# అనుష్ఠాన
# పశువైద్యచింతామణి

గ్రంథకర్త

"అభినవసహదేవ"

1957

ప్రకాశకులు:- వై. ఆర్. ప్రసాద్

పశువైద్య గ్రంథమాల - తెనాలి.

—♦—

# అనుభవ పశువైద్య చింతామణి

## పీఠిక కర్తలు

మొదటి కూర్పు: శ్రీ ఆచార్య రంగాగారు

రెండవ కూర్పు: శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు

మూడవ కూర్పు: శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు

నాలుగవ కూర్పు: శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు

అయిదవ కూర్పు: శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు

ఆఱవ కూర్పు: శ్రీ పి. తిమ్మారెడ్డిగారు



వెల రు 10 0 0

శ్రీసాయి ప్రింటింగ్ ప్రెస్, మార్కీసుపేట, తెనాలి.

# VATARI ARKAM

(RECOGNISED BY THE GOVERNMENT)

GOVERNMENT OF ANDHRA PRADESH

Agriculture Department

Memorandum No 56223 D-II/57-5 Dated 7thDec 1957

Sub Animal Husbandry Department Ayurvedic Dispensary preparations

Ref From the Director of Animal Husbandry and Fisheries No Nil Dated 3-6-57

From the Director of Animal Husbandry and Fisheries No 1527-H2/57. Dated 13-10-57 and 20-11 57

The Director of Animal Husbandry and Fisheries is requested to instruct his Subordinate Officers to use Ayurvedic preparations "VATHARI ARKAM" prepared by Sri Y Sriramulu Chowdary, Princiapal Ayurvedic Veterinary College Tenali in Veterinary Hospitals and Dispensaries to encourage the Ayurvedic Drugs

Sd/ V Govinda Rao
Asst Secretary to Government
9-12-57

To

The Director of Animal Husbandry and Fisheries (Andhra Pradesh) Hyderabad

Sri Y S Chowdary, Principal,
The Andhra Ayurvedic Veterinary College, Tenali for information.

/ Forwarded/ By order/

Sd/ Abdul Gaffar,
Supdt 9-12-57

— ♦ —

# ప్రభుత్వ అనుమతి జీ.వో.లు

## అనుభవ పశువైద్య చింతామణి

పంచాయతీబోర్డులు, సహకార సంఘములు, బ్లాకు డెవలప్‌మెంట్సు, ప్రభుత్వ జీ. వోల, సర్క్యులర్సు ప్రకారము అనుభవ పశువైద్య చింతామణిని తెప్పించుకోవచ్చును గానతప్పక ఈ గ్రంథాన్ని ఆయా సంస్థలలోనుంచి పశుసేవ చేయించుకోగోరుతాను

## పంచాయతీ బోర్డులు

లోకల్ గోన్సు జీ. వో. నెం **3958**

## సహకార సంఘములు

పాలసప్లయి సొసైటీలు – పశుపెంపకపు సంఘములు – స్పెషల్ డెవెలెప్‌మెంటు ఆఫీసర్లు, అగ్రికల్చరల్ కో ఆపరేటివ్ సంఘములకు ప్రభుత్వ సర్క్యులర్ నెం – **1206/7**

## బ్లాకు డెవెలెప్‌మెంట్సు

ప్రభుత్వ మెమోరాండం నెం. **16609/57-2**

# తొలి పలుకు



ప్రభుత్వ వ్యవసాయ, మత్స్య,
పశుసంవర్ధక శాఖామాత్యులగు
గౌ॥ పి. తిమ్మారెడ్డి గారు

మన మాతృభూమి స్వర్గానికన్నా మిన్న కన్నతల్లికంటె భూమాత – భూమాతనుమించి – గోమాత – భారతీయుల ఆరాధ్య దైవాలై – ప్రసిద్ధిగాంచుచుండుట నిర్వివాదాంశం.

కోస్తామండలాలు, రాయలసీమ, తెలంగాణము, ముప్పిరిని పేరినట్లై మన ఆంధ్రుల చిరకాల వాంఛితమైన " ఆంధ్రప్రదేశ్ " యవతరించింది. ఆంధ్రప్రదేశ్ స్వయంపోషకంగా సర్వసమృద్ధంగా భారతభూమిలోని తోటి రాష్ట్రాలలో మేలుబంతి కావాలంటే, మన పశుసంపద అభివృద్ధికావాలి. మన పశువుల యభివృద్ధి కేవలం పశు వైద్యంమీదనేగాక పశుపోషణపైకూడ యాధారపడియున్నది. దేశ సౌభాగ్యం పాడి పంటలపైనే యాధారపడి యుండడంచేత పాడినిచ్చి పంట భూములకెరువు నిచ్చి సహాయపడు పశువుల ఆరోగ్యము అభివృద్ధిచేసే విషయాల్లో మానవులు అధిక శ్రద్ధచూపడం అత్యవసరం.

పై విషయాలను దృష్టిలోనుంచుకొని పశుపోషణ, రోగనిరోధక చికిత్సలనుగూర్చి సమగ్రగ్రంథమైన "అనుభవపశువైద్యచింతామణి"ని మన రైతు సోదరుడు "అభినవ సహదేవ" శ్రీ వేజెళ్ల శ్రీరాములు చౌదరిగారు రచించి ప్రకటించారు.

శ్రీ చౌదరిగారు గత ఇరువది ఎనిమిది సంవత్సరాలనుంచి తన అమూల్య విజ్ఞానాన్ని - శాస్త్రసమ్మతమైన విద్యార్జనాన్ని - అనుభవముతో జోడించి - పశువైద్యాన ఆంధ్రప్రదేశ్ నందంతటను కృషివిగావించి చాలావరకు సఫలులైనారని తెలుపుటలో అతిశయోక్తి లేదు.

యువకులను, రైతుబిడ్డలను నొకచోటజేర్చి పశుపోషణవిధానాలను, పశు చికిత్సలను, సరళముగా సులభముగా వీరికి శిక్షణొసంగుటచే - ఆంధ్ర ప్రదేశ్ లో - ఆయుర్వేద పశువైద్యశాలలు విరివిగా వ్యాప్తములై ప్రజాసరణాన్ని బడయుచున్నవి

ఈ చింతామణి ఆంధ్రదేశమందలి ప్రతిపల్లెటూరను రైతుకు మారుమూలలనున్న కుగ్రామ ప్రజానీకానికి యితోధికమైన సేవచేయగలదని నావిశ్వాసం. ఇట్టి బృహద్గ్రంథానికి తొలుపలుకు వ్రాయు భాగ్యము నాకు కలిగినందుకు, కలిగించినందుకు గ్రంథకర్తకు నా కృతజ్ఞతాభివందనములు.

ఇట్టి అమూల్యగ్రంథాన్ని ఆంధ్ర మానవ, ఆయుర్వేద పశువైద్యులేగాక రైతు ప్రజానీకం, ఆంగ్లపశువైద్యశాఖలోని వైద్యులు, లైవ్‌స్టాక్ ఇన్‌స్పెక్టర్లు, స్టాక్‌మాన్ కాంపౌండర్లు, ఇంకనూ వ్యవసాయ శాఖలోని ఉద్యోగస్థులు, ఫీల్డుమ్యాన్‌లు, మేస్త్రీలు, ప్రభుత్వ వ్యవసాయ, పశువైద్య కళాశాలల విద్యార్థులు గ్రామసేవకులు విశేషంగా అభిమానించగలరని కోరుతున్నాను

తృణ, కాష్ఠజల సమృద్ధాలైన, ప్రాంతాలే. మానవనివాస యోగ్యాలని మనపూర్వులమతం. పశువులపచ్చిక, మనకువంటచెఱుకు. త్రాగుటకు మంచినీరు సమృద్ధంగా అవసరం. మన నిత్యజీవితంలో పశువుయొక్క అవసరాన్నిగుర్తించి పశువులభివృద్ధియే మానవకళ్యాణానికి పునాదియని విశ్వసించి, పశుజాత్యాభివృద్ధి కేంద్రాలను, పాడి కేంద్రాలను, విరివిగా స్థాపించుకొని పాడిపంటలతో సస్యశ్యామల రూపంగా రూపొందించుకొందురుగాక.

భాగ్యనగరం
హైదరాబాదు

పెద్దిరెడ్డితిమ్మారెడ్డి,
12—12—57.

# అభిప్రాయములు

భారతప్రభుత్వ రక్షణశాఖా ఉపమంత్రి

## శ్రీ. కె. రఘురామయ్యగారు ఎం. పి.

తెనాలిలోనున్న ఆంధ్ర ఆయుర్వేద పశువైద్య కళాశాలవారి సేవ మిక్కిలి మెచ్చదగిన ఉద్యమమై యున్నది. ఇంకను వ్యవసాయ సంబంధమైన రైతులకు ఈసంస్థ అపారమైన సేవ చేయుచున్నది. గ్రామీణమైనమనభారతదేశపుభవిష్యత్తు, పశుసంపదయందుతీసుకొను జాగ్రత్త శ్రద్ధలయందు ఆధారపడి యున్నదనుటనిస్సందేహము. ఆంధ్ర ప్రదేశ్, భారతప్రభుత్వం ఈసంస్థకుతగిన ప్రోత్సాహము ఈయాలి. ఈఆయుర్వేద పశువైద్య ఉద్యమానికి శ్రీ శ్రీరాములు చౌదరిగారు చేయుచున్నసేవకు నేను మనఃపూర్వకముగా కొనియాడుచున్నాను.

# శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు

(కేరళరాష్ట్ర గవర్నర్)

ఈనాడు నేను ఆంధ్రజాతీయపశువైద్యకళాశాలనుదర్శించిమిగుల యానందించితిని. భారతీయ విజ్ఞానంలో ఆయుర్వేదంతోపాటు ఆశాస్త్రానికి అంగమైన పశువైద్య శాస్త్రమునకు అత్యంత ప్రాముఖ్యత గలదు. ఆధునికులకు చాలామందికి మనభారతీయ విజ్ఞానముయొక్క అభిరుచి తక్కువైనందున, ఉన్నతదశలో నున్న ఇట్టిశాస్త్రాల విషయంలో అనాదరణగా చూచుచున్నాము. అదితొలగిపోయి లక్షలాది గ్రామాలలోగల మనసంపత్తికిసౌకర్యాలను పెద్దమొత్తున కలిగించే అవకాశంలభిస్తుందని ఆశించుచు యీసంస్థయొక్క ఇతోధికాభివృద్ధికై పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ రెవిన్యూ శాఖామాత్యులు

(శ్రీ కళా వెంకటరావుగారు)

శ్రీ శ్రీరాములు చౌదరిగారు నిర్వహిస్తున్న యీసంస్థలు దిన దినాభివృద్ధిగాంచుచున్నవి. ఆయుర్వేదమునకు రాజ్యాంగముచేకూరినది తమకోర్కెలను కష్టములను వెల్లడించుకొనగల మానవ జాతికంటె, మూగజీవులగు పశుజాతికి సేవ పరమోత్కృష్టమైనది. ఈ ప్రత్యేక పంథాలో చిరకాలమునుండి కృషిచేయుచున్న శ్రీరాములుగారికి నాఅభివందనములు, వారి కృషికూడ ప్రభుత్వపు చేయూతకు తగుసంగడు అర్హమైనది.

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పశుపర్ధక శాఖా డైరెక్టర్

శ్రీ మేజర్. టి. మురారిగారు

నేను తెనాలి ఆయుర్వేద పశువైద్య కళాశాలను, పశువైద్య శాలను సందర్శించితిని. ఈసంస్థలఅభివృద్ధికొరకు కొన్ని వైద్యసంబంధమగు సలహాలు ప్రిన్సుపాలు గారికి యిచ్చితిని ఈ శాలల అభివృద్ధికి రావాలని, ప్రిన్సుపాల్ గారికి జయము చేకూరాలని కోరుతున్నాను

## మద్రాసు ప్రభుత్వ పశువైద్య శాఖాడైరెక్టరు

శ్రీ వి. ఆర్. రాజగోపాలన్ గారు

శ్రీరాములుగారు వ్రాసిన అనుభవ పశువైద్య చింతామణిని చదివితిని. మీరు ఆయుర్వేద పశువైద్యాన్ని, దానిసాంగస్వరూపమునకు చేయుచున్నకృషిని చూచిచాల సంతసించితిని. తమరు ఇక ముందుకూడ యిట్టికృషిని సాగించుతూ కష్టించి పనిచేస్తారని విశ్వసించుచున్నాను.

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పశుసంపర్ధక శాఖాడైరెక్టర్

శ్రీ యస్. భగవాన్‌దాసు గారు

తెనాలిలోని ఆయుర్వేద పశువైద్య కళాశాలనుసందర్శించు నదవకాశము నాకుకలిగినందుకు మిక్కిలి యానందమైనది. మనస్మృతిపథమునుండి మఱుగుపడిన యశేషమైన ఆయుర్వేద ఔషధవిజ్ఞానము పశువైద్యమునఅపారమనుటనిర్వివాదాంశము. నేర్చుకొనవలసినదానికన్న అధికముగా యీవిజ్ఞానము విస్తరించబడినదనుట అతిశయోక్తి కాదు. గాన యీశాస్త్రమును పునరుద్ధరించి సరిద్దుకొనుటకు గట్టి ప్రయత్నము చేయుటవసరమైయున్నది. ఈ ఆయుర్వేద పశువైద్యకళాశాలపై కొఱతను తీర్చుటయేగాక దేశములోని ఆంగ్లపశువైద్యులు సమృద్ధిగా లేని కొఱతను కూడతీర్చుటకు సాయపడగలదని ఆశించుచున్నాను. ఈసంస్థ సర్వతోముఖవిజయమును నేను కాంక్షించుచున్నాను.

# విన్నపము



భారతదేశం కృషీవలుల దేశం. వ్యవసాయమే భారతీయులకు ప్రాణాధారం వ్యవసాయానికి మూలాధారం పశుసంతానం పశు సంతానం ఎంత వృద్ధిలోయుంటే భారతదేశంఅంతపాడి పంటలతో భాసిల్లుతుంది. భారతవర్షం ప్రపంచానికే పాడిఆవు. భారతదేశానికి యిష్టదేవత గోమాత. భారతీయుల కున్నధన మి కూడా గోధనమే అందు చేతనే భారతీయులు గోవులను శ్రద్ధాభక్తులతో పూజించుతారు భారతీయులు గోపాలురు కృష్ణభగవానుడుగోపాలుడు గీతామృతాన్ని గ్రోలే భారతీయులు గోసంరక్షణార్థం దీక్షవహించుట శుభావహం. పరమధర్మం సహదేవుడు పశుపాలనా దీక్షాదక్షుడు. ఇంకను పశుచికిత్సా ప్రవీణుడుకూడాను

కాబట్టి మనదేశం స్వర్గతుల్యంగా ఉండాలన్నా, పాడిపంటలతో తులతూగాలన్నా, పశు సంరక్షణ గావించాలి. మంచిమంచిఆబోతులను పెంచాలి.

పూర్వము చంద్రగుప్తుని కాలంలో, అశోకచక్రవర్తి సామ్రాజ్యంలో ప్రతిపల్లెయందు ప్రతిపట్టణమునందు పశు చికిత్సాలయాలుగోసదనాలు నెలకొల్ప బడినాయి. పశువులమేతకై విశాలమైన బయళ్ళు వుండేవి ఇదిచరిత్ర ప్రసిద్ధమైన విషయం.

ఇప్పుడిప్పుడే భారతప్రభుత్వం పంచవర్ష ప్రణాళికలకు కొన్ని కోట్లరూపాయలు హెచ్చించి పశుపోషణకు పశువైద్యానికి పాటుపడు చుండుట ఎల్లరు సంతోషించ దగిన విషయమే గాక మనమందరము ప్రభుత్వానికి తగినంత చేయూత తమశక్తి నిచ్చినప్పుడే మనపశుసంపద, మనమనుకొన్నకోర్కెలు సఫలీకృతమవ్వగలవు.

ఆయుర్వేద పశువైద్యంలోనగినన్ని గ్రంథాలు లేవని తామెల్లరకు తెలిసిన విషయమేగదా! మా ఆయుర్వేద పశువైద్యగ్రంథమాల తర

పున యిప్పటికి 30గ్రంధాలవరకు వెలువడి ఆంధ్రదేశ మందంతటనూ విస్తరిల్లి పశుసేవ చేస్తున్నాయి ఎంతోమంది ప్రజానాయకులు ప్రభుత్వ ఉద్యోగస్తులు, రైతులు, తదితరులు మాగ్రంధాల ఉపయోగాన్ని గూర్చి గుర్తించియే యున్నారు

నేటికిమరల నూతనముగా వెలువడిన ఈఅనుభవ పశువైద్య చింతామణిలో నవీనయుగ సిద్ధాంతాలకీతిగా ఎన్నోనూతన విషయాలుప్రచురింప బడినాయి. మాఆంధ్రజాతీయ పశువైద్యకళాశాల విద్యార్థులకు కూడ ఈచింతామణినే పాఠ్యగ్రంధంగా యేర్పాటు చేయబడింది ఇంకను ఈగ్రంధము ఆంగ్ల భాషలోనికి తర్జుమాచేయబడింది ఈసంవత్సరం ఈ గ్రంధాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గ్రామడెవెలప్‌మెంటు సెంటర్లలో పనిచేయుచున్నవారికి సప్లయిచేయించినందుకు ఇంతియేగాకుండ మాసహదేవ పశువైద్య ఫార్మసీతరఫున శాస్త్ర సమ్మతంగా పరిశోధించిన "వాతారిఅర్కము"ను ప్రభుత్వము రికగ్నయిజుచేసి అన్ని ఆంగ్లపశువైద్యశాలలకు సర్క్యులర్ జారీచేయించినందుకు, మాఆంధ్ర జాతీయ పశువైద్య కళాశాలకు ఈ సంవత్సరం ఆరువేలరూపాయలు గ్రాంటు నొసంగి ఎయిడెడ్ చేసినందుకు, మా కళాశాలలో ఉత్తీర్ణులయ్యే "గ్రామపశుసేవక్' లకు పంచాయితీలనుంచి, ప్రభుత్వ పశుసంవర్ధకశాఖాశాఖనుంచి తగినంత గ్రాంటు ఈయవలసినదిగా సర్క్యులర్ జారీచేయించి తగిన చేయూతనిచ్చి ప్రోత్సాహించినందుకు సిగదుర్వాలు రైతునాయకులు, సుప్రసిద్ధరైతుబిడ్డ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వవ్యవసాయ, మత్స్య పశుసంవర్ధక శాఖామాత్యులగు గౌ॥శ్రీ.శివార్యరెడ్డి గారు అడిగినంతనే ఈ గ్రంధానికి ఎన్నిపనులున్నను తీరికలేదనకతొలిపలుకు వ్రాసియిచ్చినందుకు ఈగ్రంధానికి తోడ్పడిన తదితరగ్రంధాల గ్రంధకర్తలకు పత్రికాధిపతులకు కూడ నాహృదయపూర్వక వందనాలు.

ఈ గ్రంధములో అచ్చటచ్చట తప్పులున్నయెడల చదువరులు సవరించుకోగలరని నావిజ్ఞప్తి. జైహింద్.

తెనాలి,
16-12-57.

ఇట్లు,
గ్రంధకర్త

# విషయసూచిక

## తొమ్మిదవభాగము



## పదియవభాగము



## పదునొకండవభాగము

## ఇరువదవభాగము



## ఇరువది ఒకటవ భాగము



## ఇరువదిరెండవభాగము



## ఇరువదిమూడవ భాగము



## ఇరువదినాలుగవభాగము

## ఇరువదిఅయిదవభాగము



## ఇరువదిఆరవభాగము



## ఇరువదిఏడవభాగము



## ఇరువదిఎనిమిదవభాగము



## ఇరువదితొమ్మిదవభాగము

# అనుభవ
# పశువైద్యచింతామణి

## ప్రథమభాగము ప్రాచీన పశుసంరక్షణ



## మన అమ్మకన్నను-గోమాతయే ప్రత్యక్ష దేవత

పవిత్రమైన భారతదేశం ప్రతివిషయములోనూ, బ్రతికి చెడ్డ దేశం. అదృష్ట రేఖలు అంతరించినా, భాగ్య రేఖలు బండబారినా, పూర్వపు చరిత్ర, పూర్వపు ఔన్నత్యం, స్మరించినప్పుడు ఉత్తేజం, ఉత్సాహం, పొర్లుతుంది.

విశాలమైన ఆకాశ పథాన అంతులేని నక్షత్రాలగుంపులు ఎన్ని మెరిసినా, ఒక చంద్రుని పండు వెన్నెల కాంతియే ప్రకాశమానంగా వెలుగుతూవుంటుంది. ప్రపంచములో ఎన్ని దేశాలున్నా, భారతదేశ మొక్కటే, ఆనాటినుండి యీనాటివరకూ, అన్ని విషయాలలోనూ ఆదర్శప్రాయంగా ముందుకు సాగిపోతూ వుంది.

—♦—

అనాదినుంచీ నీతినియమాలకూ, భక్తిమార్గాలకూ, పాడి పంటలకూ, మనదేశం పెట్టిందిపేరు. ఇట్టిపేరు గన్నట్టి భారతావనిలో పాడీ, పంటా, అభివృద్ధి కావాలంటే, గోమాత బాగుండాలి. కన్న బిడ్డలను అల్లారుముద్దుగా పెంచి, పెద్దవాళ్లనుచేసి, వాళ్లసుఖమే తన సుఖంగా, వాళ్ల ఆనందమే తన ఆనందంగా, తలంచే అమ్మహృదయం, ఎంత అమాయకమైనదో, సదా క్షేమాన్ని కోరే గోమాత హృదయం, కూడా అంత పవిత్రమైందని గ్రహించాలి. అమ్మను బోలిన, రెండవ అమ్మయే గోమాత! మన కష్టసుఖాలను, ఎప్పటి కప్పుడు ఆలోచించి అందుకునే అమ్మకన్నను, గోమాతకన్నను, నిజంగా ఈ లోకంలో ప్రత్యక్షదైవం, ఎవరు మనకూ ?



ప్రజలు సుఖంగా నిద్రిస్తున్నారంటే, ఆ చల్లనిచూపులే, ఆ దేవి చిరునవ్వే కారణం. మానవుల్లో వుండే మహత్తర శక్తి సామర్థ్యాలు, కొన్ని లోపించినా, దేశాని కెంతో సేవచేస్తూవుంది. తాను తినేది ఎండుగడ్డి అయినా, అమృతాన్నిస్తూవుంది. తాను నిదురించేది కటిక

నేలయినా, కండలు బారిన వృషభాలనిచ్చి, కన్నబిడ్డలవలె తన ప్రజల కడుపులు నింపుతూవుంది. తన మలమూత్రాలనిచ్చి సోలిపోయిన భూములను బంగారాన్ని పండింపుతూవుంది. ఇంతియేల, ఆ తల్లి స్తనాలనుంచి దిగజారు కమ్మని, తెల్లని, పాలచే ఎంతమంది భాగ్యులు కాలేదు? మృత్యుశయ్యపై నిద్రిస్తూవున్న ఎందరు దుర్బలులు శేషించి, తమ జీవితాలను హాయిగా గడపలేదు? ఆ మాత తీవించియు, మరణించియూ, దేశానికెంత వుపయోగపడుతూ వుందో ఎల్లరు తెలిసికోవాలి.

ఆగోమాతలో సమస్త కళ్యాణ గుణాలు, ఒకదానితో నొకటి పెనవేసుకుపోయాయి. ఆ తెల్లని శరీరచ్ఛాయలో, కోటిసూర్యులు ప్రతిబింబిస్తూ వుంటాయి. మోమున, చిరునవ్వు, తొణికిసలాడుతూ వుంటుంది. దయ, జాలి, ప్రేమ, ఆమెసొత్తే. భారతదేశానికి ప్రత్యక్ష దైవమేగాక, ఆరాధ్య దేవత. భారతదేశంలో, ఆమెను పూజించని చేతులూ, భజించనినోరూ, ప్రార్థించని భక్తులూ వుండరు. అందు కనే మన పూర్వులు గోమాత పవిత్రమైందని, పూజనీయమైందని అన్నారు. సాలెగ్రామం, తులసీవనం, గోవు, అగ్ని, పరమ పూజ నీయములు.



ఉదయాన నిదుర లేవగనే, గోవును చూచినపిదప, గోప్రదక్షిణ మొనరించుట ప్రబలమగు సదాచారంగావుంది. పుణ్యస్త్రీలుగోవును

మహాలక్ష్మియని పసుపుకుంకాలతో, పుష్పదామోదాలతో, అలంకరించి, ప్రత్యేకదినాలలో ఆరాధిస్తారు. భక్తులు భక్తిపూరితులై స్వయంగా లేతపచ్చికల గ్రహించి శ్రద్ధతో గోవులను, గోవత్సాలను, చేతులారా మేపుతారు. అందుచేత తమకు తమ గోపాయము కలుగుతుందని, ఎక్కువగా నమ్ముతారు. చిన్నపిల్లలు సంక్రాంతి పండుగ దినాలలో, గోమయం తెచ్చి గొబ్బెమ్మలను వేస్తుంటారు. పరమ పవిత్రమైన గోమాతను, మనమందరం పూజించాలి. అవిరాతో సేవిస్తే, మన జీవిత సాఫల్యానికి చక్కని రాజబాట, మాతృమార్గం. గోవులను రక్షించిన మహాపురుషుల పేర్లను హిందువులు గోత్రాలుగా చెప్పుకుంటూ వుంటారు. ఏ దేశాన, అద్దేవి కమ్మని మధుర అంభారావాల సంగీతం వినిపిస్తూవుంటుందో, అద్దేశ సుసంపద. ఆదేశ పతులే ధన్యులు. ఎవరు భారతీయులు. అదే భారతదేశం.

## పశుపాలన యుగము

మానవుడు ప్రపంచంలో జన్మించి ఎన్ని యుగాలైందో ఎవరు చెప్పజాలరు. వానరాకృతినుంచి జీవి క్రమక్రమంగా మానవాకృతిగా పరిణితి పొందెనని డార్విన్ సిద్ధాంతము. మన దేశంలో దశావతారాల నిర్వచనాలు మానవ పరిణామాలను సూచించుచున్నవని కొందరి అభిప్రాయము. అస్థిపంజర నిర్మాణమందును, నడకయందును, అధమ జాతి మానవునకు, ఉత్తమజాతి వానరాలగు గోరిల్లా, ఓరాంగు టాంగులకు పోలికలు వున్నప్పటికీ మానవుడు మంచి చెడ్డలను తెలిసి కొనేవాడగుటచే, ఇతడు ఇతర జంతువులనుంచి భిన్నంగా పరిణమించిన వాడని కొందరంటారు. ఏమైనప్పటికీ మానవుడు మొదట నాగరికత

లేక మృగ ప్రాయుడుగా వున్నాడనటానికి సందియము లేదు. నేటికికూడ ప్రపంచమునందు ఎందరో పశుప్రాయులైన యనాగరిక ప్రజలు వున్నారు.

ప్రథమంలో మానవుడు మృగంవలెనే నైసర్గిక పరిస్థితులకు లోనివాడై యున్నాడు. చుట్టుప్రక్కల వుండే ఆకులు, అలములు, కంద మూలాలు, తాను వేటాడి చంపిన జంతువుల మాంసము అతని ఆహార పదార్థాలు. ఇట్టి ఆహారమైనను చాలాకాలము అపక్వమైన దానినే తినుచుండేవాడు. మానవజాతికి క్రొంచెము నాగరికత హెచ్చిన తరువాతగాని అగ్నిని రగుల్చు విధానం తెలియలేదు. ఇంకను గృహనిర్మాణాన్నిగూర్చి అతనికేమీ తెలిసేదికాదు. మృగాలవలె గుహలయందో, చెట్ల తొర్రలయందో లేక పక్షులవలె చెట్లమీదనో అప్పటి వారు నివసించేవారు. మొదట వారు చలినుండి కాపాడుకొనుటకై చర్మమో, చెట్లపట్టలో కప్పుకొనేవారు. ఎండలు ఎక్కువగా వున్న ప్రాంతాల నగ్నులుగా వుండేవారు.

అరణ్యాల మధ్యలో వుండే కోయవాండ్రునుకూడ యిప్పటికి నగ్నులుగా వుండుట చూస్తూనే వున్నారము. ఆఫ్రికాఖండములో భూమధ్య రేఖ ప్రాంతాలనున్న ఆటవికులను జాతివారు, అమెరికా మధ్య భాగములో వైనులను వారి వివాహితులైన స్త్రీలు ఆకు లేదా చుట్టు కొన్నను, అవివాహితులగు కన్యలు మాత్రము ఏది కట్టుకూడదన్న నియమం వుండేదట.

కందమూల ఫలాలుగాని, వేటవల్ల లభించే మాంసముగాని తమకు కావలసినంత సకాలములోను దొరికేవి కావు. తర్వాత మానవుడు అరణ్యాలలో వుండే కొన్ని పశువులను మచ్చిక చేసుకొని తన

కవసరమగు మాంసాహారాలు పాలు, పెరుగు మున్నగు పదార్థాలు విరివిగా సంపాదించేవారు. ఈ దశకే గోపాలదశ అనియిప్పటికీఅంటారు. ఈ దశ వచ్చిన తరువాతనే క్రమేపి నాగరికత పొందుతూ వచ్చారు. ఈ దశలో జంతువులను పెంచుట, కొద్దిగా ధాన్యము పండించుట, తమ పశువులను, మేత ఎచ్చట సమృద్ధిగా వుండేదో ఆ ప్రదేశాలకు తోలుకొని వెళ్ళి కొంతకాలము నివసించుట, వ్యవసాయాన్ని చేయుటకై ఒకే ప్రదేశాన స్థిర నివాస మేర్పరచుకొనుట, రాతిపనిముట్లను లోహపు పనిముట్లను వాడుట మున్నగు నూతన పరిణామాలు పొందినాయి.

పశుపాలన దశనుంచి వ్యవసాయదశకు మానవుడు వచ్చేశాడు. తన పశువులకు ఆహారం సమృద్ధిగా దొరకు ప్రాంతాలలో నివసించు నప్పుడు విత్తనాలు భూమిమీద పడి మొక్కలై ఫలించుట చూచి మానవుడు వాటిని అనుభవించుట జరిగేది. క్రమ క్రమేపి నాగరికత లోకజ్ఞానం అభివృద్ధియైన కొలది మానవజాతి వృద్ధిపొందింది.

## పూర్వపుఋషులే - రాజులకు - పురోహితులట

వేదకాలంలో కొన్ని వందలమంది ఋషులు వుండేవారట. వారిలో భరద్వాజ, కశ్యప, గౌతమ, అత్రి, విశ్వామిత్ర, జమదగ్ని, వశిష్ఠ మున్నగు సప్తఋషుల ప్రాముఖ్యత ఆ కాలంలో ప్రఖ్యాత వంతంగా వుండేదట. వీరంతా మంత్రాలు ఎక్కువగా రచించినందు వల్లగాని, చారిత్ర్యాత్మకంగాగాని పురోహిత ఋషులకే ఎక్కువ ప్రాధాన్య మిచ్చేవారు. ఇంకను వీరంతా సప్తసింధు ఋషులేనట.

ఆకాలంలో ఆర్యుల నివాసాలు, ప్రభుత్వ క్షేత్రాలుకూడా సప్తసింధు మైదానాలే. కాని ఈ మునులు కేవలం మతాధికారుల పురోహితులుగా వుండేవారట. ఇంకా వీరు తమతమ రాజుల ప్రధాన

మంత్రులుగా, సేనాధిపతులుగా వుండేవారు. వీరంతా వృద్ధాప్యాల వల్ల యుద్ధాలలో పాల్గొనక పోయిన, వారి కోర్కెలను, పరిశీలనలను పురికొల్పి యుద్ధాలలోకి పంపించేవారట. వీరి స్తోత్రాలతో, దేవతల కృపలతో, వీరి యజమానులకు విజయం ప్రాప్తించక, వారి కుటుంబ కీర్తినిబట్టి, వారి సంఖ్యాబలాలనుబట్టి విజయప్రాప్తి ఆధారపడి వుండేదట.

వీరి కాలంలో పుత్రులారా! మీరంతా పాడిపంటలు కలిగి పుత్ర పౌత్రాభివృద్ధితో వర్ధిల్లండి, అనే సూక్తులెన్నో వున్నాయి. పురోహితుడయిన భరద్వాజుడు కవచం, ధనువు, అమ్ములపొది, రథం, అశ్వము, గండ్రగొడ్డలి, మున్నగు సాధనాలను ఎంతగానో వర్ణించాడు. ఇంకను ఆ కాలంలో కొంతపొలం బంజరు, మరికొంతపొలం పంటను వుంచేవారు. జావ లేక అంబలి కాచుకొని పెరుగుతో కలుపుకొని తినేవారు. గోవులను ధనంగా ఎంచేవారు. గోవులకు, గుఱ్ఱాలకు ఏ రోగం రాకుండా వుండాలని వేదఋక్కులను పారాయణం చేసేవారట.

## పురాణ యుగంలో - పశు వైద్యులు

అజ్ఞాతకాలంనుంచీ మానవులు స్వతంత్రంగా ఆలోచించే కాలం అభివృద్ధయి పురాణకథలు సృజింపబడ్డాయి. పురాణకర్తలు చరిత్రకారులు బ్రహ్మముఖంనుంచి నాలుగు వేదాలు పుట్టాయనీ, వాటిని బ్రహ్మదేవతలకు బోధించాడని వివరించారు. నాలుగు వేదాలలో అథర్వణ వేదంలో అన్ని రకాల వైద్య శాస్త్ర వివరాలు వున్నాయని తెలుపుతూ వుంది. సూర్యభగవానుని కుమారులు యిరువురు, అశ్వనీ

దేవతలు, అధర్వణ వేదకర్తలనీ, ప్రచారకులని ప్రసిద్ధి. భారత దేశంలో వైద్యాలను చరక, సంహిత, పశుపాలకావ్య, శాలిహోత్ర, రాజ మార్తాండ, నకుల, సహదేవ, గౌతమ, పరాశర, మున్నగు మహానుభావులు ప్రచారంలోకి తెచ్చారని శాస్త్రులు తెలుపుతూన్నాయి.



అర్జునుడు గోవులను రక్షించడానికి పండ్రెండు సంవత్సరాలు అరణ్యాలలో కష్టపడ్డాడు. విరాటుడు, నందుడు గోవులను పోషించేవారు. ఆ కాలంలో గొప్ప గొప్ప మహారాజులుకూడా గోసంరక్షణ, గవాయుర్వేదం, గోశాసనాలు, చికిత్సలు చేసేవారు. సహదేవుడు, నకులుడు, పశువులకు, గుఱ్ఱాలకు చికిత్సలు చేసేవారు. దిలీపమహారాజు గోసేవకై తన రాజ్యాన్ని, తన ప్రాణాన్నికూడా లెక్కచేయలేదు. వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, జమదగ్ని గోవులనుగూర్చి తగాదాలు పడ్డారు.

శ్రీకృష్ణుడు పశువుల కాపరిగావుండి తన మధుర మురళీ గానంతో, బృందావన వాటికలలో, గోవుల మధ్య ఎంతో ఆనందాన్ని అనుభవించేవాడు. హిందువులలో అధిక సంఖ్యాకులు గోమాత శరీరం దేవతల నివాసమనీ, గోవృషభశృంగాలపై భూమి నిలిచియున్నది అని నమ్మేవారు. ఈ రీతిగా పురాణయుగంలో ఎన్నో చరిత్రలు వున్నాయి. అవన్నీ వ్రాయాలంటే ఈ గ్రంథం చాలదు.

## క్రీస్తుకు పూర్వమే ఎడ్లపందెములు వుండేవి



డాక్టర్ ఫ్రయిర్, డాక్టర్ కుమారస్వామి, డాక్టర్ క్రుక్ రచించిన గ్రంథాలను బట్టి తాము వ్రాసిన వ్యాసాలను బట్టి మన దేశంలో ప్రాచీన కాలమునుంచీ ఎడ్లపందెములు అతి ఉత్సాహంతో జరిపించేవారట. క్రీ. పూ. నాల్గవ శతాబ్దంలో మౌర్య, చంద్రగుప్త, అశోకుల కాలంలో శకటాలకు గుఱ్ఱాలను, పశువులను, జంతువులనుకట్టి సర్దాగా పందెములు వేసేవారు. పశువులకు దృష్టిభాగులు లేనందున పశువుల మధ్య గాడిదలను, గుఱ్ఱాలనుంచి పరుగులు తీయించేవారు. గెలిచిన వారికి గొప్ప గొప్ప బహుమానాలు బహుమతిగా ఇచ్చేవారని ఆనాటి శాసనాలు వ్రాతలను బట్టి తెలుస్తున్నది. ఈ నాటికి మన దేశంలోని వివిధ దేశ సంస్థానాలలో, భారతదేశమంతటా అతి ప్రాముఖ్యంతోనూ

యిటు రైతులతోను పశుప్రదర్శనాలు, బండపందెములు ఏటేటా జరుగుతూవుంటున్నాయి. ఆంధ్రదేశంలో అతివుత్సాహంగా పట్టు దలగా ప్రథమంగా పశుప్రదర్శనాలను ఏర్పాటుచేసి, ఎడ్లపందెములు పెట్టి రైతులలో పోటీభావము కలిగించిన గౌరవం గుంటూరు జిల్లాలోని శ్రీ బాప్యపురపు, దగ్గుమిల్లి యను ప్రతినామములుగల గోవాడ వాసి, రైతుబిడ్డ శ్రీ ఆలపాటి సూర్యనారాయణగారికే దక్కింది.

2500 మధ్యకాలంలో సింధునదీ ప్రాంతాన అతిశ్రేష్ఠమైనపశు సంపద దొరుకుచుండేవని వ్రాసిరి. వైదికయుగంలో వాహాన కాల మందు, దేవీదేవతల ప్రీతికొరకు మాంసము భక్షించు చున్నప్పటికీ, పాడిపంటలకు కారకురాలగు గోమాతయందు భక్తి శ్రద్ధలు చూపు చున్నటుల ఎన్నోవుదాహరణలు వున్నాయి. ఋగ్వేదంలో ఆవు గోవు లైనను లేనివాడు బీదవాడనేవారు. దానిని బట్టి ఆకాలంలో గోవులే తమధనంగా ఎంచుతూవుండేవారని స్పష్టపడుతూవుంది.

## ప్రాచీన పశు పోషణ శాసనములు

క్రీ. పూ. 272-231 వరకు మగధరాజ్యమేలిన సూర్యవంశ రాజులలో మూడవవాడు, జీవహింసయెడల రోతయు, సకల జీవుల యెడల దయయు, కలిగి అశోకుడు శీఘ్రకాలములోనే బౌద్ధధర్మాలను అలవరచుకొని మతధర్మాలను, నీతినియమాలను బోధించు శిలా శాసనాలను పదునాలుగింటిని చెక్కించి తన సామ్రాజ్యంలో అందరికి చదువుకొనుటకు అవకాశములుగా పదునాలుగుచోట్ల అమర్పించెను. ఇంకను 240 సం॥ లో రాజ్యపరిపాలనమును తన యువరాజునకూ, మంత్రులకూ అప్పగించి సన్యాసియైనాడు.

## గుహ శాసనములు

ఇవిగయ సమీపంగావున్న బరాబరు కొండ గుహాలయం దున్నాయి. అశోకుడు రాజ్యాభిషిక్తుడైన సమయములో, అజీవికు లైన జైనమతస్థులకు ఈ గుహాలను బహుమతిగా యిచ్చినట్లు చెక్క బడిన నీతిశాస్త్ర శాసనాలు వున్నాయి.

## చిల్లర శాసనములు

భాబ్రాశాసనము, కళింగశాసనాలు, తారాయ్ స్తంభ శాసనాలు, ఏడు స్తంభశాసనాలు, లఘుశిలాశాసనాలు మున్నగునవి అశోకుడు తయారుచేయించి మానవులకు, పశువులకు చికిత్సలు చేయుంచు విధానాలు, ఔషధాలకు కావలసిన ఓషధులను తోటలలో వేసి పెంచే విధానాలు, అహింస, భూతదయ మున్నగు ఎన్నోనీతివాక్యాలు శాసనాలు ద్వారా తెలియజేసాడు. అశోకుడు క్రీ. పూ. 232–31 లో నిర్యాణము పొందినను, అతనిధర్మ చక్రము నేటికిని భారతజాతికి రాజధర్మ సూచకమై ఎల్లరకు శిరోధార్యమైనది.

పూర్వ కాలంనుంచీ "అహింసాపరమోధర్మః" యని వేదాలు, పురాణాలు, ఉపనిషత్తులు, శృతిస్మృతులు చాటినాయి. కేవలం మన మతమేగాక బౌద్ధ జైన మహమ్మదీయ క్రైస్తవ మతాలయందు కూడా సేవలన్నిటిలో గోసేవయే పరమపవిత్రమయిం దన్నారు.

అక్బరు చక్రవర్తి కాలంలో గోమాత విషయమై ఎంతో ప్రచారం చేసిన విషయాలు "శత్రుంజయ పర్వతమున గల ఆదినాధ దేవాలయ ద్వారాన సంస్కృత భాషలో వ్రాసిన శాసనం యిప్పటికీ వుందట.

1593 క్రీ. శ. విజయసేనుడు అహింసా పరమోధర్మః అను సిద్ధాంతాలను గూర్చి చేసిన ప్రచారాలను గురించి "శాదవాహుడు" వ్రాయించిన శాసనాలువున్నాయి.

క్రీ. శ. 1584 జూన్ 16 న హీరవిజయుని శిష్యుల ప్రఖ్యాతి చూచి అక్బరు చక్రవర్తి వారిని ఆహ్వానించి, గౌరవించి, గుజరాతీ ప్రాంత దేశాన భాద్రపదమాసాన ఏటేటా యిప్పటికీ జరుగుచున్న గోసేవ వుత్సవాలలో ఎచ్చటా పశుహింస చేయరాదనీ, గోమాతనే పూజించాలని ఆజ్ఞ యిచ్చెనట. క్రీ. శ. 1592 మేనెలలో హీరవిజయునకు మరొక శాసనాన్ని బహూకరించెనట. క్రీ. శ. 1608 మేమాసంలో శాదవాహుడు వివేక హర్షనకు మరొక శాసనమువుంది.

హంపిలో కామధేనువుకీ, వారణాసిలో సూర దేవునకీ, కొండిప్యలో కుండకోకిలునకు, ఆలంభీయకునకు, మాలశేషునకు ఆదు

గోకులాలు వుండేవట. గోకులమనగా పదివేలగోవులు. ఈ రీతిగా జైనుల సాహిత్యంలో ఎంతో చరిత్రవుంది.

## ఋషీశ్వరుల ధర్మ సూత్రాలు



ఈ రోజుల్లో ప్రభుత్వం ఏరీతిగా శాసనాలు చేసి అమలు పరుస్తున్నదో, అప్పటి రోజుల్లో మహారాజుల దగ్గరవుండే ఋషీశ్వరులు అన్ని విషయాలనుగూర్చి శాసనాలు ఏర్పరచేవారట. ఈ దిగువ ధర్మ శాసనాలు గమనించండి.

## ఎద్దులను ఏరీతిగా కాపాడాలి?

ఎనిమిది వృషభాలతో దున్నడం ధర్మమగు వ్యవసాయం. ఆరు వృషభాలతో దున్నడం బ్రతుకు తెరువు. నాలుగువృషభాలతో దున్నటం పాపహేతువు. రెండు వృషభాలతో దున్నుట పాపమేగాక బ్రహ్మహత్యాతుల్యం.

ఆ హుంకారాలతో అదలించి ఎద్దులను తోలాలి. ఆకులతో వుండే కొమ్మలతో కొట్టాలిగాని, కర్రతోగాని, బెత్తంతోగాని, త్రాడుతోగాని కొట్టరాదు.

ఆకలిగా, బడలికగా, వికలేంద్రియంగా వుండే ఎద్దుతో పని చేయించరాదు. తృప్తిగా మేత మేపిన తరువాత మంచినీళ్ళు త్రాగించాలి.

ఉదయంనుంచి మధ్యాహ్నంవరకు రెండు పర్యాయంతే అరక కట్టాలి. మధ్యాహ్నంనుంచి సాయంకాలంవరకు విశ్రాంతి ఈయాలి. ఇందుకు వ్యతిరేకంగా నడిచినవార్కి తగిన శిక్ష విధింపబడుటయేగాక నరకం పొందుతారు.

ఏమర్త్యాస్థులు సత్రింపద్మ్యయుల కొట్టినా, ఆ పాపికి ప్రాణహత్యాదోషము కలుగుతుంది. ఆకలిగొన్నది, దప్పికగొన్నది, ఆయాసపడుచున్నది, అవయవహీనమైనది, రోగంగలది, పుంసత్వం లేనియగు ఎద్దులను అరకకు కట్టరాదు.

దృఢమైన అవయవములుకలిగి రోగంలేక తృప్తినొంది, బాధ పెట్టకుండ వుండేది, పుంసత్వం కలిసిన గ్రహించి అర్ధపూటనో మున్న విశ్రాంతి ఈయాలి.

పాలింతయగు పశువుల్ని పశువుల కాపరి స్వాధీనంలో వుంచి పంచాలి. అట్టిసమయంలో కాపరియే పాల మంచిచెడ్డలు చూడాలి. సాయంకాలం మాత్రం కాపరులు పశువులను తోలుకొని వచ్చి, తమ యజమాని గృహమందు కట్టివెళ్లిన తర్వాత బాధ్యత అంతా యజమానిదే. యజమాని కాపరి కూలి ఈయజాలనిచో, పది ఆవులపాలను యజమానికి, ఒక ఆవుపాలు తానుపిండుకొని తీసికోవాలి.

కంటికి కనపడనిది, విషజంతువులచేతిన బడినది, పల్లపుగుంటలలో పడిచచ్చినది, కాపరి లేనిది, యగు పశువునష్టాన్ని కాపరియే భరించాలి.

దొంగలు దొమ్మిచేసి పశువులను అపహరించగానే వెంటనే తన యజమానికి చెప్పాలి. అట్లు వెంటనే చెప్పినచో కాపరికి బాధ్యత లేదు.

తుంటరివి, ఆకలిరోగంగలవి, కొమ్ములు లేనివి, గ్రుడ్డివి, గిట్టలు లేనివి, తోక లేనివియగు వృషభాలతో బండ్లప్రయాణం చేయరాదు.

## గోవుల విషయంలో

మార్గ గ్రామ సమీప ప్రదేశాలయందు పొలాలలో గోవులను మేసినచో రూపాయపావలా జరిమానా కాపరికి విధించాలి. తదుపరి ఆ గోవులు తిన్న మేత ఫలితాన్నిబట్టి యజమానిగాని, కాపరిగాని పొలము గల యజమానికి యిచ్చుకోవాలి.

నీరు త్రాగుచున్న గోవులను, పాలుకుడుస్తున్న దూడలను త్రాగనీయకుండ అడ్డుపెట్టరాదు. పాలుతీయునపుడు మాత్రం నివారింప వచ్చును. ఇతరుల దూడలు పాలుకుడుస్తున్నప్పుడు యజమానికి చెప్పరాదు.

ఈని పదిదినాలుకూడా గడవని గోవులకు, చక్రం, శూలము మొదలగువాటితో అచ్చువేసిన ఎద్దులను, ఇంకను హరిహరాదులకు అచ్చువేసిన ఆబోతులను కాపరులతోనున్నను, లేకున్నను పొలాల లోని మేతను తినుచున్నప్పటికి దండింపరాదు. ఇట్టి పశువులకు సర్వ హక్కులు వున్నాయి.

# రెండవ భాగము

## వాతావరణ - ఉత్పత్తి

## వ్యవసాయ - కార్తెలు - సామెతలు

భూమిపుట్టిననాటినుంచీ, వాతావరణం పెద్ద పరిణామములను చెందుతూవుంది. ప్రస్తుత జీవితాధార భూతమైన వాతావరణం సుమారు ఒక 100 కోట్ల సంవత్సరాలనుంచీ అట్టేమార్పు లేదనియే చెప్పవచ్చు. మానవుడు ఈ ప్రస్తుత వాతావరణ స్వరూపాన్ని పాడు చేయని పక్షంలో ఇంకా సుమారు కొన్ని కోట్ల సంవత్సరాలు వాతా వరణం నిలబడడానికి అవకాశాలు వున్నాయి. భూతకాలపు భూ చరిత్రలోని అనేక సంఘటనల ఫలితమే "గాలిఅనవచ్చు. మనలో చాలామంది అప్పుడప్పుడు భూగర్భజనిత పరిణామాల మూలంగా వాతావరణం స్థిరమైనదని, నిశ్చయమైదని భావిస్తారు. రమారమి అడు నుంచి 9 మైళ్ల ఎత్తుననున్న వాతావరణంలో నీటిఆవిరి కనపడదు" ధూళికణాలు పైకిపోతున్నకొలదీ తగ్గిపోతాయి. మిగతా వాయు పదార్థాలు నూటికి 90 పాళ్ల వాతావరణం 25 మైళ్లలోపువున్నప్ప టికీ 600 మైళ్ల ఎత్తువరకు స్థిరంగాగాలి వుంటుంది.

ప్రస్తుత వాతావరణం భూమిపుట్టినదాదిగా పరిశీలిస్తే చతుర్థ దశలో వున్నదన్నమాట. భూమిలాగే పరిణామాలనుచెంది వుండాలనే

ఊహతో ఇప్పటివరకు మనకు తెలిసినదాన్నిబట్టి చూస్తే శుక్రుడు, బృహస్పతి, శనిగ్రహాలు, కార్తెలు, ఇంకా ప్రస్తుత భూపరితల వాతావరణానికి, పూర్వస్థితి వాతావరణానికి, పూర్వస్థితి వాతావరణాన్నే కలిగియున్నవని, అంగారక గ్రహ వాతావరణ పరిణామం, భూతావరణ పరిణామంతో అన్నివిధాల ఏకీభవించుచున్నదని తేటతెల్లమగుతూ వుంది.

## అతివృష్టి-అనావృష్టుల-ఫలితాలు

విత్తనాలు చల్లాలంటే చల్లని ఆతల్లి కటాక్షంకోసం నిరీక్షిస్తూ వుండాలి. తీరా చల్లిన తరువాత అతివృష్టి వస్తుందో, అనావృష్టి కలుగుతుందో చెప్పలేం. పంచభూతాలే మనకు దైవం. ఆ దైవము అనుకూలించక పోతే మన బడాయి చిల్లిగవ్వకుమారదు అనేమాట మనకు అలవాటు అయింది. ఇప్పుడు అలాకాదు. భౌతిక శాస్త్రజ్ఞానం మనకు లభించింది. వర్షం ఎప్పుడు కురిసేదీ, గాలి ఎప్పుడు వీచేదీ మనం ముందుగానే తెలిసికొని జాగ్రత్తపడేకాలం వచ్చింది. ఈ విషయాలన్నీ ప్రభుత్వ వాతావరణాల యంత్రాల ద్వారా ఎప్పటి కప్పుడు రేడియో తెలుపుతూవుంది. కార్తెలు గాలిపాటును గురించి ప్రజల అనుభవాలు ఈ దిగువ తెలిపిన సామెతలుగా వుండిపోయినాయి. వాటిని యిప్పటికీ నమ్ముకొని ఆచరణలో పెట్టుచున్నాము. కాని ఈ సామెతల నెంతవరకు నమ్మవచ్చునో పరిశీలించేటందుకు ప్రభుత్వము ఒకకమిటీని నియమించింది. 1870 సం॥ నుంచి ప్రభుత్వం కాలమాన స్వభావ వివరాలను సేకరించింది. ఏరోజుకారోజు రాబోయే 36 గంటల వాతావరణ వివరాలు రెండుమూడురోజుల ఉజ్జాయింపుతో మనకు రేడియోలు వెల్లడిస్తూవున్నాయి.

## "అకాలపువాన - ఆరికెల కహడు"

విత్తనాలు మొలకలుఎత్తే ప్రారంభదశలో, అధికంగా వర్షంగాని, ఎక్కువ ఎండగాని సంభవిస్తే, పుట్టిటలోనే సంధికొట్టినట్లు పైరులు అన్నియు అకాల మృత్యువువాతబడతాయి. అందుకనే అకాలపువాన అరికెలకూడు అన్నారు పెద్దలు. పైరు పూతలో వున్నపుడు

వర్షాలు వుండనరాదు. సమృద్ధిగా [illegible] చాలా అవసరము. అధికవర్షాలవల్ల గింజకట్టక మొక్కలు [illegible] వేస్తాయి. ఇంతేగాక ప్రతికూల వాతావరణం [illegible] హాని ఎంతో వుంది. గాలివానలు [illegible], తెగుళ్ళు [illegible] వాతావరణము [illegible] రైతులు [illegible] అవసరం.

## "వానతో కరువులేదు - పెనిమిటితో దారిద్ర్యంలేదు"

పైరుల బాగోగులను నిర్ణయించే వాతావరణ పరిస్థితుల్లో మొదటిది వర్షం. వర్షం ఋతుపవనాలవల్ల కలుగుతుంది. మన రాష్ట్రాలకు వర్షం ఇచ్చే ఋతుపవనాలు రెండు. నైఋతి ఋతుపవనం, ఈశాన్య ఋతుపవనం. మొదటిది జూన్ నుండి సెప్టెంబరు నెలాఖరువరకు, రెండవది అక్టోబరునుంచి ఫిబ్రవరి వరకు వీచి అధికవర్షాలను ఇస్తాయి. జూన్‌నుండి సెప్టెంబరు నెలాఖరువరకు వీచే నైఋతి పవనం మృగశిర నుంచి ఉత్తరవరకూగల కార్తుల కాలంలో విస్తరించి, ఈ ఋతుపవనం వల్ల కురిసే వర్షమే రైతులకు అందులో ముఖ్యంగా ఉత్తరాది జిల్లాల వారికే జీవనోపాధి కలిగిస్తూ వుంటుంది.

## "అశ్వని కురిస్తే - అంతానష్టం"

ఈ కార్తెలో వర్షాలు అంతగా కురవవు. కురిస్తేమాత్రం మెట్ట దుక్కులకు అనుకూలం.

"భరణికురిస్తే - ధరణిపండుతుంది"

"రోహిణి ఎండలకు - బండలు పగులుతాయి"

భరణి, కృత్తిక, రోహిణి, కార్తెలను అగ్నికార్తెలు అంటారు. విపరీతమైన ఎండలేగాక, రోళ్లు బద్దలయ్యేటంత తీక్షణమైన వేడిమిగల ఎండలుకాస్తాయన్న మాట. భరణికార్తెలో వర్షంపడితే కొలకందుంపలు బాగా పండుతాయి. కాని సామాన్య వర్షాలు పడతాయి. ప్రత్తి, నువ్వులు, కొర్రలుమాత్రం జల్లుతారు.

"మృగశిరబిందిస్తే - ముసిలెద్దు రంకేస్తుంది"

"మృగశిర బందిస్తే - మిగిలిన కార్తెలు వర్షిస్తాయి"

ఈ కార్తెలో సూర్యుడు ప్రవేశించి క్రమక్రమంగా వర్షాలు అధికంకావడము శుభసూచకం. ఇంకను ఈ కార్తెతో పాటు అయిదు కార్తెలు వర్షించుతాయి. వ్యవసాయ పనులుకూడా ఈ కార్తెనుంచే ప్రారంభమవుతాయి. నైఋతీఋతుపవన సుమూహూర్తం మృగశిర అయిన తరువాత వచ్చే నాలుగు కార్తెలలోగూడ మంచివర్షాలు పడతాయి.

"మృగశిర వర్షించితే - ముంగారిపంట"

తొలకరిపంటలకు మంచి అదునుగా వుంటుంది. మృగశిరలో వర్షం, మఖకార్తెలో ఉరుములు, స్వాతికార్తెలో మెరుపులు, వర్ష పాతానికి మంచిలక్షణాలంటారు. మెట్ట, మాగాణిలో నారుమళ్లు, చోడి, గంటిజల్లికలు వుంటాయి. కూరల పాదులుకూడా పెడతారు.

"ఆరుద్రకురిస్తే - ఆరుకార్తెలు - కురుస్తాయి"

"ఆరుకార్తెలకు పోతుకార్తె - ఆరుద్రకార్తె"

ఆరుద్రలో తేజోవంతమయిన సూర్యుడు పగలు ప్రవేశించుట మంచిది కాదంటారు. సూర్యుడు మబ్బుతో వున్నపుడుగాని, రాత్రి పూటగాని, ఆరుద్ర ప్రవేశించడం మంచిది అంటారు.

"ఆరుద్రబిందిస్తే - అక్కసైరోజులువరుసంటారు"

ఆరుద్ర ప్రవేశములో వర్షించడం కడుశుభావహము. ఈ కార్తెలో పశువులు సుఖంగా వుంటాయి. కలుపులు తీస్తారు. కంది పెసర మినుము వగైరా చేలగట్లమీద, మెట్టప్రాంతాలలో చల్లు తారు. పైరులు పెరగడానికి ఈ కార్తె సహాయపడుతుంది.

"మఖాసంశంకం - సదాసంచకం"

వానలకు కార్తె మఖ. ఈ కార్తెలో వర్షాలుఅతిఅవసరం. మఖ మండిబెడితే మాత్రం సిరుత్సాహంతో వుంటారు. మఖనుంచి చిత్త వరకు వర్షాలు పడకపోతే తప్పక కాటకం కలుగుతుంది. మఖలో ఉరిమితే నుదురుమీద కర్రయినా పగులుతుంది. మఖలో వర్షం సస్యా లకు అనుకూలమేగాక పంటలుకూడ బాగాపండుతాయి.

"మఖ - పుబ్బలు వరిపిస్తే - మహాత్తరమైన క్షామం"

ఈ కార్తెలలో పడేవర్షం విత్తనాలు చల్లుటకు అనుకూలంగా వుంటుంది.

"ఉత్తరచూచి ఎత్తరగంప"

వృష్టికి ప్రమాణం ఉత్తరహస్తలు, తొలకరిలో వాతావరణం అనుకూలము లేనప్పటికి ఉత్తరకార్తెవరకు నిరీక్షింపుతూవుంటారు. అప్పటికీ వర్షాలు లేకపోతే నిరాశజెంది, రైతులు దేశాంతరము పోవలసినగతి వస్తుంది. ఉత్తర వురిమితేమాత్రం రైతులగుండెలు కుదుట బడతాయి.

"ఉత్తరకురిసినా - పాముకరిమినా - కదువదు"

అనగా తప్పక వర్షాలు ఈ కార్తెలో కురుస్తాయన్నమాట. ఈ కార్తె అంతంలో సెప్టెంబరు ఆఖరవుతుంది. అప్పటితో రైతులకు ఋతుపవనం వీచడంసరి. అప్పటికి తేలిక వడ్లు, బసంగి, రసంగి మొదలైనవి పూతలో వుంటాయి.

"హస్తకు ఆదిపొట్ట - చిత్తకు చిరుపొట్ట"

ఈ సమయంలో హస్తకు నీరు, వాతావరణం అత్యావసరం.

"హస్తచిత్తలు కురవకపోతే - అందరిసేద్యం ఒకటే"

అనే సామెత వాడుకలోవుంది.

"హస్తకార్తెలో వర్షం కురిస్తే - అడుగకనే గొట్టుకట్టు"

ఈ కార్తెలో కురిసే వర్షం విత్తనాలు చల్లుటకు, గొట్టు కట్ట డానికి ఉపయోగపడుతుంది.

"చిత్త చిత్తంవచ్చిన - చోట్లపడుతూ వుంటుంది"

చిత్తకార్తెలోని వర్షం చిత్రవిచిత్రంగా పడుతుంది. ఒకచోట కురిస్తే వర్షం మరొకచోట వుండదు.

"చిత్త జల్లులు - స్వాతి వానలు"

అనే సామెత వర్షం కురిసే విధానాన్ని తెలుపుతుంది.

"స్వాతి కురిస్తే - భీతిపొందుతారు"

గాలివానలు, తుఫానులు ఈ కార్తెలో సంభవిస్తాయి. ఇంకను ఈ కార్తెలో అధిక వర్షాలవల్ల పంటలు పండుతాయి. మెట్ట ప్రాంతాల లోని రైతులకు ఈ వర్షం ఎంతో వుపయోగం. స్వాతిలోపడే వర్షం జొన్నచేలకు అంతమంచిదికాదు. భూమిలోవుండే చలువవల్ల, మంచు పడునువల్ల పంటబాగా పండుతుంది.

"యథాచిత్త - తథాస్వాతి"

చిత్తలో జరిగేదే స్వాతిలో జరుగుతుంది"

"విశాఖలో వర్షం - విషంతో సమానం"

అనేమాట అక్షరాల నిజం. వరిపైరులన్నీ కోతకు వచ్చే సమయంకూడా. మెట్టపైరులన్నీ పంటలన్నీ కోతకు వస్తాయిగాని అట్టి సమయం వర్షం అనవసరం.

"విశాఖలో వర్షం - వ్యాధులకు హారం"

వర్షాధిక్యతవల్ల పంటలకు చీడలు తెగుళ్లు పడతాయి.

"చిత్త చిత్తగించి - స్వాతిచల్లచేసి

విశాఖ విసరకుండా ఉంటే - అనూరాధలో

అడిగినంత- పంటను యిస్తుంది"

ఈశాన్య ఋతుపవనంలో అప్పు డప్పుడు గాలివానలు తుఫానులు చెలరేగడం కద్దు.

## భూసంపదకు - గోసంపదకు - ఎంతోప్రాముఖ్యత

రైతు లేనిదే వ్యవసాయం లేదు. పశువు లేనిదే రైతు లేడు. వ్యవసాయానికి రైతుకూ, రైతుకు పశువునకూ ఎన్నడూ ఎరుగని అవినాభావ సంబంధంవుంది. పాడికిపశువు, పూజా పునస్కారాలకు పశువు, వ్యవసాయం ఎరువులకు పశువు, బరువు మోయుటకుపశువు, నాగలిదున్నడానికి పశువు, బండిలాగడానికి పశువు, రైతు పశు కదిలితే మెదిలితే పశువుకావాలి. అదిగో ఒడిలాగే ఎద్దుకానీయండి, పాలనొసగే గోవు, గేదెకానీయండి, లేకపోర్ల సంతతిని అభివృద్ధిచేసే పశువుకానీ

యండీ, ఏదైనప్పటికి రైతునకు ప్రొద్దున్నే లేస్తే ప్రొద్దుకూకే వరకు పశువుతో పనివుంది.

భూసంపదకు యెంత ప్రాముఖ్యం యిచ్చినప్పటికీ, గోసంపదను మాత్రం నిర్లక్ష్యంచేయరు. ఏస్వార్థంతో భూసంపదను అనుభవింప గలుగుచున్నారో, ఆస్వార్థత్వంతో గోసేవ అనుపేరుతో గోసంపదను గోరిలుతూవున్నారు.

## భూమాతకు ప్రాణంలేదు - గోమాతకు ప్రాణంవుంది

భూమాతకు ప్రాణంలేదు కాబట్టి మానవులపై జాలిపడే హృదయంకూడా దానిలో లేదు. మానవుడు దానిని ఎంతగా ఉపయోగించుకొంటాడో అంతవరకే ఉపయోగపడుతుంది. కదిపితే కదులుతుంది, దొర్లిస్తే దొర్లుతుంది, అందుచేత భూసంపదంతా మానవుని కృషిపై ఆధారపడివుంటుంది. కాని భూమాతవలెగాక గోమాతకు ప్రాణంవుంది. నవనీతహృదయంగల గోమహాలక్ష్మికి కోటిదణ్ణాలని పాటలు పాడుకొనేవాళ్లు - సామెతలు చెప్పుకొనేవాళ్లు - నీతుల్ని బోధించేవాళ్లు ఈ కాలంలోకూడా ఎంతోమందివున్నారు. భారతీయ మహోన్నతికి మూలస్తంభాలు గోమ, గురువు, గంగ, గోవింద, అను వాటిలో గోమాతదే అగ్రస్థానం.

సూర్యభగవానుడు వేడి వెలుతురు మున్నగునవి మానవాది జీవులు కోరకుండగనే గుణ, జాతి, కుల, భేదాలు లేకుండగనే సర్వ జీవులకు సమానంగా ప్రతిపాదిస్తున్నాడంగతి ఎల్లరకు తెలిసినవిషయమే ఆలాగే గోమాత తనఅమృతతుల్యమైన పాలనువ్యత్యాసాలు లేకుండా ఆబాల గోపాలాన్ని తృప్తి పరస్తూ వుంటుంది. తనమూత్రం, తన పేడ భూమాతకు లంచంపెట్టి ఆహారంగా ఉపయోగించి తద్వారా భూసంపదను ఎన్నోరెట్లు అభివృద్ధిపరచి ఆయాఆహారధాన్యాలను తెచ్చి

గాదెలలోపోయించి, హాయిగాకూర్చుని భుజించమని మానవాళికి హారతులిస్తూవుంది రాక్షసబాధను భరించిలేక భూమాత, గోమాత



రూపందాల్చి ప్రభుశరణ్యాన్ని పొందిందట. అట్టి గోమాత తన పేడను భారత దేశంలోవున్న ముప్పదిమూడుకోట్ల ప్రజలకు వంటచెరుకుగా **ఉపయోగపడే** అవకాశాన్ని యిస్తూవుంది.

## మానవ సేవయే - మాధవ సేవ

నేటి నాగరికత యంత్రయుగ వ్యాపార సరకుల రవాణాలలో ముప్పది వంతుల కార్య భారం గోమాత కన్నపుత్ర రత్నాలగు ఎద్దుల చేత, కోడెలచేత భూములను దున్నించి, పండిన ఆయాభూముల పంటలను తెప్పించి మానవులకు భూదానం చేస్తూవుంది. ఈ విధంగా తన జీవితమంతా మానవులకు ధారపోసి, త్యాగోపేతమగు గోమాత రోగాదులతో కృంగి నాకు ఆయుర్వేద పశువైద్యమే కావాలి అని



రోగాదులచే క్రుంగి కృశించి, గుప్పెడు గడ్డిపరకలుగాని, రవ్వంత ఆయుర్వేద మందులుగాని నోచుకోలేని స్థితిలో మరణించకూడదని కృతఘ్నులైన మానవులపై ఏమాత్రం కినుక వహించక "మాధవసేవయే-మానవసేవయే" యని తన శరీరంలోని ప్రతియణువును మానవుని ఉపయోగార్థమై వినియోగించే అవకాశాన్ని మనకు కలిగిస్తూవుంది.

## తనదూడను మూగభాషతో ఓదార్చుతుంది

మన గోమాత తనబిడ్డకై సృజింపబడ్డ పాలను మానవులకు యిచ్చి, ఆకలిచే డొక్కలంటుకొని యున్న తనబిడ్డలను, తన నాలు

కతో నాయుచూ, మూగభాషలో ఏవేవో త్యాగవచనాలతో ఓదార్చుతూ వుంటుంది. తనదూడకు పాలులేకుండా మూతిబిగించి, ముట్టె ఎండగట్టి, పరులోకానికి పంపేనూ ఆ గోమాత ఏమీకోపంతో వుండదు, విచారించదు. నిష్ఫ్రూపాచెందదు తాను మానవసేవకే జన్మించినట్లు తన విధ్యుక్త ధర్మమన్నట్లుగా భావించుతుంది. ఇంకను క్షీరాభివృద్ధికై రెండుమూడు పూటలు చిట్టు తవుడు పెట్టక పోయినను పాలు యివ్వడం మానదు, కంటతడైనా పెట్టదు, పాలు చేపలేదని కోపంతో యజమానికాను యముడైనా కఱ్ఱతో కొట్టితే "అంభా" అని అంటుందేకాని తన శత్రువులను చెండాడుటకు భగవన్నిర్మితమైన తన వాడికొమ్ములతో పొట్ట చీల్చదు. ఆవిధంగా కొమ్ములను సార్థకంచేయడానికి ప్రయత్నించదు.

## గోమాత సమ్మె చేస్తే - మనకు వ్యవసాయ మేది?

అహింసా ధర్మంలో అఖండ ఖ్యాతిగాంచిన పూజ్యబాపూజీ కూడా మన గోమాత కే పాటిసాటి ? గాంధీజీ లాగ సత్యాగ్రహం చేస్తే పరుల మనస్సు నొవ్వడమేగాక తన తన గోగణాలపై ఆధారపడే మానవులంతా ఎన్నో కష్ట నష్టాలు పడవలసివస్తుంది. మానవులు వేయి విధాల హింసలు పెట్టినప్పటికీ, తన సహజ శాంతదృక్కులతో మానవ సేవ చేస్తూవుంటుంది కాని సమ్మెచేసే ప్రయత్నమైనా తలపెట్టదు. గోమాత సమ్మెచేస్తే మనదేశంలో వ్యవసాయ మెక్కడిది ? అదిలేక పోతే ఆహారం యేదీ ?

## గోమాతయున్నయింట్లో-కలిమి తాండవిస్తూ వుంటుంది

ఆవుపాలు అమృతమువంటివి. రోగిని ఆరోగ్య వంతునిగా బలిష్ఠునిగా చేస్తుంది. గోమయంతో యిల్లు, పశుశాలలు అలికితే గోమాతలు పిడుగులనుండి రక్షింపబడుతుంది. గోమాతయున్న యింటిలో కలిమి తాండవిస్తూనే యుంటుంది. గోమూత్రం ఎన్నో రోగాలను పోగొట్టుతుంది. రక్త పరీక్ష, మేహానివారణకు అమూల్య ఔషధం. గోమాతపైనా గోగణంపైనా మీకు ఏమైనా కృతజ్ఞతా

భావము వున్నట్లయితే మీ రైతు జెండాపై గోమాతను చిత్రించి మీ విశ్వాసాన్ని సార్థకపరచుకోవాలి. ఏయింట గోమాతవుంటుందో, ఆయిల్లే "నిత్యకళ్యాణంతో పచ్చతోరణాలతో" అన్నట్లు తులతూగుతూ వుంటుంది.

## పశువధశాలలు

మనకు పూజనీయమైన గోవును నిలువునా హత్యచేస్తూ వుంటే చూచి సహించలేక అనేకచోట్ల హిందువులకు మతసంబంధమైన కలహాలవల్ల ఎంతోమంది మరణముల పాలయ్యారు. కాని ఈకాలములో కూడప్రతిచోటా కసాయిదుకాణాలు వెలిసాయి. ప్రతిదినము



వందలు వేలు వధింపబడుతున్నాయి. రైతులకు పనికివచ్చేవి, పనికిరానివనే వివక్షణలేకుండా మంచి నెత్తురు, కండరాలతో గూడినమాంసంతో వుంటుందనే విశ్వాసంతో వయస్సులోనున్న పశువులే ఎక్కువగా వధింబడు తున్నవి.

కఠినహృదయులైన దుర్మార్గులు కొందరు రాత్రి వేళ దొంగతనంగా రైతుల కొట్టాలనుంచి పశువులను దొంగిలించుకొని పోయి అమ్ముకోవడంతో రైతులకు భయంఎక్కువై పోయింది. కసాయిదుకాణాలు ఎక్కడకు అక్కడనే దగ్గరగా వుండుటవల్లదొంగల పని మరీ సులువుఅయింది, చీకటిపడగానే దొంగతనంగా పశువులను తోలికెళ్లడం, కసాయివానికి విక్రయించటం, పనులన్నీ తెల్లవారే సరికి పూర్తయిపోవుట జరుగుతూవుంది.

కసాయిదుకాణాలను పూర్తిగా నిషేధించడం వ్యవసాయం చేయడానికి ముసలి ముతక పశువుల్ని రైతు అనవసరంగా కూర్చుండబెట్టి మేపుతూవుండాలి. ఇది రైతునకు అనవసర ఖర్చుకదా యని కొందరు అంటారు. అందుచేత పెద్దపట్టణాలలోను, ముఖ్యమైన కేంద్రాలలోను ప్రభుత్వమే కసాయిదుకాణాలను యేర్పరచి,ఎట్టిపశువులు వధింపబడాలో, ఎట్టివి వధింపబడకూడదో రైతులకు తెలియచేయాలి. దుకాణాలలో వధించబోయేముందు ప్రతిపశువు ప్రభుత్వపశువైద్యునకు చూపించాలని కఠినషరతులుపెట్టి పనిచేస్తేనేతప్ప పశువధలు ఆగజాలవు.

ఇంగ్లండు అమెరికా యూరపు దేశాలలో మానవుల ఆహారం కొరకు జంతువుల వధశాలను కట్టించి వీటినియంత్రసహాయంతో వధించుతారు. ప్రయివేటుగా స్థాపించిన కసాయిదుకాణాలనుఅచ్చటి ప్రభుత్వంగూడా గుర్తించుటలేదు. రోగజంతువులను వధించుటవల్ల వాటివ్యాధులు మానవులకుకూడా సంక్రమిస్తున్నాయి. ఈ కసాయి శాలలు రైల్వేస్టేషనులదగ్గర పశువుల మార్కెట్టులదగ్గర విదేశీయులు ఎక్కువగా నిర్మించుతారు. ఒక చక్కని బిల్డింగునుకట్టి దానినిమూడు భాగాలుగాచేసి మొదటిహాలులో మేకలను, మధ్యహాలులో పశువులను దూడలను మూడవహాలులో గొఱ్ఱెలను కోసివాటి మాంసమును మంచుగడ్డలోవేసి శుద్ధిపరచి డబ్బాలలోనింపి మార్కెట్టులకు పంపుతారు. యింకను విదేశీయులు తమయిండ్లకు బంధువులురాగానేమూడు నెలల వయస్సుగల దూడను వధించి పలావుచేసి అందరుకలిసితింటారు.

బ్రిటిష్ శాస్త్రజ్ఞుడు ఒకరు మనదేశాన్ని చూడడానికివచ్చేసి, అతను బెంగాలు రాష్ట్రంలో ఒక పల్లెటూరుకు పోగా అచ్చటి ప్రజలు మన దేశాచారప్రకారం మర్యాదచేయగా అప్పుడతను మా దేశంలో గొడ్డుమాంసాన్ని అతిథులకుపెట్టి మర్యాదచేయకపోయిన అమర్యాదగాచూస్తారన్నారట. భారతదేశంలో గొడ్డుమాంసంతినకుండుటచాల సంతోషించుచుతూ, హిందువులకు గోవంటే ఎంతదయ అని ఆశ్చర్య పోయాడట.

---

# మూడవభాగము ప్రాణిపుట్టుక

## పశుసంపద - గోసంరక్షణ సంఘాలు

## పశువుల కొట్టము

## ప్రాణికోటి పుట్టుక

180 సంవత్సరాల క్రిందట భూమిమీద ప్రాణికోటి ఉద్భవించింది. రెండున్నరకోట్ల సంవత్సరాలనాడు గవ్వలేక నత్తగుల్ల, చేప ఆకారముగాను, ముప్పదిఅయిదుకోట్ల సంవత్సరాలనాడు చేప వూపిరితిత్తులతో పుట్టినట్లును, పదునైదుకోట్ల సంవత్సరాలనాడు చెట్లు, పక్షి ఆకారముగా పుట్టినట్లును, అయిదున్నరకోట్ల సంవత్సరాలనాడు పాలిచ్చే ఆడపశువులు అనగా మనేలియూజాతి పుట్టినట్లును, డెబ్బదిలక్షల సంవత్సరాలనాడు మానవ ఆకారంగా వచ్చినట్లును శాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు. మానవుడు వేటగాడు తరువాత వ్యవసాయదారుడు, తరువాత భూమిని దున్నుట, వ్యవ

సాయము చేయుట, పశువులను కుక్కలను తదితర జంతువులను




పోషించుట మున్నగు కార్యక్రమాలతో మానవుడు వృద్ధిలోనికి వచ్చినాడని తెలుస్తున్నది.

## జంతుసంపద - వ్యవసాయం

వ్యవసాయ విషయంలో దేశం మొత్తంమీద అగ్రస్థానం వహించిన ఉత్తర ప్రదేశము. ఈ దేశములో వ్యవసాయానికి పనికి

వచ్చే ఎద్దులు దున్నలు ఎక్కువగా వున్నాయి. ఇంకను ఈ రాష్ట్రంలో గొర్రెలను మేపుట, ఉన్నిని ఉత్పత్తి చేయుట, గుఱ్ఱాలు, పొట్టి గుఱ్ఱాలను పెంచుటలో అభివృద్ధిగాంచింది. అన్ని దేశాల కంటె అస్సాంలో గాడిదలు తక్కువగాను, ఉత్తర ప్రదేశంలో గాడిదలు, బర్రెలు ఎక్కువగాను. బీహారు రాష్ట్రంలో గుఱ్ఱాలు ఎక్కువగాను, రాజస్థానంలో ఒంటెలు, మేకలును, ఉత్తర ప్రదేశ్‌లో పందులును ఎక్కువగా వున్నాయి.

ప్రపంచం మొత్తంమీద పశువుల సంఖ్యలో రష్యా మొదటిది గాను అమెరికా అమెరికాద్వితీయ స్థానంగాను, చైనా మూడవది గాను, ఆస్ట్రేలియా నాల్గవదిగాను పేర్కొనబడినాయి.

1. మన భారతదేశంలోనున్న పశుసంఖ్య 31 కోటి మాత్రమే. ప్రపంచం మొత్తంమీద 95 కోట్ల పశువులు వున్నాయి. మనదేశంలో మూడవవంతు వున్నాయి.

మనదేశ జనాభా ప్రకారం తలకు సగటున 74 వంతున పశువులువున్నాయి. ప్రపంచపు సరాసరి సంఖ్య 0.82. ఈ విషయములో న్యూజిలాండు సరాసరి సంఖ్య 21.05 ప్రపంచంలోకెల్లా అగ్రస్థానం వహించింది. రెండవది ఆస్ట్రేలియా సరాసరి సంఖ్య 15.5 స్థానం వహించిందని చెప్పవచ్చును.

ఆబోతుల విషయంలో చెన్నరాష్ట్రం ప్రథమ శ్రేణిగాను, బొంబాయి రెండవదిగాను, ఆవుల విషయంలో వుత్తరప్రదేశ్ మొదటిదిగాను, చెన్నరాష్ట్రం రెండవదిగాను, బీహారు మూడవదిగాను, స్థానం వహించినాయి. గేదెల విషయంలో ఉత్తర ప్రదేశ్ మొదటిది గాను, చెన్నరాష్ట్రం రెండవదిగాను ప్రసిద్ధికెక్కినదిగాను, భారత ప్రభుత్వలెక్కలనుబట్టి తెలుస్తూవుంది.

# మనదేశ పశు సంపద

భారతదేశంలో 20 కోట్ల 82 లక్షల పశువులున్నాయి. అందులో

| | |
|---|---|
| ఆడపశువులు | 7 కోట్ల 44 లక్షలు |
| మగపశువులు | 6 కోట్ల 85 లక్షలు |
| మూడుసంవత్సరాల వయస్సువి | 6 కోట్ల 82 లక్షలు |
| పాలుయీనివి | 50 లక్షలు |
| వట్టిపోయినవి | 3 కోట్ల 54 లక్షలు |
| పాడి పశులు | 3 1/2 కోట్లు |

## పశు సంపదపై - వచ్చు ఆదాయము




మనదేశము పశుగణాభివృద్ధికి, పాడిపరిశ్రమకు సాధనోపాయాలను సూచించుటకై భారతప్రభుత్వం ఒకకమిటీనివేసి సంవత్సరాదాయాలను తేల్చమన్నారు. పశువుల మూలంగా సంవత్సరాదాయం 1900 కోట్లరూాయలని కమిటీ తేల్చింది.

| | | |
|---|---|---|
| పాలు పెరుగు వలన | 810 | కోట్ల రూపాయలు |
| వ్యవసాయపు పశువులవలన | 612 | ,, |
| ఎరువులవలన | 270 | ,, |
| వ్యవసాయేతర పశువులవలన | 161 | ,, |
| తోళ్లు, ఉన్ని, మాంసంవలన | 45 | ,, |

ఇంతేగాక ఎముకలు, కొమ్ములు, గోరోజనం వగైరా అమ్మకం వలన ఇంకా కొన్ని కోట్లు ఆదాయం వస్తుంది.

## ఆంధ్రరాష్ట్రంలో - జంతుసంపద

| | |
|---|---|
| ఆవులు, ఎద్దులు | 115 లక్షలు |
| బర్రెలు, దున్నలు | 60 లక్షలు |
| గొర్రెలు | 80 లక్షలు |
| మేకలు | 40 లక్షలు |
| కోళ్లు | 150 లక్షలు |
| గుర్రాలతో యితరజంతువులు | 7 లక్షల 29 వేలు |

ప్రస్తుతం సాలీనా 1550000 టన్నుల పాలు, పాలపదార్థాలు మనరాష్ట్రంలో వుత్పత్తి అవుతున్నాయి. ఈపాలు జనసంఖ్య దృష్ట్యా సరిపోవు.

మూడుసంవత్సరాల పైబడిన ఎద్దులు ఆవులు 86 లక్షలు, దున్న గేదె జాతిపశువులు 40 లక్షలు వుంటాయి.

మన రాష్ట్రంలో 300 లక్షల యెకరాలలో పంటలు పండింప బడుతున్నాయి. ఇంకను 30 లక్షల నాగళ్లు 12 లక్షల బండ్లు పని చేస్తున్నాయి. వీటిదృష్ట్యా అందుభాగాలలోవున్న వ్యవసాయ పశువుల సంఖ్య చాలదు. అవి అంత శ్రేష్టమైన పశువులుకూడా కాదు.

## తెలంగాణాలో పశుసంపద

| | |
|---|---|
| ఆబోతులు | 15000 |
| ఎద్దులు | 18,53 694 |

| | |
|---|---|
| దున్నలు | 383000 |
| గేదెలు | 618797 |

ఈపై లెక్కలు1951–52లో ప్రభుత్వం ప్రకటించిన లెక్కలనుబట్టి తెలుస్తూ వుంది.

పశుసంపద ఆహారకొరత సమస్యను పరిష్కరించడానికి, పాలను ఈడడానికి వుపయోగ పడేటందుకుకాదు. ప్రజలకున్న ఆర్థిక బాధలను తొలిగించడానికికూడా పశు సంపద బాగా ఉపయోగపడుతూ వుంది పాలపరిశ్రమ, వెన్న, నేయివగైరాలను విక్రియింపడంవల్ల వేలకొలది కుటుంబాలు తమకువుండే ఆర్థిక బాధలను కొంతవరకైనా తప్పించుకుంటున్నారు.

ఆంధ్ర ప్రభుత్వశాఖా ఆఫీసర్ గారు ఒకరు మనదేశపశువుల వలన వస్తూవున్న ఆదాయాన్ని ఈదిగువ రీతిగా అంచనా వేశారు.

వ్యవసాయోత్పత్తుల రవాణాలో పశువుల శ్రమవిలువ 15 లక్షల రూపాయలు, పొలందున్నుట బండ్లులాగుటవగైరాపనులలో పశువుల శ్రమవిలువ 13 కోట్ల రూపాయలు. పాలిచ్చే పశుపాలవిలువ 350 లక్షల రూపాయలు. ఎరువులవల్ల 5 కోట్లరూపాయలు. మొత్తం 23 కోట్ల 25 లక్షల రూపాయలని తేల్చారు.

ఈమధ్య మనదేశంలోని ప్రజల ఆహార పరిస్థితి విషయమై ఒక కమీషనర్ గారు పరిశీలించగా భారతదేశంలోగల జనాభాలో నూటికి 80 మంది తమశరీరాన్ని రోగాలపాల బడకుండా తగినదార్ఢ్యం ఈయవలసిన దానికంటే చాలాతక్కువ ఆహారాన్ని తీసుకొంటున్నారని తేల్చారు. ఆహారంసరియైనది లేకపోవడంవల్లమానవులకు రకరకాల రోగాలు వస్తున్నాయి. ప్రతిమనిషికి పనిచేయిడానికి తగినంత శక్తిసామర్థ్యాలు కావాలి. ఈ శక్తికి తగిన పుష్టినియిచ్చే ఆహారాన్ని తినాలి. ఈ విషయంలో ఆహారశాస్త్రజ్ఞులు యీక్రిందిపట్టిక ప్రకారం ఆహార కేలరీలవిలువ వుండాలని నిర్ధారణచేశారు.

| వృత్తి | ఆహారపు కేలరీలు |
|---|---|
| గుమాస్తా | 2600 |

| | |
|---|---|
| డాక్టరు | 2760 |
| గృహిణి | 2800 |
| సైనికుడు | 3150 |
| వడ్రంగి | 3190 |
| కూలీ | 3610 |
| కమ్మరి | 4120 |
| కట్టెలకూలి | 5500 |

ప్రతి వ్యక్తి తన శరీరానికి 25 వేల కేలరీల శక్తిగల పుష్టిని ఈయడానికి గాను ఈ క్రింద వివరించిన లెక్కల ప్రకారం ఆహారాన్ని తినాలని శాస్త్రజ్ఞులు సూచించారు.

| | |
|---|---|
| బియ్యము | 16 ఔన్సులు |
| పప్పుదినుసులు | 3 ,, |
| చక్కెర | 2 ,, |
| కూరగాయలు | 10 ,, |
| పండ్లు | 2 ,, |
| నూనెలు | 2 ,, |
| పాలు | 10 ,, |
| మాంసము చేపలు | 3 ,, |
| గ్రుడ్లు | 1 ,, |

ప్రతిమనిషీ 25 వేల కేలరీలశక్తిగల ఆహారాన్ని తినాలంటే ప్రతి నిత్యమూ పైన వివరించిన రీతిగా ఆహారన్ని తీసికోవాలి. ఇంకను ప్రతిమనిషీ ప్రతిరోజు పదిఔన్సుల పాలు తీసుకోవాలంటె ముప్పాతిక శేరు పాలను వాడుకోవాలి. 2500 కేలరీలశక్తిగల ఆహారం కంటె ఇంక ఎక్కువైన ఆహారాన్ని తీసికోవలసినవారు ప్రతిరోజూ శేరుపాలకు తక్కువలేకుండా తీసికోవలసి వుంటుంది.

ఈ రీతిగా తీసికోవలసినది చెప్పుతూవుంటే నూటికి 50 కుటుంబాల వారు అర్థశేరు పాలు గూడా తీసికోవడం లేదు సరిగదా? అర్థసేరు మజ్జిగ నీరుకూడా దొరకక బాధపడుట మనం చూస్తునే

యున్నారము. పాలు నెయ్యి పెరుగు పుష్టిగల ఆహారం లేకుండా తినే ఆహారం 16 ఔన్సులు కంటే అధికంగా వున్నప్పటికీ ఉపయోగం తక్కువ.

1950 సం॥ లో మదరాసు ప్రభుత్వ ఆరోగ్యశాఖవారు జరిపించిన పరిశోధనలో వివిధ ఆదాయాలుగల కుటుంబాలు దినానికి ఎన్ని ఔన్సుల పాలను వాడుతున్నారో తెలియజేశారు. నెలకు రు 50–0–0 లు అంతకంటె తక్కువ ఆదాయం వచ్చే కుటుంబాలు ప్రతిరోజూ వాడుతూవున్న పాలు 1 1/2 ఔన్సులు మాత్రమే.

నెలకు 50 నుండి 100 రూపాయలవరకు ఆదాయం వచ్చే కుటుంబాలు ప్రతి నిత్యమూ వాడుతూ వున్న పాలు 1 3/4 ఔన్సులు మాత్రమే.

నెలకు 100 నుండి 200 రూపాయల వరకు ఆదాయం వచ్చే కుటుంబాలు వాడుతూయున్న పాలు 2 ఔన్సులు మాత్రమే.

నెలకు 200 రూపాయలవరకు ఆదాయంవచ్చే కుటుంబాలు ప్రతి నిత్యమూ వాడుతున్న పాలు 3 1/2 ఔన్సులు మాత్రమే. వాడవలసిన పాలకంటె కుటుంబాల వారంతా తక్కువ పాలనే వాడుతున్నారని పై విషయాలను బట్టి తెలుస్తూవుంది.

మనదేశ పరిస్థితులు అటులనుంచి విదేశాలలో పాలు ఏరీతిగా వాడుతున్నారో ఈ దిగువ విషయాలు పరిశీలిద్దాం.

| దేశము | ఔన్సులు |
|---|---|
| ఆస్ట్రేలియా | 44.4 |
| బెల్జియం | 33.0 |
| జర్మనీ | 35.0 |
| స్విట్జర్లాండు | 49.2 |
| అమెరికా | 35.6 |
| బ్రిటను | 40.7 |
| ఫ్రాన్సు | 30.4 |
| కెనడా | 56.8 |

పశుజాతి క్షీణించిపోవడానికి గల కారణాలలో ముఖ్యమైన కారణ మేమన పశువులకు పుష్టికరమైన ఆహారం లేక పోవడమే. పుష్టి గల ఆహారాన్ని తినడం మానవుల కెంతఅవసరమో పశువులకుకూడా అంతే అవసరం. సంపూర్ణమైన ఆరోగ్యాన్ని కలిగిన పశువు బరువు 600 పౌనులు వుండాలి. రోజుకు 15 పౌనుల గడ్డి కావాలి. తెలకపిండి, చిట్టు, తవుడు ప్రత్తి గింజలు ఒక్కొక్కటి పౌనుకు తక్కువ గాకుండా వుండాలి. ప్రస్తుతం మన రాష్ట్రంలోగల పశువులకు ఇందులో సగం మేత కూడా లభించుట లేదు. డెల్టా ప్రాంతాలలో కొంతవరకు [illegible] లకు విస్తారంగా వుంటుంది. పశువులకు దానినంతా వేస్తారు. కాని అందులో బలం తక్కువ. ఆ గడ్డిని అధికంగానైనా తినలేవు, దాణాలు కూడా తక్కువే వాడుతారు.

## ఆబోతులు – దున్నపోతులు

మన పశుసంపద అభివృద్ధి పొందకుండా మరొక కారణంకూడా వుంది. జాత్యాభివృద్ధికి అవసరమైన మంచిజాతి ఆబోతులు దున్నపోతులు చాలినన్ని లేకపోవడంవల్ల పశుజాతి అభివృద్ధి చెందలేకపోతూ వుంది. ప్రతి వంద పశువులకూ ఒక ఆబోతు వుండాలని పశుశాఖాధికారులు తెలుపుతున్నారు. 1951–52 సంవత్సర లెక్కల ప్రకారం కావలసిన ఆబోతులలో నూటికి 50 పాళ్లు, దున్నపోతులలో నూటికి 50 పాళ్లు మాత్రమే వున్నాయి. ఈ రీతిగావున్న ఆబోతులు, దున్నపోతులు అంత శ్రేష్ఠమైనవి గావు. ఆబోతులలో చాలావరకు గ్రామాలలో పెద్దపెద్ద రైతుఇండ్లలో శుభకార్యాలు అశుభకార్యాలు జరిగేటప్పుడు మొక్కుబడి తీర్చుకునే టందుకు వదలి పెట్టబడినవిగానే వుంటాయి. దున్నపోతులు కూడా ఇంతే. రైతులు మాత్రము గ్రామాలలో అప్పుడప్పుడు గంగానమ్మకో, పోతురాజుకో, [illegible] దున్ననువదులుతారు. శ్రేష్ఠమైనజాతికి చెందని ఆబోతులు, దున్నపోతులు పారడంవల్ల వాటికి పుట్టే సంతానం మరింత దిగజారిపోతుంది [illegible] కీలక గ్రామ సెంటర్లలో జరిగే కృత్రిమ సంపర్కాన్ని గురించి [illegible] లంటేఎంతో వుంది. ఆవిషయమై ఈ గ్రంథములో [illegible].

పంచవర్ష ప్రణాళికలలో ఒక భాగంగా ప్రభుత్వం ఆబోతులను దున్నపోతులను సప్లయి చేస్తూవుంది. రైతులుగాని గ్రామ ఉమ్మడి సంస్థలుగాని సగంఖరీదుయిస్తే మిగతా సగాన్ని ప్రభుత్వంయిస్తుంది. తరువాత ఆబోతుకు దున్నపోతుకు ఒక్కొక్కదానికి ప్రతిసంవత్సరమూ 220 రూపాయలు ఇస్తుంది. పశుజాతిని అభివృద్ధి పరచుకొనే ప్రతి రైతు ఈ అవకాశాన్ని వుపయోగించుకోవాలి.

ఇక పశుజాతులు క్షీణించి పోవడానికిగల కారణాలలో వాటికి సంభవించే అంటురోగాలు, తదితర వ్యాధులనుండి తప్పించడానికి తగినఅవకాశాలు లేకపోవడంకూడా ముఖ్యకారణమైవుంది. రాష్ట్రంలో వున్న పశువైద్యశాలలు చాలాతక్కువ. ప్రతి 25000 పశువులచికిత్సకు (గొఱ్ఱెలు, మేకలు, కోళ్ళు, కుక్కలు మొదలగునవి మినహాయించి) ఒక్కొక్క డాక్టరు కావాలి. రోగాలను బాగుచేయడంతోపాటు పశువుల అభివృద్ధికి అవుసరమగు సూచనలుగూడా ఈయను యిస్తూ వుండాలి.

ఇప్పుడు ఆంధ్రదేశములో వున్న పశువులకు డాక్టర్లలో 100 కి 40 ది గూడా లేరు. బ్రిటనులో ప్రతి 3000 పశువులకు ఒకడాక్టరు వున్నాడు. జర్మనీలో ప్రతి 2500 పశువులకు ఒక డాక్టరువున్నారు. హాలెండు, స్విట్జర్లాండులలో ప్రతి 3000 పశువులకు ఒక డాక్టర్ వున్నాడు. ఆంధ్ర దేశములో ఇప్పుడున్న లెక్కల ప్రకారంఒకలక్ష పశువులకు డాక్టర్లు కావాలి.

## ప్రభుత్వ పశువైద్య ఆస్పత్రులు

ఇవి జిల్లా ముఖ్యపట్టణాలలో యేర్పాటుచేయబడినాయి. ఇట్టి ఆస్పత్రులలో మేలురకపు ఆబోతు వుంచబడుతుంది. మనరాష్ట్రంలో 36 ఆస్పత్రులు మాత్రమే వున్నాయి.

## ప్రభుత్వ పశువైద్య ఔషధశాలలు

ఇవి తాలూకా ముఖ్యసెంటర్లలో యెక్కువగా వుంచబడి డాక్టరు రోజు వచ్చేపోయే పశువులకు చికిత్సలుచేస్తూ అవసరమను

కుంటే రోగపశువులకు తన వైద్యశాలలోనే మంచి చికిత్స చేస్తాడు. మన రాష్ట్రం మొత్తంమీద 45 ఔషధశాలలు వున్నాయి.

## ప్రభుత్వ చిన్న చిన్న ఔషధశాలలు

ఇవి సాధారణంగా పశువులు ఎక్కువగావుండి, పశువైద్య సదుపాయాలు అత్యవసరమైన ప్రదేశాలలో యేర్పాటు చేయబడి అచ్చటవుండే డాక్టరు నెలకు 10 దినాలు ఆయా ప్రాంతాలలోవుండే అంటురోగాల నివారణకై పర్యటన చేస్తాడు. మనరాష్ట్రంలోయిట్టివి 165 వరకు వున్నాయి.

## ప్రభుత్వ సంచార వైద్యశాలలు

ఇవి ముఖ్యముగు గ్రామాలలో నెలకొల్పబడి పదిరోజులు గ్రామంలోవుండి తక్కిన 20 రోజులు గ్రామాలలో పర్యటనచేస్తారు. ఇటువంటివి రాష్ట్రంలో 27 వున్నాయి.

## ప్రభుత్వ ప్రథమ చికిత్సా కేంద్రాలు

ఇవి ముఖ్యమైన గ్రామాలలో యేర్పాటు చేయబడి ఆ గ్రామస్తులు మాత్రం మందులుకొనే నిమిత్తం సంవత్సరానికి రు 250-0-0 లు ఈయాలి. ఇంకను ఈకేంద్రాన్ని నడపడానికి అద్దె లేకుండా ఒక గది, కుర్చీలు వగైరా [illegible] చేయాలి. వారానికి ఒక సారి డాక్టరు ఈకేంద్రంలో [illegible]చేస్తారు.

## ఆంధ్ర ప్రదేశ్‌లో ఆయుర్వేద పశువైద్య శాలలు

భారత దేశములోని మూతన [illegible] [illegible]ములో ఆంధ్ర జాతీయ పశువైద్య కళాశాలలో గ్రామ పశుసేవక శిక్షణయిచ్చి కొన్ని వందలమంది వైతుబిడ్డలను తయారుచేసినాము. ఆ వైతుబిడ్డలలో చాలామంది వైద్యశాలలను స్థాపించి ఆయాగ్రామ [illegible] రైతులకు, పశువులకు, సహాయం చేస్తున్నారు ప్రభుత్వంకూడయిట్టి వైద్యులకు [illegible] ప్రోత్సాహ మీయదలచినది. ఇప్పటికి నాలుగువందలమంది వైద్యులు తయారైనారు. వీరుగాక ఈచింతామణిని చాలాకాలమునుంచి

చదువుచు, ఈగ్రంథము ప్రకారము రోగవిధానము మంచి అనుభవము గ్రహించి చాలామంది రైతులు నోయిలేని పశువులకు సేవచేస్తున్నారు.

## గోసంరక్షణా సంఘాలు

అనాథ గోవులను, వట్టిపోయిన గోవులను కాపాడే సంఘాలను రక్షకసంఘాలు అంటారు. గోశాలలన్న, పశుశాలలన్న, కేవలం పశువుల సంపన్నగృహాలు. ఈరెండు సంస్థలను మనభారత ప్రభుత్వం వారు ప్రత్యేక శ్రద్ధతీసికొని కొన్నిలక్షల రూపాయలను కేటాయించి అన్ని ముఖ్యప్రాంతాలలో స్థాపిస్తున్నారు. ఈనాడు గోదధి, గోక్షీర, గోఘృతవ్యాపారాలువిరివిగానాగుతున్నాయి ఇట్టివ్యాపార సంస్థలలో కల్తీ వస్తువులుకలిపి పాడుచేస్తున్నారు. ఈ సంస్థలమీదభారతప్రభుత్వం



అజమాయిషీ తీసుకొని తగిన కట్టుదిట్టాలుచేయకపోతే ప్రజలు వివిధ రోగాలకు గురియవ్వక తప్పదు. ఇంకను అచ్చటచ్చట గోవులను సంరక్షించడానికి గోశాలలు, గోరక్షణ సంఘాలను వ్యక్తులుస్థాపించిన వాటినివిపులంగా పరీక్షించితగినఆదరణ,ఆర్థిక సహాయం యిప్పించాలి. ధర్మచందాలు వసూలుచేసి గోసంరక్షణ సంఘాలు స్థాపించి ఏకొద్ది గోవులనో పెట్టి వాటి పాలను, మలమూత్రాదులను అమ్ముకొని ప్రభుత్వగ్రాంటులు పొందుచున్నవాటిపై తగిన చర్యతీసికోవాలి.

సెలయేఱులును విహరించుటకు విశాలమగు స్థలములు భగవంతుడు నిర్మించి యున్నాడు.

## పశువుల శాల

అనాది సిద్ధమగు వేదకాలమునందు సయితము ఋషికుటీరములందు పెంచబడుతువుండేవి. మన ఉపయోగమునకై వాటిని తెచ్చుటతోడనే వాటిస్వేచ్ఛ పోయినది. మనదేశములో పశుశాలను నిర్మించుట కష్టమైనపనికాదు. అతి స్వల్పఖరీదుతో తాటియాకుల కప్పులతోను దూలములతోను నిర్మింపవచ్చును. ఇంకను మనము పశువులకువేయు పాకగాని పెంకుటిచావడినిగాని మిగుల ఎత్తుగా నిర్మించరాదు. రైతులలో కొందరు తనుస్థితికిమించి చాలధనము వ్యయముచేసి పశువులకు పెంకుటి చావడులు కట్టినవారు గలరు. ఈ చావడులు చాలాపునాదితో కట్టబడునుగాని అందచందములు లేక మోటుగా నిర్మింపబడుచున్నవి. రాయలసీమలో పశువులకువేయు శాలలు చాలమోటుగా వుంటాయి. ఇంకనూ పూర్వపద్ధతులలోనే యున్నారుగాని ప్రస్తుతకాల పరిస్థితులనుబట్టి శాలలను నిర్మించుట లేదు.

పశుశాల నిర్మాణమునకై పలురకముల రాళ్ళు సున్నము వెదుళ్ళు కలప మున్నగునవి రైతుయొక్క ఆస్థినిబట్టి నిర్మించాలి. ఏసామగ్రి తక్కువ ఖరీదుగలిగి గట్టితనముగానుండునో విచారించి పశుశాలను నిర్మించాలి. కొన్ని శాలలు అనేక శతాబ్దములక్రిందట నిర్మించినను చెక్కుచెదరక యుంటాయి, కనుక సామగ్రిని పరీక్షించి త్వరలో శిథిలముగానట్టియు త్వరలో మరమ్మతు కోరనటువంటియు సామగ్రినే ఉపయోగించుట మంచిది.

## పశుశాల నివేశనస్థల లక్షణాలు

నేలగుల్లగానుండరాదు. వర్షపునీరు నిలువకాకుండ త్వరగా జారిపోవునట్లు ఏటవాలుగా వుండాలి. పోతమట్టిగలస్థలములలో శాలను నిర్మించరాదు. చెమ్మగానుండు స్థలములు మాగానిపొలములు మురికినీటి పొలములు శ్మశానములు, పశుశాలనివేశనమునకు దూరముగా

వుండాలి. సాధారణముగా పై సూత్రముల ననుసరించి నివేశముల నెంచుకొనుట కవకాశము గలుగదు. ఎక్కడస్థలములభించిన అచ్చటనే కట్టవలసి వచ్చును. అట్టిసమయమునందు నివేశనాన్ని ఎత్తుపరచి నేల క్రింద తూములనుంచియు చెమ్మతగులునట్లు యేర్పాటు చేయాలి. పనికిరానితుప్పలునరికించి క్రుళ్ళునీరు నిలువకుండ గోతులనుపూడ్పించి నివేశమును శుభ్రపరచాలి.

## శాల నిర్మాణము

శాలలో తగినంత వెలుతురు గాలి రానియెడల చెమ్మగానుండి అనారోగ్యము కలుగుతుంది. మట్టిలోని చెమ్మవలనను పైకప్పు కారుట వలనను శాలకు సమీపమున చెట్లుండుటవలనను చెమ్మచేరుతుంది. ఇటుకలు చెమ్మనుపీల్చుతాయి. చిన్నసందులందును పశు సమూహము గల వీధులందును విశాలమగు పెరడుగాని వాకిలిగాని లేక సంకుచిత మగు స్థలమున కట్టబడిన శాలలో వెలుతురు గాలిచొచ్చుటకు వీలు లేక పోవుటచే చెమ్మ హెచ్చుగా వుంటుంది.

పునాదులు సరిగావుండకపోవుట వలననే గాలివానలకు కూలి చాలా పశువులు మరణించుచున్నవి. అందువలన పునాదులు గట్టిగ బలముగ వుండాలి. నేల గట్టిది గానప్పుడు కాంక్రీటుచేసి పునాదులు కట్టుట మంచిది. ఇందువలన దుర్గంధములు చెమ్మ భూగర్భమునుండి శాలలోనికి చొరబడజాలవు. భూమిమట్టమునకు గచ్చుమట్టమునకు మధ్య గా పునాదుల వెడల్పునను నీటిని చొరనీయని వస్తువులతో కట్టాలి.

గోడలను సాధారణముగా ఇటుకతోగాని, రాతితోగానికట్టుదురు. ఇటుకలు సరియైన ఆకారముగను ఒకటేమాదిరి రంగుగలిగి మ్రోగించినచో లోహపుధ్వని వచ్చునట్లుండాలి. ఇటుకలు గాలి చొరనిచ్చుటకు చెమ్మపీల్చుటకు చాలినంత గుల్లగాకూడావుండాలి మందముచాలని గోడలుగల శాలలలో శీతాకాలమున చలియు వేసవి యందు వేడిమియు అధికముగా వుంటుంది. పెద్దతుఫానుగాలులందైనను గోడలు చెమ్మను పీల్చకుండునట్టిరీతిగా కట్టాలి.

సామాను గదులకుగాక పశువులువుండే ప్రతిగదికి కనీసము ఒకకిటికీయుండాలి. నాలుగువైపులద్వారాలు వుండాలి. వేసవికాల మందు రాత్రింబవళ్ళు కిటికీలు తెరచి యుంచాలి. శీతాకాల మందునువర్షాకాలమందునుఉత్తరపు కిటికీలు తెరువరాదు. శాలలో వేపచెట్టుండుట మంచిది. రాత్రులందు తలుపులు మూయాలి. పగలు మూయరాదు. శాలలో ఎక్కువపశువులుగల రైతు పశుచికిత్సకొరకు ఒకగదిని నిర్మించుటమంచిది. ప్రాథమిక పశుచికిత్సకొరకు కొన్ని పశువైద్యగ్రంథాలు తెప్పించి చూచుట మంచిది. కొన్ని మందులు పరికరములు యుండుట మంచిది.

పశువులకొట్టము భూమి మట్టమునుంచి 10 అంగుల ఎత్తు తక్కువగా వుండరాదు. ద్వారమువైపు 8 అంగుల ఎత్తువుండాలి. మధ్యభాగము 12 అంగుల ఎత్తువుండాలి. వాయు ప్రవేశమునకు, వాయునిర్గమనమునకు వుపయోగించునట్లు కిటికీలు శాలయొక్క వాయుప్రదేశము ననుసరించి తగిన వైశాల్యము గలిగివుండాలి.

పెంకు కలప తాటియాకు గడ్డి మొదలగువానితో ఇంటికప్పులు నేటవాలుగ కట్టవలెను. ఇంటికప్పు వర్షము ఎండను ఆపునదియేగాక కొంతగాలినికూడ చొరనిచ్చుటకు వీలుగావుండాలి. ఇంటికప్పుపై పడిన వర్షపునీరు పైకిపోవుటకు మూడువైపులను కాలువలనుఏర్పరచాలి. ఇంటికప్పు దట్టముగవుండి వేడిమిని పోనీయని పదార్థములతో నిర్మించాలి. ఇంటికప్పు ఎంత ఎత్తుగనున్న దానినుండి లోపలికి ప్రవేశించు వేడిమి అంతతక్కువగావుండాలి.

## పశువులు సుఖముగా వుండుటకు యంత్రము

| | | | |
|---|---|---|---|
| 56 | 66 | 3 | 7 |
| 6 | 3 | 63 | 62 |
| 65 | 60 | 8 | 1 |
| 4 | 5 | 61 | 64 |

ఈఅంకెలను కాగితముమీద వ్రాసి పసుపు అంటించిపశుశాల తలుపులకు అంటించాలి.

# పశుశాల విస్తీర్ణము

పశుశాలకు సుమారు ఏడెనిమిది రెట్లు విస్తీర్ణముగల విశాల మగుస్థలము ముందుభాగాన దానిచుట్టు ఎత్తుఎక్కువగానుండె గోడలు వుండాలి. పశుశాల చౌకముగానైనా గుండ్రముగానైనా వుండాలి. పశుశాలను మూడుభాగములుగా విభజించాలి.

## గోశాల

1. ఆవులు గేదెలు ప్రసవించుట
2. దూడలను తల్లులు లేనపుడు ఉంచుట
3. దుక్కిఎద్దులను పశువుల వుంచుట

ఈ మూడుభాగాలు దక్షిణపువైపు తెరచియుంచాలి. ఉత్తరపు గోడకట్టాలి. అందు చిన్న చిన్న కిటికీలు వుండాలి. ఆకిటికీలు భూమికి అయిదారడుగుల ఎత్తువుండాలి. శాల 16 అడుగుల వెడల్పువుండాలి. ఉత్తరపు గోడనుంచి పశువులు నిలుచుండుటకు 10 అడుగుల స్థలము వుండాలి. ఒకనీటితొట్టికూడా వుండాలి మంచినీరు త్రాగుతొట్టి ఇటుకతోగాని సిమెంటుతోగాని చేయించాలి తొట్టెయొక్క లోతు 18 లేక 21 అంగుళముల వెడల్పును 12 లేక 15 అంగుళముల లోతును భూమి నుంచి 12 అంగుళముల నీటిమట్టమును యుండాలి.

పశుశాలయొక్క ఏటవాలు ఉత్తరదక్షిణాలుగా వుండాలి. పశువులయొక్క తలమొదలు వెనుకటిభాగము వరకు ఏటవాలుగ వుండాలి. ఆ ఏటవాలు 30 అంగుళములు దాటియుండరాదు. అట్లున్న యెడల మూత్రమును అతిసులభముగా బైటకుపోగొట్టగలదు. ఉత్తరపు గోడవైపు ఖాళీగావుండాలి. ఎందుచేతనన మేతవేయుటకుగాని సామానులు తీసికొని పోవుటకుగాని ఖాళీయుంచాలి. వెలుపలిభాగమున 8అడుగులపొడవు4అడుగుల వెడల్పు 2అ.లలోతుగొయ్యియుండినయెడల మలమూత్రములన్నియుఅందులోనికిపోతాయి. దక్షిణపువైపు పైకప్పు స్తంభములచేతగాని యిటుకలచేతగాని కలపచేతగాని అమర్చబడి యుండాలి. ప్రతిస్తంభము యిటుకతో కట్టాలి ద్వారము 6 అడుగుల వెడల్పు 6 అడుగుల పొడవు వుండాలి. దూడలు నీరు త్రాగుటకు

6 లేక 9 అంగుళములవరకు లోతుగలిగిన తొట్టెను యుంచాలి. మొత్తముమీద 17 అంగుళంకంటె తొట్టెఎత్తుండరాదు.

## శాలను శుభ్రముగా వుంచుట

పశువులమందను విస్తారముగా శాలలో వుంచరాదు. వాటికి విశాలమైన గదులు వుండాలి. అవి నిలుచుండుటకు పడుకొనుటకు స్థలము వుండాలి. కొన్ని పెద్దపశువులైనచో 60 అంగుళములస్థలమున్న ఒక్కపశువేయున్నయెడల 10 అంగుళముల పొడవు 8 అంగుళముల వెడల్పుగల స్థలము వుండాలి. అట్లుండినయెడల దానిఇష్టము వచ్చినటుల తిరుగగలదు. పశుశాలను ప్రతిదినము ఉదయ సాయం కాలములందు శుభ్రము చేయుచుండాలి. ప్రతిదినము మలమూత్రాదుల తీసి ఫినైల్ లోషన్‌గాని సున్నపునీళ్ళనుగాని జల్లుతూవుండాలి. భూమిమీద ఇసుక కంకర మున్నగునవి పోయుటవలన నేల గట్టిగా వుంటుంది. పశుశాలను తుడుచుట కడుగుట మున్నగునప్పుడు పశువులను పొలములోనికి తోలిగాని బయటకట్టివేసిగాని మరొక దొడ్డిలోనికి తోలిగాని దొడ్డిని శుభ్రము చేయుచుండాలి.

## పశువుల కాపరి - తక్కీవడుకుట

పశువును మేపేవాడు, పశువులను కాచేవాడు మంచిపుష్టికలిగి, ఆరోగ్యవంతుడుగా, చురుకుదనంకలవాడుగా దొంగతనమూ, అసూయ లేకుండా వుండేవాడుగా, వేళ ప్రకారం పశువులకు మేత, దాణాలు పెట్టి పోషించేవాడుగా, దూరదృష్టిగలవాడుగా, పశువుల లక్షణాలు, నడకనుడులు తెలిసినవాడుగా ప్రాథమిక పశుచికిత్సకుతగినవాడుగావుంటే ఆరైతు, ఆరైతుపశువులు ఎంతో వృద్ధిలో వుంటాయి. కాని రైతు కూడ యిట్టినౌకరికిగాని, కాపరికిగాని తనస్వంత బిడ్డలాగా చూచు కొంటేనేతప్పయిట్టి నౌకరులువుండజాలరు. ఇట్టి నౌకరులుకూడ నూటికి పదిమంది దొరుకుతారేమో. ఈ కాలంలో పశువుల కాపరి మాత్రం అతిజాగ్రత్తగా వుండాలి. కానిపొలమునకు పశువులనుతోలుకొని వెళ్ళిన తరువాత కొన్నిసంగతులు రైతులు బోధించుతూ వుండాలి. పూర్వం రైతులకు, నౌకర్లకుకొన్నిఅనుపు ఆజ్ఞలువుండేవి.

ఆకాలముమారి నూతన కాలంవచ్చింది. ఈకాలంలో నౌకర్లకు రైతులే దాసోహంజేసే రోజులువచ్చాయి. ముందుంను యింకా ఎన్నో రీతులుగా కాలముమారుతుంది. కాబట్టి జాతీయప్రభుత్వం వచ్చింది. గ్రామాభ్యుదయ ప్రణాళికలు అమలులో వున్నాయి. అందుచేత భారతదేశములో ఎనిమిదిలక్షల గ్రామాలువున్నాయి. తెల్లవారేటప్పటికి ప్రతిగ్రామాన్నుంచి కనీసము 25 మందికి తక్కువగాకుండా



పిల్లలు, కొంచెము పెద్దవారు పశువులను కట్లువిప్పి మందలను పొలాలకు, బీళ్ళకు, కాలువగట్లకు, డొంకలకు, తోలుకొనిపోయి సూర్యాస్తమయమువరకు మేపుటో, కాపలాకాయుటో, కోతి కొమ్మచ్చులాడుటో, గేదెలమీదఎక్కి స్వారిచేయుటో, మొండిమొలలతో కాలువలలోదూకి స్నానముచేయుటో, కనీసము 8 గంటలయినా కాలయాపనముచేస్తువుంటారు.

ప్రతి కాపరికి సర్వోదయ సిద్ధాంతరీతిగా ఒకతక్లీ యిచ్చి వడకుట నేర్పినచో అరగంటలో వడుకుట నేర్చుకుంటారు. అప్పుడు పశువుల బీళ్లు తకలీల మయమై పోతుంది. ఈరీతిగా మనదేశంలో ప్రతి

రోజూ పశువులను కాచే కాపరులు ఒకకోటి అరువదిలక్షలమంది వున్నారని తేలుతూవుంది. వీరు అంతా వడికిన నూలు ఖరీదు రోజుకు పదిలక్షలరూపాయలు విలువగల నూలు లభిస్తుంది. దీని నాలుసరి విలువ 36 కోట్ల రూపాయలు వుంటుంది. ఈ మొత్తంలో సగముధర వేసుకొన్నప్పటికి 18 కోట్ల రూపాయల విలువగల నూలు సంవత్స రానికి దేశం మొత్తంమీదగల కాపరులచేత, గోష్ఠకాపుకు భంగము లేకుండా తయారుచేయించవచ్చు. ఇందువలన వారి సరదాకు ఎట్టి భంగమురాదు. ఎంతతక్కువ వడికినా నెలకు ఒక పౌను తేలికగా వడుకుకొనవచ్చును. తనకుటుంబములోని వారికి కొంత దీనిలోనుంచి ఈయవచ్చును. ఈ గోష్ఠకాపరులు బీదరైతులు, వ్యవసాయకూలీలు హరిజనులయొక్క కుటుంబాలైయున్నారుగాన ఈ పద్ధతి ఆచరణలో పెట్టుదురుగాక.



# నాల్గవ భాగము

## సారస్వతంలో ఎద్దు-గొవు-దున్న-గేదెల ప్రాచీన చరిత్రలు-శుభలక్షణాలు

## సారస్వతంలో - ఎద్దు

పాలనిచ్చే తల్లి ఆవులయితే, పంటనిచ్చే తండ్రి ఎద్దు. ఎద్దు దుక్కి దున్నకపోతే పంట ఏలాపండుతుంది? అందుకనే మనవాళ్లు ఎద్దును అతిగా ఆరాధిస్తున్నారు. ఆరాధించడమంటే ఏమిటి? -మానవు లలో మగవాడు పుట్టాలని ఏలా ఉవ్విళ్లూరుతూ వుంటారో, అలాగే పశువులలో కోడెలు వృద్ధిపొందాలని రైతుబిడ్డ తపిస్తూవుంటారు. రైతు వానితపః ఫలమే కోడెదూడ. కోడెదూడ ముదిరితే గిత్త-గిత్త పెద్దదైతే ఎద్దు. ఎద్దుకు ఎన్ని పేర్లున్నాయో చూడండి!

"బలముమీరినా బసవని జూడు
అందము చిందె నందిని జూడు
వాసిగాంచినా వృషభము జూడు
ముద్దులు గులికే ఎద్దును జూడు"

అన్నాడొక మధురకవి. స్థూలంగా ఎద్దునుగురించిన ప్రశస్తి కానిద్దాం! ఎద్దుల రకాలు — మక్కెలెద్దులు, గానుగెద్దులు, బండి ఎద్దులు మొదలయినవి ఇంకను ఎద్దులలో పుంగనూరు ఎద్లు, మైసూరు ఎద్లు, ఒంగోలుఎద్లు—చాలా ప్రసిద్ధమైనవిగా ఎంచబడుతున్నాయి. ఎద్దుయొక్క ప్రాశస్త్యాన్ని గుర్తించే మన కాంగ్రెసువారు రెండు మక్కెలెద్దులూ, నాగలి చిహ్నంగా పెట్టుకున్నారు. మేలుజాతి ఎద్దులను పశుసంతతి వృద్ధి చెయ్యడం కోసం స్వేచ్ఛగా వదిలేస్తారు. దీనినే తోటఎద్దు లేక ఆబోతు అంటారు. ఏ మానవుడికైనా స్వేచ్ఛా విహారాలు మితిమీరి పోయినట్లయితే.

'అచ్చోసిన ఆంబోతులా ఆలాతిరుగుతావేం?' అని అడగటం కద్దు. ఎద్దుపాటుబడే జంతువు. 'ఎద్దులాగా పాటుపడే' వాళ్ళనుచూసి యజమాని చాలా సంతోషపడతాడు. ఇంకను మానవజీవితానికీ, ఎద్దుకూ సంబంధంగల కొన్ని సామెతలున్నాయి. ఆలోచన లేకుండా ఏదోఒకపని చేయడమే ప్రధానంగా పెట్టుకొన్నవాణ్ణి 'గుడ్డెద్దుచేలో పడ్డట్టుఉన్న దంటారు. ఒకరినిగురించి రెండవవానికి సానుభూతి లేని పక్షమందు 'ఎద్దుపుండు కాకికి ముద్దా?' అని ప్రశ్నిస్తారు. ఇద్దరు తెలివితక్కువ వ్యక్తుల తొందరపాటు సంభాషణను వర్ణించటానికి 'ఎద్దుయీనెనంటె కొట్టాన కట్టుమన్నట్టు' అంటారు. ఒక్కొక్కప్పుడు, నాగలికిఒకపక్కఎద్దునూ, ఒకప్రక్కదున్నను కడతారు. ఇది సమమైన ఉజ్జీ కాకపోవడంచేత 'ఎద్దు ఎండకులాగ — ఎనుబోతు నీడకులాగ' అనిచెప్తారు. సారస్యంగ్రహించలేని మనిషినిగురించి 'ఎద్దేమి ఎరుగురా అటుకుల రుచి!' అంటారు. లోకంలో అందరినీ మెప్పించలేం. ఒకరిని సంతోషపెడితే మరొకరికి కోపంవచ్చి తీరుతుంది దీనికే.

'ఎక్కువమంటే ఎద్దుకు కోపం – దిగుమంటే కుంటివానికి కోపం' అని వాడుతారు. యజమాని, సేవకుల సంబంధాన్ని గురించి ఒక విచిత్రమైన సామెత వుంది.

'ఏలేవాని ఎద్దుపోతేనేమి – కాచేవాని కన్ను పోతేనేమి ?' అనగా యజమాని ఎద్దుపోతే పాలేరుకేంబాధ ? పాలేరు కన్నుపోతే ఖామందుకు ఏం విచారం ?

యజమాని సేవకుల సందర్భంలో సుమతీశతకకారుడు కూడా ఒక చక్కని పద్యం ఇలాచెప్పాడు.

'అడిగిన జీతంబీయని
మిడిమేలపు దొరనుగొల్చి మిడుకుటకంటెన్
వడిగల ఎద్దుల గట్టుక
మడిదున్నుక బ్రతుకవచ్చు మహిలోసుమతీ'

జడ్డుగా వుండేవాళ్లను 'ఎద్దు మొద్దుస్వరూపం' అంటారు. దీనినే మరికొంచెం వివరించి నాపాటు రాముల్లి విషయంలో 'ఎద్దులాతిని మొద్దులా పడివుంటా' అని చెపుతారు.

ఒకపని చెయ్యదలచినపుడు, ఆపనిని పెంవాడు ఏలాగా ఆమోదించడని తెలిసినప్పుడు

'ఎద్దువడిగా గంటకట్టడం?' అనే సామెతవాడుతాం. అతిమంచి తనాన్ని దుర్వినియోగం చేసేసందర్భంలో 'మంగలాణ్ణి చూసి ఎద్దు కుంటిందట' అని చెప్పడంవుంది.

"నసేప్రోత బలీవర్ధన్యాయం"

అని సంస్కృతంలోవున్నది. ఎద్దుకు ముక్కుత్రాళ్ళు కుట్టినట్టు, దుష్టుని విరోధంలో ఉంచటమని దీనిభావం.

గోవులలో గంగగోవులాగే ఎద్దులలో గంగిరెద్దుఅనేది ఒకటుంది. గంగిరెద్దులవాళ్ళు డోలుకొట్టి, సన్నాయివూదుతూ ఇంటింటికి రావటం ఎవరెరుగరు ? బసవడంటే సామాన్యుడుకాడు. లింగధారుల కులదైవం. బసవన్న పేరుతో ఒకపెద్దపురాణమే సృష్టింపబడివుంది. అదే లింగాయతులబసవ పురాణము.

స్వతంత్రమైన ఆలోచన అనేది లేకుండా పైవాళ్ళు చెప్పే ప్రతిదానికీ అంగీకారం తెలిపేవాణ్ణి 'ఏమిరా' అయినదానికీ కానిదానికి గంగిరెద్దులా తలూపుతావు? అని వ్యాఖ్యానిస్తారు.

వృషభ మనగానే పన్నెండు రాసులలో ఒకటయిన 'వృషభరాశి' ఒకటేనని జ్ఞాపకానికి వస్తుంది. అచ్చోసి ఆబోతును వదలటం మన దేశంలో ఒక ముఖ్యమైన మత సాంప్రదాయం దీన్నే 'కామ్య వృషోత్సర్జన' అని చెప్పారు. ఇంకను దీనికే 'యథేచ్ఛం విహార వృషభరాజ' అని సంస్కృత న్యాయం ఒకటున్నది. ఊరగా 'బసవన్నా!' నీ యిష్టము వచ్చినట్లు తిరుగూ అని అచ్చువేసి విడిచిన ఆంబోతును గురించి చెప్పటం. ఆవు-గోవూ ఆబోతు అయింది. ఈ సందర్భంలో మన సృష్టి పురాణకాలానికి కూడా సరించాలి.

కంసుడు పంపిన రాక్షస గణంలో ఒకడు వృషభాసురుడు. వీణ్ణి శ్రీకృష్ణభగవానుడు చీల్చి చెండాడి భూలోకానికి వాడి పీడ వదిల్చాడు. శ్రీకృష్ణుడు సంచారం చేస్తూవుండగా అనేకమంది రాజులు వాళ్ళవాళ్ళ కుమార్తెలను ఇచ్చి పెళ్ళిచేస్తూ వచ్చారు. అందులో కోసల మహారాజు అయిన నగ్నజిత్తు ఒక చిత్రమైన పోటీ పెట్టాడు. భయంకరమైన ఏడు వృషభాలను వదిలి వాటిని లొంగదీయగలవాడికి తన కూతుర్ని ఇస్తానన్నాడు. చాలామంది వచ్చి వాటిని చూడటంతోనే హడలిపోయారు. శ్రీకృష్ణుడు ఒక్కడే ఆవృషభాలకు అనేక రూపాలలో ప్రత్యక్షమై ఒక్కొక్క దాన్ని ముక్కు-త్రాళ్ళు వేసి బంధించాడు. ఈ విధంగా నగ్నజిత్తు కూతురు కృష్ణునికి భార్య అయింది.

ఇప్పటికి ఎద్దు, వృషభం, బసవన్న అనే పదాలకు సంబంధించిన సారస్వత విశేషాలు తడవినాము. ఇక నందిని గురించి చెప్పాలి.

'కైలాసంలో కాపురముండే
కాలకంఠుని కావలివాడ'

అని కవి కుమారుడు పాడటాన్నిబట్టి ఈశ్వరుడు సమక్షంలో వుండే ఎద్దుకి "నంది" అనే నామధేయం ఏర్పడిందని చెప్పుకుంటాం

తెలుస్తుంది. నంది ఈశ్వరుడు వాహనం మన దేశంలో గొప్ప నంది విగ్రహాలు మైసూరు సంస్థానం చాముండీలో, తంజావూరులో, దక్షిణ కాశీ అనబడే పీఠికాపురంలోనూ ఉన్నాయి.

నంది అంటే సౌఖ్యమైనది అని అర్థం. దీనినే "శాలం కాయన" అంటారు. "తాండవశాళికన్" అనగా పరమ శివుడు తాండవ నృత్యము చేస్తువుంటే, ఆ నృత్యానికి లయ సరిపడేటట్లు అడుగులు వేయటం-ఆ ప్రజ్ఞ నందికి ఒక్కదానికే వుందట. ఈశ్వరుడు వాహనమైన ఈ నంది మల్లెపువ్వులకంటె ధవళంగా వుంటుంది. ఇంచు మించు మంచులా వుంటుందంటేసరి. ఈశ్వరాలయాల్లో నందివిగ్రహం ఎల్లప్పుడూ యజమానికి ఎదురుగా పండుకొని వుంటుంది. ఏక్షణాన ఈశ్వరుడు వచ్చి తనమీద అధిష్టిస్తాడో అనే అప్రమత్తతో సిద్ధంగా వుంటుందన్నమాట.

తేజఃపుంజమైనటువంటి శివుని దర్శనానికి ముందు మనం నంది చెవుల సందునుంచి చూడటం సాంప్రదాయంగావుంది. ఏమంటే బ్రహ్మాండమైన ఈశ్వరశక్తికి నంది చిహ్నం. భక్తులకు నందిముందుగా కనబడటం కోసమే ఈశ్వరాలయంలో నందివిగ్రహం ఈశ్వరుని విగ్రహానికి ఎదుట నెలకొల్పబడివుంటుంది.

నందికి అవతారాలెత్తే శక్తివుండేది. ఒకప్పుడు నంది ఈశ్వరుని రూపం పొందగా ఆ మాయఈశ్వరుని చూచి పార్వతి సిగ్గుపడిందట. అప్పుడు శివుడు తెలిసికొని నందిని నీవు భూలోకానికిపోయి తపస్సు చేసి పాపవిముక్తి అయిన తరువాత మళ్లీ కైలాసానికి రావలసింది అని ఆజ్ఞాపించాడు. అప్పుడు నందీశ్వరుడు మైసూరు సంస్థానంలోని ఇప్పటి "నందిదుర్గం" అనే ప్రదేశమందు తపస్సుచేసాడట.

మరియొక అవతారంలో నంది బసవనిరూపంలో అవతరించింది. ప్రత్యేకంగా మైసూరు ప్రాంతములో బసవేశ్వరుని పేర్లు చాలామంది పెట్టుకోవటానికి ఇదే కారణం. లింగధారులకు బసవారాధన ముఖ్యం. ఈ ఆరాధన మైసూరు ప్రాంతంలో ఎక్కువ నందిపేరుతో వెలసిన స్థలాలు మరికొన్నిటిలో "నంద్యాల" నంది ఆలయమువుంది. కర్నూలు జిల్లాలో "నందికనుమ" ఇక్కడకు సమీపములోనే మహా

నంది అలయం ఉండటంవల్ల దీనికీ పేరువచ్చింది. కృష్ణాజిల్లాలోని "నందిగామ" అసలు నంది(గ్రామమే. అందరకూ సంతోషాన్ని ఇచ్చే "నందికేశ్వరుడినోము"ను గురించి కావాలన్నా మరచిపోలేము. నంది విషయంలోకూడా మానవునికి సంబంధించిన లోకోక్తులు కొన్ని వున్నాయి. తలలుమార్చగలశక్తి కలవాడిని.

'వాడు నందిని పంది – పందిని నందీ'

చేయగలవాడు అని అంటారు. ఒకడు ఏమిఅంటే అదే చలామణి అయ్యే సందర్భంలో,

"వాడు నందిఅంటే నంది – పందిఅంటే పంది"

అని చెప్పుతారు. ఆదికాలంలో మానవుడు పశుగణంలోకల్లా మిన్నయని ఎంచి ఈ వృషభాన్నే ఆరాధిస్తూ వచ్చినట్టు అగుపిస్తుంది. తదుపరి మన ధర్మ...లంనాడుకూడా న్యాయానికి చిహ్నంగా వృషభాన్నే నిర్ణయించుకోవటం జరిగింది. నిజానికి ఆవు పవిత్రమయినదే అన్ని విధాలా అయినా పూజవిషయంలో వృషభానికిగల ప్రాముఖ్యత దానికి లేదు.

దేశానికి ఎద్దూ, గుర్రం గొప్ప సహాకారులు కావటముచేత వాటిని నాణెములమీద ముద్రించి గౌరవించారు ప్రభువులు. పంట నిచ్చేది ఎద్దు. చతురంగబలాల్లో ముఖ్యమైనది అశ్వం. పంటలు బాగాపండి శత్రుభయం లేకుండా దేశం సంరక్షింపబడుతూ వుంటే ప్రజల కంతా సౌఖ్యమే. ఈ కారణంచేతనే ఈ రెండు జంతువులకూ ఇంతగౌరవం ఏర్పడింది. వివిధ దేశాలలో పెక్కుమంది ప్రభువులు తమతమ నాణెములమీద గుర్రాన్నీ ఎద్దునూ ముద్రించి గౌరవించటం రెండువేల సంవత్సరములకు పూర్వంనుంచీ జరుగుతున్నది.

1192 లో పృథ్వీరాజు పాలనలో నాణ్యాల కొకప్రక్క అశ్వికుడు. రెండో వైపున వృషభము, బొమ్మలుసంస్కృతలిపితో ము...బడియున్నవి. పంజాబు, పాంచాలం, మధ్యప్రదేశ్, రాజపుత్ర స్థానాలను ఏలిన ప్రభువులుకూడా ఎద్దూ గుర్రం నాణెములనే వ్యాప్తిలో పెట్టినట్టు ఎన్నో నిదర్శనాలు ఇప్పటికే కానవస్తున్నాయి.

భారతదేశాన్ని ఏలిన ముస్లిం ప్రభువులుకూడా భారతీయులకు ఈ జంతువులయందు గల పవిత్రభావాన్ని కనిపెట్టి పై విధానమునే అనుసరించినట్లు అనేక తార్కాణాలు కనిపిస్తున్నాయి. ఎప్పటిమాటో ఎందుకూ ? ఈనాడు మన అణాకాసులమీద బొమ్మచూడండి !

"ఎద్దునెక్కిన వాడే లింగడు – గద్ద నెక్కినవాడే రంగడు" పరిమితిని గూర్చి ప్రస్తావించేటప్పుడు.

"ఎద్దుమోసినంత – గోనెపట్టినంతా" అంటారు.

## మంచి వృషభ లక్షణాలు

తల:– పెద్దదిగా

చెవులు:– మృదువుగా, నిక్కపొడుచుకొని

కన్నులు:– అంతపెద్దవి అంతచిన్నవిగాక మధ్యరకంగావుండి రెండు కన్నులు లేడికండ్లవలెవుండి, మధ్యభాగం విశాలంగా వుండి, క్రమ క్రమంగా ముక్కరంధ్రాలవరకు కొనతేలి వుండాలి. ఇంకను కనుగ్రుడ్లు లోతుగాగాని, మిడిగ్రుడ్లుగాగాని యుండిన సాధుత్వమూ, చురుకుదనమూ కలిగి చకచకలాడుతూ

ముక్కరంధ్రాలు:– పెద్దవిగానుండి తెరచుకొని.

కొమ్ములు:– ఎరుపురంగుగా, దృఢంగా.

కొమ్ములు:– సన్నగా, దృఢంగా.

మూపురము:– పెద్దదిగానుండి పురుషచిహ్నం కలిగించు నదిగాను, మధ్య పీ వలె గుండ్రముగా

మెడ:– బలముకలిగి తలవంచినపుడు కాలువ వలెనుండి, పొట్టిగ లావుగా దృఢంగా

వక్షస్థలం:– విశాలంగా

నాలుక:– సన్నగా, కాంతిగా,

చర్మము:– నునుపుగా, మూపురమునుంచి తోకమట్టవరకుమిట్టపల్లాలు లేక సమానంగా

కాళ్లు:– నాలుగు కురచగా, గట్టిఎముకలు కలిగి, తొడలు బలంగా

డెక్కలు:- కదిసంగా, నలుపుగా, గుండ్రంగా, విడివిడిగా
తోక:- భూమిపైకి వ్రేలాడునదిగ
గంగడోలు:- చిన్నదిగా
రంగు:- తెలుపుగా మూపురము కొంచెము నలుపురంగుగా వుండాలి.

## మంచి కోడె లక్షణాలు

మెడన:- కురచగా బలంగా
ముక్కురంధ్రాలు:- కాంతిగా
కన్నులు:- విశాలంగా
నొసలు:- వెడల్పుగా
చర్మము:- కుత్తుక క్రిందనుంచి క్రింది పొట్టవరకు గంగడోలు వదులుగా వుండాలి.

## సారస్వతంలో గోవు

మన పూర్వులు మానవజాతిని కులాలుగా విభజించారు. అన్ని విధాలా ఆదర్శప్రాయమైనటువంటి వారిని బ్రాహ్మణులన్నారు. అయితే అటువంటి బ్రాహ్మణుని కంటెకూడా ముందుగా పేర్కొన తగింది గోవు.

'గో బ్రాహ్మణేభ్య - శుభమస్తు నిత్యం'

అని ఋగ్వేదంలో నిర్వచింపబడివుంది. ఈ విధంగా తొలిపూజలందుకొన్న గోవును గురించి ఎన్నెన్నో గొప్పవిషయాలు మన సారస్వతమందు గోచరించటంలో ఆశ్చర్యంలేదు. ఐతే నిజానికి గో బ్రాహ్మణులకు తరతమ భేదం లేనేలేదు. ఉభయుల అవసరమూ లోకానికి సమానంగానే వుంది. యాజసల్పటానికి బ్రాహ్మణుడూ, పూజాద్రవ్యాలు సమకూర్చటానికి గోవు ఒకేమారు బ్రహ్మవల్ల సృష్టింపబడ్డట్టు పురాణాలు చెబుతున్నాయి. తల్లితరువాత తల్లివంటిది గోవు. మానవుణ్ణి భరించేది గోమాత. తనను పెంచే తల్లివంటిది కనుకనే బిడ్డను ఆవును చూస్తే భక్తి. ఆవుని తల్లిగా ఎంచుకోవటం

చేతనే ఆవుకు పుట్టిన తువ్వాయిని తమ్ముడిగా భావించి ముచ్చట పడుతూ వుంటుంది. ఆహ్లాదకరమైన ఆవు, తువ్వాయిల సాహిత్యం తెలుగు భాషలో అపారంగా వుంది. పాపాయి ఇలాపాడతాడు.

"ఆవుకు ఉన్నది తువ్వాయి - అమ్మా అదినాతువ్వాయి
మెడలో మువ్వల తువ్వాయి-గబగబ ఉరుకును తువ్వాయి
నాతో వచ్చును తువ్వాయి-నాతో ఆగును తువ్వాయి"

బిడ్డలకు తల్లి కరవయినా, తల్లిపాలు కరవయినా, ఆలోపాన్ని పూర్తి చేయగల సమర్థత ఒక్క-గోవుకేవుంది. గోక్షీరాలలో అంత మహాత్యం ఉంది.

"పాలు తాగేనాడు - పరుగెత్తేనాడు
ఉగ్గుతాగేనాడు - ఊకొట్టునాడు
అబ్బాయి నెవ్వారు - కొట్టేన్నవారు
కొట్టిగోవులపాలు - కొనిపోసినారు"

ఆవుకూడా మనిషిలాగే చాలా నాజూకయిన జంతువు. ఎనుబోతులాగా అదివర్షంలో ఉండలేదు, చూడముచ్చటయిన జంతువులలో ఆవు ముఖ్యమైంది. ఆవు తువ్వాయిలు మనుషులపాపాయిలతో కలిసి ఎంతో మచ్చికతో ఆడుకుంటాయి. అందుకనే బాలవాఙ్మయ బ్రహ్మచింతా దీక్షితులు

'ఆవుగారమ్మాయి - అసలు మాతువ్వాయి'

అన్నాడు. ఆవుకు గడ్డివేసి నప్పటికంటె గంగడోలు దువ్వినప్పుడు ఎంతో సంబరపడుతుంది.

జగన్నాటక సూత్రధారుడైన శ్రీకృష్ణభగవానుడికి దైవాంశగల గోవుకే సంబంధంవుంది. అందుకనే శ్రీకృష్ణుడు గోపాలుడయ్యాడు. శ్రీకృష్ణుడు నివసించేది యమునానదిపై గోకులం. అష్టమినాడు పుట్టిన కృష్ణు జ్ఞాపకార్థంచేసే పండుగే "గోకులాష్టమి" గోవుల్ని మేపేవాడు గోపాలుడు. పశువుల్ని మేపడంలో గోపాలుడు పేరు పొందాడు. అందుకనే

'గోరంత దీపమ్మా - కొండలకు వెలుగు
గోపాలకృష్ణమ్మ - గోవులకు వెలుగు'

అనేపాటపుట్టింది. తనమురళి మ్రోయించి అమరగానముచే గోవులకు విందుచేసేవాడు కనుక గోవిందుడనేపేరుకూడా వచ్చింది. మనుష్యులకేకాదు పశువులకుకూడ పొంగలి పండుగవున్నది. సంక్రాంతికి మరునాడు 'మాట్టుపొంగలి అంటారు' ఆనాడు ఆవులను, తక్కిన పశుగణాన్ని వైభవంగా అలంకరించి బొట్లుపెట్టి వాటికి పిండి వంటలు ఆరగింపుచేసి ఊరేగిస్తారు. ఈపశువుల పండుగ నేపాళదేశంలో ముమ్మరంగా జరుగుతుంది. ఇటువంటి ఉత్సవాలతో గోపూజచేస్తారు కాబట్టే నేపాళదేశీయులకు 'గోరక్షకులు - ఘూర్కాలు - అనేపేరు అన్వర్థమై వెలసింది.

ఆవు సంపూర్ణముగా ప్రయోజనకారి. అందుకనే అది అతి పవిత్రవంతంగా ఎంచబడుతూవుంది, ఆవు పంచితం ఉబ్బరోగాలకు పెట్టిందిపేరు, గోమయం క్రిమిసంహారి. గుమ్మపాలు పసి పిల్లలకు పస్తాములకు తెలుసు. ఆవునెయ్యి బాలింతలకు అవసరం. లక్షవత్తుల వ్రతానికికూడా ఆవునేతినే ఉపయోగించాలి. వెన్న విషయంచెప్పే దేమిటి! మన గోపాలకృష్ణుడు అసలు వెన్నదొంగ!! ఆవునుండివచ్చే ఐదుపదార్థాలను 'పంచగవ్యము' లంటారు. వాటినే పాలు, పెరుగు, నెయ్యి, పంచితము, గోమయం' తద్దినంనాడు పిండాలు ఆవుకిపెడితే పితురులు తరిస్తారనిశాస్త్రం. చచ్చినతరువాతకూడా గోవు విలువ చెప్పాలంటే, తక్కిన దానిశరీర భాగాలమాట అటుంచి ముఖ్యంగా గోరోజనాన్ని గురించి పేర్కొనవలసి వుంటుంది. వైద్యరీత్యా దీని ప్రాముఖ్యత ఎంతోవుంది.

సత్యకాలంలో ప్రభువులు - ప్రభువులేకాదు. కాస్త స్తోమతు గల రైతుజనం గోగ్రాసం కోసం కొంత భూభాగం వదలిపెట్టేవాళ్లు. వీటికే గోభూములని పేరు. కన్నడభాషలో 'గోకల్లు' అనే పదముంది. పూర్వకాలమందు ఉదారులైన శ్రీమంతులు గోవులు మసిలే ప్రదేశాలయందు ఎత్తైన రాళ్లుపాతించేవారు. పొలాల్లో మేసే ఆవులు ఆరాళ్లవద్దకు వచ్చి మెడలు వాటికిరాచి గోక్కునేవి.

ఆవు చెవిలాంటి మూతిగల పాత్రను 'గోకర్ణం' అంటారు. సంప్రదాయాలలో గోకర్ణంతో తర్పణం, మజ్జిగా, వస్త్ర జరగటం ఎక్కువగా ఉంది. రావణాసురుడు గొప్పమాతృభక్తుడు. ఒకసారి అతని తల్లి నాయనా! నాకు పూజకు శివుని ఆత్మలింగం కావాలి అని కోరింది. రావణుడివంటి రాక్షసుని చేతికి శివుని ఆత్మలింగం దొరికినట్టయితే ప్రపంచానికి ప్రళయమే అందుకని నారదుడు ముందుగా కైలాసానికెళ్ళి ఈశ్వరుణ్ణి హెచ్చరించాడు. అనుకున్న ప్రకారం రావణుడు శివుని కోసం తపస్సుచేశాడు. శివుడు ప్రత్యక్షమయ్యాడు. అప్పట్టు శివుని వెంట పార్వతికూడ వచ్చింది. శివుడురావణుణ్ణి వరంకోరుకో అనగా ఆత్మలింగం మాటమరచిపోయి నాకు పార్వతీ కావాలన్నాడు. ఇవ్వక తప్పిందికాదు శివుడు. రావణుని వెంటబడి వస్తున్న పార్వతి మధ్యదారిలో మహాంకాళిగా మారిపోయింది. రావణుడు హడలి పోయాడు. తెలివి తెచ్చుకున్నాడు. పార్వతిని వదిలేసి మళ్ళీ గాఢంగా తపస్సు ప్రారంభించాడు. ఈసారి శివుడు ఆత్మలింగాన్ని అనుగ్రహించక తప్పిందికాదు. అయితేయిస్తూ, రావణా! ఇది ఎక్కడ నేలకు తగిలితే అక్కడ స్థాపితమైపోతుంది. జాగ్రత్తసుమా! అని హెచ్చరించాడు. రావణుడు ఉత్సాహంతో తిరిగి వస్తున్నాడు, సంధ్యవేళ అయింది. అర్ఘ్యం వదులుదామంటే చేతిలో లింగమున్నదాయె. ఎలాగా అని జిజ్ఞాసపడుతూవుండగా ఒక పొట్టిబ్రాహ్మణ బాలుడు ఆదారిని వచ్చాడు. వాడిచేతికి ఆలింగాన్నిచ్చి రావణుడు అబ్బాయీ! కాస్త దీన్నిపట్టుకొనివుండు. సంధ్యవార్చుకొని ఇప్పుడే వస్తానన్నాడు, అందుకు ఆబాలునిరూపంలోవున్న విఘ్నేశ్వరుడు అంగీకరిస్తూఅయ్యా! నేను మూడుసార్లు పిలుస్తాను. మూడోపిలుపుకు మీరురాకపోతే నేను దీన్ని కిందపెట్టేసి వెళ్ళిపోతానన్నాడు. దానికేముంది క్షణంలోవస్తా! అంటూ రావణుడు వెళ్ళాడు. ఆటకారిబాలుడు వ్యవధిలేకుండా మూడుసార్లు గబగబా పిలిచి ఆత్మలింగం క్రిందపెట్టేసి అదృశ్యమై పోయాడు. రావణుడు ఉరకలువేసుకొంటూ వచ్చి దాన్ని ఎత్త బోయాడు. ఆలింగం ఆవుచెవుల ఆకారంతో అక్కడే స్థాపితం అయి పోయింది. ఇదే గోకర్ణక్షేత్రంగా వెలిసింది.

ఇంద్రజాల విద్యలలో గజకర్ణ, గోకర్ణ విద్యలు రెండు వున్నాయి. తిరుపతిక్షేత్రంలో 'గోగర్భం' అనేటటువంటిది వుంది. యాత్రికులందరూ దీన్ని దర్శిస్తూనే వుంటారు. గోగర్భం లాగానే 'హిరణ్యగర్భం' అనేది వుంది కొన్ని పాన్తాలలో ఇదొక విచిత్ర మైన మతాచారం. ఒక సువర్ణ ధేనువును తయారుచేయించి, ప్రభువు దానిలోనుండిదూరి బయటికి రావటం సాంప్రదాయంగా వుండేది. ఆ ఆచారం క్రమంగామారి అప్పుడప్పుడులు ఒక పెద్దబంగారపుకలశంలో దూరి ఇవతలకు రావటం జరుగుతూవచ్చిందని చెబుతారు. పైనచెప్పిన కలశలో 'పంచగవ్యము' లుంచి లాంఛనతీరగానే కలశను తునకలు తునకలుగా చేసి దానంచేస్తారు.

గోస్తనది భీమవరం, తణుకు తాలూకాలలో వుంది. ఆవు పొదుగునుండి ప్రవహిస్తోందన్న సంప్రదాయాన్ని అనుసరించి దీనికీ పేరువచ్చింది. దీనిఘనత వాయుపురాణంలో చెప్పబడివుంది.

త్రిమూర్తులకు, దేవగణాలకూ ఒక్కొక్కలోకం నియమితమై ఉన్నట్టుగానే ప్రత్యేకించి 'గోలోకం' అనేదికూడా ఒకటివుంది.

'గోచర్మము' అని ఒక పదముంది. అనగా – నూరు ఆవులు, వాటిలేగలు – ఒకఆబోతు – ఇవిమసలడానికి సరిపడు నంతమేర. ఈ పరిమితిగల జాగా ఒకమనిషికి ఒకవత్సర గ్రాసాన్ని ఇస్తుందనిఅంచనా.

'గోమేధం' అనగాఆవును ఉపయోగించి చేసేయజ్ఞం. యజ్ఞం కోసం గోవును పాశంతో బంధించి కడతారు. కనుకనే తమిళంలో దీనిని పశు' అన్నారు. బ్రాహ్మణులు 'గోష్పద' పంతజుట్టు వుంచు కోవాలని పూర్వులనియమం.

గోహింస అనగానే వళ్ళు జలదరిస్తుంది, ఇటువంటి పవిత్రవంత మైన – ఉత్తమమైన – దైవాంశగల గోవును హింసించటానికి చేతులేలా వస్తాయూ అని 'గోహత్య'నుమించిన మహాపాతకం మరొకటి లేదని పూర్వులు వచించారు. గోవును చంపేవాణ్ని 'గోఘ్ని' అంటారు.

పూర్వకాలమందొకప్పుడు గొప్ప కాటకం పట్టింది. ప్రజలు మల మల మాడిపోయారు. ప్రజలతోపాటు తపశ్శాలులైన మహా

ఋషులుకూడా మాడిపోయారు. గౌతమఋషి మాత్రం బ్రహ్మవల్ల వరంపొంది పుష్కలంగా పంటలు సంకించుకొని సుఖంగా కాలక్షేపం చేస్తూ వచ్చాడు. తను సుఖించడమేకాకుండా తనను ఆశ్రయించిన వాళ్లకుకూడా సాయపడుతూ వచ్చాడు. అందుచేత ప్రజలు గౌతముణ్ణి ఆశ్రయించి ఆహారం సంపాదించుకునేవారు. గౌతమ మహర్షికీర్తి దశదిశల వ్యాపించింది. ఇదంతా చూడగా తక్కిన ఋషిగణంలో అసూయ బయలుదేరింది. వాళ్లంతకుకూడి ఆలోచనచేసి ఒకమాయ గోవును సృష్టించి గౌతముని పొలంలోకి తోలిపెట్టారు. అది చేను మేసిపోవటం కళ్లబడి గౌతముడు నీళ్లుచల్లి దానిని బెదరించాడు. వెంటనే మాయగోవు విలవిల తన్నుకు చచ్చింది.

అప్పుడు ఋషులందరూ గౌతముణ్ణి దుయ్యబట్టి ఏమయ్యా ! మహర్షినని పేరుపెట్టుకొని గోహత్య ఎలాచేశావు ? అని గేలిచేసారు. గౌతముడు హడలిపోయాడు. గోహత్యా పాతకం ఎలాపోతుందో చెప్పమని వారిని బ్రతిమాలాడు. అందుకువారు గోవుకళేబరంమీద గంగాజలం ప్రవహించినట్టయితే ఈ పాతకం పోతుంది అని చెప్పారు. గౌతముడు శివుణ్ణిగూర్చి ఘోరతపస్సుచేయగా శివుడు ప్రత్యక్షమై గౌతముడికి తన జడల్లో ఒకటి తీసియిచ్చాడు. దానిలో గంగను గౌతముడు గోకళేబరంమీద పిండేసరికి అదిలేచి నిలబడింది. ఈ విధంగా శివుని జడనుండి ప్రవహించిన జలమే గోదావరినది అయింది. గౌతముడు తీసుకురాబట్టి గోదావరికి 'గౌతమి' అని పేరువచ్చింది.

ఇప్పుడు గోదావరితీరమందున్న కొవ్వూరుపూర్వం"గోవూరట" గౌతముడు మాయగోవును చంపటం, తరువాతగంగను తీసుకొచ్చి గోవును బ్రతికిచటం, ఈప్రదేశమందేనని ఒకగాథ. ఇక్కడ గోవు డెక్కలు స్పష్టముగా కనపడుతూ వుంటాయి. అందుచేతనే ఇది 'గోపాదక్షేత్రం' అని పిలువబడుతూవుంది.

ఆవులు వెల్లావు, పుల్లావు, బట్లావు, కర్రిఆవు, పొట్టేఆవు, పోట్లావు, బోడిఆవు (కొమ్ములులేనిది) అంటూ అనేకరకాల పేర్లతో అనేకతరహాలుగా వుంటున్నాయి. అన్నింటిలోకి కర్రిఆవు అనగా కపిలగోవు శ్రేష్టతను పురాణాలు ఎక్కువగా వర్ణించాయి. దీనినే

'ఏడ్వేటి అబ్బాయికి ఎఱ్ఱావుపాలు
నవ్వేటి అబ్బాయికి నల్లావుపాలు,

అంటూ తల్లులు జోలపాటలతో యిమిడ్చి పాడతారు. కపిల గోవుపాలల్లో విటమిన్ డి నిండుగావున్నదని రూఢిచేసుకున్న ఆధునిక శాస్త్రజ్ఞులుసైతం దీనిప్రాశస్త్యాన్ని అంగీకరించి తీరుతున్నారు. ఇంతగా మనంగొప్ప చెప్పుకునే ఆవు అబద్ధమాడిందనీ, అందుచేత పొద్దున్నే దానిముఖము చూస్తే పాపమనీ ఒక పురాణగాధ వున్నది. ఈ గాధ యందు నమ్మకంగలపెద్దలు ఈనాడుకూడాలేస్తూనే.ఆవుపృష్టభాగంగాని ముఖంగాని చూడటానికి ఇష్టపడరు. ఇదంతా ఒకవింతగాధ.

స్వర్గలోకంలో వుండేది 'కామధేనువు' ఈ కామధేనువు సమస్తమైన కోరికలను తీరుస్తుందని నమ్మిక. ఇది సముద్ర మధనకాలమందు పుట్టింది. ఇది జమదగ్ని మహర్షి దగ్గర ఉండగా కార్తవీర్యార్జునుడు దీనిపైన కన్ను వేసి బలాత్కారంగా లాక్కుపోయాడు. అందుకోసమే పరశురాముడు క్షత్రియులమీద ఇరవైఒక్కమారు దండెత్తడం జరిగింది.

పంచమవేదం అనబడే మన మహాభారతంలో 'గోవ్యాఘ్ర సంవాదం' అనే ఘట్టం కరుణారసభరితమైంది ఈ గోగీతం అని ప్రసిద్ధి చెందింది.

మహాభారతం అనగానే ఉత్తరగోగ్రహణ ఘట్టం జ్ఞాపకానికి వస్తుంది. విరాటరాజు కొలువులో బృహన్నలగా నెలకొనివున్న అర్జునుడు విరటుని ఆలమందలను కౌరవుల బారినుండి మళ్లించుకువచ్చాడు. ఇది ఎంతసామర్ధ్యమో చెప్పడానికి వీల్లేదు. దీన్నిబట్టే ఆవుల్ని మళ్లించినవాడు అర్జునుడు అనేసామెత చిరస్థాయిగా నిలిచిపోయింది.

మానవజీవితంలో ఆవుకి సంబంధించిన సామెతలు చాలా వున్నాయి.

'ఆవులూ ఆవులూ పోట్లాడుకొని – లేగల కాళ్ళు విరిగినట్లు'

'ఆవుల సాధుత్వమూ – బ్రాహ్మణుల పేదరికమూ లేదు'

ఆదృష్టం చూచుకొని గర్వపడేవాళ్ళను

"ఆవుపాడిఎంత - ఐశ్వర్యమెంత" అంటారు.
తల్లిదండ్రులఛాయనే బిడ్డలు నడుచు కుంటారని చెప్పడానికి
'ఆవు చేలో మేస్తే - దూడ గట్టున మేస్తుందా?' అనిఅంటారు.
సంచి కట్టు వైద్యులను గురించి తమాషాగా
'అటయితే వైద్య కట్నం - ఇటయితే వైతరణీ గోదానం' అంటూవుంటారు.

'ఎగదీస్తే బ్రహ్మహత్య - దిగదీస్తె గోహత్య'
అని ఒక నానుడి వుంది. ముందుకుగాని, వెనుకకుగాని వెళ్ళలేని సందిగ్ధావస్థలో ఈనానుడి వుపయోగిస్తారు. దీన్ని గురించి చారిత్రకమైన ఒక గాథకూడా వుంది.

దుష్టులైన పాల వాళ్ళు దురాశచేత లేగలకు పాలు వదలక అవిత్వదిత గతిని కృశించి చచ్చునట్టు చేస్తారు. పెయ్యకునికెయ్యగానే దాని చర్మంలోపల గడ్డికుక్కి 'చేత పెయ్య'ను తయారుచేసి ఆవు కళ్ళముందు పెడతారు. ఆస్వరూపం చూచుకొని తృప్తిపడి ఆవు చేపుతుందని వాళ్ల ఆశ. దీనినే చేపటానికి చేతపెయ్య చాలునని సామెతగా చెప్పుకొంటారు. ఈ సందర్భములో మరికొన్ని సామెతలు.

"దూడలేని పాడి - దుఃఖపుపాడి
దూడ కుడిస్తే - గాని ఆవు చేపదు
లావులేని చేను - లేగలేని ఆవు
నిష్ప్రయోజనాలు"

ఎక్కడైన విద్వాంసుడు లేని చోటులో కొంచెవి తక్కువ దద్దమ్మే పెద్దయి కూర్చుంటారు. దీన్నే.
'ఏగోవూలేని వూళ్లో - గొడ్డుగేదే శ్రీమహాలక్ష్మి అంటారు'
తిండిపోతు రాముడయిన పనిదొంగను గురించి
'దున్నబోతే దూడలలోను - మేతకుపోతే ఆవులలోను'
అని చెప్పటం కద్దు.
'పాత్రాపాత్ర విచారిస్తూ - ధేను పన్నగయోరివా'
అని సంస్కృతంలో శ్లోకోక్తి. అనగా

'ఆవు గడ్డితిని పాలిస్తుంది – పాము పాలుతాగి విషం కక్కుతోంది' అని అర్థం.

పాత్రా పాత్ర విచారణచేయక చేసేదానం గురించి ప్రవర్తించే లోకోక్తియిది. మంచిగోవులను దానంచేస్తే పుణ్యం ఎలాగో – బక్క గోవులను దానంచేస్తే ఆలానే పాపం చుట్టుకుంటుంది.

ఒకప్పుడు వాజశ్రవసుడు విశ్వజిద్యజ్ఞం చేస్తూ తిండీ నీళ్లులేక అల్లాడి ఆవులను దానం చేయసాగాడు. అయ్యో ఇటువంటి దానం వల్ల నాతండ్రి సౌఖ్యంలేని లోకాలకు పోతాడే! అని ఈతని కొడుకు నచికేతుడు విచారించి నాయనా! నన్నెవరికిస్తా వన్నాడు. తండ్రి కోపగించి నిన్నామృత్యువుకిస్తా? అన్నాడు. ఆమాట ప్రకారం నచికేతుడు మృత్యుమందిరం చేరుకొన్నాడు. అక్కడ మూడు రాత్రులు ఉపవాసం చేసేసరికి ఇది అనర్థహేతువని భయపడి, మృత్యువు ఆయనను ఉపవాసంమాని మూడువరాలు కోరుకో మన్నాడు. అలాకోరుకొని మూడవవరంవల్ల ఆత్మజ్ఞానం తెలిసికొని తరించాడు నచికేతుడు.

భాగవతంలో ఈకథ చెప్పబడింది. దేవరాజు దుష్టుడు. అతని దౌష్ట్యం ఎక్కువకావటంచేత ప్రజలకుపీడాకారంగా తోచింది. పంటలు పండలేదు. ఆహారంలేక ఉపవాసాలుచేసి ప్రజలు చచ్చిపోతున్నారు. అతని తదనంతరం కొడుకు పృథ్వీరాజు రాజ్యానికి వచ్చినప్పుడు దేశం మార్పులేక ఆలానేవుంది.

పృథ్వీరాజుకు భూదేవిపైన కోపంవచ్చింది, తనవిల్లు ఎక్కుపెట్టి భూమిని కొట్టబోయే సరికి ఒకగోవు ఎదుటికివచ్చి నిలబడింది. నిలిచి ఓరాజా! నిరపరాధురాలైన నన్నెందుకు కొట్టబోతావు. రాజులారా! నిర్లక్ష్యంచేసారు. రైతులారా! దున్నరైరి. కాబట్టే పంటలు లేకపోయి నాయి. ఇదినాతప్పా! ఇప్పుడైనా ఒకపనిచేయి. ముచ్చటైన ఒక లేగను నావద్ద తెచ్చినిడు! పాలుపిండడానికి బలవంతులైన వాళ్ళను కూడా సిద్ధంచెయ్యి అన్నది. ఆలానే చేసాడు రాజు, ఆవు చేపింది. చాలాపాలిచ్చింది. ఆగోమాత చెప్పిన మాటలలో చాలా అర్థంఇది.

రాజుమంచివాడై ప్రజల కష్టసుఖాలను స్వయంగా విచారించాలి. ఆలా చేస్తే ప్రజలు తమతమ విధులు సక్రమంగా నెరవేరుస్తారు. ఎవరి విధులువారు నెరవేర్చుకుంటే పంటలు పండుతాయి. పంటలు పండగానే సరిగాదు. పండినపంటలు జాగ్రత్తపరచటానికి తగిన బందోబస్తు చేయాలి. అప్పుడే రాజ్యం సుఖంగా సుభిక్షంగా వుంటుంది.

రాజువద్దకు వచ్చిన ఆగోవే! భూమాత. పంటలకోసం మనం చేసే దోహదమే లేగ. వంటలేపాలు. ఆబలవంతులే రక్షకులు. అని చెప్పుకునే కథ.

'చెప్పినవాళ్ళకు పాడావు - విన్నవాళ్ళకు చూడావు'

## మంచిగోవు లక్షణాలు

తల:- అంతపెద్దదిగా, అంతచిన్నదిగా వుండక

నొసలు:- విశాలంగా

కన్నులు:- సొగసుగా, మిగుల చిన్నవిగ అంతపెద్దవిగ వుండక సామాన్యంగా ఇంకను గుంటలు పడక పక్కగా కనపడుతూ, శాంతి సూచనగా, కళగలిగి

మెడ:- పొట్టిగ, లావుగ

ముక్కురంధ్రాలు:- కోసుగా, పొడవుగా

కొమ్ములు:- వెనుకకు తిరిగిగాని. ముందుకు పొడుచుకు వచ్చిగాని

కాళ్లు:- పొట్టిగా వంకర లేకుండా, ముంగాళ్లు మాత్రము వెడల్పుగా కండబట్టి

తోక:- సన్నంగా పొడవుగా నేలకు తగులునట్లుండి చివర చక్కని పెద్దకుంచవలె కుచ్చుకలిగి

వీపు:- మూపురం ప్రక్క కొంచెము పల్లముగా, చదునుగా.

వెంట్రుకలు:- సన్నగా మెత్తగా నిగనిగలాడుతూ

శరీరము:- పొడవుగా, తోకవైపు శరీరము మాత్రము మూపురానికి సమానమైన ఎత్తుగా

తొంటి:- విశాలముగా

తోడలు:- ఒకదానితో నొకటి ఒరిసికొనిపోయినట్లుండక విడిగా

పొదుగు:- పెద్దదిగా ముందునుంచి వెనుకవైపుకు చాలావరకు వ్యాపించి పెద్ద సంచివలె వుండాలి. పాలుతీసిన తరువాత పొదుగు పూర్తిగా మడత పడాలి. కండపొదుగులు అంత మంచివికాదు. అవి చూడడానికి అందంగా వుంటవిగాని పాలు అంతగా ఈయవు.

స్తనాలు:- నాలుగు సమానదూరంలో వుండి, ముందువైపు స్తనాలు వెనుక వానికంటె ఇంచుక పొట్టిగా వుండాలి. మూడు, ఒకటి చన్నులు అంత శ్రేష్టసంతమైనవి కావు, కొరివి చన్నులుగల పశువును అసలు కొనరాదు.

# సారస్వతంలో - దున్న

'నల్లరాతికింద - నలుగురు దొంగలు'

ఏమిటో చెప్పుకో చూతాం - అని కధపొడుస్తాడు. చురుకైన కుర్రవాడు. అందరూ తెల్లబోతారు. కాని తెలివయిన పిల్లవాడు. రహీమని గేదెఅని చెప్పేస్తాడు.

ఈ విధంగా పిల్లలు చెప్పుకొని ఆనందించే గేదె - పెద్దవాళ్లకూ అంతటి సంతోషాన్ని కల్గిస్తున్నది. ఏమి అంటే ముఖ్యంగా గేదెపాడి వల్లనే మన శరీరాలు పోషింపబడుతున్నవి.

'గేదెకు ఎనుము - బర్రె - అని రెండుపేర్లు'

గేదె స్త్రీజాతికద. పురుషజాతికి ఎనుబోతు, దున్నపోతు, మహిషము అనిపేర్లు. దున్నేదికనుక దున్నపోతు అని పేరువచ్చినట్టు నిఘంటుకారుడు చెబుతున్నాడు. సబబుగానే వుంది ఈ మాట. అరణ్యంలో సంచరించే ఎనుము ఒకటుంది. దీనికే మనుబోతు - కారెనుము - అడవిదున్న ఇంగ్లీషులో 'బైసన్' అని నామాలు. ఈ బైసన్ అనేది మైసూరు ప్రాంతములో విరివిగా కనిపిస్తున్నది. ఇవి గాక జడలబర్రె లేక చమరమృగం అనేది ఒకటి దీని శరీరమంతా నలుపు. తోక మట్టుకు తెలుపు. ఈ తోకనుండి తీసే పొడుగాటి

వెంట్రుకలనే చామరాలుగా తయారుచేస్తారు. మిక్కిలి విలువగలిగినటువంటి, అతి పవిత్రమైనటువంటి చామరాలతో దేవుడి విగ్రహాలకు పూజార్లు విసురుతూ వుండటం మనం నిత్యం చూస్తునే వుంటాం. ఇంతవరకు ఈ జంతువును గురించిన రకాలు తెలుసుకున్నాము.

పోతే ఈ దేవీనవరాత్రులలో మహిషాన్ని గురించి ముందుగా ముచ్చటించుకోవటం అవసరం. పూర్వం మహిషం తల గలిగిన ఒక రాక్షసరాజు వుండేవాడు. వాడే మహిషాసురుడు. లోకానికి వాడి పీడ మిక్కుటమైనందువల్ల వాడిని ఏలా సంహరించటమా అనే సమస్య వచ్చింది. వాడిని చంపటంకోసం బ్రహ్మ విష్ణు మహేశ్వరులను త్రిమూర్తుల శక్తులు కలిసి, సమస్త దేవతల శక్తులూ, కలిసి ఒక అపూర్వశక్తి అవతరించింది. ఆ శక్తి పేరే 'మహిషాసురమర్దని'. ఆ మహిషాసురమర్దని నాడు మహిషాసురుణ్ణి సంహరించింది. అంత భయంకరమైన మహిషాసురుడి బాధ భూలోకానికి వదిలిపోవటంచేతనే ప్రజలు వైభవంగా ఈ ఆశ్వయుజ మాసంలో నవరాత్రి పూజలు చేసుకోవటం తటస్థించింది. ఆ ఆచారమే ఈనాటికీ సాగిపోతున్నది.

ఈ మహిషాసురుని పేరునే మైసూరుకు వచ్చింది. మైసూరు ప్రాంతములో ఈ దేవి 'చాముండేశ్వరి' అనే మరొక పేరుతో కూడ కొలువబడుతున్నది. దున్నపోతు లేక మోటు జంతువు కాబట్టి కూసింత శారీరక బాధనైతే అదిలక్ష్యం చెయ్యనే చెయ్యదు. దీన్నిబట్టే.

'ఎనుబోతు మీద – వానకురిసినట్లు'

అనేసామెతవుంది. అది ఎక్కువ కష్టమైన పనులను చేస్తుంది. అందుకనే.

"దున్నలాగున కష్టపడి – దొరలాగ తినవలె"

నంటారు పెద్దలు. హడావుడిగా అనాలోచితంగా అవకతవకపనులు చేసేసందర్భంలో

"దున్న ఈనిందంటే – దూడను కట్టివేయమన్నట్టు"

అనే జాతీయాన్ని ఉపయోగమైన వస్తువును విడనాడి నిరుపయోగమైనటువంటి, ప్రమాద కరమైనటువంటి దానిని తెచ్చుకోవటాన్ని

'పితికే బర్రెను ఇచ్చి - పాటికున్నను తెచ్చినట్లు' అనివర్ణిస్తారు
'కొల్లేట్లో పంటపండేగాని - చచ్చేదున్నపోతులకు లెక్కలే'

లేవని మరొకవాడుకవుంది. దీన్ని విప్పిచెప్ప నవసరంలేదు. ఒక దున్ననుచూచి ఏ కవికుమారుడికైనా ఆవేశంకలిగిందా! ఒక పద్యమైన చెప్పివుంటాడా? అనిసారస్వతమంతా గాలిస్తేవరప్రసాదంగా ఒకే ఒకపద్యం లభించింది.

'భుగభుగమని పొగలెగయుగ
నగణితముగ నాజ్యధారలాహుతిగాగా
నిగమాది మంత్రయుతముగ
పొగద్రాగనివాడు దున్నపోతైపుట్టున్'

అన్నాడొక మహాశయుడు. పొగతాగుడును వర్ణిస్తూ ఇంకా వెతకగా ఇందుకు తోడు ఒకచిన్న వేడుకపద్యంకూడా జ్ఞాపకానికి వస్తున్నది. ఇదిమున్నను మంచి హెచ్చుస్థాయిలోస్తుతిస్తున్నదిచూడండి?

'నగపగతు పగతుపగతుని
పగతుండగు మగధరాజు బరిమార్చినయా
జగజెట్టి యన్నతండ్రికి
తగువాహనమైనయట్టి ధన్యుండితడే'

అనగా నగ పగతుడు ఇంద్రుడు (నగము కొండ, పగతుడు శత్రువు; కొండలకుగల రెక్కలను తెగగొట్టిన పగవాడు ఇంద్రుడు. అటువంటి ఇంద్రుని వైరి నరకుడు, నరకుని విరోధి కృష్ణుడు ఆతని శత్రువు జరాసంధుడు, ఆతనిని చంపినవాడు భీముడు. భీముని అన్న ధర్మరాజు, ఆతని తండ్రి అయిన యముని వాహనం దున్నపోతు. మహిషం యమధర్మరాజునకు వాహనం అయివుండటం దాని ఆధిక్యతను తెలిపే పౌరాణిక విశేషం.

మన గొర్రెపందెములలాగానే 'మలయా'లో దున్నలను పందెములను కట్టి పోట్లాడిస్తారు. ఇవి చాలా విచిత్రంగా వుంటాయి.

ఈ పందెముల గురించిన వివరాలు ఎన్నోవున్నయి. కనుక ఒక్క మాటలో చెప్పాలంటే కుదరదు. దీనిమీద కావాలంటె ప్రత్యేక ఒక కథ వ్రాయవచ్చు.

చచ్చిన ఎనుమును గురించి తలచుకున్నప్పుడు మాత్రం
'ఏనుగు బ్రతికి వెయ్యి-చచ్చి వెయ్యి'

అనే లోకోక్తి గుర్తుకు వస్తుంది, మన ప్రాంతంలో లేదు గాని, ఎనుము చచ్చినా మానవునికి ఎంతగానో ఉపకరిస్తున్నది. సట్లెజ్ ప్రాంతంలో చచ్చిన ఎనుముల లోపలిసరుకంతా జాగ్రత్తగా తీసివైచి అందులో గాలిపూరించి నీటిమీద ప్రయాణం చేస్తారు. అనగా ఇవి గాలితిత్తులవలె వినియోగపడుతున్న వన్న మాట. ఆవిధంగా ఆప్రాంతస్థులు ఎనుము తిత్తిమీద కూర్చుని బడవప్రయాణంలాగ నిర్భయంగా ఎంతదూరమైన ప్రయాణం చేయగలరు. ఒక్కమాటలో చెప్పాలంటే అక్కడ పడవలకు ప్రత్యామ్నాయమే ఈమున్న తిత్తులు. రెండువేల సంవత్సరాలనాడు అలెగ్జాండర్ దిగ్రేట్ మన దేశానికి దండెత్తి వచ్చినపుడు యిటువంటి తిత్తులమీదనే సట్లెజ్ నదిని దాటి నట్లు చరిత్రలవల్ల తెలిస్తుంది.

## మంచి దున్న లక్షణాలు

తల:- పొడవుగ, బరువుగా

మూపురము:- చిన్నదిగా

వక్షస్థలము:- విశాలంగా

కాళ్లు:- పొట్టిగా, మిక్కిలి బలముగలవిగా, లావుగా

శరీరము:- పొడవుగా, మిక్కిలి బలముగా

కొమ్ములు:- నిలుచున్నపుడు మనము దానిమీద నీరుపోసినచో దాని ముందుకాళ్ళ డెక్కలమీద ఆనీరుపడకుండ అడ్డమువచ్చునంత వరకు వంకరతిరిగి శరీరమును ఆనుకొని వుండాలి. కొమ్ముల

అందమే శుభలక్షణము. కొమ్ములు రెండుసమానమైన పొడవు గలవై, వెనుకకు వంగి, రెండు మొనలు ఒక దానినొకటి ఎదురుగానున్న మంచిది.

తో క:- సన్నముగా, పెండ్రికలు నలుపుగా బిరుసుగా నిక్కపొడుచు కొని

## సారస్వతంలో - బఱ్ఱె

ఇప్పటికి దున్నపోతును గురించిన విశేషాలను తర్కించాం. ఇక బర్రెను గురించిన లోకోక్తులను తడవి చూదాం. సాంప్రదాయాన్ని గురించి చెప్పుకోవలసి వచ్చినప్పుడు.

'తల్లినిచూచి పిల్లనూ - పాడినిచూచి బర్రెను'

అంటూ ఒం చక్కని సామెతను వాడుతారు. పాడి అన్నప్పుడు ఒకవిషయం చెప్పాలి. గేదె పుష్కలంగా పాలిస్తుంది. అవి ఎంచి పుష్టినిస్తాయి. అందుకనే గేదపాడి పుష్టినిస్తుంది. అందులోనూ గొడ్డు గేదె అనేజాతి తడవకు కుంచాలకొద్దీ పాలిస్తుందని అంచనా. ఒక ధనవంతుడి అహంకారాన్ని నిరూపించే ఒకసామెత.

'నీబర్రె గొడ్డును ఎవరుకాస్తారో చూస్తాం అంటే నాతిత్తి లోని డబ్బేకాస్తుంది అన్నాడట'

ఎప్పుడో కాగల కార్యాన్ని గురించి వివాదపడటం

'కొనబోయే గేదెవచ్చి పెట్టబోయే బచ్చలిపాదును మేసినట్లు' ఉంటుంది.

వేళగాని వేళలో చేసేపనులు గురించి

'ఏదీగానివేళ - గేదె ఈనిందన్నట్టు' అనటం కద్దు.

బర్రెను గూర్చిన సామెతలు మరికొన్ని

'బర్రెచస్తే - పాడిబయట పడుతుంది'

'బర్రెదూడ దగ్గిరా-పాత అప్పులవాడి దగ్గిరా ఉండరాదు'

'అయ్యవాతి పెట్టినా - బర్రెబతకనూనా'

"బర్రెపాతిక - బందె ముప్పాతికా"

'దూడచస్తే కమ్మలం - గేదెచస్తే నిర్మలం'

'దూడాబర్రె ఉండగా - గుంజఅరచినట్టు'

అవగా అనవసరజోక్యం కల్పించుకోవటం.

పాలియ్యని గొడ్డుగేదెలను గురించి కొన్ని సామెతలున్నవి.

'ఇంటివాడు గొడ్డుగేదె అంటే - పొరుగువాడు పాడిగేదె అన్నట్టు' (పరస్పర విరుద్ధాభిప్రాయాలు)

'నూరుమంది మొండిచేతులవాళ్లు పోగయి ఒక్క గొడ్డు గేదెను పాలుపితుకలేనట్లు' (రెండూ అనుభవమే)

'దొడ్డెడు గొడ్లనూ దొంగలు తోలుకుపోతే గొడ్డుగేదె శ్రీమహాలక్ష్మి అయింది.'

గేదెకు పుట్టిన ఆడదూడ పెయ్య మగది దున్నకుర్ర యీ కుర్రలు అరవటం అంత వినసొంపుగా వుండదు. అందుకే మోటుగా అరచేవాళ్లను.

'గేదె పడ్డలా - అరుస్తా వెందుకూ' అంటారు,

గేదెజాతికి బురదలో పొర్లటం, వర్షంలో నానటం మహాఇష్టం ఈ అలవాటును బట్టి ఒకసామెత వుంది. 'ఎనిమిదేళ్ల ఎనుముకి ఏటి దారి తెలియక పోవటమేమిటి'.

అతీతమహిమషీ స్నేహన్యాయం గృహస్థాశ్రమంలో వున్నప్పుడు ఒక దూకగేదెను పెంచాడు. దానిమీద అతనికి ఎంతో మక్కువ వుండేది. అతడు తర్వాత గృహస్థాశ్రమం వదలిపెట్టి గురువుదగ్గర తత్త్వోపదేశం పొందినప్పటికీ ఆగేదెమీద ప్రేమను మాత్రం వదలి పెట్ట లేకపోయాడట. ఇటువంటి సందర్భాలలో ఈన్యాయం వర్తిస్తుంది.

'చర్మంతం తే మహిషీంహంతి' అని మరియొక లోకోక్తి వున్నది. అంటే తోలుసంచి కావలసినవాడు గేదెను చంపునట్లు చిన్నవస్తువు కావలసినవాడు పెద్దవస్తువును పాడుచేసుకో కూడదని భావం. ఒకడిని ఈగేదె ఎవరిదిఅని అడిగితే, ఈకర్ర ఎవరిదో వానిది అన్నాడట. అయితే ఈగేదె ఎవరిదో ఆకర్రకూడా వానిదే, అన్నాడట.

మావూళ్లో వె(రిబ్బాయి ఒక వెర్రిమొర్రిపాట పాడుతూ వుండేవాడు. 'గేదె దూడలుబతకవ్వూం - వెధవ ముండలు చావరూ' అని ఇందులో ఎంత అర్థమున్నదోమరి, బుద్ధిమంతులు యోచించాలి.

సారస్వతంలో గోవు - ఎద్దు - గేదె - దున్నలనుగూర్చిమాతృసేవలో శ్రీ యం. ఎస్. శాస్త్రిగారు వ్రాసిన వ్యాసములనుంచి తీసికొనడమైనది. వారికి మా వందనములు.

## గేదెకుండవలసిన లక్షణాలు.

తల:- చిన్నదిగా నునుపుగా కండగలిగి యుండాలి.

నొసలు:- విశాలముగా వుండాలి.

కన్నులు:- చిన్నవిగా సొగసుగా వుండాలి.

వెన్ను:- లోతుగా వుండాలి.

కాళ్ళు:- వెనుక కాళ్ళకంటె ముందుకాళ్ళు పొట్టిగావుండాలి.

కడుపు:- లోతుగా విశాలముగా వుండాలి.

తోక:- సన్నముగా వెం(డుకలు నలుపుగా బిరుసుగా నిక్కబొడుచుకొని వుండాలి

స్తనములు:- సమానమగు దూరముగో వుండాలి. పాల నరములు స్పష్టముగా కనపడాలి.

కొమ్ములు:- పశువు నిలుచున్నపుడు మనము దానిమీద నీరు పోసినయెడల దాని ముంకాళ్ళ డెక్కలమీద ఆ నీరు పడకుండ అడ్డమువచ్చునంతవరకు వంకరతిరిగి శరీరమునుఆనుకొనియుండాలి.

తోకక్రింద గుదస్థానముపైన గుంటలని కణుపులవలె కనిపించిన గేదెను కొనరాదు. వివిధాంగులలో కూడియుండు పొంగుగల గేదెను కొనరాదు. భుజము పైభాగమున గుంటగానున్న గేదెను కొనుట మహాదోషము.

## వయస్సు కనుగొనుట

పశువుల వయస్సును తెలిసికోవాలంటే వాటి లక్షణాలు వాటి పండ్లను, కొమ్ములను దీర్ఘముగా పరిశీలించితేగాని స్పష్టంగా తెలియదు ఎంతో అనుభవంకూడ వుండాలి. ఎద్దులకు అయిదు సంవత్సరాల వరకు యుక్తవయస్సు, పదునారవ యేటవరకు మధ్యమవయస్సు, తదుపరి వృద్ధాప్యంవస్తుంది. సాధారణంగా మూడవ సంవత్సరములోనే పనిలో ప్రవేశపెడతారు పది, పదునైదు సంవత్సరాలు చక్కగా పనిచేస్తాయి. తరువాత పెన్షన్ యిస్తారు. ఇంకను కఠినాత్ములైనరైతులున్న వృద్ధాప్యంలోవున్న పశువులతో పనిచేస్తారు.

## కొమ్ములనుబట్టి వయస్సు

పశువు పుట్టిన ఒకటి లేక రెండుసంవత్సరాల వరకూ కొమ్ములు వృద్ధిచెందుతాయి. పశువులకు కొమ్ములు వుంటేనే అందము కాని కొమ్ములువుంటే పశువులకు మోటుపద్ధతియని కొంతమంది చిన్నతనము నసే రాకుండా చేస్తున్నారు.

మూడుసంవత్సరాలు వయస్సు వచ్చినప్పటికి కొమ్ము మొదటి భాగమునుంచి ఒక వలయాకారంగా ఏర్పడుతుంది. ఎద్దులకంటె ఆవులు, గేదెలు, దున్నల కొమ్ములమీద ఈవలయాకారం స్పష్టంగా కనబడుతుంది.

కొమ్ములచుట్టూ ఏర్పడిన వలయాకారాలు రెండేసి వంతున కలుపుకుంటూ వచ్చినవయస్సు తెలిసిపోతుంది. కొమ్ములచుట్టూ నాలుగు వలయాలు వుండి ఇంకా రెండు కలుపుకొన్న ఆరువలయాలు

అగుతాయి. అప్పుడు పశువయస్సు ఆరువత్సరాలని గుర్తించుకోవాలి. ఈరీతిగా పశువులవయస్సు ఆవలయాలనుబట్టి ఏసంవత్సరానికి ఆసం వత్సరము లెక్కించి కనుగొనాలి. ఈవలయాలనుబట్టి పరీక్షచేయుట అనుభవ శాలురకే తెలుస్తుంది.

## పండ్లనుబట్టి పరీక్ష

మామూలుగా పశువులకు పైదవుడయందు 12 క్రిందిదవడ యందు 20 పండ్లను భగవంతుడు సృష్టించియున్నాడు. మొత్తం 32 పండ్లు వుంటాయి పైదౌడ వరుసలో క్రింద ఎనిమిది పండ్లకు సరిపోయే గట్టిమాంసపుదిమ్మె మాత్రము వుంటుంది, గడ్డిని కొరికే టప్పుడు ఆదిమ్మకు అదిమిపట్టి క్రింది ఎనిమిది పండ్లతో నొక్కిపట్టి లాగుకొంటుంది.

దూడపుట్టగానే దౌడయందు రెండుపాలపండ్లు వుంటాయి. రెం డవవారానికి నాలుగు, మూడవవారానికి ఆరు, ఈరీతిగా ఒకనెలలో ఎనిమిదివరకువచ్చి ఆరుమాసాలవరకు అవి స్వచ్ఛంగా, సమానంగా కనబడుతాయి. తర్వాత పండ్లరంగుమారి మరల ఎనిమిదవమాసంలో మొదటవున్న పాలపండ్లు ఆరు అరిగిపోతాయి.

సంవత్సరానికి నాలుగు, సంవత్సరంన్నరకు ఆరు, రెండు సం వత్సరాలకు ఎనిమిది పండ్లు అరిగిపోతాయి. మరల మామూలుగా వుండే రెండుపాలపండ్లు వూడి కొత్తగావస్తాయి. మూడు సంవత్స రాలకు నాలుగు, నాలుగుసంవత్సరాలకు ఆరు, అయిదుసంవత్సరాలకు ఆరుపండ్లు వంతున కొత్తవి వస్తూవుంటాయి. మరలవూడుతూ వస్తూ వుంటాయి. ఈరీతిగా వయస్సు తెలిసికోవచ్చును.

—♦—

# ఐదవ భాగము

## భారతదేశ - పశుసంపద

అనాదినుంచీ మానవుడు పశువులను తన సంపదగా పరిగణిం చుతూవచ్చాడు. తన జీవిత పోషణకు పాలను ఉపయోగింపవచ్చని కనిపెట్టాడు. పాలుసహజమైన సంపూర్ణాహారం. వేదకాలంలోకూడా పాడి పశువులు విశేషంగా ఉపయోగంలో ఉండినట్లు తెలుస్తున్నది. పురాతన కాలములో మునీశ్వరులు ప్రపంచాన్ని పరిత్యజించి ఆశ్రమ ములలో తపస్సు చేసుకుంటూన్నప్పుడు వారికి తప్పకుండా ఆవులు వుండేవి. గోమాతపట్ల అత్యంత భక్తి ప్రమత్తులుండడం వల్ల, అది కామధేనువుగా భావించబడింది. మానవులు దేశదిమ్మరులుగా వుండి జట్లుజట్లుగా ఆహారాన్వేషణకు బయలుదేరునపుడు తృణజలకాష్ఠ సమృద్ధిగల ప్రాంతాలకు మాత్రమే తరలిపోయేవారు. నాటినుంచి నేటివరకు మానవులు తమ ప్రయాణాలలో పశువులను భారవాహక జంతువులుగా ఉపయోగించుకొంటూ వస్తున్నారు. వారు తమ పశువులను గంగాసింధూ మైదానములలోకి తోలుకొని వచ్చే వారు. రాత్రిళ్ళువాటిని అడవిమృగముల వాతపడకుండా కాపాడుకో వలసి వచ్చేది. అందుకనివారు పశువులను ఒకచోట వుంచివాటిచుట్టు మంటలువేసి బైటకాపలా కాసేవారు. ఈవిధంగా జట్లుజట్లుగా వచ్చు వారికి ఒక నాయకుడు వుండేవాడు. ఆ నాయకుని అనంతరం అతని సంతానం అతనిపేరుతో వ్యవహరింపబడుతూ వచ్చేది. ఈవిధంగా హిందువులలో గోత్రాలు ఏర్పడినవి.

మానవుడు స్థిరనివాసానికి అలవాటుపడి వ్యవసాయం చేయడం నేర్చుకొన్నాడు. పశువులను భూములు దున్నుటకు ఉపయోగిస్తూ వచ్చాడు. యంత్రయుగములోకూడా పశువులు మానవుని జీవితంలో ప్రముఖస్థానం వహిస్తున్నవి. ఆహార సమస్య అతి తీవ్రంగా వున్న భారతదేశంవంటి దేశాలలో పశువుల ప్రాముఖ్యాన్నిగూర్చి చెప్పడం

అతిశయోక్తి కాదు. పశువులు పాలిస్తాయి; బరువులు మోస్తాయి; పొలాలు దున్నుతాయి. వాటివల్ల ఎరువు లభిస్తుంది. అధికాహారోత్పత్తి సాధించాలంటే ఎరువు లభించడం ఎంతైనా అవసరం. పశు సంక్షేమమే మానవ సంక్షేమం. అందువల్లనే పశు సంపద అభివృద్ధికై మన ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో రూ. 56 కోట్లు కేటాయించ బడినవి. ఈ మొత్తంలోనుంచి రూ. 22 కోట్లు పాడిపంటల అభివృద్ధికై ప్రత్యేకించబడినవి.

గ్రామీణ జీవితంలో పశువులుసాంప్రదాయంగా గౌరవభావం కలిగియున్నవి. "పచ్చికబయళ్లు లేకపోతే పశువులు లేవు, పశువులు లేక పోతేఎరువు లేదు,ఎరువు లేకపోతేపంటలు లేవు"అని తెలుగుసామెతఒకటి వాడుకలో వుంది పశువుల ప్రాముఖ్యమంతా ఈ చిన్న వాక్యంలో యిమిడి వుంది. ఆంధ్ర ప్రదేశ్‌లో అడవులు, సువిశాలమైన పచ్చిక బయళ్లు ఉన్నాయి. ఒకప్పుడు ఇది ఉత్తమజాతికి చెందిన పశువులకు నిలయమై వుండినవి. పశువులను కాపాడి, పోషించడం ప్రతియొక్కని విధ్యుక్తధర్మం. ఒంగోలు ఎద్దులు, ఆవులు ప్రపంచఖ్యాతి గాంచినవి. ఈ జాతి పశువులు విదేశాలకు విశేషంగా ఎగుమతి అవుతూండడం వల్ల, వీటి యెగుమతి వ్యాపారానికి క్రమబద్ధం చేయవలసి వచ్చింది. లేకపోతే ఈ జాతి పశువులు జన్మస్థానంలోనే అంతమయ్యే ప్రమాదం ఏర్పడివుండేది.గుంటూరు, నెల్లూరుజిల్లాల గ్రామస్థులందరూ ఈ పశువులను కడుజాగరూకతతో తమకన్న పిల్లలనువలె పోషించి పెంచుతారు. ఈ పశువులు చూడముచ్చటగా వుంటాయి. ఈ జాతి కోడెలు అనేక జాతీయ అంతర్జాతీయ ప్రదర్శనములలో బహుమతులు పొందినాయి. కర్నూలుజిల్లా కంభం తాలూకాలో కపిలయను లనే తెగకుచెదిన ప్రజలున్నారు. వీరు పశువులను భక్తిప్రేమలతో పెంచుతారు.ఈ జాతి పశువులు ఈ ప్రజల తెగ పేరతో వాసికెక్కినవి. ఇవి ఒడ్డూపొడవులో చిన్నవి. అయితే చాలా చురుకైనవి. వీరు తమ పశువులను ఎంత ప్రేమతో చూస్తారంటే చనిపోయిన పశువులను కూడా కసాయి

వారికివ్వరు. వాటిని భూమిలో పూడ్చిపెట్టి అంత్యక్రియలు జరుపుతారు. వీరు తమ మందకు నాయకునిగా ఒక పశువును ఎన్నుకొని దానికి 'నందగోపాలస్వామి' అని పేరు పెడుతారు. అది మిగిలిన మందకు రాజు. తెలంగాణాలో మాల్వీ, కృష్ణాలోయ పశువుల జాతులు ప్రఖ్యాతి గాంచినట్టివి. హనుమకొండ (మర్యాడా)జాతి పాడి పశువులను ఎక్కువగా లంబాడీ ప్రజలు పెంచుతారు. అమృత మహాల్ జాతి ఎద్దులు చూచుటకు చాల అందంగా వుంటాయి ఇవి చాల చురుకైన జంతువులు. బరువులు లాగుటకు వీటిని ఉపయోగిస్తారు. ముర్రా జాతికి చెందిన దున్నపోతులు, బర్రెలు చాల ఉత్తమమైనవి.

విశాఖపట్నం, నెల్లూరు, తూర్పు గోదావరి, నల్గొండ, మహబూబ్‌నగర్, కరీంనగర్ జిల్లాల్లో అత్యుత్తమ జాతికి చెందిన పశువులున్నాయి. ఈ జిల్లాల్లో పశువుల సంఖ్యకూడా యెక్కువ.

ఆంధ్ర ప్రదేశ్ అంతటా, హైదరాబాదు సరిహద్దులలోని నార్సింగి, యెర్రగడ్డలలో జరిగినట్లుగా వారానికొకసారి పశువుల సంతలు జరుగుతాయి. నిజామాబాదు జిల్లాలోని బోధన్ కు సమీపంలో సతాపూరువద్దపశువుల సంత జరుగుతుంది. ఈసంత చాలాప్రసిద్ధిగాంచినది. మహబూబు నగరుజిల్లాలో శ్రీరామనగరు,వనపర్తి, గద్వాల్లలోకూడా పశువులసంతలుజరుగుతాయి. ఇట్టిసంతలు విశాఖపట్నం. జిల్లాలోయెక్కువ. ఆంధ్రలోతూర్పుగోదావరి జిల్లాలోని పిఠాపురం, ద్వారపూడి, పశ్చిమగోదావరి జిల్లాలోని తాడేపల్లిగూడెం, ఉండి, పెనుగొండ, చిత్తూరులోని పలమనేరు, కడపలోని పులివెందుల, సింహాద్రిపురములలోజరుగు పశువుల సంతలుకూడాప్రసిద్ధిచెందినవే.

## పశు సంపద వివరాలు

ఆంధ్రప్రదేశ్ లో 11.5 మిలియన్ల ఎద్దులు ఆవులు వున్నాయి. ఇవిగాక 8 మిలియన్ల గొర్రెలు, 4 మిలియన్లమేకలు 15 మిలియన్ల కోళ్ళు, 729,000 ఇతర జంతువులు అంటే గుర్రాలు మున్నగునవి వున్నాయి.

ప్రస్తుతం 15,50,000 టన్నులుపాలు, తత్సంబంధమైన ఇతర వస్తువులుగా ఉత్పత్తి అవుతున్నాయి అయితే మన రాష్ట్రవిస్తీర్ణమూ జనాభానూ పట్టిచూస్తే ఈ ఉత్పత్తి చాలా తక్కువగా వున్నది.

మూడేండ్లకు పైన ఉన్న ఎద్దులు ఆవులు కలిసి 85 లక్షలు, దున్నపోతులు40లక్షలువుంటాయనిఅంచనావేయబడింది రాష్ట్రంలో 300 లక్షల యెకరాలు సాగు అవుతున్నవి 30 లక్షలనాగళ్ళూ, 12 లక్షల బండ్లూవున్నాయి వ్యవసాయానికి ఉపయోగపడు పశువులు చాలినన్ని లేవు వాటి నాణ్యతకూడా తక్కువే.

ఈ విషయాలనుబట్టి చూస్తే రాష్ట్రంలో పశుసంపదకు చాలా ప్రాముఖ్యం వున్నది రెండవ పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయం అభివృద్ధి చెందాలంటే పశు సంపదకూడా అభివృద్ధి చెందాలి.

## భారతదేశ పశుజాతులు

ప్రపంచములో పశుజాతులు, తదితర జంతుజాతులు ఎన్నో రకాలువున్నాయి. కాని ఈపశువులలో మూపురాలు లేనివి, మూపురాలు వుండేవిగా రెండు రకాలు మాత్రమే ప్రపంచములో కనబడుతున్నాయి. ఏదేశమేగినా ఏప్రాంతాన చూచినా మూపురమువుందా లేదా అనే విషయాన్ని ప్రతిరైతుకూడా వచ్చే పోయే ఆయాపశుజాతులను పరీక్షించుచుతూ ఉంటాడు. ఈగుర్తులనుబట్టి మూపురాలు లేకపోతే విదేశీ పశువులనీ, మూపురాలు వుంటే సాధ్యమైనంతవరకు స్వదేశీపశువులనీ రైతులుసులభముగా గ్రహించగలుగుతారు.పూర్వకాలంవలెగాక నేడుపాటునకు పాడికి బండిస్వారికి పశుప్రదర్శనాలకు పనిపాట్లకు బండలాగుటకు పనికివచ్చే పశుజాతుల విషయమై రైతులు దేశదేశాలవెంట, గ్రామ గ్రామాలవెంట తిరుగుతూ అవుసరమనుకుంటే ఎంతధనాన్ని అయినా వెచ్చించికొనేవారు ఈకాలంలో వున్నారంటే పశువులమీద ఎంత ఆసక్తివుందో ఎల్లరకు తెలిసినవిషయమే. ఇంతేగాక ప్రభుత్వం పంచవర్ష ప్రణాళికలు అమలుపరచి

మంచి మంచి ఆబోతులను పాడిపశువులను, గోసదనాలు స్థాపించి, మంచి మంచి గోవులను పెంచేవారికి కొంతగ్రాంటు బహూకరణ చేయమని తెలుపుతూ పశుసంపద ప్రచారం చేసిన తర్వాతనే రైతులకు పశువులమీద ఎంతో ఆసక్తి కలిగిందనుటకు అతిశయోక్తి లేదు అందుచేతనే రైతులు మనదేశ పశువుల చరిత్రలు తెలిసికోవాలని కుతూహలం కలుగుటవల్ల మన పశుజాతుల చరిత్రలు వ్రాయవలసి వచ్చింది. ముఖ్యమైన జాతులనే తెలుపుచున్నాను.

## మైసూరు జాతి

మైసూరులో వుండే పశుజాతులన్నిటిని మూడుభాగాలుగా విభజించవచ్చును. హాగల్వారి, హాళ్ళికర్, చిత్రాలదుర్గ జిల్లాలనుంచి వచ్చినవి కాన ఆయాపేర్లు వచ్చినాయి మనదేశంలో మాత్రం ఈ జాతి యెచ్చట వున్నా వెంటనే గుర్తింపవచ్చు పూర్వంహళ్లికారును గొల్లజాతివారు ఉత్తరదిక్కునుంచి, దక్షిణభాగానికివచ్చి చిత్రాలదుర్గ, తుంకూరులలో తమజాతివారితో స్నేహమేర్పరుచుకొని వారితో నివాసమేర్పరచుకున్నారు ఈజాతివారి పశువులన్నే 'అమృత మహాల్' జాతి యంటారు.

మైసూరు రాజ్యం పూర్వపు ప్రభువులలో దేవరాజ వడయార్ అను ప్రభువు ఈపశుజాతులనుఎంతోఅభివృద్ధి పరచాడు. హైదరాలీ కాలంలో ఈపశువులను యుద్ధసమయాలందు ఎక్కువగా ఉపయోగించేవాడు. హైదరాలీకుమార్డు టిప్పుసుల్తాన్ ఈజాతులను తండ్రికన్న మిగుల జాగ్రత్తగాకాపాడేవాడు

బ్రిటిష్‌సేనాని కెప్టెన్ డేవిడ్సె యుద్ధసమయంలో 230మైసూరు ఎద్దులమీదఎంతో బరువువేసి పంపగా ఆపరిసర ప్రాంతపు రైతులు ఆఎద్దులను చూచిఎంతో ఆశ్చర్యపడేవారు. ఇంకను వెల్లింగ్టన్ ప్రభువు అయిపురంలోజరిగిన ద్వీపకల్పయుద్ధసమయానఅమృతమహాల్ పశువులు లేవేయని ఎంతో పశ్చాత్తాప పడినాడట, 1880 సం॥ లో మైసూరు

కమీషనర్ ఈ రీతిగా చెప్పారు అమృతమహాల్ పశువులు మంచి చురుకుదనంకల్గి సేనలకంటెకూడ అతిత్వరితంగా నడిచేశక్తి కలిగి యుండేవి. అరేబియా జాతి గుఱ్ఱాలు తదితరజాతిగుఱ్ఱాలకంటె ఎంత ప్రఖ్యాతివహించినాయో, అదేరీతిగా అమృతమహాల్ పశువులు అన్ని జాతులకంటె పనుగెత్తడంలో అగ్రస్థానం పొందినాయన్నారు.

## అమృతమహల్ జాతి

ఈజాతి పశువులు క్రొత్తమనుష్యులను చూచిన కోపంతో మీదకు దూకుతాయి వానిని సాధుత్వంలోకి తేవడానికి కొన్ని మానాలు పడుతుంది వానిని మచ్చికచేసికొనడానికి కొన్నిరోజులు ఆహారం పెట్టకుండా యుంటే బలహీనస్థితికి వచ్చిచెప్పిన మాటలు వింటాయి ఎల్లప్పుడు వాటిని మంచిబరువులను లాగించుతూ, మంచి పనులుచేయించుతూ వుంటేకాని అవి అంకెకు రాజాలవు. ఆవులుకూడ ఎద్దులంత ప్రశస్తమైనవికావు పాలుకూడ అంతగా ఈయవు అవి యిచ్చేపాలు వాటిదూడలకే చాలవు

## లక్షణాలు

తల:- పొడవుగా వుండి శరీరానికి అందముయిచ్చుతుంది.

కన్నులు:- రోషవంతంగా, పౌరుషవంతంగా, నలుపుగా, చిన్నవిగా ఉబికియుంటాయి

చెవులు:- నిక్కపొడుచుకొని

కొమ్ములు:- పలుచగ, అందముగ, పొడవుగ

మూపురము:- బలముగ, అందముగ, పొడవుగ, మంచిఆకారముగా

గంగడోలు:- పలుచగ, గట్టిగా

ఎదుట్టొమ్ము:- వెడల్పుగా, భుజాలుబలంగా, బలంగలగుండ్రముగా వుండే ప్రక్కఎముకలతో

**తోక:-** మందంగా లేక పొట్టిగ, సన్నగా

**కాళ్ళు:-** చక్కగా అమరి బలముగలవై ఇనుపముక్కలా అన్నట్లుగా, కాళ్లలోనిఎముకలు మందముగా, చీలమండకు వెనుకభాగాన వెండ్రుకలు వుండెడు ఉబ్బెత్తుభాగం పొట్టెదిగా చిన్నదిగా మందముగా వుండు డెక్కలు. కొమ్ములు డెక్కలు మూతి భాగలయందుండే చర్మం నలుపుగాను, చర్మం పలుచగా, ఒక విధమగు పట్టువలె, పొట్టిగా మృదువుగానుండు బొచ్చు కలిగి పశువు ఆరోగ్యకరంగా, మంచిగుణాలు కలవిగా వుంటుంది

## మైసూరు జాతి

ఒంగోలుజాతికి ఈజాతికి పోలికదగ్గరగా వుంటుంది ఈమైసూరు జాతిని ప్రతి పల్లెటూరురైతులు సర్దాకొరకు. పనిపాటలకు తెప్పించు కొంటారు. ఈ పశువులు చిన్నవిగా, ఎలువిధ రంగుతో, ఆకర్షింప బడతాయి. ఈ జాతినే "నాతుదాన" అని పిలుస్తారు. రెండవజాతిని "దద్దోదనా" అంటారు అనగా పెద్దవని అర్థం. ఈ రెండురకాలపశువులు పెద్దరైతులదగ్గర వుంటవి. కొంతమంది రైతులు ఈ వర్తకంమీదనే జీవిస్తారు.

## లక్షణాలు

**కన్నులు:-** సాధుత్వంగా, స్పష్టంగా, రెప్ప వెండ్రుకలు నలుపుగా

**చెవులు:-** పొట్టిగా, వెడల్పుగా, నిక్కపొడుచుకొని

**మూతి:-** పొట్టిగా, అందముగా, గంగడోలు, విజృంభించి

**మూపురము:-** పెద్దదిగా, కొమ్ములు పెద్దవిగా నునుపుగా

**కాళ్లు:-** సమానంగా, బలంగా

**శరీరం:-** వెనుకభాగం వంగి విశాలంగా

రంగు:- తెలుపు లేక గోధుమరంగుగా, తల, కాళ్లు, మెడభాగాలు ఎక్కువరంగుగా వుంటాయి.

## ఒంగోలు జాతి

ఈ జాతిపశువులు మనదేశములోనే గాకుండా విదేశాలలో కూడా ప్రఖ్యాతిగాంచినాయి. మొదట నెల్లూరు జల్లాలోని ఉత్తర భాగపు తాలూకాలలోనే ఈ పశువులు ఎక్కువగావుండేవి.

ఈ జాతిఎద్దులు మైసూరుజాతియంత అందంగావుండకపోయినా అతి వేగంగా నడవకపోయినా, ఎక్కువ బరువులులాగుటలో నెమ్మదిగా లాగినప్పటికి అన్ని జాతుల పశువులను మంచి అగ్రస్థానం వహించినవి. వాటికిని ప్రత్యేకంగా బరువులు లాగుటకే ఉపయోగిస్తారు.

## లక్షణాలు

తల:- అంతపెద్దదిగ, ఎక్కువబరువుగా వుండక శరీరమునకు తగినంత పరిమాణంగా

ముఖము:- ఒకమాదిరి పొడవుగ,

మూతి:- బాగుగా వెడల్పుగలిగి

ముక్కురంధ్రాలు:- వెడల్పుగ

నొసలు:- బాగుగా వెడల్పుగా

కన్నులు:- కోడిగ్రుడ్డు ఆకారంకలిగిన విశాలమైన కన్నులలో నలుపు రంగు గ్రుడ్లుకలిగి, కంటిచుట్టు అరంగుళం వెడల్పున నలుపు రంగుగల చర్మము.

చెవులు:- సామాన్య వెడల్పుగ, కొమ్ములు పొట్టిగనుండి వెనుకకుగాని ముందునకుగాని తిరిగి

మెడ:- చిన్నదిగా, లావుగా, నలుపురంగుగా

శరీరం:- పెద్దదిగ, లావుగ, పొడవుగ, పశువుల టంగువారు మూపు రానికి వెనుకభాగాన 84 అంగుళాలు క్రిందినుంచి ఎత్తు మూపు రమునకు వెనుకభాగాన 36 అంగుళాలు

గంగడోలు:- కండరాలతోనుండి ముడుతలుపడి బొడ్డువరకువ్యాపించి

ఎదురొమ్ము:- లోతుగ, వెడల్పుగ, రెండు ముంగాళ్ళమధ్యలోతుగా, ప్రక్క ఎముకలు పొడవుగ లోతుగానుండి రెండు వైపులా సమానమైన ఎముకలుకలగి

వెన్ను:- సామాన్యమైన పొడవుకలగి అందంగావుండి వెన్నుభాగం మాత్రం వంగి

తోక:- అడుగుభాగాన సన్నంగానుండక మందముగా పొడవుగా అంద మగు జాలుతో అలంకరింపబడి చివరకుచ్చువలె, తోక చివర భాగము మడిమలకు తగులుతూ

గుదము:- తోకయొక్క వెనుకభాగము వెడల్పుగా

తొడలు:- కండరాలుగలిగి బాగుగా వృద్ధిచెంది లోతుగా

కాళ్లు:- కొద్ది వంకరగావుండి బలముగా, పొడుగుగా బలముగావుండే భుజాలుకలిగి

పాదాలు:- పొడవుగాను, ఒకమాదిరి మృదువుగావుండి చీలి,

ఎత్తు:- మంచివయస్సు వచ్చిన గిత్తఎత్తు 56 నుంచి 62 అంగుళముల ఎత్తువరకూ,

రంగు:- తెలుపు లేక బూడిదరంగు లేక నలుపు తెలుపు కలిసిగాని,

మూపురం:- తెలుపుగావుండి మెడమీద అచ్చటచ్చట నలుపు లేక బూడిదరంగు మచ్చలును

మూతి:- నలుపుగానుండి, మోకాళ్ళమీద శీలమండలకు కొద్దిగా పైభాగాన వెనుక కాళ్లమీద అచ్చటచ్చట నలుపురంగుగల మచ్చలు వుండాలి.

## తంజావూరు జాతి

ఈ జాతి కొమ్ములు లేనందున బ్రిటిష్ జాతిని పోలివుంటవి. ఈ జాతి యజమానులే ఆరుమాసాలు వయస్సురాగానే తమదూడలకు కొమ్ములు తీస్తారు. ఈపద్ధతి చేయడానికి రెండువారాలు పడుతుంది.

## లక్షణాలు

తల:- పొట్టిగ,
నొసలు:- వంగి,
కన్నులు:- విశాలంగా,
చెవులు:- కత్తిరించి.
కొమ్ములు:- వుండవు.
మెడ:- పొట్టిగ, మందముగ,
వీపు:- ఎత్తుపల్లములు లేక సరిసమానంగా, వీపునైపునకు పోనుపోను ఎత్తుగా,
తోక:- పొడవుగా, నేలను తాకుచు
కాళ్ళు:- పొట్టిగ. బలముగ,
పాదాలు:- చిన్నవిగ, అందముగ, గట్టిగ
శరీరము:- దట్టముగా.
రొమ్మెముకలు:- దృఢంగా
మూపురము:- ఒకమాదిరి యభివృద్ధి చెందుతూ
గంగడోలు:- పలుచగానుండి రొమ్మెముకవరకు వ్యాపించి,
ఎత్తు:- మూపురము వెనుక 41 నుండి 48 అంగుళాలవరకు వుండాలి.

## బీహార్ జాతి

ఇది బీహార్ జిల్లాలో దర్భాంగ, కోయల్‌పూర్, బచూర్ ప్రాంతాలలో వున్నవి. నొసలు చక్కగా సైబరంగుగా, బలమైన గిట్టలుగలిగి చెవులు వ్రేలాడుచు చూచుటకు అందముగా వుంటుంది.

# కంగాయం జాతి

ఈజాతినే కోయంబత్తూరు జాతియంటారు. ఈజాతినే కంగ నాడు, కంగాయంఅని పిలుస్తారు. ఈ పేరుకంగాయం తాలూకానుండి వచ్చింది. ప్రతిరైతు పదినుంచి ఇరువది పశువులవరకు పెంచుతూ అవసరమున్నపుడు అమ్ముకొంటూ వుంటారు వీటిని ఎక్కువగా దక్షిణ హిందూ దేశానికి, సిలోన్‌కు ఎగుమతి చేస్తారు ఈ జాతిమంచి బలిష్ఠంగా, చురుకుగా వుంటాయి

## లక్షణాలు

తల:- పొట్టిగ,
నొసలు:- విశాలంగా,
కన్నులు:- ప్రకాశవంతంగ
చెవులు:- పొట్టిగ నిక్కపొడుచుకొని
కొమ్ములు:- పొట్టిగ, గట్టిగ, వెడల్పుగనుండి మొనలు తేలి, ఇంకను పెద్దజాతిదైన కొమ్ములు వెడల్పుగ
మెడ:- పొట్టిగ, లావుగ, మందంగ,
మూపురము:- కండకలిగి పెరుగునదిగ
గంగడోలు:- మందముగానుండి రొమ్ముకవరకు వ్యాపించిసన్నముగ పొట్టవరకు వ్రేలాడుతూ
శరీరము:- దట్టముగానుండి మంచిఎముకలుకలిగి
వీపు:- పొట్టిగా, వెడల్పుగా ఎత్తుపల్లాలు లేక సాఫీగా
తోక:- కుచ్చు వెంట్రుకలుకలిగి తోక పొడవుగా పెద్దదిగా నుండి, అప్పుడప్పుడు నేలకుతాకుచూ
కాళ్లు పొట్టిగా బలంకలిగి, మంచిఎముకలుకలిగి,
పాదములు:- చిన్నవిగ పొట్టిగ, దృఢముగా

రంగు:- బూడిదరంగుగా తలమీదమాత్రం ఎక్కువ బూడిదరంగుగా ఆవులకు మాత్రం తలమీద మెడమీద మూపురం మీద తెలుపురంగుకలిగి, నాలుగు మోకాళ్ళమీద బూడిదరంగు మచ్చలును

మూపురము:- ఎత్తు వెనుకభాగమునుంచి కొలిచినయెడల 44 లేక 48 అంగుళాలవరకు వుంటుంది.

## మధుర జాతి

ఈ జాతినే పులికోలం లేక జెల్లీకట్, కిల్‌కడ్‌కిల్‌కట్ అంటారు. ఇవి చాలా చిన్నవి. మధురజిల్లాలోను, కంభం ప్రాంత మందును ఈ జాతి ఎక్కువగా కనిపించును.

## లక్షణాలు

తల:- ముఖము సామాన్య పొడవుగా అందంగా,

నొసలు:- విశాలంగా

కొమ్ములు:- పంగటించుకొని వెనుక భాగానికి వంకరలుగా తిరిగి సన్నని మొనలు తేలి

చెవులు:- నిక్కపొడుచుకొని, పొట్టిగా, గట్టిగా, నిడుపుగా

మెడ:- లావుగా పొట్టిగా,

మూపురము:- పెరుగునదిగా

శరీరము:- బలం కలిగి, మంచి ప్రక్క ఎముకలతోకూడి

వీపు:- విశాలంగా, పొట్టిగా,

నడుము:- భాగానికి మధ్య ఎత్తుగా,

తోక:- పొడవుగా, నెంద్రుకల కుచ్చు కలదిగా

గంగడోలు:- సన్నగా పంఖచగా, రొమ్ము భాగం వరకు వ్రేలాడుతూ

కాళ్లు:- బలంగా పొట్టిగా ఒకదానితో ఒకటి కొట్టుకొనకుండా

రంగు:- సామాన్యంగా తెలుపు లేక బూడిదరంగుగా వుటుంది.

## కిర్‌కత జాతి

ఇది ఉత్తరప్రదేశ్‌లో కెన్ నదీ ప్రాంతాలలో బంద్ జిల్లా యందు ఎక్కువగావుంది. ఇంకను పన్నా, జిజిగల్, చర్కారి. అజైగర్ స్టేటులలోకూడ ఈ జాతివుంది.

ఆకారము చిన్నదిగా, బలముకలిగి కాళ్లు కురచవిగా, గిట్టలు గట్టిగా, లోతుముఖము, కొనతేలిన కొమ్ములు కలిగివుంటుంది.

## గుంసూరు జాతి

గంజాం జిల్లాకు ఉత్తరభాగాన ఈజాతివుంటుంది. ఇవిమిక్కిలి చురుకుదనంగా, దృఢంగావుండి కష్టపడి పనిచేస్తాయి.

## లక్షణాలు

**తల:**— చిన్నదిగా చదనుగా, చక్కనిముఖంకలిగి.

**నొసలు:**— వెడల్పుగా,

**నేత్రాలు:**— విశాలంగా.

**కొమ్ములు:**— ముందుకుగాని వెనుకకుగాని వంగి.

**మూపురము:**— బాగాపెరిగి.

**శరీరము:**— చతురంగా దట్టంగా, మంచి రొమ్ముముకలుకలిగి, దృఢమైన నడుము గలిగి.

**గంగడోలు:**— పలుచగా రొమ్ముముకవరకు వ్యాపించివుంటుంది.

## కపిలియనుజాతి

కంభం ప్రాంతాలలో కపిలియనులు అనేజాతివారు ఈపశువులను పెంచెదరు. ఈజాతిచురుకుగా, మిక్కిలి ఓర్పుతోవుండి బండ్లులాగుతాయి. ఆవులనుంచి పాలుతీయరు ఈజాతిపశువులు చచ్చినయెడల కోతకోయక పాతివేస్తారు. మందపశువులకు ఆదర్శముగావుండే పశువును పశురాజు లేక పల్లడుపశువుఅంటారు.

## కేరిఘుర్ జాతి

ఉత్తరప్రదేశ్ లో కేరిఘుర్ ప్రాంతాలలో ఈజాతి వుంది. చక్కని నేత్రాలు, నిలువైన కొమ్ములు, సన్నని ముఖము, కురచ చెవులు, పొట్టి మెడ, మంచిమూపురము, పొడుగాటితోక కలిగి వుంటుంది. రంగు తెలుపుగావుండి అన్ని ప్రాంతాలలో తిరిగి మేసే అల వాటు ఈజాతికివుంది.

## బ్రాహ్మణ జాతి

స్థితిపరు లందరు తమ తమ బంధువులు చనిపోయి నపుడు ఆ గ్రామములో నున్న మంచి స్వచ్ఛమైన, అన్ని లక్షణాలు వున్న తెలుపురంగు గల కోడెను వెదకి దానిని ఈశ్వరార్పణ చేస్తారు. ఆ తర్వాత దూడను స్వేచ్ఛగా ఎటువంటి పొలాలలోనైనా మేయుటకు అచ్చుపోసి ఆబోతులుగా విడిచేటట్లు ఏర్పాటు చేస్తారు. అచ్చుపోసి విడువబడే ఆబోతు ఉత్తమోత్తమ మైన వృషభంగా వుండాలి. ఈ జాతిని గూర్చి శాస్త్ర సాంప్రదాయాలు భారతాది గ్రంధము లందు సమస్త ధర్మ శాస్త్రములందు వుంటుటచేత గ్రామంలో పురోహితం చేయుచున్న వారిని అడిగిన వాని విషయాలన్నీ చెబుతారు. కాని క్రమముగా దానియందుండే భక్తి తగ్గి వీలయినంత తక్కువ ధరలో దొరికే ఏ కోడెనునైనా తీసికొనివచ్చి ఆబోతులుగా చేయ ప్రారం భించుటచేత సంతతి దుర్బలమగు చున్నది. స్వచ్ఛమయిన జాతిఆబో తును బ్రాహ్మణ జాతి కోడె అంటారు. ఈ జాతి అమెరికాలో పేరు ఎంతోగాంచింది.

## సింధిజాతి

ఈ జాతి జంతువులు పాలలోను. బలిష్టంలోను, సున్నితం లోను, మన భారతదేశములో ప్రఖ్యాతి గాంచినాయి. ఈ జాతి అన్ని వాతావరణములకు తట్టుకుంటుంది, గాని ఉష్ణప్రదేశాలలో మాత్రం

జాగ్రత్తగా కాపాడాలి. ఇవి సింధులోయలోను, పశ్చిమ ప్రదేశమందును, కరాచి, హైదరాబాదు ప్రాంతాల లోను కనబడుతున్నాయి. ఈ జాతి పశువులు పాడికే గాక పనికి గూడ ఎంతో ఉపయోగ పడుతాయి. ఒక్కొక్క ఈతలో 3 వేల పౌనుల పాలవరకు యిచ్చే సాంప్రదాయం గల ఆవులున్నాయి ఎద్దులు మాత్రము పని పాటలకు పనికి వస్తాయి.

## లక్షణాలు

తల:- కురచగ,
నొసలు:- వెడల్పుగ,
చెవులు:- కొంచము వాలి, పెద్దవిగా
కన్నులు:- విడిగా, కాంతిగా
కొమ్ములు:- సామాన్య కురచగ పొట్టిగ, మందముగా, ప్రక్కలకు పైకితిరిగి
మెడ:- పొట్టిగ, లావుగ
శరీరము:- వెడల్పుగ, పొంకముగ, కురచగ వుండే కాళ్ళపై అమర్పబడి
గంగడోలు:- బొడ్డును వ్రేలాడుతూ ముడుతలు పడి మృదువుగా
మూపురము:- మధ్యపరిమాణంగా, నలుపురంగు కలిగి,
తోక:- పొడవుగా, అందముగా, నలుపు రంగు కల కుచ్చుకలిగి
కాళ్ళు:- బలముగల ఎముకలు కలిగి మధ్యరకంగారుగా
రొమ్ము:- వెడల్పుగ, లోతుగా వుంటుంది.

## పంజాబు జాతి

ఈజాతినే మాంట్‌గొమెరిజాతి అంటారు. ఇవిపంజాబులో జన్మించి అమృతసర్, లైలాపూర్, లాహోర్, కానెవల్ ప్రాంతాలలో పెంచబడుతున్నాయి. ఈజాతి మనదేశములో మంచిప్రఖ్యాతి

గాంచినవి. ఈజాతిఆవులు ఒక్కొక్కయీతకు 45 వేల పౌనులని తేలింది. గిత్తలను రెండున్నర మూడుసంవత్సరాల మధ్యవయస్సులో పనులు చేయించుదురు.

## లక్షణాలు

తల:- కురచగ
నొసలు:- వెడల్పుగా, ఉన్నతమైనదిగా
కన్నులు:- కాంతిగా, విడిగా,
మూతి:- వెడల్పుగా
చెవులు:- పెద్దవిగా కొంచెమువాలి
మెడ:- పొట్టిగా
కొమ్ములు:- సామాన్యకురచగ, మందముగా
శరీరము:- దళసరిగా, చిన్నదిగ, వెడల్పుగా
గంగడోలు:- కండరాలతో ముడతలుపడి బొడ్డువరకు వ్రేలాడుచూ
మూపురం:- మధ్య పరిమాణముగ,
తోక:- పొడవుగా నుండి వెంట్రుకల కుచ్చు నేలనుతాకుచూ
కాళ్ళు:- పొట్టిగ బలముగా
రంగు:- ఎరుపు లేక నలుపు ఎరుపుకలసిన రంగుగా వుంటుంది.

## నాగపూరు జాతి

ఇవి నాగపూరులోనేగాక ఉత్తర హిందూస్థానములో అచ్చటచ్చట ఉన్నవి. ఇవి చూపులకు బలహీనంగా వుండి ఎక్కువ వేగముగా పరుగెత్తగలవు. వీటి కొమ్ములమధ్య ఉబ్బెత్తుగా వుంటుంది. మూపురము మాత్రము ఎత్తుగా అందముగా వుంటుంది ఇవి అరువదిఆరు అంగుళాల ఎత్తువరకు పెరుగుతవి,

## హరియానా జాతి

డిల్లీప్రాంతమందును, పంజాబురాష్ట్రింలో రోటక్, హిస్సార్ గుర్గావ్ జిల్లాలలోనేగాక, ఆల్వార్, భరతపూగు ప్రాంతాలలోను ఈ జాతిపశువులు వున్నాయి. కలకత్తా తదితర పట్టణాలకు ఈ జాతి ఆవులను పాడికొరకు ఎగుమతిచేస్తారు. పాడికి మాత్రిము వంచివి. ఈ జాతిపశువులు దుక్కి దున్నుటకు, బండ్లులాగుటకు చాలామంచివి. తెలుపు, మైల వన్నెరంగు కలిగి మట్టసరిగా వుంటాయి.

## దేవ్రని జాతి

ఇవి హైదరాబాదు రాష్ట్రిములో వున్నవి. ఎద్దులు రేగడినేల లలో వ్యవసాయమునకు పనికివస్తాయి. ఇవి కథియవాడ్లోని గిరిజాతి పశువులను పోలివుంటాయి. ఇవి నలుపు తెలుపుగాని ఎరుపు తెలుపు రంగు గాని వుండి శరీరమంతా మచ్చలుమచ్చలుగా వుంటవి, ఆకుల వలె పొడుగాటి చెవులు, లోతైనరొమ్ము, చక్కని పక్కటెముకలు బలముగల కాళ్లు పాదాలు, ఉన్నతమైన మూపురము కొరడావలె పొడుగగు తోక, గొప్ప గంగడోలు బొడ్డు కలిగివుంటాయి.

## ఎర్రఖాందారి జాతి

ఈజాతిహైదరాబాదు రాష్ట్రంలో పర్భిణి, నాందేడ్, ఔరంగ బాద్, బీడ్జిల్లాలలోను, ఉస్మానాబాద్ జిల్లాకొన్ని భాగాలలోను, వుంది. ఇవి ఎర్రసింధుజాతిని పోలివుంటుంది వాటిరంగు సాధారణ గోధుమరంగు, చక్కనిచెవులు, తిరిగినకొమ్ములు, లోతైనరొమ్ము, పొడవగుతోక కలిగి పనిపాటలకు ఉపయోగపడుతాయి.

## కృష్ణలోయ జాతి

ఇవి హైదరాబాదు రాష్ట్రంలో, రాయచూరు, మహబూబ్ నగర్, నల్లగొండ, హైదరాబాదు, గుల్బర్గాజిల్లాలలోవున్నవి. ఇవి

పనిపాట్లకు, పాలకు ప్రసిద్ధి. ఈజాతి బూడిదరంగు కలిగి బలమగు శరీరము, విశాలమైనరొమ్ము, పొట్టిమెడ, చిన్న కొమ్ములు, పెద్దబొడ్డు మంచిమూపురమువంపుతిరిగిన గంగడోలు, తోకపీటముఖ్యలక్షణాలు.

## వహాల్వాజాతి

ఇవి అదిలాబాద్, నిజాంబాద్. కరీంనగర్, మెడక్, నల్లగొండ, జిల్లాల ప్రాంతాలలో వున్నవి. ఇవి వెడల్పయిన రొమ్ము, ముదురు బూడిదరంగు, బలమైనకాళ్ళు, వెడల్పుగలపాదాలు, విశాలమైననొసలు, చిన్న చెవులు, మొనలుతిరిగిన చిన్నకొమ్ములు, నలుపు కుచ్చుతోక, కలిగివుంటాయి.

## తార్పార్కర్ జాతి

ఈజాతి సింధు ప్రాంతమునందున్నది. సహివల్ జాతితో కొంచెము పోలియున్నా సింధుజాతికంటె కొంచెము పెద్దవిగావుంటవి. కాని ఇవిసాధువైనవి. తెలుపురంగుకలిగి 750 నుంచి 950 పౌనుల వరకు తూకముకలిగి యుంటాయి. ఎద్దులు రెండున్నర సంవత్సరాల వయస్సువచ్చినది లగాయతు పనిచేయుంచుతారు.

## లక్షణాలు

తల:- పొట్టిగ

ముఖం:- నిడుపుగా

చెవులు:- పొడవుగా

కొమ్ములు:- దృఢముగా, పొట్టిగా

వీపు:- తిన్నగా, విశాలముగా

పిరుదులు:- ఏటవాలుగా

తోక:- నేలను ఆనుకొని అందమగు కుచ్చుతో వుంటాయి.

## లోహినీ జాతి

ఇది అడవిజాతి. పాకిస్థాన్ సరిహద్దురాష్ట్రిపు ఉత్తరజిల్లాలోను, బెలోచిస్థానంలోను, లుర్లంపజెన్సీ లోను ఈజాతి ఎక్కువగావుంది. ఎరుపు తెలుపు మచ్చల రంగుకలిగి, చిన్నతల, పొట్టికొమ్ములు, పొట్టి చెవులు, పొట్టికాళ్ళు కలిగి ఎంతవేడినైనా, చలినైనా భరించి పని చేస్తుంది.

## గిరి జాతి

ఈజాతినే గిరిలేక కతియవార్ జాతిఅంటారు. ఈజాతిపశువులు రాజపుటానాలో పడమర భాగాన, బొంబాయి రాజధానిలో ఉత్తర ప్రాంతాన, పంజాబు దక్షిణ భాగాన వున్నాయి. ఈ ప్రాంతాలలో పచ్చిక బీళ్ళు జాస్తిగావున్నాయి. ఈజాతి మిగుల పౌరుషవంతమైనవి. క్రూరమృగాలచేష్టలు లక్షణాలు వీటికి యుండుటచేత రైతులు తమ యిండ్లదగ్గరనే యుంచుకొని కాపాడుతారు. పూర్వం ఈ జాతి పశువులను యుద్ధాలలో ఉపయోగించేవారు. నాలుగైదు ఎద్దులు కలిసి ఎటువంటి పులినైనా, సింహాన్నినైనా చంపగలవు.

## లక్షణాలు

చెవులు:- మిగుల పొడవుగ, మెలికలు తిరిగి వంగి వ్రేలాడుతూ

ముఖము:- నిద్రమత్తుగా వున్నట్లు

నొసలు:- ముందుకు పొడుచుకు వచ్చినట్లుగా కన్నుల దిగువ భాగం నుంచి ముఖముసన్నముగా కాంతిగా వుంటుంది,

తల:- ముడుతలు పడి చివర ఆకువలె వ్రేలాడుతూ లోపలి భాగం పైకి కనబడుతూ వుంటుంది.

వెన్ను:- బలముగా సూటిగా వృద్ధాప్యం వచ్చిన పశువులమూదిరిగా వీపు వంగి వుంటుంది,

తోక:- పొడవుగ నుండి కుచ్చు నేలను తాకుతూ కొరడా వలె వుంటుంది.

గంగడోలు:- ఎక్కువగ విస్తరించి సామాన్య పొడవుగ

కొమ్ములు:- స్థూలముగ నొసటి భాగపు వెనుక, బయటకు పొడచుకొని వచ్చి తరువాత పైకి పోయి లోపలకు వంకర తిరిగి చివర కొన భాగములు వెనుకకు తిరిగి యుంటాయి. శరీరము కొమ్ములు రంగు రంగుల మచ్చలు కలిగి వుంటుంది.

## భగ్నారి జాతి

ఈ జాతి పుట్టుక బెలూచిస్థానంలోని జకోబాబాద్‌కు ఉత్తరంగా భాగ్‌లోని సింధురాష్ట్రపరిసరాలలోని వని తెలియుచున్నది.

ఈ జాతి ఆవులు పాలు బాగుగా యిస్తాయి.

## లక్షణాలు

తల,ముఖము:- సామాన్య వెడల్పుగ

మెడ:- నిడుపుగా కురచగా

చెవులు:- మొనలు తేలి,

పృష్ఠములు:- బలముగా, ఏటవాలుగా

వీపు:- నిడుపుగా,

రంగు:- తెలుపుగా లేక బూడిదరంగుగా, మెడమూపురం భుజాలు ముదిరిన రంగుగాగాని లేక నలుపురంగుగాగాని వుంటుంది.

## జోధపూర్ జాతి

దీనినే తెల్లసింధుజాతిఅంటారు. ఇవిమధ్య రకపు ఎడారులలో వుంటాయి. నైఋతీసింధులోను, కచ్చి, జోధపూర్, జైసల్‌మీర్ లోను వుంటాయి, ఇవి తెలుపుగా, మైలరంగుగా వుంటాయి. దూడల

వెన్ను పైన ఎరుపు గీత వుంటుంది. ముఖము పొడవుగా. తోక కురచగా, కాళ్ళు గట్టిగా, ఎముకలు ధృఢముగా వుంటాయి.

## హల్లీకారు జాతి

ఈజాతి పశువులు ముఖ్యంగా మైసూరులోని తుంకూరు, హాస్సాను, మైసూరు, బళ్లారి ప్రాంతములందు వున్నవి. వీటిలో అనేక రకాలు వున్నవి.

## లక్షణాలు

**తల:–** మంచి ఆకారముగా పొడవుగా

**నొసలు:–** మధ్యభాగాన నాగటిచాలు మాదిరిగావుండి ఇరుపైపులా ఉబికి

**కొమ్ములు:-** తలమధ్యపుట్టి వెనుకకు ప్రక్కకువంగి, చివరసూది మొనలుగా వుంటాయి ఈకొమ్ములను బట్టియే వాటిమంచి చెడ్డలను పరీక్షిస్తారు.

**చెవులు:–** పొడవుగా నిక్కబొడుచుకొని,

**కన్నులు:–** విశాలముగా మృదువుగా, మెడపొట్టిగా, మందముగా

**శరీరము:–** లోతుగ, ప్రక్కయెముకలు దట్టముగా బలమగు భుజాలు కలిగి

**తోక:–** పొడవుగా, చివరనలుపు వెండ్రుకలుగల కుచ్చుతో

**కాళ్ళు:–** గట్టిగా, పెద్దవిగా

**గిట్టలు:–** చిన్నగా చక్కగా

**రంగు:–** నలుపుగా, మైలవన్నెగా లేక గోధుమరంగుగా వుంటుంది.

## వడియర్ జాతి

మన దేశములో ఇదికూడ ఒక మంచిజాతి, థార్‌పార్కర్ ప్రాంతాల, అహమ్మదాబాద్ ప్రాంతాలలోను, కచ్చికి ఆగ్నేయము

గాను, బొనాస్, సరస్వతీ నదుల ప్రాంతాలలోను ఈజాతివుంది. ఇవి త్వరగా పరుగెత్తగలవు. ఈజాతినే కాంక్రేజ్ జాతిఅంటారు. కొమ్ములు గట్టిగా నిలువుగా, మంచిమూపురము వెడల్పయినరొమ్ము, పెద్ద చెవులు, మైలవన్నె లేక తెలుపువన్నె కలిగి వుషారుగా వుంటుంది.

## బరగ్నూర్ జాతి

ఈ జాతి కోయంబత్తూరు జిల్లా బర్గూరు కొండల ప్రాంతము లందు ఎక్కువగావున్నవి. ఇవి మైసూరు జాతిని పోలివుంటాయి. ఇవి ధైర్యంలోను శక్తిలోను సాహసించుటలోను, వేగంలోను ప్రసిద్ధి. ఇవి కొండజాతి యగుటవలన మూర్ఖముగా వుంటాయి.

## లక్షణాలు

తల:- అందంగా, పొడవుగ ముట్టెవరకు వ్యాపించి
నొసలు:- ఉబికి,
కన్నులు:- చూచుటకు భయంకరంగా
చెవులు:- ఒక మాదిరి పొడవుగ నుండి, నిక్కపొడుచుకొని,
మెడ:- పలుచగ చిన్నదిగా
శరీరము:- వంగి రొమ్మెముకలు దట్టముగా
పాదాలు:- గట్టిగ, చిన్నవిగ
రంగు:- తెలుపులో ఎరుపు, ఎరుపులో తెలుపు, తెలుపులో బూడిద రంగుగా వుంటాయి.

## ధంగి జాతి

ఇది అహమ్మదాబాద్, నాసిక్, బన్సాదా, జొహార్, డంగ్సు స్టేట్ ధర్మపూర్ ప్రాంతాలలో నున్నాయి. కొమ్ములు కురచగా పొట్టి చెవులు పొట్టిగ లావుగా వుండే కాళ్ళు, మెరుపుగల చర్మము ఎరుపు తెలుపు కలిసిన రంగు కలిగి వుంటుంది.

## దియోని జాతి

ఈజాతి హైదరాబాదు పశ్చిమాన పశ్చిమఉత్తరాన, విరివిగా ఉన్నవి. బొంబాయి రాష్ట్రంలోని డాంగిజాతిని పోలి వుంటాయి. ఎద్దులు వ్యవసాయంలో ఎక్కువ నేర్పరి తనంతో యుంటాయి. ఇవిసాధారణంగా కధియవాడులోని గిరిజాతిని పోలివుంటాయి.

## లక్షణాలు

నొసలు:- కొంచెము ఉబ్బెత్తుగాను.
కొమ్ములు:- బయటకుకొంచెమువంగి,
చెవులు-: నిడుపుగ వంగియు,
రొమ్ము:- లోతుగా,
బరిఎముకలు:- బాగావంపుతిరిగి,
మూపురము:- బాగా ఎదిగి,
తోక:- నేలకు తాకునట్లుగా,
గంగడోలు:- పెద్దదిగా. జానుబొడ్డుగలదిగా.
శరీరంరంగు:- తెలుపుమచ్చలుకలదిగా వుంటుంది.

## గ్యేలో జాతి

మధ్యప్రదేశ్, వార్ధాప్రాంతాలలో ఈజాతివుంది. చిన్నవిగా, ఎత్తుతక్కువగా, చెవులు, మెడకురచగా, తల ముఖము నిడుపుగా, మూపురముబలసినదిగా, గంగడోలుపెద్దదిగావుంటుంది.

## ధన్నీ జాతి

ఈజాతి పశ్చిమోత్తర రాష్ట్రంలో కట్టక్, పంజాబ్ లో జహిలం. రావల్ పిండి ప్రదేశాలలో పెంచబడుతున్నవి. చురుకుదనంలోను, దున్నుటలోను, ఈ జాతి ప్రాముఖ్యత వహించినది.

## లక్షణాలు

తల:- సామాన్యముగా
నొసలు:- అందంగా
కొమ్ములు:- మూపురము దగ్గర వరకు మెడను తాకుతాయి.
చెవులు:- సున్నితముగ, పొట్టిగ
గంగడోలు:- పలుచగ వెన్ను భాగము పొడవుగ
డెక్కలు:- పలుచగ, చిన్నవిగ
తోక:- నల్లని కుచ్చుతో గుదికాళ్ళవరకు వ్రేలాడుతూ
రంగు:- ముఖములోను, గంగడోలు పైన శరీరము యొక్క క్రింది భాగాన లేతబూడిద రంగుమచ్చలు వుంటాయి.

## అలంబాడి జాతి

మైసూరుస్టేటు దగ్గరగావున్న మదరాసురాష్ట్రంలోని వుత్తర కోయంబత్తూరు జిల్లాలలోను, ఉత్తర సేలంజిల్లాలోను ఈజాతి వుంది. ఇవి బండిలాగుటకు మోటుపని చేయుటకు ప్రసిద్ధికి ఎక్కినవి. ఈజాతి ఆవులుమాత్రం పాలుఅంతగా ఈయవు.

## లక్షణాలు

తల:- సామాన్యపొడవుగా,
కొమ్ములు:- చిన్నవిగా
చెవులు:- చిన్నవిగ,
మూపురం:- చిన్నదిగా
చర్మము:- వదులుగావుండక బిగువుగా
రంగు:- తెలుపు శరీరంపై నల్లని మచ్చలుగాని, ఎరుపు మచ్చలుగాని ఈమచ్చలు కొన్ని పశువులలో శరీరము అంతా సమానంగా గాని వుంటాయి.

## కిల్లారి జాతి

బొంబాయి రాష్ట్రపు దక్షిణ భాగంలో వున్న షోలాపూర్, సతారా జిల్లాల్లో పెంచబడు ఈ జాతి పశువులు ప్రసిద్ధి గాంచినవి. అమృతమహల్ జాతి నుంచి ఉద్భవించినను వాటంతచూసుకుదనం లేదు, ఉత్తరదేశ మందలి తెలుపు పశువుల నెత్తురు కూడ ఈ జాతి యందు వుంది

### లక్షణాలు

తల:– మైసూరు ఎద్దులవలె దట్టమగు తల కలిగి వుంటుంది గాని అంత ప్రాముఖ్యత వుండదు.

నొసలు:–సన్నముగా,

గంగడోలు:– విస్తరించి

తోక:– గుదికాలునకు కొంచెము క్రింద వరకు వచ్చి నలుపు రంగు గల కుచ్చుతో వ్రేలాడుతూ వుంటుంది.

## కృష్ణవెలీ జాతి

ఈ జాతి కృష్ణానదీ ప్రాంతాన బొంబాయి రాష్ట్రి దక్షిణాన హైదరాబాదు ప్రాంతాన వుంది.

### లక్షణాలు

శరీరము:– పొడవుగా, లావుగా

రొమ్ము:– బలముగ వెడల్పుగా

మెడ:– కురచగా, బలముగా

తల:– వుండవలసినదాని కంటె చిన్నదిగా

నొసలు:– సామాన్యముగా

కొమ్ములు:- బయటకు వంకరలుతిరిగి చిన్నవిగా
మూపురము:- బాగుగా విస్తరించునదిగా
చెవులు:- చిన్నవిగా, మొనలుతేలి వంగి
తోక:- గుదికాలునకు సగముదూరముగా వచ్చి నలుపురంగుగల కుచ్చువెంట్రుకలతో సామాన్యమైన పొడవుగా వుంటుంది.

## పహివాల్ జాతి

ఈజాతి పంజాబురాష్ట్రం సాగునీటికి తీసికొనిరాకపూర్వము, దక్షిణ మధ్యభాగములోవున్న మెట్టభూములలోను, అడవులలోను, నదిగట్లమీదను తిరుగుతూ మేస్తువుండేవి ఈజాతిపశువులకు ఉత్తర పడమర ప్రదేశాలలోవుండే భగ్నారాస్, హరియాన, నాకోరస్, ధన్నీసు జాతులు రకంలో కొంచెము తేడా కన్పించుతుంది.

## లక్షణాలు

తల:- వెడల్పుగా,
శరీరము:- అందముగా,
మూపురం:- లావుగా,
గంగడోలు:- పెద్దదిగా,
తోక:- బాగుగా నేలకుతగులునట్లుగా,
రంగు:- కొంచెము ఎరుపుకూడిన కపిలరంగుకలదిగా,
చర్మము:- అందముగా నునుపుగా వుంటుంది,

## పుంగనూరు జాతి

ఈజాతి చిత్తూరుజిల్లా పుంగనూరు ప్రాంతాలలోవుంది ఇవి చిన్నజంతువులు అయినప్పటికి పాలుఎక్కువగా యిస్తాయి. పనిపాటలకుకూడ ఉపయోగపడుతవి. ప్రభుత్వం ఈజాతిని పెంపొందించడానికి ప్రయత్నిస్తూంది.

## లక్షణాలు

తల:- పెద్దదిగా
మెడ:- బలంగా పొట్టిదిగా
కన్నులు:- లేడికన్నులులాగా
చెవులు:- సూటిగా చిన్నవిగా
గంగడోలు:- రొమ్ము వరకు వ్యాపించి
కాళ్ళు:- కురచగ బిగువుగా
తోక:- పొడవుగా క్రిందకు వ్రేలాడుతూ వుంటుంది.

## దున్నలు - గేదెలు

భారతదేశములో పాడి కరువైనదనీ, మంచిజాతిగల పాడిగేదెలు ఎచ్చటదొరకునాయని రైతులు ఆతురతపడుతూ వుంటారు. అందులో ముర్రాజాతిగేదె అంటే రైతులకు ఈకాలంలో మోజు ఎక్కువైపోయింది.

ఆంధ్రదేశంలోకూడా ఈజాతిని అచ్చటచ్చట తదితర ప్రాంతాలనుంచి తెప్పించి పాడికి వినియోగించుతూ వాటిమంచి చెడ్డలను పరిశీలించుతూ అప్పుడప్పుడు వ్యాసాలద్వారా, అనుభవంద్వారా రైతులకు తెలుపుతున్న కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా నూజెళ్ల వాస్తవ్యులు సుప్రసిద్ధరైతుబిడ్డ భూస్వామియగు శ్రీ పర్వతనేని వెంకటరత్నంగార్ని, గుడ్లవల్లేరు రైతులను యిచ్చట పేర్కొనతప్పదు.

ఈ జాతిగేదెలు హరియానా ప్రాంతాలలోను, రోటక్, హిస్సారు జిల్లాలలోను, స్వచ్ఛమైనజాతి పాకిస్థాన్‌లోను, ఉత్తర ప్రదేశ్‌లోను, భారతదేశములో గంజాంజిల్లాలోను, పర్లాకిమిడి ప్రాంతాలలోను వున్నాయి.

ఈజాతిగేదెలు కొమ్ములు మెలికలుతిరిగి చూచుటకు భయంకరముగా, ముద్దుగా డాబుసరిగా వుంటాయి మెడమాత్రం పొట్టిగా,

తలచిన్నదిగా ముక్కురంధ్రాలు వెడల్పుగా, రంగు కపిలగోవురంగుగా శరీరము నునుపుగా మెరుపుగా తొంటిభాగము వెడల్పుగా, వీపు విశాలంగా, కసువుపెద్దవిగా, తోకపొడవుగా వుండిపెద్ద బడాయిగా నడుస్తుంది. ఈగేదెలు పాలకు ప్రశస్తము.

## చుక్క దున్నలు

ఇవికూడా ముర్రాజాతికి పుట్టినవే. దీనిముఖాన తెల్లచుక్క వుండుటవల్ల చుక్కదున్నలంటారు. వీటికొమ్ములు పొడవుగావుండి చివరవంపులు తిరిగి వుంటాయి. తలమాత్రం పెద్దదిగా, బరువుగా వుంటుంది. ఈ జాతిగేదెలు మాత్రం పాలుబాగాయిస్తాయి. పొదుగు మాత్రం కామధేనువు పొదుగుగా వుంటుంది.

## తోడాదున్నలు

నీలగిరికొండలకు పోవువారందరకు ఈదున్నలను గురించి తెలిసియేవుంటుంది. అచ్చట వుండేప్రతితోడావానికి ఒక మందవుంటుంది. ఈ దున్నలు తల వంచుకొని నడుస్తాయి అవి నడచేటప్పుడు చూస్తే భయంకరమైన కుక్కలవలె కనపడతాయి. మొదటి భాగమందు, మెడభాగమందు, మూపురము, వెన్ను భాగములందు వెంట్రుకలు మాత్రం దట్టంగా వుంటాయి వాటిని అనవసరముగ తాకితే అపాయము కలుగచేస్తాయి. క్రొత్తమనుష్యులను చూడగనే తలపైకెత్తి కొంతదూరము వెనుకకు పరుగెత్తి, మరల నిలబడుచూ తాను చూచిన మనుష్యుని గుర్తించుకొని తలను పైకెత్తుచూ లేడివలెనాటక మాడుచూ ఇంకాకొన్ని దున్నలను ప్రోగుచేసకొని ఆ మనుష్యుని పొడుచుటకుదండెత్తి వస్తాయి. ఒక్కొక్క సమయంలో ఆ సమూహమంతా ఒక్కసారి ఉద్రేకత చెంది, తలలు క్రిందకు వంచి, అవిదేనిని చూచి కోపంగ వుంటాయో దాని మీదకు దుమికి చంపుతాయి. ఈ రీతిగ పులులు భయంకర జంతువులు తమ జోలికి వస్తే చీల్చి చెండాడుతాయి.

## జాఫర్‌బాడేజాతి

ఈ దున్నలు కథియవారు ప్రాంతాలలో వుంటాయి. ముర్రా జాతి కంటే తల మెడ పెద్దవిగ నొసలు విశాలముగ, ఎత్తుగ, కొమ్ములు మెడ, ప్రక్కకు వంగి వుంటాయి గేదెలు బాగా పాలిస్తాయి.

ఈరీతిగ సుర్టీ, నాలి, మెహానా, రావి, నాగపూరు అను రకాల వివిధ జాతులు గలవు. ఈగ్రంథములో ఈ పశుజాతుల విషయమై వ్రాయాలంటే పశు విజ్ఞాన సర్వస్వమని రెండు వేల పేజీల వరకు వ్రాయవచ్చు కాని యిట్టి గ్రంథకర్తను ఆదరించేవారు కన్పట్టలేదు.

# ఆ ర వ భా గ ము

## విదేశీయ - పశుసంపద

## బ్రిటనులోని పశుసంపద

ప్రపంచములోనున్న జంతువులన్నియు అడవిజంతువులేఎంతో కాలానికిగాని ఈజంతువులు సాధుత్వానికిరాగలిగాయి. ఆకాలములో అవిఏరీతిగా మనకు ఉపయోగపడినవో, ఏరీతిగా ఈ ప్రపంచంలోకి వచ్చినవో మనకు తెలియదు. ఇంకను యూరప్ దేశంలో 8000 సం॥ క్రిందటివరకుకూడ ఈ పశువుల సంగతి మనకు తెలియదని చెప్పాలి. ఈఅడవిజంతువులు ప్రారంభదశలో బోస్‌ప్రిమినియస్, బోసులాంగి ఫ్రాన్సు అని రెండురకాలుగా వుండేవి. పూర్వము బ్రిటను దేశములో పశువుల ఎముకలతో రకరకాల ఆయుధాలుతయారుచేసి జంతువులను వేటాడేవారు. ఈ వేటాడుట క్రొత్తరాతి, పాతరాతి యుగాలలోవచ్చిందని చరిత్రలు తెలుపుచున్నాయి. పాలకొరకు, మాంసం కొరకు పశువులను ఉపయోగించుట ప్రారంభించారని రోమనులు తెలుపుచున్నారు. రోమనులు మాత్రము తమపశువులను తమబిడ్డల కంటె ఎక్కువగా చూచుకొనేవారు. తెల్లవాళ్ళు పశుసంపదను

వృద్ధిచేయుటలో ముందంజవేసి, ప్రపంచములోని అన్ని ప్రాంతాలకు పోయి తమజాతి పశువులను ఆదేశప్రజలు దిగుమతిచేసుకొన్నారు. ఎక్కువపాలకొరకు, మాంసానికి పనికివచ్చే పశువులను అమెరికాకు ఎగుమతిచేసి ధనాన్ని సంపాదించిధనవంతులయ్యారు. బ్రిటన్ దేశంలో వున్న పశుజాతులు ఏదేశంలోనులేవనియు, ఈవిషయమై బ్రిటిష్‌వారు చాలాగర్వింతురని ఒకపశువైద్యుడు తెలిపాడు, ఇంగ్లండు చల్లనిదేశమగుటవల్లను, చక్కని గడ్డిజాతులు పెరుగుటవల్లను, శీతోష్ణస్థితి అనుకూలంగా వుండుటవల్లను, నేల సారవంతమగుటవల్ల పశుసంపద వృద్ధిఅయింది.

## అడవి జాతి పశువులను మచ్చిక చేసుకొనుట

బ్రిటను దేశంలో నార్తంబర్ లాండులో ఒక భాగమైన బెల్ఫోర్డు దగ్గరగానున్న చిల్లింగ్‌హాం పార్కులో ఈ జాతిపశువులు వుండేవి. ఈ జాతిపశువులు ప్రారంభములో పుట్టగానే మీగడవలె తెలుపుగాను, కొమ్ములు తెలుపుగాను, ముక్కు రంధ్రాలు, గిట్టలు నలుపుగా వుండేవి. "సీడకుడిబెల్లోగాలికో" అను నతడు ఈ అడవిపశువులను వేటాడి ఎక్కువగా మచ్చిక చేసుకొని పెంచేవాడు. ఈ జాతి పశువులు మంచిబలము, రోషంగలవగుటవల్ల ఈతను వేటాడుటకు ఎంతో భయపడే వాడట. వాటిని పట్టుకొని కొన్ని నెలలుబోనులలో నుంచేవాడట.

చిల్లింగ్‌హాంజాతి అడవి పశువులుమాత్రము మనుష్యులను చూడగానే భయపడి పారిపోతాయి. దూడ పుట్టగానే తల్లి ఎల్లప్పుడూ దూడ దగ్గరనే యుండి శత్రువులు దొంగిలించకుండా కాపలా కాయునట. అడవిఎద్దులను పట్టుకొనుటకు వేటగాళ్ళు ఎంతో ప్రయత్నించి విఫలులైనారట.

పూర్వం భూమిని ఎద్దులచేత దున్నించినారని చరిత్రకారులు తెలుపుతున్నారు. 150 సంవత్సరాలనుంచి ఎద్దుల కంటే గుఱ్ఱాలు తొందరగా దున్నునను యుద్దేశ్యముతో ప్రారంభించారు. ఇంకను

గుఱ్ఱాలకంటె తొందరగా దున్నే ట్రాక్టర్లను యంత్రాలను ఉపయోగించు తున్నారు.

## బ్రిటన్‌లో ససెక్స్ మంచి జాతి పశువులు

ఈ జాతి మంచి బలంగా వుండి గుఱ్ఱముల కంటె కూడావడిగా భూమిని దున్నగలవట. ఇవి ఇంకను నాలుగు నిమిషాలలో పదహారు మైళ్ళ దూరము యెక్కువ బరువు మోసుకొని పోయేవట. కాని ఈ కాలములో ఈససెక్సు జాతిని యిట్టి పనులకు నుపయోగించుట లేదట. 18 వ శతాబ్దము నుంచి ఈ జాతి పశువులకు ఎక్కువగా కొవ్వు పట్టుట వలన మాంసము కొరకు ఉపయోగించుతున్నారు.

## ఇంగ్లండు

ఈదేశము చిన్నదియగుటవల్లను, పచ్చికబయళ్ళు ఎక్కువగా యుండుటవల్ల పశుసంపదను ఎక్కువగా అభివృద్ధిపరుస్తున్నారు. ఇచ్చట మాంసముకూడ చవుకగా దొరుకుతుంది. అమెరికాలో వున్న పశువులన్నియు యిదివరకు బ్రిటన్ నుంచిదిగుమతి చేసికొనినవేనట. వీటిలో షార్తారన్, హియర్‌ఫోర్డు, పోల్డు యాంగస్, జాతులు ముఖ్యమైనవి. అమెరికాదేశాన్ని కొలంబస్ కనిపెట్టినపుడు రెండవ పర్యాయం తనదేశాన్నుంచి తనపశువులను తీసుకొనివచ్చి అచ్చట వారికి అమ్ముతూ వచ్చేవట. ఇప్పుడు అమెరికాలో ఈకొలంబస్ తెచ్చిన స్పానిష్ జాతికూడావుంది.

## పాలఉత్పత్తి

ఈకాలంలో బ్రిటిష్‌వారు ఆవులనుపాలకొరకు పెంచుతున్నారు వానిమేతకొరకు పచ్చికబీళ్ళను ఏర్పాటు చేస్తున్నారు. ఇంగ్లండులో చలికాలంలో పచ్చికపెరగడానికి అవకాశంలేనందున చెట్లఆకులు, ఎండుగడ్డి, కృత్రిమపదార్థాలు మేపుతుంటారు శీతాకాలంలో ఆవులు

ప్రతిరోజూ సగటున మూడుగ్యాలనుల పాలుయిస్తాయి. ఈకాలంలో ఒకటిన్నరభాగం ఎండుగడ్డి, నాలుగుభాగాల చెట్లఆకులు, ఒకటిన్నర భాగం కొబ్బరిపిండి లేక దాణావస్తువులు మేపుతారు. ఇంకను వేసవి కాలంకన్న ఈకాలంలో పాలను ఎక్కువ వాడుతారు

ప్రతి సంవత్సరానికి తనఆవులనుంచి 700 లేక 1000 గ్యాలనుల పాలను పొందుతాడు. రైతులు ఖరీదుగల మేతను యిచ్చి పాడిపశువులను జాగ్రతగా మేపుతారు. రోజునకు రెండుసార్లే పాలు పితుకుతారు. ఇంకాఎక్కువగా యిచ్చేజాతులను మూడు పూటలా యంత్రాలద్వారాగాని, చేతులతోగాని పితుకుతారు. బాగుగా మేసే ఆవులు రోజునకు అయిదు గ్యాలనుల పాలు యిస్తాయి.

# ప్రసిద్ధ పశుజాతులు

గ్రిటన్ రైతులకు గుర్రాలమీాద కుక్కల మీాద వున్నంత ప్రీతి పశువుల మీాద వున్నట్లు కన్పట్టదు. మాంసం కొరకు పాలకొరకు మాత్రమే పశువులు పెంచ బడుతున్నాయి. పశువుల చంపి మాంసమును శుద్ధిజెసి డబ్బాలతో పెట్టి తదితర దేశాలకు ఎగుమతి చేస్తారు. అందుచేతనే యింగ్లండులో కసాయి దుకాణాలు, కృత్రిమ సంపర్క కేంద్రాలు ఎక్కువగా వున్నాయి. మాంసానికి పనికివచ్చే పశువులు పాలు తక్కువగా యిస్తాయి దూడలకు కూడ వాని పాలు చాలనందున కృత్రిమ అహార పానీయాలు యిచ్చి మేపి మాంసము కొరకు వధ చేస్తారు. ఇచట ప్రజలు మాంసభక్షకులగుటవల్ల కసాయివారల కాపురాలు ఎక్కువగా వున్నాయి.

## షార్తారన్

ఈజాతిపశువులు ఇంగ్లండులోనున్న ప్రతిజిల్లాలోను పెంచ బడుతున్నాయి రాబర్టు బాక్ వెల్ అనునతడు ఈజాతి పశువులను పెంచుటలో ముందంజవేశాడు. ఈజాతి తెలుపుగాగాని, ఎరుపుగా

గాని వుంటాయి. ఆవులుమాత్రం సరాసరి 700 నుంచి 800 గ్యాలనుల పాలుయిస్తాయి. ఈజాతిఎద్దులుకూడ మిగుల బలముగా వుండుటవల్ల మాంసానికి ఉపయోగిస్తారు. ఈజాతిని యితరదేశాలలో "డర్హాం" జాతిఅని పిలుస్తారు.

## ఐరిష్ జాతులు

ఐర్లండులోకూడ పశుసంపద ఎక్కువగావుంది కెర్రీ, డెక్స్టర్ అనునవి మంచిజాతులు. ప్రతిసంవత్సరము కొన్నివేల పశువులను మాంసమునకు పనికివచ్చే పశువులను ఎగుమతిచేస్తారు. ఐర్లండు దేశములో రైతులకు యిదియొక ప్రధాన వృత్తియైవుంది. కెర్రీజాతి ఆవులపాలనుంచి వెన్న, మీగడ, జున్నును తయారుచేసి రైతులు ఎక్కువధనాన్ని సంపాదించుతారు. గల్లోజాతి పశువులను మాత్రము మాంసముకొరకు వుపయోగిస్తారు. పోల్డుజాతి పశువులకు కొమ్ములు చిన్నవిగావుండుటవల్ల కాస్టిక్ పొటాష్‌తో రుద్దుటవల్ల కొమ్ములు కొంచెము పొడవుగా పెరుగుతాయి. ఈజాతి పశువులు చాలా విచిత్రంగా వుంటాయి.

## వేల్స్ జాతి పశువులు

ఈజాతి పశువులు నలుపురంగుగా నుండి పాలను యెక్కువగా యిస్తాయి. ఇంకను ఈ జాతి ఆవులను. హియర్‌ఫోర్డు ఎద్దులతో దాటిస్తారు. అందు చేత వీటి మాంసము చాలా రుచిగా వుంటుందట.

## డెవాన్ జాతి

ఉత్తర డెవాన్ జాతి పశువులు మంచి పాలకు, దక్షిణడెవాన్ జాతి పశువులు మాంసము కొరకు వుపయోగిస్తారు.

## ఎయిర్‌షెయిర్ జాతిపశువులు

ఇవి చిన్నవిగా వుంటాయి. మేతతక్కువగా తినిపాలనుజాస్తిగా యిస్తాయి.

## బ్రిటిష్ ఫ్రెజియన్స్ జాతి

ఈ జాతి ఆవులు చాలా పెద్దవిగా వుండిసంవత్సరానికి వెయ్యి

గ్యాలనుల పాలనిస్తాయి. సామాన్య ప్రజలు ఈ జాతిని పెంచుట కష్టము.

## రెడ్‌పోల్ జాతి

నాన్ ఫోల్కు, సఫోల్కు ప్రాంతాలలో పాల కొరకు, మాంసము కొరకు ఎక్కువగా పెంచుతారు.

## హియర్ ఫోర్డ్సు జాతి

ఇవి చూచుటకు చాలా అందంగా వుంటాయి. పాల కొరకు మాంసము కొరకు పెంచుతారు.

## ఇంగ్లీషుఛానల్‌లోని జాతులు

ఈ పశువులు చూడడానికి అందంగా వుంటాయి. కామధేనువు లాగాపొదుగులు వుంటాయి. పసిబిడ్డలకు వాని పాలనువాడిన జీర్ణరోగాలు కలుగుతాయి. వీటిలోజెర్సీజాతి సుప్రసిద్ధమైంది. ఈజాతిచాలా సాధువైనది. పాలుఎక్కువగా యిస్తాయి. ఇంకా వీనిచరిత్ర వ్రాయాలంటే ఎంతోవుంది.

# అమెరికా పశు సంపద

### పురాతన పశు వర్ధకశాఖ

అరువదివేల సంవత్సరాల క్రిందట బాబిలోనియన్, యశిరియన్, యీజిప్టియన్ దేశాలనాగరికతగల దేశాలలో జంతువులకు ప్రాముఖ్యతవుండేదని శిలాశాసనాలపైన వాటిబొమ్మలు చెక్కబడినాయి. గుర్రాలను యుద్ధాలలో వుపయోగించేవారు. గ్రీసులో వ్యవసాయమే ముఖ్యవృత్తిగావుండేది. అలెగ్జాండర్ హిందూదేశాన్ని జయించినపుడు80 వేల రకాల జంతువులను తమదేశాలకు తీసికొనిపోయారు. ఈకాలంలో క్రిస్టియన్ ప్రాంతాలలో పశుసంపద, వ్యవసాయంఅభివృద్ధిలోకి వచ్చింది రోమన్ సామ్రాజ్యంలో "కానిమస్" అనునతడు వ్యవసాయమభివృద్ధిని గూర్చి మహోత్కృష్టమైన గ్రంథాలను పదమూడింటివరకు వ్రాసెనట. 1453లో తురుష్కులుకనస్టాంట్

నోపిల్‌నగరాన్ని ఆక్రమించుటవల్ల వ్యవసాయం మూలపడిపోయిం దట. రైతులుకూడ చాలాబాధపడ్డారు. జంతువులుకూడ క్షీణించి నాయి.

## మధ్యమయుగ పశువర్ధక శాఖ

జర్మనీ, స్పానిష్, ఫ్రెంచి, యూరపుదేశాల నాగరికత వేయి సంవత్సరాలనుంచి అభివృద్ధిచెందుతూవుంది. పశువులు ఎక్కువపాలను యిచ్చేపద్ధతులను, మాంసము కొరకు పశువులను పెంపొందించే విష యాలను పరిశోధించారు. ఇంకను ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీ దేశాలలో లక్షలకొలది గొర్రెలుకూడ అభివృద్ధిచెందినాయి. 12వ శతాబ్దం నుంచి స్కాండినేవియాలోకూడ పశుసంపద అభివృద్ధిగాంచింది 1700 సం॥ లో పశువర్ధకశాఖ ఇంగ్లండులో అభివృద్ధిగాంచింది. రాజులు తమభూములను ప్రజలకుయిచ్చి వ్యవసాయం చేయమనగానే పశు వులకు మంచిగిరాకి కలిగింది. అప్పుడు ప్రజలు వ్యవసాయాన్ని అభి వృద్ధిపరచి పలువిధ ఆహారపదార్థాలను పండించి పశుసంపదను వృద్ధి పరచారు.

స్మిత్‌ఫీల్డు మార్కెట్టులో పశువులను తూకము వేయగా 370 పౌనులున్ను, దూడలు 50 పౌనులున్ను, గొర్రెలు 28 పౌను లున్ను, మేకలు 18 పౌన్లు తూకము వచ్చెనట తరువాత మరల 1790 లోకూడ తూకము హెచ్చెనట. ఈరీతిగా వ్యవసాయాన్ని వృద్ధిపరస్తూ పశుసంపదను కాపాడుటవల్ల పశువులు 800 పౌన్లు దూడలు 180 పౌనులు, గొర్రెలు 50 పౌనులు, మేకలు 80 పౌనులు, తూకంకలిగేటట్లు రైతులు, పశువర్ధక శాఖవారు శ్రమపడ్డారు.

## ఆధునికయుగపశువర్ధకశాఖ

ఇంగ్లండు, యూరపు దేశాలలో ఆధునిక పశుజాతులు ఎంతో వృద్ధిఅయినవనుటకు రాబర్టు బాక్‌వెల్ పరిశోధనలేకారణ మట. జంతువులను, పశువులను పెంచుటవల్లను, గడ్డిజాతులు,

మొక్కజాతులను పెంచుటవల్లను, ప్రపంచానికి ఎంతో లాభంవున్నదని ఈయుగంలో తెలుసుకొన్నారు. పూర్వం అమెరికాలో గుఱ్ఱాలులేవు. ఇచ్చటకువచ్చి స్థిరపడినతర్వాతనే కొందరు గుఱ్ఱాలనుతదితర దేశాలనుంచి దిగుమతిచేసికొన్నారు. అంతకుపూర్వం పశువులు, గొఱ్ఱెలు, మేకలు, మాత్రమే వుండేవి. ఇంగ్లాండు, యూరపుదేశాలలో పశుసంపద అభివృద్ధిని చూచి 1800నుండి 1870 సం॥వరకు పశుసంపదను, 1880లోగుఱ్ఱాల అభివృద్ధిని, 1890లో గొఱ్ఱెలు, మేకలు, కుక్కలు, పందులను అభివృద్ధిచేసే పరిశోధనలు ప్రారంభించారు.

## అమెరికాలో పశుసంపదవల్ల ఆదాయం

1950 సం॥ లోఅమెరికా పశుసంపదవల్ల రాబడి 239 మిలియనుల డాలర్లు. పాలు, వెన్నవల్ల లాభాలు 28 7 మిలియనుల డాలర్లు, గొఱ్ఱెలు, మేకలు, వాటివున్నివల్ల 16 మిలియన్లడాలర్లు, కోళ్ళవల్ల 700 మిలియనులు, ఘోరాలవల్ల 90.1 మిలియన్లడాలర్లు, ఆదాయం వచ్చింది. ఇంకను, పాడి పరిశ్రమ, వెన్న పరిశ్రమలు, స్థాపించి ఎంతో ధనాన్ని సంపాదించుతున్నారు.

## అమెరికాలో కసాయిదుకాణాలు

పూర్వము యిప్పటివలె పెద్దపట్టణాలు లేవు. ఆకాలంలో పశుసంపద కూడా అంతగా వృద్ధి యవ్వలేదు. ప్రపంచ మంతయు ఆదేశ రైతులు సంచారము చేసి జంతువుల ప్రాముఖ్యత తెలిసికొని వాటిని వృద్ధి చేయుట ప్రారంభించారు. రైతుల దగ్గర నుంచి కసాయి వారు జంతువులను కొని వాటిని చంపి మాంసమును ఎగుమతి చేస్తూ ఎక్కువ ధనాన్ని సంపాదించారు. ఇంకను మాంసాన్ని బండ్లలో వేసుకొని యింటింటా అమ్మేతారు. జంతువులను చంపేటప్పుడు కసాయి దుకాణాల మేనేజరు ఇద్దరు లేక నలుగురు కసాయివాళ్ళను కోయుటకు

ఏర్పాటుచేస్తారు. ఇంకను సహకారసంఘాలద్వారా, ఏజెంట్ల ద్వారా మాంసాన్ని అమ్మించుతారు.

## జంతువులమేత

అమెరికాలో పశువులకు ఏ యే మేతలు మేపవలెనో, ఏ యే చికిత్సలు చేయాలో, ప్రాథమిక పశుచికిత్స వల్ల యెంతవరకు లాభమో, మున్నగు విషయాలను యెన్నిటినో పరిశీలించారు. పశువులకు పనికి పచ్చే 30 రకాల మొక్కలను, వాటిలో వుండే క్రొవ్వు పదార్థాలను, విటమినులను కనుగొన్నారు. ఎ. బి. సి. డి. ఇ. ఎఫ్. విటమినులు ఆహారంలో లోపించిన వివిధరకాలరోగాలు వచ్చుచున్నవని కనుగొన్నారు. పచ్చిగడ్డిలో కూడ డి విటమిను వున్నదని గ్రహించారు.

## పశువుల పరీక్ష

పశు పరీక్ష చేయువాడు ఆతని వుద్దేశ్యాన్ని తెలివితేటల వుపయోగించి అనుభవంమీాద చెప్పాలి. పశుపరీక్ష అనేది ఒక కళకాదు. శాస్త్రం కాదు. ఇది లెక్కలలాగా గణితశాస్త్రం కాదు. మన భారతీయశాస్త్రంలాగా సుడుల పరీక్షకాదు, జంతువు మాంసానికి వుపయోగ పడుతుందో లేదో జాగ్రత్తగా తెలిసికోవాలి. ఈ దిగువమూడు సూత్రాలతో పశుపరీక్ష చేయాలి.

పశువులను కొనేటప్పుడు అమ్మే జంతువులు ఏజాతికి చెందినవో, వాటిలక్షణాలు ఎట్టివో తెలిసికోవాలి.

పాలకు, మాంసానికి. సరిపోయే పుటక, దార్ఢ్యాలు గుర్తించుకోవాలి.

ముక్కు దగ్గర వుంగరాలవలె చారలు వుండుట మంచిదని గ్రహించాలి. సంతలలో వుండే పాడి పశువులను ఎంతమాత్రము కొనరాదు.

మాంసానికి వచ్చే పశువుల బరువును బట్టి పౌనులతూకాన్ని బట్టి బలాన్ని బట్టి పశువులను ఎంచుకోవాలి.

# అమెరికాలో పశుజాతులు

## హాలెస్సెయిన్ ఫ్రిష్యన్ జాతి

ఈ జాతి పశువులను నెదర్లాండ్సునుంచి ఇగ్లండునకు దిగుమతి చేసికొనేవారు. నెదర్లాండులో మాత్రం ఫ్రిష్యన్ జాతి అని పిలుస్తారు. అమెరికాలో మాత్రం హాలెస్సెయిన్ ఫ్రిష్యన్ జాతి అని పిలుస్తారు.

1850–1860 సం॥ లో ఈజాతిఆవులను ఆబోతులను ఎక్కువగా అమెరికావారుఇంగ్లాండునుంచిదిగుమతిచేసికొనేవారు. 1880నుంచి1890 సం॥ వరకు నెదర్లాండు నుంచి దిగుమతి చేసికొనేవారు. ఈ జాతి ఆవులు బాగుగ పాలు యిస్తాయి. ఈ జాతి ఎద్దుల బరువు 1800నుండి 2000పౌనుల వరకున్ను, ఆవులబరువు 1200 నుంచి 1400పౌనుల బరువు వరకువుంటాయి. ఈజాతిఆవులమెడ, కాళ్లు అంతపొడవుగాక మధ్యస్తముముగావుంటాయి. నలుపురంగుగాగాని, తెలుపురంగుగాగాని ఈ జాతి పశువులువుండి పొదుగు చూచుటకు మిగుల అందంగా వుంటాయి.

## జెర్సీ జాతి

ఈ జాతి ఇంగ్లీషుఛానలులోని జెర్సీ ఐలెండులో ఎక్కువగా పెంచుతారు. ఈజాతినిచంపి మాంసమునినరాదని చట్టాన్ని ప్రభుత్వం అములుపరచింది. ఈజాతి ఏరీతిగా వచ్చిందో ఎవరికీ తెలియదట. ఈజెర్సీప్రాంతము విశాలమైన ప్రదేశంకానందున అచ్చటపశువులు నిలువయుండటానికి వీలు లేదు. 1850 – 1850 సం॥ రాలలో జెర్సీ, హాలెస్టీన్ జాతిపశువులను అమెరకావారు దిగుమతి చేసికొన్నారు. 1880 నుంచి క్రమేపి దిగుమతి తగ్గించారు. ఈజాతిని కెనడావారుకూడ ఎక్కువగా దిగుమతి చేసికొన్నారు. ఈజాతిని ఎగుమతి చేసికొననపుడు

జెర్సిలో ఎద్దులబరువు 1500 పౌన్లు, ఆవులబరువు 1000 పౌన్లు బరువు వుండేవి. అమెరికావారు తెప్పించిన తరువాతఎద్దులబరువు 1200 నుంచి 1300 పౌనులబరువున్ను, ఆవులు 800 నుంచి 900 పౌన్లు బరువు వుండేవి.

## జెరెన్సీ జాతి

ఈ జాతి ఇంగ్లీషుఛానల్‌లోనున్న చిన్న జెరెన్సీ ఐలాండులో పెరుగుతున్నాయి. ఇచటకూడ తగినంత చోటులేక ఈజాతిపశువులు పెరిగేవికావు. 1830 – 1850 లోను 1910 నుంచి 1930 సం॥ వరకు కూడ ఈజాతిని 30 లక్షల పశువులను దిగుమతి చేసికొన్నారు. ఈ జాతి ఎద్దులబరువు 1600 నుంచి 1800 పౌనులవరకు, ఆవు బరువు 1000 నుంచి 1200 పౌనుల బరువువరకు వుంటాయి.

## ఎయిర్ షైర్ జాతి

వీటి జన్మస్థానం స్కాట్లండు కోస ఎయిర్‌షైర్ ఈజాతిని ఇంగ్లండు కెనడా దేశాలకుకూడా దిగుమతి చేసికొనినాయి. అమెరికా వారుయిప్పటివరకు కూడ ఈజాతినిదిగుమతి చేసికొంటున్నారు.

## రష్యా – పశుసంపద

రష్యా కమ్యూనిస్టుదేశం. హిట్లర్ కాలంలో యుద్ధం వల్ల ఒక కోటి 70లక్షల పశువులు, రెండుకోట్ల పందులు, 90 లక్షలపైగా గొర్రెలు మేకలు, 11 కోట్ల కోళ్ళను హతమార్చి సైనికులకు సప్లయి చేసారు. 1940 నుండి ధాన్యోత్పత్తి వృద్ధి అయింది. గోధుమవుత్పత్తి లోమాత్రము రష్యా ప్రపంచంలో ప్రథమ స్థానము వహించింది 1951 నాటికి పశుగ్రాసం, బంగాళదుంపలు, గోధుమలు ఇరువదిరెట్లు అభివృద్ధి చేశారు. ఇప్పుడు 60 రెట్లు వృద్ధి పొందింది పంచదార మూడువంతులు, నుడిపత్తి రెండువంతులు పెరిగింది. 1960 నాటికి

పల్లెలలోను, పట్టణాలలోను పశుగణాభివృద్ధి యిసువదరెట్లు అభివృద్ధి చేయాలని ప్రభుత్వం సంకల్పించింది

మాస్కోలోని చాలా యిండ్లలో పిల్లిగాని, కుక్కగాని, పిట్ట గాని కన్పించుతుంది జంతువులను పెంచడంలో ప్రేమగల పిల్లలు తాబేళ్ళను గాని ముళ్ళ పందులను గాని పెంచుతారు. ఈ నగరం మొత్తంమీద పిల్లులు, పందులు,కుక్కలుపదిలక్షలకు పైగావుంటాయి. సోవియట్ రాజధాని నగరంలో ఈ చతుష్పాద జంతువుల పక్షుల ఆరోగ్యాన్ని పశువైద్యులు, వారిసహాయులు గల పెద్ద సిబ్బంది కాపాడుతుంది. మాస్కో నగరంలో పదనొకండు శాలలు, నగర శివార్లలో మూడున్ను వున్నాయి. చికిత్సాయావత్తు ఉచితం.

పశువైద్య శాలలకు ఎక్సరే శాఖలూ, రోగనిదాన పరిశోధ నాలయాలు, ఆపరేషన్ గదులూ, ఫిసియోథేరపేటిక్ చికిత్సకు, తదితర చికిత్సలకూ గదులు వున్నాయి. మందులు పుచ్చుకొని పోయే వాటి శాఖలతోపాటు చాలా పశువైద్య శాలలు వున్నాయి వీటిలో జబ్బుతో వున్న పశుపక్ష్యాదులకు చికిత్సచేస్తారు.

లెనీన్ జిల్లాలోని పాత పశువైద్యశాలకు ప్రక్కగా మరొక పశువైద్యశాలను స్థాపించారు. వ్యాధిగ్రస్థమయిన చతుష్పాద జంతువులకు ప్రశాంతిని యిచ్చేటందుకు చక్కనిదడులు, ఎప్పుడూ చన్నీళ్లు వేడినీళ్లు అతిపరిశుభ్రంగా వుంటాయి. క్రాస్నో ఆర్మెయి స్కయాలో మాత్రంవ్యాధిగ్రస్త జంతువులకోసం ఒకఅంబులెన్సు కేంద్రంవుంది. ఈ కేంద్రానికి పెద్దజంతువులనూ రవాణచేయడానికి ప్రత్యేక ఏర్పాట్లుగల మూతవేసి 20 కార్లు వుంటాయి.

ఉజెబకిస్తాన్, తాజికిస్తాను, కజకిస్తాను, తుర్కుమెనిస్తాను, అజరుబైజాను ప్రాంతాలలో 40 కోట్ల 50 లక్షలఎకరాలభూమిని దున్నువారికి ఉచితంగా ఇచ్చారు కార్మికులకు కర్షకులకు ఆదాయము పెరిగింది. ప్రతిమనిషీ 40 ఔన్సులపాలు త్రాగుచున్నాడు. రైతుల ఆదాయం నూటికి 72 పాళ్లు మించింది ప్రస్తుతం 90 లక్షల 80 వేల ట్రాక్టర్లు, లక్షలకొలది పంటకోతయంత్రాలు, వున్నాయి.

ఇప్పుడు సూడాను గడ్డిని పెంచుచున్నారు ప్రతిఆవునకు 4 టన్నుల మేతను మేపుతారు. మూడుసంవత్సరాల కాలంలో ఆవు ఒక్కొంటికి 1.150 కిలోగ్రాములనుంచి 2.332 కిలోగ్రాములు పాలుహెచ్చి నాయి.

సాగులో లేని భూములను ట్రాక్టర్లు దున్నుతాయి. ట్రాక్టర్లు తో లాగబడే కోతయంత్రాలు పంటను కోస్తాయి. శక్తివంతమయిన నీరుజల్లే యంత్రాలు కాయగూరల మొక్కలకు నీరుపోస్తాయి. కోతయంత్రాలు గడ్డినికోసి నడుస్తూనే లారీలో వేస్తాయి. దుంపల కోతయంత్రం దుంపలను యేరుతుంది. దుంపలకున్న ఆకులనుకోసి వేసి వాటిని వేరుగాతొట్టెలలో వేస్తుంది. పాలు తీసే యంత్రాలు విద్యుచ్ఛక్తితో పాలుతీస్తాయి ఈరీతిగా రష్యా చరిత్రవాయా లంటే ఎన్నోఘట్టాలువున్నవి.

## డెన్మార్కు పశుసంపద

డెన్మార్కు దేశం శీతోష్ణస్థితి చాలామంచి దగుటవల్ల వేసవి కాలంలో కూడా పచ్చికబయళ్లు, అరణ్యాలు బంగారంవలె పచ్చగా మెరుస్తూ వుంటాయి. వేసవి కాలంలో కూడా సుకుమారమగు ఆవులు కూడ పచ్చిక బీళ్ళలో హాయిగా షికారు చేస్తూవుంటాయి. డెన్మార్కు లోని ప్రతిరైతు పాడిపరిశ్రమకు పాటుపడుతూ వుంటాడు. 1950 సం॥ లో డైరీఫారాలలో నున్న ఆవులు 50 లక్షల టన్నుల పాలను, 60 వేల పౌనుల వెన్నను, 1169 లక్షల టన్నుల జున్నును యితర దేశాలకు ఎగుమతిచేసింది ఇంకను రెండవ ప్రపంచయుద్ధంలో సైనికులకు కావలసిన పాల పొడిని, జున్నును, వెన్నను సప్లయి చేసింది. యుద్ధసమయంలో చాలా ఆవులను సైనికుల మాంసంకొరకు వుపయోగించారు. ఇదివరకుకంటేఇపుడు పాలఉత్పత్తిలో పరిశోధనలు జరిపి అన్నిదేశాలకంటే ఎక్కువ పేరు సంపాదించారు. చెడిపోయిన పాలను పిల్లలకు,రోగులకు యిచ్చిన క్షయ, అంటురోగాలు వస్తాయని పరిశోధించారు. క్షయవ్యాధి ఈ దేశం లోనే మొట్టమొదట ప్రారం

భిం-పగా పరిశోధనలుజరిపి అరికట్టారు. ప్రతిరోజు స్కూలుపిల్లలకు, రోగులకు నీరు కలపని పాలను ఉచితంగా యిస్తారు. డెన్మార్కు పాలు అంటే సంపూర్ణమైన ఆహారమంటారు.

1870 సం॥ నుంచి సహకార సంఘాల ద్వారా ప్రజలకుపాలు సప్లయి చేస్తున్నారు. ఈ సహకార సంఘాల పద్ధతులను చూచి తదితర దేశాలవారు గూడ తమతమ ప్రాంతాలలో ఈ సంఘాలను ఏర్పరచి పాడి పరిశ్రమను అభివృద్ధి చేసారు. 1940 వ సం॥లో నూతన పద్ధతులతో ఎన్నో రకాల సహకార సంఘాలను ఏర్పాటు చేసారు. ఈ 20 వ శతాబ్దంలో పట్టణాలలో పాల ఫ్యాక్టరీలను స్థాపించారు. ఈ రోజున డెన్మార్కులో 2500 సహకార సంఘాలు 354 ప్రయివేటు డెయిరీ ఫారాలు [illegible]ంచి పని చేయుచున్నారు. డెన్మార్కు దేశము లోని 40 పట్ట[illegible]ను 20 కోట్ల జనులున్నారు. ఈ పట్టణాలనుంచి కొన్ని లక్షల పాలసీసాలు, డబ్బాలు తదితర దేశాలకు ఎగుమతి చేస్తూవుంటారు 1940 సం॥ నుంచి ఈదేశంలో పాడి పరిశ్రమ ఎక్కువగా అభివృద్ధి గాంచుట వల్ల చాలా భాగ్యవంత మైంది. 1941 సం॥ నుంచి డైరీఫారాలకు ప్రభుత్వం గ్రాంట్సు యీయడం మానివేసింది.

డెన్మార్కులోని పశువులకు క్షయవ్యాధి రాకుండా అరువది సంవత్సరాలు పరిశోధించి అరికట్టారు. 1954 సం॥లో ఈ వ్యాధిని అరికట్టిన దేశాలలో మొదటిది డెన్మార్కు దేశము. డెన్మార్కు చూచుటకు చాలా మంది యాత్రికులు తదితర దేశాలనుంచి వస్తూ పోతూ వుంటారు. యితర దేశాల నుంచి పశువైద్యులు స్వయంగా విచ్చేసి డైరీ ఫారాలను, వాటిలో వుండే పశువులను చూస్తూ కొంత కాలము యిచ్చటనే యుంటారు

## ప్రసిద్ధమైన పశుజాతులు

రెడ్ డైరీజాతి పశువులు జూట్లాండులో ఎక్కువ ఖరీదుకు దొరుకుతాయి. బ్లాకు వైట్ డేనిష్ డైరీజాతికూడా జూట్లాండులోనే దొరుకుతాయి. షార్టారన్ జాతి పశువులు జూట్లాండు ఉత్తర దక్షిణ

ప్రాంతాలలోను, జెర్సీజాతి మాత్రము డెన్మార్కులో నున్న ఆబోతులతో దాటించగా మంచిరకాల దూడలు పుట్టుచున్నవి. కాని వాటిని మాంసముకొరకు వాడుతూ వుంటారు. ఎరుపు నలుపు రంగు తెలుపురంగుగల ఆవులు పాలను ఎక్కువగా యిస్తాయి.

తమ దేశంలో పశు సంపదను అభివృద్ధి పరచడానికి పశుప్రదర్శనాలను, పాలపోటీలను ఏర్పరచుతారు. చిన్నచిన్న ప్రాథమిక పశు చికిత్సా కేంద్రాలు, గ్రామ రైతులకు ఉపయోగ పడే పశు చికిత్స పాడి పరిశ్రమ గ్రంథాలను ప్రకటించి ఉచితంగా ప్రభుత్వం పంచిపెట్టు తుంది. 1938వ సంIIలో గాలికుంటురాకుండా టీకాలను కని పెట్టిరి. డచ్చి, జర్మనీ, దేశాలవారు డెన్మార్కు దేశపు పద్ధతివలె తమ పశువులకు రాకుండా టీకాలు వేసుకొనుట వలన ఎన్నో పశువులు బ్రతికినవట.

19 వ శతాబ్దమునుండి డెన్మార్కులో తయారయ్యే వెన్నను ప్యాకెట్టులలో నింపి యితరదేశాలకు ఎగుమతి చేసి ఎంతో ధనాన్ని సంపాదించారు. కోపన్‌హేగ్‌లో 1687 మంది ప్రభుత్వోద్యోగులను షాపులలోను మార్కెట్టులలోను పాలను అమ్మడానికి యేర్పాటు చేసారట. తమ పశువులకు జబ్బుగా నున్న పరిస్థితులలో వైద్యశాలకు రాని పక్షమున ప్రభుత్వ వెటరినరీ వారు అంబులెన్సు కారు యింటికి పంపుతారట. డెన్మార్కు లోని ప్రతిగ్రామానికిపశువైద్యుడు వారానికి ఒకపర్యాయం వెళ్ళి రైతులకు ప్రాథమిక పశువైద్య చికిత్సలను బోధించుతూ వుంటారట.

## స్వీడను పశుసంపద

ఈదేశంలోని పశుజాతులు ఎక్కువగా కృత్రిమగర్భోత్పత్తితోపుట్టి నవేగాని స్వచ్ఛమయినజాతులు లేవనియే చెప్పవచ్చును. హాలెండుదేశంలోని ఎద్దులను దిగుమతి చేసికొని తమదేశపుఆవులతో దాటించగా మంచిబలముగల కోడెలు ఆవులు పుట్టుటవల్ల పాలుయిది వరకుకంటె జాస్తిగాయిస్తున్నాయి. కృత్రిమగర్భోత్పత్తితో పుట్టిన

జాతిపశువులను స్వీడిష్ ఫ్రీజియన్ జాతి పశువులు అని పిలుస్తారు. గతశతాబ్దంనుంచి హాలెండు దేశాన్నుంచి దిగుమతిచేసికొని పశు సంపదను పాడిపరిశ్రమను పెంపొందించుకొన్నారు.

1889 సం॥ లో కృత్రిమ గర్భోత్పత్తివల్ల కలిగిన ఆవులు డెన్మార్కు, నార్వేదేశపు ఆవులుయిచ్చే పాలతో సమానంగా యిచ్చెనని స్వీడన్ శాస్త్రకారులు తెలుపుతున్నారు ఈరీతిగా వృద్ధి చేసిన పాడిపరిశ్రమవల్ల వచ్చిన వెన్న, జున్నుపాలు తదితర దేశాలకు ఎగుమతిచేసి ఎంతోమంది ధనవంతులైనారు. స్వీడనులోని ప్రజలు పశువులను పాలకొరకు, మాంసముకొరకు పెంచుచున్నారు. రెండవ ప్రపంచయుద్ధంలో ఈదేశపు పశుసంపద నాశనమైంది. కానియిపుడు మరల పశుసంపద పాడిపరిశ్రమ వృద్ధిఅయింది. ఈప్రభుత్వంకూడ పశువైద్యకళాశాలను, పరిశోధనాలయాలను నిర్మించి వేలకొలది పశువైద్యులను తయారుచేసిరి. ఈ ప్రభుత్వం ప్రతి ఎనిమిదివేల జనాభాకు ఒక పశువైద్యశాలను ఏర్పాటుచేసారు. పశుప్రదర్శనాలు ఏర్పరచి ఎన్నో బహుమతులు యిప్పటికీ యిస్తూవుంటారు. 1947 సం॥ లోస్వీడను ప్రదర్శనంలో పాలపోటీలలో స్వీడిష్ ఫ్రీజియన్ జాతిపశువులు 602 పౌనులు పాలు యిచ్చినాయి. 1946 లో పశు గ్రాసం ఎక్కువగా పండుటవల్ల పశువులుతిని బలిసి సంవత్సరమునకు 143 పౌనులు పాలుయిచ్చాయి. ఈజాతిఆవులు ఇరువది సంవత్సరాల వరకుబ్రతుకుతాయి. రోజుకు రెండుమూడు సార్లుయంత్రాలద్వారా పాలు పితుకుతారు. ఇప్పుడు ఈజాతిఆవులు 990 పౌనులవరకు పాలు యిచ్చుచున్నవి.

## చైనా పశు సంపద

చైనాదేశంకమ్యూనిస్టుదేశమయినప్పటికివ్యవసాయాభివృద్ధికి పశుసంపదాభివృద్ధికి ఎంతో మహత్తరమైన కృషిచేసింది. కాని చైనాలో అంతర్యుద్ధంవల్ల వ్యవసాయం, పశుపోషణ మూలపడింది. ముఖ్యంగా పశుపోషణకు చాలా దెబ్బతగిలి పందులు, కోళ్లు, గొర్రెలు,

పాడిపశువులు ఎన్నో చనిపోయాయి. మంచిజాతి పశువులను దేశద్రోహులు అమెరికా సామ్రాజ్యవాదులకు బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు అమ్మివేసి సాంప్రదాయంగల పశుసంపదను నాశనంచేసారు. అయినా యుద్ధంకలిగించిన, అనావృష్టికలిగిన కొంతకాలానికి కష్టాలు పోయినాయి, యుద్ధానంతరము రెండవయుద్ధానికిముందున్న ధాన్యోత్పత్తి, గోధుమఉత్పత్తి, నూనెమొక్కలు, బంగాళదుంపలు, అల్లం పశుగ్రాసపు పంటలలో ముందంజ వేశారు. ధాన్యం, పశుసంపద మునుపటికంటే ఎన్నో రెట్లు వృద్ధిఅయింది. పాడి పరిశ్రమ కొరకు పాటుపడుచున్నారు. అంటురోగాలను అణచి పశుపెంపకాన్ని వృద్ధి పరుస్తున్నారు. వ్యవసాయంలో సాధించిన విజయాలు, పశుగణాభివృద్ధికితోడ్పడింది. చాలా ప్రాంతాలలోవరదలవల్ల పచ్చిక బీళ్ళలో పశువులు మేతమేయుటకు అనుకూల పరిస్థితులు లేనప్పటికి 1953 నుంచి 1954 వరకు మాంసముకొరకు, పాడిపశువులసంఖ్య, పందులు, గొర్రెలు, మేకలు అభివృద్ధి కొరకు తమశక్తి కొలది ఎంతో అభివృద్ధి పరచారు.

1940 సం॥ లో పోల్చిచూస్తే ప్రజలకు మాంసము, వెన్న, గుడ్లు, పాలు, బట్టలు వగైరా నాలుగురెట్లు అభివృద్ధి చెందినాయి. చైనా ఎక్కువ జనాభాగల దేశము అగుటవలన మాంసము, వెన్న, పాలు, వున్ని వగైరాలు తగినంత సప్లయికానందువల్లను, ఏటేటా జనాభాపెరుగుటవల్ల, తగినంతగా చాలుట లేదు. అందుచేత చైనా ప్రభుత్వం రాబోవు అయిదు సంవత్సరాలలోగానే వ్యవసాయం ద్వారా, పశువులద్వారా మూలోత్పత్తి పదిరెట్లుఎక్కువగాజరగాలని నిర్ణయించింది. పశుసంబధమైన వస్తువులు ఎక్కువచేయాలంటే పశుగ్రాసం వృద్ధిచేయాలి. 1960 సం॥ నాటికైనా మూడురెట్లుధాన్యాన్ని పండించాలని పరిశోధనలు జరుపుతున్నారు.

గత సంవత్సరాలతో పోల్చి చూస్తే 1955 లో చలి కాలపు పంటలు నాటబడ్డాయి ఇంకను వసంతకాలం పంటలకోసం ఆకురాలే కాలంలో పెద్దపెద్దప్రాంతాలలో దుక్కిదున్నబడింది. వేలకొలది వ్యవ

సాయ యంత్రాలు, పశువైద్యశాలలు అదనంగా లభించబడ్డాయి. ఈరీతిగా అభివృద్ధిచెందిన అనుభవాన్ని, విజ్ఞానశాస్త్రవిషయాలను ఎక్కువ ఆచరణలోపెట్టడంద్వారా అధికంగాసంఢించడం మున్ముందుభవిష్యత్తులోవుంటుంది.

పెద్దపెద్దబీళ్ళు గతసంవత్సరం సేద్యంలోకి తీసుకొనిరాబడ్డాయి. బంజర్లు బీళ్ళుదుక్కిదున్నబడ్డాయి. 1955 సంIIబడ్జెట్టులోవ్యవసాయాభివృద్ధికి ఎక్కువధనాన్ని మంజూరు చేశారు. చైనాలోపశుపోషణ వృద్ధిచెందటానికి బౌద్ధులెక్కువగావుండుటే కారణం. ఈమతస్థులు మాంసభక్షకులుకారు. చైనా దేశంలో చాలామంది గోవునుపూజిస్తారు. ప్రభుత్వం ప్రజలు తమదేశాభివృద్ధికి ముందంజ వేసినారనుటకుసందియము లేదు.

ప్రభుత్వంవారు పాడిపరిశ్రమ వృద్ధిచేయాలి, అంటురోగాలను అణచివేయాలి, పశువులకు నియమిత ప్రకారం ఆహార పానీయాలు అనేవిషయాలను చిన్న చిన్న కరపత్రాలు ప్రకటించి ఎల్లరకు పంచిపెడతారు. హుయాన్‌సాంగ్ చైనానుండి మనదేశానికి వచ్చినపుడు తిరిగి తనదేశంపోయినపుడు మన పశువైద్య గ్రంథాలను తాను తీసికొనిపోయి చైనాభాషలో తర్జుమా చేయించెను. నేటికి చైనా అన్ని విషయాలలోను మహత్తరదశ పొందుతూ యున్నదనుటకు ఎన్నో దృష్టాంతరాలు వున్నాయి.

## పోలెండు పశుసంపద

పోలెండు చాలా చిన్న దేశము. రెండవ ప్రపంచ యుద్ధంలో ఈదేశము చాలా దెబ్బతిన్నది. జర్మనులు బాంబులు వేసి ముఖ్య పట్టణాలలో వున్న చక్కని గృహాలను ధ్వంసము చేశారు. ఇంకను పోలెండు అన్ని దేశాల కంటె వెనుకబడి యున్నదనే చెప్పాలి. వ్యవసాయం, పశుపోషణ చాలా దెబ్బ తిన్నది. ఎన్నో పశువులు అంటు రోగాలతో యుద్ధ సమయంలో చచ్చిపోయినాయి. యుద్ధము ముగిసినతరువాత యిదివరకంటె 77 రెట్లు అభివృద్ధిఅయింది. యుద్ధానికి

పూర్వాంకంటె యిప్పుడు 36 వేలమంది ఇంజనీయర్లు వున్నారు. వ్యవసాయం. పశుపోషణ, కళాశాలలను, ట్రాక్టర్లను, యంత్రాలను ఏర్పరచి మానవులకు, పశువులకు అంటురోగాలు రాకుండా కాపాడి దేశసౌభాగ్యానికి ప్రభుత్వం ప్రజలు ముందంజవేశారు. యువకులకు యువతులకు గ్రామ సౌభాగ్యాన్ని ఎట్లువృద్ధిచేయాలో అన్నివిషయాలలోను కళాశాలలలోను, పాఠశాలలలోను బోధించుచున్నారు.

పంటలపోటీలు, పశుపెంపకపోటీలు, వ్యవసాయ. పశుప్రదర్శనాలు, ఏర్పరచి యెక్కువగా పాటుపడ్డ వారికి బహుమతులు యిచ్చి సత్కరించుతున్నారు. సోవియట్, పోలెండు దేశాల సన్నిహితాభివృద్ధికి కానుకగా సోవియట్ ప్రజలు చక్కని పశుజాతులను, పోలెండులో చక్కని భవనాలను నిర్మించారు. పోలెండులోని వార్సాలో రష్యనులు చక్కని భవనాలను నిర్మించి పోలెండువారికి కానుకగా యిచ్చారు హిందూదేశం, పోలెండుల స్నేహాభివృద్ధి కొరకు మన దేశము చక్కని సాంప్రదాయంగల బొమ్మలను బహుకరించింది. పోలెండు వ్యవసాయానికి 49 వేల ట్రాక్టర్లను సంపాదించి 3500 మైళ్ళు సముద్రందగ్గరగావున్న బంజరుభూములనుదున్ని అన్నిరకాలపంటలను పండించుతున్నారు. ఇంకను జకస్లవేకియా, రష్యా, దేశాలు పోలెండును అభివృద్ధిపరచుటలో ఎంతో సహాయం చేసినాయి.

## స్విట్ జర్లండు-పశుసంపద

ఈదేశంలోని బ్రౌన్‌స్విస్ జాతి ప్రపంచంలో వున్న మంచిజాతులలో ఇదికూడ ఒకటిగా పరిగణింప బడింది. క్రీ పూ. 2000 సం॥ క్రిందట ఈజాతి అడవి జాతిగాఎంచి మూర్ఖపశువులని పిలిచేవారు. వేయిసంవత్సరాలకు పూర్వమే ఈజాతిని గురించిప్రభుత్వంప్రకటించిన గ్రంథాలలో వ్రాయబడింది. ఈజాతి పశువులను ప్రపంచమున ప్రజలు తెలిసికొని తదితర దేశాలుకూడ కావలెనని కోరారు. కాని ఇతర దేశాలకు తమజాతిని పంపిన నశిస్తుందనువుద్దేశ్యంతో ప్రభుత్వం ఎగుమతి చేయరాదని నిషేధించింది. ఇప్పుడుమాత్రం తమదేశంలో

ఈజాతిఎక్కువగా పెంపొందుటవల్ల కోరిన దేశాలకు పంపుతూన్నారు. స్విట్జర్లండుకొండప్రాంతాలలో బాగుగా పెరుగుతున్నాయి. కొన్ని ప్రాంతాలలో క్వీజర్ జాతి పశువులని పిలుస్తారు. బీర్న్ జిల్లకుదగ్గర, జ్యూరిచ్ కకుదగ్గర యీబార్న్ జాతి పశువులనుపెంచే 62 ప్రభుత్వ కేంద్రాలువున్నాయి. అందంలోను, పాలుయిచ్చుటలోను, మాంసానికిపనికివచ్చేది ఈజాతియే యగుటవల్ల ఖరీదు జాస్తిగావుంటుంది.

ఆలప్సు కొండలప్రాంతమయిన మిట్టిలాండున్ను, జూరాప్రాంతపుకొండలున్ను, సముద్రమట్టానికి 200 నుంచి600 అడుగుల ఎత్తు వరకు వుంవి. మిగతా జిల్లాలలోనున్న కొండప్రాంతము 600 నుండి 2000 అడుగుల ఎత్తువరకు వుంటుంది. ఎంతయెత్తునున్నప్పటికి పశువులన్నీ ఈకొండలమీదకుపోయి ప్రతిరోజు పచ్చిగడ్డివగైరా మేసి తిరిగి సాయంకాలానికి ఇండ్లకు చేరుతాయి. వేసవికాలములో గడ్డిపెరుగు ప్రాంతము 1000 నుంచి 2800 అడుగుల ఎత్తునవుండే కొండలలో పెరుగుతుంది. ఈకొండలు చూచుటకు రమణీయంగాను, ఇచ్చట పెరిగేగడ్డిలో విటమినులు, బలకరపదార్థాలు ఎక్కువగానువుంటాయి. ఈపశువుయింతఆరోగ్యంగాను, బలకరంగాను, వుండటానికికారణాలు ఏమనగా:- ఈ దేశ శీతోష్ణస్థితిగతులు పశువులకుఅనుకూలంగావుండుట వల్లను, కొండప్రాంతాలలో విశాలమగు ప్రదేశాలు పశువులు తిరగడానికి చక్కనిగాలి పీల్చడానికి వీలుగావుండుటవల్లను, ఇచ్చట పెరిగేగడ్డిజాతులలో బలకరపదార్థాలువుండుటవల్ల పశువులుమేసిరక్తవృద్ధికరంగావుండుటవల్లను, ఎత్తయినకొండలనుంచి మీదికి క్రిందికి తిరుగుటవల్లపరిశ్రమకలిగి ఎక్కువగాఆకలిగలుగుటవల్లను, ఈరీతిగా పెంపొందేపశువులకువ్యాధులుపోకనందున. పశువులుఆరోగ్యవంతములై బలిష్ఠంగావుంటాయి.

ఈ జాతి ఎద్దులు 1000 కె. జి. బరువున్ను, ఆవుబరువు 600 కె. జి. బరువున్ను వుంటాయి. తలపొట్టిగాను, మెడ పొడవుగాను, రొమ్ము లోతుగాను, పొదుగు చూచుటకు అందముగానూ, పిరర్రలు

వెడల్పుగాను, పిక్కలు బలంగా, లావుగాను, కొమ్ములు అంత పొడవుగా చిన్నవిగా లేకుండా మధ్యరకముగాను ఇంకను ఈజాతిపశువులు గోధుమరంగుగా వుంటాయి.

ఈ పశువులు మాంసము కొరకు, పాలకొరకు, బండ్లులాగడానికి ఉపయోగ పడతాయి. పదిహేను సంవత్సరాలనుంచి 35 దేశాలు ఈజాతిని దిగుమతి చేసికొన్నాయి. 1920 నుంచి ఇటలీ, ఫ్రాన్సు, జర్మనీ, స్పెయిన్, రుమేనియా, అస్ట్రేలియా, ఆఫ్రికా, కెనడా, యురుగ్వే, మున్నగు దేశాలు దిగుమతి చేసికొన్నాయి. ఇంకను ఈ దేశంలో కూడా పశువైద్య కళాశాలలు, డెయిరీఫారాలు స్థాపించి పశు సంపదను అభివృద్ధి పరుస్తున్నారు

# ఆస్ట్రేలియా - పశు సంపద

ఆస్ట్రేలియా దేశాన్ని 1642 సం॥లో కనుగొన్నారు. డచ్చివారు కేప్‌యార్కు పెన్సిలావరకు వచ్చారు. 1642 లోనే టాస్‌మన్ అనువతడు టాస్మేనియా, న్యూజిలాండు దేశాలను కనిపెట్టాడు. ఆస్ట్రేలియాలో పశువులకు గొఱ్ఱెలకు విశాలమైనపచ్చికబయళ్లు వున్నాయి. అలెగ్జాండ్రియా దేశంలో పదివేల చదరపుమైళ్ళ విస్తీర్ణంగల ప్రదేశంలో ఎన్నోరకాల గొఱ్ఱెలను పశువులను ప్రభుత్వం పెంచుతూ వుంది. సౌత్ వేల్సులో అయిదు లక్షల రెండువేల ఎకరాల పచ్చిక బీళ్లలో ఒకలక్షా ఇరువదివేల గొఱ్ఱెలకు సరిపోయేగడ్డి పెరుగుతూ వుంది.

ఇంకను ఆస్ట్రేలియాలో నాలుగువందల రకాలజంతువులు ఏడు వందలరకాల పక్షులువున్నాయని ప్రభుత్వప్రకటన. ఈ పక్షులు చూచుటకు అందంగావుండి చెట్లు చిగిర్చేకాలములో చక్కనిసంగీతం పాడి ప్రజలను ఆనందింప చేస్తాయట. లైర్ అనుజాతి పక్షి పక్షులన్నిటిలో చాల అందమైనదట

ఆస్ట్రేలియాలో వ్యవసాయం చేయుట, బట్టలు తయారు చేయుట మున్నగు పరిశ్రమలలో యితర దేశాలతో సమానముగా

ముందంజవేసింది ఇంకను గొఱ్ఱెలను ఉన్నికొఱకు మాంసముకొఱకు, చర్మముకొరకు శాస్త్రసమ్మతంగా పెంచుతున్నారు. పశువులవల్ల పాలు, పెరుగు, మాంసము, చర్మాలు, వెన్న, జున్ను, మీగడ వుత్పత్తి పరిశ్రమాలయాలను ప్రభుత్వం ఎంతో వృద్ధిచేసింది. కాఫీ, కోకో, పశుసంపద అభివృద్ధికొరకు సహకార సంఘాలేర్పరచి పాటు పడుతూవున్నారు ఇతర దేశస్థులను తన సోదరుల్లాగా చూచుకొను చున్నారు. ఇతరదేశాలనుంచి ఎంతోమంది యువకులు విచ్చేసి యిచ్చటవున్న విశ్వ విద్యాలయాల్లో చదువుకొనుచున్నారు ఇంకను సహకార సంఘాలద్వారా ప్రజలకు స్వల్పవడ్డీలతో అప్పులుయిచ్చి వ్యవసాయానికి, పశుసంపద అభివృద్ధికి ప్రభుత్వం తోడ్పడుతూ వుంది. పోలెండు, ఇంగ్లండు, ఫ్రెంచి, బల్గేరియా మున్నగు దేశాల ప్రజలు ఈదేశంలో కొందరు స్థిరనివాస మేర్పరచుకొన్నారు.

ఇంకను దొమ్మ, గురక, గాలికుంటు, ప్లేగురోగాలకు ప్రత్యేక టీకాలను తయారు చేసి అరికట్టి పశుసందను కాపాడి వ్యవసాయాన్ని అభివృద్ధి పరుస్తున్నారు. అమెరికానుంచి జేబ్ జాతి మగ పశువులను దిగుమతి చేసికొని తమ ఆవుల మీదకు దాటించగా మాంసానికిపనికి వచ్చే మంచి జాతి పశువులు పుట్టుచున్నాయి.

1960 సం॥ నకు ఆహార పదార్థాలు పదిరెట్లు వృద్ధి కావాలని ప్రణాళికలు తయారుచేసారు. ఈప్రణాళికలవల్ల 120 కోట్ల పౌనులు ఆదాయం రాగలదని అంచనావేసారు గొడ్డుమాంసముకూడా 1960 నాటికి పదిరెట్లు అభివృద్ధి చెందాలను వుద్దేశ్యంతో మాంసాన్ని తయారుచేసే ఫ్యాక్టరీలను యిదివరకంటె ఎక్కువగా స్థాపించారు. 1951 - 53 లో 122 కోట్ల 80 లక్షల గ్యాలనులపాలు తమదేశపు పశువులు యిచ్చెనట. జున్ను వెన్న మీగడలను డబ్బాలలోపెట్టి ఎగుమతులు చేస్తూవుంటారు. ఇంకను 1960 సం॥ రానికి వరిధాన్యం, గోధుమలు, జంతుసంపద, అభివృద్ధి చేయడానికి బంజరు భూములను, ప్రాజెక్టులను నిర్మించి వాటిసహాయంవల్ల నచ్చునీటితో ఒకకోటి ముప్పది అయిదులక్షల ఎకరాలభూమిని సాగుచేస్తున్నారు. ఈరీతిగా

ప్రణాళికలు తయారుచేసి ఆస్ట్రేలియా దేశాన్ని ఇంకను ఎక్కువ అభివృద్ధికి తేవాలని సంకల్పించారు.

## కెనడా - పశుసంపద

ప్రపంచయుద్ధంవలన కెనడాదేశం ఎంతో నష్టపడింది. ఈ యుద్ధాలవలన ఆహారపదార్థాలు పండక, తినుటకు మాంసముదొరకక చాలాబాధపడ్డారు 1940 సం॥ లో పంటపొలాలపై జర్మనులు బాంబులు వేయుటవల్ల భూసారమంతా పాడైపోయింది. అట్టి సమయంలో బ్రిటిష్‌వారు ఆహారానికి కావలసిన సామగ్రినంతా ఉచితంగా సప్లయిచేశారు. యుద్ధాలుముగిసిన మూడుసంవత్సరాలలో మరల ఈదేశంఎంతోఅభివృద్ధిగాంచినది. ఏనుగులు, జడలబర్రెలు, ఒంటెలు, కుందేళ్ళు, పశువులు, గొర్రెలు, మేకలు, కోళ్ళు మొదలగు జంతుసంతతిని ఎన్నోవిధాల పరిశోధించి అభివృద్ధి పరచారు. కెనడాలో ఈరోజున వున్నంత జంతుసంపద యితరదేశాలలోఎచ్చటలేదని ఆదేశపువారు గర్వించుతూ వుంటారు. గతసంవత్సరం అంటారియా పట్టణములోని పశువులకు, పందులకు పెద్ద రోగముసోకి ఎన్నోపందులు చచ్చినాయి. 1950 సం॥ లోకుక్కలకు పిచ్చిఎత్తిఎన్నోచావగా వెంటనే పశువైద్యశాఖవారు పరిశోధనలు చేసి టీకాలువేసి రక్షించారు. కెనడాలోను, షికాగోలోను పశువులను, పందులను చంపిన మాంసమును డబ్బాలలోపెట్టిఇతరదేశాలకు ఎగుమతి చేసి యెంతోధనాన్ని సంపాదించుతారు.

వ్యవసాయాన్ని వృద్ధిచేయడానికి ట్రాక్టర్లు, నూర్పిడియంత్రాలను జంతువులకు మానవులకు ఉచిత వైద్యశాలలను ఎంతోవృద్ధి పరచారు. 1960 సం॥నాటికి ఆధునికయుగం ప్రకారం పాలు, వెన్న, జున్ను, గ్రుడ్లు, మాంసము, జంతుపోషణ, వ్యవసాయం మున్నగు ఉత్పత్తులను ఎక్కువచేయాలని అంచనాలువేసి పాటుపడుతున్నారు. కెనడాలోను, అమెరికాలోను ఒకేజాతి పశువులున్నాయి.

# యుగస్లేవియా పశుసంపద

యుగస్లేవియా చాలా అందమైన పట్టణమేగాక చూడడానికి చాలాఅందముగా వుంటుంది. చరిత్రలో మాత్రము వెనుకపడివుంది. ఇచ్చటప్రజలు చాలా బీదవారేగాక అన్నివిషయాలలోను చాలా వెనుకబడియున్నారు. పరిశ్రమలా వృద్ధి పొందలేదు. రైతులా ఋణాలతో మునిగిపోయారు. రెండవ ప్రపంచయుద్ధం వల్ల ఎంతో దెబ్బ ఈదేశము తిన్నది. ఈ యుద్ధం ముగిసినతరువాత మహాత్తరమయిన కృషిసలిపి పాడిపంటలను అభివృద్ధి చేసింది. అన్ని విషయాలలోను స్వయంపోషకంగా కావలెనని కృషిచేస్తున్నారు ఈ దేశప్రజనసంఖ్య 18 మిలియన్లుమాత్రమే. ఇంగ్లాండుకంటే ఈదేశంపెద్దది. నూటికి 70 మంది వ్యవసాయం పశుసంపదమీద అధారపడి యున్నారు. యుగస్లేవియా అధ్యక్షుడు "మార్షల్ టిటో" తనదేశానికి ఎంతో పాటుపడుతున్నాడు.

ఈదేశములో ఎక్కువగా పర్వతాలు వుండుటవల్ల వాటిమీద మొలచేపచ్చిగడ్డియే తమపశుసంపదకుఆధారంగావుంది. ఇంకనుఅన్ని రకాల పాడి పంటలు రైతులుసంఘించి పశుగణాభివృద్ధిని పెంపొందించారు. ఇంకను గనులవల్ల, జంతుసంపదవల్ల మంచి ఆదాయం వస్తున్నది. యూరప్‌ఖండములో యిదికూడ ఒకభాగ్యవంతమయినదేశం. అల్ప్సయిన్ కొండలు ఈదేశములో చూచుటకు ఎంతో అద్భుతంగా వుంటాయి. పంచవర్ష ప్రణాళిక మూలంగా యుగస్లేవియా వ్యవసాయ దేశంగా మారిపోయింది. ఇప్పుడు 20 లక్షలమంది బీదప్రజలకు బంజరుభూములను పంచిపెట్టారు. ఈరైతులు తమకు వచ్చిన ఆదాయంలో కొంతసేవింగ్సు బ్యాంకులలో దాచుకొనుచున్నారు. ఇప్పుడు రైతులకు ఋణబాధలులేవు. ప్రతిరైతు పంచదార, బీట్సు,పొగాకు, బియ్యము, ప్రత్తి, పండ్లు, మంచివుత్తమజాతి పశువులను సంపాదించుకొని సుఖజీవనం చేస్తున్నారు. 1950 వ సం॥ లో ఎనిమిదివేల సహకార సంఘాలను స్థాపించి పాడిపంటలను అభివృద్ధి చేసారు. పాలు వెన్న, జున్ను, గుడ్లు, మాంసము వారికిసరిపోగలిగినంత వుంచుకొని

మిగిలినదానిని తదితర దేశాలకు ఎగుమతిచేస్తున్నారు. గతసంవత్సరం పంటలకు, పశువులకు కోళ్ళకు అంటురోగాలు వచ్చి చనిపోయినాయి. ప్రభుత్వం వెంటనే తనుజంతువులకు గట్టాన్ని అనులుపరచి టీకాలు వేయించింది

యుగస్లేవియాలో మహత్తర కృషిని చూచి బర్మా మంత్రి తాకిన్‌తిన్, ఇండోనిషియానుండివచ్చిన ప్రతినిధులు అమెరికా శాస్త్రజ్ఞుడు అయిన రాబర్టుహెల్‌వెట్ అనువారు ఈ దేశకృషిని చూచి ఎంతో ప్రశంసించారు. ఇంకను ఇటలీ, టర్కీ, గ్రీసు. ప్రతినిధులు ఈ దేశ వ్యవసాయ, పశుపోషణ పద్ధతులు విషయాలను విపులంగా తెలిసికొని తమ దేశాలలో కూడా ఆచరణలో పెట్టారు

1954 సం॥లో 1600 టన్నుల గోధుమలు, 25 లక్షల 2వేల టన్నుల బార్లీ, 23 లక్షల 3వేల టన్నుల ఓట్లు, 19 లక్షల 2 వేల టన్నుల ధాన్యం, 15 లక్షల 5 వేల టన్నుల పశుగ్రాసం పండించింది. యుగస్లేవియా అధ్యక్షుడు మనదేశాన్ని సందర్శించి విషయాలని గ్రహించి మా దేశం మాదిరిగా మీ దేశంకూడ అన్నిపరిశ్రమలలోను కృషిచేయుచున్నదని చెప్పెను. ఇంకను యుగస్లేవియాలోకూడ పశువులకు ఉపయోగించే పెన్సిలిన్ తయారుచేయు ఫ్యాక్టరీలను స్థాపించారు. దేశసౌభాగ్యానికి వ్యవసాయం, పశుసంపద ఇదివరకుకంటె 30 రెట్లు ఈదేశం అభివృద్ధి పరచింది. 1960 సం॥ నాటికి ప్రజలకు పనికివచ్చే అన్నిపరిశ్రమలను వృద్ధిచేయాలని ప్రభుత్వం సంకల్పించింది.

## ఐస్‌లాండు - పశుసంపద

ఈదేశము ఎక్కువ మంచుతో కప్పబడి వుంటుంది. చలికూడా ఎక్కువే. కానిచూచుటకు ప్రకృతి అతిరమణీయమయిన దృశ్యాలు వున్నాయి. ఇంకను చక్కని పచ్చికబయళ్ళు వుండటంవల్ల సంవత్సరంపొడవునా అచ్చటవున్న పశువులు ఆగడ్డిసతిని నుంచి బలము గలిగి పాలుఎక్కువగా యిస్తాయి. ఐస్‌లాండు ముఖ్యపట్టణమగు

" రిక్జనిక్ "లో నలుబది వేలమంది జనులున్నారు. ఈపట్టణంలోని భవనాలు, పశువులకొట్టాలు చూచుటకు ముచ్చటగాను, పని తనముతోను నిర్మింపబడ్డాయి. ఈదేశంలో ఒకలక్ష పన్నెండువేల మంది జనులు ఎక్కువగా చేపలమీద వ్యవసాయంమీద ఆధార పడి యున్నారు. పశువైద్య శాఖాధికారులు మాత్రం కోళ్ళను, మాంసమును, ఆహారపదార్థాలను అభివృద్ధిచేయుటలో ఎక్కువగా తోడ్పడుతున్నారు. మాంసము మంచిదో కాదో ప్రతిరోజు వైద్యులు పరీక్షించుతూ వుంటారు ఈదేశస్థులు కొండలకుదగ్గరగా కసాయి శాలలను నిర్మించి, చంపినజంతువుల మాంసాన్ని డబ్బాలలో నిలువచేస్తారు క్రిష్టమస్ పండుగ సందర్భాలకోసం సెప్టెంబరు నెలలో చక్కని మంచి బలముగల గొఱ్ఱెలనుకోసి డబ్బాలలో నిలువచేస్తారు. అమెరికా గొఱ్ఱెల మాంసంకంటె ఈదేశపు మాంసము అతిరుచిగా వుండుటవల్ల అమెరికా దేశస్తులు ఈమాంసపు డబ్బాలనే ఎక్కువగా వాడతారు.

ఐస్‌లాండు దేశంచుట్టు నీరు ఎక్కువగా వుండుటవల్ల వివిధ రకాల చేపలు దొరుకుటవల్ల వాటిని జాస్తిగా ఇచ్చట ప్రజలు తింటారు. సాల్మన్ అను చేపమంచి రుచిగా వుండి 10 నుంచి 14 పౌనుల బరువు వుంటుంది. ఇంకను ఈచేపలమాంసము ఎరుపురంగుగా వుంటుంది. ఈచేపల గుండెనుంచి మంచిరకం కాడ్‌లివర్ ఆయిల్‌ను తయారుచేస్తారు. యుద్ధాలలో సైనికులకు కావలసిన చేపలను డబ్బా లలోపెట్టి ఎగుమతి చేస్తూవుంటారు.

ప్రపంచ యుద్ధంవల్ల పాడిపరిశ్రమకు. పశుపోషణకు, కోళ్ళ, గొఱ్ఱెల పరిశ్రమలకు గొప్ప దెబ్బ తగిలింది. యుద్ధం ముగిసిన 3 సం వత్సరాలలోనే 24 రెట్లు జంతు సంపద వృద్ధి అయింది. ఈదేశములో పశువులకు గర్భ స్రావమను అంటు రోగముతో ఎల్లప్పుడు బాధ పడుతూ వుంటాయి. అమెరికా దేశ పశువైద్యులు ఈ దేశపు పశు వైద్యులను అందరిని సమావేశ పరచి క్షయ, పొడుగు వాపు, గర్భ స్రావం, గురక, దొమ్మ, జెబ్బవాపు మున్నగు రోగాలను గూర్చి

కోళ్ళ అంటురోగాలను గూర్చి వివిధ విషయాల మీద చర్చించి కొన్ని ముఖ్యవిషయాలు బోధించారు. 1942 వ సం॥ లో అమెరికనుల ప్రోత్సాహంతో పశువైద్య కళాశాలలను, పాడి పరిశ్రమాలయాలను స్థాపించి ఎంతో పాటు పడ్డారు. ఇంకను పశు పరీక్ష, శరీర శాస్త్రం, రసాయన శాస్త్రం యిన్నగు వాటిని గురించి ఎన్నో విషయాలు విద్యార్థులకు బోధించారు.

ఈ దేశంలో వుండే పందుల మాంసం రుచిగా వుండుటవల్ల వీటి పరిశ్రమకు కూడా పాటుపడ్డారు. 1945 వ సంవత్సరంలో అంటు రోగాలతో పందులు చచ్చుటవల్ల అమెరికానుంచి విమానాలలో టీకాల మందు తెప్పించి వేసారు. ఐస్‌లాండు, హాలెస్ట్రెన్, గరెన్సీ, జెర్సీ, షార్టారన్ జాతి పశువులను ఇంగ్లండు నుండి తెప్పించుకొనుట వల్ల డైరీఫారాలలో ఈజాతులు పాలు ఎక్కువగా యిస్తున్నాయి. కుక్కలు మాత్రం గొఱ్ఱెలను కాచుటలో ఈ దేశంలో ముందంజ వేసాయి. అయితే వీటికి డిస్టెంపర్ అను అంటు వ్యాధి సోకి ఏటా మరణించుట వల్ల అమెరికా వారు ఈరోగాన్ని అరికట్టారు 1952 వ సం॥లో ఎనిమిది వందల నూతన కోళ్ళ శాలలను ఏర్పరచారు. యీ రీతిగా ఆదేశస్థులు పాటుపడి దేశాన్ని ఎంతో వృద్ధిలోకి తెచ్చారు.

## కాశ్మీర్ - పశుసంపద

కాశ్మీర్ దేశం సౌందర్యానికి పుట్టినిల్లు. చిరకాలమునుంచి మనకు కాశ్మీరుదేశానికి దగ్గర సంబంధంవుంది. గౌతమబుద్ధుడు వారి శిష్యులు కాశ్మీరుదేశములోబౌద్ధమతప్రచారంచేసారు. కాశ్మీర్ కొండ ప్రాంతాలలో భదర్వా, రామనగర్, యుధంపూర్, ముఖ్యమైనప్రదేశాలు అయిదువేల చదరపుమైళ్లవిశాలం గలిగింది. కాశ్మీర్, జమ్మూ ప్రాంతాలలో ఆహారధాన్యాలు, పశుసంపద, గొఱ్ఱెలమేకల పెంపకం ఎక్కువగావుంది. కాశ్మీర్ అరణ్యప్రాంతాలలో చక్కని పచ్చిక పెరుగుటవల్ల అచ్చట పశువులు, గొఱ్ఱెలు చక్కగా బలిష్ఠంగా వుంటాయి. ఇంకను ఈఅరణ్యాలలోవున్న కలపమీద ఎంతో ఆదా

యంవస్తుంది. కాశ్మీరులోని ప్రజలు వ్యవసాయంమీద, ఫలపుష్పాల మీద జీవిస్తూవున్నారు. పదిలక్షల నలుబది వేల ఎకరాలలో ఒకలక్ష ముప్పది వేల ఎకరాల భూమినిమాత్రమే సాగుచేస్తున్నారు.ఆప్రాంతపు భూములు నీటసౌకర్యాలు లేకపోవుటవల్ల 1950 – 1951 లో క్రిష్టతో వార్ దగ్గర కాలువను త్రవ్వీభూమిని యిపుడు సాగుచేయుట ప్రారంభించారు. సముద్రమట్టానికి ఈకాలువ 65 వందల అడుగుల ఎత్తు వుంది ఇంతపెద్దకాలవ మనదేశము మొత్తంమీదనే లేదట. ఇంకను ప్రపంచంలోకెల్లా ఈ కాలవ రెండవది అంటారు. మరల క్రొత్త ప్రాజెక్టును 65 లక్షల ఖర్చుతో అయిదు వేల యకరాలను సాగుచేయ ప్రారంభించగా ఆహారపదార్థాలు, గడ్డిజాతులు ఎక్కువగా పెంపొం దుటవల్ల అచట పశుగణాభి వృద్ధికూడ చాలా పెంపొందింది.

పురాతనకాలంనుంచి గాడిష్ జిల్లా పశు సంపదలో, గొఱ్ఱెల పెంపకములో అభివృద్ధిగాంచింది. ఇంకను సహకార సంఘాలద్వారా కాశ్మీరు గొఱ్ఱెలనుంచి వున్నితో తయారుచేసిన కంబళ్ళు, శివా సీలు, గొఱ్ఱెలచర్మాలు, ఇతర దేశాలకు ఎగుమతిచేసి ధనమును సంపాదించుతున్నారు. కాశ్మీరు జమ్మూప్రాంతాలలో గూర్జరజాతి వారున్నారు. వీరిభాష కాశ్మీర్ భాషకాదు. కాని వారు మహామ్మ దీయులే. వీరుకొండలప్రాంతాల లోయలలో నివసించుతూ, కొండల శిఖరాల దగ్గరగావుండే పచ్చిగడ్డిని తమపశువులకు మేపుకుంటారు. వాటి నుంచివచ్చే పాలద్వారా వెన్న, మజ్జిగలు తయారుచేసికొం టారు. ఈజాతివారు కొండలకు రాజులు. అనగా కొండదొరలు అంటారు. వీరికిపశువులన్నా, గొఱ్ఱెలన్నా ఎంతోప్రీతి. పాకిస్తాన్ కాశ్మీర్ యుద్ధాలవల్ల వీరిగొఱ్ఱెలను పాకిస్తాన్ దుండగీళ్ళు నాశన ముచేశారు. వీరుముఖ్యముగా పాలు, రొట్టె, తేనె, వెన్న ఎక్కు వగాతింటారు. మనదేశంనుంచి కాశ్మీరు దేశానికి మంచిరోడ్లు మనప్రభుత్వంవేసి మంచి ఉత్తమజాతి పశువులను కొన్నిటినిఖరీదు

సకుపంపారు ఈగూర్జా పిల్లలకు వారిజంతువులకు ఉచితవైద్యం ప్రభుత్వం చేయించుచుంటుంది. ఇంకను ఈదేశచరిత్రను వర్ణించాలంటే ఎంతో వుంది.

## జకస్లోవికియా - పశుసంపద

ఈ దేశములోని ప్రజలందరు సోవియట్ యూనియన్ అన్నా ప్రజలు అన్నా ఎంతో ప్రేమ. యువతులు యువకులు గ్రామాలకు పోయి పాడిపరిశ్రమ, పశు సంపదను కృషి చేయుటలో ఎంతో ముందంజ వేస్తున్నారు. వారు ప్రతిరోజు పొలాలకు పోయినపుడు కొన్ని వందల మందితో పోయి దేశ సౌభాగ్యానికి కావలసిన కృషిలన్నిటలోను పాల్గొనుచు వున్నారు. పాడి పరిశ్రమ కేంద్రాలలో వుచితంగా పశువుల మేపుట, పాలుతీయుట, ట్రాక్టర్ల దగ్గరకుపోయి, దుమ్ము వగైరాలను శుభ్రముగా కడిగి తుడుచుట, పండ్లతోటల వారికి తగిన సహాయం చేయుట మున్నగు పనులు యీయువతీ యువకులు పాడిపరిశ్రమకు, వ్యవసాయాభి వృద్ధికి, దేశాభివృద్ధికి ఎంతో కృషి చేస్తున్నారు.

రెండవ ప్రపంచ యుద్ధంలో జకొస్లవేకియాలోని వ్యవసాయానికి, పశుసంపదకు, ఎంతో దెబ్బ తగిలింది. ఈయుద్ధంలో యువకులు ధైర్య సాహసాలతో పోరాడి రష్యాసహాయంతో జర్మనులను ఓడించారు పెట్టుబడి విధానము, జమీందారీ విధానాన్ని, వారి అనుచరులను నశింపచేసి వారి ధనాన్ని, భూములను లాగుకొని ప్రజలకు ఉచితంగా పంచి పెట్టారు. భూస్వాముల దగ్గర నుంచికూడ భూములను లాగుకొని రైతులకు సమానంగా పంచి యిచ్చారు. పరిశ్రమలు బ్యాంకులు, గనులు, జాతీయం చేసారు. ఒకకోటి ముప్పది లక్షల ఎకరాలను పన్నెండు లక్షల ఏడువేల కుటుంబాలకు పంచియిచ్చారు. 1948లోభూములన్నిటిని బ్రిటీషుప్రభుత్వంవశపరచుకొన్నపుడుభూస్వాములు తిరుగ బడగా ప్రభుత్వం అందరిని అణచివైచి ఆభూములను ఫ్యాక్టరీలను రైతులకు, మధ్యతరగతి కుటుంబాల వారికి ఒక్కొక్క కుటుంబానికి ముప్పాదున్నర ఎకరాలు వంతున పంచి యిచ్చారు.

ఈ దేశం పరిశ్రమల దేశంకాదు. వ్యవసాయంమీద పశు సంపద మీద ఆధారపడి యుంటారు. 25 కోట్ల 50 లక్షల ఎకరాల భూమిలో 19 కోట్ల 50 లక్షల ఎకరాలభూమి చాలా సారవంతమైంది ఈ భూములను దున్ని ధాన్యాలు, బంగాళా దుంపలు, బియ్యం, నూనెమొక్కలు, పశుగ్రాసం, పొగాకు మున్నగుపంటలను పండింపు తారు.

1954 నుంచి ఈదేశంలో ప్రతివారు విలువగల వస్త్రాలు, చెప్పులు, సిల్కులు, సిగరెట్లు వుపయోగిస్తున్నారు. ప్రతిగ్రామములోను వైర్లెస్ సెట్లువున్నవి. సహకారసంఘ ప్రతిసభ్యునకు 3 1/2 ఎకరాలు, 4 ఆవులు, 10 గొఱ్ఱెలు, 20 పందులు, కొన్నికోళ్ళు బాతులును ప్రభుత్వం భూస్వాములదగ్గరనుండి లాగుకొన్నవాటిని ఈరీతిగా పంచిపెట్టారు.

ఉత్తర బొహీమియాలోవున్న సహకార సంఘ సభ్యులు ఎక్కువపంటలను, పశుగ్రాసాన్ని వృద్ధి చేయగావచ్చిన ఆదాయంలో చక్కని మోటారు కారులుకూడ కొనుక్కున్నారు. ప్రభుత్వం వారిని గౌరవించి 6 ఆవులను, పందులను, కోళ్ళను బహుమానంగా యిచ్చి "కృషిక్ వీర్" అను బహుమతులనుయిచ్చి ప్రోత్సహించింది. 1952 లో అయిదువందల వ్యవసాయ పాఠశాలలు స్థాపించారు. 1954 లోగ్రామాభివృద్ధికి, వ్యవసాయాభివృద్ధికి పశుసంపదాభివృద్ధికి5౧కోట్ల 44 లక్షల 89 వేల పౌనులు ఖర్చుపెట్టి మహత్తర కృషిచేసింది. 1955 నాటికి 30 రెట్ల ధాన్యం, అధికంగా బంగాళా దుంపలు, నూనె మొక్కలు, పశుగ్రాసాన్ని వృద్ధిచేసారు. పశువులకు గాలికుంటురాగా యువతీయువకులు తమ స్వంతసైకిళ్ళమీద గ్రామాలకుపోయి అంటు రోగాలనుండి కాపాడగా ప్రభుత్వంగుర్తించి వారికి బహుమతులు బిరుదులుయిచ్చి సత్కరించింది.

## టిబెట్టు పశుసంపద

ప్రతి సంవత్సరము చాలా మంది యాత్రికులు టిబెట్టునకు పోతారు మన దేశమునుంచి టిబెట్టునకు పోవుటకు చాలాదగ్గర దారు

లున్నాయి. టిబెట్టు ప్రజలకు పశువులన్న ఎంతో ప్రేమ. ఈ దేశ ప్రజలు బౌద్ధ మతస్థులగుట వల్ల నోరు లేని పశువులను వధించక ఎంతో ప్రేమతో చూస్తారు. గ్రామాలలో కూడా బుద్ధ దేవుని బోధనలు గోపూజ వాటి ప్రాముఖ్యతల గూర్చి బోధిస్తారు. ఏప్రియల్, డిశంబర్ నెలలలో ఆ దేశపు ప్రకృతి రమణీయంగా, ఎంతో ఆనందకరంగా వుంటుంది. ఈ లలామాలలో ఎక్కువ మంది వ్యవసాయాభివృద్ధికి, పశుసంపద అభివృద్ధికి పాటు పడుతూ వున్నారు. వీరికి కూడా పశువుల వలన వ్యవసాయం వలన ఎంతో ఆదాయం కలుగుతూ వుంది

లేహ లెక్క చూచుటకు శోభాయమానంగా మిరిమిట్లు గొల్పుతూ వుంటుంది. ఈ ప్రాంతాలలో వున్న పచ్చికబీళ్ళలో మేసే పశువులు కూడా ఎంతో బలకరంగాను, ఆరోగ్య వంతంగాను వుంటాయి లామాలు ప్రతి రోజు గ్రామాలకు పోయి ప్రజలను హింసించరాదు, భూతదయ కలిగి యుండాలి, జంతువులను కరుణతో చూస్తూవుండాలి. దలైలామా మన సద్గురువు గాన వారిబోధలే మనకు ప్రాణ తుల్యాలు కాన ఎల్లరు ఆయన బోధనలకు లోబడి వుండాలి.

చైనాదేశం ఈటిబెట్టు దేశ పురోగమనానికి పాటుపడుచూ, ఉత్తమ జాతి పశువుల పంపుట, జంతువైద్య శాలలను, పశువైద్య కళాశాలలను గోసంరక్షణాలయాలను ఏర్పరచి ఎంతోసహాయం చేస్తున్నారు. అంటురోగాల నుంచి కూడా జంతువులను కాపాడు చున్నారు.

## వియత్‌నాం – పశుసంపద

ప్రపంచములోనున్న అన్ని దేశాలు ఈ దేశానికి స్వాతంత్ర్యం లభించిందని గుర్తించాయి. తొమ్మిది సంవత్సరాలపాటు జరిగిన యుద్ధంలో ఈ దేశమంతా నాశనమయింది. ఫ్రెంచి సామ్రాజ్య వాదులు వుత్తమజాతి పశువులను కాజేశారు. పశుసంపద నంతా పతనంచేశారు. ఫ్రెంచి బాంబర్ల దాడులవల్ల పంటపొలాలు ధ్వంసమై

పశువులకు అంటురోగాలుసోకి చనిపోయాయి. ఈనాడు ఈ దేశంలో శాంతియుత నిర్మాణకృషి ముమ్మరంగా సాగుతోంది. సాధించ బడ్డ విజయాలు సామాన్యమైనవికావు. దేశములోని రోడ్లలో నూటికి 80 వంతులు మరమ్మతుచేయబడినాయి చైనా రష్యా దేశాల సహాయంతో వ్యవసాయం పశుసంపద వృద్ధిచెందింది. వియటునాం రైతులు పెద్ద పెద్ద యిరిగేషనులు, గుంటలు, కాలువలు, పశు వైద్యాలయాలు, మరుగుదొడ్లు, పశుగ్రాసం, బంజరుభూములసాగులు పునర్నిర్మించారు ఇచ్చట కూడ భూస్వాముల నుండి భూములు, వ్యవసాయపనిముట్లు, పశువులు ప్రభుత్వంలాగుకొని ప్రజలకుఉచితంగా పంచిపెట్టింది

1954 నుండి ఉత్తరవియత్నాం లోని నాలుగు రాష్ట్రాలలో 74 లక్షలజనాభాగల 270 గ్రామాలలో వ్యవసాయ సంస్కరణలు జరుపబడినాయి. 1008 గ్రామాలలో భూమిశిస్తు లేకుండా రైతులు పంటలు పండించుకొని వాడేపంటలను అభివృద్ధిపరచారు. మూడు లక్షల60 వేలఎకరాలబంజరుభూములను సాగుచేసి వ్యవసాయపంటలు, పశుపోషణకు కావలసిన పశుగ్రాసాలు వుత్పత్తిచేసారు పాఠశాలలోని విద్యార్థులకు వ్యవసాయం పశుపోషణ ప్రాథమిక పశు చికిత్సను గూర్చిన విషయాలెన్నో బోధించుతూవున్నారు చైనానుండి వచ్చిన అతిథులు, రష్యానుంచివచ్చిన ప్రతినిధివర్గం ఈ దేశీయులు చేసిన మహత్తర కృషినిగూర్చి ఎంతో ప్రశంసించారు. కిన్‌నార్ అనేరైతు మంచివుత్తమజాతి పశువులను మేపినందుకు ప్రభుత్వం "పశుసేవక్ అను బిరుదునుయిచ్చి సత్కరించింది.

## ఫిన్లండు - పశుసంపద

ఈదేశపుపరిస్థితి చాలాచల్లదనంగా, మంచుతో, దట్టమైనఅడ వులతో నిండివుంటుంది. గల్ఫుస్ట్రీముచది ఈదేశంలోగుండా ప్రవహిం చుతూవుంది ఈ గల్ఫుస్ట్రీము అనగా వేడినీటి ప్రవాహముగల నది. ఈ దేశంలో వున్న జనులు నూటికి 35 మంది పట్టణాలలో నివసిస్తూ

వున్నారు. ఈరోజున ఫిన్లండులో రైతులభార్యలే పశువులను పెంచుటలో, పాడిపరిశ్రమలో ముందంజవేశారు. ప్రతిరైతుకుపాడి కేంద్రము వుంటుంది. ఈకేంద్రాలను స్త్రీలే చక్కగా నిర్వహిస్తారు పొలాలలో పనిచేయుడానికి కూలీలు కావనెనంటే స్త్రీలే ఎక్కువగా పనిచేస్తారు. రైతులంతా వేసవికాలంలో పొలాలలోను శీతాకాలంలో అడవులలోనుపనిచేస్తారు. గుర్రాలు, కుక్కలు తమరైతులకుపొలాలకుఆహారము తీసికొని పోతాయి. పాడి పశువులంటేఎంతో ప్రేమ. వాటిని తమ ప్రాణాలకంటె రైతులు జాగ్రత్తగా కాపాడుతారు ఫిన్లండులోవుండే పాడిపశువులన్నియు ఉత్తమజాతిలో చేరినవే. ఈజాతిపశువుల గొప్పతనము, వాటి లక్షణాలనుగూర్చి ప్రభుత్వం పుస్తకాలద్వారా ప్రకటించింది. పాడి పశువులను మాత్రం మాంసానికి వాడరు. యంత్రాల ద్వారా పాలు తీస్తారు.

1953 లో॥ ఒకలక్షా 20 వేల దుప్పులను అడవులలో వేటాడి వాటిమాంసమును ఎగుమతిచేసి ఎంతోధనాన్ని సంపాదించారు. తేనెటీగలపరిశ్రమనుకూడ ఎంతోఅభివృద్ధిపరచారు 1954 సం॥లోఫిన్లండు దేశము ఎనిమిదిటన్నుల పందిమాంసమును తదితరదేశాలకు ఎగుమతి చేసింది. యింకను మంచిరంగులను తయారుచేసి ఎగుమతి చేస్తుంది. ఇంకను 1953 లో కొత్తగా 50కసాయశాలలును, 50 పాడిపరిశ్రమాలయాలను స్థాపించారు. పది మిలియనులటన్నుల జున్నును యితర దేశాలకు ఎగుమతిచేసారు.

30707 ఆవులను ప్రభుత్వం వుత్తమ జాతిగా ఎన్నుకొని వాటి లక్షణాలను గుర్తించి ప్రభుత్వ గ్రంథాల రూపంలో ప్రకటించింది ఈజాతి ఆవు 3398 పౌనుల పాలుసగటున యిచ్చింది. తెలికపిండి. కొబ్బరిపిండి, పాలు వృద్ధి అయ్యే విటమినులు, మంచిపచ్చగడ్డి జాతులు వేళల ప్రకారం యిచ్చుటవల్లనే ఈజాతి పశువులపాలకు కారణం. పశువులను మేపుటకన్న, వాటిపోషణ, అంటురోగాల

రాకుండా కాపాడి పశుసంపదను వృద్ధిపరచుట, పందుల పరిశ్రమ, కోళ్ళపరిశ్రమ, మేకల గొఱ్ఱెల పరిశ్రమ మున్నగువాటిని ఎంతో వృద్ధి పరచారు

ఉత్తమజాతి పశువులను వృద్ధిచేయ తలంచి ప్రభుత్వం 2900 పర్యాయములు తమ దేశములో వున్న పశువుల నన్నిటిని సమావేశ పరచి వాటి లక్షణాలను గుర్తించి అ. సాంప్రదాయము గలవని ప్రభుత్వ పుస్తకాలలో ప్రకటించారు. ఇపుడు సహకార సంఘాలలో ఆమనందల ఎయిర్ షైర్ జాతి ఆబోతులను, 2250 ఫిన్లండు ఆబోతులను వుత్తమ జాతిపశువులుగా అభివృద్ధి పరస్తున్నారు. 1947 లో కృత్రిమ గర్భోత్పత్తి విధానాన్ని అమలుపరచి పశువుల పెంపకాన్ని అభివృద్ధి చేసారు. ఇప్పుడు మాత్రం ఈకృత్రిమ గర్భంవల్ల పుట్టినపశువులు ఎక్కువగా అభివృద్ధిచెందుట లేదు. డెన్మార్కు, స్వీడను, ఫిన్లండు పాడిపరిశ్రమలో ఒకే పద్ధతిలో పాడిపరిశ్రమను నడుపుతున్నాయి. ప్రతిరైతుకు ఎనిమిది ఆవులు కనీసము వుంటాయి వాటి పాలు త్రాగగా మిగిలినవాటనుండి జున్ను వెన్నలను తయారుచేసి యితర దేశాలకు పంపుతూవుంటారు ఇంకను ప్రాథమిక పశువైద్య కేంద్రాలను, పాడిపరిశ్రమ కేంద్రాలను, ఎక్కువగా యేర్పాటు చేసి గ్రామాల అభివృద్ధికి పాటుపడుతున్నారు

## బర్మా పశుసంపద

బర్మా వ్యవసాయ దేశము. ఈదేశానికికూడ పశువులు చాలా అవసరం. ఎందుచేతనంటే ఈదేశప్రజలు గుఱ్ఱాలతోను, ట్రాక్టర్ల తోను భూములుదున్నుట లేదు మనహిందూదేశమువలె పశువుల మీాద బర్మాఆధారపడివుంది. బర్మాదేశస్థులుకూడ ఎక్కువగా బౌద్ధ మతాన్నే అవలంభించేవారైయుండుటవల్ల పశువులను తమకన్న బిడ్డలలాగా చూస్తూవుంటారు. బర్మా ముఖ్యపట్టణమగు రంగూనులోఒకపశువైద్య కళాశాల వుంది.దీనిలో తర్ఫీదైనవైద్యులందరికి ప్రభుత్వంవుద్యోగాలు యిచ్చి పశుగణాభివృద్ధికి తోడ్పడుకొంది. ప్రతిరోజు బౌద్ధమతస్థులు

గ్రామాలకుపోయి గోవులను పూజించాలి. గోవేతల్లి గోవేతండ్రి. అరువదిఆరుపిండలు ఆవ్రచంటిలో ఉన్నాయి. అహింసా పరమోధర్మః అని భోధిస్తూవుంటారు

బర్మా దేశం ఎక్కువగా ధాన్యాన్ని యితర దేశాలకు ఎగుమతి చేస్తారు. బ్రిటీష్‌వారి పాలనలో వున్నప్పుడు బర్మాలోని వుత్తమజాతి పశువులను తమ దేశానికి తీసికొనిపోయి పశుసంపదనునాశనం చేసి రనుటకు సందేహములేదు స్వాతంత్ర్యము సంపాదించిన తరువాత పశువైద్యశాఖవారు, వ్యవసాయశాఖవారు పశుసంపదను అభివృద్ధి పరచి వాటికివచ్చే వివిధరకాల అంటురోగాలకు టీకాలు వేయుటకు ప్రతిరోజు పశువైద్య శాఖాధికారులు గ్రామాలకుపోయి అంటు రోగాలు సోకకుండా పశువుల కొట్టాలు ఎట్లువుండాలో, పశుసంపదకు ఎట్లుకృషి చేయాలో, ప్రాథమిక పశుచికిత్సలలో రైతులు ఏరీతిగా పాల్గొనాలో మున్నగువిషయాలు బర్మా భాషలో వుపన్యాసాలు యిస్తూవుంటారు. బర్మాలోని పశుజాతులన్నియు ఎక్కువగా భారత దేశాన్నుంచి, థాయిలాండునుంచి దిగుమతిచేసుకొంటూ వుంటారు. ఈ జాతులను బండ్లులాగుటలోను, భూమిదున్నుటలోను సక్కగా పనిచేయించు చున్నారు

## రుమేనియా పశుసంపద

ఈ దేశపు వ్యవసాయము, పశుసంపద గ్రామాలలో అభివృద్ధి పరచుటకు ప్రభుత్వం ఎక్కువ కృషి సల్పుచు ప్రజలమన్ననలను పొందుతూవుంది. బంజరుభూములనుసాగు చేయుటవల్ల అయిదులక్షల టన్నుల పశుగ్రాసాన్ని అదనంగా పండించారు. ఇందువల్ల పాడివృద్ధి పొందింది. 1949 లో రుమేనియా వ్యవసాయములో స్వయంకృషితో వచ్చింది. ప్రత్యేకంగా పదునైదు పెద్దకళాశాలలనుస్థాపించి పశు వైద్యం, వ్యవసాయాన్ని గూర్చి బోధించుతున్నారు. ఇంకను 65 వేసంగిపారశాలలను స్థాపించి పశువైద్య అధికారులు గ్రామాలలో అయిదువేల మంది ప్రాథమిక పశువైద్యులుగా తయారుచేసారు.

రుమేనియా ముఖ్యపట్టణ మైన బుకారెస్టులో ఒక పశువైద్య పరిశోధనాలయం, పశువైద్యకళాశాలవుంది. ప్రాథమిక పశువైద్యులకు ప్రాథమిక శస్త్రపరికరాలు, మందులుయిచ్చుతూ పశుసంపదకు తోడ్పడు తున్నారు. 1953 లో క్రొత్తగా 90 వేసంగి వ్యవసాయ పశువైద్య పాఠశాలలను నెలకొల్పి ఎక్కువగా యువకులకు, స్త్రీలకు శిక్షణ యిప్పించి గ్రామాలలోని పశుసంపదకు వుచిత చికిత్సలు ప్రభుత్వంచేయుంచుతూవుంది ఇతర దేశాలలోని పశువైద్యగ్రంధాలను తెప్పించి రుమేనియా భాషలోనికి తర్జుమా చేయించి, ఉచితంగా గ్రామపశువైద్యులకుబోధించుతున్నారు. గతమూడుసంవత్సరాలనుంచి సహకారసంఘాలు పాడిపరిశ్రమ, వ్యవసాయ అభివృద్ధికి పాటుపడుతున్నాయి. ప్రత్తిగింజలను పశువులకుపెట్టి మంచివిటమినులు గల పాలను తమపశువులనుంచి సంపాదించుకుంటున్నారు.

## ఇటలీ - పశుసంపద

ఇటలీ దేశములోని పట్టణాలను చూచుటకు అందముగా వుంటాయి డెన్మార్కు ప్రపంచములోకెల్ల పాలడబ్బాలను ఎగుమతి చేయడంలో ప్రసిద్ధి. ఇటలీ దేశమువారికి డెన్మార్కు పాడి పరిశ్రమ పశుపోషణ ఏరీతిగా చేసికోవాలో బోధించారు. 1954 లో నదులు సముద్రాలు పొంగి అంటురోగాలు సంభవించుటవల్ల పశువులు తరిగి పోయాయి. అప్పుడు డెన్మార్కు ప్రభుత్వం ఇటలీవారికి తక్కువ వెలకు పాడిపశువులను ఆశోతునను అమ్మినారు. డెన్మార్కుపశువులకు ఇటలీ శీతోష్ణస్థితి అహారపానీయాలు పడక డెన్మార్కులో యిచ్చుచున్న పాలుయిచ్చుట లేదని ప్రభుత్వ ప్రకటనలోవుంది. 1950 లో కూడ సముద్రాలు నదులు పొంగి వరదలవల్ల అంటురోగాలు ప్రబలినాయి. పశుసంపద చాలావరకు నశించింది. రోము పట్టణపరిహద్దు ప్రాంతాలలోకూడ ఎన్నో పశువులు మరణించగా టీకాలను వేసి పశువులను ప్రభుత్వం కాపాడింది. 1953 లో ఇరువది పశుశాలల నిర్మించి కృత్రిమ గర్భోత్పత్తి విధానాలను అమలుపరచారు.

వీరు ఉత్తమజాతి పశువులను యితర దేశాలనుంచి దిగుమతి చేసికొన్నారు. ఇటలీలో మంచిపాలిచ్చు పశువుల సంఖ్య చాలా తక్కువ. పశువులనుపాలకొరకుమాంసముకొరకువాడుకొనుచున్నారు. ఇటలీలో పశువుల సంఖ్య తరిగిపోవుటవల్ల డెన్మార్కు దేశంచూచి సహించలేక రెండు దేశాల పరస్పరాభి వృద్ధికొరకు 50 వుత్తమజాతి పశువులను పది వుత్తమజాతి ఆబోతులను ఎగుమతి చేసారు.

## బెల్జియం-పశుసంపద

బెల్జియంకాంగో చూడడానికి ప్రకృతి రమణీయంగా వుంటుంది ఈ కాంగో చుట్టు విశాలమగు పచ్చిక బయళ్ళు బంగారం వలె ధగధగ మెరుస్తూ వుంటాయి. ఇచ్చట వుండే అడవులను, కొండలను తప్పక ప్రతివారు చూడాలి. ఈ అరణ్యాలలో అందమైన పక్షులు, బలముగల అడవిపశువులు వుండుటవల్ల ఒకే పర్యాయము చాలా మంచి వేటగాండ్రు వచ్చి ఈ పశువులను వేటాడుతారు ఎక్కువ మంది లేనిచో పశువులు వారిని చంపివేస్తాయి. ఈ పశువులు చూచుటకు భయంకరంగాను, కొమ్ములు దుప్పికొమ్ములవలె పొడవుగాను వుంటాయి. ఇట్టి పశువులను పట్టి మచ్చికచేసికొని క్రమేపి మామూలు పశువులలోకి తోలుతూ వుంటారు.

ఈదేశంలో డాగోమిజాతి, లుగ్ వారిట్, జహీమా, బోలైన్సు, డిమటేబా, సోంగా, కిసంతు, బహీమా, కివూ, ఆలూరు, యూరిండీ అను పశుజాతులు వున్నాయి. ఉత్తమజాతి పశువులను గుర్తించి వాటిలక్షణాలు, గుణాలు, ఫొటోలద్వారా ప్రభుత్వం ఒక పుస్తకం ప్రకటించింది. ముఖ్యంగా వీరు పశువులను మాంసముకొరకు పాల కొరకు వుపయోగించు కొంటున్నారు.

ఇచ్చటకూడ క్షయ, పిచ్చికుక్క కరచుట, అంటురోగాలు, పొదుగువాపు, దూడల జబ్బులు, కుక్కల గొర్రెలజబ్బులను పరీక్షించి తగిన చికిత్సలు, తగిన ఇంజెక్షన్సు చేస్తూవుంటారు. ఈదేశములో

వున్న గెంట్ పశువైద్య కళాశాల ప్రసిద్ధికెక్కింది. ఈ కళాశాలలో అన్ని ప్రాంతాల నుంచివచ్చి విద్యార్థులు విద్యను అభ్యసిస్తారు. ఇందులో రసాయనశాస్త్రం, విజ్ఞానశాస్త్రం, శారీరశాస్త్రం, పాడి పరిశ్రమ, శస్త్రచికిత్సలు, రోగాలు. చికిత్సలు మున్నగువాటిని గురించి పరిశోధించిన విషయాలన్నీ విద్యార్థులకు చెప్తూతారు

## న్యూజిలాండు - పశుసంపద

బ్రిటను, అమెరికా, యూరపు దేశాలకన్న న్యూజిలాండు వారు దూడలను పెంచుటలో మంచి నేర్పరులు. న్యూజిలాండుఆవులు కూడా ఇంగ్లండు, హాలెండు ఆవులతో సమానంగా పాలు యిస్తు న్నాయి. ఇతర దేశాలలో సంవత్సరం పొడవునా ఆవులు ఈనుతూ వుంటాయి. ఈదేశములో శీతోష్ణస్థితివల్ల, దేశముచుట్టు నీరువుండుట వల్ల, సముద్రపు గాలివల్ల ఆవులన్నియు ఒకే ఋతువులో ఈనుతాయి. ఈనిన దూడలను ఆరు మాసాలు జాగ్రత్తగా పెంచి తదుపరి ప్రతి రోజు పచ్చిక బీళ్ళకుతోలుకొని పోతారు. ఇంకను దూడలుబలియు టకు లవణాలు, విటమినులు, చేపనూనెలు, తేలికగా జీర్ణమయ్యే ఆహార పదార్థాలు యిచ్చుతారు. ఇంకను దూడలను ఏపూట కాపూట ఎక్కువతక్కువలు లేకుండా పాలుకుడుపుట, పరిశుభ్రంగా తుడుచుట కడుగుట చేస్తూ వుంటారు. ఇంకను వాటికి నిర్మించిన సుందర గోశాలలో తోలుతారు. ఎప్పటికప్పుడు లోపను నీటితో కడిగి కొట్టాలను శుభ్రము చేస్తారు. పనికిరాని దూడలను మాంసము కొరకు వుపయోగిస్తారు దూడల పోషణను గూర్చి ప్రభుత్వం కరపత్రములు ప్రకటించి రైతులకు పంచి పెట్టుతారు. ఈ జాతి దూడలు రెండు సంవత్సరాలు రాగానే 700 నుంచి 720 పౌనుల తూకము వుండునని ప్రభుత్వం తెలుపుతూ వుంది.

న్యూజిలాండులో క్షయ వ్యాధి మాత్రం జాస్తిగా వుంటుంది. ఈరోగాన్ని పరిశోధించి ఇంజెక్షన్సు ద్వారా రోగాన్ని అరికట్టారు. పాడి పరిశ్రమను గూర్చి ఎంతో శ్రద్ధ తీసుకోవడం వల్ల సంవత్స

శానికి ఆరువేలటన్నుల జున్నును వెన్నను ఎగుమతి చేస్తున్నారు ఈ దేశంలో 18లక్షల40వేల ఆవులువున్నాయని ప్రభుత్వంప్రకటించింది. పోడుగులకు మెత్త గావుండేనుందులను రాస్తారు. రాకూరు పరిశోధన శాలలో జెర్సీజాతి పశువులను పెంచు తున్నారు ఈ దేశంలో పశు చికిత్సకు వలయు కళాశాలలు. ప్రాథమిక పశు చికిత్సా లయాలు స్థాపించి అవుసర మున్నపుడెల్ల గ్రామాలలో ప్రచారం చేస్తూ వుంటారు.

## హంగేరీ-పశుసంపద

ఈదేశము చాలా చిన్నది. ఈమధ్యనే రష్యావారు వశపరచు కొన్నారు పది సంవత్సరాల నుంచి ఈదేశం అన్నివిషయాలలోను ముందంజవేసింది. పశువైద్యశాలలు, గోశాలలు, పందులు, కోళ్ళ శాలలు, జంతుసంపదను ఎంతో అభివృద్ధి పరచింది. ఉత్తమజాతి పశువులకు ప్రత్యేకంగా సిమ్మెంటు ఆధునిక పద్ధతులలో పశువుల గొట్టాలు, వైద్యశాలలను ఏర్పాటుచేసారు. టిస్జనదికి, హార్డుబేగినదికి దక్కని ఆనకట్టలుకట్టి పంటకాల్వలను త్రవ్వి భూములనుదున్ని ఎక్కువ పంటలను, పశుగ్రాసాలను పండిస్తున్నారు.

1950 లో ఈదేశములోని ప్రజల జీవితంలో గొప్పమార్పు వచ్చింది 1953 లో గొర్రెలను, పందులను కాచుటకు కొంతధనం హెచ్చించి కుక్కలను పెంచారు. తనదేశంలోనున్న మూలికలతో అన్నిరకాల జంతువులకు చికిత్సలుచేసి కొనుచున్నారు. వ్యవసాయ కళాశాలలు, పశువైద్య పారశాలలు, జంతు ధర్మవైద్య శాలలను మునుపటికంటె ఎంతో అభివృద్ధిపరచారు. గాతులకు కోళ్ళకు పందు లకు, కుక్కలకు వచ్చేరోగాలను పరిశోధనలుచేసి అరికట్టారు. ఇచ్చట చేపల పరిశ్రమకూడా వుంది. ఒక్కొక్కచేప పది పౌనుల బరువు వుంటుంది. ఈ చేపలను తదితర దేశాలకు ఎగుమతిచేస్తారు. ఈ దేశములో బేయడర్ అనుయువతి ఆవులను దూడలను పెంచుటలో మంచి నేర్పరితనం వుండుటవల్ల ప్రభుత్వం సన్మానించింది. ఈమె

దగ్గరనున్న ఆవు నాలుగువేల లిట్టర్లపాలు యిచ్చినదట. ఒకే పర్యాయం ఒక ఆవునకు నాలుగు దూడలుపుట్టి యిప్పటికీ బాగున్న వట భూములను ట్రాక్టర్లతోను, గుఱ్ఱాలతోను దున్నెదరు ఇంకను అడవులలోని చెట్ల ఉపయోగాలను పరిశోధించి ఇంకా ఎక్కువ అరణ్యాలు పెంపొందుటకు క్రొత్తఅడవులు ఏర్పాటు చేయుచున్నారు. కొన్ని వేల ఎకరాలలో ఓట్లు, బార్లీ, రై, గోధుమ, వరిధాన్యాలు, కూరగాయలు, పొగాకువగైరా పండించుతారు.

## ఫ్రెంచి - పశుసంపద

కాల్ రాబర్టు కాలంలో పశు సంపద వ్యవసాయం వృద్ధి చెందింది. కాని 14వ లూయీ వచ్చినతర్వాత పశుసంపద నాశన మయింది. ఈతను తనదృష్టినంతా యుద్ధాలలో నింపుతూ పాడిపంటల అభివృద్ధికి పాటుపడలేదు. మంచిఉత్తమ జాతిపశువులను మాంసము కొరకు సైనికులకు పంపిస్తూవుండేవాడు ఈతను మూలానే ఫ్రాన్సు దేశమంతా క్షీణించుటవల్ల పశుసంపద వృద్ధికాలేదు.

ఫ్రెంచి విప్లవమునకు కారణము ప్రజలకు తిండి బట్ట దొరకక పోవుటవల్ల, జమీందార్లు మధ్యమ తరగతివారినుండి మంచిజాతి పశువులను తీసుకొనుటవలన్ను పాడిపరిశ్రమకు మంచిదెబ్బ తగిలింది. ఇందుచేత ప్రజలు ప్రభుత్వంపై దాడిచేయ వచ్చింది. ఇంకను లూయీకాలంలో పశువులకు అంటురోగాలు ప్రబలగాపశువైద్యులు లంచా మరగి రైతులను పీల్చిపిప్పిచేసారు 1793 లో రాజును వురితీసి ప్రజాప్రభుత్వాన్ని ఏర్పరచుకొన్నారు.

ఫ్రెంచినాయకుడును, మస్తులులేని ప్రభుతోద్యోగి అయిన నెపోలియన్ చక్రవర్తి అధికారానికిరాగానేపాడిపంటలకుపాటుపడి పాడి పరిశ్రమ కేంద్రాలు, జంతు చికిత్సాలయాలు నిర్మించాడు. ఇతనికి గుఱ్ఱాలన్న, పాడిపశువులన్నా కుక్కలన్నా మంచిప్రేమ. నెపోలియన్ దెబ్బకుతట్టుకోలేక పశువైద్యశాఖావారు పశుసంపదకొరకు ఎంతో

పాటుపడ్డారు. నెపోలియన్‌కు గుఱ్ఱపుస్వారియన్నా ఎంతోసర్దా నెపోలియన్ దృష్టి ఎల్లప్పుడు యుద్ధాలలో మునిగి వుండేది. అతను పశుసంపదకొరకు ఎంతపాటుపడెనో అంతనాశనకారుడైనాడు. యుద్ధాలతో మునిగిపోయిన తరువాత పశుసంపద అంతా అంటురోగాలతో నాశనమైంది. పశువైద్యులు శ్రద్ధగా చూడలేదు. ఈఆధునిక యుగంలో మాత్రం పశుసంపద వృద్ధిఅయింది బంజరుభూములను సాగుచేసిపశుగ్రాసం పండించుతున్నారు. తమకుమిగలగావున్న 50 వేలటన్నుల గ్రాసాన్ని తదితర దేశాలకు ఎగుమతిచేసారు. 1952 లో 54 లక్షల 40 వేల గుఱ్ఱాలు, 88 లక్షల పందులు, 16 మిలియనుల పశువులు, 99 లక్షల కోళ్ళు, 12 మిలియనుల గొఱ్ఱెలు వున్నట్లు ప్రభుత్వం ప్రకటించింది. వీరి గుఱ్ఱాలను స్పెయిన్, అమెరికా దేశాలకు ఎగుమతిచేసారు.

## డచ్చి పశుసంపద

డచ్చివారు నివసించే ప్రాంతాన్ని నెదర్లాండ్సని పిలుస్తారు. ఈదేశంలో పాలు యిచ్చే ఆవులు ఒక కోటి రెండు లక్షల ఏబదివేలు. దూడలు, ఆబోతులు కలసి 12 లక్షలు గలవని వ్యవసాయ శాఖ తెల్పినది. మాంసానికి పనికి వచ్చే పశువులు నదుల దగ్గర, ముఖ్య కేంద్రాలలో ప్రభుత్వసహాయంతో పెంచబడుతూ వుంది. వి. హేగ్. ఎమస్టర్‌డాం ప్రాంతాన దక్కని పచ్చిక బీళ్ళువున్నవి. అందులో నలుపు తెలుపు మచ్చలుగల ఆవులు పెంచబడి మంచిపాలనుయిచ్చుచున్నవి. 1953 లో పాలపొడి వెన్న జున్ను తయారు చేయు ఫ్యాక్టరీలను ఆరు వందలను నెలకొల్పిరి. హాలెండులోని పాడిపశువులు సంవత్సరానికి 6.8 మిలియన్ల టన్నుల పాలిచ్చుట వలన గత సంవత్సరం 75% ఆదాయం వచ్చింది. పనికిరాని ఆవులను గోవులను మాంసమునకు వుపయోగించు తున్నారు. పశువులకు కావలసిన ఆహారము 75 % పచ్చిక బీళ్ళ నుంచి లభిస్తున్నది. చాలా శతాబ్దముల నుంచి డచ్చి వారు తమ గృహాలలోని స్త్రీలే పాడిపశువులను పోషించుతూ తామే

హిందూదేశ పద్ధతిగా పాలు తీస్తారు. 25 సంవత్సరాల నుంచివచ్చిక బీళ్ళనుపరిశోధించి ఆగడ్డిలో మంచివిటమిన్సు. పాలను అభివృద్ధిచేసే గుణాలువున్న వని తెలిసికొన్నారు. తన పశువులకు సరిపోనుమిగిలిన 80 వేలటన్నుల పశుగ్రాసాన్ని యితరదేశాలకు ఎగుమతిచేయుచున్నారు.

హాలెండులోని ఆవులు సంవత్సరానికి 3800పౌనుల పాలుయిస్తు న్నాయి.ఆవులవల్లఒక్కొక్క దానినుంచి3.65% వెన్న వచ్చుచున్నది.డచ్చి వారు భూములను గుర్రాలతోను, ట్రాక్టర్లతోను దున్నుచున్నారు. తమదేశంలోనిగుర్రాలను ఇటలీ, బెల్జియం,అమెరికా,స్విట్జర్లాండు మొదలగుదేశాలకు ఎగుమతిచేస్తూవుంటారు. తమపశువులను ఫ్రాన్సు, జర్మనీ, బ్రిటన్, బెల్జియం, స్వీడన్, లగ్జెంబర్గు, గ్రీసు. ఈజిప్టు మొరాకో, బ్రెజిల్, చీనా, అర్జంటయినా, అమెరికా, దక్షిణఆఫ్రికా ఇజ్రాయిల్ దేశాలకు ఎగుమతి చేసారు.

సహకార సంఘాల ద్వారా ఉత్తమజాతి ఆవులను పెంచుతారు. ప్రభుత్వం పశువైద్య కళాశాలల నేర్పరచి పాడిపరిశ్రమ, పాడి పశువుల పోషణ, శరీర శాస్త్రం, చికిత్సలు, అంటురోగాలకు టీకాలు, శస్త్రచికిత్సలు మున్నగు వాటిలో పశువైద్యులకు తర్ఫీదు యిస్తారు. గోవుల యజమానులకు మంచి బహుమతులు యిచ్చి జాతిని పెంపొందింప జేస్తారు. డచ్చిదేశం పాడిపరిశ్రమకు, పశు పోషణకు పుట్టినిల్లు అని చెప్పవచ్చును.

## మంగోలియా-పశుసంపద

ఈదేశాభివృద్ధికి ప్రణాళికలలో గ్రామీణ సౌకర్యాలు, వ్యవసాయాభివృద్ధి, పశుపోషణ, పశుగ్రాసం, పాడి పరిశ్రమ మున్నగు విషయాలను అన్నిటిని జేర్చిఅమలుజరుపు తున్నారు. పశుపోషణ పద్ధతులను గ్రామాలలోని ప్రజలకు బోధించడానికి విద్యార్థులు కృషి చేస్తున్నారు. మంగోలియా పశువైద్య కళాశాలలోపశువులు,గుఱ్ఱాలు, గొఱ్ఱెలు, ఒంటెలు, పాడి పశువులు మున్నగు వాటిని అభివృద్ధి పరుస్తున్నారు.

## ఆస్ట్రియా పశు సంపద

ఈదేశంలో కుక్కలు, కోళ్ళు, గుఱ్ఱాలు, మేకలు, పశువులను పెంచుటలో మంచినేర్పరులు వున్నారు. కుక్కలమీద వున్నంత మక్కువ తదితరజంతువులమీద అంతగా కన్పట్టదు. ప్రతిపట్టణము యందు కొన్నియిండ్లముందర గేటుకు బోర్డుతగిలిస్తారు. పరధ్యానంగా ఈబోర్డును చూడకుండా ఎవరైనా మాయింట్లోకివస్తే కుక్కలు కరుస్తాయి. తరువాత మీాయిష్టం. మంచిజాతికుక్కలను పెంచుతారు. అవి బజారులో నడుస్తూవుంటె గొప్పరాజఠీవిగా పోతూవుంటే ఎల్లరు హడలిపోతారు. ఈకుక్కలవల్ల బాధపడేవారిలో పోస్టు బంట్రోతు ఒకడు. ఆస్ట్రియా ముఖ్యపట్టణమైన వియన్నాలో ఒకపోస్టుమేన్ మీాదకు వస్తున్న వేటకుక్కను తనచేతికర్రతో కొట్టి గాయపరచగా, ఆతనిపై కుక్కయజమాని కేసుపెట్టగా పోస్టుబంట్రోతుకు జుల్మానా విధించారట. ఇంతవరకు పోయినసంవత్సరము 620 మందిపోస్టుజవాను లనుకరవగా డాక్టర్లకు గిరాకిఅయిందట ఈ శునకాలను మంచి చేసుకోవడానికి పోస్టుజవానులు ఒక ప్రణాళిక ఎన్నారట. దేవుడైనా సరే లంచమిస్తేగాని లొంగడన్నట్లుగా శునకాలకు తీపిమిఠాయి, మాంసపు బిస్కట్లుపెట్టి వాటిని బుజ్జగించి లోపలకు పోతూవుంటే యజమాని, తదితరులు నవ్వుతూవుంటారు. కాని ఈకుక్కల వలన యజమానులకు ఎంతో వుపయోగముగా వుంది. వియన్నా ప్రాంతాలలో పోయిన సంవత్సరం నేరాలకు అరెస్టయిన వారిలో నూటికి 80 మంది కుక్కలవల్లనే పట్టుబడినారని ఆస్ట్రియా వార్తా సంస్థవారు ప్రకటించిన కరపత్రంలో వుంది.

## అల్బేనియా - పశుసంపద

ఈదేశపుప్రజలు సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో సభ్యులుగా చేరి పాడిపంటలకొరకు అభివృద్ధిపరుస్తున్నారు. వీరుఎక్కువగా గోధుమ పంట, మొక్కజొన్న పంటపండిస్తున్నారు ఇప్పుడు ప్రతిసమిష్టి వ్యవ

సాయ క్షేత్రాలలోను 13630కోళ్లకు తక్కువ లేకుండావున్నాయి. ఈ క్షేత్రాలలో గ్రామరైతులకు వారిబిడ్డలకు స్త్రీలకు ప్రాధమికోపాధ్యాయులకు కోళ్లపెంపకము, వాటిరోగనిర్మూలనాలను గూర్చి బోధించుతూవుంటారు. చిత్రికపొట్టులో అమర్చబడిన కోడిగుడ్లు ప్రతిరోజు నగరాలకు పంపబడుతాయి.

పెద్దకిటికీలు,విద్యుత్ సౌకర్యాలు,గాలివచ్చేటట్లుగాకోళ్ళకుశాలలు నిర్మిస్తారు. గుడ్లను తక్కువవెలకు అమ్ముచూ అదనంగా 9 లక్షల టన్నులగుడ్లను తదితరదేశాలకు ఎగుమతిచేస్తారు. విద్యుత్ సహాయంతో పాలకేంద్రాలలో పాలుపితుకుతున్నారు. గొఱ్ఱెల పెంపకశాలలలో నడిచేకత్తెరలతో ఉన్ని నితీస్తున్నారు ఇంకను పాలవుత్పత్తి గౌరెలను పెంచుమార్గాలు బోధిస్తూవుంటారు.

## ఉత్తరకొరియా - పశుసంపద

ఉత్తరకొరియా రాజధానియగు "ప్యాంగ్‌యాంగ్ " లో బ్రహ్మాండమైన ప్రదర్శనం జరిగింది. దూరపు ప్రాంతాలనుంచి కూడా విచ్చేసి ఈ ప్రదర్శనాన్ని చూచి ఆశ్చర్య పోయారు. ఈ ప్రదర్శనంలో కుక్కలు, గుఱ్ఱములు, కోళ్ళు, మేకలు, పశువులు, గొఱ్ఱెలు,పందులు బాతులు ఆరువేలుదాకా పాల్గొన్నాయి. ఉత్తరకొరియా ప్రధాని "కంయూర్‌సన్'' ఈ ప్రదర్శనాన్ని ప్రారంభించారు. మన పశువుల వలె వీటికి మూపురాలు వుంటాయి. ఈ మధ్య ప్యాంగ్ యాంగ్ లో క్షీరకేంద్ర నిపుణులు సమావేశమై పాలవుత్పత్తి, పశుపోషణలను గూర్చి చర్చించారు.

## ఐర్లండు పశు సంపద

ఈదేశంలో పాడిపశువులు ఎక్కువగావున్నవి. గ్రామాలు అభివృద్ధిచేయుటకు వంద కీలకగ్రామకేంద్రాలను ఏర్పాటుచేసారు. కృత్రిమ గర్భోత్పత్తిచే పుట్టినపశువులను మాంసంకొరకు ఏర్పాటు

చేసారు పశువుల ఖామందులు అభివృద్ధి చెందిన పశు సంతతిని జాగ్రత్తగా మేపుటకు తగిన పశుగ్రాసపు బీళ్ళను ఏర్పాటు చేసారు. వీరు పందులను పోషించుటలో బహునేర్పరులు.

అయిర్లండు బ్రిటిష్‌దీవులలో ఒక భాగము. ఆంగ్లేయభాష మాట్లాడుతారు. ఇచ్చట పశుజాతులకు మూపురాలు వుండవు. ఇచట పాడిపశువులు సంవత్సరానిక 3500 కిలోగ్రాముల పాలు యిస్తున్నాయి. ఈనాడు శక్తివంతమైన పరిశ్రమలు, వ్యవసాయ పనిముట్లు, ట్రాక్టర్లు, క్షీరోత్పత్తిశాలలు, అభివృద్ధిపరచారు. 1953 లో అదనంగా 6 కోట్ల 20 లక్షలటన్నుల ధాన్యము, అదనంగా పశు గ్రాసం, గోధుమగడ్డి వుత్పత్తి చేసారు.

## ఉత్తరనార్తంబర్ అండిజాతి

ఈదేశంలోని చిల్లింగ్‌హామ్ పార్కులో నివసించే పశువులు చాలా ప్రసిద్ధికెక్కినాయి. 13 వ శతాబ్దంలో పశువు లన్నింటిని బయటకు పోకుండా ఈపార్కులోనే వుంచారట. ఈపార్కు 600 ఎకరాల విస్తీర్ణమట ఇవి అవి అడవిఎద్దులతాలూకూ సంతానమనీ, ఈఎద్దులు చరిత్రకందని కాలంలో బ్రిటనులో తిరుగుతూ వుండేవని నమ్మబడుతోంది.

ఈగొడ్లు భయంకరమైనవి. ఇవిచాలా పోకిరిగా వుండుటవల్ల వీటిదగ్గరకు పోవుటకు ఎవ్వరూ సాహసించరు. ఈమందను పాలించేది "కింగ్ బుల్" అనేఎద్దు. అది శత్రువులతో పోరాడగలిగినంత కాలం తనరాజరికాన్ని వెలుగిస్తూనే వుంటుంది. దూడల్ని లెక్కించుకో వడం, దారితప్పినవాటిని వెదకడం, మందలో శాంతిని కాపాడటం యీఎద్దు బాధ్యత.

గొడ్లుఅన్నియు బెదరిపారిపోవడం ప్రారంభిస్తే, యీఎద్దు మాత్రము చివరవరకు వుండి, రాబోయే ప్రమాదాన్ని ఎదుర్కొనే వరకు సిద్ధంగా వుంటుంది. మరొకఎద్దుతో పోట్లాటవచ్చి ఓడిపోతే, తాత్కాలికంగా మందనుంచి వెలివేయ బడుతుంది.

1947 సం॥ చలికాలంలో జబ్బుచేసి 30 పశువులకుగాను 13 మాత్రమే జీవించగలిగినాయి. బ్రతికినవికూడా చలిదెబ్బకు తట్టుకోలేక సంవత్సరంన్నర కాలం కదలకుండా నీరసంగావున్నాయి. ఈజాతి నశించి పోతుందనే భయం శాస్త్రజ్ఞులకు కలిగింది. 700 సం॥ లపాటు పెరగ గలిగినజాతి నాలుగు ఆవులమీద, ఒకఎద్దుమీదా జాతి ఉద్ధరణ బాధ్యత తల్లి మోపవలసి వచ్చింది. కొన్ని ముసలితనంవల్ల చచ్చినప్పటికీ బ్రతికినవి మాత్రము వయసువారీగా ఉండడం ఆశాజనకం. ఎనిమిది సంవత్సరాలుగా ఒకే "కింగ్‌బుల్" కూడాపాలిస్తూనేవుంది. వీటికి మానవులపొత్తూ ఏమాత్రముగిట్టదు. దూడనుఎవరైనా తాకినట్లయితే మందంతా కలిసి వానిని చంపివేస్తుంది. 1947 చలికాంలలో బైటనుంచి పంపిన పచ్చిగడ్డినికూడా యివితాకలేదు

వీటిదగ్గరనుంచి వివరాలు పరిశీలిద్దామంటేఅవకాశమేవుండదు. దూడల్నికనేటప్పుడుసహాయంచేద్దామంటేఅసలేకుదరదు. అవిదూడల్ని కనడం కూడా ఎక్కువరహస్యంగా జరుగుతుంది. పదిరోజులు అయ్యాకగానిమందలోకిరావు. అదిఇన్నాళ్లు ఎచ్చటో దాచియుంచి, దూడబలంగావున్నదనుకున్నాకగాని.తల్లిదాన్ని వెంటబెట్టుకొనిసూర్యాస్తమయసమయంలో మందలోకి లాక్కొనివస్తుంది కింగ్‌బుల్ ఈ దూడకు ఎదురు వెళ్ళి స్వాగతమిచ్చి, మందలోని మిగతాపశువులకు పరిచయం చేస్తుంది. స్వేచ్ఛను అనుభవించే పశువులగాథ విచిత్రంగా వుంటుంది.

# ఏడవ భాగము

## గోసాముద్రికము

## సుళ్ల చరిత్ర

ప్రాచీనకాలములోనే మహాఋషులు వృషభాలసుళ్లను, లక్షణాలనుజాతకాలను పరీక్షించినటుల ఎన్నో గ్రంధాలు తెలుపుతున్నాయి. చాలామంది రైతులు యిప్పటికికూడ సుళ్ళను లక్షణాలను వార నక్షత్రాలనుచూచి పశువులను కొనుట విక్రయించుట జరుగుతూ వుంది. నేను సుళ్ళనుగూర్చి తెలుపుతున్నాను అనవసర తర్కాలు చేయక శాస్త్రానుసారంగా తెలిపేవాటినిగూర్చి శ్రద్ధతో గమనింతురుగాక. వీటిమీదమీకు ఎంతవరకు నమ్మకంవుందో అంతవరకే ఆచరణలో పెట్టుదురుగాక సుళ్ళవిషయమై ఎంతోమంది స్వయంగా వచ్చినన్ను అడుగుతారు దూరప్రాంతాలవారు వుత్తరాలద్వారా తెలుపుతారు. ఎంతవరకు శాస్త్రసిద్ధాంతమో అంతవరకే తెలుపుతూ వుంటాను.

## శుభాన్ని కలిగించేవి

## స్థానపు సుడి

దీనినే బ్రహ్మసుడి యంటారు. ముఖ్యంగా పశువునకుమూడు సుడులూ సరిగావుంటేతప్ప పశువులను కొనరు. కొంతమంది ఈ సుడులనేపలురకాలుగాపిలుస్తూవుంటారు. దీనినేనొసటిసుడియనికూడా అంటారు పశువుకొమ్ములకునాలుగైదు అంగుళాలదిగువగా వుంటుంది. ఈసుడిలేకుండా తదితరసుళ్లున్నప్పటికీ అంతమంచిదికాదు. ఈసుడి గలస్థానమందే మానవులకు పశువునకు కుంకుమతోను, పసుపుతోను పండుగదినాలలో, తదితర శుభకార్యములలో తిలకం అనగాబొట్టు

పెడుతారు. వితంతువులకు బొట్టువుండదు అదేమాదిరిగా ఈసుడి లేకపోతే వితంతువుతో పోల్చుతారు పశువుశరీరం తెలుపుగా వుండి తోకకురచగావుండి ఈసుడి యుంటే వృషభం తన యజమానుని ఆరోగ్యవంతంగా, కీర్తివంతంగా, సర్వ సంపదలను సమకూర్చుతుందని గ్రహించాలి.

## ధాన్యపుసుడి

దీనినే విష్ణుసుడి యంటారు. గోమహాత్యం అను ప్రాచీన సంస్కృత గ్రంథములో గోవును చిత్రించి ఏయే భాగాలలో ఏయే మహాత్తులు వుంటాయో, ఆమహాత్తువలన ఏఏశుభాలు కలుగుతాయో ప్రాచీనఋషులు తెలిపారు. వానిలో విష్ణువును వర్ణించుతూ ఈసుడి వివరాలు తెలిపారు పశువు మూపురం వెనుక భాగంలో కొంచెం దూరములో అనగా 12 నుంచి 14 అంగుళముల లోపల, వెన్నెముక భాగము తొలగక ముందుచూపులో ఈ మహత్తరసుడి యుంటుంది. ఇది గంత కట్టునకు వెలుపలి భాగాన, వెన్నెముకకు ఒక ప్రక్కన, ఈసుడి యుంటె మధ్యరకము అని తెలిసి కోవాలి.

ఈ సుడిగల వృషభం తన యజమానికి సస్యాభి వృద్ధినీ కుటుంబ వృద్ధినీ కలిగించు తుంది. అన్నిట కంటె పంటలుపుష్కలంగా ఫలించి ధాన్యరాసులను కుప్పలు కుప్పలుగా పోయించే మహాత్తు ఈ సుడియందువుంది

## ఆసనపు సుడి

దీనినే మహేశ్వర సుడి అంటారు వృషభము యొక్క ఆసనపు అడ్డ ఎముక నుంచి 4 5 అంగుళాల దగువ భాగంలో ఈ సుడి యుంటుంది ఈ సుడి వుండుట వలన యజమానిని నదివలె అన్ని విషయాలలోను పొంగించుతుంది

## కవ్వపు సుళ్లు

వృషభము రొమ్ము భాగానికి దగ్గరగాను గంగడోలుకు రెండు వైపులా మజ్జిగ చిలికే కవ్వపు ఆకారంగా ఈ సుడులు వుంటాయి రెండు వయిపులా ఇవియుండుట మంచిది కుడి ప్రక్కన సుడియుంటే మంచిదనీ ఎడమవైపున సుడియుంటె ఆక్షేపణీయమని తెలిసికోవాలి. రొమ్ముమధ్యభాగాన రెండు లేక నాలుగు సుడులున్న ఎద్దు ఎండకు శ్రమకు చలికిఓర్చుకొంటుంది. చక్కగా పరుగెత్తుతుంది యజమానిని ఎట్టిపనిలోనైనా దిగ్విజయంగా చేస్తుంది.

## లక్ష్మి సుడి

వృషభము గంగడోలుకు కొంచెము పైగా, మెడకు ఒక ప్రక్కగా ఈసుడి వుంటుంది. ఈసుడిగల వృషభము యజమానికిసకల భాగ్య భోగాలను కలుగచేస్తుంది. ఇట్టివి అరుదుగా దొరకుతాయి.

## జంటసుడులు

వృషభము నొసటిభాగాన ఒకదానిక్రింద నొకటిగాని, జంటగా వుండిపైకెప్రక్కకు గానియుంటే జంటసుళ్ళంటారు ఇట్టివృషభముతన యజమానుని అదృష్టవంతునిగా చేస్తుంది

## చెవిగూబల సుళ్లు

వృషభము రెండుచెవులగూబలదగ్గరగా రెండుసుడులువుంటాయి. వీటినే వృషభావర్తములంటారు తన యజమానిని ధనవంతునిగా చేస్తుంది ఇంకను ఈసుళ్లుచెవులమొదటి భాగానపైగా ఒకవైపుగాని రెండువైపులగాని సుడులుంటే ఆక్షేపణలేదు. ఇంకను రెండుచెవుల వెనుక పలుపుముడివేసే భాగంలో ఒకసుడికొన్నిటికి వుంటుంది. ఇది కూడ ఆక్షేపణలేదు.

## ముచ్చిలిగుంటు సుడి

పశువు రెండుకొమ్ములమధ్య ఒకసుడి స్పష్టంగా కనబడుతుంది ఈసుడిమీద ఒకపసరుపోస్తే వుండులోవుండే పురుగులు క్రిందపడి పోతాయి. ధనుర్వాతం వల్లగాని, కుండేటి పెరిగివల్లగాని బాధ పడుతూవుంటే ముచ్చిలిగుంటలో వుండేసుడిమీద వాతవేస్తే టక్కున రోగంకుదురుతుంది ఈసుడికూడమంచిదియే.

## తదితర ఆక్షేపణలేని సుళ్లు

పశువువీపుమీద వెన్నుపూసకు రెండువైపులా ఒకదానికొకటి ఎదురుగా రెండుసుడులుంటే మంచిది ముందు రెండు కాళ్ళలోపలి భాగములో సుడులుంటే మంచిది. పశువు ఆసనమునుంచి పిర్రల మధ్యగా వృషణాలవరకు సుడులుంటే ఆక్షేపణలేదు వృషభము రెండు కణతుల మధ్యభాగములోగాని, ఒక కణతియందుగాని సుడి యుండుటమంచిది వృషభముయొక్క ముక్కురంధ్రాల పైభాగాన సుడియుండుట మంచిది వృషభము నొసటిస్థానమందు ఒకదానిపై ఒకటిజంటగా వుండిపైకిగాని ప్రక్కకుగాని వుంటేమంచిది వృషభము వెలుపలి దవుడలకు, కంఠమునకు మధ్య సుడియుంటే మంచిది.వృష భము బాహువులమీద రెండువైపుల రెండుసుడులువుంటే మంచిది. వృషభం గుదభాగపుసుడికూడా మంచిది. వృషభము కంఠము మధ్య భాగాన ముత్యపు చిప్పవలె సుడియుంటే మంచిది. వృషభము గంగ డోలు ప్రదేశాన సుడివుంటే మంచిది. వృషభము నాభిదగ్గరగా సుడి యుంటే మంచిది వృషభము కడుపుక్రింద రెండుప్రక్కలాగాని, ఒక ప్రక్కగాని సుడులున్న ఆక్షేపణలేదు. లంగువాదు బిగించేస్థానమందు సుడియుంటే మంచిది వృషభం సంకముడుపులలో ఎచ్చటసుళ్ళున్నను మంచిది వృషభము బొడ్డుభాగంలో సుడియుంటే ఆక్షేపణలేదు

# ఆక్షేపణా సుళ్లు

## తొండపరి సుళ్లు

వృషభము తోక మట్టపైభాగానగాని, క్రిందిభాగానగాని, రెండువైపులగాని లేక ఒక వైపునగాని వుంటేతొండపరి సుళ్ళు అంటారు. పైభాగానవుంటే దానిని తొండసుడియనీ, క్రిందిభాగాన వుంటేపరికసుడియనీ అంటారు. ఇవన్నీ ఆక్షేపణాలే.

## మూత్రపు సుడి

ఈసుడి వృషభము పొట్టమధ్యభాగంలోవుండే గీతమధ్యగా, మూత్రకోశానికి దగ్గరగా ముందుభాగంలో వుంటుంది ఈసుడికి మరొకగుర్తువుంది. మట్టినితీసికొని ఆసుడిమీదరుద్దితే మూత్రము పోస్తుంది ఇట్టిదానిని ఎవరూకొనరాదు.

## సంకెళ్ల సుళ్లు

ఇవి రెండుకలలో కలసికాళ్ళభాగలలో వుంటాయి ముందు మోకాళ్ళ మీదగాని, కాళ్ళకు వెనుకభాగానగాని, కాళ్ళకువెనుక మోకాలి మడత నుంచి సిల్ల గిట్టలు దాటకుండాగాని, మోకాళ్ళపై భాగాన ఎనిమిది లేక పది అంగుళాలవరకు ఈసుడులు వుంటాయి. ఈసుడులున్న వృషభం తన యజమానుని కారాగృహానికి పంపు తుంది

## ముక్కంటి సుడి

ఈసుడి నొసటి భాగాన మూడు కోణాలు కలిగి వుంటుంది. దీనినే శివునిమూడవనేత్రము అంటారు. ఈకన్ను తెరచినఅన్నివస్తు వులుభస్మమై పోవునట. ఎవరూకొనరాదు

## భాషికప్పు సుడి

నేత్రాలకు పైభాగాన నొసటియందు భాషికప్పు ఆకారముగా వుంటుంది. స్థానపుసుడికి రెండుఅంగుళాల దిగువ అడ్డంగా ఒకటి లేక రెండుసుడులు వుంటాయి. ఈ సుడిగల వృషభాన్ని కొన్న రైతుకు భార్య వియోగముగాని, భార్యను తెచ్చుకొనుటగాని జరుగుతుంది. వివాహముకానివారు కొనవచ్చును.

## గాడి సుళ్లు

వృషభము మెడ ప్రక్కనసుడియున్నా, గంగడోలుకు క్రింది భాగాన సుళ్ళున్నా, రొమ్మునకు ఒకవైపున వెండ్రుకలతో ఒకసుడి యున్న, ఎదరాలకు ఎడమవైపున సుడియున్న ఆక్షేపణయే.

## కత్తెర సుళ్లు

వృషభము ఆసనమునుంచి వృషణాలవరకు పొడవుగా ఈనెఆకారంగా అటునిటూ తొలగకుండా వుంటే మంచిది ఈయీనెకు రెండు వైపులా రెండు సుడులు వుండి, ఈ రెంటి యొక్క చూపు ఈ నెకుఅడ్డం వచ్చినట్లు కనబడితే కత్తెరసుళ్లు అంటారు. ఇవన్నీ ఆక్షేపణయే.

## గూటపు సుళ్లు

వృషభం ఆసనానికి రెండువైపులా వుండే మొరడుల వెలుపల భాగాన ఈసుళ్ళు వుంటాయి. కొన్నిటికి ఒక వైపున వున్నా రెండు వైపులనున్నా ఆక్షేపణయే.

## కంటిరెప్పలమీద సుళ్లు

వృషభంకంటి రెప్పలమీద సుళ్లువుంటేమంచిది. ఎడమరెప్ప మీద సుడినుంచిదికాదు,

## నాగుసుడి

వృషభం పిఱ్ఱభాగాన పాము పడగవలె సుడివుంటేనాగుసుడి యంటారు, ఆక్షేపణయే. పశు ప్రతోక మట్టకిర్రింద పేడవచ్చేమార్గానికి ఇరుప్రిక్కల పాముపడగవలె సుడియున్నాఆక్షేపణయే. తల నుంచి మెడవరకు రెండుపాములవలెనలుపుగావుంటే అశుభమే.

## చీపురుకట్ట సుళ్లు

వృషభం కడపటి బరిఎముకనుంచి, మూడవ సగము పూస ఎముక దాటకుండా, వెన్నుకుప్రక్కగాగాని. మీదగాగాని, చీప్రుకట్ట ఆకారంగాసుడివుంటేవారకసుడి అంటారు ఇదిగూడా ఆక్షేపణయే.

## పాడె సుళ్లు

కడపటి బరిఎముకదాటి వెన్నుపూసకు రెండువైపులా వుండే సుళ్ళను పాడెసుళ్ళు అంటారు .యజమానిని త్వరలో పాడెకట్టెయంత ప్రమాదం కలిగిస్తుంది.

## నాలుగు సుడులు

వృషభం నాలుగుకాళ్ళమీద నాలుగుసుడులుంటేఆక్షేపణయే. పిక్కలకు గొరిజలకు మధ్యభాగాన నాలుగు కాళ్ళకు నాలుగు సుడులున్నాతప్పే.

## తదితరసుళ్లు

అర్తిమీద సుడియుంటేకీడు. బరిఎముకలమీద సుడులుంటే ఆక్షేపణయే. వెన్ను భాగానికి రెండువైపుల డొక్కస్థానమునకు పైగా కురచగా వుండే ఎముకలమీద సుళ్లువుంటే ఆక్షేపణయే వెంట్రుకల వరుస ఒకటి మొదటిభాగమునుంచి వెనుక వెన్నుమీదకు తిరగ కుండావుంటుంది దీనినే వరు సుడియందురు. ఇదికూడ ఆక్షేపణయే. తోకమట్టనుంచి క్రిందవరకు వెంట్రుకలు ఎదురొక్కనియుంటే తొండ

గిరియంటారు. ఇదికూడా ఆక్షేపణయే వృషభము కడపటిబరిఎముక దాటిముందర బరిఎముకతో కలియకుండా ప్రత్యేకంగా వుంటే మోటు బరియంటారు. మంచిదికాదు. కొమ్ముల చివరభాగంలో తెలుపుగా చింతపువ్వువన్నెగల సుడియుంటే ప్రాతపంటారుఆక్షేపణయే. దేహ మంతా ఒకేరంగుకలిగి యితరరంగుగల మచ్చఒకటియుంటే అగ్ని మచ్చఅంటారు. యజమానుని మచ్చమార్పుతుందట. ఆరంగుగలమరి యొకటిమచ్చయుంటే హానిచేయదు. మరియొకమచ్చ లేనప్పటికి ఆ రంగుగల ఒకరెండువేళ్లు వున్నయున్నూఆక్షేపణలేదు. తోకరెండువ్రే కలుకుచ్చు అధికంగావుండిచిన్నచెవులుగలపశువుసిరిసంపదలను కలుగ చేస్తుంది. అన్నిఅవయవాలుబిగుతరంగావుండి పశువుపొడవు తక్కు వగావుంటె పనిపాటలలో పేరొందుతుంది ఏపశువుయొక్క నొసటి భాగము వెడల్పుగాపుష్టిగావుంటుందో అట్టిది మహావేగంగాపోతుంది.

## ఆక్షేపణ లక్షణాలు

### నాగలిముఖం

ముఖాన్ని నాగలివలె వంచుకొనివుండే వృషభాన్నికొనరాదు. ఆట్టేపాటుపడక నష్టాన్ని కలిగించుతుంది.

### కాళ్లుఎత్తివూగేది

వృషభం నిలబడికాళ్ళు ఎత్తిఎత్తి ముందువెనుకకు ఊగేదానిని యింటిలో వుంచితే మహాగోషమేకాక పశుశాలకుకూడా కీడు.

### ఆసుపోయుట

పశువునిలబడి ఎడమ కుడి ప్రక్కలకు తలను ఆడించుతూ వుంటుంది. ఏప్రక్కకు వూగినా యజమానికి నష్టమేగాకుండా పశు పీడవుంటుంది.

## తోకక్రింద గ్రంధులు

తోకక్రింద గుదస్థానానికి దగ్గరగా రెండువైపుల రెండు మాంసపుగ్రింధులవలె కనపడుతూ వుంటాయి. ఇట్టిది యజమాని సుఖసంపదలను పోగొట్టుతుంది.

## అంగిలి నలుపు

పశువు అంగిలి ఎరుపుగావుండి ప్రక్కల నలుపురంగుగా వుంటే ఆక్షేపణలేదు. అంగిలి నలుపుగావుంటే మాత్రము మహాదోషము. అట్టిదానిని యింటవుంచరాదు.

## నాలుకబైటికి జాపుట

పశువు ఎల్లప్పుడు తననాలుకను బైటికి పోనిచ్చుతూ, లోపలికి లాగుకొంటూ ఆడించేది అశుభాన్ని కలుగచేయడమేగాక యజమాని సిరిసంపదలను పోగొట్టుతుంది.

## బెదిరేది

ఏదైనా ధ్వనివిన్నా, వాయిద్యాలువిన్నా, నీలిరంగు గొడుగు చూచినా బెదిరే పశువును మాత్రము శత్రువులుకూడా కొనరాదు.

## లేడికడుపు వంటిది

ఇట్టిది ఎక్కువగా పాటుపడుతుందిగాని బలమురాక శక్తి లేనిదిగా వుంటుంది. ఇట్టిది మధ్యరకంగా ఎంచాలి.

## కొంగకాళ్లది

ఇట్టి పశువు వికృత ఆకారంగా నిస్సత్తువగా వుండి నడక మందంగా నడుస్తుంది ఇదికూడా మధ్యరకమే

## గేదెలవీపుద ఎక్కేది

ఇట్టిది ఆవుల వంకచూడనే చూడదు. బలమూ ఎక్కువరాదు. మనస్సు స్థిమితంగా వుండదు. పనియూపరిగా చేయదుగానదొడ్డిలో వుంచరాదు.

కాళ్లుపొడవుగా వంకరగా వుండేవృషభము బాగుగావున్నప్పటికి పాటుకి పనికిరాదు. వ్రేలాడే వృషణాలుగలది బలముతక్కువగా వుంటుంది. ఏవృషభము ముఖము వెడల్పుగావుంటుందో అట్టిదిపోడు స్తుందని తెలిసికోవాలి. కాళ్లుఈడ్చేది నడకసాగకుండా మందమతిగా పోతుంది. చెవులుపెద్దవిగా వుండేదిసోమరితనంగామందంగానడుస్తుంది.

ఏవృషభానికి పిల్లగిట్టలునడుచునపుడు కాలికికొట్టుకొంటూ నడు స్తుందో అట్టిదిగిట్టలరాపిడివల్ల రక్తంకారుతూ వుంటుంది.గానఎవరు కొనరాదు. గిట్టలువ్యాపించితే వంగగిట్టలుగల పశువు అంటారు, ఇట్టిది నడకలోమందంగా వుంగడి కుంటుతుంది, ఆక్షేపణయే. గిట్టలువెడల్పుగా వంకరలుతిరిగి వుంటే మాత్రముశక్తిలేనిదిగా వుంటుంది.పలుచనిగిట్టలు గలిగి బలములేనిదిగా వుంటేఎండలోను ఇసుకలోనూ నడువలేదు.అరి గిన గిట్టలుగలది పుండ్లతో బాధపడుతుంది. పశువునడుచునపుడుముందు అడుగునకంటే వెనుకఅడుగు ముందుకు వేసేది. చీలినగిట్టలుగలది పైకి లేచినగిట్టలు గలది మంచిది. సగంగిట్టలుగలది సరిగా నడువలేదు. గిట్టలను గుచ్చినడిచేది అంతమంచిది కాదు. కలిసిపోయిన గిట్టలు గలదిసరిగా పనిచేయదు.

ఒకకన్ను గచ్చకాయరంగు, మరొకటిశ్యామల లేకగోరోచనపు రంగు, రెండవకన్ను నలుపువుండే పశువుమిక్కిలిఆక్షేపణయే పువ్వు వేసి కాయకాచిన కన్ను, గుడ్డు కాలినకన్నుగలవి జయముగా వుండవు మెల్లకంటిదానిని విడిచిపెట్టాలి. కనుగొలుకులు తెలుపు నలుపురంగుగావుంటే మహాదోషము. కనురెప్పలు నలుపు తెలుపు రంగుగావుంటే అపకారి. ఏనుగకన్నులవంటి కన్నులుఅనగా చిన్న నేత్రాలుకలది పొడుస్తుంది నేత్రాలు కొంచెము ఎరుపుగావుంటే చురుకుగా వుంటుంది మూపురము ఎడమవైపున వంగియుంటేఆక్షేపణ రెండుకొమ్ములమధ్యగా ఎత్తుగావుంటే పొట్లది అని తెలిసికోవాలి.

## కొమ్ములశుభలక్షణాలు

కిరీటంవలె కొంచెము వెనుకకు వంగియుండే కొమ్ములుగల వృషభము అతివేగంగా నడుస్తుంది. సూదికొమ్ములుకలవి శక్తివంత,

ముగావుంటే కాగా పోరాడుతుంది. కత్తెరకొమ్ములు, లావుకొమ్ములు గిన్నెకొమ్ములు, కురచగావుండి పక్కకువాలిన కొమ్ములు, తెలుపు రంగు, నలుపురంగు నీలిరంగు, రాగిరంగు, శ్యామలరంగు కొమ్ములు ఒంటిమచ్చకొమ్ములు, వెనుకకు వంగియుండే కొమ్ములు, గొట్టె కొమ్ములు, ముఖంవైపునకు వంగియుండేకొమ్ములు, లేడికొమ్ములు, గల వృషభాలు యజమానులకు శుభఫలాలను యిస్తాయి. ఇరువది యైదు అంగుళాల పొడవుగల కొమ్ములు గలవి చాలామంచివి

## కొమ్ముల అశుభ లక్షణాలు

పెద్దకొమ్ములుగలది, ఒకటి వెనుకకు మరొకటిముందుకు వంగిన కొమ్ములు గలది, వాలినకొమ్ములు, పొట్టిలు కొమ్ములు, ఒంటి కొమ్ము, ముఖంమీద మధ్యగా వుండేకొమ్ములు మూపురంమీదకు వాలినకొమ్ములు, పగిలినకొమ్ములు. వంకరకొమ్ములు, పశువులు విదిలించుటకు వీలుగావుండే కొమ్ములు, గలవృషభాలు ఆయా యజ మానులను అనేకవిధాలుగా కష్టనష్టాలు కలిగించుతాయి.

ఒకకొమ్ము తెలుకొమ్ముగావుండి రొమ్మునుంచి మూతిభాగము వరకుకాటుకరంగు చారలువుంటే ఆక్షేపణీయే. పెద్దవిగా, పొడవుగా నుండేకొమ్ములుగల వృషభాలకు త్వరగా వృద్ధాప్యంవస్తుంది చూచు టకు అందహీనంగావుంటాయి. ఒకకొమ్ము ఆకాశంవైపునకు రెండవ కొమ్ముముందు ముఖమువైపునకు వుండేవాటిని మెంటికొమ్ములు అంటారు. దీనిని కొనరాదు. ఒకకొమ్ము స్వర్గమువైపుకు, రెండవ కొమ్ము పాతాళంవైపుకు గలఎద్దు ఎంతో అపకారం చేస్తుంది. ముందుకువంగినకొమ్ములు పనికిమాలినదగుతుంది. ఒక కొమ్మువిరిగిన మధ్యమము. ఒకకొమ్ముపుట్టి రెండవకొమ్ము పుట్టకపోయిన అశుభమే కొమ్ములులేనిది అశుభము. కొమ్ములపైన పంగతలగావుంటే మహా దోషము. పగిలినకొమ్ములు గలది రోగాలను కలిగించుతుంది. రాత్రిం బవళ్ళు కొమ్ములను గుంజలకు గోడలకు కొట్టేదిఅశుభము. తక్షణమే అమ్మాలి.

# రంగుల శుభాశుభలక్షణాలు

ఏవృషభమైనా ఒకకాలు తెలుపు, శరీరమంతా ఇతరరంగులతో కలసివుంటే శుభము. ఎక్కువ తెలుపుగా వుండకమిశ్రమ రంగుగా వున్ననూ మంచిది. కలువరంగుగలది, తెలుపురంగుగలది, నువ్వులు బియ్యము కలసిన రంగువలె మిశ్రమంగావుండేది మిగుల జయప్రదము. సగభాగము నీలిరంగు సగభాగం తెలుపుగలది సకల శుభాలను కలిగిస్తుంది. అన్ని అవయవాల మీద తెలుపురంగుగా వుంటేచాలా మంచిది. పసుపురంగుగల రెండుప్రకలు కొన్నివుండేది మందమతిగా వుంటుంది. తోకక్రిందనుంచి గుదస్థానము వరకు నీలిరంగుగావుంటే మంచిది. నేత్రాలునాలుగు ప్రక్కల కాటుకరంగుగా వుంటేపౌరుషంగా వుంటుంది కాటుకరంగు నీలిరంగు కలది కూడ బలకరంగా వుంటుంది. ఏడుసురచలు గలిగి ఆయేను అవయవాలలోను నలుపు రంగువుంటే యజమానికి జయము కలిగించుతుంది నొసలునుంచి ముక్కురంధ్రాలవరకు ఒకే రంగు ఆయుధమువలె వుంటేమంచిది. శరీరమంతా తెలుపు, తోక నలుపుగావుంటే ఎక్కువగా పాటుపడుతుంది. ఉలిపిరిచుక్కలుగలది, గజ్జిబట్టన బాగా పాటుపడుతుంది. కాని వానికి నేత్రరోగాలు, కొమ్మురోగాలు వస్తాయి. సగముఎరుపు సగము తెలుపు కలిసినది మంచిది. శరీరమంతా తెలుపు నలుపూ మచ్చలువుంటే మంచిది మెడ తోకనలుపు రంగుగలదిబాగా పాటుపడుతుంది తెలుపు నలుపురంగు గలది మధ్యమంగా వుంటుంది ఎక్కువఎరుపు, ఎక్కువ తెలుపు రంగుగలది సోమరితనంగా వుంటుంది. చిలుకకంఠము రంగువలె తోక వెండుక్రలు రెండువరసలుగా వుండేది మహాదోషము. కుష్టురంగు పువ్వులుగలది, శరీరమంతా పంచరంగులు గలది మధ్యమం. కంచురంగుగలది, బంగారు ఛాయగలది, పాలబట్టవ, కట్టెబట్టది, ఎరుపుబట్టది, తాటిరంగుది, పుల్లబట్టది, దోరబట్టది, చాలా మంచివి. గొర్రెరంగుకలది, కాకిరంగుకలది పుప్పులవలె మచ్చలు గలది దోషము నిత్యము నేత్రాలనుంచి నీరుకారే వృషభాన్ని కొనరాదు.

## క్రయ విక్రయాల ముహూర్త చక్రము

ఈదిగువ చక్రములో వున్న తిథి, వార, నక్షత్రాల ప్రకారం పశువులను అమ్మట కొనుట జరుపుట మంచిది. అమ్మిన తరువాత ఆ పశువు మెడలో వుండే పాత త్రాడు మాత్రము అమ్మేవారికి ఈయరాదు. క్రొత్త తాడు నారతో తయారుచేసి యిచ్చి పంపాలిగాని పాత త్రాడు యిచ్చుట మన తాతల నాటినుంచి ఆచారం లేదు. పాలికాపరికి ఏ పావలో, ఏ అర్ధరూపాయో యిస్తే మంచిది

| తిథి | వారము | నక్షత్రాలు | |
|---|---|---|---|
| పాడ్యమి | సోమ | హస్త | అశ్విని |
| విదియ | మంగళ | పుష్యమి | పునర్వసు |
| తదియ | బుధ | రేవతి | కృత్తిక |
| చవితి | గురు | జ్యేష్ఠ | మృగశిర |
| పంచమి | శుక్ర | శతభిషం | ధనిష్ఠ |

## సంతలకు యాత్రలకు తీసుకొనిపోయే ముహూర్తచక్రము

| తిథి | వారము | నక్షత్రాలు |
|---|---|---|
| పాడ్యమి | .. .. | అశ్విని, భరణి, కృత్తిక, |
| విదియ | సోమవారము | మృగశిర, ఆరుద్ర, పునర్వసు |
| తదియ | ...... | ..... |
| పంచమి | మంగళవారము | పుష్యమి, ఆశ్లేష, మఖ |
| షష్టి | బుధవారము | ... .. |
| సప్తమి | గురువారము | పూర్వాభాద్ర, హస్త 3 వ పాదం |
| దశమి | శుక్రవారము | ... .. |
| ఏకాదశి | ...... | జ్యేష్ట, అనూరాధ |
| ద్వాదశి | శనివారము | ...... |
| త్రయోదశి | ...... | మృగశిర, శతభిషం, రేవతి |

# ఎనిమిదవ భాగము

## పశుగ్రాసము

### విదేశాల పశుపోషణ

ప్రతి దేశములోను మానవుల ఆహారానికి వుపయోగించే పశువులు కొద్దిగనో గొప్పగనో వుంటాయి. కాని ప్రపంచములో కొన్ని ప్రాంతాలలో ఇట్టి పశువులు ఎక్కువగా వున్నాయి. వీటిలో ముఖ్యముగా పేర్కొనదగినవి.

ప్రసిద్ధి గాంచినగడ్డి బీళ్ళతో కూడిన దక్షిణ అమెరికాలోని అర్జెంటైనా, ఉరుగ్వే, దక్షిణ బ్రెజిల్, పెరుగ్వే మున్నగు ప్రాంతాలును ఉత్తరఅమెరికాలోని ప్రపురీరాష్ట్రాలును ఆస్ట్రేలియాలోని క్వీన్ లాండును. ఉత్తరఆస్ట్రేలియా రాష్ట్రములును, ఇవే గాక యూరపు ఖండమందలి స్పెయిన్, పోర్చుగల్, ఇటలీ, ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ, రష్యామున్నగు దేశాలలోగూడా మాంసాన్ని యిచ్చే పశువుల సంఖ్య ఎక్కువగావుంది.

కొన్ని ప్రదేశాలలో పాడి పశువుల సంఖ్య ఎక్కువ. ఉత్తర అమెరికాలోని కెనడా, యునైటెడ్ స్టేట్సు, యూరపుఖండములోని ఇంగ్లండు, హాలెండు, డెన్మార్కు, నార్వే, స్విట్జర్లండు, అయిర్లాండు దేశాలు, ఆస్ట్రేలియా, న్యూజిలాండు మున్నగు దేశాలలో ఈ పశువుల నుంచి పాలు, పాలపొడి, వెన్న, జున్నుమున్నగునవితదితర దేశాలకు పంపబడుతున్నాయి. మాంసానికి వుపయోగించే గొఱ్ఱెలు మాత్రము న్యూజిలాండులోను, దక్షిణఅమెరికాలోని అర్జంటైనా, వురుగ్వే, చిలీదేశాలలోను, ఆస్ట్రేలియా ఖండమందును ఎక్కువగా వున్నాయి. పందులుమాత్రము చైనాలోను యునైటెడ్ స్టేట్సులోను మొక్కజొన్న పండేప్రాంతాలలోను యూరపుఖండములో వాయువ్య మధ్యభాగంలలోను అధికంగా వున్నాయి. కోళ్లకు, కోడిగుడ్లుకు

మాత్రము డెన్మార్కు, అయిర్లాండు, చైనా, ఈజిప్టు, రష్యాదేశాలు ప్రసిద్ధిగాంచినాయి రిఫ్రిజిరేషన్ పద్ధతిప్రకారము,మాంసము. పాలు, వెన్నముతృగు పాడిపదార్థాలను దూరదేశాలకు చెడిపోకుండాపంపుటకు వీలగుతూవుంది.

ఉష్ణమండలాలలోను, సమశీతోష్ణ మండలాలలోను వివిధ రకాలపచ్చిక బయళ్ళువున్నాయి వీటిలో వర్షాలు ఎక్కువగా కురిసకుండుటవల్ల చెట్లుమున్నగునవి పెరుగకుండా వున్నాయి. నదీతీరాలలో మాత్రం కొన్నిరకాలచెట్లు పెరుగుతాయి. ఉష్ణమండలాలలో వుండే పచ్చికబయళ్ళను సావన్నాస్ అంటారు. సమ శీతోష్ణ మండలాలలో సంవత్సరం పొడవునా పచ్చిక పెరుగుతూ వుంటుంది. కాని ఈ ప్రాంతాలలో ఎండాకాలములో ఎండ, వర్షాకాలములో వర్షం ఎక్కువగా వుంటుంది. ఈపచ్చికబీళ్ళనే పాంపాస్ అంటారు. ఉష్ణమండలాలలోను సమశీతోష్ణ మండలాలలోను అరటి మామిడి, ఈత, తుమ్మ చక్కగా పెరుగుతాయి. ఇంకను సుమిత్రి, సిలోన్, జావామున్నగు ప్రాంతాలలో కొబ్బరిచెట్లు చక్కగా పెరిగి ఫలించుతాయి.

ఎడారి ప్రదేశాలలో మృగాలు వుండవు. శీతల మండలాలలో మాత్రం కొన్నిరకాల జంతువులు వుంటాయి. ఉష్ణమండలాలయిన ఆఫ్రికా ప్రాంతాలలో దట్టమైన అడవులు యుండుటవల్ల పులి, సింహము, జిరాఫి, జీబ్రా లేగాక చెట్లపై నివసించే కోతులు, పాములు, పక్షులు విశేషంగాను ఇంకను ఈ ప్రాంతాల నదులలో మొసళ్ళు, ఖడ్గమృగాలు, నీటిగుఱ్ఱాలు, నిప్పుకోడి మున్నగునవి వుంటాయి. శీతల దేశాలలో రెయిన్‌డీర్ అనేజంతువు మంచుగడ్డల మీదను, దిబ్బలపైన సులభంగా నడువగలదు. దీనికి అచ్చటవుండే పాచియే దీనికి ఆహారము. ఎడారులలో ఒంటె తప్పయే జంతువు తిరుగలేదు. ఎడారులను ఆనుకొనియుండే పచ్చికబీళ్ళలో గొఱ్ఱెలు, మేకలు, పశువులు, గుఱ్ఱాలు వుండుటవల్ల కోట్లకొలది ప్రజలకు అవిఉపయోగపడుతున్నాయి.

పశువుల పెంపకములో ఈమధ్య అనేకమార్పులు ఆయా దేశ శీతోష్ణస్థితుగతులనుబట్టి కలిగాయి. సంవత్సరం పొడవునా వానికి కావలసిన ఆహారము సమృద్ధిగా లభించుటకై క్రొత్తరకపుగడ్డిజాతులు దుంపలు, దాణాలుమున్నగునవి వుత్పత్తి చేయడానికి అనేక దేశాలలోని రైతులు పరిశోధించు తున్నారు. మాంసానికి వుపయోగపడేపశువులు బలిసికండగలవి అగుటకు ఎట్టిఆహారము అవసరమో, పాడిపదార్థాలు యిచ్చేవానికి ఏ ఆహారం అవుసరమో పరిశోధించారు. అందుచేత పూర్వకాలము కంటె ఈకాలములో ఆయాదేశాల పశువులవల్ల ఎక్కువపాలు, మాంసము లభించుతూవుంది. హీనజాతి పశువులను తగ్గించుటకు, ఉత్తమజాతి పశువులను అభివృద్ధిచేయుటకు కావలసిన మార్గాలనుకూడ అనేకమంది శాస్త్రవేత్తలు కనుగొన్నారు. పశు వైద్యశాస్త్రంకూడా ఎంతో అభివృద్ధిగాంచింది.

పశువులను పెంచే విషయములో అమెరికాలో వందలకొలది బీళ్ళువున్నాయి అందులో వేలకొలది పశువులు మందలు మందలుగా వుంటాయి వాటిని మేపేవారికి గౌవాయిఅంటారు ఇంతటి జగత్ప్రసిద్ధి గాంచిన పశువులకాపరులు మరెచ్చటను లేరు. ఒక్కొక్క బీటిలో పశువులకు, పశువులకాపరులకు, వారి అధికారులకు కావలసిన సమస్త సౌకర్యాలుంటాయి. ఈ కాపరులు గుఱ్ఱాలనెక్కి పశువులనుతోలు కొని ఒకభాగమునుంచి మరియొకభాగానికి తిరుగుచు స్వేచ్ఛగాబ్రతు కుతూ వుంటారు ఈరీతిగా విదేశీ పశుచరిత్రలు వ్రాయాలంటే మా ఆయుర్వేద పశువైద్య కళాశాల లైబ్రరీలో ఎన్నో గ్రంథాలేగాక 1500 పశువుల ఫొటోలు వున్నాయి.

## పశుగ్రాసము

పశువులఅభివృద్ధిముఖ్యంగాఅవితినే అహారాన్నిబట్టి వుంటుంది. పశువులకు పచ్చిమేత, ఎండుమేత, వివిధరకాల దాణాలు అత్యవసరం. మనదేశంలో వున్న పశుగ్రాసము మన పశువులకు చాలదు. పశువులకు

పెట్టే ఆహార పదార్థాలలో శీతోష్ణస్థితి పరిస్థితులనుబట్టి ఏఆహారం దానిశరీరానికి ఆరోగ్యకరమో తెలిసికొని మేపాలి. అన్ని ఋతువుల్లోను ఆహారాన్ని సమానంగా యిస్తూ వుండాలిగాని, విశేషంగా మేత దొరకని వేసవికాలంలో తగ్గించుటవల్ల పశువు ఆరోగ్యంచెడుతుంది. ఏమేతఅయినా జీర్ణమగునదిగావుండాలి. నిస్సారమైనట్టి, బూజుపట్టి నట్టి తుక్కుముక్కు గడ్డివగైరా మేపరాదు. శీతాకాలంలో పశువులకు ఎక్కువ ఆహారం, వెచ్చదనమూ అవుసరం. ఈకాలంలో పగలు 12 నుంచి 2 గంటలవరకు ఆరుబయట వుంచుట మంచిది. పాడి పశువులకు, పసిదూడలకు ఈకాలంలో రోగాలువస్తాయి. పాలుకూడ చలివల్ల తక్కువగా యిస్తాయిగాన పుష్టికల ఆహారం పెట్టాలి. వేసవి కాలంలో నీరు అధికంగా తాగుతాయిగాన ఆవిషయం కనిపెట్టి తగినన్నిసార్లు నీటినితాగించాలి. శీతాకాలము కంటే వేసవికాలంలో పశువుల్ని జాగ్రత్తగా మేపాలి. ఈకాలంలో ఎండుగడ్డి ఒక్కటితప్ప పచ్చిగడ్డి వగైరాలు దొరకవుగాన జనుము, కంది, పెసర, మినుప పొట్టులు, దాణాలు పెట్టాలి వర్షాకాలంలో మాత్రము పశువులను ఆరుబయట కట్టరాదు. అధికంగా వర్షాలకుతడవ నీయరాదు.

పశువులకు జీర్ణశక్తినియిచ్చే పదార్థాలను ప్రతిరోజు మేతతో పెట్టుచుండాలి. శరీరదార్ఢ్యంగల పశువునకు అరవౌనువరకు చమురు పదార్థాలు పెట్టవచ్చును. ప్రతిదినము పశువుతినే ఆహారానికినాలుగు రెట్లునీటిని తాగించాలి. అప్పుడప్పుడు ఆహారంతో మెంతిపిండి ఉప్పు, కలిపిపెట్టుటమంచిది. ఇంకను పశువులకు వేరుశనగ, కంది, పెసర శనగ, ఉలవ, గోరుచిక్కుడు, మినుము, అలచంద మున్నగు కాయ ధాన్యాల పొట్టులోను, చెత్తలోను మాంసకృత్తుల వుండుటవల్ల బలకర పదార్థాలనిగ్రహించాలి. ఇంకను పాడిపశువులకు, దుక్కిటెద్దు లకు రాగి, సజ్జలు, జొన్న, మొక్కజొన్న, కొర్ర, వరిగె, ఆరిక, గోధుమ మొదలగుకంకి ధాన్యాలగడ్డి, చొప్పకూడా బలకరముగా లేయని గుర్తించుకోవాలి. శనగపొట్టున కున్నంత బలము రేగిపొట్టునకు లేదు.

వరిగడ్డికంటె గోధుమగడ్డి బలకరమైంది శెనగలు నల్లకంటె మినుల బలమైనవి. కాయధాన్యాలకంటె తెలికపిండి, కొబ్బరిపిండి, బలంగలవి.

కాని మనదేశములో 50 కోట్లటన్నుల మేత 60 లక్షలటన్నుల దాణాలు మనదేశంలో తక్కువగా వున్నట్లు కనబడుతూవుంది. ఈ అంచానాలు దేశం మొత్తంమీద అమలుపరచినా, వర్షాలుఎక్కువగా పడుతున్న ప్రాంతాలలో ఎరుగ్రాసం తక్కువగావుంది. సంవత్స రానికి 30 అంగుళాలకంటె తక్కువవర్షం పడే కడప, బళ్లారి. అనంత పురం జిల్లాలలో పండే చొప్పగడ్డివగైరాలు అవసరమయ్యే దాని కంటె దాణాపంటలు మాత్రము సగానికి తక్కువగా వున్నప్పటికి ఈప్రాంతపు పశుపోషణ తృప్తికరంగానే వుంది. ఈ కూటంలో నెల్లూరు పడమరభాగం, గుంటూరుజిల్లా దక్షిణభాగం, ఒంగోలు చుట్టుప్రక్కలా కలుస్తుంచనుకోవచ్చు. తూర్పుకనుమల గుట్టలచుట్టూ ఎర్రనేలలు నల్లనేలలు ఒకదానితో నొకటి చేరివున్నాయి. నిస్సార మైన భూములు సట్టముఖ్య, వర్షాకాలంలో నీరునిలువయుండేగుంటలు జక్కెరలునుండే చోట ప్రశస్తంగా ఏర్పడివున్నాయి.

తుమ్మచెట్లు బీళ్ళలో సామాన్యంగావుంటాయి. ఈచెట్లుభూభా గంలో వున్న తేమనుతీసికొని బ్రతుకుతాయి ఇంకను దానిఆకులు పూర్తిగా సూర్యరశ్మి కప్పవేయకుండా క్రిందనేపెరిగే గడ్డికెండగాలి నీరు ఈయడానికి అవకాశముయిస్తుంది. ఒకపర్యాయం కొంతవర్షానికి మొలచి తర్వాత చచ్చిపోయి గడ్డిగాదాలుచీకకుండా ఆనెలలోనే చీకిపోయి అంతకంతకు క్రమంగా ఫలవంతమైన బీళ్లు ఈయడానికి దోహదము యిస్తున్నాయి. పశువులు తుమ్మకాయలు ప్రీతిగా తింటాయి క్రిందవున్న పచ్చికను మేస్తాయి మరల యింకపచ్చి ఎండుమేత దాణాలు తినుటవల్ల పశువులు పనిపాట్లను ఉత్సాహంతో పనిచేస్తాయి. కానీ ఈకాలంలో అనేకకారణాలవల్ల పశుగ్రాసం తక్కువగావుంది. పశువులకు సరిపడే గ్రాసంలోగడ్డి, చొప్ప, వగైరాలు

మూడువంతులు దాణాలు ఆహారంలో నాల్గవవంతూ వున్నట్లు అంచనా, కాబట్టి పశుగ్రాసం సరిపోవాలంటే ఇప్పుడువున్న పచ్చిక విస్తీర్ణం ఆరురెట్లు అధికంచేయాలి.

## మేతల పరిమాణములు

| | | |
|---|---|---|
| 7 నుంచి 9 నెలల దూడకు | — | 5 పౌనులు |
| 10 నుంచి 12 నెలల దూడకు | — | 10 పౌనులు |
| చిన్న పశువులకు | — | 10 పౌనులు |
| పాడిపశువులకు ఉదయాన | — | 20 పౌనులు |
| సాయం కాలమున | — | 30 పౌనులు |
| ఎద్దులకు | — | 20 పౌనులు |

పైరీతిగా పశువులకు అహారమీయాలి. పనిజేయుఎద్దులకు పూర్తి మేతనే మేపాలి. ఈనుటకు సిద్ధముగానున్న ఆవులకుపచ్చిమేత వేయరాదు. నెలదినములు పెరిగిన మొక్కజొన్నను పశువులకు మేపిన వుంగిడీయను వ్యాధిసోకి పశువు మరణమునకు సిద్ధమగుతుంది.

చిన్న ఎద్దులకు అనగా 700 నుంచి 900 పౌనులు తూకముగల వాటికి దినానికి 20 పౌనులజొన్న చొప్పను, ఒంగోలు జాతివంటిపెద్ద పశువులకు అనగా 1000 నుంచి 1400 పౌనుల తూకముగల వాటికి 25 నుంచి 30 పౌనుల జొన్న చొప్పను మేపాలి. పచ్చిగడ్డి పచ్చిచొప్ప అంతగా అవసరముండదు. దొరికితే మాత్రము ప్రతిరోజు ఒక్కొక్క పశువునకు పదిపౌనుల వరకు పెట్టవచ్చును. మధ్యతరగతి అనగా 500 నుంచి 900 పౌనులవరకు తూకంతూగే ఎద్దులకుమాత్రము ప్రతిరోజు 18 పౌనుల వంతున జొన్న చొప్పను పెట్టి వేరుశనగపిండి, ప్రత్తి గింజలు ఈరీతిగా పెట్టవచ్చును పనిచేయునప్పుడు 2 1/2 పౌనుల వేరు శనగపిండి, ఒకపౌను ప్రత్తిగింజలు, తేలికపనిచేయునపుడు 10 ఔన్సుల వేరుశనగపిండి 2 పౌనుల 5 ఔన్సులు ప్రత్తిగింజలు, పని ఎక్కువగా

నున్నప్పుడు 15 ఔన్సుల వేరుశనగ పిండి 2 పౌనుల 15ఔన్సుల ప్రత్తి గింజలు కలిపి పెట్ట వచ్చును ఇంకను ప్రత్తిగింజలకు బదులు ఒక వంతు కొబ్బరిపిండిని గాని 2 1/4 వంతులు ఉలవలు గాని కలిపి పెట్టవచ్చును. పై దాణాలలో తప్పకుండ ప్రతిరోజు ఒక ఔన్సు ఉప్పును చేర్చి పెట్టాలి.

పాడిపశువులకు తదితర మేతలతో పాటు ఖనిజపదార్థాల మిశ్రమము ఉప్పు కలిపిపెట్టట మంచిది. ఖనిజపదార్థముల మిశ్రమమనగా కాల్చినగవ్వసున్నము, ఆవిరితో తయారుచేసిన ఎముకపొడి కలిసిన మిశ్రమపదార్థము, కాల్షియం చాలా తక్కువగానున్న ప్రాంతములలోని పాడిపశువులకు మూడుపాళ్ళ ఎముకలపొడి కలిపి ఈయవచ్చును. ఇట్లిచ్చే కంగపులో కాల్షియం, భాస్వరం సమృద్ధిగా వుంటుంది ఈరెండుపదార్థాలు పాడిపశువుల ఆహారములో కలసివుండాలి.

రోజుకు అయిదుపళ్ళకంటె ఎక్కువగా పాలిచ్చే ఆవులకు అదనముగా రెండఔన్సుల కలగలుపును ఈయవచ్చును. కడప,కర్నూలు, మలబారు,నీలగిరి, సేలంపంటప్రాంతాలపశువులకు ఖనిజపదార్థాములు రెండురెట్లుకలిపి పెట్టాలి. ఈ ఖనిజపదార్థాల మిశ్రమాన్ని కొనిపశువులు వాసనకు సహించలేక తినవు. అప్పుడు వేరుశెనగ, తెలికపిండి, ప్రత్తిగింజలు, తవుడు, తదితర పొట్టుధాన్యాలతో కలిపిపెట్టాలి.

## బీటి మేత

పశువులకు పెట్టేమేత లన్నిటిలో బీటిమేతనే శ్రేష్ఠమైనదని ఎల్లరకు తెలిసిన విషయమే. అయితే ఏమిలాభము? కాలముమారినది. మంచి మంచి బీడుభూములన్నీ మాగాణీకింద, దొరపుగాకు క్రింద డబ్బునకాశించిగోసంరక్షణవిషయమైనప్రజలుమరచిపోయారని తెలుపుటకుపశ్చాత్తాపపడుతున్నాను. కొంతకాలముక్రిందట ముప్పది ఎకరాలకుఒకఎకరము బీడుభూమిగా విడచిపెట్టేవారు ఇప్పుడో స్త్రీలు

పురుషులు మల మూత్రాలకు వాడుకొనే పోరంబోకలుకూడా ఆక్రమించుకొని పంటలు పండించుకొంటున్నారు. ఇప్పుడున్న ప్రజా ప్రభుత్వంమాత్రం పంచవర్ష ప్రణాళికలు అమలుపరచి పశుపోషణ పశుగ్రాసాభివృద్ధికి తగినంత బీటిభూములు ఏర్పరచాలని ప్రయత్నించు చున్నారుగాని ఈ స్కీము ఎంతవరకు సాగుతుందో యోచించాలి.

చూడండి ఈ మధ్య మన ప్రధాని నెహ్రూ స్విట్జర్లండు, హాలెండు, డెన్మార్కు ఇంగ్లండు, రష్యా, అమెరికా, ప్రాంతాలకు వెళ్ళినప్పుడు ఆ ప్రాంతపు పశువులను, బీటిభూములను, పాడి పరిశ్రమాలయాలను చూచి వుప్పొంగి పోయినటుల ఎన్నో పత్రికలలో చూచాము. ఆ దేశాలలో శాస్త్రసమ్మతముగా పరిశోధించి పశువులకు కావలసిన బీళ్ళు, వాటిలో పెరిగే గడ్డిజాతులు, దుంపజాతుల రకాలు ఎన్నోవున్నాయి. అచ్చట యుండేపశువులకు మేతకరువు వుండదు. దాణాలు అసలే కరువుండవు.

మన ప్రాంతాలలో వుండేబీళ్ళలోగడ్డిజాతులలో గరిక, గునుకు మొలవ, చెంగలి, మిగులబలమగు సారవంతమగుజాతులగుటవల్ల బాగుగా తింటాయి. ఊశిక, చిప్పర, తుంగ మున్నగునవి యిసుక భూములలో బయలుదేరే జాతులు, చవిటినేలలో ఉప్పి, గజ్జెరు మాత్రము పెరుగుతుంది. బీటిభూములలోపెరిగే మేతయంటే ఎంతబక్కచిక్కినపశువునకైనా ఎంతో ప్రీతి. బీటిమేత తిన్నపశువుల పాలు చాలారుచిగా వుంటాయి వెన్న పెరుగు గట్టిగా సువాసనగా వుంటుంది. పశువులు కూడ బిగుతరముగా వుంటాయి.

బీళ్ళలో పెరిగే గడ్డిజాతులు సున్నమును ఎక్కువగా తీసికుంటాయి. గరికగడ్డికి సున్నమంటే ఎంతో ప్రీతి. బీళ్ళలో వుండేపశువులను మాత్రము జాగ్రత్తగా కాపాడాలి. కాపరులనుకూడ జాగ్రత్తగా చూస్తువుండాలి. మనయిండ్లలోను దొడ్లలోను వుండేపశువుల కంటె బీళ్ళలో వుండేపశువులుస్వేచ్ఛగా హాయిగావుంటాయి. బీళ్ళలో వుండేపశువులు పెండ్లికొడుకుల లాగా బలిసి ఒకదానితో నొకటి

పోట్లాడుకుంటాయి అందు చేత కాపరులుజాగ్రత్తగాపరిశీలి స్తూవుండాలి. బీళ్ళలో పుట్టలు, పాములు, విషపు మొక్కలు. అంటురోగాలు గల పశువులు మున్నగునవి యున్నవేమో అప్పడప్పుడు పరిశీలిస్తూ వుండాలి.

# తృణధాన్యాలు

పశువులకు పనికివచ్చే పంటలు అనేకరకాలువున్నాయి.పశు గ్రాసానికి పనికివచ్చే పైరుఎక్కువ ఒనుగుగాగట్టిదిగా, త్వరగా జీర్ణ మగునదిగా, రుచిగా వుండేదికావాలి. పశువుల ఆహారములో మేత, గడ్డి, చొప్ప మున్నగునవి ప్రధానములు తృణధాన్యాలలో మృదు వుగా వుండే వరి, గోధుమ, చామ మున్నగువాటిని గడ్డియనియు, జొన్న, మొక్కజొన్న, కొఱ్ఱ మున్నగు బిరుసుగావుండేవాటిని చొప్పనీ వాడుతారు. వీటిలో రెండురకాలువున్నాయి పంట పండేవరకువుంచి వెన్నులు కోసినతరువాతగాని ధాన్యము నూర్చిన తరువాతగాని దగ బడేగడ్డి, చొప్పఒకరకంగా వుంటాయి. మేతకొరకు ప్రత్యేకంగా వొత్తుగా చల్లి పెంచి వెన్నులుదరకమునుపే కోసి మేతగా వుప యోగింపబడే గడ్డి చొప్ప వరొక విధంగా వుంటుంది ఇట్టి మేతను పచ్చిగా వున్నప్పుడుగాని,ఎండబెట్టిగాని వుపయోగింప వచ్చును,గరిక, తొండంగి,గినిగడ్డి, లూసన్ మున్నగు గడ్డిజాతులు పంటలకు పనికి రావు. వీటిని మేతకొరకే పెంచాలి.

# అపర సస్యాలు

తృణధాన్యాలకంటె జనుము, ఉలవ, బొబ్బర,మున్నగు అపర సస్యాల కాడలేగాక తోటకూర, చిలకతోటకూర,ముళ్ళతోటకూర, కొయ్యతోటకూర, పొన్నగంటికూర, బచ్చలి, పెసర, మినప, పిల్లిపెసర కాడజాతులు మున్నగునవి పశువులకు వుపయోగిస్తు

న్నారు. ఇవన్ని మంచిఆహారము. ఇంక జొన్న, మొక్కజొన్న, వరిగ, చోడి, కావృస, పూతిక, గంటె, వగైరా మేతలేగాక తుమ్మకాయలు కూడమంచి సత్తువను కలుగజేస్తాయి.

## దాణా పిండ్లు

చమురు గింజలనుండి నూనెను తయారుచేయగామిగిలినపిప్పినే పిండి యంటారు. ఈ పిండి పశువులకు మేతగా, పొలములకు ఎరువుగా వుపయోగించుతారు కొంతనూనె ఈ పిండులలో కలసియుంటుంది. గానుగ ననుసరించి ఎంత నూనెయుండేది తెలుస్తుంది. ఇనుప గానుగ లలో వుండే పిండులలో నూనెఎంత మాత్రము యుండదు. కొన్ని రకాల పిండులను మాత్రమే పశువులు తింటాయి నువ్వులు, ప్రత్తి విత్తులు, ఎర్రగిసె, ఆవ, కుసుమ, వేరుశెనగ, కొబ్బరి మొదలగువాటి పిండులు పశువులు మిగులప్రీతితో తింటాయి. ఆముదము, బొప్పాయి, మహువాపిండిని మాత్రము తినవు. ఏదో పిండిని ఎరువుగా వుప యోగించేది వాటివెలల ననుసరించి యుంటుంది కొన్నిటినిపశువులు తినినందువల్ల వెల సరసమగునని తలంచరాదు కొన్ని ప్రదేశాలలో పశువుల ఆహారముకు వుపయోగపడేవి చాల స్వల్పధరలకు లభించు తాయి. అట్టి సందర్భములలో వాటినే ఎరువులుగా నుపయోగించు తారు

## ప్రత్తి పిండి

| | | |
|---|---|---|
| ఈ పిండిలో 10 వేలపాళ్ళలో | 950 | పాళ్ళ నీరు |
| | 1575 | ,, మాంసకృత్తులు |
| | 3274 | ,, ఉష్ణకర పదార్థములు |
| | 2035 | ,, నార |

ఈ పిండిలో 10 వేల పాళ్ళలో పాళ్ళు
376 . లవణపదార్థములు
1790 ,, నికరవస్తువులు

వుంటాయి. గింజలపై పొట్టునుదీసి శుభ్రము చేయకుండసిద్ధము చేయబడిన పిండిలోనూటికి 3.4 భాగములు నత్రజని 1.26 భాగముల భాస్వరము యుంటుంది. ఈపిండి పెట్టబడిన పాలలో క్రొవ్వుపదార్థములు ఎక్కువగా యుంటాయి. దానివలన వెన్న యొక్కసైపూర్వము కంటె ఎక్కువ జిడ్డుగా గట్టిగా యుంటుంది. నేయిగూడ గట్టిగా ముద్దగా వుంటుంది. పిండినిగాని గింజలనుగాని అధికముగ పెట్టరాదు గింజలలో చముకు ఎక్కువగా యుంకుటవలనపిండినే పెట్టుటమంచిది. ప్రతిదినము యితరాహార పదార్థములతో పిండిని జేర్చి పెట్టుటవలన పశువులకు బలము నిచ్చుటయేగాక వెన్న పాలును వృద్ధియై చాల మంచిగుణములు కలుగుతాయి ప్రత్తిపిండినలన వెన్నవలెపాలంతగా వృద్ధియైనట్టుల కానరావు.

## వేరుశనగ పిండి

బొంబాయి, మదరాసు రాజధానులలో పప్పుకొరకును నూనె కొఱకును విశేషముగా పైరుచేయుచున్నారు వేరుశనగ పరదేశముల నుండి ఎన్నియో శతాబ్దముల క్రిందట మనదేశమునకు తేబడింది, చీనా. మనిల్లా, ఆ రేబియా దేశములనుండి తేబడినట్లు తెలియుచున్నది. వీటి జన్మభూమి బ్రెజిల్ దేశము. ఇది అయిదారు నెలలపంట పంట తీరగనే పై పచ్చితీగనుకోసి ఎండవేసినచో పశువుల మేతకు పనికి వస్తుంది.

నూరుపాళ్ళ వేరుశనగపిండిలో 13.41 చముకు
49.43 మాంసకృత్తులు
22.5 ఉష్ణకర పదార్థములు

వుంటాయి. మాంసకర పదార్థములలో 80 పాళ్ళు మాత్రమే జీర్ణమగును. కాబట్టి జీర్ణకర పదార్థములు 39.58 జీర్ణకరమగు పదా

ర్థములు 16.9 జీర్ణమగుచమురు 12.06 జీర్ణమగు చమురును 2 3 చే గుణించి జీర్ణమగు ఉష్ణకర పదార్థములతో కలిపివేయాలి. అందు వలన జీర్ణమగు చమురు విలువ 44 63 యుంటుంది. పాడి పశువులకు దినమునకు చిన్నదూడలకు ఒకఅరపౌను, పాడి పశువులకు 4 లేక 5 పౌనులు పెట్టితే బాగా పాలనిస్తాయి. వెన్నకూడ వస్తుంది. పెట్టిన తరువాత ఒక ఔన్సు ఉప్పు పెట్టవలె ఈ పిండిని తదితర దాణాలతో పెట్టిన పశువుకు ఏరోగమురాదు.

## తెలికపిండి

దీనిపంట మనదేశమునందంతటావుంది. కాని బొంబాయిచెన్న రాజధానులయందు, బర్మా మధ్యపరగణాలయందు విస్తారముగా పైరగుతూవుంది. నువ్వులవలన తీయుచమురు మానవులకు పశువులకు ఆహారానికేగాక మందులలోకి గూడపనికివస్తుంది తెలికపిండి పాడి పశువులకు, తదితర పశువులకు మంచిఆహారమై యుంది. వాతముగల పశువునకు దినమునకు ఒకఅరవీసెడు ఈయవచ్చును నిక్కాక పశువు నకు అంతగా వాడరాదు, పశువు శీతములో వున్నప్పుడు తెలికపిండి పెట్టుట మంచిది. వాతసంబంధమగు రోగాలు సంభవించినపుడు ఈ పిండిని అప్పుడప్పుడు పెట్టుట మంచిది నిండుచూలుతో వున్నప్పుడు దీనిని ఎక్కువగా వాడిన పిండము కాగిపోతుంది. పశువు ఈనినతరు వాత బాగా పెట్టవచ్చును. దుక్కిఎద్దులకు సాయంకాలపుపూట పెట్టాలి. గానుగఆడినవెంటనే పిండి తెచ్చిపెట్టిన మిగులబలము గలిగించుతుంది. నిలువయున్న పిండి అంత శ్రేష్టమైనదికాదు.

| | | |
|---|---|---|
| ఈ పిండిలో 10 వేల పాళ్ళలో | 1080 | పాళ్ళు నీరు |
| | 3175 | ,, మాంసకృత్తులు |
| | 2900 | ,, ఉష్ణకరపదార్థాలు |
| | 365 | ,, నారపదార్థాలు |

ఈ పిండిలో 10 వేల పాళ్ళలో పాళ్ళ
1140 ,, లవణపదార్థాలు
1340 ,, తదితర వస్తువులు

వుంటాయి పిండులన్నింటిలో తెలికపిండి మిక్కిలి సారవంత మైంది.

## కొబ్బరి పిండి

కొబ్బరికాయలను చిప్పలుగగోసి ఎండబెట్టి చమురుదీస్తారు చమురుదీయగా మిగిలినపిండి పాడిపశువులకు ఆహారముగా నుపయోగ పడుతుంది.

| | | | |
|---|---|---|---|
| ఈపిండిలో నూటికి | 9.00 | పాళ్ళు | నీరు |
| | 19 35 | ,, | పిప్పి |
| | 48.00 | ,, | పిండిపదార్థాలు |
| | 9.12 | ,, | కొవ్వు |
| | 8.64 | ,, | నార పదార్థాలు |
| | 5.89 | ,, | బూడ్గు పదార్థాలు |

యుంటాయి. ఆరంభములో ఈపిండిని పశువులంతగా తినవు. అలవాటుచేసినకొలది దినమునకు 7 1/2 పౌనుల కొబ్బరిపిండిని తిను నట్లు చేయవచ్చును.

## సోయబీను పిండి

సోయబీను గింజలనుండి నూనె తీసివేయబడిన తరువాత దీనిని సోయబీనుపిండి అంటారు. సోయబీను తూర్పు దేశములలో విశేషంగా పండించుతారు. ఈ గింజలే పశువులకు ఆహారముగా వుపయోగ పడ తాయి. నూనె తీసివేయబడిన పిండిలో కొంతచమురు యుంటుంది. ఈపిండియందు నూటికి 40 నుంచి 45 వరకు పిండి పదార్థాలును,

8పాళ్ళనూనె వుంటుంది ఇది ప్రత్తిపిండిని పోలియుంటుంది. ఇతర ఆహారాలతో దీనిని కలిపి పెట్టాలి. ఈ గింజలనుండి పాలు తయారు చేయ వచ్చును. మంచి పొలములో ఎకరానికి 3 టన్నుల గడ్డి సామాన్యముగా వస్తుంది. మనదేశములో ఈ మొక్కఅయి దారు సంవత్సరములకంటె అధికంగా బ్రతుకదు. సంవత్సరానికి 8 కోతలు కోయవచ్చును కాని కొన్ని ప్రదేశాలలో 193 అడుగులను వాడితే ఏరోగమురాదు.

## గడ్డిని పాతరవేయుట

మనదేశంలో సామాన్యంగా ఎండుగడ్డినే వాములుగా వేస్తారు. మంచిగడ్డికి ఎండలు అంతఅవసరము లేదు. ఇటీవల దేశములో వ్యవసాయ నిపుణులు పనిచేయ ప్రారంభించిన దానిగా ఒకనూతనవిధాన మవలంబింప బడుతూవుంది. గడ్డికి సూర్యరశ్మి అంతప్రధానము గాక పోవుటచేత దానిని పాతరలలోగాని, గదులలోగాని భద్రపరచి యుంచవచ్చునని వ్యవసాయ డిపార్టుమెంట్‌వారు తెలుపుతున్నారు మనదేశపు రైతులు ధాన్యమునుపాతర వేయుటనగా భూమినిగోంచెము లోతుగాత్రవ్వి దానిలో గడ్డివేసి ధాన్యముపోసి కప్పియుంచుట. ధాన్యమువలెనే గడ్డినికూడ పాతర వేయుట విదేశములలో నాచారమై యున్నది. గడ్డినిపాతర వేయుటవలన పశువులకు సర్వకాలములయందు మంచిపచ్చిమేత దొరుకుతూవుంటుంది. ఎండుగడ్డికంటె పాతర వేయ బడిన పచ్చిగడ్డి పశువుల కెక్కువ ఆరోగ్యమునిచ్చు ఆహారమైయుంది. వేసవికాలములో పశువులను మేతదొరకనికాలమందు ఈపాతరలోని గడ్డిని మేపవచ్చును వర్షాకాలములో మేతపుష్కలంగా నుండునుగాన అట్టిసమయములందు ఈగడ్డిని వెన్ను వేయునపుడు కోసిపాతర వేయాలి. ఎండుగడ్డి చేయుటకన్న ఈ గడ్డినిచేయుట చాలాఖర్చుతక్కువ. దీనికి అగ్నిభయముగాని, చోరభయముగాని యుండదు. కలుపుమొక్కలను భూమినుండి తీసివేయుటకగు ఖర్చులేకుండా వానిని మేతకు పనికివచ్చు నట్లు చేసి లాభముగా నుపయోగపరచు విధము ఇదియొక్కటియే. ఈ మేతఎక్కువరుచిగా నుండి త్వరగా జీర్ణమగును.

# దైవ మహిమగల వృక్షజాతులు
# సూర్య చంద్రుల మహత్తు
# తొ మ్మి ద వ భా గ ము

## వన మూలికలు

అరణ్య ప్రాంతాలలో అనేక రకాల వనమూలికలు దొరుకు తున్నాయి మహాప్రభావంగల యిట్టి వనమూలికలను పశువైద్యులు వుపయోగించి పశువులరోగాలను కుదుర్చుకోవడం మామూలుగ మన దేశములో వస్తూవుంది. ఏ దేశములో పుట్టిన పశువులకు ఆ దేశములో పుట్టిన ఓషధులే, హితవై అనుకూలంగా పనిచేయగలవని శాస్త్ర వేత్తలు తెలుపుతున్నారు. పాశ్చాత్య ప్రభుత్వంతో పాటు పాశ్చాత్య ఔషధాలుకూడ మన దేశాన్ని ఆక్రమించుకోవడంవల్ల మన దేశీయ మూలికలను మనవారు వాడకం తగ్గించారు. వనమూలికల పేర్లు వాటి స్వరూపము, జాతిగుణము గ్రహించగలవారు అరుదైనారు. పశు వైద్యులలోకూడా వీటిస్వరూపము గుణవిజ్ఞానము లేకుండాపోయింది. మనపరిసరాలలో మనదొడ్లలో నిత్యమూ మనకండ్ల ఎదుట కనపడే వనమూలికల వుపయోగాన్ని తెలిసికోలేక పోతున్నారు విదేశ వ్యామోహం మనలో విస్తరించింది. సాంప్రదాయమైన వృద్ధవైద్యము అనుభవాలు; మూలికా విజ్ఞానం నశించింది.

ఆంధ్రప్రదేశ్ లోవున్న కొండలు, అరణ్యాలలో అనేకరకాల వనమూలికలు వున్నాయి శ్రీకాకుళం జిల్లా నాపడ, పాలకొండ, వంశధారనదీ ప్రాంతాలలోను, గోదావరిజిల్లాకు చెందిన నూగూరు, రంపచోడువరం, అడ్డతీగెల, పోలవరం, జీలుగుమిల్లి మున్నగు ప్రాంతాలలోను పాపికొండలు భద్రాచలం ప్రాంతాలలోను, కృష్ణా

జిల్లా కొండపల్లి, నూజివీడు, తిరుపూరు ప్రాంతాల అరణ్యాలలోను, గుంటూరుజిల్లా కొండవీడు, నాగార్జునకొండ, అమరావతి, చీమకుర్తి మున్నగు ప్రాంతాలలోను, కర్నూలుజిల్లా నల్లమల, అహోబిల, శ్రీశైల ప్రాంతాలలోను, నెల్లూరు జిల్లా ఉదయగిరి, పొదిలే, పామూరు ప్రాంతాలలోను, చిత్తూరుజిల్లా తిరుపతి, తిరుమల, ఆకాశ గంగా, పాపనాశనం మున్నగుపర్వతప్రాంతాలలోను, అరణ్యాలలోను హైదరాబాదు రాష్ట్రంలోను వివిధరకాల వనమూలికలు పెరుగు తున్నాయి. ఆయాకాలాలలో ఇవి చిగిర్చి పుష్పించి ఫలించి ఎంతో ఆనందాన్ని కలిగించుతున్నాయి.

మన అరణ్యాలలో గొప్పవృక్షాలు వనమూలికలు వుండడం వల్లనే మన ఆంధ్రప్రాంతాలలో సకాలానికి వర్షాలు కురిసిన నదులు ప్రవహించడం వల్లనే పంటలు, ఓషధులు వుత్పత్తి యగుతున్నాయి. మనదేశంలో వున్న ప్రతిగ్రామములోనూ మర్రి, రావి, జువ్వి, చింత, మామిడి, దిరిశన, లొద్దుగ, మద్దిటేకు, మేడి, వుసరిక మున్నగు వన స్పతులు వాటంతటవే పెరిగి మానవులకు, జంతువులకు, పక్షులకు, చల్లదనాన్ని. ఆరోగ్యాన్ని, ఆనందాన్ని కలిగిస్తున్నాయి. ఇట్టి ప్రభా వముగల మూలికలు ఆంధ్రప్రదేశ్ అనంతరముగా వున్నాయి. గాన మనము ప్రభుత్వం మూలికా పరిశోధనచేసి తీరాలి మా ఆంధ్రఆయు ర్వేద పశువైద్యకళాశాల తరపునమూలికలనుపెంచి పరిశోధించడానికి తగిన ప్రయత్నాలు జరుగుతున్నాయి.

## మూలికల ప్రభావము

ప్రాచీన ఋషీశ్వరులలో అగస్త్యుడు, మాండూక్యుడు, నందీశ్వరుడు, వాగ్భుటాచార్య, వ్యాసుడు, విశ్వామిత్రుడు, వశిష్టుడు, గోరక్షుడు, కొంకణుడు, మత్స్యముడు, కమలుడు, యోగానందుడు, నిత్యానందుడు, పరాశరుడు, హారితుడు, పశుపాలకాప్య, సుశ్రుతుడు, గోకముడు, చరకుడు, మున్నగువారు మూలికల ప్రభావాలను,

మూలికలను గూర్చిన మంత్రి, తంత్రి భావాలు మున్నగువాటిని గురించి ఎన్నో విషయాలు తెల్పారు ఈవస్తుగుణదీపికలో ఎంతో విలువ గల వివిధరకాల గ్రంథాలున్నాయి. ఒక్కొక్క గ్రంథము అరువది నుంచి ఎనిమిదివందల రూపాయల ఖరీదు చేసేవిగలవు. నేనుకూడ లక్నో, తిరువాన్కూరు, హిమాలయప్రాంతాలుమున్నగుప్రాంతాల కేగి ఓషధుల మహిమలను పరిశోధించుటకు ప్రయత్నముచేస్తున్నాను.

పశువైద్య మూలికలగురించి 800 పేజీలు వ్రాయగల సమర్థతను నేను సంపాదించితిని గాని యిట్టిగ్రంథాలను అచ్చువేయించే దాతలు లేనందువల్ల ఈగ్రంథములో పశువులకు సంబంధించిన మూలికలను కొన్నిటినే క్లుప్తముగా యిచ్చితిని. తెనాలి ఆయుర్వేద పశువైద్య కళాశాలలో మూలికలను తెప్పించి పెంచి పరిశోధించి పశువైద్య వస్తుగుణదీపికను మరల రెండవ సారి ప్రకటింపదలచితిని. ఈ గ్రంథాన్ని చదివే చదువరులు మూలికలనుగురించి సవిస్తరముగా వ్రాయలేదని అసంతృప్తిపడక తెలియని విషయాలు మాకు తెలిపిన వివరాలన్నిటిని తెలుపగలను.

షరా:- ఈ వస్తుగుణదీపికలో మూలికల మోతాదులు ప్రకటింపలేదు. అనుభవముగల రైతులుగాని, వైద్యులుగాని, మూలికల గుణాలు తెలిసికొని ఎంత మోతాదు వాడాలో వారే నిర్ణయించుకోవాలి.

# దైవమహిమగల వృక్షాలు

## బుద్ధ భగవానుడు

బుద్ధభగవానుడు డెల్లప్పాకు వటవృక్షపు ఛాయను విశ్రమించుటవల్ల ఆయనకు జ్ఞానోదయము కలిగినదన్న విశ్వాసంతో, సింహళ దేశంలోనున్న "అనూరాధ పురం"లో మళ్ళీకొమ్మనునాటి, సింహళ దేశీయులు నాటినుంచి నేటివరకు భక్తితో ఆరాధించుచున్నారు.

## సెయింట్ అగస్టయిన్

పదునైదు వందల సంవత్సరాల క్రితము సెయింట్ అగస్టయిన్ అను మహనీయుడు టునీషియాలో సౌక్ దగ్గరగావున్న ఆలివ్ ఆయిల్ చెట్టునీడలో కూర్చుండేవాడు. అందుచేత ట్యూనిషియా దేశస్థులు ఆ చెట్టును పవిత్రవంతంగా యిప్పటికీ గౌరవించుతారు.

## మహమ్మద్ ప్రవక్త

అరేబియాలో "సవద్ పవిత్రజాలాలాల్" దగ్గరగా కొన్ని ఖర్జూర చెట్లువుండేవి. మహమ్మద్ ప్రవక్త ఆ చెట్లగుండా నడచే వాడు. అందుచేత పెద్దపెద్ద మహోత్సవాలలో ఆ చెట్లను అలంకరింప జేసేవారు.

## గెత్సెమెన్

ఆలివ్ తోపులో వుండే చెట్లు మొనలుదేరిన తమపచ్చని పసందైన కొమ్మలు స్వర్గంలో కొన్ని చూపినవని "గెత్సెమెన్" అను మహనీయుడు బైబిల్ లో తెలిపాడు

## అబ్రహాం

రెండువేల సంవత్సరాల క్రితం "పాలస్టయిన్"లో మమ్రె, దగ్గరగా పవిత్ర వంతమైన చెట్టొకటి యుండేది. "అబ్రహాం" అను మహనీయుడు ఆ చెట్టుక్రిందనే సమాధయ్యాడు. ఈ నాటికి కూడ అదియొక పవిత్రవంతమైన పుణ్యక్షేత్రమయ్యెనట.

## వర్జిన్

కెయిరో, హెలియో ఆపొలిస్ మధ్యగా "వర్జనీస్" అనేసెలిమోర్ అను చెట్టొకటి వుండట. హెరోడ్ నుంచి ఈజిప్టునకు పారిపోవుచూ ఈ చెట్టుమాను తొఱ్ఱలో "వర్జన్" ఆతని బిడ్డ దాగినారట. అచ్చట నున్న చెట్టు చచ్చిపోగా 1665 లో మరల ఆ చెట్టువిత్తనాలను వర్జన్ జ్ఞాపకార్థం మరల నాటినారట

# కన్‌ఫ్యూసియస్ తల్లి

చీనా దేశంలో "నీ" అను కొండకు, పెంపింగునకు మధ్య దారిలో ఒక మలబారు చెట్టును ఆదేశస్థులంతా గౌరవించేవారు; బి. సి 551లో కన్‌ఫ్యూసియస్ అను మహానీయుని తల్లి "నీ" అను కొండనుంచి పెంపింగునకు యాత్రికు పోవుచుండగా ఈమలబారు వృక్షపు తొఱ్ఱలోనికేగి ఒకచక్కని బిడ్డను కనమనియు, ఆబిడ్డ మహాత్తు చీనాదేశము నందంతట వ్యాపింప గలదని ఒకదేవత ఆదేశించెనట. ఇప్పటికి కూడ "కుప్" దగ్గర ఆ చెట్టున్నదట.

# వృక్షాలలో కూడా మానవలక్షణాలు

అరటిచెట్టుకు పిల్లలంటే అతిప్రీతి. ఎల్లప్పుడూ పిల్లలను అనగా తనపిలకలను తనచుట్టూ పెట్టుకొని కాపాడుకుంటుంది.

# తుమ్మచెట్టు పిరికితనం

తుమ్మచెట్టు మాత్రం అతిపిరికితనం గలది. వంటినిండాముళ్ళు పెంచుకొనిశతృవులు అపాయం చేయకుండా కాపాడు కొంటుంది. ఇంకను తాను జంట ముళ్ళమీద చీమలకు, పురుగులకు గూళ్ళు కట్టుకొంటానికి యిచ్చి తన ఆకు రెమ్మల చివర ఏటికి ఆహారంకొరకు పిండిపదార్థం తయారుచేసి పెట్టుతుంది.

# కందచెట్టు పిసినిగొట్టు

కందచెట్టు మా పిసినిగొట్టుది. మూడేళ్ళ వరకు పెట్టబోయే కుటుంబము కొరకుఆహారాన్ని ఎవరికీ కనబడకుండా భూమిలో దాచు కొంటుంది.

## మఱ్ఱిచెట్టు మహాంత్రికము

మఱ్ఱిచెట్టు మాత్రం పరోపకారంగలది. పెద్దచెట్టయినప్పటికి పండ్లుమాత్రం చిన్నవిగా నుండి, తన నీడను విశ్రమించే వారికి అపాయము కలుగకుండా జేస్తుంది.

## తాడి, వేరుశనగల తంతులు

తాడిచెట్టు వేరుశనగ మొక్కలు మాత్రము తమ వంశాంకురాలను దాచుకొనడానికి అవస్థపడుతూవుంటాయి తాడి తన కాయలను ఎచ్చటో నెత్తిమీద పెట్టుకుంటే, ఈ వేరుశనగ తన కాయలను భూమిలో దాచుకుంటుంది.

## గుమ్మడి ఓపిక

గుమ్మడిపాదు బలహీనమై నప్పటికిని, పిల్లలను ఎత్తుకొనడానికి మహా ఓపికగలదిగా వుంటుంది.

## కాఫీ, అనాస సుకుమారత్వాలు

కాఫీ, అనాస మొక్కలు మాత్రము మహా సుకుమారములు. నీరుమాత్రం ఎప్పుడూ తగులుతుండాలి.

## సరుగుడు చెట్టు ఈలపాట

సరుగుడు చెట్టుకు ఎంత మేలుచేసినా విశ్వాస ముండదు. గాలి వేసినపుడల్లా ఈలపాటలు పాడుతూ వుంటుంది. తిమింగలానికి వలె చచ్చిన తరువాత యీచెట్టు ఉపయోగం కనపడుతుంది.

## తేయాకు మొక్కల జీవితం

ఉద్యోగస్తునివలె తేయాకు మొక్కలు జీతముయిచ్చినంత కాలము ప్రజలకు సేవచేస్తుంది.

## బదనిక, నాచు మొక్కల భిక్షము

బదనికలు మాత్రము చెట్లమీదనేయుండి గాలిపీల్చుకొని బ్రతుకుతాయి. నాచుమొక్కలు బిచ్చగాళ్ళవలె ఎచటతడియుంటే అచ్చటజేరి బ్రతుకుతాయి

## జువ్విచెట్టు ప్రాచీనాచారము

జువ్విచెట్టు చాలా సదాచార సంపన్నమైంది. ఆకులను రాల్చి వేయ నక్కర లేని ఉష్ణమండలాల్లో స్థిరనివాసమున్ననూ. తనప్రాచీనాచారమును మానకుండ శిశిఋతువులో ఆకులనుపూర్తిగా రాల్చి వసంత ఋతువులో చిగుర్చుతుంది.

## సిగ్గుచింత బెదరు

సిగ్గుచింత మాత్రము జంతువులు గాలివిసరే సరికె తనఆకులను ముడుచుకుంటుంది.

## ద్రాక్షతీగెమొక్కలు,చేతులు కత్తిరించాలి

ద్రాక్షతీగెకు ఎంతఎరువువేసినాతనశరీరాన్ని మాత్రంచక్కగా పెంచుకుంటుంది. ముక్కులు చేతులు కత్తిరించిన తరువాతగాని అది అప్పుతీర్చదు.

## ఈతచెట్టు నంగనాచిత్వము

ఈతచెట్టుమాత్రం ఎరగనినంగనాచివలెఎల్లప్పుడు దూరముగా వుంటుంది

మామిడిచెట్టు తనకుచేసిన ఉపకారమును మాత్రము ఉండనిచ్చుకోదు

## నిద్రగన్నేరుచేసే పరమేశ్వరసేవ

నిద్రగన్నేరు మాత్రం ప్రాణసేవయే పరమేశ్వర సేవఅంటుంది. పగలంతా నీడ, రాత్రంతా వెన్నెల అనుభవాన్నికి తెచ్చుతుంది. తియ్యగా పొడవుగా నుండేకాయలు, మెత్తని అందమగు కుంచెవంటి పువ్వులగలదానినే నిద్రగన్నేరంటారు

## ప్రాచీనకాలంలో జంతువుల వృక్షాల గుప్త చరిత్ర

పూర్వంమనభూమిమీద ప్రారంభదశలో ఏకకణజీవం ప్రత్యక్షమైందనీ, ఆతరువాతనే జంతుజాతులు, వృక్షజాతులు క్రమేపివృద్ధి చెందినవనీ, వైజ్ఞానికులు నిర్ధారణచేశారు. సెల్యూరియన్ యుగానికి పూర్వమే వెన్నెముకగల జంతువులు మనభూమిమీద లేనేలేవనియు డెవోనియం యుగములో బ్రహ్మాండమైనచేపలు, తదుపరి సరీసృపాలు, తరువాత పక్షులు, ఆతరువాత స్తన్యజీవాలు మనభూమిమీద నివసించేవనియు, ఆస్తన్యజీవులునుండే నేడుమనకు కనబడుతున్న జంతుజాలమంతయుఉద్భవించినదని"పాపిల్"అనుశిలాచిహ్నలను పరిశీలించినారని కార్నెల్ విశ్వవిద్యాలయంలో భూగర్భశాస్త్రాచార్యులొకరు తెలిపారు. ఈశిలాచిహ్నము లనబడునవి భూగర్భంలోని రాతిపొరల మధ్య గట్టిపడి శిలలుగామారి పోయిన జంతువుల కళేబరాలు, మొక్కల ప్రకాండములు, ఆకులు వగైరాలట.

## పేలియంటాలజీ

ఒక్కొక్కయుగంలోఒక్కొక్కరకపు జీవకోటి మ భూమిమీద వర్ధిలిందని ఈశిలా చిహ్నలవల్ల కొన్ని నిదర్శనాలు దొరికినాయి. ఈ రీతిగా భూమి యొక్క చరిత్రను నిర్ణయించే శాస్త్రాన్ని "పేలియంటాలజీ" అంటారు

మద్రాసు మ్యూజియంలో అడ్డంగానరికియుంచిన చెట్టుకాండపు పలకఒకటియుంది. దానిలో ఏర్పడిన వలయములచుట్టూ ఈచెట్టుపుట్టి చచ్చేంతవరకు, దక్షిణ భారతదేశంలో జరిగిన చరిత్రసంఘటనలు గూర్చి గుర్తుగావేసి యుంచారు. ఈచెట్టు 1400లో పుట్టింది. అది దాదాపు 500 సంవత్సరములు బ్రతికిందనీ, వాస్కోడిగామా మన దేశానికి ఎప్పుడువచ్చిందీ, సెంటుజార్జికోటఎప్పుడుకట్టిందీ, పుదుచ్చేరి ఎప్పుడు పుట్టిందీ, టిప్పుసుల్తాన్ ఎప్పుడు మరణించిందీ, విక్టోరియారాణి రాజ్యానికిఎప్పుడువచ్చిందీ, మున్నగువి వరాలన్నీ ఈపలకమీాదనున్న అక్షరాలను చూస్తే ఎల్లరకు విశదము కాగలదు.

## మిస్టర్ డగ్లస్ పరిశోధనాలు

చెట్లకాండలను అడ్డంగా నరకిఅందులో ఏర్పడిన వలయాలను బట్టి కనుగొనే విధానముకు "మిస్టర్ డగ్లస్" ప్రారంభకుడని చెప్ప వచ్చును. ఈతనిపరిశోధనల ఫలితంగా కొన్నికొన్ని వృక్షాలుక్రీస్తుకు తరువాత 400సంవత్సరాల నాటివని నిర్ధారణ చేసేనట. తరువాత ఆకాలములో ఈచెట్లతో కట్టబడిన గృహాలలో నివసించే ప్రజలనాగరి కతను, వారుపయోగించే పరికరాలను గురించి అనేక నూతనవిష యాలను విజ్ఞానవేత్తలు కనుగొన గలిగిరి. మరికొందరు కాలిఫోర్ని యాలో పెరిగినబ్రహ్మాండమైన సెక్వాయియాజాతిచెట్ల వలయాలనూ, కాండములను పరిశీలించి మూడు వేల సంవత్సరాలక్రితమే అచ్చట నుండే వాతావరణాన్ని నిర్ణయించ గలిగేవారు.

జంతువుల శిలా చిహ్నముగల రాతిపొరలు యిప్పటికి 50 కోట్ల సంవత్సరాలక్రితము ఏర్పడినవనియు 40కోట్ల సంవత్సరాలకు పూర్వము వెన్నెముకగల జంతువులుండేవనియు చెప్పుటకనేకనిదర్శ నాలున్నాయి. ఇంతేగాక 27కోట్ల సంవత్సరాలకు పూర్వముమన పూర్వీకుల సంతతికిజెందిన జీవజంతువులు, జలచరజీవాలు, సరీసృపా

# వన మూలికలు






నుంచి స్తన్యజీవాలు అవతరించి భూచరాలలో అతిప్రధానమైనవిగా పరిణమించినవని కూడ చెప్పుటకు కొని నిదర్శనాలు దొరికినవి.

## మొక్కలపై సంగీతప్రయోగం

చెట్లకు మాయామాళవగౌళ, శంకరాభరణం, బిలహరి రాగాలను వినిపించుట

అన్నామలై యూనివర్సిటికి చెందిన వృక్షశాస్త్రజ్ఞులు అత్తిపత్తి చెట్టునుగూర్చి కొన్ని పరిశోధనలు గావించారు. ఈపరిశోధనలో కొన్ని వృక్షాలు సంగీతమువలనఅతిసున్నితముగాకదలింపబడగలవనియు సాధారణ చెట్లకంటె సంగీతప్రభావమునకు లోబడి చెట్టు త్వరగా పెరిగి ఆకులు ఎక్కువగా వేయుట, కొమ్మలు, కాడలువేయుటజరుగగలదని కనుగొన్నారు. యూనివర్సిటీ లేబరేటరీవారు అత్తిపత్తి చెట్లను నాలుగు ప్రత్యేక కుండలలోనుంచి పరిశోధనలు గావించారు. అన్ని కుండలలోను ఒకేరకమగు మట్టి, సరియైనవేళలలో ఒకేపరిమాణముగా నీరుపోయుట, త్రవ్వుట, మున్నగుపనులు చేశారు. రెండుమొక్కలను మాత్రమువిడదీసి వాటని కంట్రోలు వృక్షాలని పేరిడినారు తక్కిన రెండు మొక్కలనుకూడవిడదీసి ప్రత్యేకగదిలోనుంచి తలుపులుబిగించి ప్రతిరోజు ఉదయము 6 గంటలకు 7గంటలకు మధ్య25నిమిషాలసేపు ఫిడేలుతో "మాయామాళవగౌళ" అనుకర్నాటక సంగీతమును వాయించి ఆమొక్కలకు వినిపెంచేవారు ఈమొక్కలను పక్షులుతాకకుండ, చీడపట్టకుండజాగ్రత్తగా పెంచారు. ఈరీతిగా పరిశోధించిన రెండుమొక్కలకు రెండునెలల పదిరోజులు "మాయామాళవగౌళ" రాగము వినబడింది. ఆకాలములో ప్రతిఆదివారము ఈరెండుమొక్కలను గూర్చి పరిశీలించుచుతూవ్రాయుచుండెడివారు కంట్రోళ్ళ మొక్కల ఆకులకంటె పరిశోధనల మొక్కలఆకులు ఎక్కువ పచ్చరంగుగా నుండేవి. రెట్టింపుపొడవుగా పెరిగినాయి. కొమ్మలుకూడ ఎక్కు

వయ్యాయి. సంగీతపరిభావమునకు లోనైన మొక్కలు రెండవ శ్రేణిలో అదనముగా ఆకులుకాడలు కూడలేచినాయి.

ఈమొక్కలపై యింకను పరిశోధనలు చేస్తున్నారట. ఈ పర్యాయము వీణా, ఫిడేలు రెండింటిపైన "బిళహరి, శంకరాభరణం" రాగాలను ఆలాపించి పరిశోధన చేయుదురట

## భూపాళం, షణ్ముఖప్రియ, మధ్యమావతిరాగాలు

ప్రఖ్యాతసంగీతశాస్త్రజ్ఞులు నియమించిన నియమితకాలములో రాగముల నాలపించిన, వృక్షములపై వాటిపెరుగుదలపై ఎట్టిపరిభావ ముండునో పరిశోధనచేయగలరట, ఏఏకాలములలో, ఏఏరాగములను పాడవలసినది. హిందుస్థానీ, కర్ణాటక సంగీతశాస్త్రములలో ఈదిగువ రీతిగా చెప్పిరట.

ఉదయం 4 లేక 5 గంటలమధ్య-భూపాళం

ఉదయిం 6 లేక 7 గంటలమధ్య-బిళహరి

రాత్రి 10 గంటలకు లేక అర్థరాత్రివేళ-షన్ముఖప్రియ

మిట్టమధ్యాహ్నము-మధ్యమావతి

రాగములు పాడుటవలనగాని, వాయించుటవలనగాని చెట్లు వృద్ధియగునని సంగీతశాస్త్రములో చెప్పబడియున్నదట ఈరీతిగాపరి శోధనలుచేయుచున్నారట.

## జంతువులకు, వృక్షములకువుండేవ్యత్యాసాలు

ఆకులు,పట్టలు, ఫలపుష్పాలు వేటిని వాడుకొంటాయో ఆకులు రాలిపోవుట, పట్టచెడిపోవుటచేత వృక్షాలకుకూడ స్పర్శజ్ఞానముందని తెలుస్తున్నది.

జీవశాస్త్రజ్ఞానము అభివృద్ధి జెందినకొలదీ జంతువనట్టిదియో వృక్షమనట్టిదియో, వేరువేరుగా నిర్వచించుట కష్టతరమగు చున్నది. జంతువునకు ఉద్భిజ్జమునకు వ్యత్యాసము కనుపించుట లేదు. ఈ రెండింటి లోనుకూడ ఉత్కృష్టమైన వాటిని పరీక్షించినప్పటికి వాటికి దగ్గర పోలికలున్నట్టు విశదమగుతున్నది జంతుఘనందేదైన ఉపయోగమైన నిర్మాణముగాని, గ్రహణశక్తిగల ఇంద్రియముగాని యున్నయెడల, దానికి సమానమగునది ఒకటిఉద్భిజ్జమునందు కూడ కనపడుతుంది. స్పర్శజ్ఞానముగల చర్మము గాకపోయిన, అట్టిధర్మాన్నే చేయుశీత పదార్థం వృక్షానికికూడ వుంది. జంతువునకు వృక్షమునకు భేదమేమైన యున్నచో ఆదివాటిశరీర సంబంధమైందికాదు.

## చెట్లకుకూడా సుఖదుఃఖాలు

వృక్షాలు ఇంద్రియ జ్ఞానము కలిగి సుఖదుఃఖా లనుభవించుట వలన, నరకబడినవి మరల మొలచుట వలనవృక్షాలకు చైతన్యము లేక జీవముందని గ్రహించాలి. మొక్కలు చలిచేత తిమురుపొందుతాయి. మద్యముచేత మత్తెక్కుతాయి. చెడుగాలిచే నుక్కిరిబిక్కిరి యగుతాయి. హెచ్చు పనివలన అలసిపోతాయి. మత్తుమందు చేమాంద్యము నొందుతాయి. దెబ్బలచే గాయము లొందుతాయి సూర్యరశ్మివలన ఉత్సాహము బొందుతాయి. వర్షమువలన నిరుత్సాహము లేక మందమతిగావుంటాయి. విషములచేత వినాశము పొందుతాయి. మానవులకును మొక్కలకును చాలా వ్యత్యాసము లున్నట్లు అగపడినను, మనకును వాటికిని దగ్గర సంబంధముందని ఒప్పుకోకతప్పదు.

మననాడివంటి నాడివాటికికూడా కలదనియు విద్యుచ్ఛక్తినిఉపయోగించి, మందులనువాడి నాడిని ఉద్రేకపరచ వచ్చుననియు లేదా వాటిని అలసిపోవునట్లు చేయవచ్చుననియు, సారాయిపోసి మానవుల వలె వాటికి మత్తెకించవచ్చుననియు, త్రాచుపాము కరచినఅవికూడ ప్రాణమును కోల్పోవునని పరిశోధనలుచేసి శాస్త్రజ్ఞులు తెలిపారు.

## వృక్షాలకుండే ఇంద్రియజ్ఞానం

వృక్షాలు వేళ్ళతో జలాన్ని పీల్చుటచేత, అవిరోగాలలో నుండగా మనము చూచుటచేత ఆయారోగములకు తగినమందులు ఈయగా తగ్గుటచేత వృక్షాలకుగూడ రసేంద్రియ మున్నదని తెలుస్తున్నది. స్థావరములగు ఉద్భిజ్జములకును, జంగములగు జంతువులకును గలభేదము ఛేదింపబడింది. సర్వసామాన్య మొక్కలకు గూడ ఇంద్రియ జ్ఞానమున్నట్లు ఋజువుచేయబడింది మొక్కలకు కూడ స్నాయువులు కలవని శాస్త్రజ్ఞులుచూపగలిగారు ఈగొప్ప విషయాన్ని కనుగొనుటచేత ప్రపంచమంతటకి ఎంతో అమూల్యమైన లాభము చేకూరకలదు. వృక్షాలకు,నరములు లేని యెడలతుపానులయొక్కయు, సూర్యకాంతియొక్కయు, శీతోష్ణములయొక్కయు, భావములను పొందుటకు గలసాధనాలు, ఎచ్చట,స్మృతియుండుట కవకాశమే లేదు. జంతువులవలె వృక్షములకు గూడజ్ఞానముందను(శ్రీ)జగదీశ చంద్రబోసు అభిప్రాయము కాకపోయిన బాహ్యమైన శక్తులయెడల మొక్కలు సచేతనమైనవిగ ప్రవర్తించునని ఈయన ప్రత్యక్షముగ చూపెట్టెను. అసామాన్య పరిశోధనపద్ధతుల వలనబయటనుండి ప్రేరేపింపబడినపుడు మానవులవలె మొక్కలకుకూడ మార్పులను బొందునని ఋజువు పరచెను

## చెట్లకుకూడా విద్యుచ్ఛక్తి

అత్తిపత్తిచెట్టు ఎంతమృదువుగా నెమ్మదిగా ముట్టుకొని నప్పటికి, అగ్నిని చూపించినా, గలిగట్టిగా వీచినా, దానిదళాలన్నియు ముడుచుకొని పోతాయి. రెమ్మలన్నియు రాలిపోతాయి. ఇంకను వాటిపైన రేడియో తరంగాలను, కాంతికిరణాలను ప్రయోగించి నప్పుడు మాత్రము అవి ఎంతో సున్నితమైన స్వభావములను ప్రదర్శించుతాయి. స్వల్పశక్తి వంతములగు రేడియో తరంగాలను వాటిమీద ప్రయోగించినపుడు వాటికి ఉద్రేకము కలుగుతుంది.

విద్యుచ్ఛక్తి యంత్రసహాయంతో మొక్కలమీదికి కొద్దికొద్దిగా ఉపయోగించిన ఫలితముగా వచ్చిన కప్పలు అకస్మాత్తుగా ఏరీతిగా కాలుముడుచుకొనునో అదేమాదిరిగా, ఈవిద్యుచ్ఛక్తి ప్రభావమునకు గురియైన మొక్కలు ఆకులు ముడుచుకొంటాయి. ఇంకను ఎక్కువ శక్తిగల విద్యుచ్ఛక్తిని ఉపయోగించినపుడు ఆ తాకిడికి తట్టుకొనలేక తబ్బిబ్బయిపోయి కొన్నాళ్ళకు అవి పెరగకుండ పోయినవి.

## ఎక్కువధ్వనివల్ల - ఆకులకు వచ్చేనష్టము

ఎదప్రభంగి, ముత్తవపులగము, మునుగుడు మాను, మున్నగు మొక్కలకు ఎక్కువ చప్పుడు చేయగనేఆకులు ముడుచుకొని పోతాయి. నిదగన్నేరు చిక్కుడు, మున్నగునవి తమఆకులను పగలు చాపుట, రాత్రిలందు ఆకులనువాల్చుట జరుగుచుంటాయి. మనుష్యులుగాని జంతువులుగాని ఇట్టిమొక్కలను తాకినప్పుడు తమవేళ్ళ ద్వారా పీల్చుచున్న నీటిని కొమ్మలకు ఆకులకు పంపుతాయి. ఈరీతిగా పైకి వచ్చిన నీరుఆవిరిరూపంగా బయటకు పోతాయి. ఇట్లు బయటకు పోవడానికి కొన్నిరకాల కణాలని నిరూపింపబడ్డాయి.

## మొక్కలుకూడ పసిపట్టుతాయి

మొక్కలు జంతువులకంటె కూడపసిపట్టేగుణముంది. అందు చేత యిటువంటివి చూచినపుడు ఆకలిదప్పులు, ఇంద్రియజ్ఞానము, భయభక్తులుగల లక్షణాలకు సంబంధించినంత వరకు మనకు వృక్షములకు మొక్కలకు గలవ్యత్యాసాలు నిరూపించుట చాలా కష్టతరము. మననాడివలెనే క్రమపద్ధతిలో వాటినాడికూడ కదలుచున్నప్పటికి జంతువుల కుండే గుండెచెట్లకున్నదని చెప్పజాలము.

## చెట్లకుండే సోమరితనం

మనకువలెనే చెట్లకుకూడ సోమరితనముంది కొన్నియిత్తరం చెట్లయొక్క ఆహారపానీయాల్ని మెక్కిచక్కని పుష్పాలను పూస్తూం

టాయి. మరికొన్ని సోమరితనంగా వ్రండిచిన్న పుష్పాలను పూస్తూ విత్తనాలను మాత్రము ఎక్కువగా సృష్టించుతాయి వీటిలో కొన్ని రకాలు మాత్రము పెద్దచెట్లనుంచి రాలిన పంగుటాకులను ఎరువుగా మార్చుకొని దానిపైన ఆధారపడి యుంటాయి. వివయోలెట్, బ్లూలెట్, సెలాండైన్ మున్నగు మొక్కలు ఈజాతిలో చేరినవి కోరల్ రూట్ ఆర్చిడ్స్ మున్నగు మొక్కలు ఫంగి (గూడు)లో ఏర్పరుచుకొని రాలిపోయినపంగుటాకులను తేలికగా స్వీకరించుటచేతఅవిఆహారమును తయారుచేసికొన నగత్యము లేకుండ నుంటాయి. అందుచేతనే వాటికి ఆకులు తక్కువగ నుంటాయి.

వీటిలోనే చెట్లమీద మొలచే వివిధజాతులుంటాయి. ఇవి పెద్ద చెట్ల కాండముమీద పీడతగిలే చోటులందు మాత్రము వృద్ధియగు తాయి, దట్టంగా, తేమగానుండే అరణ్యములలో ఈరకపు మొక్కలు ఎక్కువవృద్ధి జెందుతాయి. ఇవిమాత్రము చెట్లబెరడుమీదనే ఆధారపడి యుంటాయి. ఇవితమకు కావలసినతేమను గాలినుంచి తీసి కొని శిథిలమయ్యే బెరడునుంచి ఆకులనుంచి పీల్చుకుంటాయి.

## పుష్పాలచరిత్ర

సువాసనగల పుష్పాలనుగాని, తదితరపుష్పాలను చూచినప్పుడు మనము పరమానందం పొందుతాము. ప్రారంభములో దానిసౌందర్య మును తరువాత దానిసువాసనను చూచి సంతసించుతాము. సర్వ కళా విజ్ఞేతయగు భగవంతుని సృష్టియగుటచే దాని సౌందర్యానికి దానిసుకుమార్యానికి మేరయే లేదు. కృత్రిమ పుష్పాలను మనము చూచుచునేయున్నారము వాటికి ప్రకృతిసిద్ధమగు స్వభావముండ జాలదు అసలుపుష్పముకు ప్రధానమైంది సువాసన. ఈ సుగంధ ముండుటచేతనే దానికిఎంతోవిలువ కలుగుతుంది. స్వంతోపయోగము కొరకు మొక్కచే సృష్టింపబడిన నూనెలచేత నీసువాసన వస్తూ వుంటుంది. సామాన్యంగా చెట్లులే ఈనూనెలను తయారుచేస్తాయి.

నూనెలజాతికి సాదృశ్యము కర్పూరతైలము. చెట్లనుబట్టికూడ ఈ నూనెలు వివిధ రకాలుగా తయారగుతాయి ఈనూనెలపరమాణులు గాలిలోకలసి యావిరి రూపముగా వ్యాపించుటవలన మనయాఘ్రాణేంద్రియానికి గోచర మగుతాయి.

నూనెలో ప్రధానమైందిబొగ్గు, హైడ్రోజన్ యైయుంది. ఈ రెండు ప్రతిపూవులో వుంటాయి. పువ్వులోమాత్రము చాలినంత నూనెదీయుటకు దొరకవుగాని అత్తరులుతీయడానికి, పురుగులనుచంపడానికి, గాలిలోని విషజీవాణువులను చంపడానికి పనికివస్తాయి సువాసన పరమాణువులన్నియు జీవాణువుల విషము లే. ఇవిలేనిచో మనము భూమిపై బ్రతుకుట కష్టము ఎందుచేతనన రోగజీవాణువులకే నాశనము లేకున్న ప్రజలెల్లరురోగ పీడితులై నశించుదురనుటకుసందియము లేదు.

సువాసన పుష్పాలకేగాని ఆకులకు, కాడలకు యుండదు.గాని, వేళ్ళకుమాత్రం కొంచెముంటుంది. విత్తనములయొక్క వుత్పత్తికి ముఖ్యాధారమగు పదార్థము పురుగుచేత తేబడుతుంది. అట్టిపురుగుల నాకర్షించుటకు పువ్వులకే సువాసన యమర్చబడింది. మనకెట్టి ఉపయోగము కలదో చెట్లకు కూడా పువ్వుల వలస అంత ఉపయోగము వుంది పువ్వుల సుగంధ ద్రవ్యమును మనము సంపాదించుకొని పువ్వులు లేనికాలములో గూడ ఆ పువ్వులవాసనను మనముగ్రహించుతున్నాము. పువ్వులను కోసి వాటి సుగంధాన్ని అరకులుగను, అత్తరులుగను తయారు చేసికొనుట వలన వృక్షముల కెంతో నష్టము కలుగుతున్నది. గులాబీ, నారింజ, లవండపు మున్నగు పుష్పాలను ముందు నీటిలో వేసి బట్టీ పెట్టి నీటియావిరితో వచ్చు నూనెను చల్లగా నుండు పాత్రలలో నుంచుతారు. నూనెపైకి తేలినపుడువిడిగా తేర్చుతారు. దానినే అత్తరందురు ఆనీటినే మరలపన్నీరుగను, లవండరుగను తయారుచేస్తారు. మల్లె,జాజి మున్నగుపువ్వులను నీటితో కలిపి ఉడకబెట్టుటచే సౌరభము భగ్నమైపోతుంది. గానఈపువ్వులను

మిగుల పరిశుద్ధమగు పట్రిములపై పెట్టితయారుచేసెన తరువాతఆల్కా-హాలులో కొప్పునుతడిపి గిలకొట్టి సువాసనను సారాయిలోనికిదింపుతారు తదుపరిసారాయిని ఆవిరిగమార్చునపుడు పుష్పసుగంధసారము మిగులుతుంది. ఈరీతిగా రకరకాల సుగంధసారములను తయారుచేసి మానవులకు, జంతువులకు వచ్చేరోగాలకు, ఆరోగ్యంకొరకు ఉపయోగించుతారు.

## లతలకుండే స్వార్థత్వం

లతలకున్నంతస్వార్థము మరిఏజాతికిలేదు. అనేకరకాలపాదుల మొదటిలో ఎదోఒకచెట్టు బెరడును ఆధారముగా పట్టుకొని పైకి అవ్వాయిచువ్వలాగా పాకిపోతాయి. సూర్యరశ్మికి చెట్టంతటను ఇది పాకి, అసలుచెట్టుకనబడకుండ క్రమ్ముకుంటాయి ఈరీతిగా సూర్యరశ్మికొరకు, గాలికొరకు పోటీపడే కొన్నిచెట్లు ఆకాశమెత్తున ఎదుగుతాయి. అందుచేతనేలఅడుగున నీడలోనుండే మొక్కలు పాలిపోతాయి ఇంకమరికొన్ని మొక్కలు గాలిలోనే వేళ్ళుపెడతాయి. ఇవిస్పంజ మాదిరిగా, గాలిలోనుండు తేమనుపూర్తిగా లాగుకొని జీవించుతాయి. దీనికితోడు ఈచెట్లఆకులుకూడ ఒక్కొక్కసారిఈపీల్చుకున్న నీటిని. కరువురోజులకొరకు దాచుకొంటాయి.

## మొక్కలు మాంసాన్ని చేపల్ని తినేవిధానాలు 500 రకాల మాంసాహారమొక్కలు నిలువునా ప్రాణాలుతీస్తాయి

మొక్కలలో ఎంతో విషవంతమైనవి, నిలువునా ప్రాణము తీసేవి ఎన్నోరకములున్నాయి తమదగ్గరకు వచ్చుజంతువులను, క్రిమి

కీటాదులను వడుపుగపట్టుకొని చంపితిను మాంసాహారులైన మొక్కలు అయిదువందల రకాలకుపైగా ఉన్నవి.

## బట్టర్‌వర్ట్

"బట్టర్ వర్ట్" అనబడు మొక్క జిగురుజిగురుగా నుండు ఆకులను కలిగియుంటుంది. ఈఆకుల ప్రత్యేకలక్షణమేమనగా మనఆహారకోశములో ఏరీతిగాజీర్ణమగునో అదేరీతిగా మాంసాన్ని జీర్ణంచేసికోగలదు. అందు చేతనే మాంసముకడిగిన నీళ్ళను చెట్లకుపోసిన వృద్ధిజెందు నంటారు.

## హిమసూర్య

అస్ట్రేలియా హిమసూర్య (సన్‌డ్యూ) అను మొక్కలఆకులకు సన్నని నూగుమీసములుంటాయి. పొరబాటున ఏదైనపీటిమీద వాలిందా వెంటనే దానినినాలుగువైపులనుంచి చుట్టముట్టిజిగురుగా నుండే రసాన్ని లోనికి నింపుకొంటుంది

## బ్లేడ్‌వర్ట్

"బ్లేడ్ వర్ట్" అనుతిత్తి మొక్క నీటిఅడుగుభాగమునందుంటుంది. దానికిరబ్బరువంటి మెత్తని, ద్వారముంటుంది. చిన్న జంతువులు దీని ద్వారా లోపలికి పోవగనే ముడుచుకొంటుంది. వెంటనే చచ్చిపోతాయి. ఆకలిగా నున్నపుడు చిన్న చిన్న చేపలను కూడ తింటాయి.

## వీనస్ ఫ్లయిట్రాప్

అమెరికాలో "వీనస్ ఫ్లయిట్రాప్" అనబడు ఈగలోను మొక్క ఒకటి యుంది. దోమగాని మరేదైనగాని అందులో ప్రవేశింపగనే, పది సెకండ్లలో తన కోరలతో రెండువైపుల నొక్కి చంపుతుంది.

## కొరివి మొక్క

అన్నిటికన్న అతి విచిత్రమైన మొక్క మరొకటి పశ్చిమ ఆసియాలో వుంది. దీనినే "దిట్టానీ" లేక కొరివి మొక్కయని పిలుస్తారు. దీని విత్తనాలనుంచి ఒక విధమగు మంటమండే, వాయువు వెలువడుతుంది దీనికి దగ్గరలో నిప్పు రవ్వ పడిన యడల వెంటనే టపేలుమని అంటుకొని భగ భగ మండి పోతుంది.

## మంకినీల్, ఉపస్ చెట్లు

మధ్య అమెరికాలోను, వెస్టిండీసులోను "మంకినీల్" చెట్లు, జావా, బోర్నియో, ఫిలిప్పైన్‌లో "ఉపస్" అను చెట్లుప్రమాద కరమైనవి. మంకినీల్ చెట్టు పాలు ఒక చుక్క మన శరీరము మీద పడినచో నిప్పు లేక ద్రావకము పడినంత ఘాటుగా కాలిపోతుంది. మంట కూడ దుర్భరముగా వుంటుంది. ఈ పాలు తలమీద పడిన మన కండ్లు గూడ మూడి పోతాయి.

ఈ రీతిగానే "అంటిరియాన్ టాక్సికారియా" అనబడు మొక్కనుంచి జిగురుగా నుండె పాలు కారుతాయి. ఈ పాలను ఆదిమ నివాసులు తమ అలుగుల మొనలకు పూసికొనే వారు. ఈ అలుగు సోకిన వెంటనే మరణించే వారు. ఎంతోమంది ఈవిషయం తెలియక తలదాచు కొనుటకు నిలబడగా ఈవిషము సోకి మర ణించిరట.

ఒక్క రాత్రిభాగములో నాలుగైదు అడుగుల వరకు ఎదిగిపోవు వెదురువంటి మొక్కలు ఒక్కొక్కప్పుడు ప్రాణాలను తీస్తాయి. పూర్వము ఫిలిప్పీన్సు దీవిలో ఆదిమ నివాసులు తమ బందీలుగా పట్టు బడు వారికి ఈ మొక్కలను గుచ్చగా దాహమైన అడగకుండ మరణించారట.

ఇంక కొన్నిరకపు మొక్కలు ఆలిచిప్ప ముత్యములవలె చక్కని ముత్యాలను సృష్టించుతాయి. నాగజెముడు, బొమ్మజెముడు జాతి మొక్కలు, కొన్ని రకముల పెద్ద వృక్షాలు, పక్షులు, క్రిమి కీటకాలు కల్పించిన వ్రణాలను ఎప్పటికప్పుడు చికిత్స చేసికోవట, ఇంకను ఒక్కొక్క పర్యాయము యివి వృద్ధి చెందుచున్న పగడపు కొమ్మవలె వ్యాపించుతాయి.

## బొమినియాడ్స

(బొమినియాడ్స) అనబడు ఒకజాతి మొక్కల ఆకులలో చిన్న చిన్న దోనేలుంటాయి. వాటిలోనికి వర్షపునీరు జేరుతుంది. ఈ మొక్కలు వర్షము లెక్కువగానుండు అరణ్యములలో పెరుగుతాయి. మరొక రకము చెట్టు తన వేళ్ళను మొక్క కొమ్మలలోనికి గుచ్చి అచ్చట అవి యింటి గుమ్మము వలె కాచుకొని, అసలు చెట్టునకు పోయే ఆహారాన్ని అవి తింటాయి మరికొన్ని జాతిమొక్కలుఅసలు చెట్టునుంచియే, ఆహారమంతా తింటూ, ఆచెట్టుకు ఆకులు లేకుండ మోడుగ జేసి తీగలవలె అల్లుకుంటాయి. తీగచుట్టతో కణుపు కణుపు నుండి పూలగుత్తులు మాత్రము వ్రేలాడు తుంటాయి.

## బొరాండన్ మొక్కలు

ఈ మొక్కలను చూచి చెట్టుపూలనుకొని పక్షులు, పశువులు, చివరకు మానవులుకూడా భ్రమపడుత వి. ఇట్టి మొక్కలు చీనాదేశ మునందున్నవి. వీటిలో బొరాండన్ వర్గమునకు చెందిన మొక్కల విత్తనాలకు జిగురు ఎక్కువగా వుంటుంది ఇవి మొలకలు ఎత్తునపుడు చివర జిగురు బిళ్ళలో ఒక వేరు ముందునకు సాగుతుంది. వీటి అను కూలము లేకపోయిన వేరు వంగుతుంది.

## శాండ్ బాక్సు

మరికొన్ని రకముల మొక్కలు వాటి విత్తనములను ఇతర ప్రాంతాలకు వ్యాపింప జేయుటకు వాతావరణమును చూచుకొని విడిచి పెట్టుతాయి. టపాకాయల మొక్కలు, కనకాంబర మొక్కలు మున్నగునవి వాటి గింజలను చుట్టు ప్రక్కల చాలా దూరమువరకు విరజిమ్ముతాయి ఇంకను దోసగింజలు వాటి నంటుకొనియుండు చిగురు, ప్రూతతో సహా గజముమ్నర దూరము వరకు పాకుతాయి. శాండ్ బాక్సు వంటి ఇంగ్లీషు మొక్కలు పెద్దధ్వనితో 50 అడుగుల దూరము వరకు గింజలను విడచి పెట్టుతాయి.

## యూనికారన్

దక్షిణాఫ్రికాలో యూనికారన్ అను మొక్క వ్యాప్తి మిక్కిలి చెడుగా కనిపించుతుంది. మొక్కల విత్తనాలకు వాడిగ, కోలగనుండు ముళ్ళుంటాయి. ఈముండ్లు దారినిపోయే జంతువుల శరీరానికి గుచ్చుకొని చాలా బాధ పెట్టుతాయి. తరువాత ముండ్లతో సహా గింజలు రాలిపోతాయి తేలుగొండి. గర్దగోరు కాయల మొక్కలు ఈజాతి లోనివే.

## మొక్కలకు వచ్చేకురుపులు

మొక్కలఆకుల మీద కొమ్మల మీద కురుపుల వలె నుండు పెరుగుదలలను మనము చూడ వచ్చును ఈ మధ్యనే అమెరికా, ఇంగ్లండులలో జరిగిన పరిశోధనలఫలితంగా ఈ మొక్కలకుకురుపులకు కేన్సరునకు సంబంధముందనీ ఇవి బాక్టీరియా (సూక్ష్మజీవులు) వలన కలుగుతున్నదనీ తెలియజేశారు.

## పాచిమొక్కల నుంచిజున్నును తయారుచేయుట

"అగర్ అగార్" అనగాజన్ను గడ్డి అను పదార్థము కొన్ని జాతుల సముద్రపు పాచి మొక్కలనుంచి తయారు చేశారు. ఇదిఅనేక పరిశ్రమలలో ముఖ్యమగు వైద్యశాస్త్రములో మందులపరిశ్రమలో, 'బ్యాక్టీరియా'ను పెంచుటకు 'మీడియం'గాను ఉపయోగపడుతున్నది. పూర్వము ఈపదార్థము యొక్క ఉత్పత్తి, సరఫరా జపానువారు చేసేవారు. 1936 లో జపానులో 3549 టన్నుల అగర్ అగారు ఉత్పత్తి చేసేవారు. ఇది ముఖ్యముగా గెలీడియం కార్నమ్, ఆకాంతో పెర్టిన్ జపోనిక అను రెండు పాచి మొక్కలనుంచి వచ్చెనట. మనదేశములో కూడ దీనినియిప్పుడిప్పుడే తయారుచేస్తున్నారు

## చెట్లుకూడ తమపిల్లలను కాపాడుకొనే పద్ధతులు

పిట్టలు, సరీసృపములు, పురుగులుమున్నగునవిగుడ్లుపెట్టిపొదిగి పిల్లలను చేసికొనుట మనకుతెలిసిన విషయమే కిత్తనార మొక్కలు మనచేతి వెడల్పంత వెడల్పున బారడేసి మట్టలతో డొంకలలో వుంటాయి. వీటికి వెలుబూడిద చల్లినటుల నీలపురంగు మట్టల అంచు పొడవున చివరభాగములందు రంపపు పండ్లవలె గరకుగా నుండే ముళ్ళుంటాయి. ఇంకను మట్టల మధ్యనుంచి పొడవుగా కాడలుపుట్టి దీని చివర పువ్వులు పూస్తాయి. ఈపువ్వులే కాయలుగానై ఆకాయల నుంచి వేళ్ళు చిన్నచిన్న మట్టలుగా పుట్టి పెద్ద వగుతాయి. బురదలో పెరుగు మడ చెట్లు కూడ తమ కాయలు వేళ్ళు పెట్టి పిల్లమొక్క లయిన తరువాత వాటిని రాల్చుతాయి. విత్తనము మొక్కగా మారుటకు గాలిలోని ప్రాణ వాయువును పీల్చుకొనాలి. మడచెట్ల విత్తనాలు బురదలో పడిన వాటికి మాత్రము ప్రాణ వాయువు లభించి నప్పటికి వేళ్ళు వచ్చుటకు అవకాశము లేదు. గాన వేళ్ళు పుట్టేవరకు విత్తనములను చెట్టురాల్చదు.

## నాచులోగూడ విటమినులు

కోట్లకొలది సంవత్సరాలనుంచి పృథివిలో నున్న జలాశయములలో ఒక విధమగు నాచు మొక్కలు పెరుగుతున్న సంగతి అంతగా ఎవరికి తెలియదు. ఈ నాచువంట మొక్కలలో మానవున కుపయోగపడుకొ్రొత్తరకపుఆహారపుమొక్కను "ఆల్జే" అంటారు. ఇది కూడా ఒక విధమగు నాచు. వీటలో 17000 రకాలున్నవి. అతి సూక్ష్మముగానుండే ప్లాంక్టన్ మొక్కలనుంచి ఒక్కొక్క సారి నూరేసి అడుగుల పొడవుండు సముద్రపుపాచి వరకు గలవి ఈ "ఆల్జే" అనబడు పాచిజాతికి చెందినవే. వాటిలో "క్లోరెల్లా" అనబడు ఒక జాతిమొక్క గలదు. వైజ్ఞానికులు దీనిని తీసికొని ఆహారపదార్థాముగా నుపయోగ పడు విధానములను పరిశీలించారు. దీనినినాటినచో ఎకరానికియిప్పటి కంటెకనీసము ఇరువదిరెట్లయినా ఆహారము పండగలదని అంచనా వేయబడింది.

ఇప్పుడుమనఆహారమునకు పయోగపడు మొక్కలుచాలా రకము లున్నాయి. ఇవినీటినుంచి, గాలినుంచి, భూమిలోని కొన్నిరసాయన పదార్థములనుంచి సారమునుగ్రహించి, సూర్యరశ్మిసహాయముతో శక్తినిపొంది మనకుకావలసిన ఆహారపదార్థములను తయారుచేస్తు న్నాయి. భూమిమీద సమశీతోష్ణ ప్రాంతములలో తృణజాతులు. ఆహారపు మొక్కలుతమకులభించేసూర్యకాంతితో నూటికిఅరవంతును మాత్రమే ఉపయోగించుచున్నవి. కొన్నిరకములమొక్కలు మన దృష్టితో చూచినపుడు అతిస్వార్థము గలవని చెప్పకతప్పదు. అవి మన ఆహారపుఅవసరములను అనుగుణమనించినట్లు కన్పడవు. వాటిలో కొన్నితినుటకే పనికిరావు.

## ఆల్జే మొక్కలోనుండే విటమినులు

ఈ "ఆల్జే" మొక్క కణములలో విటమిను అనబడు జీవకారక పదార్థములు సమృద్ధిగానున్నవి. ఇంతేగాక మానవ శరీర పోషణకు

కావలసిన మాంసకృత్తులన్ని రకాలు వీటిలోపుష్కలంగా నున్నాయి. మరొక విషయ మేమన ఇప్పటి వరకు మానవునకు తెలిసిన ఏ ఆహారపు మొక్కలలో కూడా ఈ అల్జేజాతి మొక్కలో నున్న మాంసకృత్తులు లేవు. ఈ అల్జే అతివేగముగా పెరుగుతుంది. ఇది సంవత్సరమునకు నలబది టన్నుల పొడి ఆహారాన్ని సృష్టించ గలదట. అనగా వరి గోధుమ వగైరా మామూలు ధాన్యముల కన్న ఇరువది రెట్లు ఎక్కువ పండు తుందట. గోధుమ ఎకరమునకు రెండు టన్నులు పండిన ఎంతో గొప్ప పంటందురు. వడ్లు సగటున టన్ను న్నర కంటె ఎక్కువ పండదు ఇంకను ఈఅల్జే మొక్కల ఫలితములను బట్టి అంచనాలు వేయబడినాయి. ఇందులో గూడ అనేక రకము లున్నాయి. వీటి సేద్యములోగూడ అనేక వృద్ధికరమగు నూతన పద్ధతులు ప్రవేశ పెట్టినపుడు ఎకరమునకు 150 టన్నులకంటె ఎక్కువ పండించవచ్చునని అంచనా వేయ బడింది. ఈలెక్కను బట్టి నూటికి 50 వంతులు మాంస కృత్తులుండునని తలంచిన మానవ కోటికి కావలసిన మొత్తము మాంసకృతులలో దాదాపు సగభాగము ఒక పది లక్షల ఎకర ములలో సాగుచేసిన లభించునట. అనగా ఇంగ్లండులో 30 వంతు జపానులో 100వ వంతు భూమిలో సాగుచేసిన చాలునట.

ఈ ఆల్జే పచ్చివాసన వేస్తుంది. దీనిని రోగులకు కూడ వాడు తారు. ఇది రుచిగా కాకుండ బలముకూడ కలిగించు తుంది. ఈ నాచుతో బహురుచ్యమగు వంటలను, రొట్టెలను సూపులను తయారు చేసికొన వచ్చునట. కోడిపిల్లలకు వేసిన మంచి బలము కలుగుతుంది. పశుగ్రాసమునకు కూడ పనికివచ్చునని పరిశోధకులు నిర్ధారణచేశారు అమెరికాలో దీనికి సంబంధించిన పశుగ్రాసపు మొక్కను "ఐరిష్ మోస్" అందురు. మొత్తంమీద ఈ ఆల్జేను ఇంగ్లండు, జపాను, జర్మనీ వెనిజులా, ఇజ్రాయిల్, నెదర్లాండు మున్నగు దేశములలో ఈ నాచువిషయమై పరిశోధనలుచేసి ఫలితములను కనుగొన్నారు.

# సముద్రపుపాచి కడలి మొక్కల వింతలు

నేలమీద మనము అందమగు పువ్వులను, రకరకముల జంతువులను చూస్తున్నాము. మొక్కలు ఒకే చోటున కదలక యుండుట వలన స్థావరములనియు, జంతుకోటిని జంగమములనియు పిలువబడు చున్నవి. కడలి యందలి వింత ప్రపంచములో ఈ నడక తల్లక్రిందు లైంది. కడలి మొక్కలుఅనగా సముద్రమున నుండు ఒక విధమగు జంగమము ఉంటారు పువ్వులవలె కనబడు కడలి జంతువులు స్థావరములై ఏబండకో లేక ఏజంతువు చిప్పకో కరచుకొని, కదలికయే లేక జీవితమంతయు గడుపుతుంటాయి. అట్టివి కడలిపువ్వులనబడుతాయి.

స్పంజి లేక సముద్రపు పాచిని చూడని వారెవరు నుండరు. ఇదియొక సముద్రప్రాణి. అస్థిపంజరమని మనము నమ్మజాలము. ఈ జంతువులు సముద్రమున సమిష్టిగా జీవించుతాయి. చాలాకాలము వరకు వీటిని మొక్కలనియే భావించేవారు ఎందుచేతనన ఇవి స్థావరములైనప్పటికి ఇవి గుడ్లుపెట్టి సంతానాభివృద్ధి గావింపు కొంటాయి సముద్రములోని ఏకకణ జంతువులు వీటికి ఆహారము. ఇవి పాలు అన్నపు మొక్కలు పెట్టినను తిని ఖర్చించుకో గలవట

తెలుపు పసుపు ఆకు పచ్చ లేక రక్తపురంగులను కలిగి అందముగాతురాయిపువ్వువలె కనుపించు మరొకరకపు జంతువుంది. దీనిని సముద్ర అలిమోను అనిపిలువబడును ఇదిసన్యాసి ఎండ్రకాయ చిప్పకో లేకఏగుట్టకో కరచుకొని జీవితమంతయు స్థావరముగనేయుండి పోతుంది. ఈఅలిమోన్లకు నిరోధకశక్తి చాలాఎక్కువ బొబ్బలు రేగు సంతటి వేడినీటిలో వీటినిముంచినను, మంచుగడ్డిలో నుంచినను, ఒక్క సంవత్సరము వరకుతిండి లేక పస్తుంచినను ఇవిచావనేచావవట. కానిమంచినీటిలో ముంచిన వీటిప్రాణములు నిలవవట, అందుచేతనే ఇవిసముద్రపునీటిఉప్పులోనే కష్టములకోర్చి జీవించుతాయి,

## అలివోనుజంతు వింతచర్యలు

అలివోను ఒకగొట్టము వంటిజంతువు దీనికికండరయుతమైన కడుపు గొట్టము మధ్యవుంటుంది. దీనినుంచి రబ్బరువంటినాళములు చేతులవలె అలివోను నోటిచుట్టు లెక్క లేనన్నియుంటాయి. వీటినే తంతులంటారు ప్రతితంతునందు కాటువేయగల గోళములెన్నో యుంటాయి సూక్ష్మదర్శినితో చూచినచో ఈగోళకములుబుడుపుల వలెకన్పడుతాయి. ప్రతిగోళకములోను ఒకకారమయిన ద్రవము, దానిలో చుట్టలునున్న దారపుపోగు యుంటుంది. ప్రతిపోగుసూది వంటి మొనకలిగియుంటుంది. అలివోనునోటివద్దకు ఒకచిన్నచేప రాగానే దానితంతులలోని వేలకొలది గోళకములు పగిలి వాటి సూదులవంటి పోగులన్నిఒకేసారిగా చేపపైకి విసురుతాయి. ఇవన్నియు ముళ్ళజెముడుపై చేయిపెట్టినపుడు యేవిధముగా ముళ్ళు గుచ్చుకొనునో అదేరీతిగా ఆచేపదేహమును పొడుస్తాయి. అంతియే గాక పాముకాటు వేసినపుడు విషమేరీతిగా ఎక్కింపబడునో అదేరీతిగా గోళపుపోగులు చేపనుపొడిచి దానిగాయములోనికి ఒకవిషద్రవమును చిమ్ముతాయి. ఈవిషపుకాటునకు కొయ్యబారి చచ్చినచేపనుమ్రింగి నమలిపీల్చి పిప్పిచేసి తరువాత పిప్పినినోటిగుండానే వూచివేస్తాయి.

## కృత్రిమ ముత్యాలు

కృత్రిమ ముత్యములను మికొమోటోయను జపానుదేశస్థుడు ప్రపంచమంతటను వ్యాపింపజేసాడు. ఈతనువీధులలో చేపలుఅమ్ముకొనేవాడు. తన౧౨సంవత్సరముల వయస్సున సముద్రవస్తుప్రదర్శనము చూచెను. అచ్చటతయారగువిధానములన్నియు పరిశీలించాడు. సముద్రములోనుండు ముత్యపుపురుగు దేహాలలోనికి ఒకఇసుకకణము గాని, లేకముత్యపుచిప్పకణముగాని, ఆకస్మికముగా లోపలకూడి

దానికి బాధకలుగ జేస్తుంది. ఈ బాధనివారణ కొరకు ముత్యపుపురుగు కాల్షియంకార్బనేట్ అనేక వేలపలుచని పొరలు పొరలుగా ఈసూక్ష్మ కణములచుట్టు వ్యాపింపజేస్తాయి ఈపొరలు క్రమేపిగట్టిపడి ముత్య ముగాతయారగుతుంది.

మోను తక్కిన జంతువులవలె మలవిసర్జనచేయదు. హంస, పాలనుండి నీటినివేరుజేయునట్లు అలిమోనుగూడ తనఆహారమునకు పనికివచ్చుదానిని పీల్చుకొని, పనికిరాని పదార్థమును విసర్జించు తాయి చేపలు, రొయ్యలు, ఎండ్రికాయలు, నత్తలు మొదలగునవి దీనికి ఆహారము. అలిమోనుచాలాతిండిపోతు. పెద్దశంఖుచిప్పపురుగు తోసహా మ్రింగివేస్తుంది. అలిమోనుకూడ జంతువులవలె గ్రుడ్లు పెడతాయి.

## పగడపు గుట్టలు

సముద్రములో చాలాద్వీపములు పగడపు గుట్టలనుంచియే నిర్మింపబడినాయి. ఇవి సున్నపురాతితో తయారౌతాయి. ఇవిగూడ అలిమోనువంటి చిన్నజంతువులచే నిర్మింపబడి సముద్ర జలములో నివసించుతాయి. ఈ జంతువులగుంపు సస్యసమూహములవలె కనిపించు తాయి. ప్రతి జంతువు సూదితలయంత చిన్నదిగా వుంటుంది. దాని నోరు చుట్టు కాటువేయగల తంతు లనేకములుంటాయి. ఈ జీవులు తమదేహ సంరక్షణార్థము తమచుట్టూ సున్నపురాయిగోట నిర్మించు కొని దానిలోనివసించుతాయి, ఈరాయికోట వృక్షమువలె శాఖోప శాఖలుగా తెలుపు, ఎరుపు, నీలము, పసుపు. ఊదా మొదలగు ఉజ్వల వర్ణములు గలిగియుంటాయి. ఈ పగడపుగుట్టలు జీవులచే నిరంతరము నిర్మింపబడుతాయి. కొంతకాలమునకు ఇవి పెద్ద పర్వత ములై సముద్ర ద్వీపములుగా నేర్పడుతాయి. మంచి పగడములు

చాల విలువగలవిగాన రంగుల పై ఆధారపడి యుంటాయి. ఎరుపురంగు పగడములు చాలామంచివి. ఇవి నక్షత్రములవంటి ఎనిమిదితంతు వులుగల చిన్న జంతువులచే నిర్మింపబడుతాయి.

## రాతిపువ్వు మొక్కలు

రాతిపువ్వు మొక్కలను తినుటకు, మందులలో వాడుటకు ఉపయోగించుతారు. ఇవి తేమతక్కువగా నుండు పెద్దపెద్ద కొండ రాళ్ళమీద ఆకుపచ్చగా నుండు మచ్చలవలె పెరుగుతాయి. వీటినే వృక్ష శాస్త్రజ్ఞులు "లైకెన్సు" అంటారు. వీటిలోకూడ కొన్ని వేలరకముల జాతులుంటాయి.

ప్రపంచములో అన్నిరకాల భూములమీద, చెట్ల కొమ్మల మీద, నీరున్నను లేకపోయినను ఇవిపెరుగుతాయి. వనప్రాంతాలలో కూడా ఈ జాతులనేకము లున్నాయి. జంతువులకు, మనుష్యులకు చాలా దేశములలో ఈ రాతిపువ్వు మొక్కలను ఆహారంగా నుపయో గించుతారు. ప్రాచీన కాలములో కూడ వీటిని అనేక రోగములకు ఉపయోగించెడి వారట ఇప్పటికినీ జపాను మున్నగు దేశాలలో ఇవి ఆహారపదార్థముల క్రింద ఎక్కువగా ఉపయోగించు చున్నారట. ఈ మధ్య అమెరికాలో బర్కు హెల్లక్, మాడిడ్ విశ్వ విద్యాలయములో ఫారెన్సియో, బల్గేరియా, జపాను, తదితర దేశాలలో కొంతమంది చేసిన పరిశోధనల వలన లైకెన్సును క్షయ మొదలగు ఊపిరితిత్తుల రోగములకు వాడుట మంచిదనిరి. దీనిలో నుండే పదార్థము సూక్ష్మ జీవులను నిర్మూలించునని తెలియచేసారు.

## వృక్షాలకు కావలసిన లవణాలు ఎరువులు

శరీరపోషణకు మానవునకాహారమెంతఅవసరమోఆరీతిగానే వృక్షములకు, మొక్కలకు అంతఅవసరము. పశువులపెంట, కుళ్ళిన

నెంట, పోగువేసిన వృక్షములువగయిరా బాగగా పెరిగి మంచిపంటలు పండునని అనాదినుంచి నేటివరకు ఎల్లరకు తెలిసినవిషయమే. వృక్ష భాగాలలోనుండే ధాతువుల స్వరూపము తెలిసికొనుటకు వందసంవత్సరములవరకు ఏపరిశోధనా ప్రయత్నము జరుగలేదు.

19వ శతాబ్దములో మాత్రము వైజ్ఞానికులు ధాతువులున్నాయని తెలిసికొన్నారు. వృక్షములు పగటిపూట సూర్యరశ్మి సహాయంతోను, గాలిలోనినీటియావిరితీసికొని వాటినిపిండిగాపంచదారగా మార్చి ప్రాణవాయువును వదలివేస్తాయి. మట్టిలో నత్రజనిగలపదార్థములు లేవనియు, ఆధాతువులుకూడా గాలిలోనుండియే తప్పక గ్రహింపబడవలెననియు, భూమినుంచి తీసికొనే లవణాలులేవని లీబిగ్ అనుశాస్త్రజ్ఞుడు నిర్ణయించాడు.

అందువలన ఎరువులకు బదులులవణాలను సరియైన భాగాలలో కలిపిఎరువుగావేసిన పంటలుపుష్కలంగా పండగలవని నూతన సిద్ధాంతమును లీబిగ్ ప్రతిపాదించాడు. ఈ సిద్ధాంతరీతిగా బ్రిటన్ దేశములో విజయవంతముగా ఆచరణలో పెట్టాడు. ఆ కాలములో యూరపుఖండములోని భూములన్నియు సరియగు ఎరువులు లేక నిస్సారమైపోయినాయి. అప్పుడు లాయెన్ అనురైతు మామూలుగా దొరకు ఎముకలపొడినివాడి పంటలనుపండించుటకు ప్రయత్నము చేశాడు. ఎముకలలో మాత్రము కాల్షియం ఫాస్పేటుఅను లవణము మాత్రముంది. దానివలన లాయెన్‌కు ఫలితమేమీ కనపడ లేదు. ఎముకలపొడి నీటిలో కరుగక వృక్షములచేత గ్రహింపబడక పోవుటే కారణమని తేలింది. వెంటనే అతను తన విద్యార్థిదశలో సంపాదించిన రసాయన విజ్ఞానమును సంపాదించి, విజ్ఞానమును ఉపయోగించి ద్రావణీయముగా చేయుటకు సల్ఫ్యూరిక్ ఆసిడ్‌ను కలిపివాడగామంచి ఫలితము కనిపించిది. ఈ రీతిగా తయారు చేయబడిన ఫలితమును సూపర్‌ఫాస్ఫేట్స్ ఆఫ్‌లైమ్ అంటారు. దీనిలోనున్న లవణాలువృక్షములకు మంచి ఉపయోగమై

నందున వెంటనే ప్రపంచమంతటా వాడుకలోకి వచ్చింది. ఇంకను అమ్మోనియా నైట్రేట్, యూరియా అను లవణాలు కొన్ని కంపె నీలుతయారు చేస్తున్నాయి. మనదేశమునకు సుమారు 5 మిలియనుల టన్నుల రసాయనపు ఎరువులు కావలెనని అంచనావేయ బడింది. ఈ మొత్తము ఇతర దేశములనుంచి రానలసివచ్చేవి. మనప్రభుత్వము వారు బీహార్ రాష్ట్రములోని సింద్రీలోను, తిరువాన్కూరు,కొచ్చిను లోని అల్వేయిలోను పెద్ద ఫ్యాక్టరీలు నిర్మింపబడి పని చేయుచున్నవి. ఈ రసాయన ఎరువులను అతిగా వాడిన భూమి సారవంతముగాక నష్టము కలుగుతాయి. అందుచేత ఈ ఎరువులను జాగ్రతగా యిత రులను తెలిసికొని వాడాలి.

## సూర్య చంద్రుల మహత్తు

సూర్యుడనగా దేవుడనీ, వానిని పూజించాలనీ పురాణాల గాథలు తెల్పుతున్నాయి. సూర్యుడుబ్రహ్మాండమైన అగ్నిగోళము ఆగోళముయొక్క వేడిమి భూమిపైయున్న వారికున్నంతగా అందుసవ సించే వారికివుండను. భూతఅద్దానికి దగ్గరగా దూదిపెట్టినచో కాలదు. ఆఅద్దాన్ని తగినంత దూరములో వుంచితే ఆదూదికాలుతుంది. ఆరీతిగానే సూర్యుడు బహుదగ్గరగావున్నా బహుదూరముగా నెళ్ళిన వేడియుండదని తెలిసికోవాలి వేసవికాలములో భూమిదగ్గరగాయుండి వేగముగాపోవుటవల్ల గాలివేడియేగాని సూర్యుని తీక్షతగాదు. దీనినే ఆదానకాలమంటారు. శీతాకాలములో భూమికిదగ్గరగా యుండివేగము మందగించుటచేత సూర్యునితీక్షత కనిపించుతుంది. దీనినే విసర్గకాల మంటారు.

ప్రాచీనసిద్ధాంతరీతిగా అష్టమూర్తులలో సూర్యుని ఒకమూర్తి గా నుపంచభూతాలలో సూర్యునిఅగ్నిభూతముగాను నిర్ణయించారు. సమస్త జీవరాసుల శరీరాలలోవుండే ఆహారపచనాది కార్యములసాధిం

చుతూ జరరాగ్ని అను పేరొంది వెంగ్రుకలు,ఎముకలు, గోళ్ళు మున్నగు వాటిలో ఈసూర్యునిశక్తి విశేషముగావుంది. ఈసూర్యుని తేజస్సు సమస్త బ్రహ్మాండాలనుఆశ్రయించింది. ఈసూర్యగోళము ధాతువులలో ఎముకలకు అధిపతి. వ్రణాలు, పైత్యరోగాలు. దీర్ఘరోగాలు, మహారోగాలను పుట్టించుటలోను,నశింప జేయుటలోను, సూర్యుడు సమర్థుడు. ఈసూర్యకిరణాలు 7రకాలుగా వుంటాయి. వీటికే సప్త ఋషులనీ, ఏడుఅశ్వములనీ, వేదాలు ఘోషించుతున్నాయి.సూర్యునిలో అనేకరంగులున్నాయి వాటిలో 7రంగులను గ్రహించారు. ఈ రంగులనుబట్టి పాశ్చాత్యులు మనవారు ప్రకృతిచికిత్స కిరణచికిత్సగా వుపయోగించుతున్నారు.ఈ7రంగులను ఆశ్రయించివారాలు, రాసులు, ఋతువులు ఏర్పడుతున్నాయి. ఈరంగులకుకారణము ఉదకము. ఈ రంగులు నీటిలో ప్రతిఫలించి భిన్నరూపాలను సృష్టింపజేస్తున్నాయి.

ఈ రంగులన్నీ మామూలుగా తెలుపు నుంచియే పుట్టు తున్నాయి. ఈ ఏడుకిరణాలు ఋతువులననుసరించి వసంతఋతువులో ఆకుపచ్చ, గ్రిష్మఋతువులో పసుపుపచ్చ, వర్ష ఋతువులో నీలిరంగు, శరదృతువులో ఎరుపు, హేమంతఋతువులో నారింజ రంగు, శశి ఋతువులో వూదారంగు గల కిరణాలు ప్రసరించుతూ వుంటాయి. ఆకాలాలలో పరిపక్వమయ్యే పుష్పాదులందు, పుట్టునట్టి జీవరాసులందు ఆయా కిరణసంబంధక శక్తులు విశేషంగా వుంటూ వుంటాయి.

ఊదా రంగు కిరణాలు ఉదయాన అరుణునకు సూర్యునకు మధ్యకాలంలో ప్రసరించుతాయి. ఈ కిరణాల వల్ల చర్మ రోగాలు నశించుతాయి. ఇంకను వూదా, పసుపుపచ్చ, నారింజరంగు కిరణాలు సూర్యుని ఉదయ కాలమునకు పూర్వము మధ్యాహ్నమున సాయం కాలమున ఈ మూడు వేళలందు విస్తారముగా ప్రసరించుతాయి. ఈ కిరణాలు సర్వరోగాలను హరింపజేసి ఆయువును తేజస్సును వృద్ధి

పరచుతాయి. ఈ ఏడు కిరణాలలో కొన్ని కిరణాలు శరీరానికి అనారోగ్యము కలిగించుతాయి. తూర్పుగాలి, తూర్పు ఎండ పనికిరాదని నిషేధించారు. సాయంత్రపు ఎండలు ఆరోగ్యప్రదము.

## చంద్రుని మహత్తు

చంద్రుడు విరాట్పురుషుని మనస్సు నుంచి పుట్టినాడని శాస్త్రాలు తెలుపుతున్నాయి. ఈ చంద్రుడు తన చుట్టూ తాను తిరుగుతూ భూమి చుట్టు తిరిగివచ్చుటకు ఒక మాసము పట్టుతుంది. చంద్రుడు పడమర దిక్కున పుట్టుతూ, తూర్పుదిక్కున విశ్రమించుతాడు. బ్రహ్మాండమైన అగ్ని గోళానికి జతగా చంద్రుడు అమృత జలస్వరూపముతో నిలుచుటచేతనే ప్రపంచము నిలిచియుంది. కాబట్టి చంద్రుని తల్లిగను, సూర్యుని తండ్రిగను సృష్టికి మూల కారకులని తెలుస్తూవుంది.

సూర్యునివలనప్రాణవాయువుపుట్టుతుంది. దీనివల్ల నేఅగ్నిపుట్టుతుంది. చంద్రునివల్ల నత్రజని పుట్టుతుంది. ఈ నత్రజనిలేనిచో ప్రాణవాయువు జనతాగ్నివల్ల లోకము భస్మమగుతుంది. ఈ చంద్రుని వృద్ధిక్షీణతల ననుసరించే జీవరాసుల ఆరోగ్యము, సృష్టికార్యక్రమము వర్ధిల్లుతూవుంది. ఇంకను చంద్రుడు ఓషధీపతియని అందరికి తెలిసిన విషయమే. ఇంకను చంద్రుడు ప్రకృతి జంతువులకు, మానవులకు క్షీరజలాలకు, రజోతమోగుణాలకు, సప్తధాతువులు, దేహము, ఘృతము, దధి, సర్వ ఓషధులకు, వెండి,బంగరము, పువ్వు, పండు జ్ఞానం, అజ్ఞానం, ఆత్మ,ఈశ్వరుడు, జీవుడు, అండపిండ బ్రహ్మాండమునకు, పంచభూతాలకు కారణ భూతుడు అగుచున్నాడు. ఈ రీతిగా, సూర్యచంద్రుల చరిత్రలు తెలుపాలంటే ఎంతోవుంది.

## బదనికలు

వృక్షజాతిలో సంజీవిని మున్నగు దవ్యౌషధాలు తమ తమ ప్రభావాలతో సంచరించే స్వభావముకలవై యున్నాయి ఈసంజీవి వన్యాది దివ్యౌషధులు ఒక్కొక్క ముహూర్తకాలము నిలుస్తాయి ఈఓషధులయొక్క స్పర్శమాత్రము చేతనే ఆవృక్షాలలో బదనిక యనుపేరుతో బదనికలు కలుగుతున్నాయి. సంజీవకమను పేరు కలదియే బదనిక ఈబదనికలు గ్రహబాధలు, మానవ, పశురోగాలు, మున్నగునవి నశింపజేస్తాయి వీటిలో కొన్నిటిని గూర్చి తెలుపు తున్నాను.

## బదనికలు తీయువిధానము

శనివారము రాత్రిపూట బదనికను పూజచేయాలి. పసుపు దారము ఆబదనికకు కట్టాలి తర్వాత ఒకకోడినిబలిఈయాలనినాగార్జ నునిమతము మంత్రముచే మీకు కావలసిన బదనిక దగ్గర పసుపు, పసుపుకలిపిన అక్షతలు, బలికోసంగుటకు ఒకకోడి, ఎర్రనీటితో వండిన అన్నము పచ్చనిదారమువుంచి 108 పర్యాయములు జపించి

"ఓంనమస్సంజీవ ... వశమానయస్వాహా"

యనుమంత్రమును వుచ్చరించుతూ బదనికను గ్రహించాలి.

## అంకోలము

మంత్రపూర్వకముగా అశ్వినీనక్షత్రమందు గ్రహింపబడిన ఊడుగబదనికను ధరించితే స్థావరజంగమాత్మకమగు సర్వవిషబాధలు శమించుతాయి. దీనిప్రభావమువలన పామునోటియందు కాలు జొనపవచ్చును విషభయములేదు.

## అడ్డసరము

ఆర్ద్రానక్షత్రమున విధిపూర్వకముగా తేబడిన అడ్డసరపు, బదనికను చేతియందుకట్టుకున్న తనకుటుంబము, తన పశుసంపద ఎల్ల ప్పుడు ప్రకాశించుతూ వుంటాయి

## మద్ది

అశ్వనీ నక్షత్రాన మంత్రవిధి ననుసరించి తేబడిన మద్దిబదని కనుచేతియందు కట్టుకొన్నను, పాలతో నూరి త్రాగినా సర్వరోగాలు నశించుతాయి.

## ఆదొండ

ఆదివారము ఆమావాస్యనాడు ఆ దొండచెట్టుపైనుండు బద, నికను తీసికొని తనయింటిలోగాని, పశువుల కొట్టములోగాని కట్టితే ఎట్టి అగ్నిభయము వుండదు.

## రావి

రోహిణీ నక్షత్రాన మంత్రం పరించి తీసిన రావిబదనికను తన యింటియందు, పశుశాలయందు వుంచిన యజమానికి సర్వసంపదలు సమకూరును. భూతబాధలు వుండవు.

## చింత

మృగశిరానక్షత్రాన మంత్రాలతో తీయబడిన చింత బదనిక సర్వరోగాలు పోగొట్టుతాయి. యింకను ఈ బదనికను గేదెపేడతో కలిపి శరీరమంతా దట్టముగా రాసుకొని నిప్పులలో దూకిన శరీరం ఏమాత్రము కాలదు. ఈ బదనిక ఎవరియింటియందు వుంటుదో అట్టి చోటుకు దొంగలు రాజాలరు.

## వెదురు

పునర్వసు నక్షత్రాన వెదురుచెట్టుపైనున్న బదనికను గ్రహించి గొడ్డుబోతులకు, వంధ్య పశువులకు పాలతో త్రాగించిన మంచి సంతానము కలుగును.

## విష ముష్టి

విషముష్టి చెట్టుమీదవుండే బదనికను పునర్వసు నక్షత్రాన తీసికోనివచ్చి చేతియందుంచుకొన్న సర్వగ్రహాలు, సర్పవిషాలు, కృత్రిమ విషాలు హరించుతాయి.

## ఇప్ప

ఆశ్లేషానక్షత్రాన ఇప్పచెట్టుపైనుండే బదనికను తెచ్చి తన చేతిక ధరించిన పెద్దపులులు, ఘోరమృగాలు పారిపోతాయి.

## మోదుగ

హస్తానక్షత్రాన మోదుగ చెట్టుపైవున్న బదనికను తెచ్చి, చేతికిగాని తలకు గానికట్టుకున్న పెద్దపులులు, తదితరక్రూరమృగాలు రాక్షసబాధలు, దుష్టగ్రహాలు తొలగిపోతాయి

మరా:- ఈరీతిగా వ్రాసిన తాళపత్రాలలో ఈబదనికలవర్ణనలు మంత్రాలు,ఆచరణలు ఎన్నోరకముల బదనికల మీద వున్నాయి.అందు చేతనే అరణ్యాలలో కొండప్రాంతాలలోవుండేకోయ చెంచువాండ్లు యిట్టిబదనికలను, మూలికలనుసంపాదించుకొని ఆయాకాలపరిస్థితులను బట్టివచ్చే తమరోగాలకు ఎట్టిడాక్టరు సహాయము లేకుండా చికిత్సలు చేసుకొంటువుంటారు. తమయిండ్ల దగ్గరకుగాని, అరణ్యాలలో వేట కొరకు తిరిగేటప్పుడుగాని ఎట్టిభయము లేకుండా ఈమూలికలను వాడు కొంటూయుంటారు. ఇంతేగాకసన్యాసులు,సుప్రసిద్ధవైద్యులు,మంత్రి గాళ్ళు గారడివాళ్ళు యిట్టిమూలికలనుసంపాదించి వాడుతూయుంటారు. అందరికి ఈ మంత్రాలు అబ్బవు ఎంతోసిద్ధి, ఆత్మశుద్ధియుంటేనేగాని యిట్టివి లభించవు.

## ఓషధులను గ్రహించదగిన ఋతువులు

మార్గశిర పుష్య మాసములందు వచ్చు శరదృతువులో ఓషధులు సరియగు రసముగలిగి యుండును గాన సర్వరోగ నివారణార్థము ఈఋతువునందే ఓషధులను సంగ్రహించుట మంచిది.

జ్యేష్ఠాషాఢ మాసములందువచ్చు గ్రీష్మఋతువునందు రూక్ష స్వభావముచేత ఓషధులు రసహీనములై యుంటాయి.

వర్షాకాలములో ఓషధులు అధికరసము గలిగియుంటాయిగాన అంత గుణవంతములుగా వుండవు. విరేచనములకిచ్చు ఓషధులు తీక్ష్ణములై యుండాలిగాన వానిని గ్రీష్మకాలమునందే సంపాదించాలి

## ఓషధులను గ్రహించకూడని స్థలములు

పుట్టలు, చెడుస్థలాలు, జలముతో నిండియుండు ప్రదేశాలు, స్మశానాలు, చవిటి నేలలు, మార్గమధ్యము, దుష్టజంతువులువుండు స్థలాలు, కాలిన చోటులు, అతి మంచుగల స్థలాలు వుండే స్థానములందుఓషధులను గ్రహించరాదు అవిమంచిగుణముల నీయకపోగా చెడుగుణముల నిచ్చుతాయి.

## ప్రశస్తమగు ఓషధులు

వింధ్యపర్వతము మున్నగువాని పరిసరప్రాంతాలలో వుండే ఓషధులు అగ్నిస్వభావము కలిగి యుంటాయి.

హిమవత్పర్వతము మున్నగు పరిసర ప్రాంతాల యందుండు ఓషధులు సౌమ్యస్వభావముకలిగియుంటాయి. కాబట్టిఆయాప్రదేశాలలో పుట్టిన యోషధులనుఆయా పనులకై ఉపయోగించాలి.ఇంతియే

గాక వనములందు, ఉపవనములందు కూడాఅట్టి స్వభావముగల యోషధులుత్పత్తి యగుతూవుంటాయి కాబట్టి వనములందుపర్వతము లందు నుత్పత్తి యగుయోషధులనే గ్రహించాలి.

శశిరఋతువునందు వేళ్ళను గ్రీష్మఋతువునందుపత్రములను, వర్షవసంత ఋతువులందు పట్టలను, దుంపలను, శరదృతువునందు క్షీరమును ఏయేఋతువులందు ఏయేపుష్పములు ఫలములు ఉత్పత్తి యగునో ఆయాఋతువుల యందాయా పుష్పములను, ఫలములను, హేమంత ఋతువునందు సారములను సంపాదించాలి.

## గ్రహించవలసిన సారములు

చండ్ర మొదలగు వృక్షముల నుండిసారమును, వేపమున్నగు వృక్షముల నుండి పట్టలను, దానిమ్మ మున్నగు వృక్షముల నుండి ఫలములను, చేదుపొట్ల మున్నగు వాటి నుండి పత్రములను, మర్రి మున్నగువాని నుండిపట్టలను, వేగిస మున్నగువానినుండి పత్రములను, త్రిఫలా వృక్షములనుండి ఫలములను స్వీకరించాలి. వృక్షములనుండిగ్రహింపదగినమూలములు పెద్దవిగాలావుగా వేళ్ళపై నుండు పట్టలను, చిన్నచిన్న వేళ్ళను గ్రహించాలి.

## ఓషధుల కాలపరిమితి

లవంగము మున్నగుపుష్పములు ఒకసంవత్సర కాల పరిమితిగా నుండి తరువాత గుణహీనములగుతాయి పండ్లు ఆకులు మున్నగునవి ఒక సంవత్సరము. కాష్టములు నాళములు రెండుసంవత్సరాలు, వేళ్ళు మూడు సంవత్సరాలు, చండ్ర మున్నగునవి అయిదుసంవత్సరాలు, బూరుగ బంక మున్నగు నవి పదిసంవత్సరాలు దాటినతరువాత గుణ హీనములగుతున్నాయి.

## స్వరసము

అప్పుడే గ్రహించినట్టి పచ్చిద్రవ్యములను సమకూర్చిపురుగులు మన్ను వగైరాలులేకుండ బాగుచేసి తెచ్చినవెంటనే నీరుకలపకుండ తొక్కి వస్త్రములో వడియగట్టిన రసమును స్వరస మంటారు. ఎండిన యోషధులను చూర్ణించి రెండురెట్లునీరుపోసి రాత్రిబవలు నాననిచ్చి మరునాడు ఆఉదకమును వడియగట్టిన మరొకవిధమగుఅంగ రసమంటారు పచ్చిననమూలికలు దొరకనిచో ఎండినవాటిని తెచ్చి వాటికి ఎనిమిదిరెట్లు నీరుపోసి చతుర్థభాగముగ కాచినరసమునకుశృత మంటారు.

## కల్కము

పచ్చిగనుండు ద్రవ్యములను రాతిపైనవేసి మెత్తగానూరి ముద్దజేసినదియు ఎండు ద్రవ్యములను నీటితోజేర్చి పైరీతిగ జేయ బడినదియు, కల్కమంటారు.

## క్వాథము

రోగాల ననుసరించి ద్రవ్యముల నన్నిటిని లెక్కప్రకారము నలగగొట్టి కుండలోవేసి యందు తగినంతనీరుపోసి అగ్నితోకాచి దానినివడియగట్టి కొంచెము వేడిగనున్నప్పుడే రోగపశువునకిచ్చు దానిని క్వాథము లేక కషాయమంటారు.

# పదియవ భాగము

## వనమూలికలు

### అడ్డసరపం

ప్రతి రైతునకు ఈ చెట్టు వుపయోగము తెలియును. చూడండి తన పశువునకు దగ్గువచ్చినా, ఆయాసపడుతున్నా, వాతనొప్పులు వున్నా ఈఆకును వుపయోగించుతాడు. కాని రైతుమాత్రం ఏ మూలిక ఏ గుణం కలిగి వుంటుందో, చలువ చేస్తుందా, వేడిచేస్తుందా అనే విషయాలు గుర్తించుకొని వాడాలి గాని తమ యిష్టంవచ్చినట్లుల వాడరాదు. గుణము కనిపెట్టి మూలికలను వాడాలిగాని మీయిష్టం వచ్చినటుల వాడిన తరువాత గ్రంధకర్తను దూషించినా లాభం లేదు. అందుచేతనే విషపంతంకాని పశువులకు అపకారము చేయనిముఖ్యమైన మూలికలనే తెలుపుచున్నాను. అడ్డసరపుచెట్టు పొదవలెగుబురుగా పెరుగుతుంది కొమ్మలు లేతగా వున్నప్పుడు ఆకు పచ్చగా, ముదిరితే తెలుపుగావుంటాయి. మాఘఫాల్గుణ మాసాలలో ఇదిచక్కగా పూతపూస్తుంది. కొమ్మల చివరజూలువలె తమాషాగా చిన్నచిన్న ఆకులుపుట్టి వాటిమధ్య తెలుపుగావుండే చిన్నపువ్వులు పూస్తుంది దీనిఆకులు, చెక్క శ్వాసరోగాలు తగ్గించుటలో పెట్టింది పేరు. ఆకురసము మాత్రము చలువచేస్తుంది.

### అవిసె

ప్రతిరైతుకు అవిసె ఆకు మహాత్మ్యతెలియును బస్తీలలో ప్రతి కొట్టువద్ద అవిసెఆకుకట్టలువుంటాయి. పొద్దున్నే తమకొట్ల దగ్గరకు,

రాగానే వర్తకులు తమనిత్య జయముకొరకు వచ్చేపోయేగోవులకు, ఆబోతులకు ఒకటిరెండు అవిసెఆకుకట్టలను కుడిచేతితో వాటినోటి కందించి "గోవుమాలిచ్చిమికి కోటిదణ్ణాలు" అని ఒకనమస్కారం పెట్టి తమపనినితాము సాగించుకొంటారు. అవిసెచెట్లుఅన్నిప్రాంతాల లోను వుంటాయి. ఈచెట్లలో ఎరుపు, తెలుపు పువ్వులుపూస్తాయి.దీని చెక్క, ఆకురసముచేదుగావుంటుంది. వేడిచేస్తుంద పశువుకంటిలో పువ్వువేసిన, పొరవేసిన అవిసెఆకురసముతో తగినంతసొంటిగంధంకలిపి అప్పుడప్పుడు పెట్టితే తగ్గిపోతుందని ప్రతి రైతునకు తెలియును. ఈరీతిగా పశువు శరీరమంతా కల్లవాపుగా వాస్తే దీని ఆకు రసంతో కొద్దిగా ముద్దకర్పూరం కలిపి రెండుపూతలు పెట్టితే దిష్టి తీసినట్లుగా తగ్గుతుంది. అవిసె గింజలనుండి నూనెను శుద్ధి చేసి కడుపుబ్బు, దీర్ఘ కడుపునొప్పికి వాడితే బలేగా పనిచేస్తుంది. అయితే ఒక విషయం మాత్రం ప్రతిరైతు గుర్తించుకోవాలి. బజారులలో రంగులలోకలిపి వచ్చేది, శుద్ధిచేయని అవిసెనూనెను వాడితే తిక్కపుట్టి మరణానికి సిద్ధమగుతుంది. గాని మీకు దగ్గరగానున్న మందుల షాపులో శుద్ధి చేసిన నూనె దొరికితే వాడాలిగాని శుద్ధి చేయనిది ఎంత మాత్రం వాడరాదు.

## అల్లము

మానవునికి వలె పశువునకు కడుపుబ్బరంచేసినా, కడుపునొప్పి వచ్చినా, అజీర్తి చేసినా తెనాలి సహదేవ పశువైద్య ఫార్మసీవారి వాతారి అరకులో అల్లపురసము కలిపియిస్తే వెంటనే గ్యారంటీగా తగ్గుతుందని ప్రతిరైతుకు నమ్మకము వుంది అల్లము అంటే అదిరి పోయే మందు అంటారు. అంతచక్కగా జీర్ణరోగాలలో పనిచేస్తుంది. పశువులకు వచ్చే జీర్ణరోగాలకు. శ్వాస, వాతరోగాలకు వాడే మందులలో అల్లమును కలిపి వాడుతారు. ముఖ్యంగా కడుపులోని


రేవల్చిన్ని
వాయింటు
మిరియాలు
జిల్లేడు
గజపిప్పలి
బ్రహ్మదండి
గుగ్గిలం
నల్లజీడి
లవంగము


సునాముఖి
మంచిగంధము
తిప్పతీగె
పొగడ
గసగసాలు
క్వైనా
ఆవ
పసుపు
మునగ

వాయువును హరింపజేయాలన్నా అజీర్తి, దగ్గు, వగర్పు తగ్గాలన్నా తగినంత మంచి బెల్లంతో అల్లపు రసం కలిపివాడితే గోసాయి చట్కాలాగా పనిచేస్తుంది.

## అతిమధురము

ఈ మొక్కలు పెషావరు, అరేబియా, సింధు ప్రాంతాలలో పెరుగుతాయి. చెట్టుఅంతా నారగా వుంటుంది. పువ్వులు గుత్తులుగా వుంటాయిగాని వాసనవుండదు ఆకును చేతితో నలిపితే వెగటు వాసనగా వుంటుంది. దీనిఆకు తిని సన్యాసులు యోగసిద్ధిలోజయము పొందుతారు. వేరురసము చలువచేస్తుంది. దీనినే యష్టిమధుకం అంటారు. దగ్గులకు, వగర్పుకు వాడవచ్చును.

## అరటి

ఈ చెట్టును గురించి ప్రతివ్యక్తికి తెలియును. ఈచెట్టుదుంప, వేర్లు, పొత్తి, ఆకురసము వెగటుగా చేదుగా వుంటుంది. వేరురసం మాత్రం విషాన్ని విరుస్తుంది. మలబద్ధకంగా వుండే దూడలకు రెండు చిన్న అరటిపండ్లు తగినంత ఆముదముతో కలిపి అంగిటిలో వేస్తే చక్కగా విరేచనమగుతుంది. అరటిదుంప రసంవిరేచనాలుకట్టిస్తుంది. అరటిపొత్తి మసిచేసి తగినంత వెన్నలోకలిపి రాస్తే అరుగ్రివాపులు తగ్గుతాయి

## అక్కలి కఱ్ఱ

మానవులకువలె పశువులకుకూడ నోటినుంచి నీరువూరనప్పుడు నాలుక పిడచకట్టినపుడు,నాడీకా రోగాలలోను దీనిచూర్ణమును అప్పుడప్పుడు తదితర మందులతో కలిపి వాడితే మంచి పని చేస్తుంది. కందిరీగలు, తుండీగలు, జోరీగలు కుట్టి దద్దురు కలిగినప్పుడు దీని గంధం చక్కగా పని చేస్తుంది. ఆకు వేరు వేడి చేస్తుంది. కారంగా వగరుగా వుంటుంది.

## అతివస

దీనిలో తెలుపు,ఎరుపు, నలుపు అనిమూడు రకాలువుంటాయి. గుణముమాత్రం అన్నీసమానంగానే యుంటాయి. చేదుగా,కారంగా వుంటుంది. వేడిచేస్తుంది. దొమ్మలకు, కల్లవాపులకుపనిచేస్తుంది.

## అత్తి

ఇవిపెద్దవృక్షము. ఆకులుకోలగా, మందంగా, గుండ్రంగా, గరగరలాడుతువుంటాయి. చెట్టుమాను వొలిస్తే పాలుకారతాయి. చెక్కరసం వెగటుగా తీపిగా వుంటుంది. వాతరోగాలకు, మొండికంతులకు, చర్మరోగాలకు వుపయోగపడుతుంది

## అంకుడు

ఇదిసామాన్యవృక్షము.దీనినిపాలకొడిసకూడా అంటారు.ఇంకను అదిపాలుగల వృక్షము. ఆకురసం మిగుల వేడిచేస్తుంది.చర్మరోగాలకు ఆకుపసరు చక్కగ పనిచేస్తుంది.

## అత్తిపత్తి

అదిచిన్నజాతిలోని మొక్క. నీటియొడ్డున, తేమగలప్రదేశాలలోను ఇదిపెరుగుతుంది. దీనివేరు ఎరుపుగావుంటుంది. దీనిఆకులను చేతితో తాకిన పుల్లతో తాకినా ముడుచుకొనిపోతాయి. రాత్రులందు అవంతటవియే ముడుచుకొంటాయి. వీటిలో ఎరుపుపువ్వులు, పచ్చపువ్వులుగలవిరెండుజాతులువుంటాయి. దీనిపట్ట, ఆకులుచేదుగా వగరుగావుంటాయి చలువచేసేగుణము వుంది రక్త,శ్వాస, మూత్ర, చర్మరోగాలకు వాడవచ్చును. వంధ్య పశువులు గర్భము ధరించుతాయి.

## అడవిపొట్ల

అరణ్యప్రాంతాలకు దగ్గరగావుండే పొలాలలో మామూలు పొట్లచెట్లవలే పెరుగుతాయి. ఆకులుచిన్నవిగావుంటాయి తీగమాత్రము నాలుగైదు గజాల దూరము కంటె పాకదు. చెట్టుసమూలమంతా కాయతో సహా చేదుగావుంటుంది. తీగఎండిపోయినా కాయలు ఎరుపుగా పండి చాలాకాలము నిలువయుంటుంది. శ్వాసరోగాలకు, చర్మరోగాలకు చక్కగా పనిచేస్తుంది. మిగుల వేడిచేస్తుంది. సమూలమంతా శ్లేష్మాన్ని హరింపచేస్తుంది.

## అగరు

దీనినే అగురుఅనికూడఅంటారు ఇదికూడ ఒకచిన్న చెట్టు. అగురులో చాలాజాతులుకలవు ఆకులుతొగరాకులవలె కోలగావుంటాయి. కృష్ణఅగురునుమాత్రము వైద్యానికివుపయోగిస్తారు ఇదివేడిచేస్తుంది. రోగపశువులు-ఆహారము తినాలంటే రుచికొరకు దీనినివాడవచ్చును. శ్వాసరోగాలకు, చర్మరోగాలకు ఈఅగురుద్రవ్యాన్ని ధూపముగా వేసి ముక్కురంధ్రాలకు పట్టించిన చక్కగాపనిచేయును. ఈఅగరుతోనే సువాసన కొరకు అగురువత్తులుగాతయారుచేసి సువాసనకొరకు వాడుతారు.

## ఆముదపు చెట్టు

ఈ చెట్టుకూడ చాలాప్రసిద్ధమైంది దీనిలో చిట్టాముదము, పెద్దాముదము అని రెండుజాతులు. ఆకులువగరుగ చేదుగావుంటాయి. ఆముదమును గురించి ప్రతిరైతునకు తెలిసియేవుంది. నేత్ర, జీర్ణ, వాతరోగాలలో ఆముదాన్ని వాడవచ్చును. ఆముదపు గింజలను దాణాలలో కలిపి అప్పుడప్పుడు వాడుతూ వుంటే మలబద్ధకము పోతుంది. ప్రతిరోగానికి ఆముదాన్ని లోపలికి ఈయరాదు.

## ఆవాలు

ప్రతియింటిలో ఆవాలు వాడుతారు. మామిడికాయ, నార దబ్బకాయ పచ్చడిలో ఆవాలు వేసినచో రుచేకాకుండా ఏజబ్బు చేయదు. అందుచేత పశువులకు కడుపుకుట్టుచేసినా, దొమ్మ తగిలినా కొంతమంది రైతులు మామిడికాయ పచ్చడి లోపలికి పెడతారు. ఆవాలను పశువులకు వాడే బలవర్ధక ఔషధాలలో కలిపివాడవచ్చును. ఆవాలపట్టును మానవులకు వలె పశువులకువచ్చే న్యూమోనియా మున్నగు రోగాలలోవచ్చే వాపులకు పట్టువేసి కొంతసేపువుంచుతారు. మలిమిడిసోకి కాలిగుత్తి వాచినపుడు చిత్రమూలం వేరుతో ఆవాలు వేసినూరి ఒకటి రెండు కట్లు తేలికగాకట్టితే వాపుతీసి బాధతగ్గుతుంది

## ఆరుదొండ

ప్రతి చిన్నపిల్లవానికి దొండకాయ అంటే ఎంతో యిష్టం. దొండ తీగెగాప్రాకుతుంది. అర్రవాపులకు, బెణుకులకు ఈదొండఆకు పసుపులో తగినంత మంచినూనె కలిపి మర్దనచేసి వేడినీటి కాపులు తీస్తూవుంటే తగ్గుతాయి. మొత్తంమీద దొండాకు పసుపువాపులను తగ్గించుటలో మొనగాడు.

## ఆకు జెముడు

జెముడుచెట్లలో చాలారకాలు వున్నాయి. ఎంతో అవసరముంటే తప్ప అనవసరముగా నోరులేని పశువులకు వాడరాదు. ఇది ఎంతో విషవంతమైనది. మోటువైద్యులు ఈచెట్టుతో పశువులతో సరసాలు ఆడతారంటారు అంటే పశువుచస్తేచస్తుంది. బ్రతికితే బ్రతుకుతుంది. గరళములాగా పనిచేస్తుందని గొట్టాలకొలది జెముడు రసముపోస్తే పేగులుకూడ తెగిప్రాణాపాయంకలిగించే విషముదీనిలో వుందిగాన ఎట్టివైద్యుడైన ఈజెముడురసాన్ని వాడుతూవుంటేరైతులు మాత్రం ఆవైద్యునిసాగదీసి దేనికిఈరసంవాడుతున్నావని ప్రశ్నించుట అత్యంతవసరము. జెముడు కాడరసములో వేపనూనె కలిపి అర్రవాపులకు కల్ల వాపులకు పైన మర్దనచేయవచ్చును.

## ఆరికలు

ఇదిమాగాసిప్రాంతాలలోను, రేగటినేలలలోను,పండుతాయి. ఇవిచింతగింజరంగుగావుంటాయి గింజపలకగావుండిచిన్నదిగావుంటుంది. ఇవిక్షారగ్రిలకంటె కూడ వేడినిస్తాయి బలవర్ధకపు మందులలో వీటిని కలిపిపెట్టిన మంచిపుష్టినిచ్చును. కఫమును హరింపజేస్తుంది.

## ఆకాశ గరుడ

ఇది తీగెజాతిలోనిది. దీనినేరాకాసితీగె, నాగదొండఅంటారు. ఆకులు మందముగావుండి ముడుచుకొని వుంటాయి. గబ్బువాసనగా వుంటుంది. దీనికి దుంపకూడా వుంటుంది. ఆకాశమున గరుడపక్షి ఏరీతిగా వుంటుందో ఇదికూడ ఆకాశంగా వుంచితే జీవించగలదు. చేదుగా కొంచెము పులుపుగా వుంటుంది. పాము విషానికి మంచి విరుగుడుగల మూలిక. దీనిదుంపనే యిట్టివాటకి వాడుతారు. పశువులు పాలీయునపుడు దీని ఆకుపసరును యోనికిరాసిన వెంటనే చేపుతాయి.

## ఆకాశ వల్లి

దీనినే పాచితీగె యంటారు. చెట్లమీద సన్నని తాళ్ళవలె వ్రేలాడుతాయి దీనికి వేరుయుండదు ఇది వర్షఋతువులో బయలు దేరుతుంది. ఇది వగరుగ చేదుగా వుంటుంది ఇది చర్మరోగాలకు పని చేస్తుంది. నేత్రరోగాలను పోగొట్టుతుంది.

## ఇంగువ

చూడి పశువులకు, తదితర పశువులకు, ఈనిన పశువులకు యింగువను మన రైతులు జాస్తిగా వాడతారు. యింగువ కొరు వాసనగా, వెగటుగా, కారముగా, మంటగా వుంటుంది. మిగుల వేడి జేస్తుంది. గర్భంలోని వాయువును, నాతాన్ని, మలినాన్ని వెంటనే పోగొట్టుతుంది. జీర్ణరోగాలకు, వాతరోగాలకు యిది పెట్టింది పేరు. కాని గుణము కనిపెట్టి మోతాదు వాడాలి గాని, ఎక్కువమోతాదులు వాడితే జీర్ణకోశం చెడి పోతుంది.

## ఇందుపగింజలు

పీటినే చిల్లగింజలు అంటారు. ఒండుర్రి, మురికినీటిలోని మడ్డి శుభ్రం చేయాలంటే ఈ గింజల గంధము నీటిలో కలిపితే చక్కటి నీరు తయారగు తుంది కంటి తెలుపు. కంటి పువ్వులకు ఈ గింజలను మాడ్చి పొడిచేసి రెట్టింపు పంచదార కలిపి అప్పుడప్పుడు పట్టించితే తగ్గిపోతాయి.

## ఇప్ప

ఇది యొక పెద్ద వృక్షము. దీని పువ్వుతో సారాయి తీస్తారు. యింకా నూనెను తయారు చేస్తారు. పువ్వులు మాత్రము పొగడ పువ్వులులాగా మెత్తగా వుంటాయి అరిష్టాలలోను, కషాలయాలలోను ఈ పువ్వును వేసి కాచితే ఒక విధమగు గ్యాసు, శక్తి కలుగుతుంది. యిప్ప పువ్వు అంటురోగాలకు వాడుతారు.

## ఈశ్వరి

ఇదియొక చిన్న మొక్క, దీనిలో తెలుపు, నలుపురకాలు వున్నాయి. సమూలమంతా చేదుగావుంటుంది దీనివేరురసము పాము కాటునకు తదితర జంతువుల విషాలకు అద్భుతముగా పనిచేస్తుంది.

## ఒద్ది చెట్టు

ఇదియొక పెద్దవృక్షము, ఈ చెట్టునకు చేదుగల పాలుంటాయి. ఈ చెట్టు చెక్కరసము చేదుగా కారముగా వుంటుంది. కఫాన్ని పోగొట్టుతుంది. విషాలను విరుస్తుంది. శిరోరోగములకు పనిచేస్తుంది.

## ఏనుగ పల్లేరు

మూత్రరోగాలు తగ్గాలంటే ముందుపల్లేరు వాడమంటారు. పెరుగుగట్టిగా తోడుకోవాలంటే పల్లేరు ఆకులను ఎనుగులో కొంత

సేపువుంచితే గట్టిపడుతుంది. అన్నిరకాలపశువుల మూత్రరోగాలకు కాయలరసం చక్కగా పనిచేస్తుంది. చలువచేస్తుంది

## ఏనుగతుమ్మ

అదిఅర్ధగజమెత్తు పెరుగుతుంది. ఆకులు పసుపుఆకుపచ్చరంగుగా వుంటాయి. ఒకవిధమగు సువాసనగావుంటాయి. పువ్వులు తెలుపుగాను. ఆకులుగరుకుగాను వుంటాయి. అవిగరపనేలలలో పెరుగు తాయిరక్త సంబంధమైన రోగాలలోను, జ్వరాలకు ఆకుపనిచేస్తుంది.

## ఎలుకచెవితీగె

అదినేలమీదపాకుతుంది. దీనిఆకులుమాత్రము ఎలుకచెవి ఆకారముగావుండుటవల్ల ఎలుకచెవితీగెయని పేరు వచ్చింది. కాడలు సన్నముగు ఆకులుకొంచెము ఎరుపురంగుగా తోకచివర గుండ్రని పువ్వులు పూస్తాయి ఆకువగరుగచేదుగనుంటాయి. శూలలకు, విష జంతువుల విరుగుడుకు. క్రిమిరోగాలకు పనిచేస్తుంది.

## ఎద్దునాలుకచెట్టు

అదిఒకచిన్న మొక్క, దీనిఆకులు ఎద్దునాలుక ఆకారంగా వుంటాయి. ఆకులుగరుకుగా వుంటాయి. ఆకురసము చేదుగావగరుగా వుంటుంది. శ్వాసరోగాలకు, విషరోగాలకు పనిచేస్తుంది.

## ఉమ్మెత్త

ఉమ్మెత్త అంటేనే విషవస్తువని చాలామందికి భయం. వీటిలో నలుపుది చాలాశ్రేష్టమైంది పచ్చపువ్వులది అన్నిటికంటె శ్రేష్టమైంది సామాన్యంగా అది దొరకుటకష్టము. ఆకురసము అతివేడిచేస్తుంది. ఈఆకును చూస్తే విషపురుగులు, పాములు హడలిపోతాయి. విష పురుగుల కాట్లకు, పాముకాటును. విషసంబంధమైన రోగాలకు ఆకు పసరు బాగుపని చేస్తుంది

## ఉత్తరేణి

ప్రతి నాటువైద్యుడు పాముకాటుకు మందుయిస్తాను. ఎముక విరిగి అతుకుకొనకపోతే నిమిషంలో ఆకువేసి కట్టిస్తాను అంటు వుంటారు. ఈ ఉత్తరేణి ఆకుతోనే అట్టివైద్యులు నాటకమాడుతారు ఉత్తరేణిఆకుపసరు కారంగా చేదుగావుండి వేడిచేస్తుంది. విరిగిన ఎముకలను అతుకుకొనచేయుశక్తి దీనిలోవుంది. చర్మరోగాలకు, విష సంబంధమైన రోగాలకు ఈ సమూలము అంతా పని చేస్తుంది.

## ఊడుగ

ఈచెట్టుసామాన్యంగావుంటుంది. ఆకులుసన్నంగా పొడవుగా రెండు మూడు అంగుళాలు వుంటాయి. ముఖ్యంగా ఈచెట్టు చెక్క రసం అంటురోగాలకు, విషపురుగుల కాట్లకు చక్కగా పనిచేస్తుంది. రసము చేదుగానుండి వేడిజేస్తుంది.

## ఉసరిక

ఇదిజీర్ణ, వాతరోగాలకు పరమౌషధము ఈచెట్టు కాయలు పువ్వులు ఆకులు వైద్యానికి వుపయోగ పడుతాయి. దీనిచెక్క కాయలరసం వగరుగ పులుపుగ వుంటుంద. చలువచేస్తుంది రక్త, జీర్ణ, వాత, శ్వాసరోగాలన్నిటికివాడే ఔషధాలలో ఉసరికను వాడ కుండా వుండరు.

## కరక్కాయ

సామాన్యంగా ప్రతిజీర్ణ, వాత, రక్తరోగంలోను వాడేమందు లలో కరక్కాయపొడి కలపకుండా వుండరు. ఈ కరక్కాయలలో పది రకాలు వున్నాయి. విజయ కరక్కాయ మాత్రం శ్రేష్టమైంది. కరక్కాయ కండలో మధురరసం, స్నాయువులలో ఆమ్లరసం, తొడిమలోచేదు, చర్మంలో కారము, గింజలో వగరు వుంటుంది. కరక్కాయ చలువచేస్తుంది.

## కలబంద

ఇదికూడ సర్వాంగ సారమగు మూలిక. కలబంద మట్టలలో మదపువాసనగల గుజ్జువుంటుంది. వైద్యంలోమాత్రము మట్టలనే వాడుతారు మట్టలరసం విరేచనం గావించుతుంది. చర్మరోగాలను పోగొట్టుతుంది. ఈ మట్టలనుంచియే ముసాంబ్రిను తయారుచేస్తారు. దీనిని బలవర్ధక ఔషధాలలో వాడుతారు.

## కవిరి

ఇది చండ్రిచెట్టునుంచి తయారుచేస్తారు. దీనినే కైరసారం,, కాంచు, కాచు, కవిరి అంటారు. తమలపాకుల కిల్లీలలో ఎరుపురంగు వచ్చుటకు, నోటిదుర్గంధాన్ని పోగొట్టుటకు కవిరిని వాడుతారు. ఇది వెగటుగ, వగరుగ వుంటుంది. చలువచేస్తుంది. ముఖ్యంగా విరేచనాలను కట్టించుతుంది. నాలుక నోటిపూతను హరింపచేస్తుంది.

## కరివేప

ఈ చెట్టును గురించి ఎల్లరకు తెలిసినవిషయమే. ఆకుమాత్రం పశువులపాలిట అమృతంవంటిది ఈనినతరువాత వాతమువల్ల మైల ఎడునపుడు మాత్రము నిమ్మకాయంత కరివేపాకును సేరు బియ్యపు నీటిలో కలిపి నూరి రోజుకొకసారి త్రాగించిన మైలంతా పడిపోతుంది. వాతాన్ని హరింపచేస్తుంది. చూడి నిలుచుటకు కూడా దీనిని వాడవచ్చును.

## కసివెంద

ఇది చిన్నచెట్టు సమూలమంతా వెగటుగా వుంటుంది ఆకు రసము వేడిచేస్తుంది. ఆకుపసరు చర్మరోగాలకు, వాపురోగాలకు వాతరోగాలకుచక్కగాపనిచేస్తుంది.

## కుప్పింటు

ఈ చెట్టు ప్రతిచోటా పెరుగుతుంది. ఇది మూరొంకడాకుజాతి లోనిది. ఆకురసం ఘాటుగా వుంటుంది స్మారకము తప్పినపుడు విష పురుగుల కాట్లకు ఆకుపసరును ముక్కులలోపోసిన తుమ్ములువస్తాయి. చర్మరోగాలకు ఈపసరు పనిచేస్తుంది.

## కురంజీవాము

ఈ మొక్కలుగుబురుగా పెరుగుతాయి. పచారికొట్లలో ఇది దొరకుతుంది. జీర్ణరోగాలను వెంటనే తగ్గించుతుంది. ఇంకను ఈ వాములో మత్తును కలిగించే గుణముంది.

## కురాసానివాము

ఇదికూడ ఘాటుగా సువాసనగా వుంటుంది గర్భ, వాత,జీర్ణ రోగాలకు పనిచేస్తుంది. జీర్ణకారి.

## కుంకుడు

ఈచెట్టునుగురించి ఎల్లరకు తెలిసియుంది. ప్రతియింటిలో ఈ కాయలు లేకుండ వుండవు. కాయలరసం చేదుగావుంటుంది. దొమ్మ లకు ఈరసమును తాగించిన పనిచేస్తుంది. చర్మరోగాలకు వాడే మందులను పైనరాసినప్పుడు కుంకుడుకాయ రసంతో కడిగిగాని మందును వుపయోగించవలె

## కానుగ

క్షయ ఆస్పత్రులను, ఈచెట్లువుండే ప్రాంతాలలో స్థాపించుట మనకు తెలిసేయుంది. ఈ చెట్ల గాలిలోవిషక్రిములనుచంపేశక్తి వుంది. కానుగగింజల నుండి తీసిన నూనె చర్మరోగాలకు పనిచేస్తుంది. ఆకురసం గూడ చర్మరోగాలకు వాడవచ్చును.

## కాకర

ఇది తీగ జాతిలోనిది. సమూలమంతా చేదుగా వుంటుంది, వేడిచేస్తుంది. ఆకుపసరు విషజంతువుల కాట్లకు, చర్మరోగాలకు చక్కగా పనిచేస్తుంది.

## కంద

మనపొలాలలో పండిచే కంద దుంపను మావిపడని పశువులకు తగినంత దుంపను అనగా 10 తులాల వరకు తీసికొని సేస బియ్యపు నీటిలో కలిపి త్రాగించిన చక్కగా పనిచేస్తుంది. ఇకొక మంచి చట్కా.

## కుక్కవాయింట

ఆకులు చిన్నవిగా, గుండ్రముగా చెడువాసనగా వుంటాయి. ఈ ఆకు పొక్కే గుణముంది. చర్మరోగాలకు, కర్ణరోగాలకు వ్రణాలకు పనిచేస్తుంది.

## కస్తూరి బెండ

ఇది మధ్యరకపు చెట్టు, ఇది లక్ష్మీప్రదమైనది. ఆకురసము తీపిగా వగరుగా వుంటుంది. వాతజీర్ణరోగాలకు పనిచేస్తుంది.

## కృష్ణతామర

ఇది అన్ని ప్రాంతాలలోనుదొరుకుతుంది దీనిసమూలరసాన్ని మిరియాలరసముతో విషపుమొక్కలుతిన్న పశువులకు, ఉంగిడితగిలిన పశువులకు త్రాగించిన చక్కగా పనిచేస్తుంది.

## కొబ్బరి

కొబ్బరికాయలేనిదే ఏపూజ, ఏఫలహారం పూర్తికావు. కొబ్బరిలో చమురువుంటుంది. పాడిపశువులకు, తదితర పశువులకు

వాతముచేసిన, అజీర్తి చేసిన, పాలుచిత్తగ్గిన కొబ్బరికాయను పెట్టుట మనరైతులకు బాగా తెలియును. ప్రతిరైతు వాడవచ్చును. కొబ్బరి పువ్వుకూడ చక్కగపనిచేస్తుంది. కొబ్బరినూనెకూడ పశువులకువాడ తారు. మితిమీరివాడితే వ్యాధికుదరకపోగా తదితర రోగాలలోకి దింపుతుంది. గాన ఒకపౌనునూనెకంటె వాడరాదు

## కర్పూరశిలాజిత్తు

ఇది తెల్లటి ముక్కలలాగా వుంటుంది. కర్పూరగంధ కలిగి యుంటుంది. ఇదివగరుగా తీపిగావుంటుంది చలువచేస్తుంది. మూత్ర రోగాలకు పనిచేస్తుంది.

## కలిగొట్టు

ఇది పెద్ద వృక్షము. ఇది దశమూలాలలో ఒకటి. దీని వేరుచేదుగా వుండి వేడిచేస్తుంది. ఈచెట్లలో తెలుపు, ఎరుపు రెండు రకాలు వున్నాయి వాత, జీర్ణ, శ్వాసరోగాలలో వేరు పనిచేస్తుంది

## కర్కాటకశృంగి

ఇదిరొకచిన్న చెట్టు. ఇదిరుచిగా వగరుగా వుండి వేడిచేస్తుంది. వాతాలకు, రక్తరోగాలకు, శ్వాసరోగాలకు పనిచేస్తుంది. ఇంకను కఫాన్ని, దప్పికను తగ్గించుతుంది.

## కొడిశపాల

ఈచెట్లుఅరణ్యాలలోపెరుగుతాయి. దీనిమానుపట్టరసం ఎరుపు రంగుగా వుంటుంది. చెక్కరసం కారంగా, రుచిగా వుంటుంది. చర్మరోగాలకు. అతిసారము, విరేచనాలను కట్టించుతుంది.

# కురు వేరం

ఇది తూటికాడవలె వుంటుంది. నీరుగల ప్రదేశాలలో పెరుగ తుంది. వేరు సువాసనగా రుచిగా చేదుగా తీపిగా వుంటుంది జ్వరాన్ని, శ్వాసను కట్టించుతుంది. దప్పికను అణచుతుంది.

# గంజాయి

దీనినే జ్ఞానపత్రిఅంటారు. ఇదిమత్తును కలిగించుతుంది విరేచ నాలను కట్టించుతుంది. దీనిఆకురసము చెవిమాదకు మొండి చర్మ రోగాలకు పనిచేస్తుంది.

# గచ్చ

ఇది పొదలాగా పెరుగుతుంది. గచ్చపప్పు చేదుగా వగరుగా వుంటుంది. శ్వాసరోగాలకు పనిచేస్తుంది. ఆకును వెచ్చచేసి కల్లవాపు లకు, బుడ్డవాపులకు, దూడల బొడ్డువాపులకు నాలుగైదుకట్లు కట్టిన తగ్గుతుంది.

# గుంటకలగర

ఇదిఒకచిన్న మొక్క నలుపు, తెలుపు పసుపుపువ్వులు పూసే రకాలు వున్నాయి ఇదిసర్వాంగసారమైన మూలిక. ఆకురసము చేదుగా వుంటుంది. నేత్ర, చర్మ, శిరోరోగాలకు ఆకురసము పని చేస్తుంది.

# గోగు

ప్రతియింటిలోను గోగు కూర వండుకొంటారు. చిన్నదూడ లకు రేజీకటిగల పశువులకు, కసిమిరి తగిలిన పశువులకు గోగుకూర, గోగుగింజలు పెట్టిన చక్కగా పనిచేయును. కంతులకు, గడ్డలకు, వ్రణములకు, కల్లవాపులకు గోగుకూర ఉడికించి కట్టిన తగ్గిపోవును, వేడిచేయును. రుచిగా పుల్లగా వుంటుంది.

## గాడిద గడప

ఇది కంచెలమీద, కాలువగట్లమీద తీగెగా మొలుచుతుంది సమూలమంతా చేదుగా వుంటుంది. ఆకుపసరు వాతరోగాలకు, చర్మ రోగాలకు, విషపురుగుల కాట్లకు, ఎలికపాములు పేగులలోవున్నపుడు చక్కగా పనిచేస్తుంది.

## గుగ్గిలము

గుగ్గిలము చెట్టుయొక్క బంక. నీటిలో కలిపిన పాలవలె తెలుపుగా వుంటుంది. బలవర్ధకౌషధాలలోను, ధూపనై వేద్యాలకు, వాతనొప్పుల పట్లకు పనిచేస్తుంది

## గొల్లజిడ్డు

దీని ఆకులు తిప్పతీగె ఆకులవలె వుంటాయి. దీని ఆకులను మెత్తగా బెల్లముతోనూరి విరిగిన ఎముకలకు కట్టుకట్టిన వెంటనే అతుకుకొన చేస్తుంది ఆకురసము మూత్రరోగాలకు గాయాలకు, పనిచేస్తుంది.

## గజ పిప్పలి

ఇవి మలయా ప్రాంతాలలో ఎక్కువగా పండుతాయి. వేడి చేస్తుంది గొంతురోగాలకు శ్వాసరోగాలకు, వాత, జీర్ణరోగాలకు పనిచేస్తుంది.

## చింత

చింతచెట్టు వుపయోగాన్నిగూర్చి ఎల్లరికు తెలిసినవిషయమే. చింతపండుపులుసు చలువచేస్తుంది విరేచనాన్ని కలిగిస్తుంది. చర్మ రోగాలను పోగొట్టుతుంది. చింతగింజల జిగురు విరిగిన ఎముకలను అతుక్కొనచేస్తుంది. పులుసు విషాలనువిరుగతీస్తుంది.

# చిత్రమూలము

చిత్రమూలం చెట్టులో ఎగుపు. తెలుపు నలుపు భేదాలు వున్నాయి. నలుపురంగుది పాడిపశువులకు వాసన చూపినా, పాలలో కలిపినా పాలు నల్లబడతాయి. చిత్రమూలం బెరడును చూర్ణంచేసి బలవర్ధక ఔషధాలలో కలిపి ఈయవచ్చును ఆకును వేరును బెణుకులకు, పాతనొవ్వులకు వుపయోగించిన పని చేస్తుంది.

# చేదుబీర

మంచిబీరవలె వుంటుంది. సమూలమంతా చేదుగావుంటుంది. నాడికాసంబంధమగు రోగాలకు ఆకుపసరు పనిచేస్తుంది నరాలకు సత్తువ కలిగించుతుంది.

# చేదు పొట్ల

దీని సమూలమంతా చేదుగా వుంటుంది. వేడిచేస్తుంది. రక్త, చర్మ, క్రిమిసంబంధమగు రోగాలకు ఆకుపసరును వాడవచ్చును.

# చేకొంతి

దీనినే సేగుర్తాకు అంటారు. ఇదిదొడ్లలోను పొలాలలోను పెరుగుతుంది. ఆకు పసరు వాతాలకుబాగాపనిచేస్తుంది.

# చిరి

దీనినే చిరికూరఅంటారు. ముండ్లతోటకూరలాగావుంటుంది. ముండ్లువుండవు. తీపిగా రుచిగావుంటుంది. చలువచేస్తుంది. విషానికి విరుగుడుగా పనిచేస్తుంది. చిరివేళ్ళరసము ఉంగిడికి పశువులకు విషపు మందులు పెట్టినపుడు విరుగుడుగా ఈయవచ్చును. విషపు మొక్కలు తిని నోరుపొక్కినపుడు ఈవేళ్ళరసాన్ని తాగించాలి.

## మంచి గంధపుచెక్క

చెక్కపొడి, చెక్కఅరగదీసిన గంధము సువాసనగావుంటుంది. చలువచేస్తుంది. తాపాన్ని, మూత్రరోగాలను పోగొట్టుతుంది

## చిట్టిముట్టి

ఇది యొక చిన్న మొక్క. ఆకురసము మూత్ర రోగాలకు, దాహాన్ని తగ్గించుటకు పనిచేస్తుంది.

## చేదు జీలకఱ్ఱ

దీనినే విషకంటకాలు అంటారు ఇది నలుపుగా చేదుగా వుంటుంది. వేడిచేస్తుంది. విషాలకు విరుగుడుగా పనిచేస్తుంది. చర్మ వ్యాధులకు ఈ జీలకఱ్ఱను చింతపండు పులుసుతో కలిపిప్రాతగాపెట్టిన తగ్గుతుంది.

## జీడిగింజలు

నల్లజీడిగింజలను నలగగొట్టితే మంచిఘాటుగావుండి శరీరము పొక్కుతుంది. ఇవిచేదుగా వెగటుగా చమురు కలిగియుంటాయి. పాడి పశువులకు తదితర పశువులకు ఈ గింజలను పులిచల్లలో నానవేసి పెట్టవచ్చును. అనుభవముగల రైతులే వీటిని వాడాలి. ఈ గింజలతో భల్లాతక లేహ్యం తయారు చేస్తారు. ఈ లేహ్యాన్ని పశువులకు వాడరాదు.

## జలకఱ్ఱ

ప్రతియింటిలోను యిదివుంటుంది. జీర్ణకారి. వేడిచేస్తుంది. రక్త, జీర్ణ, వాతరోగాలలో వాడే మందులన్నిటిలో కలిపి ఈయ వచ్చును.

## జిల్లేడు

జిల్లేడుపాలు పొక్కుతాయి. తెల్లజిల్లేడు శివునకు ప్రీతియట. చెట్టుసమూలమంతా వెగటుగా చేదుగా వుంటుంది. చాలా వేడిచేస్తుంది. ఆకురసం శ్వాసరోగాలకు, విషపురుగుల కాట్లకు, చర్మరోగాలకు పని చేస్తుంది. కీళ్ళవాపులకు, కీళ్ళదెబ్బలకు జిల్లేడాకులకు ఆముదమురాచి వెచ్చచేసి కట్టిన తగ్గుతాయి.

## జటా మాంసి

ఇది పీచుగావుంటుంది. చేదుగా తీపిగా వగరుగా వుంటుంది. చలువచేస్తుంది. నరాలబలహీనతను పోగొట్టుతుంది. ఇంకను ఇది సువాసనగా వుంటుంది. జ్వరమును తగ్గించుతుంది. చర్మరోగాలను పోగొట్టుతుంది.

## తుమ్మ

ఈ చెట్టునుగురించి ప్రతిరైతునకు తెలియును. సమూలమంతా వగరుగా వుంటుంది. చెక్కరసము విరేచనాలను కట్టించుతుంది. నోటిపుండ్లకు చర్మరోగాలకు చెక్కరసం పనిచేస్తుంది. తుమ్మకాయలు బలమును కలిగించుతాయి. తుమ్మఆకు వాతాన్ని పోగొట్టుతుంది.

## తురక వేప

ఈ చెట్టు చెక్కరసం ఆకురసం చేదుగావుంటుంది వేడి చేస్తుంది. ఆకురసం విరేచనం గావించుతుంది. చర్మరోగాలకు, వాతరోగాలకు వాతపట్లకు ఆకురసం పనిచేస్తుంది ఈఆకు వేసికాచిన నీటిని కల్లవాపు లకు, వాతనొప్పులకు అప్పుడప్పుడు పట్టించిన తగ్గుతాయి.

## తులసి

వీటిలో కృష్ణతులసి, లక్ష్మితులసి, భూతులసి. అనేవి వున్నాయి. కృష్ణతులసి సువాసనగా వుంటుంది. కఫాన్ని పోగొట్టుతుంది దగ్గును హరింపజేస్తుంది. వేడిచేస్తుంది. మొగబంతి, ముక్కుపీనస మున్నగు రోగాలలో ముక్కులకు పట్టించిన తుమ్ములు వచ్చి శిరోభారము తగ్గుతుంది చర్మరోగాలను పోగొట్టుతుంది

## తమ్మల పాకులు

ప్రతిరైతునకు ఈఆకులవాడకం తెలియును. వాత, జీర్ణ, శ్వాస రోగాలలో ఈఆకుపసరు పనిచేస్తుంది

## నేలతంగేడు

ఈచెట్టు సమూలమంతావగరుగా వుంటుంది ఇదిచిన్న గుబురు గలచెట్టు పసుపచ్చపూలుపూస్తుంది ఆకురసంవిరేచనాలను కట్టించుతుంది. దూడలకు తెలుపుగా విరేచనాలగునప్పుడు ఆకును పెరుగుతో కలిపి పెట్టిన తగ్గుతాయి.

## తిప్పతీగె

ఈతీగెనుండితిప్పసత్తును తీయవచ్చును. తీగెరసముకారముగా వగరుగా చేదుగా వుంటుంది. ఈరసము వాత, రక్త, రోగాలకువాడవచ్చును. తీగెనుపలుపుగా చుట్టి కురముతగిలిన పశువుమెడలోవేసిన జ్వరము, గ్రహబాధలు తగ్గుతాయి.

## తవాక్షరి

ఎదురుబొంగులలో పుట్టే తెలుపురంగుగల పలుకులనే తవాక్షరి అంటారు. వెగటుగా కారముగా వుంటుంది మూత్రరోగాలకుచక్కగా పనిచేస్తుంది.

## త్రిఫలాలు

కరక్కాయ, తాడికాయ, ఉసరిక్కాయలను త్రిఫలాలు అంటారు. వాత, రక్త, జీర్ణ, నేత్రరోగాలకు చక్కగా త్రిఫల చూర్ణం పనిచేస్తుంది.

## త్రికటుకాలు

సొంటి, పిప్పళ్ళు, మిరియాలను త్రికటుకాలు అంటారు. ఈ మూడు కలిపిన చూర్ణాన్ని రక్త, జీర్ణ, శ్వాస, శిరో, నేత్రరోగాలకు వాడవచ్చును.

## తేనె

తేనెలో నాలుగురకాలు వున్నాయి. తేనె మధురముగా వుంటుంది. వేడిగావుండే పదార్థాలలో తేనెను కలిపివాడిన విషముగా మారుతుంది. బలవర్థక ఔషధాలలోను, మాత్రలు లేహ్యాలలోను కలుపుటకు వాడవలసినపుడు చల్లారిన తేనెనువాడాలి.

## తెల్లపులక

వీటిలో వివిధరకాలు వున్నాయి. చెట్టునకు ముండ్లుంటాయి. తెల్లములకపండ్లు తెలుపుగావుంటాయి ఆకురసము చేదుగావుండి వేడి చేస్తుంది. ముఖ్యముగా కఫాన్ని. వాతాన్ని పోగొట్టుతుంది. నేత్ర రోగాలను పోగొట్టుతుంది. ఈ ఆకురసముతో చూడి పశువులకు నస్యము చేయించితే మగదూడలు పుట్టగలవని కొంతమందినమ్మిక.

## తుంగ ముస్తలు

మామూలుగా మెట్ట, మాగానిగట్లమీద మొలచే తుంగ దుంపలనే తుంగముస్తలు అంటారు. మెట్టదుంపకంటె మాగానిదుంప పెద్దదిగా వుంటుంది. తుంగముస్తలు చేదుగ వగరుగ తీపిగావుంటాయి.

ఇవి రక్తాన్ని శుభ్రపరుస్తాయి. ఆకలిని కలిగించుతాయి. దుంపను తొక్కి కంతులకుకట్టినతగ్గుతాయి. శ్లేష్మరోగాలలోను. జ్వరాలలోను విరేచనాలలోను తదితర మందులలోకలిపి ఈయవచ్చును

## తాళిసపత్రి

ఇది పెద్దవృక్షము. చెట్టంతా సువాసనగా వుంటుంది. దీని ఆకు యే ప్రసిద్ధమైనది. ఇదిఎండినద్రవ్యము చేదుగా, తీపిగా వుంటుంది. కఫరోగాలను, వాతాలను, శ్వాసరోగాలను తగ్గించుతుంది.

## ధనియాలు

మెట్టప్రాంతాలలో మామూలుగా పండేపంట. ప్రతియింటిలోను ధనియాలు లేకపోతే వంటింటిపనిసాగదు ధనియపు మొక్కనే కొత్తిమీర అంటారు ధనియాలుతీపిగా కొంచెము వగరుగావుంటాయి. మంచిజీర్ణకారి. కడుపులోని చెడువాయువును తీసివేస్తుంది. జీర్ణరోగాలలోను బలవర్ధకౌషధాల లోను కలిపివాడవచ్చును.

## దానిమ్మ

ఈచెట్టుచెక్క, ఆకు, వేరురసము వగరుగావుంటుంది. లేత ఆకును తగినంత పెరుగుతో తొక్కిదూడలకు, పెద్ద పశువులకు పెట్టిన విరేచనాలు తగ్గుతాయి. చెక్కరసమును పశువు ఈనిన తరువాత మైలపడుతున్నప్పుడు మానాన్ని కడుగుచున్న యోని శుభ్రపడుతుంది దుర్వాసనకూడ పోతుంది.

## దిరిసెన

ఇదియొక పెద్దవృక్షము. ఈచెట్టు చెక్క, ఆకురసము వెగటుగా కొంచెము చేదుగావుంటుంది. వేడిచేస్తుంది. ఆకుపసరు రక్తసంబంధమగు రోగాలకు వుపయోగపడుతుంది. చెక్కరసము వాతరోగాలలో వాడవచ్చును.

## దూసర

ఇదితీగెగా ప్రాకుతుంది. వేసవిలోను పచ్చగావుంటుంది. దూసరతీగెను పలుపుగా చుట్టి కురము, దొమ్మ మున్నగు రోగాలలో మెడలో వేసిన తాపము అణుగుతుంది. దూసరఆకు పసరును మూత్రరోగాలలో వాడవచ్చును. ఆకు పసరు చలువచేస్తుంది

## దుష్టపుతీగె

ఇదికూడ తీగెగా ప్రాకుతుంది. ఈతీగెను కూడ పలుపుగాచుట్టి కురమరోగము గలపశువు మెడలో వేసిన జ్వరము తాపము తగ్గుతుంది. శరీరపు నొప్పులు తగ్గుతాయి. ఆకు పసరు వేడిచేస్తుంది వాతరోగాలకు, రక్తసంబంధమగు రోగాలకు ఈఆకు పసరును వాడుతారు ఈతీగె ఉపయోగము రైతులకు తెలియును.

## దొండ

మామూలుగా దొండకాయను కూరగా వండుకొంటారు. దీనిలో కాకిదొండ, తియ్యదొండ, లింగదొండ అనేరకాలువున్నాయి. దొండఆకు పసరును వాతరోగాలకు వాడవచ్చును. దొండాకు పసరును తగినంత మంచినూనెలో కలిపి అరువాపులకు, బెణుకులకు వాడిన తగ్గుతాయి.

## దేవదారు

ఇది పెద్దచెట్టు. కొంచెము సువాసనగా వుంటుంది. మానులలో ఒకవిధమగు చమురు వుంటుంది దీనినే దేవదారు తైలము లేక టర్పెంటైన్ అంటారు. చెక్కకషాయము వాతరోగాలకు, మూత్రరోగాలకు, చర్మ రోగాలకు పనిచేస్తుంది

## దంతెన

దీనినే గంటెనచెట్టు అంటారు. వీటిలో తెలుపు నలుపురకాలు వున్నాయి. డొంకలలో పెరిగేతీగె. దీని వేరురసము కారముగ, చేదుగ,

వగరుగ వుంటుంది. దీని వేరును అరగదీసి విషపురుగుల కాట్లకు కండ్లలో కలికెముగా వేయవచ్చును. క్రిమిరోగాలలోను, విషజంతువుల కాట్లకు, కుందేటి చెర్రికి వేరురసాన్ని యిచ్చినతగ్గుతాయి.

## నల్లేరు

ఇది డొంకలమీద, చెట్లమీద ప్రాకుతుంది. నల్లేరును భస్మాలు చేయుటకు కాయలను మందులలోకి వుపయోగించుతారు. నల్లేరు రసము నురదగా వుంటుంది. వేడిచేస్తుంది. ఉంగిడికి, విషపురుగుల కాట్లకు, విరేచనాలకు వుపయోగపడుతుంది

## నల్లమందు

నల్లమందు చేదుగావుంటుంది మత్తును కలగజేస్తుంది. మూత్రాన్ని బంధించుతుంది శరీరనొప్పులను తగ్గించుతుంది జీర్ణ రోగాలకు, అజీర్తి విరేచనాలను కట్టించుతుంది. క్షీణించిపోయే పశువులకు ఆవుపాలలో తగినంత నల్లమందు కలిపి వరుసగా కొన్నిదినాలు యిచ్చిన పశువు బాగుపడుతుంది

## నల్లఉప్పి

ఈ చెట్టుచెక్క, వేరు, ఆకులరసము చేదుగావుంటుంది పశువుల దీర్ఘవాతరోగాలకు చెక్కరసము చక్కగా పనిచేస్తుంది

## నీరుల్లి

ఇవి ఎరుపుగ, తెలుపుగ వుంటాయి ప్రతియింటిలోను వుల్లిపాయలు లేకపోతే వంటచేసేవారు తృప్తిపడరు వుల్లిపాయల రసము కొంచెము కారముగా వెగటుగావుండి చలువచేస్తుంది నరాలకు సత్తువను కలిగించుతుంది. పసువుల శ్వాస రోగాలకు, వాతరోగాలకు వాడవచ్చును.

## నేరేడు

నేరేడుచెక్క రసము, నేరేడు పండ్లరసము వగరుగ కొంచెము తీపిగ వుంటుంది ముఖ్యముగ ఇవి విరేచనాలను కట్టించుతాయి. మూత్రి, మల కోశాలను శుభ్రిపరచుతుంది చెక్క కషాయముతో పుండ్లను గాయాలను కడిగిన త్వరలో గారపట్టుతాయి

## నేలవేము

ఇదిఒక చిన్న మొక్క సమూలమంతా చేదుగ వుంటుంది రక్త, జీర్ణ, వాత రోగాలలోవాడే మందులలోను బలవర్ధక ఔషధాలలోను నేలవేమును కలిపి వాడవచ్చును

## నువ్వులు

నువ్వులు లేకపోతే మనయింటిలోనికి కావలసిన స్వచ్ఛమైన నూనె దొరకదు నువ్వులు వేడిచేస్తాయి నువ్వులనూనెను, నువ్వులను పశువులకువాడతారు శీతాకాలములోనువ్వులు తాటిబెల్లంకలిపిత్రొక్కి పశువులకు పెట్టిన వాతాన్ని శరీరములో వుండే చెడునీటిని హరింపచేసి బలముకలిగిస్తుంది మావివేయని పశువులకునువ్వులనుతొక్కి గోరువెచ్చనినీటిలో కలిపి పెట్టిన మావిపడుతుంది

## నీరుగొబ్బి

దీనినే గొబ్బిఅంటారు ఆకు చేదుగతీపిగావుంటుంది జీర్ణరోగాలకు, ఉదరరోగాలకు, వాతరోగాలకు, వేసురసము మూత్రిరోగాలకు పనిచేస్తుంది.

## నారదబ్బకాయ

ఈచెట్లు కొండప్రాంతాలలో ఎక్కువగా పెరుగుతాయి. ఇది కొంచెము వగరు, చేదు, పులుపుగా వుంటుంది. కాయరసము రక్త, జీర్ణ, వాత రోగాలకు కాయరసం మంచిపనిచేస్తుంది.

# నేలపములక

ఇదికూడ తెల్లములకవలె పనిచేస్తుంది. ఇంకను ఈఆకుపసరు చర్మ రోగాలకు, విషాలను విరచుటలోను ఆకలిని పుట్టించుటలోను, జ్వరాలను తగ్గించుటలోను మంచిప్రయోగకారి.

# నేల ఉసిరిక

ఇది చిన్న మొక్క జాతిలోనిది ఆకుసహాయంతో భస్మాలు చేస్తారు. దీనిఆకులు కాయలువగరుగా రుచిగావుంటాయి. చలువ చేయును. మూత్రి, చర్మరోగాలను పోగొట్టును

# పంచ లవణములు

సైంధవ, సౌవర్చ, బిడా, కాస, సముద్రి లవణాలను పంచలవణాలు అంటారు. ఇవి శరీరాన్ని పోషించడానికి అత్యంతవసరము. ప్రతి వ్యాధికివాడే మందులలోను, బలవర్ధక ఔషధాలలోను కలిపి వాడవచ్చును.

# పసుపు

పసుపు లేనిదే దేవతారాధనలు జరుగవు. వంటింటి పనులు కొన్ని సాగవు. పసుపు వేడిచేస్తుంది జీర్ణ, రక్త, వాత, చర్మరోగాలలో పసుపును వాడవచ్చును. ఇదిఉద్రేకకారి, బలకారియగు మూలిక.

# పటిక

ఇది వగరుగ పులుపుగ కొంచెము కారముగా వుంటుంది. నోటిని శుభ్రిపరచుటకు, పండ్లను కడుగుటకు, నేత్రరోగాలకు, రక్త స్రావమును అణచుటకు పటిక చక్కగా ఉపయోగ పడుతుంది.

## పుగాకు

పుగాకులో " నికోటిన్ " అనే విషపదార్థమువుంది. పుగాకు తోటల లోనికి విషజంతువులు పోజాలవు. పుగాకురసముగాని ఎండిన చూర్ణముగాని పురుగులు పడిన పుండ్లను మాన్పుటకు, చర్మ రోగాలకు, నేత్రిరోగాలకు వుపయోగించ వచ్చును.

## పిప్పళ్లు

పిప్పలితీగె చల్లనిప్రదేశాలలో పెరుగుతుంది పిప్పళ్ళు చమురు గలిగి యుంటాయి. రసము వేడిచేస్తుంది. రక్త, జీర్ణ, వాత శ్వాస రోగాలన్నిటిలోను వీటని వాడవచ్చును.

## పెన్నేరు

ఇదియొక చిన్న చెట్టు. దీని దుంపనే వైద్యానికి వాడుతారు దుంప విలువచేస్తుంది. అజీర్తి దగ్గు వాతము, విరేచనాలను తగ్గించు తుంది.

## ప్రత్తి

ప్రత్తి చెట్టు లేకపోతే మనవస్త్రాలు తయారవ్వవు ప్రత్తిగింజలను పశువుల దాణాలలో కలిపి పెడతారు. ప్రత్తిఆకు పసరు విరేచనాలు కట్టించుతుంది.

## పులి చింతాకు

వీటిలోకూడ కుక్క పులిచింత, ఎర్రిపులిచింత, తెల్లపులిచింత అనే రకాలుగలవు. ఆకులు పుల్లగావుంటాయి, వేడిచేస్తుంది. ఆకు రసము వాతరోగాలకు, శ్వాసరోగాలకు, చర్మరోగాలకు నేత్రిరోగాలకు వాడవచ్చును.

## పున్నాగ

ఇది పెద్దవృక్షము. గింజలు సువాసనగా వుంటాయి. ఆకుల రసము చలువచేస్తుంది చర్మరోగాలకు, నొప్పులకు, కంతులకు గింజలు బాగుగా పనిచేస్తాయి.

## పేంకటు

ఇదితీగె జాతిలోనిది. పువ్వులు తెలుపుగా పండ్లుసువాసనగా వుంటాయి, ఎండినకాయలను బజారులో అమ్ముతారు. ఆకు రసము చలువచేస్తుంది. తాపమును హరింపజేస్తుంది. విరోచనాలను కట్టించు తుంది.

## పొగడ

ఈచెట్టుమాను గట్టిగా వుంటుంది. వీటిపుష్పాలు సువాసనగా వుంటాయి. సపోటచెట్టువలె వుంటుంది. చెక్కరసం దంతరోగాలకు, అతిసారమునకు పనిచేస్తుంది.

## పొటపత్రి ఆకు

దీనిఆకురసము విరేచనమును కలిగించుతుంది. విషాన్ని హరింప జేస్తుంది. జ్వరాన్ని, నేత్రరోగాలను పోగొట్టుతుంది.

## పాషాణభేది

దీనినేపిండికొండచెట్టు అంటారు ఈచెట్టులో రాళ్ళనుపిండిచేసే శక్తివుందట చలువచేస్తుంది. మూత్రకోశములోని రాళ్ళను కరిగించు తుంది. దీనిఆకురసమును రాతికల్వాలు చేయుటకు వుపయోగిస్తారు. వగరు, దగ్గు, జ్వరము తగ్గించుతుంది

## బ్రహ్మ దండి

ఇది పసుపుపచ్చని పూవులుపూస్తుంది. ఇది మెట్ట చేలలోను, గట్లమీదను పెరుగుతుంది. దీని సమూలరసాన్ని తీసి చర్మరోగాలకు, విషపురుగుల కాట్లకు, మాదలకు వుపయోగించ వచ్చును.

## బాడిత

ఇది పెద్దచెట్టు. చెక్కరసము ఆకురసము వెగటుగా వుంటుంది. వాత, కర్ణ, చర్మరోగాలకు వుపయోగపడుతుంది. ఆకురసము పుండ్ల లోని పురుగులను చంపుతుంది.

## బొక్కెన

దీనినే సీటిపప్పలి అంటారు మెట్ట మాగాని ప్రాంతాలలో ఈతీగె పెరుగుతుంది ఆకుపసరు గాయములను మాన్పుతుంది.

## బంతి

మామూలుగా మనపొలాలలోను, ఇండ్లలోనుదొడ్లలోను పెరిగే పసుపుపచ్చపువ్వులు బంతి మొక్కల విషయమైఎల్లరకు తెలిసియుంది. బంతిఆకుపసరు చర్మరోగాలకు పొడలకుపట్టించుచతగ్గుతాయి బంతిఆకు అరఖు రక్త స్రావమును ఆపుతుంది బంతి ఆకు పసు చంటివాపులకు రాసిన తగ్గుతాయి.

## బలురక్కెస

బంగారురంగు గల పూవులుపూస్తుంది. కాయలకు ముండ్లు వుంటాయి. దీని సర్వాంగములకు పసుపుపచ్చని పాలువుంటాయి. బ్రహ్మదండికి వుండవు. దీనిసమూలమంతా చేదుగావుంటుంది విరేచనముగావించుతుంది. లోహాలనుభస్మంచేస్తుంది. జీర్ణరోగాలకు మూత్రరోగాలకు ఆకుపసరు పనిచేస్తుంది. లోపలకుయిచ్చిన ఎలిక పాములు క్రిములుచస్తాయి.

## బోడతరము

దీనిలో తెలుపు, ఎరుపు పచ్చపువ్వులు పూయుమొక్కజాతుల లోనివి. చెట్టంతా జిడ్డుగావుండి మదపువాసనకలిగి యుంటుంది. చవుడు, పల్లము, పాటిగరువు భూములలో పెరుగుతాయి. ఆకురసం చర్మరోగాలకు, చంటివాపులకు పనిచేస్తుంది. బోడతరము సమూలముతో వాముకాటరువలె యంత్రముద్వారా తీసిన అర్కమువిషాలకు, చెట్టికి, శరీరములో వుండే మలినపదార్థాలను తీసివేయుటకు వాడవచ్చును.

## బావంచాలు

ఇవి పల్లపు ప్రాంతాలలోను, రేగడి భూములలోను మూడు అంగుల వరకు పెరిగే మొక్కలు, గింజలు సువాసనగా వుంటాయి. వీటినే బావంచాలంటారు. దీనిఆకును కూరవండుకుంటారు బావంచాలు చర్మవ్యాధులకు, తెల్లపొడలకు, మచ్చలకు పని చేస్తాయి.

## భూతులసి

బీళ్ళలోను, గరుపు భూములందు ఈ మొక్కలు పెరుగుతాయి. ఇదికూడ ఘాటయిన వాసన కలిగి యుంటుంది. ఈ వాసనకు భూత, పిశాచ, గ్రహబాధలు ఎగిరిపోతాయి. దీని ఆకుపసరు పశువు చర్మరోగాలకు, కుక్కల గజ్జికి పనిచేస్తుంది.

## భూర్జపత్రి

దీనినే భుజపత్రి అంటారు. ఈ చెట్లు హిమాలయ ప్రాంతములందు పెరుగుతాయి. ఎన్నో గ్రంథాలు ఈ చెట్టు మానునుండి వచ్చే పొరలమీద పూర్వులు వ్రాసుకొనేవారు ఆకులుకూడ అరటి

యాకులవలె పెద్దవిగా వుంటాయి. ముఖ్యముగా పశువులకు గ్రహ బాధలు, దృష్టిదోషాలు, శనిగ్రహాలు, దుష్టగ్రహాలు, అంటురోగాలు సోకకుండా ఈ భూర్జర పత్రిమీద యంత్రాలు, సంఖ్యలు వేసేరక్ష రేకులుగా తయారు చేసి, పశువులకు, పశుశాలల గోడలకు తగిలించు తారు.

## బరివెంక

దీనినే బరెంక అంటారు దీని ఆకులు తింటే మేకల పాలు తగ్గుతాయి. దీని చెక్కరసము వాతాన్ని, కఫాన్ని, అతిసారాన్ని తగ్గించుతుంది.

## మిరప

ఎండుమిర్చి లేని గృహ ముండదు. ఎండుమిర్చిని నీటిలో వేసి కాచి వడపోసి పశువుల వాతజీర్ణరోగాలకు వాడవచ్చును మిర్చి పొడినిమాత్రం నీటిలో వేసి కాచకుండ పోసిన పశువులకుఒక్కొక్క ప్పుడుప్రమాదం కల్గించుతుంది

## మెంతులు

ఇవికూడ ప్రతి గృహములోను వాడుతారు. మెంతులు వేడి జేసి ఆర్చుతాయి. జీర్ణ, వాతరోగాలలోను, పాడి పశువుల దాణాల లోను వేయించిన మెంతిపొడిని వాడుతారు. పాలుకూడ రుచిగా వుంటాయి దాణాలు త్వరగా జీర్ణమవుతాయి. పాలుకూడ రుచిగా వుంటాయి.

## మిరియాలు

ఇవి వేడిచేస్తాయి జీర్ణ, రక్త, వాత, నేత్రి రోగాలలో వాడే మందులలో కలిపి వాడిన చక్కగా పనిచేస్తాయి.

## మోదుగ

ఈచెట్టుఆకులతో విస్తళ్ళు కుట్టుతారు. మోదుగ పువ్వును, మోదుగ చెక్కను, మోదుగ గింజలను వాత, జీర్ణ, రక్త, రోగాలలో వాడుతారు.

## ముష్టి

దీనినే విషముష్టి, ముషిణి అంటారు. ఈగింజలనుంచి నూనెను తయారు చేస్తారు. ముష్టిగింజలను శుద్ధిపరచి నాడీకా సంబంధ మగు రోగాలకువ్వాడినమురుకుదనము, బలముకల్గించును ఇంకనుపక్షవాతము, పార్శ్వపు వాతాలకు పోడి పనిచేస్తుంది.

## మునగ

ఈచెట్టుచెక్కరసము, ఆకురసము, పువ్వురసము వేడిచేస్తుంది. మునగ చెట్టులో పెన్సిలిన్‌ను తయారుచేసేఓషధి యుంది. దొమ్మలకు, వాతాలకు, బెణుకులకు చెక్క, ఆకురసం పనిచేస్తుంది. పువ్వులరసం నేత్రరోగాలకు వుపయోగ పడుతుంది.

## మూర్కొండ

వీటిలో కుప్పింట, మూర్కొండ అని రెండు రకాలువున్నాయి. కుప్పింట ఆకులు గుండ్రముగాను, మూర్కొండాకులు కోలగాను వుంటాయి. ఈరెండు ఒకేపని చేస్తాయి అపస్మారం, తుమ్ములు వచ్చుటకు,కలికెము వేయుటకుఆకుపసరువాడవచ్చును పసరుమంటగా వుంటుంది. వేడిచేస్తుంది.

## మయూరశిఖి

దేవాలయములలోను, తదితర ప్రాంతాలలో రాతికి రాతికి మధ్యగా వుండే పగుళ్ళలో పాచిపట్ట మొలచేది. ఇదిమొక్కగా మొలుస్తుంది. అడుగున చిన్నదుంప వుంటుంది. దీని సమూలమంతా విషాలకు, గర్భరోగాలకు పనిచేస్తుంది.

## మంచితోటకూర

వీనిలో తెలుపు, ఎఱుపురకాలున్నాయి సమూలంగ మూలవ్యాధి రోగాలకు ఈయవచ్చును. పాడిపశువులకు పెట్టినపాలు వృద్ధియగుతాయి. ఎర్రతోటకూరలో బంగారం భస్మమగుతుంది.

## ముల్లంగి

పెద్దదుంపగా వూగలేంది కారముగా రుచిగా వుంటుంది త్రిదోషహరమైంది. విరేచనము గావించుతుంది. మూత్రరోగముల్ను పోగొట్టుతుంది.

## మాచికాయు

ఈచెట్లు అడవులలో పెరుగుతాయి కాయలు గుండ్రముగా వుంటాయి. కాయలే వుపయోగము కాయ చూర్ణము వేడి చేస్తుంది విరేచనాలను కట్టించుతుంది.నోటిపూతను పోగొట్టుతుంది దీనిగంధము చర్మరోగాలకు పనిచేస్తుంది.

## మోడి

పిప్పలి మోడి, మోడియంటారు. ఎండినకట్టె ఘాటుగా, కారముగా వుంటుంది. జీర్ణకారి.జ్వర. వాతరోగాలకు పనిచేస్తుంది వేడి చేస్తుంది

## మామిడి

ఈచెట్టు విషయమైఎల్లరకు తెలిసినవిషయమే మామిడిచెక్క రసం మామిడిచిగుళ్ళ రసం విరేచనాలను కట్టించుతాయి మామిడి వేరు రసం కఫవాతముల హరించును.

## మంజిష్ట

ఇదియొక చిన్నతీగె దీనివేళ్ళే ప్రధానమైనది. ఎరుపురంగుగా వుంటుంది వేడిచేస్తుంది. శ్లేష్మాన్ని హరింపజేస్తుంది జ్వరాన్ని తగ్గించుతుంది. చర్మ, రోగాలను, పోగొట్టుతుంది.

## మద్ది

ఇది పెద్దవృక్షము. దీనిలో తెలుపునలుపు రెండురకాలు. తెల్ల మద్ది ఔషధాలలో వాడుతారు మాత్రినుకుగంటు వేసిన పాలుకారుతాయి. చెక్కకషాయము మూత్రరోగాలకు, శ్వాసరోగాలకు పనిచేయును.

## ములుగోరింట

దీనిలో నాలుగురకాలు వున్నాయి. మొత్తంమీద ఇవన్నీ కొంచెమించుగా సమానంగానే పనిచేస్తాయి. ఆకుపసరు చర్మరోగాలకు, వ్రణరోగాలకు పనిచేస్తుంది

## మెంతులు

మెంతులు వేయించినపొడి పాడిపశువులకు, తదితర పశువులకు దాణాలలోను కుడితిలో కలిపిన జీర్ణము గావించును. పాలకు రుచి వచ్చును. మెదటిరోగములకు మంచిది. బలవర్ధక ఔషధాలలోకలిపి మెంతులను వాడవచ్చును. కఫాన్ని వాతాన్ని పోగొట్టుతుంది

## ములువెంపదుగ

దీనివేరు వగరుగావుంటుంది. క్రిమిరోగాలకు, విషసారమునకు, కర్ణరోగాలకు ఉపయోగపడుతుంది.

## మహాదీఫలం

ఇదిమధ్యరకపుచెట్టు. ఈచెట్టుకాయలుదోసపండ్లంతవుంటాయి. ఈపండ్లరసము జరరరోగాలకు, శ్వాసగోగాలకు, కఫ, వాతరోగాలకు పనిచేస్తుంది. కాయతొక్క చేదుగావుంటుంది. కఫాన్ని, వాతాన్ని పోగొట్టుతుంది పండ్లరసము మూత్రాన్ని గావించుతుంది.

## రావి

ఈచెట్టు విషయమై ఎల్లరకు తెలిసినవిషయమే. చెక్క రసం వగరుగవుండి చలువచేస్తుంది. చెక్కరసము కషాయముగా కాచి నోటిపుండ్లకు, నోటి దుర్గంధానికి, నోటినుంచి వడుకక్కే పశువులకు చక్కగా పనిచేస్తుంది

## రేవల్చిన్ని

ఇది యొక వేరుముక్క. పశుపచ్చగా వుంటుంది వేరుగంధము చలువచేస్తుంది. పంటినొప్పిని లాగుతుంది విరేచనము గావించుతుంది. మూత్రరోగాలను పోగొట్టుతుంది.

## రేగు

మామూలుగా పొలాలలోను, అరణ్యాలలోను పెరిగే రేగు చెట్లఆకులను ఎండించగా వచ్చిన చూర్ణమును పాడిపశువుల పాల వృద్ధికి, దుక్కిటెద్దుల జీర్ణశక్తికి నీటతోగాని కలినీటితోగాని రుబ్బి ప్రతిరోజు కుడితిలోగాని దాణాలోగాని కలిపి పెట్టవచ్చును.

## రేల

ఇదికూడ యొక పెద్దచెట్టు. పువ్వులు ఆకులు బంగారురంగుగా వుంటాయి. రేల విరేచనము గావించుతుంది చేదుగ వుంటుంది. ఆకుపసరు చర్మరోగాలకు పనిచేస్తుంది రేలవేరు, రేలగుజ్జు విరేచన కారి.

## లొద్దుగ

దీనినే లోధ్రి అంటారు వృక్షజాతిలోనిది. హిమాలయ ప్రాంతాలలో ఎక్కువగ ఈ చెట్లు పెరుగుతాయి. దీని చెక్క కషాయము వగరుగ వుంటుంది. చలువ చేస్తుంది. చెక్కకషాయము పశువుల యోనిరోగములకు పనిచేస్తుంది ఆకుల రసము విరేచనాలకు దగ్గులకు, దాహమును అణచుటకు పనిచేస్తుంది.

## వాము

వంటింటి వైద్యానికి వాము లేకపోతే పనిసాగదు మామూలుగా మెట్టప్రాంతాలలో ఈవాముమొక్కలు పెరుగుతాయి. వాము జీర్ణకారి. కడుపులోని వాయువును హరింపచేస్తుంది. పశువులపాలిట అమృతమువంటిది పశువులకు వచ్చే రోగాలన్నిటిలోను తదితర మందులలో కలిపి ఈయవచ్చును.

## వాయింట

ఇదియొకచిన్న మొక్క. చెట్టుఅంతా వెగటువాసనగావుంటుంది. వీటిలో కుక్కవాయింట, వాయింట అని రెండురకాలు. మొత్తంమీద ఈరెంటిగుణము యించుమించుగా యొకటే వాయింటాకుపసరుచర్మ రోగాలకు, చెవిరోగాలకు వుపయోగపడుతుంది.

## వావిలి

వీటిలోకూడ తెల్లవావిలి. నల్లవావిలి అనిరెండు జాతులు వున్నాయి. దీని పసరు వాతరోగాలలో వాయుపట్లకు, తదితరబెణుకులకు బాగాపనిచేస్తుంది.

## వేప

ఈచెట్టుమహాత్మ్యం, ఉపయోగము అందరికి తెలుసును. దీని సమూలమంతా వైద్యానికి వుపయోగ పడుతుంది ఆకులు అంటు రోగాలను చెడువాయువులను పోగొట్టుతాయి ఆకుపసరులో తగినంత మంచినూనె కలిపి పశువులకు పట్టేగోమారులకు, మిన్నల్లులకు, పట్టించిన తగ్గిపోతాయి. చెక్కరసము, పొడి పుండ్లకు ఉపయోగపడుతుంది.

## వెల్లుల్లి

వీటినే చిన్న తెల్లగడ్డలంటారు. ఇదిఘాటుగావుంటుంది. రసము వేడిచేస్తుంది పేగులలోని క్రిములను నశింపచేస్తుంది. లోపలివాయు

వును పోగొట్టుతుంది. నరాలకు సత్తువ, చురుకుదనము కలిగించుతుంది. వాత, రక్త, జీర్ణ, చర్మ, నేత్రరోగములన్నిటిలో వాడేమందులతో దీనిని తగినంతగా కలిపియిచ్చిన చక్కగా పనిచేస్తుంది.

## వెదురు

వెదురుచెట్లు పెద్దవిగా పెరుగును. ఆకు పెలుసుగా, నారగా వుంటుంది. వెదురాకు చేదుగా, పులుపుగా, వగరుగా వుంటుంది. వేడి చేస్తుంది. శ్వాసరోగాలకు, జీర్ణరోగాలకు ఆకువుపయోగపడుతుంది.

## వెట్టిపుచ్చ

ఏటియొడ్డులందు ఉతీగెపెరుగుతుంది ఆకు కాయలు చేదుగా వుంటాయి. పశువులవాత, జీర్ణరోగాలకు కాయలరసము బాగా పనిచేస్తుంది

## వస

వసపొడి ఘాటుగా వుంటుంది. క్రిమిని చంపుతుంది. దీని గంధము చర్మరోగాలకు పనిచేస్తుంది.

## వాకుడు

నేలమీద పాకుతుంది చెట్టునకు ముండ్లువుంటాయి. వాకుడు కాయరసము శిరోరోగాలకు, నాసికారోగాలకు పురుగులు పడిన పుండ్లకు వాడవచ్చును.

## వత్సనాభి

దీనిఆకులు కోలగా వావిలి ఆకులవలె వుంటాయి. ఈ చెట్టు దగ్గరగా యేచెట్లు పెరగవు. దుంప నలుపుగా వుండి ఖర్జూరకాయవలె ఎండుగావుండి నొక్కులునొక్కులుగా వుంటాయి. ఇది విషవంతమైనది వాపులకు, కంతులకు, విషాలకు దీని గంధము పనిచేస్తుంది.

## విషబొద్ది

ఇది నాభిదుంపవలె వుంటుంది. కారముగ చేదుగవుంటుంది. వేడిచేస్తుంది చర్మరోగాలకు వ్రిణాలకు దీని గంధముపుపయోగ పడుతుంది.

## సీతాఫలం

ఇది సామాన్యమైనచెట్టు. ఆకుమాత్రిం వెగటుగా వుంటుంది. పురుగులు పడిన పుండ్లలో ఆకును రాతిసున్నముతో కలిపి తొక్కి పట్టించిన పురుగులు చచ్చి పుండ్లుమానుతాయి.

## సోపు

సోపుగింజలుజీలకర్ర కంటె రెట్టింపుపరిమాణముగావుంటాయి. బహుజీర్ణకారి. కడుపులోని చెడువాయువును లాగాలంటే సోపుగింజల గుండ్లనే వాడాలి. అన్నిరకాలజీర్ణ, వాత రోగాలకు ఇదిపనిచేస్తుంది.

## సొంటి

ఇదికూడ వంటింటి వైద్యపు మూలికయే కడుపునొప్పివచ్చింది దంటే సొంటిని వేడిచేసి తినమంటారు. సొంటి జీర్ణరోగాలకు, వాత రోగాలకు అమోఘముగా పనిచేస్తుంది సొంటరసం మంచిజీర్ణకారియే గాక మలమును జారీచేయించుతుంది కడుపులో నిగాలిని తీసివేస్తుంది. నరాలను సడలిస్తుంది. సొంటిరసము వేడిచేసి చల్లార్చుతుంది.

## సూరేకారము

ప్రతికొట్టులోను ఇది దొరుకుతుంది. ఇది యొక లవణము, చలువచేస్తుంది. మూత్రరోగాలకు పనిచేస్తుంది

## సోడాఉప్పు

ఇదికూడ లవణము జీర్ణకారి. జీర్ణ, రోగా లన్నిటిలోను ఇది చక్కగా పనిచేస్తుంది.

## సర్పాక్షి

దీనిఆకులు వెంపలిఆకువలెవుంటుంది దీనిసమూలమంతా వైద్యానికిమంచిది కారముగా చేదుగావుంటుంది. వేడిచేస్తుంది విషహారము, విషజంతువుల కాట్లకు, సర్వవిషాలకు ఆకుపసరు పనిచేస్తుంది.

# పదునోకండవ భాగము

## శారీరశాస్త్రము

ఆయుర్వేద పశువైద్య శాస్త్రములో శారీరాన్ని గురించిన విజ్ఞానముచాలా తక్కువగా నేవుంది పశుపాలకాప్య, సుశుతుడు, ధన్వంతరి మున్నగువారు శారీర శాస్త్రవిషయాలను గూర్చి, మర్మస్థానాలు, సిరలు, ధమనులను గూర్చి చక్కగా తెలిపియుండిరి దశరథుని పరిపాలనలో పశుపాలకాప్య అనేఋషి జంతువులకు సంబంధించిన శస్త్రచికిత్సలు, శారీరవిషయాలను గూర్చి చిత్రాలతో సహా కొన్ని గ్రంథాలు ప్రకటించారు.

పశుశరీరాన్ని వర్ణించి వివిధ భాగాలను సమగ్రముముగా తెలియజేసి ఆయాభాగాలలోవుండే ప్రయోజనాలను గూర్చి తెలియపరచుట శారీరశాస్త్రముయొక్క కర్తవ్యము.ఎనాటమి, ఫిజియాలజి, పెథాలజి, హిస్టాలజి, ఎంబ్రియాలజి అనివివిధభాగాలుగా విభజింపబడింది

ఎనాటమి:-అనగా శరీరము ఏరీతిగా నిర్మింపబడిందో తెలిపేశాస్త్రానికి ఎనాటమి అంటారు

ఫిజియాలజి:-అనగాశరీరములో వుండే యంత్రాలన్ని ఏరీతిగాపనిచేయుచున్నది తెలిపే శాస్త్రానికి ఫిజియాలజి అంటారు.

పెథాలజి:-అనగా రోగకారణాలవల్ల దేహ యంత్రములో కలిగే మార్పులను గుర్తించి, వర్ణించే శాస్త్రానికి పెథాలజిఅంటారు

హిస్టాలజి.-అనగా కంటికి కనపడని సూక్ష్మభాగాలను భూతఅద్దముతో పరీక్షించి వర్ణించే శాస్త్రాన్ని హిస్టాలజి అంటారు

ఎంబ్రియాలజి:-అనగా పిండోత్పత్తి శాస్త్రమంటారు

## శరీర నిర్మాణము

పశువు శరీరములో రెండు ముఖ్య విభాగాలువున్నాయి తల, మొండెము, కాళ్ళు మొండెములో మాత్రము ఒక పెద్ద సంచు వుంటుంది. మొండెములోనే ముఖ్యమైన గుండె, ఊపిరితిత్తులు,



శ్వాసనాళము, కంఠనాళము, కాలేయము, ఆహారకోశము, ప్లీహము, చిన్న పేగులు, పెద్దపేగులు, మూత్రపిండాలు మున్నగునవి సృష్టి చ బడియున్నాయి పశువు శరీరములోవుండే ప్రతి అవయవానికి ప్రత్యేక వుపయోగమువుంది నోరు, కుత్తుక, పండ్లు, ఆహారకోశము, పేగులు కలసి తిన్న మేతను జీర్ణాన్ని చేస్తున్నాయి వీటన్నిటిని కలిపి జీర్ణావయవములంటారు. ముక్కు, ఊపిరిగొట్టము, ఊపిరితిత్తులు, కలిపి మంచి

గాలిని పీల్చుకొంటూ, బొగ్గుపులుసు గాలిని బయటకు నెట్టుతూ వుంటాయి వీటన్నిటిని శ్వాససంబంధమైన అవయవములు అంటారు. గుండె, రక్తనాళాలు కలసి పశు శరీరమంతటిలోను రక్తాన్ని వ్యాపింప



జేస్తాయి అందుచేతనివి రక్త ప్రసరణావయవములు అంటారు మూత్ర పిండాలు, చర్మము, ఊపిరితిత్తులు, కాలేయము, పెద్దప్రేగులు కలసి శరీరములోని మలినపదార్థాలను బైటకు నెట్టివేస్తాయి వీటిని విసర్జక అవయవాలంటారు మెదడు, వెన్నుపాము, పెద్ద చిన్ననరాలు అన్ని కలసి లోపలవుండే అవయవాలన్నిటిచేత కావలసిన పనులు చేయించుతాయి ఎముకలన్నీ శరీరానికి చట్రముగా పనిచేస్తాయి కండరాలు శరీరముయొక్క అన్నిభాగాలను కదులునట్లు చేస్తాయి

పరా:- శరీరశాస్త్ర విషయమైన ఈగ్రంథములో క్లుప్తంగా ప్రకటించితిమి ప్రక్కఎముకలు వెన్నెముకలతో శరీరాన్ని నిలబెట్టుతున్నాయి ఈఎముకలన్నీ కార్టిలేజివంటి మెత్తని పదార్థముతో బిగించబడినాయి. ఎముకలన్నిటిపై భాగమందు దంతాలవలె తెలుపుగా వుండే పొరయొకటి కప్పబడి యుంటుంది ఈపొర గట్టిగా వుంటుంది దీనిలోపల స్పంజివంటి మెత్తని పదార్థమువుంటుంది దీనినే మూలుగ అంటారు. ఇది గుల్లఎముకలలో కడ్డీవలె యుంటుంది


హృదయము
మూత్రపిండములు


రక్త ప్రసరణము


"అస్థిపంజరము"

# వెన్నెముక

వెన్నెముకలోని భాగము మెదటి యొక్క తరువాతభాగమే, ఈనరాలతాడు మనవేలంత లావుగా వుంటుంది అదిమెదడు క్రింది భాగానికి అతుకబడి పుర్రెలోనికి పెద్దరంధ్రముగుండా పోతుంది వెన్నుపూస ఎముకలు ఒకదానికొ నొకటి కలసి పేర్చుటచేత మధ్యగా దండ్లవంట మెత్తటిఎముకపదార్థము అమర్చబడి యుండుటవల్ల వెన్నెముకను వంచుటకు వీలగుతూవుంది

# ప్రక్కఎముకలు

ఇవి వంకరటింకరగా వుంటాయి. హృదయానికి రెండువైపులా 26 ప్రక్కఎముకలు వుంటాయి ఇంకను యివి వీపుఎముకకు అతుకుకొనివుంటాయి

# వస్తికము

ఇవి తొంటిఎముకల పైప్రక్కలఅమర్చబడియుంటాయి పశువు శరీరములోవుండే ప్రాణాధారమగు అవయవాలు ఈవస్తికమునందు ఏర్పడివుంటాయి దండఎముక, మోకాలుఎముక, మణికట్టుమున్నగునవి దీనికిఅమర్చ బడతాయి.

# కండరాలు

పశువు పైచర్మము తీసివేస్తే ఎఱ్ఱని మాంసపు ముద్ద కన్పించుతుంది.ఇదీనినే కండరమంటారు. ప్రతికీలువద్ద మెత్తని పదార్థము వుంటుంది. ఇవి శరీరముయొక్క ప్రదేశాన్ని బట్టి ఎక్కువ తక్కువ లుగా వుంటాయి. ఈకండరాలు మాంసంతో తయారై కంటికి కన పడని దారాలుగా కట్టలుగా కట్టబడి వాటిపైన పలుచటి పొర

కప్పబడి యుంటుంది. ప్రతి కండరములోను ఒకనాడి కొన్ని రక్త నాళములు వుంటాయి ఈకండరాలు ఎముకలు వంగుటకు, నాగ దీయుటకు, నిలబడేటట్లు చేయుటకు బరువు మోయుటకు సహాయ పడతాయి.

## రక్తప్రసరణ

చర్మము కండరాలు నరాలు రక్తనాళాలతో కప్పబడియున్న వుడు దానికొక అందము వస్తుంది జీవించియున్న ప్రతిపశువుశరీరము లోను ప్రవహించే రక్తమే జీవరసం కాబట్టి పశువుశరీరములో జీవ కళవుండుటకు రక్తమే ప్రధానము. రక్తములో ఎఱ్ఱకణాలు, తెల్ల కణాలు వుండి ప్రవాహంలో దొర్లుతూ రక్తాన్ని శుభ్రముచేస్తాయి. ఇంకను ధమనులు, శిరలు, టిస్యూలు వుంటాయి.

## హృదయము

ఇది గోపురపుఆకారముగ వుండి దీనిచుట్టు ఒక పొర ఆవరించి తోలు సంచి వలె యుంటుంది ఇది గుండెను తదితర కోశములతో తగులనీయక రక్షింతుంది. గుండె మాత్రము రొమ్మెముక, శ్వాస కోశాల మధ్యగా క్రిందిభాగాన వుంటుంది. హృదయము బరువు 4 నుంచి 51/2 పౌనులు వుంటుంది.

## నాడి

మానవుని నాడి పరీక్షించి నటులనే పశువుల నాడిని కూడా తోక చుట్ట క్రిందనూ దౌడ వద్దనూ కనుగొన వచ్చును.

## నరాలు

పశువు మెదటినుంచి వెన్నుపామునుంచి చిన్న చిన్న నరాలు పుట్టి శరీరమంతా వ్యాపించుతాయి. ఇవిచాలాచిన్నవిగాన శరీరములో ఎచ్చటగుచ్చిన ఏదోయొక నరముతగిలినొప్పికలుగుతుంది. ఈనరాలు

చముురుతో నిండి యుంటాయి. వీటిలో జ్ఞాననాడులు, స్పర్శ నాడులు, జ్ఞాననాడులు, చలననాడులు, అనేవి వున్నాయి. ఇవి స్పర్శ, రస, శబ్ద, రూప, గంధరూపకముగా మెదటికి దీసికొని పోతాయి. వీటినే జ్ఞాననాడులు అంటారు.

## మెదడు

పెద్దమెదడు, చిన్న మెదడు అనేవి పశువుతలలో నుండే కపాలమందుంటాయి ఆలోచనకు, జ్ఞాపక శక్తికి యివి ముఖ్యమైనవి.

## మూత్రకోశము

ఈ కోశములో రక్తనాళాలు వుంటాయి వెన్నెముకకు రెండు వైపుల తొంటిఎముకలకు మధ్యగా ఒక్కొక్క పిండము వుంటుంది. వీటిని ఆనుకొని మూత్రనాళమను కోశము వుంటుంది. దీనినుండియే మూత్రముతయారగుతుంది

## ఊపిరితిత్తులు

ఇవి కమ్మరివాని కొలిమితిత్తులవలె వుంటాయి. ఈ తిత్తులలో రక్తనాళికలు, గాలిగొట్టాము, రబ్బరువంటి మాంసకరపదార్థాలు వుంటాయి. ఊపిరితిత్తులు ప్రాణవాయువును పీల్చుతాయి. చెడు గాలిని పీల్చుతాయి.

## ఆహారతిత్తులు

పశువు ఆహారకోశము నాలుగుభాగాలుగా వుంటుంది. దీనిలో అన్నిటికంటె పెద్దపొట్టవుంటుంది ఇదిపక్క ఎముకలకు మధ్యగా వుంటుంది. దీనిలోపలవుండే కండరాలు తేమగావుంటాయి. ఇందులో జీర్ణరసము తయారగుతుంది.

రెండవదానిని కాసులపొట్ట లేక దీనినే నెమరుతిత్తి **అంటారు.** పెద్దపొట్టలోని మేత దీనిలోనికివచ్చి వుండలు వుండలుగాతయారై ఈవుండలనుచక్కగా నోటలోనికి తెచ్చుకొని నెమరువేసి మరలరసాన్ని మిగ్రింగు తుంది. జీర్ణముకానిరాళ్ళు ముక్కలు ఇందులో చేరతాయి. మూడవపొట్టను అరల పొట్టఅంటారు నెమరు వేయబడిన ఆహారము ఇందులో చేరి జీర్ణమగుతుంది. ఇదికాగితపు పొరలుగావుంటుంది.

నాలుగవపొట్టలో జీర్ణమైనమేత జేరుతుంది. ఇచటనే జఠర రసము పుట్టుతుంది ఈపొట్టచివరనే పేగులు ఆరంభమగుతాయి. ఇంకను ఆహారనాళము, చిన్నపెద్ద పేగులు, కార్జము, పిత్తము, ప్లీహము, కీళ్ళు, చర్మముమున్నగు భాగాలు వున్నాయి. ఇవన్ని కూడ పశువును అనేక విధాలుగా సంరక్షించుతాయి.

# పంద్రెండవ భాగము

## పశురోగ విజ్ఞానము

## పశువైద్యులు

గ్రామాలలో ప్రాచీన **కాలమునుంచి** నోరు లేని పశు**వులకు** సాంప్రదాయంగా చేసేపశువైద్యులు అప్పుడుయిప్పుడు యున్నారు కాని ఒక్కొక్క వైద్యుని దగ్గర ఒక్కొక్కచిట్కా చికిత్సవుండేది. ఏతాటాకుమీదనైనా ఆ చికిత్స వ్రాసిగాని యుండక పోవడం వల్ల మన దేశములో మన ఆయుర్వేద వైద్యము అభివృద్ధి చెందలేదన వచ్చును.

మనదేశములో యిప్పటికీ తెలివిగల మంచి అనుభవముగల వైద్యులున్నారు. వీరిలోకూడ యిప్పటికీ కొందరు ఏఆకు పసరో ఏ మూలికో ఎవరికి తెలియ నీయకుండా తీసికొని వాడుట కొంతమంది తెలిసి తెలియని చికిత్సలు చేయుట జరుగుతూంది, మరి కొంతమంది రోగనిదానము గ్రహించక తమయిష్టము వచ్చిన మందులను ప్రయోగించు చున్నారు ఈకాలములో అన్నిరకాల వైద్యాలలోను నూటికిమందు లేకపోతే భత్యాలుగిట్టవని తెలిసి తెలియని ఇంజెక్షన్ని యిచ్చి నాటకమాడుతున్నారు. మరికొందరు యమకింకరులులాగా అయినదానికి కానిదానికి నోరులేని పశువులను పండకాల్చుటకూడా జరుగుతోవుంది మరికొందరు ఓనమాలు చదువుకొని ఎవరైనాశాస్త్రజ్ఞులు శాస్త్రోక్తంగా తయారుచేసిన ఏవాతారి అరఖుసీసానో తీసికొని దానిలో నీరుకలిపి సైసాలను దగాచేయుట, ఏడిస్టిల్డువాటరో, ఏపెన్సిలిన్నో తీసికొని రోగనిదానము తెలియనప్పటికి, ధనార్జన కొరకు యింజెక్షను యిచ్చి మోసాలుచేయుట,మరికొందరు క్యాటిల్ మసాల వాతహారి, జీవామృతంఅని ఏవామో, ఏపొంటిమో కలిపి డాబుగా పొట్లాలు కట్టిఅమ్మడం ప్రారంభించారు. కాబట్టిరైతులు ఇట్టివార్ని జాగ్రత్తగా పరీక్షించి సక్రమముగా లేనిచో తగిన చర్య తీసికోవలసి వుంటుంది నేను 30సంవత్సరాలనుండి కొన్ని వేల రూపాయలు ఖర్చు పెట్టి ఈవైద్య విషయాలను పరిశీలించి ఈ చింతామణి గ్రంధాన్ని యిప్పటికి ఎనిమిదివేల ప్రతులనేగాక యింకాఎన్నో పశుసంబంధమైన, జంతుసంబంధమైనగ్రంధాలువ్రాసినప్పటికి, ఎన్నో వేలపశువులకుఅనుభవంతో రోగనిదానంతో చికిత్సలుచేసినప్పటికిఒక్కొక్కప్పుడు నేనుకూడా పొరబడుతూఇంకాఅనుభవము కావాలనుకొంటూదీర్ఘంగాఆలోచనలో పడుతూవుంటాను. కాబట్టి శాస్త్రజ్ఞానముకలిగిన అనుభవచికిత్సలు చేయువాడే పశువైద్యాచార్య అనిపించుకుంటాడు. శాస్త్రము తెలియని వాడు పశువుల పాలిట యమదూతయంటారు.

గ్రామాలలో వుండే కొంతమంది వైద్యులు అతిగర్వంతో వుంటారు. వారియింటిచుట్టు తిరిగినప్పటికి ఒక్కొక్క సమయములో రారు. ఇట్టివారితో వైద్యముచేయుంచుట పొరబాటు. ఇట్టివారికిఏగురువైనాయుండి మంచినేర్పరియని యోగ్యతా పత్రియిస్తే గురువునకు పంగనామాలుపెట్టేవారున్నారని తెలుపుటకుపశ్చాత్తాపడుచున్నాను. కాబట్టి మీప్రాంతాలలో అనుభవము, శాస్త్రజ్ఞానముగల వైద్యులుంటారో వారితోనే చికిత్స చేయించాలిగాని అటొకగంతు ఇటొకగంతు వేసి వారినివీరిని రప్పించి చికిత్సను చెయించరాదు. ఎవరినైతే నమ్మి చికిత్స చేయించు మన్నారో చివరవరకు వారితోనే చేయించమని నాసలహా.

## వైద్యములో మార్పులు

ప్రతి పదిసంవత్సరాలకు శీతోష్ణస్థితులనుబట్టి మానవులకు పశువులకు సోకే రోగాలలోకూడ వ్యత్యాసాలు కలుగుతున్నాయి. నేను యింతవరకు పశువైద్య చింతామణి, పశువైద్య వస్తుగుణదీపిక, జంతు శాస్త్రము, ప్రాచీన పశుసంజీవి, ఆంగ్లేయ వస్తుగుణ దీపిక, పాడి పరిశ్రమ, పశురోగ విజ్ఞానము, భేషజ కల్పము, విషతంత్రము, శస్త్రచికిత్స, రాక్షసవైద్యము, శారీర శాస్త్రం, పశురోగవిజ్ఞానము, పశుచికిత్సాసారము, కోళ్ళపరిశ్రమ, జంతువిజ్ఞాన శాస్త్రము, హోమియోపశువైద్యము, స్వస్థవృత్తము నూరుపశువైద్యమూలికలు, ప్రాథమిక పశుచికిత్స, అంటువ్యాధులు, అశ్వవైద్యము, పశు వైద్య యోగావళి, పశువైద్య ఇంజెక్షన్సు మున్నగు గ్రంథాలు 31 వరకు ప్రకటించాను. పదిసంవత్సరాలనుంచి గోసేవయనే తెలుగు మాసపత్రికను ప్రకటించుతూ కొన్నివేల కాపీలు ప్రకటించి ఆంధ్రప్రదేశ్ అంతటా వ్యాపింపజేసాను పశువులకు పనికివచ్చే ఆంగ్ల ఆయుర్వేద మూలికలను ఔషధాలను స్వయంగా నాస్వంతఖర్చుతో తెప్పించి ముప్పది సంవత్సరాలనుంచి పరిశోధించాను ఇంతపని సాధించినప్పటికి చేయవలసినసేవ, పరిశోధనలు యింకా ఎన్నో

వున్నాయి. ఈవిషయాలన్నీ ఎందుకు చెప్పుతున్నానంటే కొందరు వైద్యులు నేనొక పశువైద్యుడనని డాంబికంతో ఈకాలములో నాటకమాడి నోరులేని పశువులేకదా అని తెలిసి తెలియని మందులు, ఇంజెక్షన్లు చేస్తున్నారు ఇట్టివారిని ప్రభుత్వం తగినచర్య తీసికో వలసి యుంటుంది

## వ్యాధినిదానము గుర్తించుట

వ్యాధియొక్క లక్షణములను గుర్తించుటకు మిక్కిలి అనుభవము మంచి బుద్ధికుశలత, కావాలి. వ్యాధియొక్క లక్షణములను సరిగా చెప్పగలుగుటకు వ్యాధియొక్క ఆగమనాన్ని చక్కగా తెలిసినవాడై ఆరోగ్యముయొక్క ప్రమాణములను యెరిగినవాడై తానుపయోగించు గుణాలను శక్తిని గ్రహించుటలో మిగుల అనుభవము గల వాడైయుండాలి

వ్యాధియొక్క లక్షణమును గూర్చి వైద్యుడు తనంతట తాను పశువుయొక్క యజమానికి చెప్పరాదు ఎవరైనా అడిగినయెడల స్పష్టముగా తెలుసుకున్న సంగతి మాత్రము చెప్పవచ్చును. అనుమానముగానున్న సందేహమాత్రము చెప్పుటలో బహు జాగ్రత్తగా వుండాలి వైద్యులు చెప్పుసంగతులు సాధ్యమైనంతవరకు ఆశనుకలుగ జేయునట్లుగా వుండాలి. స్పష్టముగా పశువునకు మరణము సంభవించే స్థితిలో వైద్యుడు తానెరిగిన సంగతిఅంతా స్పష్టముగాయజమానికి చెప్పాలి.

## ధర్మామీటరుతో పరీక్షించుట

రక్తప్రవాహాన్నిగురించి కొంతపరీక్షించిన తరువాత జ్వరానికి తగిన చికిత్సచేయాలి అదేసమయములో రోగనిర్ణయముచేయడానికి తరువాత లక్షణములను కనుగొనడానికి ధర్మామీటరు ఉపయోగించాలి. పశువు రోగచిహ్నములు స్పష్టముగా తెలిసినప్పటినుండి

గానికేవిధమగు పనిచేయకుండా విశ్రాంతి ఈయాలి. శస్త్ర చికిత్సా సంబంధమగు రోగాలలో జ్వరము వచ్చినచో అదిహానికి ముఖ్య చిహ్నము. నరముల సముదాయము ఎక్కువగా పనిచేసినప్పుడువుండ వలసిన పరిమాణముకన్న ఉష్ణము తక్కువయుండిన అది అపాయ చిహ్నము పశువులయొక్క శీతోష్ణపరిమాణము కనుగొనవలెనంటె ధర్మామీటరును దానిమలాశయములో పెట్టిఆధర్మామీటరుయొక్క మంచిచెడ్డలను అరనిమిషమునుండి మూడునిమిషాలవరకు వుంచితే జ్వరంఎంతయుందీ తెలుస్తుంది. ధర్మామీటరుయొక్క పాదరసముండే చోట (గుబ్బ) పశువుపోగులకు సంబంధించిన పొరలనంటుకొనేవరకు జాగ్రత్తగా వెళ్ళునటుల తోయాలి, అంతవరకు పోనీయని యెడల శీతోష్ణపరిమాణము తెలియదు.



ఉదయం 6 గం॥ నుంచి ౮ గం॥ వరకు సాయంకాలము 5 గం॥ నుంచి 71/2 వరకు

ఆధర్మామీటరుపైన కచ్చితమైన కొలతలు వీలగునట్లు అంకెల వరుస 98నుంచి 110వరకు విస్తరించి పదిభాగాలుగా విభజింప బడి యుంటుంది. ప్రతి రైతుదగ్గర ధర్మామీటరుండుటవసరము రోగపశువు

యొక్క శరీరోష్ణమును థర్మామీటరుతో దినమునకు రెండుమూడు పర్యాయములు కొలుచుట మంచిది. అవుసరాన్నిబట్టి మధ్యకాలములోకూడ కొలవవచ్చును. చెవిదగ్గర గాని. ఎదరరాలలోగాని, ఆసనములోగాని, కాలికి గంగడోలునకుమధ్యగాని, జ్వరమ యొక్కపాదరసభాగమును 4 లేక 5నిమిషములుంచి కొలవాలి. ఆసనములో కంటె తదితరభాగములందు పెట్టి చూడబడిన యుష్ణము ఒకడిగ్రీతక్కువగా యుంటుంది. కనుక తదితరభాగాలలో పెట్టిచూచినపుడొక డిగ్రీ అదనముగా కలుపుకొని లెక్కచూచుకోవాలి. జ్వరము కొలుచునపుడు రెండుమూడు నిమిషాలుప్రుంచి చూడాలి.

ఆరోగ్యస్థితిలో పశువు శరీరవేడిమి 102 డిగ్రీలు వుంటుంది. అంతకంటె అధికంగావున్నా, తక్కువగావున్నా అనారోగ్యమని తెలిసికోవాలి. పశువునకు సామాన్య జ్వరమున్నచో సామాన్య ఉష్ణము 100 డిగ్రీలకుపైగా పాదరసముప్రవహింమతూ వుంటుంది. సామాన్య గుర్తుకు అనగా 101 డిగ్రీలకు తక్కువగా పాదరసము దిగినయెడల పశువు నిస్త్రాణస్థితిలోనూ, చాతములోనూవుందని తెలిసికోవాలి.

107, 108 పైనయున్నచో దారుణమైన వేడియని గ్రహించాలి. 104 నుంచి 105 వరకు దీర్ఘకాలము నిలబడియున్నచో ప్రమాదము రానైయున్నదనీ 102 నుంచి 104 వరకున్న సామాన్య జ్వరమనీ భావించాలి. 95 డిగ్రీల వరకున్న అధిక అపాయమనీ అంత్యదశయనీ తెలిసికోవాలి పశువుయొక్క ఉష్ణము కొలిచినంతరువాత థర్మామీటరు క్రిందివైపునకు జాడించి దానిలోని పాదరసాన్ని సామాన్యపు గుర్తు కంటె క్రిందికిదింపి వేడినీటితోగాని, తదితర ద్రావకములలోగాని కడుగాలి.

## నాడి, శ్వాస, ఉష్ణము, తెలుపు పట్టిక

| జంతువు | నాడి నిమిషమునకు | శ్వాస | టెంపరేచరు |
|---|---|---|---|
| గుఱ్ఱము | 35 45 | 10–12 | 100–102 |
| ఎద్దు | 50–60 | 12–16 | 101–101 1/2 |
| దున్న | 45–50 | 20–25 | 100–101 |
| గొఱ్ఱె | 70–80 | 30–40 | 102–104 |
| మేక | 60–70 | 25–30 | 101–103 |
| కుక్క | 70–95 | 15–25 | 101–105 |
| దూడ | 65 వరకు | 12–16 | 102–104 |
| కోడి | 65 వరకు | 8–12 | 102–103 |

ఎక్కువ వెలపెట్టి గుడ్డను; తక్కువ వెలపెట్టి గొడ్డును కొనరాదు.

## మోతాదులు

ఈగ్రంథములో పశువైద్య మూలికలు తెలిపియున్నాను మోతాదులు మాత్రము ఖచ్చితంగా తెలుప లేదు. మానవులకంటె




పశువులకు యిచ్చేవి సుమారు నాలుగురెట్లు వుంటాయి. రైతులుగాని, వైద్యులుగాని మందులు తూచకుండగనే సుమారుగా పెడతారు.

ఇదిచాలాహారకాలు మోతాదు ఎక్కువపడితే అపకారముచేస్తుంది తక్కువపడితే పనిచేయదుగాన తూచిపెట్టట మంచిది. పెద్దపశువుల కంటె చిన్నపశువులవిషయమై మోతాదులుఇచ్చుటలో జాగ్రత్తగా వుండాలి విషపుమందులను అతిజాగ్రత్తగా ఈయాలి.

ద్రవపదార్థాలు గాక ఘన పదార్థాలువాడేటప్పుడు మాత్రల రూపముగా గాని వుండల రూపముగా గాని వాడుటమంచిది వుండలు పెట్టిన తరువాత గొంతు లో పడికి గోరువెచ్చని నీటినిగాని, అనుపానము గాని త్రాగించితే గొంతుకకు వుండ అడ్డు తగల కుండ జారి పోతుంది

## కొలతగ్లాసులు - తూనికత్రాసు

ఔషధాలు తూచుటలో బహు ఖచ్చితంగా వుండాలి తూనికకై ప్రత్యేకంగా త్రాసులు వుంటాయి త్రాసుతో తూచిన తర్వాత ఎప్పటి కప్పుడే పరిశుభ్రముగా వుంచాలి. ఔషధాలు




కాచుటలోకూడా చాలా జాగ్రత్తగా వుండాలి ఈ కొలతలు గుర్తు పెట్టడానికి గాజుగ్లాసులు అమ్మబడతాయి. ఆగ్లాసులకు రెండు వైపులా ఔన్సు, అర ఔన్సు, పావు అరపావు ఔన్సుగ్లాసుల కొలతలు వేసి వుంటాయి. గాన వాటినే వాడుట మంచిది.

కొలత గ్లాసును ఎడమ చేతియొక్క బొటన వ్రేలునకున్ను, పిమ్మట రెండు వ్రేళ్ళమధ్యగా పట్టుకొని కంటితో సమానమైన ఎత్తువరకు తీసికొని రావాలి. ఏసీసానుంచి మందుపోయాలో ఆసీసాను కుడిచేతితో పట్టుకొని దానియొక్క మూతను ఎడమచేతిచిన్న వ్రేలుతో పట్టుకొని యుండాలి ఈరీతిగా మూతను పట్టుకొనడానికి కొంతవరకు అలవాటు కావాలి. లేనిచో సీసాలు పగిలి పోవచ్చును.

| తూనికలు | | కొలతలు |
|---|---|---|
| 30 చిన్నాలఎత్తు | — | 1 తులము |
| 3 తులాలు | — | 1 ఫలము |
| 8 ఫలాలు | — | 1 శేరు |
| 12 తులాలు | — | 1 అర్ధ శేరు |
| 5 శేర్లు | — | 1 వీసె |

2

| | | |
|---|---|---|
| 5 తులాలఎత్తు | — | 1 గిద్ద |
| 2 గిద్దలు | — | 1 అరసోల |
| 2 అరసోలలు | — | 1 సోల |
| 2 సోలలు | — | 1 తవ్వ |
| 2 తవ్వలు | — | 1 మానిక |
| 2 మానికలు | — | 1 అడ్డ |
| 2 అడ్డలు | — | 1 కుంచము |

3

| | | |
|---|---|---|
| 60 చుక్కలు | — | 1 డ్రాము |
| 8 డ్రాములు | — | 1 ఔన్సు |
| 20 ఔన్సులు | — | 1 పైంటు |
| 24 ఔన్సులు | — | 1 క్వార్టు |
| 8 పైంటులు | — | 1 గాలను |

4

| | | | |
|---|---|---|---|
| 4 | వడ్లగింజలఎత్తు | — | 1 గ్రెయిను |
| 20 | గ్రెయినులు | — | 1 స్క్రూపిలు |
| 3 | స్క్రూపల్సు | — | 1 డ్రాము |
| 8 | డ్రాములు | — | 1 ఔన్సు |

5

| | | | |
|---|---|---|---|
| 16 | ఔన్సులు | — | 1 పౌను |
| 2 1/2 | ఔన్సులు | — | 1 తులము |
| 180 | గ్రెయినులు | — | 1 తులము |
| 5 | తులాలు | — | 1 చటాకు |
| 16 | చటాకులు | — | 1 సేరు |

# పదమూడవ భాగము

## భేషజ కల్పము

### పశువులకు ఔషధాలు త్రాగించుట

పశువుతలను ఎత్తిపట్టుకొని నోరు తెరచి ఒక్కొక్క గొట్టము వంతున నెమ్మదిగా ఔషధాన్ని త్రాగించాలి లేనిచో పొలమారి పశువు వుక్కిరిబిక్కిరి అగుతుంది.

పశువునకు మందుపోయునపుడు త్రాడుగట్టిగా బిగించరాదు మందును. నెమ్మదిగా పోస్తూ ఒక వేళదగ్గువస్తున్నట్లు కన్పడిన వెంటనే మందుపోయుట ఆపాలి.

కొన్ని పశువులు జడిసిగాని, పొగరు బోతుతనము వలనగాని మందు త్రాగక గల్లంతుచేస్తూ త్రిప్పుకట్టి బిగించి వప్పటికి నేలమీద



పడిపోతుంది. అట్టిసమయములో వెంటనేకట్టిన త్రాళ్ళు వూడదీసి విశ్రాంతియిచ్చి మరలసరియగుస్థానము నందుంచిమందును పోయాలి.

జబ్బుతోవున్న పశువు లేవలేనప్పుడు మందు త్రాగించాలనుకుంటే పరుండబెట్టియే నెమ్మదిగా త్రాగించాలి

మందులుపోసిన తరువాత సీసాఅడుగుభాగాన మందుసంబంధము మడ్డిన గైరాలువున్న వదిలించిపోయాలి.

అంటురోగాలలో మందులువాడే పశువులకు ప్రత్యేకమైన గొట్టాలుగాని, సీసాలుగాని ప్రయోగించాలిగాని వీటినే మంచిపశువులకు వాడరాదు.

## నస్యము చేయించుట

ఆకుపసరులుగాని, చూర్ణాలుగాని, తైలాలుగాని ఆయారోగాల ననుసరించి ముక్కురంధ్రాలలోనికి పట్టించుట లేకపోయిన నస్యకర్మ అంటారు పశువులకు వచ్చేముక్కుపీనస, మొగబంతి, రొంప,జలుబు, శిరోవాతము మున్నగురోగాలలో నస్యకర్మచేయించాలి.

# ధూపాలువేయుట

ఘాటుగల వనమూలికల చూర్ణాలుగాని, సాంబ్రాణి, గుగ్గిలమువంటివస్తువులనుగాని ధూపము వేయుటఅనగా ముక్కురంధ్రాలకు పొగ వేయుపద్ధతికే ధూపాలు లేకధూమపానముఅంటారు రొంప, ఊర్ధ్వశ్వాస, వగర్పు, ఉబ్బసము, దయ్యాలు, భూతాలు, దృష్టితాళ్ళు వేసేడప్పుడు పశుశరీరమునకు ముక్కురంధ్రాలకు, పొదుగు భాగానికి, దవుడలు బిగిసినప్పుడు, శిరోరోగాలకు ధూపాలు వేయాలి



ఫార్మసీ వారి మందులను పరీక్షించుచున్న మాజీ మంత్రి శ్రీ ఓబులరెడ్డి గారు

## అంజనము

నేత్రరోగాలలో కాటుకగా మందులను పెట్టుతే అంజనమంటారు. మందమతి, విషపురుగుల కాట్లకు. శిరోరోగాలకు నేత్రరోగాలకు అంజనమును వాడవచ్చును.

## గండూషము

వగరు కషాయాలను నోటిపుండ్లకు, నోటిదుర్గంధానికి, విషవస్తువుల విరుగుళ్ళకు వాడే పద్ధతికే గండూష మంటారు.

## శిరోమర్దన

పశువుల రెండుకొమ్ముల మధ్య అనగా భాషికపుసుడి దగ్గర భాగాన ముచ్చిలిగుంటవద్ద తైలాన్ని వేసి మర్దించుటే శిరోమర్దన అంటారు. ఈమర్దనవల్ల పుర్రెముకలకు మెదటికి బలముకలుగుతుంది. పశువులకు వాతము చేసినప్పుడు, నేత్రాలు వేడెక్కినపుడు ఆముదాన్ని కాచి ఆయా భాగాలకు మర్దన చేయుట మంచిది.



ఫార్మసీ వారి మందులను తనిఖీ చేయుచున్న పశువైద్యశాస్త్రజ్ఞ శ్రీ ... గారి గారు

## వేడికాపడములు

పశువులకు దెబ్బలు తగిలినప్పుడు, బెణుకులకు, వాపులకు, వాతనొప్పులకు, నరాల సంబంధమగు రోగాలకు శరీరంలో వుండే చెమటను తీయడానికి, నొప్పులు తీయుటకు ఈ కాపడాలు చాలా మంచివి ఈ కాపడాలు యిసుకతో గాని, తవుడుతో గాని, వేడినీటితో గాని తీయుటమంచిది.

# పదునాలుగవ భాగము

## పశువులను పడగొట్టుట

గ్రామాలలో వుండే రైతులు తమపశువులకు ప్రమాదమైన రోగాలుసోకినప్పుడు మందులు పోయనీయక విసిగించినపుడుగాని, డెక్కలకు నాడాలు వేయడానికిగాని, బుడ్డకొట్టుట, బర్డోజీ వంటి పనిముట్లతో నొక్కవలసి వచ్చినప్పుడు పశువులను పడవేయవలసిన అవసరముందిగాన అట్టివాటిని జాగ్రత్తగా మెత్తని పక్కగా ఎండు గడ్డివేసిగాని, మెత్తని యిసుకలోగాని, పడవేయాలి. ఇంకనుపశువులను పడవేయుటకు ముందు పడవేసే పశువు పొగరుబోతుదా? పిరికిదా? పోట్లదా? కరచేదా? తన్నేదా? తలతో కొమ్ములతో గుద్దేదా? పొడిచేదా? కోపముతో వుండేదా? సాధువేదా? మున్నగు విషయాలు తెలిసికొని సూత్రింగాదానికినొప్పిలేకుండా, దెబ్బతగలకుండా పడ వేయాలి పడవేసే ప్రాంతములో గ్రాకొయ్యలు, మేకులు, తదితర వస్తువులు తీసివేయాలి. లేనిచో అనరిపాటు పశువులు కన్నువిన్ను కానకుండా ఎచ్చటపడితే అచ్చట పడగానే అవి గుచ్చుకొనియో, దెబ్బలుతగిలియో బాధపడతాయి అట్టి సమయములో దగ్గరవున్న మనుష్యులు కూడ ప్రమాదాలకు గురియగుతారు

పడగొట్టినతరువాత కాళ్ళనుకట్టునపుడు వెనుక కాళ్ళదగ్గరగనుండ రాదు అట్లుండికట్టితే వెనుక కాళ్ళతో పొట్టమీదగాని, తలమీదగాని, మూత్రకోశములోగానితన్నినదంటే ప్రాణాపాయంకల్గే వారికిరాగలదు గానజాగ్రత్తగపడవేయాలి ఇదినాప్రత్యక్షఅనుభవము. పడినవెంటనే తోకను వెనుకకాలిక్రిందగా పైకివంచిపెట్టితోకనుగట్టిగాపట్టుకోవాలి దీనినేమడితోక అంటారు పడగొట్టేముందుగా పశువునకు కడుపునిండా నీరుత్రాగించరాదు మేతకూడా ఎక్కువగా పెట్టరాదు అట్లుపెట్టిన ఆయాసపడుతూ కడుపుకూడా వుబ్బుతుంది. అట్టిసమయములో నోటిని తెరచి నాలుక ప్రక్కన మనవేళ్ళనుదూర్చి కొంచెముసేపువుంచాలి

దూడలను జాగ్రత్తగా పడవేయాలి సాధ్యమైనంతవరకు పశువులను పడగొట్టకుండా ఆస్పత్రిలోవుండే కగ్రిలలాగాపాతి మధ్యగా పశువును నిలబెట్టి త్రాటితో కట్టి నోరు తెరచి మందులుపోయుట మంచిదిగాని అయినదానికి కానిదానికి పశువులను పడవేయరాదు



రోగపశువులకు వాతలు వేక నస్యలు వేయవలసినప్పుడు జాగ్రత్తగా పడవేయాలి ఆపశువునకు మందు పెట్టినప్పుడు తప్పని రాక్షసవైద్యము చేస్తారు. అట్టిసమయములో కొన్ని పశువులు ఆనిష్ట అప్పటవుండే



మనుష్యులనుచూచి జడిసి వెంటనే ప్రాణము పోగొట్టుకొనేవికూడా వున్నాయి. మరికొన్ని పశువులకు దొమ్మ గురక మున్నగు ప్రమాద

కరమగు రోగాలువచ్చినపుడు రోగగుణాలవల్ల మందుత్రాగనందువల్ల రైతులుఆతురతపడిఅట్టి పశువులను పడవేసి పశునాలుక తెరచి, గొంతు వాచి బాధపడుచున్నపుడు మందులు బలవంతముగా నోరుతెరచి



పోస్తారు ఇట్టిసమయములో రోగతీవ్రతవల్ల గాని, మందుల ఘాటువల్ల గాని, మెడత్రాళ్ళు, కాళ్ళత్రాళ్ళు బిగువుగా కట్టుటవల్లగాని, బలవంతంగ ఆపశువుమీద పదిమందిపడి అటుఇటు కదలకుండా అదిమి పట్టుటవల్లగాని, ప్రాణాపాయము వెంటనే కలిగి "అంభా" అని అరచి ప్రాణాలు విడుస్తుంది. కాబట్టి జాగ్రత్తగా ఆలోచించి పడవేయాలి



తెల్లజాతి పశువుకంటె నల్లజాతి పశువులు మన్న, గేదె, మున్నగునవి మిగులక్రూరమైనవిగాన చాలాజాగ్రత్తగా ఈగ్రంథములో

చూపించిన చిత్రపటాలలో వుండే రీతిగా పడవేయాలి. ఆవులను, గేదెలను మాత్రము ఎంతో అవసరమున్న నే తప్ప చీటికి మాటికి పడవేయరాదు వాటిఆహారకోశము, నీళ్ళడొక్క, పాలసంచి నిండుగా సున్నితముగా వుంటుంది. గానపడవేసినను ఎక్కువసేపు వుంచరాదు. గాని పశువును పడవేయరాదు దూడను సాధ్యమైనంతవరకు కాళ్ళకు కట్టకుండగానే నొక్కిపట్టి చికిత్సచేయాలి. ఎందుచేతనంటే వీటికాళ్ళు చాలా సున్నితముగా వుంటాయి. బిగించికట్టితే తిమ్మిరి ఎక్కుటగాని నరాలు నలుచుకొనుటగాని, ఎముకలువంగుటగాని, విరుగుటగాని జరుగుతాయిగాన జాగ్రత్తగా పడవేయాలి వరొక ముఖ్యవిషయ మేమనపశువును పడవేసేముందు నీటినిగాని, తదితర ద్రవపదార్థాలను గాని త్రాగించరాదు. అట్లుత్రాగించిన కడుపుపొంగుతుంది. పశువును పడవేసేముందు ఎంతసేపు పడగొట్టియుంచాలో కటిక నేలమీదపడ



లెగవే! నీ తస్సదియ్య!

గొట్టితేపమైన గడ్డిచెత్త వగైరాలు పరిక్కవేయాలో, లేకదగ్గరలో ఇసుకవుంటే ఒకపర్యాయం పారతో తేలికగా కుదిలింపబడవేయాలో ఆలోచించి పడవేయాలి. పశువును పడవేసిన జడిసిగాని, తదితర కారణాలవలనగాని వుక్కిరిబిక్కిరి అయినప్పుడు నోటిలో మనవ్రేలును దూర్చి కొంచెముసేపు వుంచాలి.

వ్యాధి ముదిరినతరువాత ఇంకా బ్రతుకుతుందని ఆశయున్నప్పుడు కొందరుఅట్టిపశువును పడవేసి మందుపెట్టటో వాతవేయుటో చేస్తారు అట్టిసమయములో అరచుచు, కనుగ్రుడ్లుతేలవేసి మరణించే



పూనకొనద్ధలిన పశు వేయుట

దశ రాగలదని అనుమానమున్నప్పుడు మాత్రము వెంటనే పశువును లేపాలి. సామాన్యంగా పశువును ఎడగొట్టిన తరువాత తోకనుమడి దగ్గరగా దూర్చిపట్టుకోవాలి. లేనిచో వెంటనే లేచే స్వభావము వుంటుంది.

# పదునైదవ భాగము

## రాక్షసవైద్యము

మనదేశంలో పశువులకు ఏరోగమువచ్చినా, రాకపోయినా, అయినదానికి కానిదానికి వాతలువేస్తారు. వ్యాధులు రాకపోయినా తమాషాగా పిఠాపురం కాల్పులు, వరహాల కాల్పులు కాల్చుతారు. వరహాల కాల్పులు అంటే నాలుగురూపాయలు తీసికొని కాల్చేకాల్పు

లట. ఈరీతిగా కాల్చుటచాలా అన్యాయము మానవవైద్యములో, యింగ్లీషు వైద్యములో కూడ వాతలు అనగా రక్షలు లేక చురకలు కొన్ని రోగాలలో కాల్చవచ్చునంటారు వాటికి తగిన కాల్చేపనిముట్లు కూడావుంటాయి. పశువులకు వచ్చే ఆకస్మికరోగాలలో దొమ్మ, గురక, కుండేటిదెరి) మున్నగు రోగాలలో వాతలు వేస్తే తగ్గేగుణము వుంది కానిఎంతో అనుభవమున్నవారు తప్ప తదితరులు కాల్చరాదు. కీలెరిగివాత వేయాలంటారు మనపెద్దలు కాల్చేస్థలములో ఏ అవయవాలు, కీళ్ళు, నరాలు, రక్తనాళాలు వున్నవో గుర్తించుకొని వాతలు వేయాలిగాని యిష్టము వచ్చినట్లు కాల్చిన తదితరరోగాల పాలై త్వరలో మరణిస్తాయి.

వాతలు వేసే పని ముట్లు తుప్పుపట్టకుండా జాగ్రత్తగావుంచాలి. అవి అంసరదగ్గర వుండవు గ్రామాలలో ఎవరోఒకరు వాతలు వేసే వారుంటారు వారిదగ్గర నేయిట్టివివుంటాయి. కాని రైతులు తమయిండ్లలో వుండే గడ్డపార, కొడవళ్ళు, కిటికీయి పపూదలు మున్నగునవి తాత్కాలికంగా వాడుతారు ఇవ్వి వాడుటకూడ పొరబాటే ఒకవేళ వైద్యుని దగ్గర లేకపోతే యిండ్లలోవుండే పనిముట్లను తెచ్చి లోపను నీటితో కడిగి నూనెరాసి వుపయోగించాలి.

వాతలు వేసేమనిషి తనకట్టుపంచెను పైకిదోపుకోవాలి. గాని క్రిందకు వ్రేలాడనీయరాదు.

పశువును పడగొట్టిన తరువాత చెవులు మడత పడినవేమో చూడాలి లేనిచో చెవినరాలు మడతలుపడి కాలుచెల్లపోతుంది

వాతలను తీవ్రముగాను, అంత తేలికగగాను కాల్చక ఎంత వరకు కాల్చాలో అంతవరకు కాల్చాలి.

కాల్చేముందు పశువును యిసుకలోగాని, మెత్తని పచ్చిగడ్డి వంటివియున్న స్థలంలోగాని, పశువును పడవైచి కాల్చాలిగాని ఎండు గడ్డి పరిక్క వేసి కాల్చరాదు

వాతలు వేసేముందు ఎచ్చట కాల్చాలో ముందు సిరాతో గుర్తులు పెట్టుకోవాలి

పశువునకు అవసరమౌ చముఱు, తైలాలు మర్దన చేసినచో ఆభాగమంతా గుడ్డతో తుడిచి కాల్చాలి లేనిచో చర్మమంతా మాడిపోతుంది

వాతలు వేసేమనిషి ఎవరితో మాట్లాడక నోటిలో చుట్ట వగైరా వుంచుకోక కీలెరిగి వాతలు పెట్టాలి



వాతలు వేసే భాగాలలో వుండే నరాలు, కీళ్ళు వగైరా చిట్లకుండా కాల్చాలి

వాతలు వేయునపుడు ఆపొగను పీల్చరాదు.

వాతలు వేయునప్పుడు చాలామంది గుమికూడతారు పశువును బెదరగొడతారు. పడకపోతే తాళ్ళతో అటుఇటు గుంజుతారు కాళ్ళతో తన్నుతారు. మరికొందరు మూష్టులు అమ్మబూతులు తిడతారు. పశువు లేవలేకపోతే రాక్షసులులాగా తోక కొరుకుతారు పశువు వెన్నెముక, పక్కఎముకలమీద. చెవులుమీద, యమకింకరులులాగా కొడతారు ఇట్టిపనులు చేసేవారుంటే ఆపశువుయజమాని తప్పకుండా మొగమాటము లేకుండా అవతలకు మర్యాద పూర్వకంగా పంపించాలి వాతలు వేయుట పూర్తి అయిన తరువాత నెమ్మదిగా పశువును లేపి తోకనుపట్టుకొని పిన్నగాలాగి శరీరమును చేతితో తట్టి జాగ్రత్తగా కట్టివేయాలి చెవులనుకూడ చవరదీయాలి. వాతలు వేసిన తరువాత నీటిలోగాని, ఎండలోగాని, వర్షములోగాని లేకుండా కాపాడాలి. వాతలు వేసిన తరువాత పుండ్లను కాకులుపొడవనీయకుండా, ఈగలను,దోమలను వాలనీయకుండా కాపాడాలి. ఫార్మసీవారి గ్లయిమాల్ నుగాని, చెర్మారినిగాని, సెటరినరీ ప్లాస్టరునుగాని వాడాలి.

# పదునాలవ భాగము

## ఎనీమా చేయు పద్ధతులు

### ఎనీమా

మానవులవలెనే పశువులకు కూడ మలకోశములోనికి నీరు ఎక్కించి ఎనీమా చేయుట యిప్పటికీ కొంతమందికి ఆశ్చర్యముకలిగించుతుంది కొందరురైతులు ఎనీమా చేసినవద్దు లోపలనీరు బైటకు రాదు. అదిచచ్చిపోతుంది. రోగంతగ్గకపోతే పోతుంది. ఎనీమా చేయవద్దుఅనేవారు ఈకాలంలో లేకపోలేదు. ఇదివరకు డాక్టర్లు తప్పతది

తరుతెచుసుఎనీమా చేయుట ఎరుగక పోవుటవల్లను. డాక్టర్లు బెట్టుగుట్టులు ఎచ్చట ఎగిరిపోతాయో యని ఈ విషయముంను బయటపెట్టెవారు కారు.



ఇప్పుడంటూరా తెనాలి ఆయుర్వేద పశువైద్య సంస్థవారు చేసే చికిత్సల వల్లగాని, వారిగ్రంథమాల రచించిన యిట్టిగ్రంథాలవల్ల గాని, వారికళాశాలలో తర్ఫీదైనరైతుబిడ్డలవల్లగాని, పశువైద్యంలో గుట్టుబెట్టులేకుండాఈముప్పది సంవత్సరాలనుంచి చేసే సేవవల్ల రైతు లెల్లరు అన్నివిషయాలుగ్రహించడంవల్లఎనీమా చేయడమంటే, ధర్మా మీటరుతో ఉష్ణాన్ని పరిశీలించడ మేమిటోచాలావరకు తెలిసికొన్నా రని తెలుపుటకు నేనూ రైతుబిడ్డనుకాబట్టి,నాకుఎట్టిప్రభుత్వడిగ్రీలు లేన ప్పటికి, మారైతుసోదరులలో కొంతమంది ఎనీమా చేయుచున్నారని తెలుపుటకు నేనుఎంతో గర్వపడుతున్నాను. కానిరైతులుకూడా పశు వునకు ఎట్టిసమయములో ఎనీమాచేయాలో, ఎట్టి సమయములో ఎనీమా చేయాకూడదో, తెలిసికొని చేయాలిగాని పశువు పేడ వేయ లేదని మాటిమాటికి మాత్రము ఎనీమా చేయక ఈగ్రంథములో తెలి పిన విషయాలను గ్రహించి ఎనీమా చేయాలి.

ఎనీమా పశువేగులు శుభ్రము చేయుటకు వుపయోగ పడుతుంది ఎనీమా చేయడానికి 100 డిగ్రీల వేడిగలనీరు రెండు లేక నాలుగుసేర్లు వుపయోగించవచ్చును నీటిని ఎనీమా డబ్బాలో పోసి దానిని మూడడుగుల ఎత్తుభాగాన పట్టుకోవాలి నీరుపోకుండా రబ్బరు గొట్టాన్ని నొక్కాలి. నీరు పేగులలోనికి యెక్కిన తరువాత పొట్ట భాగాన్ని చేతులతో నొక్కాగానే లోపలనుంచిబయటకు మలముతో సహా పడిపోతుంది జ్వరాలలోను, అంటురోగాలలోను 85 లేక 90 డిగ్రీల వేడినీటితోనూ జీర్ణ వాత రోగాలలో 110 లేక 115 డిగ్రీల వేడినీటితోను యెనీమా చేయాలి



ఎనీమా చేయునప్పుడు బొట్టను పైకిదోపుకోవాలి. పశువు ఆసనము దగ్గరగానుండక కొంచెము దూరముగానుండి ఎనీమాడబ్బా చేతితో పట్టుకోవాలి ఎనిమా చేయగా వచ్చినపాలినములో ఏరకమైన గింజలు, తుక్కు పదార్థాలు, జిగురు రక్తము మున్నగునవి వున్న వేమో పరీక్షించాలి మలినము పోయేవరకు పదేపదే పేగులోనికి నీటిని ఎక్కించ వచ్చును పశువులను నిలబెట్టి దూడలను పడుకొన బెట్టిగాని, నిలబెట్టిగాని ఎనీమా చేయాలి సన్‌లైట్ సబ్బుతోగాని తదితరకం పనీటు సువాసన, ఘ్రంగే సబ్బులనుగాని వాడరాదు.

శీతకాలంలో దూడలకు ఎక్కువతక్కువైతె మలబద్ధకం కలిగి పేడ వేయలేక బాధపడుతూ వుంటే ఏగొలిమిడాకో, ఏగాడిద గడ పాకో, ఏబలుసుఆకో, వుండలు చేసి పెడతారు. అట్లు వేయుటవల్లమలము గట్టిపడి పిట్టంకట్టి విషమంతా శరీరంలో జీర్ణమై సంధించి మెడతిరిగి చనిపోతాయి కాబట్టి ఇటువంటివి పెట్టకుండ ఆరంభములో నేఎనీమా చేయుట మంచిది. ఎక్కువ శీతలములో నుండి మామూలు వేడికూడా లేనప్పుడు ఎనీమా చేయకుండా చేతికి ఆముదము రాసుకొని లోపల మలాన్ని తీసివేయాలి.

# పదునేడవ భాగము

## ఇంజక్షన్సు

## సూచివ్యధ

### పశువులకు—జెములు టీకాలు—వేయుట

ప్రాచీనకాలంలో చేయబడే ఇంజక్షన్సు (సూచీవ్యధ) మరొక రీతిగా వుండేవి కొన్నివందల సంవత్సరాలకు పూర్వమే కనిపెట్టిన సూచీవ్యధనే నేటికాలములో విదేశీయులు వివిధరకాల యింజక్షన్సు వివిధ రూపాలుగా ఎన్నోకం పనీలు తయారుచేయుచున్నారు మానవులకుఆయుర్వేదయింజెక్షన్సులనుకూడ నేడు తయారు చేయుచున్నారు. పశువులకుకూడ ఆయుర్వేద యింజక్షన్సు తయారుచేయుడానికి ప్రయత్నాలు జరుగుచున్నాయి.

ఆంగ్ల పశువైద్యులు యిప్పటికి ఈ పద్ధతి ప్రకారము పశువులకు గూడా టీకాలు వేయుట ఆచరణ యందున్నవి ఇంకను మానవులకు ప్రాచీనకాలమునుంచీ “ఎచ్చుబొట్టును” సూచీవ్యధ యిప్పటికిఆచరణలో

వుంది ఈ రీతిగానే ప్రాచీనకాలమునుంచీ నేటివరకు అంటురోగాలు సోకకుండ ముందుగానే శాస్త్రసమ్మతముతో, అతివిష్టతో "జెముడు పాల"తో పచ్చబొట్టు సూచీవ్యధలాగా పశువు డొక్కభాగమందు వేయుటఆచారమైయుంది. ఈ టీకాలమందు పొక్కువుండయి జ్వరము క్రమేపి తగ్గుతుంది. ఈ రీతిగా ఎన్నోప్రయోగాలు ప్రాచీన ఋషీశ్వరులు పరిశోధించినటుల తెలుస్తున్నది.

## వాత, పిత్త, కఫాలు

మానవులకుగాని, జంతువులకుగాని వ్యాపించు సకలరోగాలకు విహారత్రిదోషాలు (వాత,పిత్త,కఫాలు) ప్రధానములై ఆహార భేదముల చేతను,శరీరము ప్రకృతి భేదముల చేతను వేరు వేరు లక్షణాలతో వేరు వేరు చికిత్సలతో చికిత్సింపబడుతున్నాయి. ప్రకృతి సిద్ధమైనపంచ భూతములచే నిర్మింపబడిన ఈకాయము (శరీర భేదము)లు కాలకర్మ దోషములచే వివిధ రూపాలు గల రస, రక్త, మాంస మజ్జ అస్థి, మేద, శుక్రరూపాలతో వుత్పత్తియై మానవులకు. పశువులకు శరీర భాగములు స్వల్పభేదములతో సమానముగా వున్నాయి.

## సూచీ వ్యధ

ప్రాచీన ఆయుర్వేద చికిత్సా విధానములన్నీ మానవులకు వలెనే పశువులకుకూడ ఉపయోగింప బడుతున్నవి. ఈ కారణము వల్లనేఆంగ్లేయ వైద్యులు కొన్ని జంతువులనుండి తయారుచేసినమాంస రసము, రక్తము, చీము మొదలైన పదార్థాలు మనుష్యులకు టీకాల రూపాన ఇంజెకన్ రూపాన ప్రయోగించుచున్నారు. ఇట్టివి ఉదాహరణకు ఎన్నియోఉన్నాయి. గొంతు పరికేత్తి సూది, సపనిమ్ముట్లుతో ఏనాఔషధాన్ని రక్తములో ప్రవేశింపజేయువిధానానికే ఇంజక్షన్ లేక సూచీవ్యధయని పేరువచ్చింది

## చరకాచార్యులు

ప్రాణావశిష్టంబగు రోగములందు ఉపయుక్తమగు ఔషధాన్ని రక్తమందు ప్రవేసింపజేసిన జీవించునని తెలిపియున్నాడు, ఆరీతిగానే పూర్వశాసనమే నేటికని ఆచరణీయమై ఆంగ్ల, ఆయుర్వేదీయులు టీకాల మూలాన రక్తాన్ని చిమ్మించి అందు ఔషధాన్ని ప్రయోగింప జేయుటే ప్రధాన కర్తవ్యమైయుంది.

## సుశ్రుతాచార్యులు

శల్యతంత్రమున శస్త్ర పనిముట్లను కొన్నిటిని నిరూపించు చెప్పుచూ బుద్ధివంతుడగు వైద్యుని నారూప్యము వలనా, శాస్త్ర జ్ఞానము వలనా, గురూపదేశము వలనా, యితర యంత్రాలను జూచుట వలనా తయారు చేసికోవచ్చునన్నాడు.

ఈనవీన నాగరిక ప్రపంచములో శాస్త్రజ్ఞాన మభివృద్ధియగు కొలది వివిధరూపాలుగ వివిధఉపయోగాలుగవుండే నూతన పరికరాలు బయలు దేరుతున్నాయి అయినప్పటికి పూర్వులు నియమించిన 101 శస్త్రకర్మములలోను రక్తమునందు ఔషధ ప్రయోగము చేయుట సూచీ ముఖప్రయోగమును నిర్ణయించి యున్నారు. రక్తమునందెక్కించుటకు ఈప్రయోగము చాలామంచిపద్ధతియని చరక సుశ్రుతాదులు ఏకగ్రీవముగా సమ్మతించారు. ఈశతాబ్దములో పాశ్చాత్యులు ప్రయోగించు ఇంజెక్షను అను సూదిమందు,పూర్వముసూచీ ముఖప్రయోగమువలన సూదిమొనవంటి సాధనము (సిరంజి) తో జంతువులరక్తమునందు ప్రవేశపెట్టుచున్నారేగాని మరెట్టి పద్ధతిగాను మారలేదు

ఆంగ్లేయవైద్యులు చేయుచున్న ఇంజక్షనులకు పూర్వంటీకాలను చర్మాన్నిగీచి అచ్చటరక్తమునందు ఔషధప్రవ్యాన్ని ప్రయోగించుతూ క్రమక్రమముగా పరిశోధనలు చేసి రక్తమునందు ఔషధము ప్రవేశ

పెట్టుటయే. ముఖ్యవిషయమని గ్రహించి పూర్వ శాస్త్రములయందు చెప్పబడినరీతిగా ఆయుర్వేదీయ సూచీ ముఖశస్త్రము (సిరంజితో) పనిముట్టుతో పశువులకును తదితర జంతువులకును మానవులకున్ను ఇంజెక్షన్ (సూచీముఖప్రయోగము) చేస్తున్నారు. ప్రాచీనులగు చరకాదులు జెప్పినట్లుగానే ఔషధాలను రక్తమందు ప్రవేశపెట్టుట కను కూలించునట్లుగా దర్శరూప పద్ధతులతో ఉపయోగించుచున్నారు

## ఇంజెక్షన్ అంటేఏమిటి ?

ఇంజెక్షన్ అనుపదము సామాన్యంగా ఏ భాషలో చేరిందో బోధపడుట లేదుగాని, దేశమంతా సర్వసామాన్యంగా వాడుకయై యుంది.

ఇన్ ॥లోనికి

జెక్షన్। జొనుపుట

అనగా శరీరములోనికి యంత్రసాధనముచేత ఔషధాన్నిగాని, మరియే యితరపదార్థాలనుగాని ప్రవేశింపజేయు విధానమునకేఇంజెక్షన్ యని వాడుతున్నారు ఈమాటకుసరియగు పదము గానరాదు ఆయుర్వేదములో సూచీ ముఖప్రయోగమని వృద్ధవైద్యులు తెలుపుతున్నారు. శరీర భాగములోనికి సూదివంటి ఏయితర పనిముట్లు (పిచికారి)తో చర్మములోకిగాని మాంసకండరములోకిగాని, రక్తనాళములోకిగాని ఔషధమును పంపుటకు ఇంజెక్షన్ అందురు.వీటిలో రెండురకాలు వున్నాయి.

1. చర్మ,మాంస, నరములగుండా రక్తములోనికి ఔషధములు ప్రయోగించుట

2. ఆసనముద్వారా లేక యోనిగర్భాశయ, మూత్రాశయముల ద్వారా ఔషధములు ప్రయోగించుట. ఈ రెండువిధములగు ప్రయోగాలకు సాధారణముగా ఇన్‌జెక్షన్‌ యనివాడవచ్చును. ఇప్పటి వైద్యులు ఆసన, మర్మావయముల గుండా ప్రవేశపెట్టు సాధనమునకు ఎనీమా (వస్తికర్మ) యని వాడుతున్నారు.

## రికార్డు సిరంజీల-కొలతలు

సిరంజికి రెండువైపుల లోహముతో తయారు చేయబడిన మూతలవంటివి యిమిడ్చి యుంటాయి. ఇంకను సిరంజిలోని మందును లాగుటకు, విడుచుటకు యేర్పడియుండు కడ్డీకూడ లోహముతో తయారుచేయబడి యుంటుంది. ఇంకనుసిరంజికి మధ్యగాగాని,ప్రక్కగాగాని మొన (ముక్కు) గలిగి యుంటుంది.

## సామాన్య ఇంజక్షన్సు

గాజు పిచికారి, రబ్బరుట్యూబ్, ఎనీమాట్యూబ్, నికెల్ పిచికారి, పెద్దపేగులోనికి ఎక్కించే ఎనీమాట్యూబ్సుమున్నగువాటిని సింపిల్ ఇంజక్షన్సు అంటారు.

## రెక్టల్ ఇంజక్షన్

పశువు మలకోశములో మలముజారక గట్టిగా నున్నపుడు ఎనీమాడబ్బాకు రబ్బరుట్యూబును తగిలించి సబ్బునీటితో గాని,తదితర గ్లిసరైన్ ఆముదము వంటి పదార్థములతో ఎనిమా చేయుట కే రెక్టల్ ఇంజెక్షన్ అందురు. దీనినే వస్తికర్మయంటారు.

## యురెథల్ ఇంజక్షన్

పశువు మూత్రకోశములో రాళ్ళుఅడ్డుపడి నపుడుగాని, చేరులోపల పుండ్లుకురుపులు లేచినపుడుగాని చేయమూదలో పెద్దప్రండయి బాధ పడుచున్నప్పుడుగాని, మందు నీటిని గాని, లోషన్‌నీటినిగాని

మూత్రకోశభాగమునకు ఎక్కించవలసి నప్పుడు వాడేదానికి యురెథల్ ఇంజెక్షను అంటారు.

## వైజైనల్-ఇంజక్షన్

ఆడపశువుమీద మగపశువు బలవంతముగా ఎక్కుట వలన యోనిభాగమంతా వాచి బాధపడుచున్నప్పుడుపసూ కేకారపునీటినో, తదితర మందులనోకలిపి డూష్ చేయు పనికి వెజైనల్ ఇంజక్షన్ అంటారు.

## యుట్రైన్ ఇంజక్షన్

మావిపడినపుడు లాగిన తరువాతను, అకాలప్రసవములో యోనిని శుభ్రముచేయుటకు వాడేపనికి యూటెరిన్ ఇంజెక్షన్ అంటారు

## గాస్ట్రిక్ ఇంజక్షన్

లోపలికి ఆహారము పోవునపుడు కంఠనాళముగుండా పంపే దానికి గాస్ట్రిక్ ఇంజక్షన్ అంటారు.

## బ్లాడర్ ఇంజక్షన్

నీరుడు బంధించి బాధపడునపుడు వృచ్చబుడ్డలో రాళ్ళుపుట్టి నపుడు, మూత్రనాళముగుండా మందులు నగైరాలం పేదానికిబ్లాడర్ ఇంజక్షన్ అంటారు.

## కోలన్ ఇంజక్షన్

పెద్దపేగులోమలముతో శ్లేష్మము, తదితర పదార్థములుచిక్కకొని ఎన్నివ ందులు వాడినను పనిచేయనప్పుడు మలకోశమును ఒత్తిడితో కడిగే దానికి కోలన్‌యింజక్షన్ అంటారు

## ఇయర్ ఇంజక్షన్

చెవిమీద, చెవిలో కురుపులు దురద, రసి మున్నగు వాటిని కడిగే పిచికారికి ఇయర్ ఇంజక్షన్ అంటారు.

## నాసాఫెరింజియల్ ఇంజక్షన్

ముక్కులలోను, కంఠనాళములో నుష్రంప్లుగాని కురుపులుగాని వ్రణములుగాని పుట్టి బాధించునపుడు వాటికి తగిన మందులనుపంపే దానికి నాసాఫెరింజియల్ ఇంజక్షన్ అంటారు.

## ఇన్యులేషనం - ఇంజక్షను

చర్మము పైభాగము సంకుసంములు మర్దన రూపముగా, మాలీషురూపముగా ప్రవేశ పెట్టట.

గమనిక :- మానవులకు వలెనే పశువులకు కూడ అల్లోపతిలోను ఆయుర్వేదములోను, హోమియోపతిలోను ఇంజక్షన్లు (సూదిమందులు) వున్నాయి. కాని పశుశాస్త్రములో ఆరితేరిన వారే ఇంజెక్షను ఈయాలి గాని ఎవరు బడితేవారు యిచ్చుటవల్ల పశువులకు ప్రమాదాలు కలుగుచున్నటుల తెలుస్తావుంది. అందుచేత ఈపర్యాయం ఈగ్రంధములో యింజెక్షను మందుల వివరాలు తెలుపలేదు

# పదునెనిమిదవ భాగము

## మెస్మరిజము

పూర్వము మనదేశంలో మంత్రిశాస్త్రజ్ఞులు, యోగాభ్యాసపరులు అసంఖ్యాకులుగా వుండేవారట. మనదేశానికి అమెరికా, ఇంగ్లాండు, గ్రీకు, ఫ్రాన్సు, జర్మనీ, మున్నగు దేశాలవారు వచ్చి ఈ మెస్మరిజాన్ని, మంత్రాలకు సంబంధించిన విషయాలనునేర్చుకొని వెళ్ళి వారిదేశాలలో ఈరహస్యాలను వెల్లడిజేస్తుంటే ఆశ్చర్యపడేవారు. ఈ మెస్మరిజము వగైరాలు ఆదేశాలు అతిశీతలమయినదేశాలు అగుటవల్ల, తగినశీతోష్ణస్థితి లేనందువల్ల ఇట్టివి వుండేవిగావు. ఆదేశములో నదులు ప్రవహించలేక చలిచేగడ్డకట్టుటవల్ల, ఆదేశప్రజలు చలిచే గజగజవణుకుటవల్ల, ప్రకృతిఆహారాలకు తగిన శాఖాహారాలు దొరకనందువల్ల యిట్టివిజరుగుట మిగుల దుర్లభముగా వుండేది. ఇంకను యిండ్లమధ్యనే కొరివిదయ్యాలులాగా అగ్నిహోత్రాలుఏర్పరచుకొని వానిచుట్టూ కూర్చుండి తమతమపనులను చేసికొంటారు. మనదేశంలో అట్లుకాదు. మనదేశ శీతోష్ణ స్థితేవేరు. మనదేశంలో ఎన్నోరకాల ఫలవృక్షాలు, మంచినీటిప్రవాహాలు, మహానదులు, చెరువులు, వాగులు సరస్సులు వున్నమాట ఎల్లరకు తెలిసినవిషయమే. అందుచేతనే మనదేశం ఆధ్యాత్మికజ్ఞానానికి, యోగాభ్యాసాలకు ప్రసిద్ధిచెందినది. అందుకే మన దేశము విజ్ఞానమయమైంది.

ఈరీతిగా మనదేశానికి వచ్చిన విదేశాలవారిలో మిస్టర్ అంథోని ఒకడు ఇతను 1734లో రైన్‌నదియొడ్డునవున్న స్టైను అను పట్టణములో జన్మించి, మెస్మరిజమను వైద్యశాస్త్రన్ని నేర్చుకొని వియన్నా దేశంలో గొప్పపేరు సంపాదించాడు. అట్టిసమయములోనే "హేహాలను" గొప్పభగవద్భక్తుడు ఆదేశమందే పుట్టి మాగ్నేటిజం అనుఆత్మశక్తిని

సంపాదించి ఎన్నో రోగాలు కుదిర్చాడు. మాంగ్నేటిజం అంటే మంత్ర శక్తి అంటారు. ఆకర్షణశక్తిలో ప్రభావంవుందని మెస్మరిందార తెలిసికొని లోహసంబంధమైన ఉక్కుముక్కలను తెప్పించి ఉపయోగించి అనేకరోగాలకు చికిత్సలు చేసేవాడు. ఆకాలములో మన దేశానికికూడ ఈదారవచ్చి కాశ్మీరువండితులవద్దయీవిద్యను నేర్చుకొని తనదేశంలో బాగా ప్రచారంచేసాడు. ఈరీతిగా మహాపవిత్రవంతమైన ఈసమ్మోహన విద్యకే మెస్మరిజం అనే పేరువచ్చింది.

మెగ్నేటిజం అనునది నరాల సంబంధముగు రోగాలలో మిక్కిలిసులభంగా జేరి వెంటనే గుణముకనిపించుతుంది. ఈశక్తి మిక్కిలి దూరంలో వుండే శరీరాలకు కూడా వ్యాపింపచేస్తుంది. ఈశక్తి పెద్ద శబ్దాన్ని కూడా కలుగజేస్తుంది.

హిప్నాటిజం అనేది ఒకరకపు మెరుపుశక్తి. ఈమెరుపును మన కన్నులతో చూస్తే కష్టంగావున్ననూ సారప్రయోగము వల్ల కలిగే అత్యద్భుత శక్తివలన స్పష్టమగుతూవుంది. ఇదియే మెరుపులో వుండే సారప్రశక్తి, సూర్యుని వెల్తురు కిరణంగా వెలువడుట వల్లనే, మానవ శరీరమందుండే జీవకాంతి తేజస్సే చిన్నగా దగ్గరగా వుండే వస్తువులలో ప్రవేశించుతుంది. ఈశక్తివల్లనే నరాలకు సంబంధించిన రోగాలను తగ్గించవచ్చును దీనిశక్తి సందుల ప్రభావంకంటె గొప్పది.

డాక్టర్ ఎన్. డెయిలను అనునతను ఈ ఆకర్షణాశక్తి వల్ల రోగులకు మత్తుమందు యిచ్చి పెద్దపెద్ద వ్రణాలను శస్త్రచికిత్సలు చేసేవాడు. డాక్టర్ బ్రెయిడుదార 1843 లో సమ్మోహన శాస్త్రాన్ని హిప్నోలని పేరుతో ఒకగ్రంథము వ్రాశాడు. ఇంకను ఈ విద్యవలన ఎంతోమంది ఇంద్రజాల మహేంద్రజాలాది విద్యలు నేర్చుకొని ప్రజలనుంచి ఎంతో ధనాన్ని సంపాదించారు.

పూర్వము మనదేశంలో మహారాజులలో ఈ ఇంద్రజాల మహేంద్రజాలాది విద్యలు చూపించేవారని పురాణాలలో చెప్పబడి వుండేవి. ఇవన్నీ ఈ మెస్మరిజం సహాయంవల్లనే కలుగుచుండేవి.

పశువులకు దృష్టిదోషం తగిలి పాలుఈయకపోతే మాంత్రిమహాత్తుచే ఈ మెస్మిరిజాన్ని ఉపయోగించి విరాటురాజు కొలువులో సహదేవుడు చికిత్సచేసేవాడట. ఈ మెస్మిరింజమే ఒక మంత్రశక్తి, దివ్యదృష్టి, కుక్క జనసమూహంలోవున్న తన యజమానుని తేలికగా గుర్తించు తుంది ఆయజమాని దగ్గరవుండే ఆకర్షణశక్తియే కుక్కనుతనదగ్గరకు లాగుకొని వచ్చింది కాబట్టి ఈ ఆకర్షణాశక్తి కొందరిలో అధికంగాను మరికొందరిలో తక్కువగాను వుంటుంది.

తులసీదళాలు భగవంతునికి ప్రీతికరమైనవస్తువులని చెప్పిననే గాని మనమువాటిని భక్షించాలని మనపూర్వీలు చెప్పేవారు. ఈ చెట్టులో మనశరీరములో అతివేగంగా ప్రకాశించే మంచిశక్తులు వున్నాయి అందుచేత ఆ తులసీదళాలు వేసికొని త్రాగిన నీటిలోమంచి శక్తి ప్రవేశించి బలాన్ని కలుగజేస్తుందని తులసిపూసలలో కూడా మనకు పనికివచ్చే ఆరోగ్యం, తేజస్సు కలుగజేసే ఆకర్షణశక్తివుందని మనపూర్వీలు తెలియజేసారు.

రోగాలనే బాధపడుచున్నపుడుగాని, దయ్యాలచే బాధపడు చున్నపుడుగానిగ్రహస్థితి బాగులేనపుడుగాని రావిచెట్టును పూజిస్తారు. ఏకదృష్టితో బలముతో ఆత్మ బలముతో చెట్టు చుట్టూ ప్రదక్షి ణాలు చేస్తారు. ఇట్లు చేయుట వల్ల బలము, ఆత్మశక్తి, తేజస్సు, మనో ధైర్యము కలిగి ఎంతో మంది ఆరోగ్యంచెందిన వారువున్నారు. వేయిమంది మానవులయందు ఎంతశక్తి వుంటుందో అంతశక్తి ఈచెట్టులోవుందనీ, అట్టి శక్తిని మానవశరీరంలోకి దివ్యదృష్టితో రావాలంటే ఎంతో నిష్ఠతో, మంత్రవుచ్చారణతో చేస్తే తప్పక ఆకర్షించి ధన్యతనుచేయగల మహాత్తు వుందని మన పూర్వ శాస్త్రాలు తెలుపుతున్నాయి. యిప్పటికి కూడా ఈ ఆచారము మనదేశాలలో వుంది.

మనదేశములో ప్రతిమానవుడు, ప్రతిగృహిణి నొసటి మధ్య భాగమున బొట్టుపెట్టుకొను ఆచారమువుంది. ఈబొట్టులో మానవ దృష్టి దోషము పోవు మహాశక్తి వుంది ఎంత అందగాడైనా, ఎంత

అందమైన స్త్రీయైనా, ఎంత అందమైన జంతువైనా కూడా నొసటి భాగమే పవిత్రమైన లక్షణము అందుచేతనే ప్రాచీన ఋషీశ్వరులు నొసటబొట్టు లేనినాప ఎందుకుపనికిరా రన్నారు ఎంత దుర్మార్గుడైనా, ఎంత రౌడియైనా, ఎంత కఠినుడైనా ఆ నొసటను వున్న కుంకుమ లేక గంధపు బొట్టు దివ్యదృష్టితో చూచినా తనుఅనుకున్న మాయా బజారంతా పటాపంచలై తాను కూడ పవిత్రత పొందగల, శక్తి తాను కూడ బొట్టు పెట్టుకొనుకొనే అంత శక్తి ఆ బొట్టు లోవుంది ఇప్పుడు చాలా మంది బొట్టు పెట్టుకోకు చూచేశారు కుక్క పెంపుడు పిల్లను, సాంప్రదాయం గంచి లక్షణాలు అందముగల వాటి నొసటి భాగమందు ఎరుపు రంగు లేక పసుపు రంగుగల బొట్టు సన్నని చార లాగా యజమానులు పెడతారు గోపూజ చేసి ఆవు నొసటకి పసుపు కుంకుమ పెడతారు ఇట్లు పెట్టుట వల్ల ఆజంతువులకు దృష్టి దోషంపోయి కులాసాగా వుంటాయని వారి తెలంపు. ఈరీతిగా గడ్డాలు పెంచేవారు. జటా జూటాలు పెంచేవారు, గ్రహాలను బట్టి క్షవరము చేయించుకొనేవారు, దేవుడి గుళ్లో వెంట్రుకలు తీయించుకొనే వారు యెంతోమంది యున్నారంటే వారంతా పిచ్చివాళ్ళయి కాదు ప్రాచీన సిద్ధాంతములననుసరించి వారి వారి నమ్మకలను బట్టి చేస్తూ వున్నంతమాత్రాన మనము హేళన చేయక వాటిలో శక్తిసామర్థ్యాలు ఏమిటో తెలిసికోవాలి.

## జంతువులను లోబరచుకొనుట

ఈ కాలంలో మెస్మిరజం, గారడి, అంటే అంతా టక్కుటమారము అనేవారూ వున్నారు జంతువులస్వభావాలను తెలిసికొని వశపరచుకొనే సూత్రాలు ఎన్నోవున్నాయి అడవి మృగాలకంటే గ్రామాలలోవుండే జంతువులను సులభంగా వశపరచుకోవచ్చును. అరణ్యాలలో వుండే కోయవాండ్రు సింహాలను పెద్దపులులను తదితర జంతువులను ఒక విధముగ కట్టుకట్టి వశపరచుకొంటారు. ఈ కట్టుకట్టుటకు అనేకరకాల మంత్రాలు వున్నాయి ఎన్ని మంత్రాలున్నప్పటికీ

మనస్సును శుద్ధిపరచుకోవడంలోవుంది చూడండి పాములనరసయ్య పారముల శీతయ్యగారలు పాముమంత్రాలు పెట్టి మంత్రి ప్రభావం వల్ల ఎంతమంది మనుష్యులను, పశువులను సమాచారాలద్వారా రక్షించారో ఈ కాలములోకూడా బుజువగుతూవుంది. మనపూర్వులు ఆకర్షణాశక్తితో జంతువులను లోబరచుకొనేవారు. ఈ ఆకర్షణాశక్తి కొన్ని జంతువులయందే వుండేది. అట్టిజంతువులను లోబరచుకో వాలం టేఎంతో కష్టం. ఆకర్షణాశక్తిగల యిట్టిజంతువులు మనుష్యులనే ఆకర్షించుతాయి.

చూడండిపాములువాడు ఎట్టిపామును అయినా మంత్రముచే నిలుపుతాడు. ఈఆకర్షణాశక్తి ఒక్కొక్కవంశములో పరంపరగా కలు గుతూ వుంటుంది. ఈరీతిగా చిన్నజంతువులనుంచి పెద్దజంతువులవరకు తదేకధ్యానంతో దృష్టినివుంచి అరికట్టుచున్నచో జయముగాంచ వచ్చును. కానిఅందరు ఈరీతిగా చేయజాలరు పట్టుదల,ఓర్పు, దైవ భక్తి, ఏకదృష్టి, భూతదయ, పరోపకారము గలవారికే ఈవిద్యఅబ్బు తుంది.

మానవశిరస్సును 42భాగాలుగా శాస్త్రజ్ఞులు విభజించారు. ఒక్కొక్కభాగంలో ఒక్కొక్కశక్తిని భగవంతుడు సృష్టించాడు. వయస్సు పెంపొందినకొలదీబుద్ధియొక్కఅభివృద్ధిశక్తితగ్గుతూవుంటుంది. పుట్టినబిడ్డకు ఏడవరోజున ఎంతజ్ఞానశక్తివుంటుందో, ఏడవమాసాన అంతకురెట్టింపుగా వుంటుంది. ఏడవసంవత్సరములో అంతకు మూడు రెట్టింపులు అభివృద్ధియగుతుంది ఈరీతిగా చిన్నతనంలో జ్ఞానశక్తిదిన దినాభివృద్ధిచెంది, వయస్సు ముదిరినకొలదీ తగ్గిపోతూవుంటుంది. కాబట్టి ప్రతివ్యక్తి పైనచెప్పిన విషయాలన్నీ గుర్తించుకొని మంత్రాలలో ప్రతిభాశక్తిగలవారిని ఆక్షేపించక, హేళనచేయక తగిన ప్రోత్సాహ మిచ్చుదురుగాక.

# రేడియో ఐసోటోపులు

మైక్రోస్కోప్ తరువాత ఈ రేడియో ఐసోటోపులు అతిముఖ్యమైనవని పరిశోధకులు తెలుపుతున్నారు. ఇంకను దీని పరమాణువు, రేడియో ధార్మికశక్తి యుపకూడ అంటూ వ్యాధులను చికిత్సచేయడంలోను. నొప్పులు, రాచపుండ్లు, క్యాన్సర్, మొదలు నివారించడంలోను, అణుశక్తినుంచిపుట్టే పదార్థాలను వినియోగించడంలోను ప్రపంచమంతటా క్రమేపి అభివృద్ధి కలుగుతూవుంది. రేడియో ఐసోటోపులు అనగా మామూలుగా దొరకే కర్బనము, భాస్వరము, అయోడిన్, గంధకము మున్నగులోహాలతో రసాయనిక పదార్థాలను అణుశక్తి రియాక్టర్లలో వేపి న్యూట్రానులతో కొట్టడంద్వారా వాటికి రేడియోధార్మికశక్తి అబ్బుతుంది వాటినే రేడియో ఐసోటోపులు అంటారు. ఇవి ఎల్లప్పుడూ రేడియేషన్ కక్కుతూ, ఎచ్చటవున్నా తమ స్థానాన్ని సూచిస్తూ వుంటాయి. అందుచేత వీటినిగుర్తించే అణువులు (ట్రేసరు ఆటమ్సు) అనికూడ అంటారు కాబట్టి వీటి రేడియేషన్ బట్టి మానవ, జంతువుల శరీరాలలో అవియెచ్చటచ్చట తిరుగుతూ వుందీ గమనించడానికి వీలుకలుగుతుంది వ్యాధి పరీక్ష పరిశోధన సందర్భాలలో ఈ రేడియో ఐసోటోపులను లోపలికి మ్రింగించుట గాని లేక ఇంజెక్షన్ద్వారా శరీరంలోకి ఎక్కిస్తారు. తదుపరివాటిగగన మార్గాన్ని గమనిస్తూ వుంటారు. ఇవికూడా చాలవరకు రేడియం, యుక్సురేలవలె పనిచేస్తాయి. వీటిని మెదటిరోగాలు క్యాన్సర్ మున్నగురోగాలకు చికిత్సలు చేస్తారు. అమెరికా మున్నగు దేశాలలో వున్న శాస్త్రపరిశోధకులు యిప్పుడిప్పుడే పరిశోధించుతున్నారు.

# ఎక్సురే

పూర్వంకు యిప్పటికి అన్ని విషయాలలోను ఎన్నో నూతన మార్పులు కలిగినాయి. ఎంతోమంది పరిశోధకులు మానవకోటిని జంతుకోటిని పీడిస్తున్న రోగాలకు చికిత్స చేయడంలోను. ఔషధ

పరిభావాలు గుర్తించడంలోను మంచి ఉత్సాహంతో ముందంజ వేయుచున్నారు. మానవుల అజ్ఞానం తొలగించబడి వైద్యవిజ్ఞానంలో ఒక గొప్ప విప్లవంలాగా వస్తూవుంది.

1840 ఆ ప్రాంతాలలో కాస్వజ్వరం వచ్చినట్టయితే ఆశలు వదులుకోవచ్చేది. ఆరోజుల్లో చిన్న చిన్న రోగాలకు కూడ తగిన చికిత్సలు లేక కోట్లకొలది జీవాలు ఆసువులు బాయవలసివచ్చేది. ఒకవంద సంవత్సరాలకిత్రం లండను పౌరులు ఇంచుమించు మన బకింగ్‌హాం కాలవలో నీరువలె దుర్గంధభూయిష్టంగా వుండే థేమ్సునదీ జలాలను బక్కెటు అర్ధణాకు తీసుకొని తాగేరంటె వారసులు ఆశ్చర్యపోవచ్చు వడపోసుకొనైనా, వడపోసుకోకుండా, నగరంలో మురికి కల్మషం అంతా కలుస్తూవుండే ఈనీటినే తాగుతూవుండేరు. ఆసంగతి యిప్పుడు తలచుకొంటే, వాళ్ళు ఆకాస్త కాలం ఏలాబతికారా అంటూ ఆశ్చర్యంతో శరీరం గగుర్పొడుస్తుంది

ఆధునిక విజ్ఞానప్రభావమా యంటూ ఎన్నో నూతనవిషయాలు తెలుసుకొంటున్నాము. మత్తుమందులు కనిపెట్టకపూర్వం శస్త్రచికిత్సలంటే రోగులకు బ్రహ్మప్రళయంగా వుండేవి మొండికత్తుల పీడవిరగడయ్యింది ఈ కత్తులకుబదులుగా సన్నని ఎలక్ట్రిక్‌తీగతో శస్త్రంచేస్తున్నారు ఈ తీగద్వారా వైర్లెస్ హైఫ్రీక్వెన్సీ కరెంటును శస్త్రంచేయవలసిన చోటికిపంపిస్తారు దానితో ఒక్కచుక్క నెత్తురైనా క్రిందపడకుండా శస్త్రచికిత్స జరిగిపోతుంది

పశువులకుకూడా వాతనొప్పులకు, బెణుకునొప్పులకు ఈకరెంటు ప్రసారంద్వారా మా కాలేజి తరఫున వున్న పశువైద్యశాలలో అమలులో పెట్టి చికిత్సలు చేస్తున్నారము.

## జంతువుల వివాద మంత్రాలు

ఎన్నోరకాల మంత్రాలు కొంతమంది మహానుభావులు ఆచరణలో పెట్టి నమ్మించిన తరువాతనే మంత్రాలంటే నమ్మకం కలిగింది. ఈ రీతిగా పశువులకు వచ్చే రొమ్ములకు ఊపిరివాపులకు, చనుకుదురు మున్నగు రోగాలకు మంత్రాలు కొందరు పెట్టుతూ వుంటారు. మంచి గేదెగాని, మంచి గోవునుగాని ఏకదృష్టితో పరిశీలించిన మెస్మరిజంవలె ఆ పశువు చన్నో పొదుగో, ఏ అవయవమో చెడిపోతుంది ఇది నా ప్రత్యక్షానుభవము దీనినే దృష్టిదోషం అంటారు ఏమైనామంచి మందులు వుంటే ఉండవచ్చునుగాని, అవి మనకు అందుబాటులో లేనప్పుడు ఈ మంత్రాలు అవసరమని తెలుసుకోవాలి మంత్రాలు ఈ కాలంలో అందరూ పెడతామంటే నమ్మవద్దు భూతవైద్యమని, పశువులకు మనుష్యులకు దయ్యాలు పడతాయని మేము నెమ్మదిచేస్తామని డాంబికవైద్యులు బయలుదేరుతారు అట్టివారిని నమ్మరాదు దైవసంభూతులై మంత్రశక్తిగల మహాత్ములున్నారనుటలో సందియము లేదు

## పశువులకు మళయాళ మంత్రాలు

మనదేశంలో మంత్ర తంత్రాలకు మలబారుజిల్లా ప్రసిద్ధి. అందుకనే మళయాళ మంత్రాలు మహత్తరమైనవంటారు. మలబారులోని ప్రతివ్యక్తికి దయ్యాలన్నా, భూతాలన్నా, మంత్రాలన్నా తగనినమ్మకంవుంది. అచ్చట భూతాలలో ఒక తెగ వుందట ఆ తెగ భూతాలను "కుట్టిచాదను" అంటారు కుట్టిచాదనులంటే భూతాలని అచ్చటవుండే చిన్నపిల్లలకు కూడా తెలుసు ఈ భూతాలను వశపరచుకోటానికి ఒక విచిత్ర ముందట 'కుట్టి-చాదను'లకు కొన్ని పదార్థాలంటే మిక్కిలిప్రీతియట. అట్టి పదార్థాలలో గేదెపాలుముఖ్యమట. పశువు ఈనగానే ముందుగా ఆపశువు పొదుగునుంచి పాలు తాగవానికి ఒక చేపాటికర్రను చేతబూని ఒక భూతం వస్తుందట ఇది

స్థూలనేత్రాలకు మాత్రము కనపడదట. కుక్క కన్నుతో తయారు చేసిన ఒక అంజనాన్ని కాటుకగా పెట్టుకుంటే కనిపిస్తుందట. పశువు ఈనగానే దాని పాలు త్రాగడానికి ఈ దయ్యం రాగానే, దానిని వశపరచుకో దలచినవారు ఆకర్రను లాక్కొని దగ్గరలోవున్న ఏ చెరువుకైనా, కాలవకైనా వారిపోయి మెడలోతునీళ్ళలో నిలబడాలట.

అప్పుడు భూతాలు నీటిలో ప్రవేశించవుగాన ఏలాంటి ప్రమాదం వాటినుంచి రాదట తన కర్ర తిరిగి యిచ్చివేయమని ఆ భూతం ఎన్నివిధాల బ్రతిమాలిన శసేమిరా అనాలట నేను చెప్పినట్లు వింటానంటే నాకు వశమై వుంటానంటే ఇస్తానని చెప్పాలట అప్పుడు విధిలేక ఆ భూతం మనం చెప్పినరీతిగా చేస్తానని చెప్పినతరువాత ఆభూతంమాటతిరిగిపోదట తిరస్కృతులైన ప్రేమికులు రాజకీయాలలో కక్షగలవారు ఈభూతాల్ని తమ ప్రయోజనాల సాధనాలకొరకు వినియోగించుకొంటారట మన పశువులు ఈనగానే గృహాంగనలు గంగానమ్మ, పోలేరమ్మకు చల్దిఅన్నంపెట్టి పూజిస్తారు. దృష్టితాళ్ళు వేయించుతారు విభూతితో జపం చేయించుతారు.

# పండొమ్మిదవ భాగము

## స్వస్థవృత్తము

జీవముగల ప్రతిప్రాణికి ఆహారమత్యవసరము. శక్తికి, ఎదుగుటకు దేహములోని అవయవాలు సరియగుపద్ధతులలో నుంచుకోవడానికి సరియగు ఆహారము అవసరము శరీరానికి కావలసిన ఆహారపదార్థాలు వివిధరకాలుగా విభజింపబడినాయి. నీరు, మాంసకృత్తులు,

పిండిపదార్థాలు, నూనెలు, విటమినులు, ఖనిజాలను గూర్చిన ముఖ్యవిషయాలు ఈగ్రంథములో తెలుపబడినాయి. నీరు, ఖనిజాలు తప్పమిగతా వన్నీ వృక్షజాతినుంచి మానవులు, పశువులు, తదితర జంతువులుతమ ఆహారముకొరకు సంపాదించుకొంటున్నారు దేహానికి వేడిమినిపుట్టించే పిండిపదార్థాలు ధాన్యములలోను, గడ్డిజాతులలోను, దుంపలలోను, అధికంగా లభించుతాయి క్రొవ్వుపదార్థాలు కూడవేడిని, సత్తువను పుట్టించుతాయి. ఇవివేరుశెనగ, నువ్వులు, ప్రత్తివిత్తులు కొబ్బరి, మున్నగువాటిలో లభించుతాయి

ఈరీతిగ [illegible] ఆయావృక్షాలనుంచి, జంతువులనుంచిలభించగలవు. ఇంకను పశువులకు శరీరవ్యాయామం, విశ్రాంతి మొదలైనవిచాలా అవసరము. మనదేశములో పశువులు ఆరోగ్యంగా వుండాలంటేతినుటకు మంచిమేత, త్రాగుటకు మంచినీరు, పీల్చుటకు మంచిగాలి పశువు చాలాకాలము బ్రతకాలంటె, పైనచెప్పిన శరీరధాతువులు, ఖనిజాలు విటమినులు కావాలి.

## శరీరధాతువులు

సమస్త జీవులకు ఆహారం ముఖ్యావసరము. పశువుశరీరములో గల మూలపదార్థాలన్ని సమానభాగాలుగల ఆహారమే సంపూర్ణమైన ఆహారము అట్టిఆహారపదార్థాలు అన్నిటిలోను జలము, జంతువృక్ష సంబంధమైన పదార్థాలు, ఖనిజపదార్థాలు వున్నాయి. ఇంకను వృక్ష సంబంధమగు పదార్థాలలో మాంసకృత్తులు, క్రొవ్వుపదార్థాలు, పిండిపదార్థాలు అనేవముఖ్యములుగా వున్నాయి. ఇవేగాక జీవనానికి [illegible] వీటన్నిటి [illegible] విటమినులు [illegible]

# నీరు

ప్రతిఆహారములోను తప్పకకొంతభాగమునీరువుంటుంది.ఎండు గడ్డిమున్నగు మెత్తటిఆహారంలో నూటికి80పాళ్ళు నీరువుంటుంది.ప్రతి జంతువు ఎముకలయందు నీటిబరువు సగంవరకూ వుంటుంది. ప్రతి దినము పశువుశరీరాన్నుంచి చెమటద్వారా మలమూత్రాలద్వారా కొన్నివందల ఔన్సులునీరు బయటకుపోతూ వుంటుంది. ఈలోపాలన్ని టిని పూర్తిచేయడానికి ప్రతివేళ నీటినిత్రాగుతూ వుండాలి. ఆహారము జీర్ణమగుటకు, మూలపదార్థాలు రక్తములో మిళితమగుటకు. మలినపదార్థాలు విసర్జించుటకు నీరుచాలా తోడ్పడుతుంది శరీరోష్ణత సక్రమంగావుండుటకుకూడా నీరుకావాలి ఈనీటివలననే వివిధరకాల గ్రంధులు వివిధరకాల రసాలను, ధాతువులను అభివృద్ధిచేస్తాయి.రక్తములో కూడా 90పాళ్ళునీరు వుంటుంది.

# మాంసకృత్తులు

వీటినే ప్రొటీనులు అంటారు ఆహారంలో మాంసకృత్తులు ముఖ్యమైనభాగాలు.కండరాల పెంపకానికి, మాంసాభివృద్ధికి,మాంసకృత్తులు అవశ్యకములు నీరసపడుతూవుండే కండరాలకు అప్పటికప్పుడే క్రొత్తశక్తిని కలిగించేపదార్థాలుకూడా ఇవియే. వీటిలోశాఖాహార సంబంధమైనవి మాంసాహార సంబంధమైనవి రెండురకాలు

శాఖాహార సంబంధమైన మాంసకృత్తులు నెమరువేయు జంతువులే ఎక్కువగా తింటాయి పాలలోని మాంసకృత్తులు పాల కొరకు పశువులు తినే ఆహారంలో చేర్చి ఈయాలి మాంసకృత్తులు ఎక్కువగా మేపితే వట్టిపోతాయి. దాణా దినుసులు ఎండుతెర జొన్న, కంది, మినుము, ఉలవ, కొబ్బరిమున్నగు వాటిలో శాఖాహార సంబంధమైన మాంస కృత్తులు ఎక్కువగా

వుంటాయి. వీటివల్ల కండరాలు, నరాలు, స్నాయువులు, మెదడు మున్నగునవి వృద్ధిచెందుతాయి. పసిదూడలకు, పాడిపశువులకు యివి అత్యావసరం.

మాంసాహార జంతువులగు సింహము, పెద్దపులి, తోడేలు, కుక్క మున్నగు జంతువులకంటె శాఖాహారులగు పశువులు, కోతి, లేడి, ఏనుగ, మేక, గొఱ్ఱె, కుందేలు మున్నగు జంతువులకు తెలివి తేటలు అధికము. మాంసాన్ని తినే జంతువుల పేగులు శాఖాహార జంతువులకు పొడవుగా వుండవు.

## క్రొవ్వు పదార్థాలు

ఇవి జంతువుల శరీరానికి అధికమయిన శక్తిని, వేడిమిని కలిగించుతాయి ఇంకను యివి గుండె మున్నగు సున్నిత అవయవాల చుట్టూ చేరి పనిచేత అరిగిపోకుండా చేస్తూ అపాయము రానీయకుండా కాపాడుతాయి జంతువులకు యిచ్చే నిత్యాహారాలలో ప్రతి రోజు మాంసకృత్తులు, ఈక్రొవ్వు పదార్థాలు కావాలి. జంతువుల శరీరములో ఈక్రొవ్వు లేనిచో చలి అధికంగా వుంటుంది. జంతు సంబంధమైన క్రొవ్వులలో ఎ, డి, విటమినులు ఎక్కువగా వుంటాయి జంతువుల శరీరములలోని క్రొవ్వు పదార్థాలలో కొన్ని వెంటనే శరీరానికి శక్తినివ్వడానికిగాను కొన్ని ధాతువుల వుత్పత్తికి ఖర్చగుతూ వుంటాయి. కొన్ని చూడిజంతువుల స్తనాలందు పొదుగులందు చర్మమందు, హృదయ కుహరమందు ఈ క్రొవ్వు పదార్థము నిలువ యుంచబడి అవసరాన్ని బట్టి శరీరానికి ఉపయోగపడుతుంది.

## పిష్టమధుర పదార్థాలు

వీటినే కార్బోహైడ్రేటులు అంటారు. మొక్కలలో వుండేనీటి పదార్థాన్ని తీసివేయగా మిగిలిన ఏడు పదార్థాలలో మూడు పాళ్ళు పిండి పదార్థాలు శరీరమునకు కావలసిన ఉష్ణము శక్తిని యిచ్చుచున్నాయి.

ఆహారపు విలువలోను జీర్ణ విషయములోను మేతలలోగల పిండి పదార్థాములలో చాలా వ్యత్యాసము వుంది. పిండి, చక్కెర త్వరగా జీర్ణమగుతుంది. ముతకైన పిండి పదార్థాలు గడ్డిఎండుగడ్డి పొట్టుగింజలు మున్నగు వాటిలో ఎక్కువ పాళ్ళు కలిగి వుంటాయి పశువుల జీర్ణ కోశములో బాక్టేరియా అనే సూక్ష్మజీవుల సహాయంతో జీర్ణమగు తుంది. అందుచేత పశువులు తక్కువ విలువగల ఆహార పదార్థాములను గడ్డిజాతులను పిండిపదార్థాలు తక్కువగానున్నను తిని జీర్ణించుకో కలుగుతున్నాయి. పనిచేయుటకు పశువులకు శక్తని ఈయాలంటే ఈకార్బో హైడ్రేటులే మూలాధారము. శరీరమందలి క్రొవ్వునృత్తికి, పాలలోని క్రొవ్వుపదార్థానికి ఇవిచాలా అవసరం.

## ఖనిజలవణాలు

పశువులుతినే ఆహారాన్నిబట్టి, వయస్సునుబట్టి శరీరఆరోగ్యా నికి ఈలవణాలు అత్యవసరము. మూడుపశువులు తమపిండాలనుపోషించు కొనడానికి ఎముకలను గట్టిపరచడానికి కాల్షియం, ఫాస్ఫేటుకావాలి. రక్తాన్ని చక్కనిదారిలో వుంచుటకు, ఎరుపురనాన్న కలిగించుటకు, ఇంకను హృదయకోశం వూపిరితిత్తులద్వారా బొగ్గుపులుసుగాలి బయ టకు పంపే స్థితికలగడానికి. తిన్నమేతజీర్ణంకావడనికి. పేగులలోవిష పదార్థాలు చేరకుండా వుండడానికి,మరికొన్నిగ్రంథులుపనిచేయడానిక ఈలవణాలు చాలాఅవసరం ఇనుము, సున్నం,భాస్వరం, అయోడినులుతది తర లవణాలకంటె శరీరానికి ఒంటబట్టుతాయి

## కాల్షియం

పశువు సీరములో ముఖ్యమైంది కాల్షియం ఒకటి. కాల్షియం అనగా సున్నం ఎముకలకు, దంతాలకు కండరాలు ముడుచుకోన డానికి, శరీరపనులు నిర్వహించడానికి, నరాలు చురుకుదనముకలగడానికి ఈ లవణం అత్యవసరం.దూడలు పుట్టినతరువాత ఎముకలు మొత్తబడి

సాగుతూవుంటాయి తల్లి పాలనుంచి కాల్షియం గ్రహించి ఎముకలు గట్టిపడతాయి దంతాలు మొలుస్తాయి, చూడిపశువులకు ఈ లవణం లేకపోతే దూడఎముకలు పెరుగక సన్నకాళ్ళు, సన్నమెడ, అంగ వైకల్యాలు గలిగి వికృతాకారం ఏర్పడుతుంది

ఈ లవణం లేకపోవుటవల్ల పశువుఎక్కువగా ఆయాసపడుట' అప్పుడప్పుడు కాళ్ళు ఎగలాగుట, శరీరంపై గ్రంథులుపుట్టుట, చర్మం పొలుసు లేచుట, బిరుసెక్కుట, కళ్ళమిరి తిరుగుట, కొమ్ముల చివర భాగమందు ప్రాతపడాయుట, మెత్తగాళ్ళపడుట నరములు బలహీనత జెందుట మున్నగురోగాలు కలుగుతాయి. ఈ లవణంవల్లనే రక్తం పల్చబడకుండ పెరుకొంటూ వుంటుంది ఎముకలు దంతాలుదీని వల్లనే తయారగుచున్నవి

## అయోడిన్

శరీర అవయవాలకు చురుకుదనం గలిగించుటకు అయోడిన్ అతిముఖ్యం పశువుమెడయందుండే థయిరాడ్ అనే కోశంలో ఈ అయోడిన్ భద్రపరచబడి యుంటుంది పశువుతినే ఆహారమునుండి ఈ లవణంతీసికొని రక్తానికి అందియబడుతుంది. రక్తంతగినంతవడిగా వ్యాపించుటకు, చర్మం నునుపుగా వుండుటకు వీర్యవృద్ధికి ఈ అయోడిన్ అవసరమైయుంది ఇదిమంచి వేడిమిని కలిగిస్తుంది. గాలిలో మాత్రం త్వరగా తయ్యారంలాగా హరించిపోతుంది. అందువేత మన ఉష్ణదేశ పొలాలలో పండేపంటలలో ఈ లవణం తక్కువగావుంటుందని శాస్త్రజ్ఞులు నిర్ణయించారు. పశువుమేత మేయునపుడు కరిక్కుట నోరువాసన యుండుటకూడ ఈ లవణం లేకపోతే రావచ్చు. నోటినుంచి జిగురుపదార్థముఊరుట, ఉపిరివాపులు, గంగడోలుక్రిందవాపు, చర్మరోగాలు,తూలుట, మున్నగు లక్షణాలు ఈ లవణం లేకపోతే కలుగుతాయి,

## ఇనుము

పశువులకు ఈలవణం ప్రధానమైంది. రక్తానికీ ఎరుపురంగురావాలన్నా, ప్రాణవాయువును పీల్చాలన్నా, రక్తంలోను, శరీరంలోనూవున్న జీవాణువులన్నీ పెరగాలన్నా, నేత్రాలు తేజస్సుగా వుండాలన్నా ఈ లవణం చాలాఅవసరం. చూడిపశువులు రెండు నెలలకు ఈనుననగా ఈ ఇనుము చాలాఅవసరం గుండెకు, పేగులకండరాలకు ఇదిమంచిశక్తిని యిచ్చుతుంది

రేజీకటి, నీరుచురుకు, పాండురోగము, ఎండువాతము, చర్మరోగాలు, గుండెవగర్పు, మొదలైనరోగాలు ఈలవణంలేకపోతే కలుగుతాయి

## సల్ఫర్

దీనినేగంధకమంటారు. అన్ని జంతువుల వెంట్రుకలలో, గోళ్ళలో, డెక్కలలో ఇదికలదు. శరీరంలో వేడిమి చురుకుదనము కలిగియుండుటకు తప్పకఈగంధకముకావాలి ఇదిలేనియెడల కండ్లజబ్బులు, కోపము, తాపము, చిరుబుస్సు, మెడజబ్బులు కలుగుతాయి.

## మ్యాంగనీస్

ఈలవణంకూడా రక్తకణాల ఉత్పత్తికి తోడ్పడుతూవుంటుంది. ఇదితక్కువైన చెవిరోగాలు, మందబుద్ధి, నరాలబలహీనత, పక్షవాతం, పొట్టలో గాలిచేరుట కలుగుతాయి

## క్లోరిన్

శరీరంలో పేరుకునే మష్టపదార్థాలను తీసివేసే గుణముదీనిలో వుంది. అవయవాలసంధులకు మంచిశక్తినిచ్చే గుణముకూడావుంది. ఈలవణంలేకపోతే కీళ్ళనొప్పులు, కీళ్ళవాపులు మూత్రరోగాలు, దంతవాపులు, చిగుళ్ళవాపులు వగైరా కలుగుతాయి.

## సిలికన్

ఈలవణం పొటాషియంతో కలిసివుంటుంది. మూత్రంతో పీర్యంపడుట, దగ్గు, కంతులు, వ్రణాలు, నాడీనీరసంగా నుండుట ఈ లవణం లేనిచో కలుగుతాయి.

## రాగి

ఈలవణం లేకపోతే చర్మరోగాలు తప్పక కలుగుతాయి.

## ఫోరిల్లి

ఈలవణం తక్కువైతే దంతాలు, కొమ్ములు, గిట్టలుబలహీనత నొందుటగర్భకోశంలో పుండ్లుపుట్టుట, ముక్కు-పీనస ముసుబంతి, కండ్లు పుసులుకట్టుట జరుగుతాయి

## సోడియం

ఈలవణం పశువుశరీరమంతటా వుంటుంది గుండెసరిగాపని చేయుటకు ఈలవణం బాగా తోడ్పడుతుంది. జీర్ణకోశంలోని జఠరరసం పనిచేయుటకు, రక్తభాగాలను పెంపొందించుటకుఈలవణం కావాలి. ఇది లేనియెడల అస్థిరకముల వాతాలు, దొమ్మలు, అంటురోగాలు, కలుగుతాయి.

## పొటాషియం

కండరాలకు బలమునిచ్చేలవణం పొటాషియమని గుర్తించుకోవాలి. ఇదిలేనియెడల కండరముల బలముతగ్గుట, అవయవములు స్పష్టిలేకుండుట ఎప్పుడుశరీరమునిక్కాకగానుండుట, నల్లకప్పువేయుట తరచు అంటువ్యాధులు కలుగుట జరుగుతాయి.

## భాస్వరము

పశువుల శరీరభాగాలన్నిటిలోను ఈలవణమువుంది. ఇది లేని యెడల ఈనుప్పు, మూర్ఛ, హిస్టీరియా, కుండెటి వెర్రిమున్నగురోగాలు పుట్టుతాయి. రక్తములోని కొన్ని విషపదార్థాలకు ఇదివిరుగుడుగా పని చేస్తుంది.

# విటమినులు

నేడు ఏఆహార శాస్త్రాలు చూచినను విటమినుల ప్రాశస్త్యం విశేషంగా కనబడుతూ వుంది. విటమిన్ అనునది ఆంగ్లపదం దీనికి తెలుగులో ప్రాణకృత్ లేకజీవనీయము అంటారు. ఇవిప్రకృతిసిద్ధమైన ఆహార పదార్థాలలో వుంటాయి పశువులు ఆరోగ్యంగా వుండడానికి అవితినే ఆహారాలలో జీవశక్తిని యిచ్చే కొన్ని పదార్థాలువుండితీరాలనీ నవీనపశుశాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు కృత్రిమంగా తయారు చేయబడే మాంసకృత్తులు, క్రొవ్వులు, కార్బొహైడ్రేట్సు,లవణాలు ఎంతఅధికంగా వాడినాసరియగు పెరుగుదల నొందక శుష్కించి పోతాయి కాబట్టి అవితినేఆహారంలో జీవనశక్తి యిచ్చేకొన్నిముఖ్య పదార్థాలు కావాలి. వీటినే విటమినులుఅంటారు ఈవిటమినులువున్నప్పటికి తక్కినపదార్థాలు లేకపోతే ప్రయోజనము లేదు. పశువులకు యిచ్చే అహారపదార్థాలు జీర్ణమై శరీరపోషణకు పనికిరావడానికి ఒక్కొక్క రకపు విటమిను ఒక్కొక్కరీతిగా ఉపయోగపడుతుంది ఇవి శరీరంలో వుండే ఆయాగ్రంధులు ఆయారసాలను వుత్పత్తిచేస్తూ వుంటాయి. సృష్టిజాలమందు వృక్షజాలానికిమాత్రమే ఈవిటమినులు తయారుచేసేశక్తివుంది పచ్చనిఆకులపైసూర్యరశ్మిపడుటవల్ల ఈవిటమినులు ఉత్పత్తియగుతాయి. పచ్చిగడ్డి తినేఆవుపాలలోను, పచ్చని నాచునుతినే చేపలలోను విటమినులు ఎక్కువగా వుంటాయి. పచ్చిక తినే ఆవుపాలలో ఏ విటమిను ఎక్కువగా వుంటుంది ఇంతవరకు 15 రకాల విటమినులు వున్నవని పరిశోధకులు తెలుపుచున్నారు ఏ విటమిను డి విటమిను ఆహారంద్వారానే సప్లయి చేయవలసివుంది. కాని బి. కాంప్లెక్సు, సి, విటమినులు పశువులుతమశరీరంలోనె ఉత్పత్తి చేసుకొంటాయి. మనదేశములో సూర్యరశ్మికి కొదువలేదుగాన విటమిను డి కొరవలేదు. విటమిన్ ఏ మాత్రము అవసరము.

## విటమిను ఏ

పశువు దేహంలోవుండే పొరలన్నింటని రోగక్రిములు చేరకుండా కాపాడుతూవుంటుంది ఇది పెరుగుటకు, సంతానోత్పత్తికి,

యుక్తవయస్సు చెందినపశువుల పోషణకు యీవిటమిను చాలా అవుసరం. పచ్చిమేతలో యిదివిరివిగా కనబడుతుంది ఇంకను పచ్చి మేతలోగల కారొటిన్అను పదార్థము పశువుల జీర్ణకోశములో విటమిన్ ఏ. గా మారుతుంది ఇంకను కారొటిన్ పెరిగే ప్రతిమొక్క భాగములోనువుంటుంది. కాబట్టి పీళ్లలో విటమిన్ ఏ విలువహెచ్చు, గుమ్ముపాలలో మాత్రము విటమిన్ ఏ. హెచ్చుగావుంటుంది అందు చేతనే కూడ పుట్టగానే ముర్రుపాలు త్రాగింపుతారు. ఈ విటమిను తక్కువైతే నేత్రాల హీనత, రేచీకటి వెలుతురులో చూడలేక పోవుట, ఎముకలు సరిగా ఎదగకపోవుట, చర్మదూడలు పుట్టుట, పిండము వృద్ధిగాక ఎండుకుపోవుట మొదలగునవి సంభవించుతాయి ఈ విటమిను చమురుపదార్థాలలోను, పచ్చిగడ్డిలోను, వృక్షసంబంధ మైన ఆహారపదార్థాలలోను, లేతమొక్కలలోను, ధాన్యము, పచ్చ జొన్నలు, గోధుమలు, శనగలు, వోట్లు, రాగులు, మినుములు. పెసలు, మొక్కజొన్నలు, ప్రత్తిగింజలు, ఎండిన జనుపకట్టె, తవుడు, దుంపలు మున్నగువాటిలో వుంటుంది

బి. విటమిను పప్పులుదాణాదినుసులు, గోధుమలు, తవుడు మున్నగు పదార్థాలలోవుంటుంది. ఇదిలోపించితే చర్మరోగాలు, విరేచనాలు, మలబద్ధకం, జ్ఞానతంతురోగాలు రాగలవు.

సి. విటమిను మొలకధాన్యాలలోను, కూరగాయలలోను, పెద్దఉసరికలోను వుంటాయి ఇది లోపించితే దంతరోగాలు. కీళ్ళ నొప్పులు, ఎముకలు పటుత్వం తగ్గుట, చర్మరోగాలు కలుగుతాయి.

డి విటమిను చమురు పదార్థాలలోను, ఎండిన గడ్డిలోను, పాలలోనువుంటాయి. ఇవి లోపించితే ఎముకలకు సంబంధించిన రోగాలుకలుగుతాయి వీటిలో 15 వున్నప్పటికి ముఖ్యమైన వాటినే తెలిపితిని,

# ఇరువదవ భాగము

## నర్సింగ్

రోగపశువును కాపాడే మగ మనిషిగాని, ఆడమనిషి గాని ప్రభుత్వ డెయిరీఫారాలలోను, ప్రయివేటు డెయిరీఫారాలలోను, పాల సప్లయి ఫారాలలోను కొంతజీతమిచ్చి నియమిస్తారు ఈపద్ధతి చాల మంచిది. పెద్దపెద్దపశువైద్యశాలలోకూడా ఈనర్సులనుఏర్పరుచుటచాల మంచిది. మానవ సేవచేసే నర్సుల మాదిరిగానే జంతుసేవ చేసే నర్సులుకూడా చక్కని పరిశుభ్రమగు దుస్తులను ధరించునట్లుచేసిన రైతులుకూడా తనపశువుల ఆరోగ్యాన్ని కాపాడే చురుకుదనం కలుగుతుంది ఈనర్సులను రైతులు చాల గౌరవముగా చూస్తారు ఈనర్సులు మాత్రము పసిదూడలకు పాలుపోయుట, పాలుకుడుపుట, మంచి పశువులను బ్రష్షులతో తుడిచి చర్మాన్ని శుభ్రపరచుట, మలబద్ధకము లేకుండా కాపాడుట, అవసరముంటే మందులుపోయుట, రోగపశువులను ఏ పూట కాపూట ధర్మామీటరుతో జ్వరాన్ని కొలచుట. ఎన్నిపాలు కుడపాలో ఎన్నిపాలు తగ్గించాలో పరీక్షించుట మున్నగు విషయాలు గుర్తుంచుకొని గోమాతకు సేవ చేయాలి. అందుకనే మా ఆంధ్ర జాతీయ పశువైద్య కళాశాలలో గ్రామపశు సేవక్ తరగతులనేర్పరచి ఎంతోమంది పురుషులను కొంతమంది స్త్రీలకు తర్ఫీదు యిచ్చి గ్రామాలకు పంపుట తమ కెల్లరకు తెలిసిన విషయమే. ప్రభుత్వం మాత్రము ఈనర్సింగ్ విషయమై తగిన ప్రోత్సాహ మీయాలి.

## రోగం అంటే ఏమిటి?

పశువు ఈనిన తరువాత దూడ భూమిమీద పడి కను తెరచి అంభాయని అరచినప్పటినుంచీ మలబద్ధకం, పాలఅజీర్తి, వేధిస్తూనే వుంటుంది అందుచేత "వాతాపి జీర్ణం వజ్రశరీరం" అని దూడలకు ఆముదము పెడుతూ వుంటారు. ఇంకను దూడలకు వచ్చే అంటురోగాలు పోవాలనీ, రాకుండా వుండలనీ సాంబ్రాణి గుగ్గిలపు ధూపాలు పశుశాలలలో వేస్తూవుంటారు రోగాలు మానవులకు పశువులకు అనాది నుంచీ వేధించుట ఎల్లరకు తెలిసిన విషయమే అసలు రోగం అంటే ఏమిటో అనే విషయం తెలుసుకోవాలంటే మనం అనేక శతాబ్దాలు వెనుకకు వెళ్ళాలి మొదట రోగం అంటే ఒక దయ్యమో, భూతమో అని భయపడేవారు ఇప్పుడుకూడ మలయాళ దేశంలో ఈ తంతులు ఎన్నో చేస్తూవుంటారు. ఇంకను ఒక మహత్తరశక్తిగల అమ్మవారో, మహంకాళో, గంగానమ్మో పోలేరమ్మో అనుకునేవారు. కొబ్బరికాయలు కొట్టేవారు మేకలను బలియిచ్చేవారు, కోళ్ళను కోసేవారు. పోలేరమ్మకు నైవేద్యాలు పెట్టేవారు ఊరిబయట పెద్ద మట్టిబొమ్మలు చేసి కుంభాలుపండి ఏవేవో మంత్రాలు చదివేవారు తరువాత కొంతమంది మహాశయులు, ఆరితేరిన శాస్త్రజ్ఞులు మానవరోగాలకు, జంతువుల రోగాలకు ఒకముఖ్యమైన కారణం ఉంటుందని తెలిపారు. పశువుల అలవాట్లకూ, శరీరతీరుకూ, వాతావరణానికి, వ్యాధికి సంబంధము వున్నదని వారిఅభిప్రాయం. మరికొన్ని సంవత్సరాలు గడచిన తరువాత కొన్ని చిన్న చిన్న కణాలుంటాయని, అవి నోటి ద్వారానో, ఏ ఇతరమార్గాల ద్వారానో శరీరంలో పలికి ప్రవేశిస్తే వ్యాధికలుగుతుందని కొందరన్నారు.

## సూక్ష్మక్రిములు

ఇవన్నీ అయిన తర్వాత తెలుసుకొన్నది పశువుల రోగాలకు క్రిములే కారణమని తేలింది ఈ క్రిములు సర్వాంతర్యామి. ఇవి ఇందు గలవు అందు లేవని సందేహము లేదని తేలింది. ఈ క్రిములు పశువులు

పీల్చేగాలిలో తినే ఆహారపానీయాలలో ఉన్నాయి ఇంకను త్రాగే నీటిలో ఉన్నాయి మనం వున్న భూమిలో ఉన్నాయి నిజానికి క్రిములు లేని చోటు లేదు. అయితే యిన్ని వున్నా మానవులకు, పశువులకు హానికలిగించేవి మాత్రము కావు. కొన్ని ఉపయోగకరమైనవి కూడా వున్నాయి. కాయలు ఫలాలు అవుతున్నాయి. పాలు పెరుగు అవుతూ వుంది. అట్టి లాభకరమైన మార్పులకు కారణం ఒకవిధమగు జీవాణువులే. ఏ వ్యాధియైనా వ్యాపించడానికి మొట్టమొదట ఒక మూలస్థానం వుండాలి. ఆ మూలస్థానంలో క్రిమి వుండాలి ఆ క్రిమికి తీవ్రత వుండాలి, పశువు శరీరంలో దీనిని ఎదుర్కొనే శక్తి వుండాలి. సూక్ష్మక్రిములు దేహాన్ని ప్రవేశించినప్పుడు పశువు శరీరంలో జరిగే సంఘటనలు తమాషాగా వుంటాయి శతృవులు రాజ్యాన్ని ప్రవేశించి కోటను ముట్టడించడానికి ప్రయత్నిస్తే ఏమి జరుగుతుంది? రాజ్యంలోని సైన్యం సిబ్బంది సిద్ధమై శతృవులను ఎదుర్కొని పోరాడుతారు. అదే విధంగా పశువు శరీరంలో కూడా క్రిములు రక్తాన్ని ప్రవేశిస్తాయి. రక్తంలో ఎర్రకణాలు, తెల్లకణాలు వుంటాయి. వ్యాధులలో తెల్లకణాలు ముఖ్యమైన పాత్రలు వహిస్తాయి. తెల్లకణాలు సిపాయిలలాగా తయారై క్రిములను ఎదుర్కొంటాయి. అయితే ఈ క్రిములతో ఒక పెద్ద చిక్కు వుంది.

ఇవి శరీరంలో ప్రవేశించి నప్పటి నుంచీ కూడా ఇవి విపరీతంగా పుట్టి పెరుగుతాయి రెండు నాలుగై, నాలుగు ఎనిమిదై, ఎనిమిది పదహారై ఈ రీతిగా విధి విరామము లేకుండా వుత్పత్తి అవుతాయి. ఒక్క రోజులో ఒక్క క్రిమిలో నుంచి కొన్ని కోట్ల క్రిములు తయారవుతాయి యింద్రజాలం లాగా పెరుగుతాయి యివియిట్లు పెరుగుతూ వూరికే వుండవు. వీటిలో కొన్ని విష పదార్థములను తయారు చేస్తాయి యీ సూక్ష్మజీవులు సామాన్యంగా కంటికి కనపడనంత చిన్నవిగా వుంటాయి యివి సన్నని సూది మొనలో కోట్ల కొలది క్రిములు యిమిడి వుంటాయి. వీటిని మనం సూక్ష్మదర్శిని సహాయంతో చూడవచ్చును. దీనిని ఉపయోగించి చూస్తే క్రిములు

తదితర వస్తువులలో ఎన్నో క్రిములు పెద్దవిగా కనబడతాయి. యిట్టి క్రిములను చూడడానికి మనం రక్తం కానీ చీముకానీ, కఫంకానీ పరీక్షించవచ్చు. ఈ క్రిములలో కొన్ని చిన్నచిన్న పుల్లలు గాను, మరికొన్ని చిన్నవిగా గుండ్రముగా వుంటాయి. కొన్ని రోగాలను కలిగించే వ్యాధి బీజాలు వృక్ష జాతికి చెందినవి. యివి కొన్ని రకాల చర్మరోగాలను కలిగిస్తాయి.

## సూక్ష్మజీవులు

పశువులరోగాలు అనేకరీతులుగా వుంటాయి. కొన్నిరోగాలు అవయవాలు తమతమ నియమిత పనులను నెరవేర్చని కారణాన కలుగుతాయి మరికొన్ని శీతోష్ణస్థితి భేదాలవల్ల కలుగుతాయి. పెద్దరోగము, దొమ్మ, గురక, కురమ, మున్నగురోగాలు ఒకపశువు నుండి మరియొక పశువునకు అంటుకొనేరోగాలు. ఇవి కంటికగుపడని




ఎర్రకణములు, తెల్లకణములు, క్షయ, గాలికుంటు, దొమ్మ, పెద్దరోగాలను కలిగించు సూక్ష్మజీవులు

సూక్ష్మజీవుల వలన కలుగుతున్నాయి వృక్షాలలో ఒక్కొక్క చెట్టునకు ఒక్కొక్క జాతి బీజముంటుంది. ఆబీజము ఏప్రదేశములో పడితే ఆప్రదేశానుసారం నేలశక్తి, వాతావరణం అనుకూలిస్తే మొలకెత్తుతుంది.

అలాగే అంటు వ్యాధులకు ఒక్కొక్క వ్యాధిని వ్యాపింప జేయడానికి సూక్ష్మజీవులు బీజము లగుచున్నాయి. ఒక జంతువునుండి వేరొక జంతువునకు వ్యాపించే వ్యాధిని అంటువ్యాధి యనబడుతుంది ఒకేవిధమగు లక్షణాలు కలిగిన రోగము ఒకేవిధమగు సూక్ష్మజీవి వలన కలిగిన రోగము ఒకవిధమగు సూక్ష్మజీవివలన కలుగుచున్నట్లు దృఢపడినది. పెద్దరోగపు విత్తనము నాటిన శరీరమున పెద్దరోగపు లక్షణములే కనపడును గాని గురక లక్షణాలు కనబడవు ఒకపశువునుండి మరియొక పశువునకు అంటు వ్యాధి వ్యాపించవలెనన్నచో ఈక్రింది పరిస్థితులు అనుకూలపడాలి.

1. వ్యాధిని కలగ జేయుటకు తగిన తీవ్రతగల సూక్ష్మజీవుల సమూహము.
2 వ్యాధిని కలుగచేయుటకు చాలినన్ని సూక్ష్మజీవులను ఒకప్రదేశము నుండి మరొకప్రదేశమునకు గొనిపోగల సాధనము
3. సూక్ష్మజీవులు సులభముగ ప్రవేశించుటకు అనుకూలమైన శరీర క్షేత్రము

పైపరిస్థితులెంత పూర్తిగా అనుకూల పడితే అంతత్వరలో దగినంత తీవ్రతతో వ్యాధి ఒక పశువునుండి మరియొక పశువునకు వ్యాపింపగలదు.

## అంటువ్యాధులవ్యాపకము

ఒక ప్రాంతమునుంచి మరియొక ప్రాంతానికి అంటువ్యాధులు వ్యాపించడానికి ఆప్రాంతములో కలిగే మనుష్య సంచారము, జంతు సంచారమే కారణాలు. పశువులు మేతకొరకు దూరదేశానికి పోవుట, చచ్చిన జంతువులమాంసమును మాదిగవాండ్రు వేరొక ప్రదేశానికి తీసికొని పోవుట, కాకులు, కుక్కలు అంటు జాడ్యముగల జంతువు మాంసము ఎత్తుకొనిపోయిఅక్కడక్కడ పార వేయుట. అంటువ్యాధులు

గల పశువును సంతలకు తీసికొని పోవుట వచ్చిన పశువులను పాతి పెట్టక నదులలో పారవేయుట మున్నగు కారణాలవల్ల అంటు వ్యాధులు వ్యాపిస్తాయి

## సూక్ష్మజీవులకు కారణము ఈగలే

కొన్ని ఈగలు కరచి రక్తము పీల్చుతాయి. ఇవి నీటిలో ఎక్కువగా వుంటాయి మరికొన్ని ఈగలు కరవకుండగనే ఆజంతువుల శరీరము మీది పుండ్ల రసినిగాని, ఎండిన పుండ్లరసినిగాని లేక కుళ్ళు పదార్థమునుగానిఆహారముగా తీసికొంటాయి. ఇంకను యివి ఎరువులో కుళ్ళిన మాంసాదులలో లేక జీవించియున్న జంతువుల మాంసకండరములలో ఉత్పత్తియగుతాయి. ఈగలు వాటికాట్లు దురదనుపుట్టించుటయే గాక దొమ్మ, పెద్దపాండు మున్నగు అంటు వ్యాధులు కలిగించుతాయి ఈగలు నొప్పికలుగజేయు కాట్లను వేస్తాయి. అందువలన గాయముల నుంచి రక్తము కారుతుంది. అందుచే యింక ఎక్కువగా ఈగలు జేరి రక్తమును నష్టపరచుతాయి కాబట్టి ఈగలను చంపే సూత్రాలు కనిపెట్టాలి.

## సూక్ష్మ జీవుల ప్రవేశము

శరీర చర్మము పైభాగమున నున్నంత వరకు సూక్ష్మజీవులు ఎట్టి హానిని కలిగింప జాలవు ఏదోయొకరీతిగా ఇవి శరీరములోపల ప్రవేశించినపుడే రోగమును కలుగజేస్తాయి

గాయములద్వారా, నోటిద్వారా. శ్వాసకోశములద్వారా శరీరమందలి పలుచని పొరల ద్వారా కొన్ని సూక్ష్మజీవులు వీనిలో నేదోయొక మార్గమున ప్రవేశించు తాయి. మరికొన్ని రెండు మూడు మార్గముల ద్వారా ప్రవేశించుతాయి.

## గాయాలద్వారా

పిచ్చికుక్క కరచుట చేతకలిగే వ్యాధికి కారణమగు సూక్ష్మ జీవి గాయము ద్వారా దొమ్మ, గురక రోగాలను కలిగించే సూక్ష్మ

జీవి కూడా గాయముల ద్వారా ప్రవేశించుతాయి ధనుర్వాతమును కలిగించు సూక్ష్మ జీవి కుళ్ళుపుండ్లలో చీముపుట్టించు సూక్ష్మజీవి యిట్లే ప్రవేశించుతాయి కురపను కలిగించు సూక్ష్మ జీవి దోమల వలన ప్రవేశించుతుంది

## శ్వాసకోశాలద్వారా

సూక్ష్మజీవులు ఊపిరితో పాటు శ్వాసకోశాలలో ప్రవేశించి వాని యందలి పలుచని పొరలలో నివాసమేర్పరుచుకొని రోగాన్ని కలిగించుతాయి. గాలివలనవ్యాపించే మశూచి, విషజ్వరము మున్నగు వ్యాధులు వానికి కారణములగు సూక్ష్మజీవులను ఊపిరిచే పీల్చుట వల్లనే కలుగుతాయి.

## పలుచనిపొరలద్వారా

పశువు నోటిలోపలా మర్మాంగయవము లందూ ఆసన ద్వార మందుగల మృదువైన పలుచని పొరలద్వారా గాయము లేకున్నానూ సూక్ష్మజీవులు లోనికి ప్రవేశించి రోగాలను కలిగించుతాయి. కంటి లోని పలుచని పొరలలో సూక్ష్మజీవులుచేరుట వలన కండ్లకలకయు, ముక్కు రంధ్రములందు సూక్ష్మజీవులు ప్రవేశము వలన పీనసరోగము కలుగుతాయి

## నోటిద్వారా

ఆహారపానీయాలతో సూక్ష్మజీవులునోటిద్వారా జీర్ణకోశమున ప్రవేసించి వ్యాధులను కలిగింతాయి వీనిలో పెద్దరోగము, పారుడు రక్తవిరేచనములకు. సూక్ష్మజీవుల సంపర్కంవలన నకవికాలుగా కల వచ్చును పెద్దరోగముచే బాధపడిన పశువు మల మూత్రములలో తత్కారణములగు సూక్ష్మజీవులు రోగము విడిచిన కొంతకాలమువరకును విసర్జింపబడుతాయి. వీనికే బాధ [illegible] తీసుకొని రావచ్చును.

మలమూత్రములపై వ్రాలిన ఈగలు దోమలు సూక్ష్మ జీవులను తోడ్కొనివచ్చి,జావ, గుగ్గిళ్లుపచ్చిగడ్డిమున్నగుఆహారపదార్థములందు చేర్చుతాయి. క్షయవ్యాధిగల ఆవులపాలద్వారా ఆవ్యాధిసూక్ష్మ జీవులు పాలనాహారముగా గొనుచున్నపిల్లల శరీరమున ప్రవేశించి క్షయవ్యాధిని కలిగించుతాయి.

# ఇరువదియొకటవ భాగము

## అంటురోగాలు

## అంటువ్యాధుల పట్టిక.

| వ్యాధి పేరు | అంటెడి కాలము | వ్యాధి నిర్ధారణయగు దినము | పశువును బహిష్కరింపవలసిన కాలము |
|---|---|---|---|
| పెద్దరోగము | 2 దినములు మొదలు 8, 12 వరకు | జ్వరమువచ్చునతరువాత మేతవేయుచుండుట | పారుడు శాంతముగా కట్టిన వార [illegible] ములవరకు |
| దొమ్మ | 2 మొదలు 3 దినములు | నోటివెంట చొంగ పడుట | పశువు మేత తినువరకు |
| గురక | 24 గంటలు | గురక పెట్టుట | సామాన్యముగా చికిత్సను లొంగదు |
| జబ్బవాపు | 2 దినములు | జ్వరముతగిలి వాపుకనబడుట | పశువు మేత తినువరకు |
| కురమ | 2 మొదలు 5 దినములవరకు | అతితీవ్రమైన జ్వరము కలిగికాళ్ళుపట్లుబట్టుట | పశువు మేత తినువరకు |
| గాలికుంటు | 24 గంటల నుండి 7 దినములవరకు | తీవ్రమైనజ్వరము, పుండ్లు పడుట | పుండ్లు మాని మేత తినువరకు |
| క్షయ | 10 దినములనుండి కొన్ని వారముల వరకు | దగ్గు, కళ్ళిపడుట | దగ్గు కట్టువరకు |
| మసూచి | [illegible] నుండి 5 దినముల వరకు | తీవ్రమైనజ్వరము, రసి కుండలు పోయుట | పొక్కులన్నియు ఊడిపోయిన తరువాత ఒకవారము వరకు |
| కల్లవాపు | 2 నుండి 18 దినము2వరకు | వాపులు వాచును | వాపులు తగ్గి మేతమేయువరకు |

# పెద్దరోగము

దీనినే పెద్దరోగము, కింక, చీడపారుడు, సరకు, కలరా, అమ్మవారు, గొట్టాలమ్మా, విషజ్వరమనీ ఆయా దేశభాషలను. వాడుక పేర్లతో పిలుస్తారు




గ్రామాలలో ఈవ్యాధి లేకుండా నూతనముగా ఏపశువునకో తదితర జంతువులవల్లసోకినప్పుడు రోగనిదానాన్ని గ్రహించుటచాలా కష్టము. అందువలన వ్యాధిలక్షణములు జాగ్రత్తగా పరిశీలించితగిన సేవ చేయుదురుగాక. ఆంగ్లేయ వైద్యసిద్ధాంతమునందు ఈవ్యాధికి టీకాలుతప్ప వేరేమందులు లేవని తెలిపారు వారి దేశములో సరియగు చికిత్సలు లేవేమోగాని మనదేశములో చక్కని మూలికాప్రభావాల వల్ల వ్యాధిని నెమ్మదింప జేయవచ్చుననియు నాయభిప్రాయం

## స్వభావము-వ్యాపకము

మానవజాతికి కలరాయెటువంటిదో పశుజాతికి ఈ పెద్దరోగము అటువంటిది. పశువులకు సంభవించే వ్యాధులలో ప్రమాదకరమైంది ఈవ్యాధి ఒకవిధమగు సూక్ష్మజీవులవలన కలుగుచున్నది. ఈసూక్ష్మ జీవులు సాధారణముగా గాలిమూలాన పశువుశరీరములో ప్రవేశించు తుంది దొమ్మ, గురక, జబ్బవాపు మున్నగువ్యాధులను కలిగించు సూక్ష్మజీవులవలె గాక ఇవిమరొక విధముగా వుంటాయి ఈవ్యాధి కలిగించే సూక్ష్మజీవులను నీడలో వుంచితే రెండుదినాలవరకు బ్రతుకు తాయి. ఈజీవులకు సూర్యోష్ణత సోకినపుడు 12గంటలలోగా చని పోతాయి. ఈసూక్ష్మజీవులు వ్యాధితగిలిన పశువునుంచి రెండుపర్లాం గుల దూరము వరకు వ్యాపించుతాయి. వ్యాధితగిలిన పశువురక్త మందు, మాంస ంతరములందు పేగులయందు, ఎముకలయందు ఈ జీవులాక్రమించుకొనివుంటాయి కనుక జబ్బుతో వున్న పశువుల మల మూత్రములు విసర్జించిన ప్రదేశములందెల్లెడలా ఈవ్యాధివ్యాపించు తుంది. అందువలన జబ్బుగానుండే పశువులను మంచిపశువులనుంచి విడదీయాలి

ఈవ్యాధి నెమరువేయుజంతువులకు గొర్రెకు, మేకలకు,పందు లకు, దుప్పులకు, పక్షులకుకూడా సోకుతుంది.

## వ్యాధిసోకుట

ఈరోగముతో వుండే పశువులను మంచిపశువులు నాకుటచేత రోగపశువుయొక్క మలమూత్రములు, చొంగబడిన మేత వగైరాలు మంచిపశువులు తినుటచేత, తగిలిన పశువుల కుపయోగించు తొట్లు, మట్టి పాత్రలు మున్నగునవి మంచి పశువులు వాడుటచేత మాదిగ చాండ్రు తమబంధువులకు ఈవ్యాధి తగిలిన పశువుల మాంసమును పంపించుటచేత ఈవ్యాధితగిలిన గ్రామములద్వారా మంచిపశువులను సంతలకుగాని బంధువుల యిండ్లకుగాని తోలుకొని వెళ్ళుటచేత గ్రద్దలు గొర్రెలు, కుక్కలు. కాకులు మొదలగు అల్ప జంతువులు

ఈవ్యాధిచే చనిపోయిన పశుమాంసము నచ్చటచ్చట తినుచు విడచుటచేత వ్యాధిగల పశువులను స్టీమర్లలోనుంచి తదితరప్రాంతాలకు పంపుటచేత చచ్చిన పశువులను పాతిపెట్టక పోవుటచేత ఈవ్యాధి సోకిన ఆవు, గేదె మున్నగు పశువులను మగపశువులు దాటుటచేత ఈ వ్యాధి సోకుతుంది.

ఈవ్యాధి గేదెలను దున్నలను ఎక్కువగా బాధించుతుంది. ఒక్కొక్క సమయంలో రైతునకున్న నల్లపశువులన్నీ చనిపోవుటయు గలదు. ఎద్దులకు ఆవులకు ఈవ్యాధి సోకిన ఆరంభములో తగినసలహా తీసికొని చికిత్సచేసిన నిరభ్యంతరంగా తగ్గుతుంది ఈవ్యాధి తగిలిన పశువుల చర్మముపైన దద్దుదద్దుగా ఒకవిధమగు పూత పూసినట్లుండిన ఆపశువులకంత ప్రమాదము రాజాలదు.

## లక్షణాలు

ఈవ్యాధిసోకినపిమ్మటబయటకుకనబడుటకు 3నుంచి 8 దినముల వరకు పట్టుతుంది. కొన్నిజంతువులకు 10, 15, 30 దినముల వరకు



పట్టుతుంది. రైతులలో చాలమంది పారుడుపుట్టినతరువాత వైద్యులకు చూపించుతారు. ఈపారుడు పసుపుపచ్చగానుండి రక్తకండలుపడుచు ముడ్డి తీపుగానుండి పదేపదే విరేచనములగుచు గబ్బిలపు వాసన

కొట్టుచున్నపుడు అట్టి పశువు బ్రతుకుట చాల కష్టమని గ్రహించాలి మిగుల అనుభవముగల వైద్యుడున్నగాని ఇట్టి ప్రమాద స్థితిలో సరియగు చికిత్స చేయజాలడు మనరైతులలో అధికచాదస్తము గలవారున్నారు ఏ వెంకయ్యో ములగచెక్కరసం ఉప్పు కలిపిపెట్టగా తగ్గినదని చెప్పగానే అదేమాదిరిగా అందరునమ్మి చేసేవారు ఇప్పటి కాలపరిస్థితులలోకూడా వున్నారు ఇట్లుచేయుట చాలా పొరపాటు.

## ప్రథమంఅవస్థ

ఈవ్యాధి సోకినవెంటనే 105, 106 డిగ్రీల జ్వరమువుంటుది. మనుష్యులకు పెట్టు ధర్మామీటరునే పశువుల ముడ్డిలో పెట్టితే తెలుస్తుంది. అర మేత మేస్తూవుంటుది ముఖ్యముగా దగ్గువుంటుంది. కొన్నిటికి యుండదు చెవులనుండి రసికారుతూ తలను అటూ నటూ కొట్టుకొంటూవుం ంది. కను కొలుకులు సూక్ష్మంగా చిట్లి పుసులు కట్టుతాయి కొన్ని కండ్లనుండి నీరుకారుచుతాయి. మలము గట్టిగ వేస్తుంది. గుండె తీవ్రముగ కొట్టుకొంటూవుంటుంది. పాడిపశువులైన వెంటనే పాలు ఎండిపోతాయి. కొన్నిటికి కండ్లు కనురెప్పలు ఎర్రబడతాయి. ఈ ప్రథమావస్థలోనే రోగం పుట్టిన ఆ పశువు బ్రతుకుట కష్టము. కావున జాగ్రత్తగ పరిశీలించి రోగమును పోగొట్టు సదుపాయాలు చేయాలి

## రెండవ అవస్థ

పశువు నోటిలోపల ఎరుపుగా కంది పొక్కులు పొక్కులుగ వుంటాయి. ఈ అవస్థనుంచి మేత నీరు మానుతుంది. చెవులను వ్రేలాడవేసి క్రిమేసి జ్వరముతగ్గుతుంది. ముక్కులగుండా చిక్కని చీమిడి, నోటిగుండ చొంగపడుతూ వుంటుంది. ముక్కులనుశుభ్రంగా కడుగనిచో పురుగులు పడతాయి. నోటిలోపలినుంచి ఒకవిధమగు దుర్వాసన వేస్తుంది ప్రథమావస్థలోనే ముక్కిలెద్దులను బండిపనిగాని

నాగలిపనిగాని చేయించిన ఆ పశువులకుకూడ ప్రమాదానికిగురియౌతాయి. నా అనుభవము మీాద ఇట్టి పశువులకు ఎంతో అనుభవచికిత్స చేసినగాని తగ్గవు. శరీరమందే భాగమందైన ఈ రెండవ అవస్థలో ఒక విధమగు వాపులుపుట్టుతాయి. ఈ వాపులు మెత్తగాగాని గట్టిగగాని యుంటాయి. క్రమేపి కనుగొలుకలు ఒరిసి పుండ్లు అగుతాయి. ఆడ పశువులైన శరీరము మీాద పుండ్లుపడి ఎరుపురంగుగా వుంటాయి. దీనినే మశూచి పూత యంటారు. కండ్ల నుండి కారు నీరు పగరుగ కారంగా వుంటుంది దాహమెక్కువగుతూ ఆకలి నిలిచి పోతుంది. నాశి తీవ్రముగ కొట్టు కొంటూ విరేచనరంగు పులుసువాసనగా కొద్ది పసుపురంగుగా వుండి దినమునకు రెండుమూాడు పర్యాయములు పారుతూ వుంటాయి.

## మూాడవ అవస్థ

ఈ అవస్థలో పశువు మిక్కిలి శుష్కించిచాలా విచారకరంగా వుంటుంది. వ్యాధి ముదిరినకొలదీ విరేచనాల రంగుమారిదుర్వాసనగా వుంటుంది. ముడ్డిలో తేంగుపుట్టి ముక్కుతూ జ్వరముక్రమేపితగ్గుతూ వుంటుంది. ఈ సమయములో జ్వరము తగ్గకుండ విరేచనాలను కట్టించు సదుపాయాలు చేయాలి ఉచ్ఛ్వాస నిశ్వాసాలను ఆటంక పరస్తూ నీరసింపజేస్తుంది. పసుపురంగు నీరువలె పదేపదే పారుతూ వుంటుంది

## నాలుగవ అవస్థ

పశువు శరీరము, కాళ్లు, ముఖముల రంగుమారి ముడతలు పడుతాయి. శరీర వేడిమి తగ్గుతూ శీతలానికి వచ్చుతుంది మూత్ర కోశముచెడి నాలుక తెలుపు-పసుపు కలిసినరంగుగా వుంటుంది. నోరంతా ఆరిపోయి, దాహ మెక్కువగుతుంది. కొన్ని దాహోస్న కోరవు పేగులు అరస్తూ కాళ్ళనరాలు లాగుతూ పశువునిలబడుతూ లేచుతూ బాధపడుతూ వుంటుంది. దేహమంతా శీతలానికివచ్చుతుంది.

కనుగుంటలు విడచిపెట్టిన మందులు మలముగుండా పోతూ కండలు కండలుగా కొద్దిగా పాకుతూ బరిఎముకలు బయటపడి నీరసించి మరణించుతుంది. కొన్ని పశువుల తత్వాన్నిబట్టి పైలక్షణాలలో మార్పులు వుండుటయూగలదు. కాబట్టి జాగ్రత్తగా చికిత్సచేయుట మంచిది.

## సంరక్షణ

ఈ వ్యాధికి ఔషధాలకంటె సంరక్షణే ముఖ్యము. ఈ వ్యాధి వర్షాకాలమందు ఎక్కువగా వేసవికాలమందు తక్కువగా ప్రబలుతూ వుంటుంది వర్షమునకు తడియనీయక ఆయాకాల పరిస్థితులనుబట్టి జాగ్రత్తగ కాపాడాలి. ప్రతిగంటకు ముక్కులను నోటినిపటికనీటితో గాని తదితర నగుపదార్థాలతోను కడుగుతూ ఈగలు వాలకుండ కాపాడుతూ దాహము కావాలని కోరికయున్న అర్థగాకాచిన నీరు పెట్టుతూ అప్పుడప్పుడు ముక్కురంధ్రాలకు మంచినూనెను రాస్తూ మలమూత్రాదులు తీసివేస్తూ, కండ్లను పరిశుభ్రము చేస్తూ, కుక్కలను కాకులను పంచిశువులను దగ్గరకు రానీయకుండ కాపాడుతూ, విరేచనము లగుచున్నప్పుడు తీసివేసి నేలను వాటిమట్టితో గాని, సున్నముతోగాని జల్లి శుభ్రము చేస్తూ, కాపాడుచున్న యెడ తగ్గిపోతుంది

## చికిత్సలు

ఆరంభము లో నేచింతపండుపులుసుసేరు,ఉప్పుగతులాలుకలిపితగిలిన వెంటనే ఒక్కపర్యాయమే ఈయాలి. లేకకొంరి1తు, వాము అరగుప్పెడు మెంతులుగపువ్వు 11/2తు, ఉప్పు3తు, బియ్యపునీరు సేరుకలిపి ఒకపర్యాయమే త్రాగించాలి.

లేక ఉదయముపూట 100న్ను సాయంకాలము 100న్నుతమలపాకులకు, మంచినూనెరాసి తినిపించాలి.

లేక వెల్లులిపాయలు 2తు, వాము4తు, ఉప్పు4 తు, చింతపండు పులుసు అర్ధ శేరు, కలినీరు అర్ధ శేరు కలిపి ఒక్క మోతాదు ఈయాలి.

లేక వెదురాకు అరగుప్పెడు, నేలవేము 1తు, నల్లేరు వేళ్ళు 1తు, తెల్ల ఆవాలు 1తు, బియ్యపునీరు శేరు కలిపి త్రాగించాలి.

లేక నేలవేము 2తు, మోదుగపువ్వు 6తు, నువ్వులనూనె అర్ధ శేరు, కలిపి త్రాగించాలి.

లేక నల్లేరు కాడల రసము 3తు, వెల్లుల్లిరసము 4తు, నువ్వుల నూనె అర్ధ శేరుకలిపి త్రాగించాలి.

వ్యాధి సోకిన ప్రథమ ద్వితియ అవస్థలలో ఒకటి రెండు మోతాదులకంటె పైమందులు పెట్టరాదు.

దినమునకు రెండుమూడు పర్యాయములు పారుతూవుంటేపచ్చి తుమ్మచెక్క, పచ్చినేరేడుచెక్కను తెచ్చి నీరుపోసి త్రొక్కి 2 శేర్లు చిక్కనిరసము వచ్చునట్లుగా చేసికాచి రెండువేళల పెట్టవలెను. ఈ చికిత్సకూడ పారుడు కట్టినచో మరొక మోతాదు ఈయవచ్చును.

లేకదానిమ్మ చిగుళ్ళను 15తులాలు తెచ్చి మెత్తగానూరి అర్ధ శేరు పెరుగుతో పెట్టాలి లేక పైకిపత్తి ఆకురసము శేరు, మజ్జిగ అర్ధ శేరు, కలిపికాచి పెట్టాలి. లేక నేల తంగేడాకును కచ్చుసచ్చుగాదంచి శేరు మజ్జిగలోకలిపి త్రాగించాలి. ఈచికిత్సలన్నీ విరేచనాలు తీవ్రముగా నగుచు లోపల జ్వరంతగ్గకుండ నున్నపుడు విరేచనములు కట్టువరకు మూడునాలుగు పర్యాయములవరకు పెట్టనచ్చును. ఈమందులు పెట్టు నపుడు విరేచనములు కట్టినచో వెంటనేఆపాలి. లేనిచో మలబంధము కలిగి పశువులకు వగర్పుపుట్టుతుంది. ఇంకను దేహమంతా మిగుల వేడిగానుండి విరేచనాలు అగుతున్నప్పుడు అరటిదుంపను మానెడు నీటిలోవేసి దంచిరసముతీసి దానిలోత న్నెడుజొన్నపిండికలిపి కాచి చల్లార్చిపెట్టాలి లేకతంగేడాకుపసరు సేరు, పెరుగుఅర్ధసేరు, కలిపిత్రాగిం చాలి.

ఎన్ని మందులు పెట్టినను పారుడు కట్టనపుడు వరిపిండిసోలెడు, హారతికర్పూరము 1/4తులము, పాలుసేరు, కవిరి2తు, కలిపి త్రాగిం చాలి.

లేకసీమసున్నం 4తు, కవిరి2తు, మాచికాయలు 1తు, నల్ల మందు 1/4తు, గంజాయిపత్రి 1/2తు, వరినూకలజావ సేరుకలిపి పారుడు తగ్గువరకు ఒకటిరెండు మోతాదులు ఈయాలి.

(పారుడు కట్టుటకు ఫార్మసీవారి బేల్ పౌడరు బాగుగా పనిచేయును.)

## పథ్యము

రైతులలో చాలమంది వ్యాధి తగిలిన పశువులకు నీరు, మేత పెట్టరాదని చెప్పతారు. మరికొందరు నీరుపెట్టుట బొత్తిగా మాని వేయుటవలన ఆహారనాళముఎండిమరణించుచున్నవి ఇప్పటికాలపరిస్థి తులలో "పశువుపోతే బ్రతుకుపోవురా" యను సిద్ధాంతముతో ఎట్టి చిన్న పశువునకైనా తగుజాగ్రత్తగా చికిత్సలుచేయుచున్నారు వ్యాధి సోకినది లగాయతు నెమ్మదియగువరకు తుమ్మచెక్కగాని రావిచెక్క గాని వేసి సలసల కాగిన తేలికకషాయాన్ని చల్లార్చి పెట్టుటమంచిది ఈకషాయమును పెట్టుటవల్ల నీరు అర్థిగా త్రాగుతుంది పేగులు నోరు గారపట్టుతుంది. పారుడు కూడ గట్టిపడుతుంది నాఅనుభవము మీద ఈకషాయమే బాగుగా పనిచేయుచున్నదని తెలుపుచున్నాను ఇంకను వేడిచేసి చల్లార్చిన నీటిలో కొద్దిగా పసుపువేసి పెట్టవచ్చును. వ్యాధి తిరిగిన తరువాత కూడ జావ, వగరు కషాయములు తేలికగా తయారుచేసి పెట్టాలి రోగమునుండి తేలిన పశువులను పక్షము దినములవరకుమందలోకలుపరాదు. నూకలు తేలికగవేయించికాచిజావ పెట్టుట మంచిది.

## వ్యాధిని నివారించు మార్గాలు

గ్రామములోకి ఈరోగము రాగానే జాడ్యము తగలిన వాటిని తక్షణమే మరొక చోట కట్టాలి కొంతమంది రైతులు దేవుడుంటే ఎచ్చటకట్టివేసినాపరవాలేదనితీగెలు తీయుచు పశువుమీద ప్రేమలేక మాట్లాడుతారు. మనిషికి కలరా రాగానే అమ్మోనాయనో యని గుండెలు బాదుకొంటారు. అంతతాపత్రయమే నోరులేని పశువులకు కూడ యుంటుందని పాపము వీరికి తెలియదు. చూడండి మంచి పశువును జబ్బు పశువుతో వుంచండి. అది యెంత బాధ పడుతుందో జాగ్రత్తగా చూస్తే తెలుస్తుంది. కాబట్టి తప్పక జబ్బుపశువులను విడదీయాలి. జబ్బు పశువులున్న స్థలమునకు సంబంధించిన కొట్టపు గోడలు, నేలనీటి తొట్టెలు శుభ్రముగా వుంచాలి రోగ పశువులకు చికిత్స చేయువారుగాని, అంటుసోకియుండే స్థలాలలో తిరుగు కుక్కలు కాకులనుగాని మంచి పశువులున్న చోటుకు రానీయరాదు చచ్చిన పశువులనుమాత్రము కోయించక పది పండ్రెండడుగుల లోతునపాతి పూడ్చుట మంచిది పార్మసీవారిజంతురక్షిణి రోగాన్నిరానీయకుండా కాపాడుతుంది.

## ప్రభుత్వటీకాలు-జంతురక్షణి

భారతప్రభుత్వంవారు యిటీవలనే పెద్దరోగము తదితర అంటు రోగాలు రాకుండా సూదిమందులను పరిశోధించి తయారుజేసారు ఈటీకాలను ప్రతిరైతు తప్పక వేయించుకోవాలి చాలా అవసరం ఈటీకాలు వేసిన తరువాత పెద్దరోగము రాకుండా ఎన్నో పశువులు సురక్షితంగా వున్నాయి. కాని రైతులుమాత్రం ఈటీకాలమందుతప్ప తదితర ఇంజెక్షన్లు వేయించుకోరాదు. స్వలాభపరులగు వైద్యులు వివిధ రకాలఇంజెక్షన్లుయిచ్చి డబ్బుకొరకు నాటకమాడతారు. అట్టివైద్యులను ప్రభుత్వానికి ఒప్పగించి తగినశిక్ష వేయించితే గాని మనపశు సంతతి బాగుపడదు.

ప్రభుత్వటీకాలు దొరకనిపక్షంలో సహదేవపశువైద్యఫార్మసీ వారి జంతురక్షణిని వాడండి. ఇదికూడా దేశంలో మంచిపేరు పశువుల పాలిట గాంచింది ఇంకను ఈఫార్మసీవారు ఈఅంటరోగాలకు లహసన్ సంబంధమగు ఇంజెక్షన్ మందునుతయారు చేస్తున్నారు. వివరములకు ఫార్మసీవారికి తెలుపండి.

పరా:-ఈరోగానికి ఈగ్రంధంలో ప్రకటించిన ఔషధాలు గాక ఈగ్రంధము చివరభాగంలోవున్న చిట్కా చికిత్సలు చూచి మీఅనుభవంతో వాడవచ్చును

## దొమ్మరోగము

పశువులకు సంభవించే రోగాలన్నిటిలో దొమ్మ మిగులహాని కరమైంది. ఇది ఒక జంతువునుండి మరొక జంతువునకుసోకు రోగమై



దొమ్మ

యున్నది. పెద్దరోగము తగిలిన పశువువలె ఎక్కువ కాలముండక గంటలపరిమాణము చచ్చిపోతుంది. అందుచేత రైతులు ఆతురత పడుతూవుంటారు పెద్దరోగమంత తీవ్రముగా అన్ని పశువులకు సోకదు. ఈవ్యాధిని కలిగించు సూక్ష్మజీవులు మట్టితోకలిసి పదిసంవత్సరాలవరకు జీవించియుంటాయి. ఈ సూక్ష్మజీవుల గుడ్లను సీలుచేసిన గొట్టములోపెట్టి కాపాడగా 22 సంవత్సరములవరకు బ్రతి

కినవని లూయీఫాస్టర్ దొరగారు తెలిపారు. పల్లపునేలలోవుండే గడ్డి వేళ్ళను ఈ సూక్ష్మ జీవులంటియుండి పశువు మేయునపుడు ఆ గడ్డితో గూడ శరీరములోనికి ప్రవేశించిన తరువాత ఈ వ్యాధిసోకుతుంది. ఎఱ్ఱలు విశేషముగావుండే నేలలో ఈవ్యాధి ఎక్కువగా వుంటుంది ఈ జాడ్యపు విషాంకురాలు మనుష్యులకు వుండేగాయాల గుండా ప్రవేశించితే రాచపుండ్లు చెడువ్రణములు కలుగుతాయి ఈవ్యాధిగల పశువును చికిత్సించువైద్యులు చాలా పరిశుభ్రముగా వుండి జాగ్రత్తగా చికిత్సచేయాలి

చచ్చినజంతువులనుకాల్చకపాతిపెట్టకప్రవహించుకాలువలలో నదులలో కళేబరాలు పారవేయుటచేత ఈవ్యాధిచే బాధపడు పశువుదగ్గరవుండేమల మూత్రాదులుబాగుచేయకఅచ్చట నేయుంచుట చేత,ఈరోగపశువు నెత్తురుమీదతదితర స్థానములందు ఈగలువ్రాలి అవియుంచిపశువులపుండ్లమీద గాయములమీద వ్రాలుటచేతఈవ్యాధి ఎక్కువగుతుంది. చూడిపశువులకు ఈవ్యాధితగిలలోపలిపిండమునకు మాత్రము తగలదనీయు. అచ్చట విషజీవులను చంపుపదార్థమొకటి కలదనీ పశుశాస్త్రజ్ఞులు తెలిపియున్నారు ఈవ్యాధిపశువులకు, గుఱ్ఱములకు, గాడిదలకు, మేకలకు, పందులకు సోకుతుంది దొమ్మరోగముచే చనిపోయినా పశువుచర్మముల ద్వారా, కంబళ్ళద్వారా, ఎరువులద్వారా ఈవ్యాధిరావచ్చును

## లక్షణాలు

పశువుఆరోగ్యముగా వుండినట్లేయుండి ఆకస్మాతుగా చనిపోతుంది, అట్లుగాక లక్షణాలు కనపడినయెడల జంతువునకు తీవ్రమైన జ్వరము (106 107 డిగ్రీలవేడిమి)యుంటుంది. పశువుగజగజవణుకుతూ కన్నులనుండినీరుకారుచుతూదీనంగాచూస్తూవుంటుంది కన్ను,ముక్కు, నోరు మున్నగు వానిలోపలి చర్మపుపొరలు ఎక్కువగా కందినాడితీవ్రముగా కొట్టుకొంటుంది కన్నులు ముక్కు కొమ్ములు, పాదములు

చల్లగావుంటాయి. నల్లకప్పువేస్తుంది. కాళ్ళుగుదులుపట్టి నిలువలేక తూలుతూ వుంటుంది. చెవులను వ్రేలాడవేస్తూ ముక్కులయందు చెమటయుండదు ఆయాస మెక్కువగావుండి నోటినుండి నీరుకొద్ది కొద్దిగా పడుతూవుంటుంది లోపలికఫము బైటకుతన్నుచుండుట చేత నాలుకనుజారవిడుచుతుంది కడుపుబ్బునెత్తురువిరేచనాలు కొద్దికొద్దిగా అగు తూంవుటాయి. క్రిమేపితూలుచు కండ్లలో నిస్సత్తువయేర్పడిక్రింద బడిమరణించుతుంది. ఈవ్యాధి 24గంటలనుంచి 48గంటలవరకుయుండ వచ్చును. లేక ఈలోపుగనే చచ్చుటయుగలదు. చచ్చినతరువాతమల కోశము ఉబ్బుతుంద.

## ఆయుర్వేదచికిత్స

ఆరంభములోనే ఈవ్యాధిని కనుగొంటేమూడుడ్రాములసారా యిని పెట్టాలి. లేకసేరునీటిలో రెండుగుప్పిళ్ళ ఎండుమిరపకాయలు వేసి సలసల కాగనిచ్చి పిసికి, వడపోసికాఫీత్రాగనంత వేడిలోనున్న పుడు త్రాగించాలి

లేకముద్దకర్పూరం అరతులము, మంచిబెల్లం 10తులాలుకొట్టు పసుపు 1తులము మెత్తగానూరి ముద్దచేసి ములగ చెక్కరసముతో పదునుచేసి పెట్టాలి.

లేక శొంఠి 3తులాలు పిప్పళ్ళు మిరియములు 6తులాలు, కర క్కాయలు 3 తులాలు ఉసిరికపప్పు 2తులాలు కొట్టుపసుపు 3తులాలు కలిపి మెత్తగానూరి సేరుచింతపండు పులుసుతోకాని, సేరున్నర బియ్యపుకలితో కాని ఒక్క మోతాదేఈయాలి. లేక వెల్లుల్లిపాయలు 10తులాలు, పసుపు3తు ఉప్పు 10లు, తెల్లతుమ్మ చెక్కరసము సేరు. మేకమూత్రము అర్ధసేరుకలిపికాచిపెట్టాలి. ఈరీతిగా 6గంటలకొకపర్యా యము ఈయాలి.

లేకపోతే ఎర్ర ఉప్పులు మిరియాలు ఒక్కొక్కటి 4తులాలున్న, దిరిసెనాకు పసుపుసేరు మేకపంచితము అర్ధసేరుకలిపి రెండుగొట్టాలపంతున మూడునాళ్లుఈయాలి. మంచిపశువులకు సోకకుండ దొమ్మలన్నిటికి జంరతురక్షణి వాడుదు.

లేకనల్లఉలవను వేయించినగమూత్రముతో పెట్టిన తగ్గుతుంది.

పథ్యము.—వ్యాధితగ్గునరకు నీరుఆహారము పెట్టరాదు వ్యాధి తగ్గిన నాలుగుదినములవరకు కాచిననీరు కొర్రజావ, వగైరా పెట్ట వచ్చును.

## పిడిదొమ్మ
## స్వభావము-వ్యాపకము

జీర్ణకోశము తగినంత పనిచేయక పోవుటచేత రక్తహీనతవల్ల అజీర్తివల్ల ఎక్కువగ ఎండలో పనిచేయుచుండుటవల్లగుండె అదురుట



వలన ఈవ్యాధి రావచ్చు. లేదా ఒకటి రెండు దినాలకు తరువాత తీక్షణమగు గుణాలుపుట్టి మృతినొందవచ్చు. చక్కగా కండబట్టిబలిసి

యుండే గిత్తలకు, కోడెదూడలకు తరచుగా ఈ వ్యాధిసోకుతుంది. ఈ వ్యాధి తగిలిన పశువు బ్రతుకుట చాలకష్టము. అందువలననే మిడిదొమ్మయని పేరువచ్చినది.

## లక్షణాలు

ఆరంభములో మందమతిగా వుంటూ అరమేత మేస్తుంది. ముఖ్యముగా నల్లకప్పు జ్వరముకూడ తీవ్రముగా వుంటుంది. గుండె చెడిపోతుంది. ముక్కురంధ్రాల పైభాగాన వాపుపుట్టి క్రమముగ పెద్దదగుతుంది. మెదటిలోనికి నెత్తురు విశేషించి పోతూవుంటుంది. వాపు పెద్దదయినకొలదీ ఊపిరి పీల్చుట కష్టముగావుంటుంది. చొంగ ముక్కులనుండి నోటినుండి ఎక్కువగ పడుతూవుంటుంది. ఒకవిధముగు గురకకూడాపుట్టుతుంది. కండ్లువాచి పశువు దీనంగాచూస్తూకన్నీరు కార్చుతూ వుంటుంది. చనిపోవుముందు వెఱ్ఱిమూపు చూస్తుంది. నడుముమీద నొక్కితే కుంగుతుంది. కొన్నిరక్తమూత్రము పోస్తాయి మరికొన్ని పారుతాయి. వాపు గురక ఎక్కువై మరణించుతుంది.

## చచ్చిపోయినతరువాత లక్షణాలు

నోరు దుర్వాసనగ వుంటుంది నాలుక లావుబారుతుంది. వాపు బురబురలాడుతూవుంటుంది. కండ్లనుండినీరు కారుతుంది మూతిమీద వాపుకోసిచూస్తే పసుపురంగుగల ద్రవము కనబడుతుంది. ఈద్రవము విషపురుగులతో కూడుకొనియుంటుంది. గుండె ఎరుపుగకందియుంటుంది. ప్రేగులను చీల్చిచూస్తే నీలిరంగుగ వుంటుంది.

వాపుపుట్టకపూర్వమే నాలుగు డ్రాములసారాయిలో 1 తులము ముద్దకర్పూరము, 2 1/2 తులములు పిప్పళ్ళ చూర్ణము కలిపి ఒకటే మోతాదే పొయ్యాలి.

లేక వెల్లుల్లిపాయలు 20 తులాలు, పసుపు 3 తులాలు, ఉప్పు చేరెడు, కరిభూపము 2 తు, ములగచెక్కరసము అర్ధ శేరు మేక పంచితము సేరుకలిపి ఒక్కపర్యాయమే త్రాగించాలి.

లేక శేరు ఆవుపాలలో 4తులాలవసపొడి కలిపికాచికాఫీత్రాగినంత వేడితో నున్నపుడు త్రాగించాలి గుటకవేయునపుడు లాభము లేదని గ్రహించాలి.

లేకమూడు గుప్పెళ్ళు ఎండుమిరపకాయలు, గుప్పెడుకురంజీ వాము లేకవాము, తులముశొంఠి మెత్తగా నూరి రెండుసేర్లనీటిలోకలిపి కాచి గోరువెచ్చగా నున్నపుడు త్రాగించాలి.

వ్యాధితగ్గినతరువాత రెండు లేకనాలుగుదినాల వరకుకాచిననీరు, కొర్రగంజి పెట్టినతరువాత అనుభవముమీద అనుపానాలువాడాలి. మూత్రిమీద వాపునకుమాత్రముసూరేకారము 2తు, ఆముదము10తు కర్పూరము 1తు, పొగాకుపొడి 1తు నూరి పట్టువేయవచ్చును

## నెరడుందొమ్మ

ఈవ్యాధి పాటుపడే పశువులకు తరచుగావస్తుంది. పశువు దేహంలో నెరడుగుండె వుంటుందని అందరికి తెలుసు పశువునకుమత్తు పదార్థాలులను పెట్టుటచేత ఎండయనక వానయనక విరామము లేక పనిచేయించుటచేత ప్రతిదినము చలిగాలిలో, వర్షములో కట్టుటచేత మలపదార్థాలు పేగులలో చిక్కుకొనుటచేత పశువువెల్లప్పుడుదీర్ఘ శ్వాసను తీసికొనుటచేత చాలాకాలమునుంచి నిలువయున్న గడ్డి, దాణాదినుసులు తినుటచేతఈవ్యాధివస్తుంది. ఈవ్యాధి24 గంటలనుంచి 7, 10, 30 దినములవరకు వుంటుంది.

లేక నల్లఉప్పి వేరుపొట్టు, సున్నం, ఉడకబెట్టి నిమ్మకాయంత చేసి నాలుగు దినములు పెట్టాలి. నీరుకాచి దాహముగా ఈయాలి. తెలికపిండిని పెట్టవచ్చును, వాతముచేయు దాణాలను పెట్టరాదు ఫార్మసీవారి పశురక్షామృతము వరుసగా వాడితే అమృతంగా పని చేస్తుంది

# చలిదొమ్మ

ఈవ్యాధి తొలకరివర్షాలు కురిసిన తరువాత పల్లపునేలలయందు బురదనేలలయందు ప్రబలుతుంది.దోమలు మిక్కుటముగా కరచుట చేత మురికినీరు పులిసి వాసనకొట్టు దాణాలు, కుడితి త్రాగుట చేత, విషసంబంధమగు గాలి పీల్చుట చేత, ఏకారణము చేతనైనా జవ సత్వము తగ్గుటచేత వ్యాధిరావచ్చును.

# లక్షణాలు

పశువునకు ఆరంభములో 106, 107 డిగ్రీల జ్వరమువుంటుంది. చలిచేవణకుతుంది నల్లకప్పువేసి వెన్ను కాళ్ళుఅస్వాస్థతనొందుతాయి. నాలుక తెలుపుగావుండి ఎదరాలు త్వరితముగా కొట్టుకొంటాయి చలిచే పండ్లుకొరుకుతూ మూత్రముబిగబట్టి పోస్తుంది కడుపుబ్బ రముగావుండి వ్యాధిముదిరినకొలదినోటి వెంటచొంగపడుతూవుంటుంది నాలుకజారవిడుస్తూ కఫముపెరుగుతూ పలుచగాపారుతూ క్రిమేపి పశువు శుష్కించి చసిపోతుంది.

# చికిత్స

మూడుడ్రాముల సారాయిలో అర్ధసేరుదుష్టుపాకుపసరు కలిపి త్రాగించుము.

లేకశొంఠి పిప్పళ్ళు,మిరియాలు సమానభాగాలు తీసికొనిసేరు కారపుపాలలో కలిపిత్రాగించుము.

లేక గోమూత్రము అర్ధసేరు. నరమూత్రము అర్ధసేరు కలిపి త్రాగించుము.

లేక ఇంగువ ఏతులములు, ఆవాలు 2తు, వెల్లుల్లి 4తు, పసుపు 2తు, దుష్టుపాకు గుప్పెడు, తాటిబెల్లం 8తు, కలిపి ఉండచేసి పెట్టుము.

లేక కురాసానివాము గుప్పెడు, నల్లఉప్పు 3తులములు, వెల్లుల్లి 8తు, నేలవేము 3తు, త్రిఫలములు 6తు, ఎండుమిర్చిగుప్పెడు కలిపి త్రొక్కి 2 సేర్ల నీటిలో వేసి కాచి వడపోసి గోరువెచ్చనివి త్రాగించుము.

లేక కరక్కాయలు, ఉసిరికపప్పు, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు ఒక్కొక్కటి 4తులములవంతున పొడిజేసి గేదెపేడ రసములో కలిపి కాచి వడపోసి త్రాగించుము.

ఈరీతిగా అనుభవముమీద వస్తుగుణాలు గ్రహించి తగిన అనుపానాలతో ఈయవచ్చును.

## నాలిదొమ్మ

ఈవ్యాధికూడ ప్రమాదకరమైంది. పశువు బాగుగా వున్నట్లే యుండి చివరదశలో దుష్ఫలాలు పుట్టి ప్రమాదము కలిగించుతుంది. పశువు నాలిగానుండుటవల్లనే నాలిదొమ్మయని పేరువచ్చింది. ఇది పది, పదునైదు రోజులవరకు యుంటుంది. పశువునకు చలిగాలి తరచుగా తగులుటవలన, విపరీతముగా తవుడు కృత్రిమ పదార్థములు మేపి పని చేయించకపోవుట వలన, మలబద్ధక ముండుటవలనా ఈవ్యాధి కలుగుతుంది

## లక్షణములు

ప్రారంభములో తీవ్రముగా జ్వరము వుంటుంది. దగ్గుతక్కువగా వుంటుంది. మూత్రము పసుపురంగుగా పోస్తూ నల్లకప్పవేస్తుంది. నోరు వాసనగా వుండి, నోటినుండి ముక్కులనుండి చీమిడివంటి పదార్థాము

పడుతూవుంటుంది పశువు మందమతిగానువుండి వ్యాధిముదిరినకొలది తలనువ్రాపుతూవుంటుంది. పొట్టవుబ్బరముగావుండి క్రిమేపి మేతనీరు తగ్గించి, కనుగుంటలు విడచుతుంది వ్యాధి ముదిరినకొలది మలము దుర్వాసగానుండి రంగుమారి పంట్లుకొరుకుతూ, అపానవాయువులు విడచుతూ పశువుక్రిమేపి శుష్కించి మరణించుతుంది

## చికిత్స

ఆరంభములోనే తాడకాడలు 3తు,ఉసిరికపప్పు2తు,కరక్కాయలు 1తు, పిప్పళ్ళు2తు, శొంఠి2తు, మిరియాలు1తు చింతపండు నిమ్మకాయంత మెత్తగానూరి రెండుసేర్లు గేదె పేడరసములో కలిపి కాచి వడపోసి త్రాగించుము

లేక వెల్లుల్లి10తు, మునగచెక్కరసం అర్ధసేరు, త్రికటకములు 4తు, ఆవాలు 4తు, ఎండుమిర్చిపొడి3తు, మెత్తగానూరి సేరుకారపు పాలతో కలిపి త్రాగించుము.

లేక మోదుగపువ్వు 4తు, జొన్నకలి సేరుకలిపి త్రాగించుము

లేక ధనియాలుసోలెడు కురంజీవాము గుప్పెడు, జీలకర్ర 2తు, నేలవేము 3తు, ఉప్పుచేరెడు కలిపి నూరి సేరుజొన్నకలితో పెట్టుము

లేక మూడుడ్రాములు సారాయిని త్రాగించుము.

లేక ఫార్మసీవారి జంతురక్షిణిని నాలుగైదు పర్యాయములు వాడుము తప్పకుండా తగ్గుతుంది

## గాలికుంటు

దీనినే కాలుకుంటు,గాలిగాళ్ళు,నోటిగాళ్ళు, కాలినోటిగాళ్ళని వివిధ రకములుగా పిలుస్తారు.

# స్వభావము-వ్యాపకము

ఇదితీవ్రమైన అంటువ్యాధి, ఈరోగము దేశమునందంతటఅప్పు డప్పుడు శీతోష్ణస్థితి గతులనుబట్టి వ్యాపించుతూవుంటుంది. రైతులకు మంచిపనులు చేయుకాలములో ఈవ్యాధి వచ్చినపుడు వాటుపడుఆతు రత ఇంతయని చెప్పనలవికాదు. ఈవ్యాధిపందులకు గొఱ్ఱెలకుమేకలకు కూడ వస్తుంది. ఇదిబహు వేగముగా వ్యాపించేరోగము



ఈగాలికుంటును కలిగించే సూక్ష్మజీవులు పశువురక్తములోను బొబ్బలయందును వుంటాయి ముఖ్యముగా ఒకజంతువునుండిమరొక జంతువునకు సోకుతుంది. ఈజాడ్య సంబంధమగు విషము, మేత,నీరు, గాలిమూలాన దేహములో ప్రవేశించి నాలుగుదినాలు దాగి అయిదు లేక ఆరవనాడు బయటకుప్రబలుతుంది ఈవ్యాధికొన్నిటికి నోటికిని, మరికొన్నిటికి పాదములకును రావచ్చును.

లేదా నోటికి ముందుసోకి పాదములకు తరువాత రావచ్చును ఈవ్యాధిపశువును చంపకపోయినా రైతుయొక్క పనికి అడ్డువస్తుంది కొండప్రదేశాలలోవుండే పశువులకు ఎక్కువగా సోకుతుంది ఇంకను పశువులకొట్టములు, రైలువాగనులు గాడితొట్లు మున్నగునవి కూడా

ఈవ్యాధివ్యాపింప జేయుటకు ఆధారములై యున్నాయి. గొఱ్ఱెపిల్లలకు కుక్కలకు, పందులకు, దూడలకుకూడ తమతల్లుల పాలనుంచివస్తుంది. కోళ్ళకు,గుఱ్ఱములకు దుప్పులకు ఒంటెలకుకూడా సోకుతుంది. మేతనీరు గాలివల్ల రోగపశువుదగ్గర పనిచేయు పరచారికులవల్ల పాలుపితికెడు వారివల్ల కుక్కలు,పిల్లులు, ఎలుకలు,పక్షులు, ఈగలు,మున్నగువాని వల్ల రోగపశువులను సంతలకు కసాయి దుకాణములకు తోలుకొని వచ్చుటవల్ల; ఈవ్యాధి వ్యాపించుతుంది ఈవ్యాధినికలిగించు సూక్ష్మ జీవి 15మైళ్ళ విస్తీర్ణమువరకు పోగలదని శాస్త్రజ్ఞులు తెలుపు చున్నారు.

## లక్షణాలు

పశువునకు అరంభములో 106.107 డిగ్రీల జ్వరము వుంటుంది. నల్లకప్పువేస్తుంది. మూతిచెమ్మలేకయుంటుంది. నోటినుండి చిక్కని చొంగపడుతుంది. కాళ్ళు చెవులు వేడిగావుంటాయి అరమేత మేస్తుంది




కొద్ది మలబద్ధకంవుంటుంది. పెదవులతో చప్పరించుతుంది. నోటిలోని చర్మముపొర ఎరుపుగా కందియుంటుంది నాలుకమీద నోటిలోపల, పేగులలో, నాలుగవపొట్టలో, దవుడల లోపలిభాగమందును గిట్టల సందున, కండ్లలోను, కొమ్ములలోను, పాడిపశువు పొదుగుమీదచిన్న

చిన్న బొబ్బలు కనబడతాయి. ఇవికందిగింజంత పరిమాణముగలవై చితికి రసికారతాయి కాళ్ళడెక్కలమధ్య ఈపుండ్లురెండుమూడు కలిసి అట్టకట్టుకొంటాయి. వీటిని శుభ్రము చేయనిచో పురుగులుపడి దుర్వాసనచేసి డెక్కలు వూడిపోతాయి. ఈవ్యాధితగిలిన పశువును ఎండలో వుంచితే కసిమిరితగులుతుంది. కొమ్ములను శుభ్రము చేయనిచో కొమ్ములు వూడిపోతాయి. పాడిపశువులకు ఈపుండ్లులేచుటవల్లపాలు తగ్గుతాయి. కండ్లు నోరు తదితర అవయవముల మీద లేచేపుండ్లవిషయమై సరిగా చూడనిచో అచ్చటపురుగులు పడిపశువును బాధించుతాయి.

## చికిత్స

జాడ్యముతగిలిన పశువును ఎండలో నుంచరాదు. ఈవ్యాధికి కూడ సంరక్షణయే ముఖ్యమగుచికిత్స ఈవ్యాధిసోకినపశువులను వాని చుట్టుప్రక్కలనుండు ప్రదేశములను శుభ్రపరచాలి. పశువులకొట్టములు పరిశుభ్రముగా వుండుటకు పేడకలిపిన నీటినిగాని సున్నపునీటినిగాని, జల్లుతూవుండాలి పాలిచ్చుపశువులను లేగదూడలను బలహీనమగుపశువులను జాగ్రత్తగచూచి తగిన సంరక్షణ చికిత్స చేస్తూవుండాలి. పాడిపశువులకు తగిలిన తరువాత దూడలను పాలుకుడుపరాదు. అట్లు కుడిపిన అవిమరణమునకు సంప్రాప్తనుగుతాయి ఈవ్యాధి తగిలిన పశువును బురదలో దింపరాదు. పుండ్లకు మట్టిని చవుడునుకొట్టరాదు. ఇట్లుచేయుటవలన డెక్కలు కాలుకవేసి చాలాకాలము కుంటుగా నేర్పడి పశువును బాధించుతాయి

(ఆరంభములోనే నూనెకారము 2 తులాలు, వేడినీరు సేరు కలిపితాగించిన జ్వరముతగ్గి పుండ్లు తేలికపడి బాధతగ్గు తుంది.)

లేక ఉప్పు 4 తు. నేలవేము 2 1/2తు, మంచిబెల్లం సవాసేరు కలిపి నూరినాకించుము

లేక పెసరపప్పు అర్ధసేరు, వేలపిండి సోలెడు మంచినూనె సవాసేరు కలిపిపెట్టుము.

లేక తమిదెజాన అర్ధశేరు. నుంచినూనె సవాసేరు కలిపి తాగించుము

లేక నీరుల్లిపాయలు 1½ తులాలు, జొన్నఅన్నముసేరు. పెసర పప్పు అరసోలెడు. పసుపు 2తు, కలిపిపెట్టుము. మంచి పశువులకు స్వర్ణాసవ వాడినసోకదు చాలామంచి రైతులు ముందుగనే స్వర్ణాసవను తెప్పించుకొని వాడుతారు ఇంజెక్షన్‌వలే పనిచేస్తుంది

## పుండ్లకు చికిత్స

కవిరిగాని మాచుకాయగాని పటిక తుమ్మచెక్క లేక వేప చెక్కవేసి కాచిన చిక్కని కషాయముగాని తీసికొని రెండుమూడు సేర్లనీటిలోకలిపి నోటిపుండ్లకు అప్పుడప్పుడు పుక్కిలింపు జేయించిన



గారపట్టుతాయి. ఇంతేగాకుండ తుమ్మచెక్క కషాయాన్ని ప్రతిరోజూ కాలిపుండ్లు, తదితరపుండ్లు కడుగుట కుపయోగించుట మంచిది.

కాళ్ళకు గాలికుంటుతగిలిన వెంటనే మీగడలో తగినంత పసుపుకలిపి అప్పుడప్పుడు డెక్కల భాగములకు రాసినచో పుండ్లు అంతగా పడక త్వరగా మానును. లేక నీలిమందును కొబ్బరినూనెలో కలిపిగాని, నవాసాగరమును నీటిలో కలిపిగాని గానుగనూనెగాని రాసిన తగ్గుతాయి. కలరావుండలపొడిని వేపనూనెతో కలిపిరాచిన పుండ్లు గాయాలు మానుతాయి.

పురుగులుపడి పశువు బాధపడుచున్నపుడు మాత్రముఫినైల్‌ను కొన్నిచుక్కలు వేసి కట్టుకట్టిన పురుగులు చచ్చును. సాధారణముగా రైతులలో చాలమంది పురుగులు లేనిపుండ్లకుకూడ గాయముమాను నని విస్తారముగా పోస్తారు. అల్లుపోయులవల్ల పశువునకు జ్వరము ఎక్కువై పుండు పెద్దదై పశువు శుష్కించుతుంది. గాన జాగ్రత్తగా వాడాలి, లేక శీతాఫలపుఆకు, సున్నము, పుగాకుపొడి మెత్తగానూరి పురుగులున్న పుండుకు పట్టించిన పురుగులుచచ్చుతాయి లేక వారిజ పాకు గుప్పెడు, ఉప్పు 2తు, మిరియాలు 1తు, మెత్తగా పాలతోనూరి పట్టించుము. లేక పొగాకు. కరిభూపము, పొట్లాకు, రాతిసున్నము, సొరాకు తగినంత తీసికొని మెత్తగానూరి పట్టించుము లేక వసపొడిని పట్టించుము.

## పద్యము హెచ్చరిక

పాలిచ్చే పశువులు ఎండిపోతాయి చూడిపశువులు ఈచుకొని పోతాయి. దుక్కిఎద్దులు డెక్కలు పాడగుతాయి పగుళ్ళుపట్టతుంది గాన ఆరంభములోనే జాగ్రత్తగా చికిత్స పోషణ చేయాలి. మనుష్యుల శరీరము మీాద వుండే గాయాలకు ఈపశువు చొంగతగిలినా ఈవ్యాధిసోకిన పాడిపశువులపాలు త్రాగినా చంటిపిల్లలకు త్రాగించినా ఈవ్యాధికలుగుతుంది. గాన జాగ్రత్తగా వుండాలి. అప్పుడప్పుడు పశువులశాలలో సాంబ్రాణి పొగ వేయుటమంచిది.

ఆవుమజ్జిగ సేరు, మంచినూనె నవటాకు, అరిగ అన్నముగాని వరిబియ్యపు అన్నముగాని అర్ధశేరుకలిపి మంచిపశువులకు త్రాగించిన వ్యాధిసోకదు. జబ్బునెమ్మదించిన తరువాత జొన్నలను వండి మంచి నూనెలో కలిపి ప్రతిరోజు పెట్టిన మంచిది. దీనినే మడ్డికూడుఅంటారు. ఫార్మసీవారి పశుబలవర్ధనిని వాడుడు

## గురక

దీనినే కంఠమాద, కుత్తుకవాపు, గురక, గొంతురోగము, ఎల్లిదొమ్మ, దున్నలప్లేగు అంటారు

## స్వభావము - వ్యాపకము

పశువులకు సంభవించు రోగాలన్నిటిలో ఈ వ్యాధి తుపాకు గుండువంటిది ఈవ్యాధితగిలిన కొన్నిగంటలలోనే మరణించుతాయి. ఈవ్యాధి గ్రామములో వ్యాపించినదనగానే రైతులకు గుండెలు దడదడ కొట్టుకొంటాయి.



గురక

ఈవ్యాధిచే నూటికి ?0 వరకు మరణించుతాయి. ఇదికూడ అంటురోగమై యుండి. ఈవ్యాధి దుప్పులకు పక్షులకు దున్నలకు తదితర పశువులకుసోకుతుంది ఈవ్యాధినికలిగించుసూక్ష్మజీవి పల్లముగా, అనారోగ్యముగా తేమగా యుండే పట్టి నేలలయందుంటాయి. అట్టి నేలలో మొలచేగడ్డిలోగానిత్రాగునీటిలోగానియుండితొలకరించ గానే వ్యాపించి దున్నలకు గేదెలకు తగులుతుంది అందుచేతనే దున్నల ప్లేగంటారు. ప్రారంభములో గేదె, దున్నదూడలకువచ్చిచచ్చిపోతాయి.

క్రిమేపి వ్యాధివ్యాపించి గేదే,దున్న, ఎడ్లకుకూడ వస్తుంది. ఈవ్యాధి లోపలదాగియుండిబయటకుకవపడుఅంతర్గతకాలముఒకటిరెండుదినాలని గ్రహించాలి నూటికి 98 దున్నలవరకు ఈవ్యాధిచేమరణించుతాయి.

## లక్షణాలు

పశువునకు తీవ్రమగు జ్వరము 106, 108 డిగ్రీల వరకువస్తుంది. మేతమాని మందమతిగావుంటుంది. కన్ను, ముక్కు, నోరు మున్నగు శరీరావయవాలలో వుండే పొరలు ఎరుపుగ కందియుంటాయి. మూతి పొడవ్రగా విస్తరించుతుంది నోటినుండి చొంగపడుతుంది. గొంతును పట్టిచూచినవాపుగలిగిచల్లదనంగాయుంటుంది. ఈవాపుక్రమేపి గొంతుక దవుడలు, గంగడోలు, మెడముందరికాళ్ళుమున్నగుభాగాలకుపోతుంది. ఇంకను తలమీందకంటిరెప్పలమీదముక్కురంధ్రాలమీద నోటిలోపల ఈవాపుకనబడుతుంది. ఈవాపులు కనబడిన ఆయాభాగాల చర్మము లోపల ఎరుపుగా కంది రక్తపుమచ్చలు కసబడుతాయి. నాలుక వాచిఎట్టబడి జిగురువంటి పదార్థము పడుతూ నరములు లాగుతూ వుంటాయి. నోరు నలుపుగావుండి దగ్గుకూడయుటుంది. వాపు త్వరలోనే హెచ్చుతూ ముదిరినకొలది చల్లగావుంటూ, పశువులేస్తూ పడుకొంటూ పశువునకు ఊపిరి సలుపక కఫము తన్నుతూవ్రంటుంది. కన్ను గుంటలువిడుస్తూ చూచేమనిషికే విచారముగావుంటుంది పశువులకుకూడ యిట్టిజబ్బులు భగవంతుడు సంప్రాప్తించినాడాయని రైతులు పదేపదే విచారపడుతూవ్రంటారు. ఈవాపు గొంతుక వద్ద కనబడుట వలన కంఠమాదయనీ ఊపిరాడకపోవుటవలన గురకయనీ చెప్పుతారు. ఆగురక చాలాదూరమువరకు వినబడుతుంది. పశువు తన వీపును బాధచే ముడుచుకొంటుంది పశువు పేగులువాచి కందుతాయి నొప్పిగల దగ్గువ్రంటుంది. శ్వాసకోశములు చిన్నవగుతాయి. క్రిమేపి వ్యాధిముదిరి అకస్మాత్తుగామరణించుతుంది.

## చికిత్స

ఈవ్యాధి సామాన్యముగా చికిత్సకు లొంగదు మంచి పశువులను వీనితో కలుపక ప్రత్యేకముగావుంచాలి నాలుక జారవిడచి

గోండు పెట్టుచున్నపుడు ఆ పశువు బ్రతుకదని గ్రహించాలి ఏ మందయిన పోసిన గుటక వేయక వెంటనే మరణించుతుంది

ఆరంభములోనే నాలుగు డ్రాముల సారాయితో అర్థసేరు దుష్టుపాకు పసరు కలిపి త్రాగించుట మంచిది.

లేక సేరున్నర పాలలో 4 తులములు వసపొడి కలిపి కాచి కాఫీ త్రాగునంత వేడిగానున్నపుడు నాలుగుగంటల కొకపర్యాయము త్రాగించుము

లేక పసుపు 2 తు, సొంటి 2 తు, పిప్పళ్ళు 2 తు, వెల్లుల్లి 10 తు, ఎండుమిర్చి 6 తు, మెత్తగానూరి అర్ధసేరు మునగచెక్క రసముతో పెట్టుము

ఆరంభములోనే మీపశువులన్నిటికి ఫాస్టసివారి జంతురక్షణిని గాని పశురక్షామృతముగాని రాకుండా వాడవచ్చును అద్భుతంగా పని చేస్తుంది




దీనినే గూడవాపు లేక జబ్బవాపు అందురు

## స్వభావము - వ్యాపకము

ఇదికూడ విచిత్రమైన వ్యాధియే. ఈవ్యాధి కొండప్రదేశము లందు, అరణ్యప్రాంతములందు, రాతినేల ప్రాంతాలలో వుండేపశువు లకుతరచుగాకఠినముగా సోకుతుంది. ఈవ్యాధిని కలిగించు సూక్ష్మజీవులు గాలిరూపాన, నీటరూపాన ఆహారమువల్ల పశువులందు ప్రవేశించు తాయి. లేతవయస్సులో వుండే పశువులు అనగా 4 నెలలనుండి 5 సంవత్సరములలోపు వానికి విస్తారముగాను తక్కువవానికి తక్కువగా సోకుతుంది. ఈవ్యాధి కొన్ని పశువులకు పైకనబడక లోపలనే దాగి యుంటుంది కండబట్టి మిగుల బలిసియున్న గిత్తలకు తరచుగా నీవ్యాధి సోకుతుంది. వేసవికాలములో సరియగు మేత లేక తొలకరించగనే మిక్కిలి ఆతురతతో పచ్చికను తిను పశువులకు గూడ ఈవ్యాధి సోకుతుంది. ఈ వ్యాధిఒంటెలకు, గుఱ్ఱములకు, గేదెలకు, ఎద్దులకుకూడతగులుతుంది. భూమిలో పెరిగే ఒకవిధమగు సూక్ష్మజీవులు రోగముతగిలినపశువు యొక్క రక్తప్రవాహములో సాధారణముగా కనిపించవు. వాపు కనిపించినచోట మాంసములో అవితప్పకకనిపించుతాయి. ఈసూక్ష్మ జీవులు సులభముగాచావవు ఈవ్యాధి పశువులకుసోకిన రెండుమూడు దినములకుగాని బయటకు కనపడదు. తీవ్రముగా వచ్చిన కొన్ని గంటలలోనే చనిపోతాయి.

## లక్షణాలు

ఈవ్యాధితగిలిన పశువు మిగిలినవానితో నుండక ప్రత్యేక స్థలమునందు వుంటుంది. పశువు మందమతిగా వుండి కుంటుతుంది. జాగ్రత్తగా పరీక్షించినచో ముందు జబ్బమీదనో, వెనుక తొడల మీదనో, లేక మెడ, పిఱ్ఱ, రొమ్ము, వీపు నడుముమీదనో, వాపు కనబడుతుంది. ఆవాపును పట్టి చూస్తే ఎక్కువ వేడిగా వుంటుంది ఆవాపుచుట్టూ వృద్ధిపొంది పశువును కదలకుండునట్లు చేస్తుంది. మరికొంత సేపటికిఆవాపు పైకి పొంగి సల్లుంటుంది. అప్పుడు ఆవాపు మీద చేతితో తట్టినయెడల బుసబుస లాడుతుంది. వాచినప్రదేశము యొక్క చర్మముక్రిందభాగాన చీల్చితేఆమాంసము కుళ్ళియుంటుంది.

పులిసిననుకుగువంటి ద్రవము కారుతుంది ఈవాపును నొక్కిన కరకర మను శబ్దముకూడా యుంటుంది. ఈవాపునుబట్టియే జబ్బవాపు, గూడవాపు అనిపేరువచ్చింది ఇంక ఈవాపు శీఘ్రముగా పెరిగి 24 గంటలలోగాని, రెండుమూడు దినములలోగాని పశువునుచంపుతుంది. వ్యాధి ముదిరినకొలది శరీరము శీతలములోనికివచ్చి నాడి బలహీనమై వణకుతూ ఊపిరి కష్టముగవిడుస్తూ మూలుగుతూ క్రమేపి మత్తువచ్చి చనిపోతుంది ఈరీతిగా నూటికి 95 వరకు చనిపోతాయి.

## చికిత్స

వాపును కత్తితోకోసి కుళ్ళిన మాంసాన్ని తీసివైచి కర్పూర తైలమునుగాని లేక జిల్లేడాకుదుష్టు పాకుపసరు సమానభాగాలు రాతితడిసున్నం ఒకభాగముకలిపి పట్టించాలి.

లోపలికి మూడుడ్రాములు సారాయిని త్రాగించుము.

లేక నాగజెముడు మట్టను ఉడికించి దానిలో సన్నావాలు కొద్దిగావేసి త్రొక్కిన జిగురుగావస్తుంది. దానిని వాపునకుపట్టించాలి అంతకు వాపుఆగనప్పుడు వాపుచుట్టు రక్షలు వేయుటమంచిది.

లేక బాలింతబోలు 1 తు. గండఫిరోజు 2 తు, ముసాంబ్రము 1తు, మెత్తగానూరి సారాయితో వాపుమీద పట్టించవలెను. మంచి పశువులకు రాకుండ జంతురక్షణి వాడుము




దీనినే కురమ- చలికురమ, ఒకవిధమగు విషజ్వరము అని చెప్పుదురు.

## స్వభావము-వ్యాపకము

ఈజాడ్యము వర్షాకాలము నుంచి శీతాకాలము వరకు వ్యాపించి యుంటుంది రైతులలోను నాటువైద్యులలోను కొంతమంది ప్రతిజంబ్బకూ కురమయంటారు. ఈవ్యాధిని కలిగించే సూక్ష్మజీవులు ఒకతరగతి దోమలయందు నివాసమేర్పరచుకొంటాయి పశులు రక్తములోవుండే ఎఱ్ఱకణాలలో ఇవి జేరియుంటాయి. ఇవి పల్లపుభూములందు, గొప్ప నదులు సముద్రములో కలియుచోటులందూ అడవిప్రదేశము లందూ బురదనేలలందూ కుర్రిళ్ళుచుండు పెంటపోగులందూ దాగియుంటాయి. ఎండలు తీవ్రముగావున్నపుడు ఈ సూక్ష్మజీవులు పైకివచ్చుతాయి. పశువును ఎండలో పనిచేయించుటవల్ల లోపలి నెత్తురు ఉడుకెత్తునపుడు ఈ వ్యాధి రావచ్చును. ఇంకను చక్కని కోడెలకు, ఆవులకు, మధ్య వయస్సుగల జంతువులకు, పెద్దవయస్సులో వున్నవానికి తక్కువగా ఈ వ్యాధి సోకుతుంది

## లక్షణాలు

ఆరంభములో పశువువణకుతుంది. మలబద్ధకముంటుంది ముఖ్యముగా దగ్గువుంటుంది. అన్నిటికంటె ముఖ్యమైన లక్షణము చెవులు వ్రేలాడక నిక్కపొడుచుకొనివుంటాయి. నల్లకప్పు వేస్తుంది. కాళ్ళు ఒకటి రెండుగాని అన్నీగాని పట్లుపట్టుతాయి. వెన్నుచర్మము బిగిసియుంటుంది మూత్రము పసిమిరంగుగా పోస్తుంది మేత నెమరు మానుతుంది. మరికొన్ని కాళ్ళు పట్లు బాధసహించలేక వెల్లికిలిగా పరుండి గోండ్రుపెట్టుతాయి. మరికొన్ని మంచిబలముమీద వుండి గురకరోగములోవలె గోండ్రుపెట్టుతాయి మరికొన్నిటికి నోటివెంట చొంగపడుతూవుంటుంది. వ్యాధి తీవ్రముగావుంటుంది. 106, 107 డిగ్రీలజ్వరమువుంటుంది. కాళ్లు, చెవులచివరిభాగాలు, చల్లగావుంటే చలికురుమ యంటారు. కడుపుబ్బరముగా వుండి మునగతీసుకొంటుంది. పశువుయొక్క తత్వాన్నిబట్టి పైలక్షణాలలో తదితర లక్షణాలుకూడ యుండవచ్చును.

## చికిత్స

ఈ వ్యాధినిగూర్చి ప్రతిరైతునకు తెలియును. ఈ వ్యాధివలన ప్రమాదమురాదు. కాని కొన్ని పశువులకు ప్రమాదమువస్తుంది. పశువుబలహీనమై నాలుగుకాళ్లను కదల్పలేక కనుగుడ్లు బయటకు వచ్చిన ఆ దీర్ఘశ్వాస కలిగినప్పుడు మాత్రము ప్రమాదము రావచ్చును.

(లేకతిప్పతీగెరసముసేరువుంచినూనెఅర్ధసేరుకలిపిఒకసారిత్రాగించును)
లేకదుష్టుపాకురసము అర్థసేరు, సారాయి 2 డ్రాములు త్రాగించును.

లేకదుష్టుపాకు అరగుప్పెడు తురకవేపాకు అరగుప్పెడు, వావిలాకుఅరగుప్పెడు, వాము4తు, వెల్లుల్లి4తు, పసుపు1తు, నీరు రెండుసేర్లు కలిపికాచివడపోసిపూటకురెండుగొట్టముల వంతునతగ్గువరకుపెట్టును.

కాళ్ళపట్లకు హారతికర్పూరం 1/2 తు, కొబ్బరినూనె 10తు, కలిపి గోరువెచ్చగ కాచి రాసి వేడినీటి కాపులుగాని, చన్నీటిలో గుడ్డనుతడిపి ఆభాగాలకు కొట్టిగాని చికిత్సచేయాలి. ఇంకను కాళ్ళపట్లకు తిప్పతీగె రసమునుగాని దూసరాకు ఉమ్మెత్తాకు పసరుగాని దుష్టుపాకు రసమును కలిపి తగినంత వెన్నగో కలిపి మర్దనచేయాలి లేక పిడక బూడిదనుగాని, విభూతినిగాని కాళ్ళపట్టులకు, ముత్తిలకు రుద్దిన మంచిది.

ఈవ్యాధితగిలిన ఆరంభములోనే దుష్టుపు తీగెనుగాని దూసర తీగెనుగాని తిప్పతీగెనుగాని పలుపులువలెచుట్టి మెడలో వేసిన తాత్కాలిక జ్వరము, నొప్పులు ఆఘాతువలన తగ్గును గాన తప్పక ప్రతిరైతు ఆచరించాలి

కాళ్ళపట్లకు స్ప్రెయిన్‌కిల్లర్ చక్కగాపనిచేయును

పథ్యము — జ్వరము తీవ్రముగానుండి రొప్పుతున్న ఎండు కర్జూరకాయలు 10 కొట్టి సేరు నీటిలోవేసి త్రాగించాలి. నూక జావను, బియ్యపునీటిని కాచినవేడినీటిని అప్పుడప్పుడుత్రాగించాలి. ఫార్మసీవారి స్వర్నాసవను వాడాలి

# మశూచి

ఈవ్యాధినే స్ఫోటకమంటారు పశువులయొక్క గుఱ్ఱములకు గొర్రెలకు పందులకు ఒంటెలకు కుక్కలకు సోకుతుంది. ఇది అంటుసంబంధమైనట్టి పొక్కులు చేసునట్టి జీవితమునందు సామా



న్యంగా వొకపర్యాయము కలుగునట్టి జ్వరమైయుంది ఈవ్యాధిప్రారంభించినది లగాయతు వెన్నాదినముగు పదకుండురోజులలో అస్వస్థతగాయుండినా మాలిన్యమేర్పడినా చర్మమునుండి పూర్తిగా పొక్కులుపోవువరకు విశేష అంటుగుణము వహించియుంటుంది చీడ, పాడుమీదవచ్చుపొక్కులనే కొందరు మశూచి అంటారు అట్లనుట పొరబాటు. ఈరోగముగలపశువులతో మంచిపశువులు కలియుటవలన పశువుల కాపరులు పాలు పితుకువారు, జబ్బుపశువులను తాకి మంచిపశువులను తాకుటచేత ఈ వ్యాధికలుగుతుంది. పట్టణాలలో వుండేవాటికే ఈవ్యాధిఎక్కువగా వస్తుంది కొన్నిపశువులు గుఱ్ఱములద్దెలు ఒంటెలద్దెలు తినుటవల్ల కూడరావొచ్చును.

## లక్షణాలు

ఆరంభములో జ్వరముపుంటుంది కండ్లనుండి నోటినుండి నీరు గారుతుంది. మేతతినదు. పాలిచ్చు పశువుల పొదుగుమీద చన్నుల మీద దూడలకు మూతిమీద ఎద్దులకు తొడలమధ్య వెంట్రుకలు లేని చోట్లను బఠాణీగింజలంత పొక్కులై పక్వమై పలుచబారి పగిలి ఒకవిధమగు రసికారుతాయి. వీటినే రసికుండలంటారు. మనుష్యులకు వేయుటీకాలరసము ఈ రసికుండలనుండియే తయారుచేస్తారు. ఈ వ్యాధి మనదేశములో చాలాతక్కువ పాడిపశువుకుఈవ్యాధితగలగానే పాలుతగ్గుతాయి. రెండుమూడు దినములైనతర్వాత యెర్రనిచుక్కలు పశువు శరీరముపైన కనపడుతాయి. తర్వాత పొక్కులుగా మారి నాల్గుదినములైన తరువాత పొక్కులు శరీరమునందంతట వ్యాపించి నీరు పట్టిఎఱుపుగానుండి మలినమేర్పడి ముఱుచి వాసన స్పష్టముగ కన బడుతాయి ఈ వ్యాధి ఉదృతిచహించినచో ముఖమువాడిపోయి కన్నులు మూసుకొనిపోతాయి. పొక్కులుఎండి గోధుమరంగుగా మచ్చలుపడిపక్షములేక అరమండలము రోజులవరకుగాని నెమ్మదికాదు.

## చికిత్స - పోషణ

జబ్బు పశువును ప్రత్యేకముగా వుంచి జాగ్రత్తగా పోషణ చేయాలి విరేచనము గావించు పదార్థాలను పెట్టుచు, పుండ్లకు దగిన చికిత్సలు, తగిన సంరక్షణచేయాలి. చురుకుదనము కలిగించు ఆహార పానీయాల నిచ్చుతూ అప్పుడప్పుడు ఘాటుగల ధూపాలను వేయు చుండాలి.

## జ్వరములు

మానవులకు వలనే పశువులకుకూడ వివిధరకాల జ్వరాలుగలవు వాటి జ్వర లక్షణాలను బట్టి, రోగపశువు యొక్క తత్వాన్ని బట్టి, వ్యాధియొక్క ఉద్రేకతను బట్టి జ్వరాలకు మందులు వాడాలి. వాతిసంబంధమైన జ్వరాలు పైత్యసంబంధమైనజ్వరాలు, శ్లేష్మసంబంధ

మైనజ్వరాలు అజీర్ణసంబంధమైనజ్వరాలు, వరుసజ్వరాలు చలి జ్వరాలు కాలజ్వరాలు, సూతికా జ్వరాలు అని ఆయా వ్యాధులలో వచ్చేజ్వరాలకు తగినమందులు, ఆహారపానీయాలు బలవర్ధక ఔషధాలు ఉపయోగాలతో అనుభవముతో చికిత్సలు చేస్తూవుండాలి. ఇంకను ఈ పగువజ్వరాల విషయమై గమనింతురుగాక. ఈవిషయాలన్నీ ఎందుకు తెలుపుతున్నాననగా పశువులకు కూడా మానవులకు వలె యిన్నిరకాల జ్వరాలు ఉన్నవని విదేశాల పశువుల జ్వరాలు, మనదేశపు జ్వరాలు తేడాలు కూడ గమనింతురుగాక.

## టెక్సాస్ జ్వరము

ఆఫ్రికా, అమెరికా, ఇండియా, క్వీన్సులాండ్ యూరపు దేశాలలో ఈజ్వరాన్ని కలిగించే సూక్ష్మజీవులను కనుగొన్నారు.

## ఈస్టుకోస్టు జ్వరము

తూర్పు ఆఫ్రికాలో ఈరోగము టిపర్వా అనుసూక్ష్మజీవివల్ల కలుగుతుంది.

## హార్సుఎక్సైన్ బిల్లారిజ్వరము

యూరపు, రష్యా, అమెరికా, ఇండియా, దక్షిణ ఆఫ్రికా, ఆస్ట్రేలియా, దేశాలలో బి. కబ్బలిస్ అను సూక్ష్మజీవులవల్ల కలుగుతుంది.

## ఎల్లో జ్వరము

ఇది వేటకుక్కలకు ఎక్కువగా వస్తుంది. ఈరీతిగా పశువులకు రకరకాల జ్వరాలువున్నవని తెలియుచున్నవి. గాన పైచెప్పినజ్వరాల విషయాలు గుర్తించుకొనుటే తప్ప వాటికి తగిన చికిత్సలు పెద్ద డాక్టర్లకు తప్ప సామాన్యవైద్యులకు అర్థముకావని గుర్తించుకోవాలి.

## జ్వరము

పశువుశరీరంలో జ్వరము మామూలుగా వుండే ఉష్ణముకంటె ఎక్కువగా వుండి కదలిక తక్కువగా, ఆహారంమీద ఇష్టత లేకుండుట ఉష్ణమువలన వణుకుట, నోరు పొడిగా వుండుట, నెమరుమానుట, పక్కలొ ఎగరుట కొమ్ములు వేడిగా వుండుట, చర్మము బిరుసుగా వుండుట, నాడి తీవ్రముగా వుండుట, నాలుగునుంచి ఆరు గంటలలో మరల పశువునకు తెలివివచ్చి మేత మేయుట మున్నగు లక్షణాలతో జ్వరము వుంటుంది.

## చికిత్స

జ్వరము మాత్రమే యున్నచో సేమన్నర వరినూకల జావలో 2 తులాల సూరేకారము 4 తులాల అల్లపురసము కలిపి రోజువిడచి రోజు యిచ్చిన తగ్గుతుంది లేక ఫార్మసీవారి పశురక్షామృతం యిచ్చిన బాగా పనిచేస్తుంది. తదితర రోగాలలో జ్వరముంటే రోగానిదానము గ్రహించి తగిన చికిత్స చేయాలి

## క్రిమిసంబంధ రోగాలు

పశువులు, గొర్రెలు, మేకలు, గుర్రములు మున్నగు జంతువులు క్రిమిదోషపూరితములగు పచ్చిగడ్డి, తదితర కాడజాతులను తినుట వలన దొమ్మగురక తదితర అంటు రోగాలను కలిగించే బాసిలెస్ యెన్‌థరసీస్ అనేకిమి సంబంధమగు రోగాలు వుత్పత్తి అగుతాయి ఇట్టి క్రిమిసాంక్రమిక రోగాలతో కృశించుతూవుండే పశువులను మేపుట, వానిముందర మేతపడవేయుట, వాని పాలు పిండుట, స్వారిచేయుట, కోయుట, అమ్ముట చర్మములు పదును చేయుట, ఉన్ని నరుకుట, కత్తిరించుట, మున్నగుపనులు చేయునప్పుడు ఈ బాసిలెస్ యెన్ థరసీస్, క్రిములు మానవుల శరీరమందు గాని, శ్వాసకోశములలో గాని, చేరి చర్మ వ్యాధులు, విషజ్వరాలు సోకగలవు గాన జాగ్రత్తగా పై విషయాలు గ్రహించి తమ ఆరోగ్యాలను కాపాడుకోవాలి.

పోయిన శరీరము అతి నీరసమేర్పడి, మేతతినక, నీరు త్రాగక, శ్వాస నెమ్మదిగా విడుస్తూ పశువు బాధపడుతూ వుంటుంది. కాబట్టి అనుభవము గల వైద్యునకు చూపించి తగిన చికిత్సలు చేయించాలి గాని తెలిసి తెలియని చికిత్సలు చేయరాదు.

## వణకుట

పశువులకు తీవ్రమైనదొమ్మ, కురము, శీతవాతము, ఉష్ణవాతము, అపస్మారము కుందేటివెర్రి మున్నగు రోగాల కారణాలవలన శరీరకండరాలు వణకుట, వెంట్రుకలునిక్కబొడుచుట, కొన్నిటికి చలి వేడితో బాధపడుట మున్నగు లక్షణాలువుండి కొన్ని కండరాలు అదురుతూవుంటాయి అట్టిసమయంలో మనరైతులు ఏమైనావిషపురుగులు కుట్టినవో, కరచినవోయని తడబడుచూ పసుపుముక్కురంధ్రములకు రాసిపరీక్షించుతారు. రాసినపసుపు భాగము ఎర్రగావుంటే పాముకరచినదని, పురుగుముట్టుకుందని తొందరపడి పిచ్చిపిచ్చివైద్యాలు చేస్తారు. ఇట్లుచేయుట పొరపాటు. అనవసరముగా ఆపశువును బాధపెట్టుటతప్ప మరొకటికాదు. ఈగ్రంధములో విషతంత్రముచూస్తే ఆభాగమందు పసుపుఎట్టివ్యాధులలో రాయాలో తెలుస్తుంది. కాబట్టి ఎప్పుడైతే పశువు వణకుతుందో అప్పుడు చురుకుదనము కలిగించే మందులు ఈయాలి లేదా ఫార్మసీవారి పశురక్షామృతం వాడితే చక్కగా పని చేస్తుంది.

## క్షీణించుట

పశువునకు పారుడురోగం, దొమ్మ, గాలికుంటు, కురము. రక్తమూత్రము, శస్త్రచికిత్స, సూతికా వాతము మున్నగురోగాలు సోకి నెమ్మదించిన తరువాత బలహీనత, నిస్త్రాణ, కన్నులలోని కాంతి,

కన్నుగుడ్లు లోతుకుపోవుట, శరీరవేడిమితగినంత లేకుండుట, ఆకలి లేకుండుట మున్నగునవి లక్షణాలతో పశువు విచారముతో వుంటుంది. రైతుమాత్రము రోగం తగ్గినదికదా పనిపాటలకు ఎప్పుడు పనికి వచ్చునాయని నిరీక్షించు చుంటాడు. ఈపరిస్థితులలోవుండేపశువులకు చలిగాలి, ఎండతగులనీయక, వర్షాలలో కట్టివేయక గాలి వెలుతురు వచ్చే పశువుల కొట్టంలో కట్టివేసి వెచ్చగావుండే పొడిగడ్డిని పక్కవేసి బలము జీర్ణం కలిగించే దాణాలు మేతలు పెట్టుచూ ఫార్మసీ వారి "పశుబలవర్ధని"నిగాని వాతారి అరకునుగాని ప్రతిరోజూ వాడుతూ వేళలప్రకారం నీటిని త్రాగించుతూ ఒకపక్షము లేక మండలము రోజులు కాపాడిన పశువుయొక్క క్షీణత, నిస్త్రాణతగ్గి ఆరోగ్యం చెందుతుంది. లేనిచో మరల రోగము తిరుగబెట్టి అకస్మాత్తుగా వేడితగ్గి ప్రమాదమునకు రాగలదు.

## అరోచకము

పశువులకు అజీర్తిచేసిగాని, వాతముచేసిగాని, జ్వరము వచ్చిన తరువాత తగ్గిగాని, అంటు రోగాలు సోకి దైవవశాత్తుతగ్గినపుడుగాని నోరంత జిగటగా బంకగావుండి ఒకవిధమగు వెగటువాసన వేస్తూ వుంటుంది. అందుచేత ద్రవపదార్థంగాని,ఘనపదార్థంగాని,లోపలికి యిచ్చినపుడుతినుటకు(తాగుటకు యిష్టము లేకకొన్ని దినాలుఆకలిమంద గించి తిన్న మేత నెమరకురాక కండ్లనుండి నీరుకార్చుతూ యజమాని వంక దీనముగా చూస్తూవుంటుంది అట్టిసమయంలో రెండుసేర్ల గోరు వెచ్చని నీటిలో 1/8 తులము పటికపొడికలిపి ఉదయం సాయంకాలం మందు నోటిని నాలుకను దవుడలలోపలభాగాన్ని, ముక్కులను మాప్ చేస్తూవుంటే పశువు ఆరోగ్యంచెంది ఒకవిధమగు లాలాజలరసంవుత్పన్నమై ఆకలియై ఆహారంకొరకు నిరీక్షించుచూ వుంటాయి. మరికొన్ని

టికి ఈపటికలో లోషన్‌తోగాని, వగరుగల తుమ్మ, నేరేడుచెక్కల కషాయంతోగాని పుక్కిలింపచేస్తూ రెండు వేళల సాంబ్రాణిపొగముక్కు-



లకు వేస్తూ జీర్ణముచేసే ఆహారాన్ని యిచ్చిన కొలదికాలంలో నెమరు తిరిగి పశువు ఆరోగ్యం చెందుతుంది. ఇటువంటిచట్కాలను రైతులు అనుభవంతో చేసికోవాలిగాని అయినదానికి కానిదానికి డాక్టర్లకోసం నాటువైద్యులకోసం పరుగెత్తవద్దు.

# ఇ రు వ ది రెం డ వ భా గ ము

## జీర్ణరోగాలు

పశువుయొక్క జీర్ణకోశము చెడుటచే అజీర్తి యేర్పడుతుంది. నెమరువేయు ప్రతి జంతువుయొక్క పొట్టనూ నాలుగు భాగాలుగా విభజింపవచ్చును కాబట్టి నాలుగు పొట్టలలోనూ అజీర్తి యేర్పడవచ్చును వ్యాధిలక్షణాలనుబట్టి నాలుగుకోశాలలో ఏ కోశము చెడిందీ పరీక్షించవచ్చును. ముఖ్యముగా ఈ వ్యాధి పాడిపశువులకు ఎక్కువగా వస్తుంది. వేసవికాలమందు మేతతక్కువగా, వర్షాకాలమందు మేత ఎక్కువగా, తినుటచేత మామూలు ఆహారము తినుచు జొన్నపిండి, ఉలవపిండి తదితర దాణాలు గొంతుకవరకు పెట్టుటచేత పశువును పనిచేయించక సోమరితనముగా నుంచుటచేత పశువుఆహారకోశములో పురుగులు, సున్నము, జీర్ణముగాని కఠిన పదార్థములు యుండుటచేత ఈ వ్యాధి కలుగుతుంది. తదితరవ్యాధులు కలిగియుండి అజీర్తికూడ కలుగవచ్చును.

## లక్షణాలు

ఆకలితగ్గి అరమేతమేస్తుంది. చక్కగా లెక్కప్రకారము 36 నెమర్లువేస్తూనేవుంటుంది. మలబద్ధకముంటూ అప్పుడప్పుడు అపానవాయువులు వదలుతూ వుంటూంది. పేగులు అరుస్తాయి. కడుపు వెన్ను నంటియుంటుంది. నల్లకిప్పవేస్తుంది అప్పుడప్పుడు కడుపులో గాలి కూడ యుంటుంది. పాడిపశువైన యడలపాలుపచ్చి తగ్గుతుంది. వ్యాధి ముదిరినకొలది పశువు కృశించి ఆకలితగ్గి రక్తము క్షీణించుతుంది అంగిటి ముండ్లుకూడ పెరిగి నోరువాసనగా వుంటుంది, సరియగు బలవర్థకౌషధ మీయనిచో నీరసించి చనిపోవచ్చును.

## చికిత్స

సోడాఉప్పు 2 తు, కురంజీవాము 4తు, ఇంగువ 1తు నేలవేము 1తు, ఉప్పు 4తు, కలిపి సేరు గోరువెచ్చనినీటితోగాని నిమ్మకాయంత తాటిబెల్లంతోగాని దినమునకొక మోతాదువంతున పక్షము లేక నెలదినములు పెట్టిన తగ్గుతుంది.

లేక శొంఠి 2తు, మిరియాలు 1తు, పిప్పళ్ళు 1తు, ఇంగువ 2తు, వాము గిద్దెడు, ఉప్పు 3తు, కలిపి పైమాదిరిగనే పెట్టుము

లేక ధనియాలు చేరెడు, పిప్పళ్ళు 2తు, సదజీలకర్ర 2తు కురంజీవాము 4తు, ఉప్పు 4తు, కలిపి పెట్టుము.

లేక మిరపఆకురసము అర్ధసేరు, మిరియాలు 1తు, ఉప్పు 2 1/2 తులములు కలిపిపెట్టుము.

లేక మహిసాక్షి 2తు, కటకరోహిణి 1తు శొంఠి 1తు, ఉప్పు 4తు, కలిపి పెట్టుము.

లేక లవంగాలు 1తు, శొంఠి 2తు, నేలవేము 1 1/2 తు, సోడాఉప్పు 2తు, తాటిబెల్లం 8తు, కలిపి దినమునకొక మోతాదు వంతున పక్షమురోజులు పెట్టుము.

లేక చింతపండుపులుసు, కారము, ఉప్పు ఆవపిండి కలిపి రోజుకొక మూడుగొట్టములు పెట్టుము. పైచికిత్సలను వరుసగాకొంత కాలము వాడుము.

లేక ఫార్మసీవారి పశుబలవర్ధిని వాతారికలిపి కొన్ని దినములుపెట్టుము.

## మరొక సలహా

వరి కుప్పలు అపర ధాన్యాదుల నూర్చు నపుడు పశువులు ఆతురతతో తినుటవలన జీర్ణముకాక పేగులలో చిక్కుకొనిబాధపడు తాయి ఇట్టిసమయములో కొందరు వంకాయలను, దోసకాయలను

ఉప్పును, కొబ్బరినూనెను పోస్తారు ఇట్టిచికిత్సలను అనుభవపరుల సలహాతీసుకొని చేయుట మిక్కిలిమంచిది. కానిచేరెడు లేకరెండుచేరెలు ఉప్పును మెత్తగా నలుగగొట్టి దానిలో 4తులాల శొంఠిపొడిని కలిపి కాఫీత్రాగునంత వేడినీటిలో కలిపి పెట్టిన తగ్గుతుంది.

లేక కొబ్బరిని వేడినీటిలో వేసి తొక్కి 10 తులాలవుప్పును కలిపి పెట్టుము

లేకగిద్దెడు పేరినేతిలో సేరు గోమూత్రమునెచ్చని నీరుకలిపి మోతాదు ఈయుము

లేక మూడుడ్రాములు సారాయిని త్రాగించుము

లేక మూడుగుప్పెళ్ళ ఎండుమిరపకాయలు రెండుసేర్ల నీటిలో కలిపి కాచిపిసికి వడపోసి త్రాగించుము

లేక పశుమిత్ర లేక వాతారి అరఖు గ్యారంటీగా పనిచేస్తుంది.

## కడుపుబ్బు

జీర్ణముకాని పదార్థాలు నెమరు పొట్టలో నిలువయుండుట వల్ల అవిపులియుట వల్ల దూరప్రయాణమైన వెంటనే నేదైన మేత తిని తరువాత కుడితి మున్నగు పదార్థాలు త్రాగుటవల్ల తొలకరి వర్షములు కురిసిన తరువాత మొలచుగడ్డిని ఎక్కువగా తినుటవల్ల విషవంతములగు పొదలు మొక్కలు తినుటవల్ల పచ్చిజనుము, వరిపిలక మున్నగు వాతపదార్థము రుచిగానున్నవని ఎక్కువగా తినుటవల్ల ఈఉబ్బుకలుగుతుంది ఇంకను ఇతరరోగాలలోకూడ ఇదికలుగవచ్చును.

## లక్షణాలు

కడుపు విస్తారముగా పొంగుటయే ముఖ్యమైనగుర్తు. ఎడమ డొక్క భాగములోనే ఆహారకోశము వుంటుంది. ఎడమ డొక్కే ఉబ్బు

తుంది. ఆ ఉబ్బుమీద (వేళ్ళతో తట్టినయెడల గాలితిత్తివలె మ్రోగుతుంది. సకాలములో తగు చికిత్స చేయనిచో నెత్తురు తలకెక్కుతుంది. అప్పుడు ముఖముమీదవుండే రక్తనాళాలు ఉబ్బుతాయి. కన్నులు




కనబడవు ఊపిరి పీల్చుట కష్టముగా వుంటుంది పశువు మూల్గుతూ వుంటుంది వ్యాధి ముదిరిన కొలది మరణముకూడ సిద్ధమగుతుంది. డొక్కలో గాలి జేరితే గాలితీయాలి.

## చికిత్స

ఆరంభములో అరసోలెడు ఉప్పును మెత్తగనూరి సేరున్నర గోరువెచ్చని నీటిలో కలిపి త్రాగించుము లేక నాలుగు గుప్పిళ్ళ ఎండుమిర్చిని మెత్తగా నలుగగొట్టి మూడుసేర్ల నీటిలో కలిపి కాచి వడపోసి త్రాగించుము.

లేక కడుపులో గాలి జేరియున్న గాలి తీసేపద్ధతి చేయుము

లేక మామూలుగా తింటూ ఎక్కువై ముక్కుచున్న పశువునకు మూడు డ్రాముల సారాయిలో 2తులముల ఇంగువ కలిపి పెట్టుము.

లేక ముఖముమీద రక్తనాళములుబ్బి శ్వాస కష్టముగ పీల్చుచున్న ఉలితో ఆ రక్తనాళములను తెగగొట్టుము.

లేక కోడిరెట్టను 10తులములు తీసికొని సేరున్నర గోరువెచ్చని నీటిలో కలిపి త్రాగించుము.

లేక జొన్నదంటుగాని వరిగడ్డినిగాని కాల్చి మసిచేసిమూడు గొట్టములు పెట్టుము.

లేక దిరిశెనఆకుపసరుసేరు, కాం 4 తు.ఉప్పు చేరెడు ,కలనీరు సేరు, కలిపి త్రాగించుము.

లేక సోపు 2 తు ఏలకులు2 తు, జుంకర2తుశొంఠి 2 తు, కలిపి సేరుగోరు వెచ్చనినీటితో త్రాగించుము. లేకవాతారిఅరఖును ఈయుము.

## ఆకస్మిక కడుపుబ్బు

పశువు కడుపులో విషపదార్థాలు చిక్కుకొనుటవల్ల, తాటి పండ్లు తదితర వస్తువులు గొంతుకకు అడ్డుపడుటవల్లజీర్ణముకాకతినిన పదార్థములు పులిసి ఆహారకోశములో నిలువయుండి ఒక విధముగు గ్యాసుగా ఏర్పడుటవల్ల, తదితర కారణములవల్ల ఆకస్మికంగా కడుపు పుబ్బుతుంది.

ఇట్టిసమయములో పశువు తత్తరపడుతూ దేహము ముడుచు కొంటుంది. ఎడమడొక్క గ్యాసుతో బాగాపుబ్బుతుంది, వ్రేలితో నొక్కిన గుంటఎడక డండం అను ధ్వని కలుగుతుంది. మలబద్ధకము వుంటుంది వెంటనే తగుచికిత్స చేయనిచో చనిపోతుంది.

## చికిత్స

కడుపు విస్తారముగపొంగి శ్వాస ఆడనపుడు ఎడమప్రక్క నడుముఎముక కడపటి ప్రక్కఎముక, తొంటిఎముక ఈ మూడు ఎముకలకు మధ్యగావుండే భాగములో అనగా రమారమి గుంటగా నుండు ఎడమపక్కకు మధ్యభాగాన సిరాతోగాని, పేడతోగాని గుర్తుపెట్టి పశువును పడవేసి ఆగుర్తుమీద డొక్కలో ఒకచిన్నచాకుతో గాని ట్రోకారు అను పనిముట్టుతోగాని పొడిచి గాయముగుండ

గొట్టమును తగిలించిన లోపలనున్న గ్యాసుఅంతా బుస్సుమని దుర్గంధముతో పైకివచ్చి ఉబ్బరముతగ్గుతుంది. మరునాడుకూడ ఈరీతిగ గ్యాసుతీసి ఆముదమును సేరున్న, వాము 6 తులములును నూరికలిపి ఒకమోతాదు ఈయాలి. లేక గ్యాసును పోగొట్టువస్తువులను ఈయాలి. గొంతుకలో తాటిపండ్లు, ఎముకలు అడ్డుపడిన ఒక నున్నని తిన్నని కర్రను గొంతులోనికి పోనిచ్చి కొద్దిగా ఆముదము పోయుచు బైటకో లోపలికో నెట్టాలి. ఇంకను ఏమైన చిన్నవస్తువులు చిక్కుకొన్న కోడిగుడ్డు తెల్లసొనతో ఆముదముకలిపి గొంతుకలోనికి జారవిడువాలి. లేదా ప్రోబాంగు అను పనిముట్టును గొంతుకలోనికి జొనిపి తీయాలి. ట్రోకారుతో పదేపదేచేయరాదు. వేసినను లాభము లేదు.

## ఉదయం సాయంకాలపు ఉబ్బ

కొన్ని పశువులకు అజీర్తివల్లగాని ఇతర కారణములవల్లగాని ఆహారకోశములోగాని జేరుచూపోతూవుంటుంది కొన్నిటికి ఉదయపు పూట మరికొన్నిటికి సాయంకాలము ఇంకాకొన్నిటికిఅన్ని వేళలందూ డొక్క భాగములో ఉబ్బు కనబడుతూ వుంటుంది ఈ వాపు ఉన్నంత సేపు పశువునకు బాధగా ఉంటుంది మేతసరిగా తినదు కొన్నిటికి దగ్గువుంటుంది. చికిత్స చేయకపోతే దీర్ఘరోగముగాఏర్పడి ఆహారకోశము చెడి మలబద్ధకమేర్పడి పశువుమృత్యువునకాసన్నమగుతుంది. గాన ఆరంభములోనే చికిత్సచేయాలి. ఈ ఉబ్బునే ఎగుబోరవలి దిగుబోరవలియంటారు. ఈవ్యాధినిబట్టిమందులు వాడాలి. లేనిచో ప్రేగులకు అపాయము కలుగుతుంది

## చికిత్స

ఆరంభములోనే అడ్డసరపాకులు2గుప్పిళ్ళు ఉప్పు చేరెడు, ఇంగువ 2తు,కలిపితొక్కి దినమునకొక మోతాదునంతున సేరు గోరువెచ్చని నీటితోగాని, కారపుపాలతోగాని నాలుగుదినములు వరుసగాయిచ్చిన తగ్గుతుంది.

లేక మెడికల్ అవిసెనూనె సవాసేరు, కర్పూరతైలం 2 1/2 తు, నవాసాగరం 1 తు, కలిపి ఒక మోతాదు మాత్రమే యిచ్చిన తగ్గుతుంది. అవిసెనూనె మందులషాపుల్లో దొరకుతుంది. రంగులలో కలిపేది వాడరాదు అదివిషము.

లేక మసిబొగ్గుపొడి 6తు, కారప్పుపొడి 4తు. సున్నపు తేటసేరు, కలిపి త్రాగించుము.

లేక వావిలాకుపసరు సేరు శొంఠి 2తు, పిప్పళ్లు 1తు, మిరియాలు 1తు, చేదుజీలకర్ర 2తు, ముసాంబ్రము 1/2 తు, మహిసాక్షి 1తు, కారప్పుపాలు సేరు కలిపి త్రాగించవలెను. లేక పశుమిత్రను గాని వాతారి అరకును గాని వరుసగా వారమురోజులు వాడిన మంచిది

## కడుపునొప్పి

పశువు ఎండుగడ్డిని, పచ్చిగడ్డిని వెంటవెంటనే మేయుటచేతను ఆతురతతో అందినముండ్ల చెట్లు, కంపజాతులను తినుటచేత ఎల్లప్పుడు చల్లనినీటిని త్రాగుటచేత పేగులలో జీర్ణముకాని పదార్థాలు నిలువ




యుండుటచేత, వాయుపూరితంగా కడుపుబ్బరంగా వుండునపుడు పనిచేయుటచేత, మత్తుపదార్థాలు పేగులలో చిక్కుకొనిపోయి బాధ కలుగుటవల్ల, తవుడు, జొన్నలు, వడ్లు మున్నగు గట్టి పదార్థములు మిక్కుటముగా తిని జీర్ణము కాకపోవుటవల్ల, ఈవ్యాధి కలుగుతుంది. ఈ నొప్పి అనేక కారణాలవల్ల పలువిధాలుగా రావచ్చును

## లక్షణాలు

పశువు మేత మేయుట మానుతుంది. ఏమియూ తోచక పరుండు తుంది. ముఖ్యముగా పశుపుత్రిలను ఎడమడొక్క దగ్గర ఆనించి మూల్గుతూ వెనుక కాళ్ళతో తన్నుకొంటూ వెన్నును విరుస్తూ, పడుకొంటూ, లేస్తూ, తోకనుఎత్తుచూ, మాటిమాటికి మూత్రమును పోయుచూ, పేడపలుచగ గాని గట్టిగగాని అసలు వేయకుండగగాని యుండుచూ అప్పుడప్పుడు పండ్లుకొరుకుట కన్నులుతిప్పుట, నురుగు కక్కుట మున్నగులక్షణాలు వుంటాయి.

## చికిత్స - పరీక్ష

ఈవ్యాధి ఏ కారణమువల్ల వచ్చిందో, ఏ పరిస్థితిలో వుందో వెంటనేతగ్గునా, ఎంతకాలము పట్టును? అప్పుడప్పుడు వచ్చిన ఏ లక్ష ణాలతో వుంది? ఎనిమా అవుసరమా? మున్నగు విషయములను పరీక్షించి తగిన చికిత్స చేయాలి.

ఆరంభములో ఉప్పుచేరెడు వాముఅరసోలెడు, ఇంగువ 4తు, సన్నావాలు 4తు, కలిపి సేరున్నర గోరువెచ్చని నీటిలోకలిపి ఒక మోతాదు ఈయాలి

పేడవేయక మలబద్ధకముగ నున్నపుడు సబ్బునీటితో ఎనిమా చేయుటమంచిది

లేక గచ్చాకురసము అర్ధసేరు ఇంగువ 4తు. ఉప్పు చేరెడు కలిపి త్రాగించాలి.

లేక దీర్ఘకాలపు నొప్పిగానున్న శొంఠి 1తు, మిరియాలు2తు, కురంజీవాము 2తు, సోడావుప్పు 1తు, వాయువిడంగాలు 1తు, నీరు సేరున్నర కలిపి రెండుదినముల కొకమోతాదు ఈయాలి

లేక నొప్పిచే తన్నుకొనిచుండిన గాడిదగడపాకు పసరుగాని, వాముపాటకుగాని ఈయాలి. లేక ఫార్మసీవారి వాతారిఅరకు అద్భుతముగా పనిచేస్తుంది.

# మలబద్ధకము

పశువుయొక్క తత్వాన్ని బట్టి అప్పుడప్పుడు గాని, ప్రతిదినము గాని మలబద్ధక మేర్పడుతుంది. ఈవ్యాధి కూడ అనేక కారణాల వల్ల రావచ్చును పేగులు సరిగా పని చేయక పోవుటవల్ల అనారోగ్య




ముగు మన్య ప్రదే శాలలో వుంచుట వల్ల మేత, నీరు సరిగా పెట్టక ఎల్లప్పుడు ఎండలోనుంచి పనిచేయుటవల్ల పేగులు ఆరిపోటవల్ల మల బద్ధకము కలుగుతుంది పశువు అనారోగ్యముగా నున్నపుడెల్లా యీ వ్యాధి కలుగుతూనే వుంటుంది.

## లక్షణాలు

పశువు నాలుక పై ఒక విధమగు పొర గ్రమ్ముతుంది మలము గట్టిగా వేస్తుంది ఆకలి తగ్గినుందిమతిగ వుంటుంది. నెమరు సరిగా వేయదు తోక అప్పుడప్పుడు ఎత్తుచు ముక్కు తూవుంటుంది జ్వరము కూడ యుంటుంది అపానవాయువులు విడస్తూ వుంటుంది. కాళ్ళ నరములు లాగుతూ వుంటాయి. చిన్నదూడలైన పేగులలో ఎలుకపాములువుట్టు తాయి.

## చికిత్స

ఆరంభములో చింతపండుపులుసు సేరు, ఉప్పుచేరెడు, గోరువెచ్చని నీరుసేరు, త్రాగించుము.

లేక అర్థసేరు ఆముదములో 40 చుక్కల నేపాళనూనె కలిపి ఈయాలి.

లేక 10 వల్లజీడిగింజలు కొట్టినవి పాలుసేరున్నకలిపి కాచివడ పోసి త్రాగించాలి

లేక ముసాంబ్రము 1 తు, నేలవేము 2 తులాలు ఉప్పు 6 తులములు శొంఠి 3 తులములు కలిపి సేసవేడినీటికో కలిపిఈయుము.

లేకఆముదము సేరు, ఎండుమిర్చి గుప్పెడు అల్లము 2 తులములు కలిపి కాచివడపోసి త్రాగించాలి.

ఈరీతిగా అనుభవ చికిత్సలు చేయవలెను. విరేచనములైనతరు వాత బలముగల తేలిక పదార్థములను, పచ్చిగడ్డిని పెట్టాలి. లేక వాతారి అరుఖురు వాడుడు.

## విరేచనాలు

ఈవ్యాధి మేతలోపమువల్ల ఆహారకోశములో, పేగులలోఒక విధమగు పురుగులుండుటవల్ల పచ్చికమేస్తూ వెంటనేఎండుగడ్డి తినుట వల్ల వర్షముకురిసినతరువాత పచ్చిగడ్డి తినుటవల్ల ముక్కిపోయినగడ్డి కాడలు, పురుగులుపడిన తవుడు, నిలువయున్న కుడితివస్త్రాలు తినుటవలన కలుగుతుంది ఇంకను పెద్దరోగము ముసురు తదితర రోగాలలో విషపుసాలీళ్ళను తినుటవల్లకూడా ఈవ్యాధిరావచ్చును.

## లక్షణాలు

పలుచగా పేడవేయుటయే దానిముఖ్యలక్షణము. కడుపునొప్పి ఆకలి లేకుండుట, వేడిజేసి పారుటముడ్డితీపుతో ముక్కుచూస్తుంటుంది.

వాతముజేసి పారుతూవుంటే ముడ్డితీపుయుండదు. దుర్వాసన బంకతో గూడిన నెత్తురుకూడ యుంటుంది. విరేచనము లగుకొలది మలపదార్థము తగ్గుతుంది చెవ్వులను వేలాడవేసి నల్లకప్పువేస్తుంది. దినమునకు 10 లేక 16వరకు విరేచములగు తాయి నెమరు మాని మూల్గుతూ డొక్కలు దెంచుకొనిపోతాయి. అంటురోగాలలో వచ్చేవిరేచనాల లక్షణాలు మరొకవిధముగా వుంటాయి.

## చికిత్స

ఆరంభములోనే సేరు ఆముదము యిచ్చితే లోపలివలవంతా కదిలి పడిపోయివ్యాధి తగ్గుతుంది.

లేక పచ్చిమామ్మి చెక్కరసము, పచ్చినేరేడు చెక్క రసము, పచ్చివేపచెక్కరసము మూడుఅర్ధసేరురసము తీసిసమ్మకాచుంత వెన్న కలిపి ఒకటి రెండు మోతాదులు యిచ్చినతగ్గుతుంది

లేక కవిరి 2తులాలు మాచికాయలు 2తులాలుసీమసున్నము 4తులాలు, గంజాయి1తు, నల్లమందు పావుతులము కలిపినీరు సేరున్నర కలిపి పారుడుతగ్గువరకు రెండుమూడు మోతాదులిచ్చినతగ్గుతుంది.

లేకమారేడుగుజ్జు 10తులాలు కవిరి2తులాలు, కలిపినూరిసేరు నీటిలో కలిపిఈయాలి

లేక కర్పూరము పావుతులము, ఇంగువ2తులాలు,శొంఠి1తు కవిరి3తు, కలిపిసేరుజొన్నకలితో పెట్టుము.

లేక కాసినిగింజలను నీటిలోనానవేసి పిసికితాగించిన ముడ్డితీపుతగ్గి విరేచనములు కట్టుతాయి.

లేకపయిడిప్రత్తి ఆకురసము సేరుమజ్జిగసేరుకలిపి కాచియిచ్చిన తగ్గుతుంది.

మరా.- ఈవ్యాధి కాకవలన పారుచున్నదీలేక వాతమువలన పారుచున్నదీ, లేకతదితర వ్యాధులచే పారుచున్నదీ, బాగుగా పరీక్షించి అనుభవంతో చికిత్స చేయాలి కాకవలనపారితే అంతప్రమాదము లేదుగాని వాతమువలన పారితే శీతలము లోనికివచ్చి ప్రమాదముకలిగించుతుంది విరేచనములగుచోట ఎప్పటికప్పుడు పరిశుభ్రము చేయుచుండాలి. ఎక్కువగానై నీర సించితే జొన్నజావతో సారాయి, శొంఠిపొడి కలిపిపెట్టాలి ఫార్మసీవారి బేల్ పౌడర్ మంచిది.

## రక్తవిరేచనాలు

ఈవ్యాధి శీతోష్ణ స్థితిగతులు మారునప్పుడు తరచుగా వస్తూ వుంటాయి. పశువులు క్రొత్తగడ్డి తినుటవల్ల కాల్వలలోని క్రొత్తనీరు త్రాగుటవల్ల, కొన్నిసమయములలో అతివేడిజేయుటవల్ల, జీర్ణముకాని పదార్థములు జీర్ణకోశములో నిలువయుండుటవల్ల ఒకవిధమగు పురుగులు పేగులలో వుండుటవల్ల, విషవస్తువులు విషపుమొక్కలు, విష పురుగులను తినుటవల్ల, తదితర కారణములవల్ల ఈ వ్యాధి కలుగుతుంది.

## లక్షణాలు

ఈరోగము ఆకస్మికముగా రావచ్చును. పశువునకు చలిసోకుతుంది మలముెవెంట చీము నెత్తురు పడుచు గుదస్థానమున బాధగా యుంటుంది. కడుపు నొప్పిచే పండ్లు కొరకుచు పచ్చిమాంసపు ముక్కలవలేవుండే చిన్న చిన్న నెత్తురుకండలతో విరేచనాలు అగుతూ దుర్వాసనగా వుంటాయి పేగులపై ఒత్తిన బాధగా వుంటుంది. పగలుకంటె రాత్రులందు వాతము వలన పశువు బాధపడుతూ

వుంటుంది. పేగులుఅరస్తూవుంటాయి. వ్యాధి ముదిరినకొలదిశుష్కించుచు తుంది. దుర్వాసనగల చెమట శరీరముపైన పుబుకుతుంది. తగినచికిత్స చేయనిచో చనిపోతుంది

## చికిత్స

ఈవ్యాధికి జాగ్రత్తగా సంరక్షణచేయాలి. వగరుపదార్థాలను కాచిన నీటిని యిస్తూ వుండాలి.

ఆరంభములో పెసరగుగ్గిళ్ళు తన్నెగు లేక మానెడు, పేరినేయి సోలెడు ఉప్పు 4 తు. కలిపి పెట్టాలి.

లేక అరటిపువ్వులరసము అరసోలెడుపెరుగు సేరు, సున్న 5తు, కలిపి ఒకటి రెండు మోతాదులు ఈయాలి

లేక ఆవుపాలు సేరు, హారతి కర్పూరము 1/2 తు,కవిరి 2తు' నరిపించి సోలెడుకలిపి పెట్టుము.

లేక ఎఱ్ఱకలువదుంపలు అరవీశెడుతోగ్రిక్క సేరు జొన్నకలితో కలిపి కాచి విరేచనాలు తగ్గునంతకు నాలుగుగంటలకొక మోతాదు ఈయాలి.

లేక నీరుల్లిపాయలు 25 తు, పెరుగు సేరు. మెంతిపొడి 2తు, వెన్ననిమ్మకాయంత కలిపిపెట్టుము

లేక ఉడక బెట్టిన నీరుల్లిపాయలు 20 తు, పిచ్చిబెండాకు 2గుప్పెళ్ళు, నల్లమందు 1/4 తు,కలిపి మెత్తగానూరి పెట్టుము.

## హెచ్చరిక

రోగను ఆసనాన్ని వేడి నీటితోకడుగుచుండాలి, ఆహారము, జీర్ణము కలుగ జేయునదిగా పెట్టాలి,నీరుకాచి పెట్టాలి.దుర్వాసన యున్న సాంబ్రాణిపొగ శరీరమునకు, ముక్కులకు వేయాలి.

## పాండురోగము

పశువునకు తగినంత ఆహారము పెట్టకపోవుట చేత చీకటికొట్టములో ఎప్పుడు నుండుటవల్ల తగినంత గాలి లేకపోవుట చేత సోమరితనముగా ఎప్పుడు నీడను, పశువుల చావడి లోను వుండుటచేత, రక్తము నందుడే ఎఱుపు కణములు తగ్గుటచేత ఈవ్యాధి కలుగుతుంది రక్తమునందలి దౌర్బల్యమే దీనికి ముఖ్య కారణము.

## లక్షణాలు

పశువు శరీర కాంతి పాలిపోతుంది. సామాన్యజ్వరమువుంటుంది. కంటిరెప్పలు,చూచిన రక్తము లేక తెలుపురంగుగావుంటాయి. నాలుక పెదవులు, కను రెప్పలు చర్మమువున్నగు భాగాలన్నియు పాలిపోతాయి. వ్యాధిముదిరినకొలది బరువుతగ్గుతుంది. ముఖము వాచుతుంది. రక్తముక్షీణించినకొలది అవయవాలు అస్వాస్థతనొందుతాయి క్రమేపి పక్షవాతము కుడ రావచ్చును. క్రమక్రమముగా కృశించి కొన్నాళ్ళకు మరణించుతుంది.

## చికిత్స

బలము రక్తవృద్ధి కలుగజేయు పదార్థములను పెట్టుచుండాలి గాలి ధారాళముగా వచ్చుప్రదేశమునందు వుంచాలి.

అన్నభేది 1తు, విషముష్టిగింజల పొడి 2తు, సోడా ఉప్పు 1తు కురంజీ వాము1తు, ఉప్పు 2 1/2 తు పసుపు 1/2తు, కలిపి ఉదయ సాయంకాలము లందు గోరు వెచ్చని నీటితోగాని, బెల్లముతో గాని పెట్టాలి.

లేక జిల్లేడి మొగ్గల పొడి 1తు వాము 8 తు. మిరియాలు 2తు, శొంఠి 3 తు, ఇంగువ 1తు, కలిపి పై మాదిరి గనే పెట్టాలి.

లేక విషముష్టి గింజలపొడి 2తు, నేలవేము 1తు, అన్నభేధి 1 1/2తు,పసుపు 1తు. కలిపి పైమాదిరిగనే పెట్టాలి.

లేకమహిసాక్షి 1తు, కటకరోహిణి 2తు, శొంఠి ½తు ఉప్పు 3తు. కలిపి దాణాలోగాని, వేడినీటితోగాని పెట్టవలెను. పైమందులను వరుసగా నేదొఒక పక్షము లేక నెల రోజులు పెట్ట వలెను. లేక పశుబలవర్ధని, వాతారిపొడను కలిపి పెట్టాలి.

## గుండె ఆగుట

ఈరోగము పశువులకు దుర్బలత్వమువల్లకలుగుతుంది. ఇంకా వేసవికాలంలో మేత సరిగా దొరకక తీలకదించగనే మిక్కుటంగా తినుటచేత వర్షాకాలంలో నూతనంగా చిగిర్చి నీటి మయమైయుండే పచ్చిక తినుట చేత ఎల్లప్పుడు చలి గాలి లో వుంచుట చేత శ్వాస కోశాలలో అస్వస్థతయేర్పడుటచేత రక్తహీనత చేత కలుగుతుంది. ఈజాడ్యము పశువురొమ్మునకు కడుపునకు మాత్రిము ముఖ్యముగా సోకుతుంది ఇదేగుండెకు సోకి గుండెవంజుగానై క్రమేపి గుండెఆగిపోయి తటాలున పశువుపని చేయునప్పుడు క్రిందపడి మరణించుట గూడాగలదు.

## చికిత్స

నేలవేము 1తు, ఉప్పు 2 1/2తు కలిపిచూర్ణము చేసిప్రతిదినము ఈ మోతాదు వంతున వారము దినములు పెట్టుచు జీర్ణ శక్తి గలుగు పదార్థాలు పెట్టుచుండాలి.

లేక ఆరె దొండాకు పసరు అర్థ సేరు, మిరియాల పొడి 1తు, శొంఠి 1తు, వెల్లుల్లిపాయలు 4తు పసుపు, 1 1/2తు కలిపి పైమాదిరిగనే నాలుగు దినములు పెట్టాలి.

లేక ఆవుపాలుగాని, గేదెపాలుగాని, సేరు, తెలికపిండి సవాసేరు, కలిపి ఒక పూట నాననిచ్చి పెట్టాలి.

లేక కర్పూరము 1/2తు. యష్టిమధుకము 1తు, ఇంగువ 1 తు, బెల్లము 6తు, కలిపి అప్పుడప్పుడు నాకించుచుండాలి.

లేక ఫార్మసీవారి పశుబలవర్ధని, ( స్పైయిన్ కిల్లరును ) వాడ వచ్చును

# గర్భశూల

ఈ వ్యాధి చిన్న పశువులకు వచ్చుతుంది. దాణా దినుసులు కంచులు, వులవలు, మినుములు మున్నగునవి ఎక్కువగా తిని మరల పచ్చిగడ్డితదితర పొట్టుధాన్యములుతినుటవల్ల క్రొత్తగడ్డికాడతినుటవల్ల నెమరుసరిగా వేయకపోవుటవల్ల చలిగాలిలోను, వర్షములోనువుండుట వల్ల రావచ్చును. ఈ వ్యాధి కొన్నిరోజులుగాని ఒకటి రెండు మాసములుగాని వుంటుంది.

## లక్షణాలు

ముఖ్యముగా ఈ వ్యాధిలో విరేచనమవ్వక జిగురుతో కొద్దిగ పడుతూవుంటుంది శూలనొప్పి వచ్చినప్పుడు కాళ్ళనుజూపి తనతలను పొత్తికడుపునకు ఆనించి మూలుగుచు దీనముగ చూస్తూవుంటుంది. నెమరు పొట్టవుబ్బరంగావుంటుంది అప్పుడప్పుడు నోటినుండి చొంగ పడుతూవుంటుంది. ఎన్నిపర్యాయములు ఎనీమా చేసినా విరేచనము కాదు పశువు లేచుట పండుకొనుట, మూల్గుట, వెన్నువిరచుటఅపాన వాయువులు విడచుట క్రిమేపి వ్యాధి ముదిరి మరణమునకు సిద్ధమగు తుంది. మూత్రము, మలము ఎరుపురంగుగ నుండవచ్చును.

## చికిత్స

ఈ వ్యాధిగల పశువునకు ముందు విరేచనమయ్యేసూత్రమును చూడాలి. ఈ విరేచనమగుటకు ఆతురతతో రైతులు వివిధ చికిత్సలు అనగా కొబ్బరి నూనె, వంకాయలు, నల్లేరు, పందిపెంట జెముడు కాడలరసము మున్నగు వస్తువులు పెట్టుటవలన మలము గట్టిపడి ద్ఘోర వ్యాధిగానై మరణానికి సిద్ధమగుతుంది

ఆరంభములోనే నల్లజీడివిత్తులు 15 మెత్తగాకొట్టి సేరుగేదె పాలలోకలిపికాచి ఒకపర్యాయమే ఈయాలి

లేక రెండుగిద్దల వుప్పును కారపు పాలతోకలిపి గోరువెచ్చగ నుండునట్లు ఒక్కపర్యాయమే త్రాగించాలి.

లేక నేపాలగింజల నూనె 60 చుక్కలున్నూ, ఆముదమును సేరును, కలిపి ఈయవలెను ఈరీతిగా గాఢవిరేచనమగునట్లు ఒక మోతాదుయిచ్చిన లోపలనున్న చెడుమలమంత పడిపోయినతరువాత ఏ వామురసమో, ఏ శొంఠి రసమో, ఏ ఇంగువపాలో దినమునకొక మోతాదును యిచ్చుచు జీర్ణమగు తేలిక పదార్థములను పెట్టుచుండ వలెను. కాచిన నీటిని దాహముగా ఈయాలి అవుసరముంటేఎనీమా చేయాలి పేగులలో తెల్లని జిగురుపదార్థమువుంటే ఎనిమా చేసినను విరేచనంకాదు.గాన పశురక్షామృతంతో చింతపండుపులుసు కలిపి యిచ్చినతగ్గుతుంది. ఈ వ్యాధి విషయమై ఫార్మసీవారికి తెలిపిన తగిన సలహా ఈయగలరు.

## జలగరోగము

పశువు ఆహారకోశంలో జలగ ఆకారముగవుండే పురుగులు పుట్టి గుడ్లుపెట్టి ఒకవిధమగు రోగాన్ని కలిగించుతాయి. ఈరోగము పల్లపు ప్రదేశాలలో వుండేకొల్లేరు ప్రాంతాల పరిసేలలలో వుండే పశువులకు తరచుగా వస్తుంది ఈ వ్యాధి ఎక్కువైనకొలది పశువు క్షీణించుచు ప్రక్కటెముకలు కనబడుతాయి. అప్పుడప్పుడు దగ్గుంటుంది. నిస్సారముగావుంటుంది. రక్తముక్షీణించినకొలది, పురుగులు జలగలు ఆకారముగా పెరిగినకొలది విరేచనాలు అగుతాయి. క్రిమేపి విరేచనాలతో జలగ ఆకారమగు పురుగులుండి బయటపడుతూ దుర్బలమునొంది క్షీణించుతుంది.

## చికిత్స

జలగలను ఎండించి చూర్ణముచేసి పూటకు పావుతులంపొడిలో అరతులం పొగాకుపొడినికలిపి సేరు గోరు వెచ్చనినీటితో కలిపి దినమున కొకమోతాదు ఈయాలి.

లేక ఫార్మసీవారి వాతారియను అరకును అనుపానపత్రిక రీతిగా త్రాగించిన తగ్గుతుంది

అనుభవముగల వైద్యునికి చూపించి తగినచికిత్స చేయించాలి. లేనిచో ప్రమాదమునకు గురియగుతుంది.

## శక్తికిమించినబరువులు

### రొమ్ముపట్టు

రైతులలో చాలమంది బాడుగకు బండ్లుతోలుచు మోయరాని బరువులువేసిపశువులను చంపుతారు. ఇట్లువేయుటవల్ల అరుత్రిఅడుగు భాగాన, మెడభాగానవుండే నరాలు కండరాలు పాడైవాపుపోటుకలిగి శరీరము కదలునప్పుడు ఎంతో బాధపడుతూ వుంటుంది. మరికొన్ని పశువులకు అపస్మారంవచ్చి గుండెఆగిపోయి దారిలోనే విరగదీసుకొని క్రిందపడిపోయి ప్రాణాన్ని విడుస్తాయి. కాబట్టి శక్తి కిమించినబరువులు వేయక తగినంతగా వేసికాపాడాలి.

## పేగుపూత రేగుదల

పశువులకు సరిపడనిమేతలు, దాణాలు, వేరుశనగపిండి, మినప కుడితి, మినపపొట్టు మున్నగునవి అతిగా పెట్టటవల్ల తాత్కాలికంగా బలిసినను కొన్నిమాసాలైనతరువాత పశువు పాలిపోయి శరీర కాంతి తగ్గివెండ్రుకల రంగుకూడామారి బరిఎముకలు కనపడుతూజీర్ణశక్తి తగ్గి క్రమేపి క్షీణించుతుంది ఈరీతిగా కొంతకాలము బాధపడుతూ పేగులలో ఒకవిధమగు రేగుదలగాని, పూతగాని, ఇంకావ్యాధిముదిరిన

వుండ్లుగాని పడవచ్చును. ఇట్టిపశువులను జాగ్రత్తగా పరిశీలించితగిన విశ్రాంతియిచ్చి తగిన జ్వరానికి సంబంధించిన ఔషధాలు ఇచ్చినగాని తగ్గవు.

# పేగులరుగ్మత

పశువుల పేగులనుగూర్చి ఈగ్రంథములో తెలుపబడినది. పేగులను శుభ్రపరచనిచో వాపు, జిగట, శ్లేష్మముచేరి మలాన్ని బంధించుతుంది. సామాన్యంగా మనపశువులకు మేపేదాణాలు, కుడుతులు, మేతలు, పొట్లధాన్యాలు, కంపులు, మినుములు మున్నగునవి మిక్కుటముగా తినుటవలన జీర్ణముకాక మలబద్ధకముకలిగి పేగులలో చీమిడివంటి తెల్లనిబంకపదార్థము పేరుకొనిమలాన్ని అటుఇటుపోనీయక పశువును బాధపెట్టుతుంది. ఆహారముతినక నెమరువేయక, నీరుత్రాగుటకుకూడ యిష్టపడక నోరు నాలుక దుర్వాసనగా జిగటగావుండి బాధపడుతూ వుంటుంది. రైతులు చాలామంది తెలసి తెలియని చికిత్సలు అనగా కొబ్బరినూనె, ఆముదము, మంచినూనె, కారపునీళ్ళు మున్నగునవి ఎవరియిష్టమువచ్చినట్లు వాడుటవల్ల పశువుఅశక్తతబొంది, లోపల వున్నకల్మషములు బయటకురాక మలాన్ని అడ్డగించి 40రోజులవరకు బాధపడి మరణించినపశువులువున్నవి కాబట్టిజాగ్రత్త అనుభవముతో చికిత్సలుచేయాలి. ఇట్టివాటికి జీర్ణముకలిగించే మందులను వాడు చుండాలి. ఎనీమా చేసినను పేడపడక శ్లేష్మమువంటి తెల్లటికొవ్వు వంటి జిగురుపదార్థము పడుతుంది. ఫార్మసీవారిసలహాతీసికొనివాతారి లేకపశురక్షామృతమును వాడుటమంచిది.

# స్నాయువులు పొరలయొపరోదము

పశువుయొక్క ముక్కు, శ్వాసనాళాలు, ఆహారకోశము, అంత్రములు మున్నగు అవయవాలలోవుండే సున్నితమైన పొరలు యేకారణముచేతనైనా అపస్వస్థతజెందితె తేమడ, చీమిడి, జిగట, బంక

మున్నగు లక్షణాలు వుండి పశువు బాధపడుతుంది. పశువు దవడల లోపలిభాగాన పెదవుల ప్రక్కన అంగిటిముండ్లు పెరిగి ఈరీతిగనే బాధపడుతూ మేతతినాలని కోరికతో నోటిలో పెట్టుకోగానే ముండ్ల బాధకు తట్టుకోలేక బయటకుక్రక్కుతూవుంటుంది. కాబట్టిజాగ్రత్తగా పరిశీలించాలి దగ్గు, రొంప, జలుబు, ఆంత్రములలో శ్లేష్మము పేరుకొనుట మున్నగు రోగాలలో కలిగే లక్షణాలనుకూడ తెలిసికొని తగిన చికిత్సచేయాలి.

## జీర్ణాశయపొరవాపు

పశువులకు మితిమీరిన వేరుశెనగ, పిల్లిపెసర తదితరదాణాలు ఎక్కువగా మేపుటవల్లను, అంటురోగాలు సోకి నెమ్మదించిన తరువాత తగినంతగా ఆహారపానీయాలు ఎక్కువగానో, తక్కువగానో, యిచ్చుట వల్లను, పశువుకుడిడొక్కభాగపుపొరలలోఒకవిధమగువాపు జేరిపెద్దబంతి వలె అటుఇటు తిరుగుతూ వున్నట్లు కన్పడుతుంది. ఇట్టిసమయములో పశువునెమరువేయక భాధపడుతూ వుంటుంది కొలదిజ్వరము కూడ యుంటుంది. మేతసరిగాతినక నీరసించిపోతుంది. ఈరీతిగాతగినచికిత్స చేయకపోయినచో నెలరోజులుకూడయుంటుంది గాన జాగ్రత్తగారోగ నిదానము గ్రహించి అనుభవము గలవైద్యునితో చికిత్సచేయుంచుము లేదా తెనాలిసహదేవ పశువైద్య ఫార్మసీవారికి తెలిపితే తగిన మందు పంపించుచూ చక్కని సలహా యిస్తారు.

N. B:- ఈగ్రంథములో తెలిపినవ్యాధులలోకొన్నిటినిశక్యముకానివాటిని అనుభవముగలవైద్యునకు చూపించమని తెలుపుచున్నారము లేదా తెనాలి సహదేవ పశువైద్య ఫార్మసీవారి సలహాతీసి కొనమని కోరుచున్నాము. ఈరీతిగాఎందుకు తెలుపుచున్నా మంటేసామాన్యచికిత్సలకు, సామాన్యవైద్యులకులొంగవుగాన ముప్పదిసంవత్సరాల అనుభవంతో తయారుచేసి అనుభవము సంపాదించిపేరుప్రతిష్టలు గాంచిన తెనాలి ఫార్మసీవారి సలహా తీసికొనుటమంచిది.

# నెమరువహానుట

ఆరోగ్యంగల పశువు మేతతిన్నతర్వాత నెమరుకు తెచ్చుకొని 24 నుంచి 36 వరకు నెమరు గుటకలు వేస్తుంది నెమరుకు తెచ్చుకొన్న మేత వుండనునమలి గుటక (మింగుట) వేయుటనే నెమరుఅంటారు. ఇది ఒక రోగమనుటకంటె రోగలక్షణమనవచ్చును.

పశువు నెమరు వేయక మందమతిగా వుంటుంది. కడుపుబ్బి వుండవచ్చును మూత్రకోశము, పేగులు అంతగాపనిచేయవు. పేడ సరిగా వేయదు. మూతిని చెమ్మ యుండదు.

## చికిత్స

సేరు గోరువెచ్చనినీటిలో పావుగిద్ద అల్లపురసం, ఆరుతులాల పేరినెయ్యి కలిపి రెండుమోతాదులు ఒకదానితరువాత మరొకటి యిచ్చుతూ పొట్టను మాలీషుచేయాలి.

లేక ఫార్మసీవారి వాతారి అరఖు అద్భుతంగా పని చేస్తుంది

# హృదయకోశములో నీరుచేరుట

ఈరోగాన్ని కనుగొనుట కష్టము అకస్మాత్తుగా కంఠముదగ్గర గాని, గంగడోలునకుగాని, వెనుక పిర్రలకుగాని, బొడ్డునకుగాని, వట్టలకుగాని ఒకవిధమైన వాపుపుట్టి క్రమేపి నాగుపాము విషమువలె ఈవాపుశరీరమంతాసోకుతుంది. ఈవాపు గట్టిగానైన, మెత్తగానైనా, రావచ్చును. తీవ్రమైన జ్వరమువుంటుంది నాడిఉద్రేకత, మూల్గుట, ఎక్కువగా బాధపడుట క్రమేపివాపులోపలి భాగాన చెడునీరుచేరి కఫమెక్కువైకుత్తుకస్థానమునకుజేరి పశువును చంపుతుంది ఇది ఒకవిధ మగు దొంగజబ్బు. ఇట్టిరోగముగల పశువును అనుభవముగల పశు వైద్యునకు చూపించాలి.

# అంగవిక్రృతిరోగము

ఈరోగము పశువులకు ఆకస్మికంగావస్తుంది. తలలోనికి మెదటి లోనికి రక్తము అతివేగముగా ప్రసరించుటవల్ల రక్తనాళములలో కొన్ని భాగాలు పగులుటవల్ల పశువు ఆకస్మికంగా స్మారకంతప్పి తెలివి తేటలులేక బాధపడుతుంది.

## లక్షణాలు

పశువు కదులుటకు యిష్టముఫుండదు శ్వాస నెమ్మదిగా విడుస్తుంది కనుగ్రుడ్లుతిప్పుతూవుంటుంది. నాడితీవ్రముగాకొట్టుకొంటుంది. శ్వాస తీవ్రతవలనురకపుట్టుతుంది. నోటినుండి చిక్కనిచొంగపడుతూ వుంటుంది శరీరము శీతలమునకువచ్చి కాళ్ళతో తన్నుకొంటూ 24 గంటల లోపల పశువు మరణించుతుంది.

## చికిత్స

ఆరంభములో ముక్కులకుయూకలిప్టస్ ఆయిల్ కొన్నిచుక్కలు గాపి చన్నీటిని పశువు తలమీద ఎత్తునుంచి ధారగా పోయాలి పశువు ఏదైనా త్రాగాలనికోరికగా వృక్ష నాలుగునిమ్మకాయలరసాన్ని సేరు గోరువెచ్చని నీటిలోకలిపిఈయాలి లేకఫార్మసీవారి పశురక్షామృతంను సేరునీటిలో 6తులాలమందును నాలుగుగంటల కొకసారిఈయాలి. పశువునకు స్మారకముపోయి తెలివివచ్చిన బ్రతికినదని గ్రహించి కొద్దిగా వరినూకలజావను ఇచ్చుచుతూ క్రమేపి ఆహారపానీయాలను శక్తివచ్చి లేచేవరకుఈయాలి.

[-o-]

# ఇ రు వ ది మూ డ వ భా గ ము

## వాతరోగాలు

రైతు లలో చాలా మంది మా పశువునకు వాతము చేసింది, యేమియు తినుట లేదని మామూలుగా తదితరుల తో చెప్పుతూ వుంటారు. వాతము అనే వ్యాధి దేనివల్ల వస్తుందో ఆ లక్షణాలు ఏరీతిగా వుంటాయో ఈవాతాలలో ఎన్నిరకాలున్నవో ఏ యే వాతా లలో పశువు లక్షణాలు ఎట్లుండునో, ఏ ఆహార పదార్థాలు తినినందు వల్ల ఈ వ్యాధి వచ్చిందో మున్నగు విషయాలు తెలిసి కోవాలి.




పశువులు తినే మామూలు ఆహారముగాక అదనముగా బలము కలిగించేతోండంగి పిల్లి పెసర, మినుము, కందిపొట్టు,శనగపొట్టుతవుడు మున్నగునవి మితిలేకుండా మేపుటవల్ల వేసవికాలములో పిల్లిపెసర పొలములలో పశువులనుతోలి మిక్కుటముగా తినుపించుటవల్ల.ప్రత్తి గింజలు మొక్కజొన్న, పాలకండెలు, జొన్నపిండి, పాలు, మినపపిండి,

ఇంకాఎన్నెన్నో రకరకాల పదార్థములు అల్లుళ్ళకు పెట్టినట్లుగా ఈ పశువులకు పెట్టుటవల్ల తప్పక వాతము కలుగుతుంది. ఈ రీతిగా మేపి పశువులకు తగినంత వ్యాయామము ఈయక పోవుటవల్లను, చలి గాలి లోఎండలో వుంచుటవల్ల ఈవాతము వస్తుంది. పశుప్రదర్శనా నాలకు వెళ్ళాలని అన్నము, గుగ్గిళ్ళు, గారెలు, బూరెలు, నెయ్యి మినప పిండివగైరా మనిషివలె పశువునకు కూడ గారాబముగా పెట్టేవారు ఉన్నారు ఇటువంటివన్నియు పెట్టి అరే! మాగిత్తను కాళ్ళుపట్టినవిరా! వాతము చేసినదిరా! అని చెప్పగానే 74 వస్తువులు ఏకొండలమీదనో, ఎవరు చెప్పినవో తీసికొనివచ్చి ముద్దకొట్టి నోటిలో పెట్టుతారు. ఇట్లు పెట్టుటవల్ల వస్తువుల గుణాల ననుసరించి లోపల జీర్ణించుకోలేక నోరులేని ఆపశువు పడేబాధ భగవంతునకెరుక కాబట్టి ఇట్టిపశువులకు జాగ్రత్తగా చికిత్స చేయించాలి.

## లక్షణాలు

వాతం అనునది పశువు దేహములో జీర్ణించి రెండు మూడు సంవత్సరాలకు కూడ రావచ్చును. ఆరంభదశలో నల్లకప్పువేస్తుంది ముఖ్యముగా వెన్ను డొక్కల భాగము ముడుచుకొని అరమేత మేస్తుంది. కాళ్ళు, పట్టివేస్తుంది. శరీరరంగు ఎరుపుగా వుంటుంది, పేడ పలుచగాగాని, గట్టిగాగాని యుండి పులుసు వాసన కొట్టుతుంది. మలబద్ధకముండి జ్వరము హెచ్చుచు తగ్గుతూ వుంటుంది. క్రమేపి పశువు క్షీణించుతుంది కండ్లనుండి కొన్నిటికి పుసినీరుకారుతూ అప్పు డప్పుడు పండ్లు కొరుకుతూవుంటుంది. పశువు తనతలను కడుపుదగ్గర పెట్టుకొని విచారకరముగావుంటాయి. కొన్ని వెన్ను విరుస్తాయి అపాన వాయువులు విడుస్తూక్రమేపి పశువునీరసించి చనిపోతుంది. ఈవ్యాధికి తగినచికిత్స చేయనప్పటికి తెలిసితెలియని మందులు పెట్టినప్పటికి మరొకవ్యాధిలోనికి రాగలదు.

## చికిత్స

మలబద్ధకముగానున్న ఆరంభములోనే ఎనీమా చేయుటమంచిది.



ఏనుపెసరాకు (పెళుసుగావుంటుంది.) ఇదియొక గుబురుతీగె, సముద్రప్రు ప్రాంతాలలోను కొండలప్రాంతాలలోవుంటుంది. 8 వీసెల ఆకు, మంచినూనె 4 వీసెలు, శొంఠి పిప్పళ్ళు, మిరియాలు, 15 తు, తాటిబెల్లం 2 వీసెలు, వుప్పు సోలెడు, కురంజీగాము సవాసేరు కలిపి తొక్కి ఒక కుండలోవేసి పక్షందినాలు భూమిలో పాతిపెట్టి తీసి ప్రతిరోజు సవాసేరుమందును తినిపించిన చాలా బాగుగా పనిచేస్తుంది ఇది నా స్వానుభవము.

లేక తమలపాకులు 50, ఇంగువ 2తు, వెల్లుల్లి 4తు, మెత్తగా నూరి ఒకగొట్టమునువ్వులనూనెలోకలిపి రెండుదినములకొకమోతాదు వంతున వారముదినములు యిచ్చిన తగ్గుతుంది.

లేక పచ్చిఅల్లము 4తులాలు, వుప్పు 6తు, కొబ్బరిపాలు సేరు కలిపిపెట్టుము,

లేక దుష్టుపాకుపసరు అర్థసేరు, కడుగుసేరు, వుప్పు 4 తు కలిపపెట్టుము. నాలుగు మోతాదులీయుము. దినమున కొకసారి మాత్రమే,

లేక నల్లేరు నిమ్మకాయంత, ఇంగువ 1 తు, వెల్లుల్లి 4 తు ఆముదపుపప్పు నిమ్మకాయంత నూరి సేరుకలితో పెట్టుము.

కాళ్ళు పట్టుపట్టినయెడల ఒకబిందె నీటిలో తురక వేపాకుగాని, వావిలాకునుగాని వేసి కాచి కాఫీతాగునంత వేడినీటిలో గుడ్డముంచి అప్పుడప్పుడు కొట్టుచు కొబ్బరినూనెలో హారతికర్పూర బిళ్ళలు వేసి కలిపి మర్దన చేయాలి

లేక మంచినూనెలో మండపసుపుకొమ్ము అరగదీసిపట్టించుము.

ఈరీతిగా ఇంకను అనుభవముమీద చికిత్స లెన్నోగలవుగాన చేసికోవచ్చును

ఈరోగముగల పశువులకు తేలికగా జీర్ణమగు పదార్థములను పెట్టాలి ఎండలోను చలిలోను యుంచరాదు.

ఫార్మసీవారి వాతారిపొడినిగాని, వాతారిఅరఖునుగాని వాడిన అత్యద్భుతముగా పనిచేయును. కాళ్ళపట్లకు స్ప్రెయిన్ కిల్లర్ వాడుడు.

## కీళ్ళ వాతము

పశువులు చలిగాలిలో వుండుటవల్లను, మురికిగావుండే ప్రదేశములో కట్టుటవల్ల, వాతము జీర్ణించిపోవుటవల్ల ఈ వ్యాధి వచ్చును

ఈ వ్యాధిలో జ్వరముతీవ్రముగావుంటుంది అన్ని అవయవాలు వేడిగా వుంటాయి. ఆకలి చురుకుదనము తగ్గుతుంది. నడచుటకెంత మాత్రము యిష్టపడక పడుకొని మూల్గుతూ వుంటుంది. ఈవ్యాధికి పశువు కొంకులదగ్గర వాచుతుంది అవాపు ఒక కాలుకుగాని నాలుగు కాళ్ళకుగాని రావచ్చును. ఇట్టిసమయంలో పశువునుకదలనీయరాదు. వాపుభాగము వేడిగా గట్టిగా వుంటుంది. ఈ వ్యాధి దీర్ఘకాలమున్నచో పశువునకు జ్వరముండదు. ఈ వ్యాధి ఆవులకు ఆంబోతులకు యున్న దూడలకుకూడ రావచ్చును. ఇట్టి పశువులకు చాలా అనుభవముతో వైద్యము చేయాలి. వాతారి, స్ప్రెయిన్ కిల్లరును వాడుడు వాతారివాతలకు పెట్టిందిపేరు గ్యారంటీగా పనిచేస్తుంది.

## చికిత్స

నల్ల వుమ్మెత్తాకుపసరు అర్ధసేరు, నల్లమందు 1/4తు, వస 1తు, కలిపి వాపులకు పట్టువేయాలి. లోపలికి చురుకుదనము పుట్టించు ఆహారముఃగాని, మందుగాని ఈయాలి.

లేక అన్నభేది 1తు, విషముష్టిగింజల పొడి 1తు, వాము 4తు' నేలవేము 2తు, కలిపి, సేరు నీటిలో గాని, ముద్దగా వచ్చునంత తాటి బెల్లముతో గాని దినమున కొక మోతాదువంతున పక్షము దినములు పెట్టుచువాపులకు, కీళ్ళ పట్టుకు, కోడిగుడ్డు తెల్లసొన, తేనె, గుల్ల సున్నము కలిపి పట్టువేయాలి

లేక తాటి బెల్లము 2 పీసెలు, వెల్లుల్లి 6తు కొట్టుపసుపు 4తు, కురంజీవాము10తు, ఇంగువ 4తు, మునగచెక్కపొడి 10తుసన్నావాలు 4తు, కలిపిమెత్తగానూరి దినమున కొక పర్యాయము రెండునిమ్మకాయలంతవుండను మందు వచ్చువరకు పెట్టాలి. మలబద్ధకము లేకుండ చూడాలి.నువ్వుల నూనె లో చిత్ర మూలము వేరు అరగ దీసి కీళ్ళ వాపులకుపట్టించుము.

లేక వావిలాకు గుప్పెడు, నేలవేముఆకు అరగుప్పెడు, వేపాకు గుప్పెడు తెచ్చి మెత్తగా నూరి దానిలో అర తులము పసుపు కలిపి కాఫీ త్రాగు నంత వేడి నీటితో దినమున కొక మోతాదు వంతున వ్యాధి తగ్గువరకు పెట్టాలి

ఈ వ్యాధి దీర్ఘముగా నున్నచో ఎక్కువకాలము పై మందుల ను వాడ వచ్చును. వాత సంబంధ మగు ఆహారములు పెట్టరాదు. మందులకు తగ్గనిచో రక్షలు వేయాలి.

## ఎండురోగము

ఈ రోగంఎల్లప్పుడూ శరీరము వేడిగావుండే పశువులకు అజీర్తి వల్లమూత్రము జారీయగుట వల్ల నరాలలో పటుత్వము లేకపోవుట వల్ల దాణాలు, ఇష్టము వచ్చిన మందులు, బలముః కలుగ జేయు వను

యుద్దేశ్యముతో పెట్టుటవల్ల ఎంత మేసినా నిస్సత్తువుగావుండి బరి ఎముకలు కనబడుటవల్ల మేతనీళ్ళుపెట్టిన వెంటనే బండికట్టుటవల్ల ఈ వ్యాధిరాగలదు. దీనినే పెంటకకల్లు, అజీర్తివాతము అంటారు.

## లక్షణాలు

పశువునకు లోపలమూ మూలు వేడికంటె ఎక్కువగావుంటుంది పేడనుకొన్నిరోజులు గట్టిగా మరికొన్నిరోజులు పలుచగా వేస్తూవుంటుంది. ఈరోగముగల పశువులను నేనుచాల పరీక్షించితినిగాని వ్యాధి ముదిరినలాభముకన్పట్టదు. కాళ్ళు, శరీరము శుష్కించుతూ బండికట్టినపుడు పారుతూవుంటుంది. మరికొన్నిసార్లు వ్యాధి ముదిరినకొలదీ శరీరము పటుత్వముతగ్గి ఎడ తెగకపారుతూవుంటుంది ఈపారుడు వెనుక కాళ్ళకొంకులతోకకు ముడ్డికి అంటియుంటుంది. పారుడలో బుడగలుండి నలుపు రంగుగావుంటుంది మలముపులుసువాసన కొట్టుతుంది. రైతులెన్నియో చికిత్సలుచేస్తారు పారుడు పుట్టినతరువాత లాభముండదు. కృశించి నెమ్మదిగా చనిపోతుంది. మరికొన్ని పారుడుసంజ్ఞా క్షీణించుతూ ఆకలి మందగించుతుంది. ఇట్టిపశువులకు తగ్గుతుంది.

## చికిత్స

ఈవ్యాధికి అనేకమంది అనేక చికిత్సలు చేస్తారు తాత్కాలికంగా ఏతుమ్మచెక్కయో ఏనేరేడుచెక్కయో నీటిలోతొక్కిచిక్కని రసము నాలుగైదు పర్యాయములిచ్చినచో తగ్గుతుంది. మరల యథా ప్రకారముగా పారుతూనేయుంటుంది. రైతులకుకూడ విసుగుపుట్టుతుంది. అందుచేత ఆరంభములోనే జాగ్రత్తగా చికిత్సచేయాలి

పారుడు లేకుండనున్న పశువులకు వేయించిన ఉలవపిండికుంచెడు తాటిబెల్లం 4విసెలు, అల్లం 8తు, ఇంగువ10తు, వెల్లుల్లి8తు, కలిపి తొక్కి కలిపిప్రతిరోజు కొబ్బరికాయంత పరిమాణము పెట్టాలి.

లేక సేరుఆవుపాలలోగాని మేకపాలలోగాని సగం సేరు తెలికపిండి కలిపి ఒకపూట నానవిచ్చి తోలు మున్నారం పసుపుకలిపి దినమున కొక మోతాదు వంతున పక్షము రోజులు పెట్టాలి.

లేక తమలపాకులు 100, ఇంగువ1తు, మారేడుపండ్ల గుజ్జు 2తు కలిపినూరి దినమునకొక మోతాదువంతున 10దినాలుపెట్టాలి.

లేక చేతోణిక ఆకురసము అర్ధసేరు, వాలుఅర్ధసేరు పసుపు 1తు, ఇంగువ 1తు. కలిపి దినమునకొక మోతాదువంతున నాలుగుదినము లు పెట్టుము

పాకుడున్న పశువులకు వగరుపదార్ధములుగాని బేల్ పౌడరును గానివాడుము

ఈవ్యాధికి వాతారిపౌడిని పశుబలవర్ధనినికలిపివాడుటమంచిది.

## శిరోవాతము

ఈవ్యాధి జలుబువల్ల వర్షాకాలంలో మాగాని పొలములలో. దమ్ముచేయుటవల్ల, పచ్చిగడ్డి కోరికసపుడు తప్పుడు, చిట్టు మున్నగు దాణాలు ఎక్కువగా పెట్టుటవల్ల ఈవ్యాధిరావచ్చును. లేతపశువుల కెక్కువగాసోకును ఈవ్యాధిశిరస్సులో పుట్టుటవలన శిరోవాతమని పేరువచ్చింది

## లక్షణాలు

ఆరంభములో పశువునకు వేడితక్కువగావుండి చెవుల మొదటి భాగమందు వేడిగా, చివరభాగమందు చల్లగా వుంటుంది. ముక్కుల నుండి ద్రవమువంటి పదార్ధము జాస్తిగా కారుతూ అప్పుడప్పుడు కండ్లనుండి నీరుగారుచూ నల్లకప్పువేస్తూ కాళ్ళుపట్టివేస్తూ వ్యాధి ముదిరినకొలది శుష్కించుతూ ముక్కులనుండి వచ్చుద్రవము పలుచగా, చిక్కగా వుంటుంది. అరమేత మేస్తుంది, నాలుకతో ముక్కుల

నుండి వచ్చుద్రవమును నాకుతుంది. నీరుకూడసరిగా త్రాగదు, నాలుక తెలుపువుంటుంది. ఈవ్యాధి నెలరోజులవరకుకూడ యుంటుంది. క్రమేపి కొమ్ము డొల్లలుగ గాని కొమ్ము మాదగా గాని చేరవచ్చును. గాన జాగ్రత్తగా చికిత్స చేయాలి

## చికిత్స

ఆరంభములో ముక్కులనుండి వచ్చేద్రవమును పరీక్షించాలి. ఏ నేఆహారము పెట్టినదీ? ఎంతకాలమునుంచియున్నదీ పరీక్షించాలి తరువాత అవు పాలుగాని మేకపాలుగాని సేరు, వసపొడి 1తులము, శొంఠిపొడి 1తుకలిపి దినమునకొక మోతాదువంతున పక్షముదినముల వరకుపెట్టినతప్పక తగ్గుతుంది. వాతవస్తువులను మాత్రము పెట్టరాదు అప్పుడప్పుడు ముక్కురంధ్రములకు సాంబ్రాణి పొగను పట్టించుట మంచిది. లేక రామాయిల్‌ను వాసన చూపించుము.

లేక వస 1తులము, వెల్లుల్లి 1తులము, కుప్పింటాకు పసరు 2 పలములు కలిపి రెండు చెవులలో పోసి కొమ్ములకు చెవులకుకట్టాలి ఈ రీతిగా నాలుగు దినముల కొకపర్యాయము చేయుచు బలముగల ఆహారపదార్థములను పెట్టుచుండాలి,

లేక వామింటాకు పిడికెడు నలిపి నీరు పిండి బిళ్ళగా చేసి తల కొమ్ములకు కట్టాలి. ఈరీతిగా వారమురోజులు చేయాలి

ఉలవగుగ్గిళ్ళు, మడ్డికూడు, వగైరా ఎక్కువగా పెట్టాలి. ఇంక ను విపరీతముగా ముక్కులనుండి నీరు కారుచున్నప్పుడు మూతిమీద ముచ్చెన గుంటలో కాల్చుటమంచిది, పశుబలవర్థని, వాతారి (పొడరును) కలిపి పెట్టిన చక్కగా పనిచేస్తుంది.

# గర్భ వాతము

పశువును మితిమీరి మేపుటవల్ల కందులు, తవుడు, చిట్టు శనగలు, వడ్లు వగైరా పొట్టుతో నున్నపుడు ఆతురతతో తినుటవల్ల, వరిపిలక, తొండంగి, పిల్లిపెసర ఎక్కువగా తినుటవల్ల ఈరోగము వచ్చుతుంది

పశువు నల్లకప్పు వేస్తూ మలబద్ధకము గా వుండి పేడ గట్టిగా వుంటుంది. జ్వరము దగ్గు కొద్దిగావుంటుంది. ముఖ్యముగా బొడ్డు పైకి లాగుకొని పోతుంది. నీరుడు కూడ ధారాళముగా పోయదు. మేత నీరు క్రమేపి మాని డొక్కల క్రింది భాగము వెన్నెముక భాగము ఉబ్బరముగా వుంటుంది. కొన్ని పశువులు కాళ్ళనుకూడ పట్టివేస్తాయి ఈవ్యాధి 10, 20, 30 దినముల వరకువుంటుంది. తగిన చికిత్స చేసిన వెంటనే తగ్గుతుంది. గర్భకోశములో వాత మెక్కువగా వుండుటవలన, కడుపులో నొప్పికూడ యుంటుంది. గర్భకోశంలో వాతముండుటచే గర్భవాతమని పేరువచ్చినది

## చికిత్స

ఆరంభము కటకరోహిణి 1తు. ఉప్పు 5తు, శొంఠి 6తు, మిరియాలు 1తు, సారాయి 2 డ్రాములు. నూకల జావ సేరు కలిపి త్రాగించిన తగ్గుతుంది.

లేక వెఱ్ఱిపుచ్చ కాయలు 40 కోసిన తరువాత పసుపు 10తు, కురంజీవాము 10తు, నల్లఉప్పు 4తు, వేసి త్రొక్కి ఒక కుండలో వేసి నాలుగు దినములుంచి ప్రతిరోజు ఒక వెలగకాయంత ముద్దను పెట్టిన తగ్గుతుంది.

లేక వెల్లుల్లి 15 తు. ఇంగువ 10తు, శొంఠి 4తు, కురాసాని వాము గుప్పెడు పచ్చిపసుపు 10తు, ఆముదపు పప్పు సోలెడు కలిపి త్రొక్కి నిమ్మకాయంత ఉండలు చేసి రేపుమాపు పెట్టిన తగ్గుతుంది.

లేక అల్లము 15తు, వాము 10తు, ఇంగువ 4తు వుప్పు 15తు, సోడావుప్పు 10తు, కలిపినూరి దినమునకు 4తులాల వంతున సేరు వేడి నీటిలో కలిపి యిచ్చిన తగ్గుతుంది.

మలబద్ధకముగానున్న ఆరంభములో విరేచనాలకుఈయాలి వ్యాధి తగ్గువరకు తేలిక ఆహారపదార్థములను యిచ్చుచుండాలి ఫార్మసీవారి వాతారి అరఖును గాని పశుమిత్రను గాని వాడాలి

## నక్కవాతము

దీనినే నక్కోరు, జంబుకవాతము, కసిమిరి యందురు

గాలికుంటు తగిలి పశువు ఎండలో వుండుట వల్ల రక్తవృద్ధి తగ్గుటవల్ల జబ్బులో నీరసత్వ మెక్కువగా వుండుట వల్ల పేగులలో పురుగులు వుండుటవల్ల ఊపిరితిత్తులలో వేడిగాలి జేరియుండుటవల్ల ఈ వ్యాధి వస్తుంది.

## లక్షణాలు

పశువుశరీరమంతానలుపురంగుగనోబూడిదరంగుగనోయుంటుంది కొన్నిటికి నక్క రెండు ప్రకలవలెపొడుగగురోమములుపుట్టినిక్కబొడుచుకొని యుంటాయి. ఎండలో యెంతమాత్రము నిలువలేక నీడకొరకు ఎదురుచూస్తుంది వగర్పు ఎక్కువగావుండి దీనముగాచూస్తూకృశించుతుంది ఇట్టి పశువులను జాగ్రత్తగా కాపాడాలి. ఈవ్యాధి తగ్గుటకు చాలా రోజులు పట్టుతుంది. కొన్ని మాత్రము ఎన్నిచికిత్సలు చేసినాతగ్గవు. చలువచేయు పదార్థాలు ఇట్టిపశువులకు పెట్టాలి

## చికిత్స

లేక నీరుల్లిపాయలు 25 తులాలు, పచ్చిపసుపు 6 తులాలు, తాటిబెల్లం 15 తులాలు, కలిపి ప్రొక్కి రోజువిడిచి రోజువంతున పక్షముదినాలు పెట్టుము.

లేక నాగలాకు2వీ. తక్కెడాకు 1వీ గోంగూర 2వీసెలు మంచి నూనె1వీసె కలిపి ముద్ధచేసి దినము విడిచి దినము పెట్టము.

లేక పసుపు 6 తులాలు, తామర దుంపలు 1వీసె, బెండవేళ్ళు 2 గుప్పెళ్ళు, పంచదార అరవీసె. కలిపి 2సేర్ల పంది నేతితో వండి వెలగకాయంత తీసుకొని అర్ధసేరు గొర్రెపాలతో కలిపి పెట్టుము.

లేక పచ్చిగోంగూర 1మణుగు. శొంఠి 15 తులాలు, మిరియాలు10తులాలు ఉసిరికపప్పునవాసేరు కలిపి ఒక బానలో వేసి భూమిలో 10 దినములు పాతిపెట్టి దినమునకొక కొబ్బరికాయంత పెట్టుము ఫార్మసీవారి కనకాసవనువాడాలి.

# ధనుర్వాతము

దీనినే ఈడుపురోగమనీ, ధనుర్వాతమనీ అంటారు. ఈవ్యాధి చలిగాలి సోకుటవల్ల, గాయపుసంధివల్ల, పశువునకేమైన అపాయమైన దెబ్బతగిలినపుడుగాని, ఏ అవయవమైన విరిగినపుడుగాని ఇదివరకు ఏమైన శరీరము మీద పుండ్లు, వ్రణములు, గాయములు, మున్నగునవి యున్నప్పుడుగాని ఈవ్యాధి సోకుతుంది. గాయములోనికిఏమాత్రము దుమ్ము లేక మట్టిచేరిననూ వెంటనే ఒకవిధమగు సూక్ష్మజీవులు అందులో ప్రవేసించి పశువునకు ప్రాణాపాయము కలిగించును. కాబట్టి పశువునకేమైన దెబ్బతగులుట, విరుగుట, చలిగాలిలో, వర్షములో నుంచుట మున్నగునవికలిగినపుడు వెంటనే ఆ గాయమునకు దుమ్ము, మట్టి వగైరాలు కలుగకుండ కాపాడాలి. అట్లు దుమ్ము వగైరాలు దూరినచో వెంటనే ఎలెక్ట్రిక్కుతీగవలె రక్తములోనున్న నరముల సముదాయమున కేగినవెంటనే ప్రాణాపాయము కలుగుతుంది. పాడిపశువులకు, లేతపశువులకు. దూడలకు తరచుగా వస్తుంది. దూడలకు మిన్నల్లులు పట్టుటవలన కాకులుపొడిచిన పెద్దపుండ్లు బొడ్డుపుండ్లువల్లకూడ ఈవ్యాధి రావచ్చును. మామూలు పశువులకు కూడ ఈవ్యాధి రావచ్చును

## లక్షణాలు

పశువును కదలించినచో చాలా కష్టముగా కదలుతుంది. లోపల జ్వరంవుంటూ నోటి వెంట చొంగపడుతూ వుంటుంది. మనము తలను లేపినయెడల వెంటనే పశువునకు వణుకుబుట్టి ఈడ్పులు (ఉలుకులు) వస్తాయి వ్యాధిముదిరినకొలది మెడ. దవుడలు కాళ్ళు వగైరా బిగదీసికొనిపోయి పశువు విల్లువలె వంగిపోయి ముఖము ముడుచుకొనిపోయి వికృతాకారముగా అగుతుంది. ఈడ్పులు అన్ని అవయవములకు సోకి ఆయాసమెక్కునై పశువు మరణించుతుంది

## చికిత్స

దవుడలు బిగిసికొనిపోయి గుటకవేయనిచో లాభము లేదని గ్రహించాలి



65

కర్పూరము 2తు. వరిగంజి సేరు, ఇంగువ 4తు కలిసి త్రాగించి అన్ని అవయములకు తవుడుతోగాని ఉప్పుతోగాని వేడి కాపులు కాయాలి.

లేక మూడుడ్రాములు సారాయిలో అరతులం కర్పూరం కలిపి త్రాగించుము.

లేక 10 కోడిగుడ్లలోని తెల్లసొనయు, సేరుసున్నపుతేట కలిపి త్రాగించుము.

లేక కుంకుడుకాయ నురుగునీరు కలిపినది సేరు త్రాగించుము.

లేక మీ సమీపములో ఇంజెక్షన్సు యిచ్చే డాక్టర్లున్న ధనుర్వాతపు ఇంజెక్షన్సు యిప్పించుము లేక ఫార్మసీవారి వాతారి అరఖును క్రిస్పెయిన్‌కిల్లరును వాడుము.

## స్వభావము-వ్యాపకము

మెదడుయొక్క అస్వస్థతవల్ల మెదడునకు నరములసముదాయమునకు దెబ్బతిగులుటవల్ల చెవినరములకు ఒత్తిడి కలుగుటవల్ల వెన్నెముకకు హానికలుగుటవల్ల విషవస్తువులుతినినపుడు ఎండలో వర్షములోను పనిచేయుంచుటవల్ల విపరీతమైన వాతమువల్ల చలిగాలిలోను మంచులోను ఎక్కువగా పనిచేయుంచుటవల్ల తదితరకారణాలవల్ల ఈరోగమువస్తుంది

## లక్షణాలు

పశువుశరీరపు సగభాగముగాని, పశువువెనకభాగమునకుగాని ముందుకాళ్ళకుగాని ఒకచెవికిగాని, ఒక కన్నుకుగాని తలకుగాని, శరీరమంతటికిగాని, నాలుకకుగాని, ఈవ్యాధిరావచ్చును. ఒకరైతు దొడ్డిలో ఈరోగముచేతనే ఒక్కసర్యాయమే పదిపశువులకు సోకిన వీనికన్నిటికి వెనుకతొడలు, కాళ్ళు ముడ్డిపూసక్రిందిభాగము సోకి నాలుగుదినములు కొన్ని వారముదినము లుకొన్ని పక్షముదినము లుకొన్ని యుండి చికిత్సలవల్ల తగ్గినవి. కాబట్టిఈవ్యాధి తేలికగాతగిలిన పిట్ట వాలినదని వాతలు, యంత్రములు వేస్తారు ఈయంత్రమువల్లనేతగ్గిన

దనుకొంటాను. మరికొన్నిటికి తాత్కాలిక చికిత్సలవలన వాటితత్వము వలన కొన్నిటకితగ్గుతుంది కాబట్టిజాగ్రత్తగా పశువును పరీక్షించి ఏయే భాగములకు ఏ యే లక్షణాలు సోకి బాధపడుచున్నదో చికిత్స చేయాలి.

## చికిత్స-పరీక్ష

ఏఅవయవమునకు ఈవ్యాధిసోకినదో కనుగొనుటకు ముందుగా ఒకసూదితో ఆ అవయవమును తేలికగా గుచ్చాలి. అట్లు పొడిచినపుడు పశువునకు నొప్పియున్నట్లు అలుకుచున్నదా లేకతిమ్మిరియెక్కినట్లున్నదా? ఆతిమ్మిరి ఏఅవయవమువరకున్నది? ఎంతకాలము నుంచిపశువు నిలుచుండుట లేదు? ఏకారణమువలన సోకినది? తేలికగా తగిలినదా? ఎక్కువగాతగిలినదా? మేతతినుచు వెనుకభాగము లేవలేకుండనున్నదా మున్నగులక్షణములు గ్రహించి చికిత్సకు ప్రారంభించాలి

ఈవ్యాధితగిలిన వారముగోజులలో పశువు లేవలేకపోయినచో ఆపశువు బ్రతుకుటే కష్టమని గ్రహించాలి. వారమునుంచి నెలదినముల వరకు బాధపడి, అవయవములు, మూత్రకోశముకుళ్ళి బాధపడిచని పోయినవి కూడాగలవు.గానజాగ్రత్తగా ఆలోచించి చికత్సచేయాలి.

ఆరంభములో విరేచన మగుటకు మందీయాలి. తరువాత నేల వేము 1తు, కురంజీవాము 2తు, సోడఉప్పు2తు, మంచిగంధపుపొడి 1/2తు, నల్లఉప్పు2తు, కలిపి మెత్తగానూరి ఉదయమున సేరునీటిలో కలిపి త్రాగించాలి. సాయంకాలము7గంటలకు ఆవుపాలుగాని గేదె పాలుగాని సేరు రావిచెక్క పచ్చిరసము అర్థసేరు, కస్తూరి,పసుపు1తు, కలిపి త్రాగించాలి అప్పుడప్పుడు నౌలికపిండిని సేరునుజ్జిగలోనానవేసి పెట్టాలి

లేకగుగ్గిలము 5ఫలములు. పొంగించిన వెలిగారము 10తు కస్తూరిపసుపు 15ఫలములు కలిపిపొక్కి సేరున్నర మునగచెక్కరసం

పోసి నిమ్మకాయంత ముద్దలు చేసి రేపుమాపు మందు వచ్చువరకు పెట్టాలి.

పిట్టవాలినదని అనుమానముతో నున్నపుడు గరుత్మంతుని పాదపు ఆకారముగా వెనుక భాగము మీంద పసుపుతో యంత్రియు వేయ వచ్చును.

స్పర్శ లేని అవయవములకు మంచినూనె సవాసేరు జిల్లేడాకుల రసము పావుసేరు, నల్లేరువేళ్ళరసము పావుసేరు జిల్లేడుఆకురసము పావుసేరు కలపకూరి తడియింకువరకు కాగబెట్టి దింపిచల్లార్చిప్రతిరోజు మర్ధన చేయుచు తవుడు వేయించిగాని, యిసుక వేయించిగాని అప్పు డప్పుడు వేడి కాపులు కాయాలి.

ఈవ్యాధికి వాతలు వేయుటవలన లాభము లేకపోగా పశువుమర ణమునకు సిద్ధమగుతుంది. ఇంకను తేనెటీగల మైనము20తు,మంచినూనె 20తు, కలపి గోరువెచ్చగా కాచి అందులో అరతులము నల్లమందు4తుల ములు హారతికర్పూరం కలిపి చలనము లేని భాగములకు మర్ధనచేయాలి. ఫార్మసీవారి వాతారి పశుబలవర్ధని స్పెషల్ కిల్లరును వాడవలెను.

## గిట్టలు పెరుగుట

పశుప్రదర్శనాలకు, పశువుల పందెములలో గెలుపొందిన వాటికి తదితర గారాబముగా పెంచే పశువులకు బలము గలుగజేయు దాణా మేతలు మేపుటవల్ల, సరియగు పనిపాటలు చేయించకపోవుటవల్ల గిట్టలు పెరుగుచూ పనిచేయలేక బాధపడుతూ వుంటాయి. ఇట్టి పశువులకు వాతమును హరింపజేసే మందులను లోపలికి వాడుతూ పెరిగిన గిట్టలను నరికించుట మంచిది. ఫార్మసీవారి వాతారి పశుబలవర్ధని చక్కగా పనిచేస్తుంది.

## రుద్రవాతము

ఈవ్యాధి దొమ్మలలోను, గుండెరోగాలలోను, మూత్రపిండాల రోగాలలోను, కార్జపుసంబంధపు రోగాలలోను వస్తుంది. చూడడానికి

పశువు బలహీనముగా వుండి శరీరమంతటా చిన్న చిన్న కంతులు పుట్టుతాయి. క్రిమేపి హృదయముమీద వుండే రక్తనాళాలు చిట్లి రక్తము కారుతూ వుంటాయి. తరువాత పక్షము సెకండ్లు దెబ్బ తింటాయి ముఖ్యముగా జంతుప్రదర్శన శాలలలోను, ఫారాలలోను గారాబముగా పెంచేవాటికి తగినంత సూర్యరశ్మి తగులక రాగలవు. ఈరోగానికి తగిన చికిత్స లేదు. ఫార్మసీవారికి తెలిపినసలహా, మందు పంపగలరు.

## వాయునొప్పులు

ఈరోగము రాయల సీమలలోను, నెల్లూరు గుంటూరు జిల్లాలలో కొన్ని ప్రాంతాలలోను పశువులకు వస్తూవుంది. పశువుల పాలిట ఈరోగము యమపురివంటిదని చెప్పవచ్చును. మంచి దుక్కి టెద్దులకు, గిత్తలకు. కోడెలకు ఈరోగము ఎక్కువగా సోకుతూవుంది ఈరోగాన్నే వాయుపట్లు, కీళ్ళ పట్లు, దీర్ఘకీళ్ళవాతము, వాత లేక వాయు నొప్పులని పలు రకాలుగా పిలుస్తారు. మొత్తంమీద ఈ రోగానికి తగిన మందు కనిపెట్ట లేదనియే చెప్పవచ్చును. ఖరీదు గల పశువులకు వచ్చినపుడు యజమానులు ఎంతో పశ్చాత్తాప పడుతూ వుంటారు ఎంతఖర్చయినా మందులకు ఆతురత పడుతారు హైదరా బాదు స్టేటులో కూడ ఈరోగము వుంది ఈరోగము అధ్రికము. కాకి రాయి గనులు ఎనామిల్ ఫ్యాక్టరీలు, విద్యుచ్ఛక్తి కేంద్రాలు వుండే ప్రాంతాలలో వుండే భూములలో ఫ్లోరిన్ అనే విషపదార్థము కలసిన నీరు, మేతవగైరాలు తినుటవల్లను ఈరోగమురాగలదని శాస్త్రజ్ఞులు తెలుపు తున్నారు.

## లక్షణాలు

పశువు గూడలు. ముంగాళ్ళుబిగిసి వాపుంజప్పట్టి, చెప్పరాని బాధపడతాయి, వ్యాధిముదిరినకొలది నడుముముడు మకోనుట, కండ

రాలు కృశించుట, కాలిడెక్కలు పొడవుగా పెరిగి మెలికలుతిరుగుట, పక్కటెముకలమీద, తదితర భాగాలమీద కుంకుడుకాయనుంచి నిమ్మకాయంత కంతులుపుట్టతాయి దంతాలపైనమచ్చలుపడతాయి వ్యాధిముదిరినకొలది ఎముకలలో పటుత్వంతగ్గుతుంది ఆవులుచూలు కట్టవు కొన్నిపశువులకొమ్ములు పక్కలకు వరుగుతాయి.

## చికిత్స

వ్యాధి ప్రారంభదశలో వావిలాకుపసరు అర్థసేరు అన్నభేధి 2 తులాలు, ఇంగువ 2 తులాలు, ఉప్పు 1తులాలు కలిపి రోజుకొక పర్యాయం త్రాగించుతూ కాళ్ళపట్లగాని వాపులుగావుంటే చేప నూనెలో ముద్దకర్పూరం కలిపి రాసి వేడినీటికాపులుకాయాలి. వ్యాధి ముదిరితే మాత్రము మాఫార్మసికి తెలిపిన తగినమందులు సలహాలు పంపబడును. ముఖ్యముగా ఈ రోగపశువులకు ప్రారంభమునుంచి చికిత్సలు చేయాలి,

## మలగమనమున కవరోధము

పశువు శరీరములో రోగకారణాలవల్ల మలబద్ధకమేర్పడి పేగులలో చిక్కుకొని దుర్గంధముతో పిట్టముగట్టి వుండలువుండలుగా తయారైన లుపుగా ఒకవిధమగు కాంతిగా, జిగురుగావుండి,ఆహారము మందమతిగావుండి కనుగుంటలువిడచి, జ్వరము కూడాసోకి, దాహ మెక్కువగా నగుచు బాధపడుతూ వుంటుంది ఇట్టిసమయము చేతికి ఆముదము రాచుకొని గోళ్ళు గిల్లుకొని మలకోశములోనికి పోనిచ్చి నెమ్మది నెమ్మదిగా ఆ వుండలను తీసివేయాలి. ఇంకను లోపలమల మున్నదని అనుమానమున్నపుడు గోరువెచ్చని నీటిలో సబ్బుగాని, ఆముదముగాని కలిపి ఎనిమాచేసిన లోపలవున్న మలినముఅంతా బయటకుపోయి పశువు తేటగావుంటుంది. తరువాత జీర్ణముకలిగించే ఆహారము, సహదేవ పశువైద్య ఫార్మసీవారి వాతారివంటి ద్రవ పదార్థాలను వాడిన చక్కగా బాగుపడుతుంది.

## తిమ్మిరి వాతము

పశువులకు మేపే మేతలలో తగిన బలకర పదార్థాలు లేకపోవుట వల్ల కాళ్ళయందు వాపు, కండరములందు వాపు, బాధ బలహీనత, శరీరభాగాలలో తిమ్మిరి, మొద్దుబారినట్లుండుట, కాళ్ళు పట్టుపట్టుట, వ్యాధిముదిరినకొలది శరీరము కృశించుట, వాపులు ముదిరినకొలది శరీరమంతటా వ్యాపించుట, ఈ వాపే హృదయానికి చేరుటవల్ల రక్తనాళాలు ఉబ్బి తదితర ప్రమాదకరమైన రోగాలలోనికి గురియగుచుందిగాన యిట్టిపశువులకు లోపలికి బలవర్ధకౌషధాలను యిచ్చుచూ వాపులకు నొప్పులకు స్ప్రెయిన్ కిల్లర్, వెటరినరీ ప్లాస్టర్ వంటి తైలాలను రుద్దుచూ కాపాడుచుండాలి.

## అపానవాతము

పశువులకు అజీర్తి చేసిగాని, వాతము చేసిగాని మలబద్ధక మెక్కువగా నుండుటవల్లగాని, పశువు మేతతినునప్పుడుగాలిలోనప్రవేశించుటవల్లగాని, కడుపులోను పేగులలోను గుడగుడమనిశబ్దముఆసనమునుంచి ధ్వనితో వెలువడుచు, ఆగాలిదుర్వాసనగావుంటుంది, ఇట్టిసమయములో కారణము గ్రహించి తగినచికిత్స చేయాలి.మామూలుగాయిట్టిపశువులకు గేదె వెన్న 8తులాలు తీసికొని ఉదయపుపూట వరుసగావారము రోజులుయిచ్చిన కొన్నిటికి తగ్గగలవు లేదా ఫార్మసీవారి వాతారి అరఖును తగినంత చింతపండుపులుసుతో నాలుగైదు మోతాదులిచ్చినను తగ్గును.



---

# ఇరువదినాలుగవ భాగము

## శ్వాసరోగాలు

### క్షయం

ఇది అంటువ్యాధి. ఈవ్యాధి అన్నిజంతువులలోను వ్యాపించుతుంది పశువు శ్వాసకోశాలలో ఒకవిధమైన పురుగు ప్రవేశించి వానిని క్షీణింపచేయుటవలన ఈ వ్యాధికలుగుతుంది పశువుయొక్క కఫ్ములోను, చొంగలోను, పాలలోను, రక్తములోను, ఊపిరిలోను, ఈ పురుగు వ్యాపించియుంటుంది ఆహారపదార్థాల మూలాన, గాలి మూలాన ఈసూక్ష్మజీవి పశువుశరీరములో ప్రవేశించుతుంది జబ్బు గలపశువులు మంచిపశువులతో కలసియుండుటచేత ఈవ్యాధి విచ్చలవిడిగా విజృంభించుతుంది. కనుక జబ్బుగల పశువులనుఆరోగ్యపశువుల నుండి విడదీసి ప్రత్యేకస్థలము నందుంచాలి. ఈసూక్ష్మజీవికి పశువుయొక్క శరీరము వెలుపలగూడ జీవించేశక్తివున్నది. పశువులకొట్టము అనారోగ్యకరంగా, అపరిశుభ్రముగాఉంచుటచేత, ఈరోగము వృద్ధిపొందుతుంది. ఈవ్యాధి కొన్నివారములుగాని, మాసములుగాని యుంటుంది ఈవ్యాధిముదరకమునుపే చికిత్సచేయుట మంచిది ఈవ్యాధి అన్నిజాతుల జంతువులకు మనుష్యులకు, పక్షులకుగూడ సోకుతుంది. ఇది సామాన్యముగ పట్టణాలలోవుండే పశువులకుఎక్కువగావస్తుంది. అనారోగ్యప్రదేశాలలో వుండుటవల్ల, పశువుపేడ, చెత్త, మూత్రము మున్నగువానిని నిలువయుంచుటవల్ల గాలి, వెలుతురు లేని కొట్టములలో పశువులను కట్టివేయుటవల్ల, దోమలు యీగలు ఎక్కువగా వుండే మురికిప్రదేశాలలో పశువుల కట్టివేయుటవల్ల ఈవ్యాధి ప్రబలు

చాలావిచారముగావుండిజ్వరము హెచ్చుతూ తగ్గుతూవుంటుంది. పశువు క్షీణించినకొలది బరిమెముకలు స్పష్టముగా కనబడుతాయి నోటి నుండి జిగటవంటి ద్రవపదార్థముఎక్కువగా వెలువడుతూ కఫమెక్కువైన పశువులకు మరణము సంభవించుతుంది కొన్ని పశువులకు దీర్ఘముగానుండి కంగుకంఠము నసిదగ్గుతాయి

## చికిత్స

రావిచెక్క 2తులాలు, మిరియాలు 2తులాలు, పచ్చిపాలు అర్థసేరు కలిపి ప్రతిదినము ఉదయము త్రాగించాలి ఈవిధముగా వారముదినములు చేయాలి.

లేక పెన్నేరుగడ్డలు పొట్టు పావుసేరు పులిచల్ల అర్థశేరు,కలిపి ఒకపూట మాత్రమే త్రాగించాలి. ఈవిధముగా వారముదినములు చేయాలి.

లేక నీరుల్లిపాయరసము పావుశేరు, ఒకపూట త్రాగించుము. ఈరీతిగా 15దినములు చేయాలి.

లేక అడ్డసరపాకు పసరుపావుశేరు, అల్లపురసము పావుసేరు కలిపి సాయంకాలము త్రాగించాలి.4దినములు చేయాలి. లేకఫార్మసీ వారి కనకాసవము వాడుడు.

## హెచ్చరిక

ఈవ్యాధికికూడరొంపకుచేయు చికిత్సయే చేయాలి. కానిపురుగులవలన కలిగినవ్యాధిని మాత్రముపశువుల డాక్టరునకు చూపించాలి. ఒకపశువునుండి మరియొకపశువునకు ఈవ్యాధివ్యాపించి కొన్ని పశువులు చెడిపోవచ్చును. డాక్టరుదగ్గరకు వెళ్ళుట తటస్థించిన యెడల జబ్బు తగిలిన పశువులను ఒకగదిలోనుంచి గంధకపుపొగ పీల్చునట్లు చేయవలెను.

## రొంప

పశువులతిశీతలమైన గాలిలో వుంచుటవల్ల శీతోష్ణస్థితిలో వింతయగు మార్పులు కలుగుటవల్ల గాలి సెలుతురు లేనిఇరుకుగానుండు కొట్టములలో పెక్కింటిని కట్టుటవల్ల వానికిమంచుచలిగాలితగులుటవల్ల అధికశ్రమ కలుగునట్టి పని చేయించుటవల్ల ఈవ్యాధికలుగుతుంది.

## లక్షణాలు

ఈవ్యాధిసంభవించుటకు రెండుమూడుదినాలకు ముందేపశువునికుత్సాహముగావుండి అప్పుడప్పుడు దగ్గుతూవుంటుంది. ఇంకనూ జ్వరమును నోటిలోఒకవిధమైన కఫం ఏర్పడి జంతువు పరుండుటకు ఇచ్చగింపదు. వ్యాధి పెంపొందిన కొలదీ ఊపిరితిత్తులలో ఒకవిధమైన ధ్వని పుట్టుతుంది ముక్కురంధ్రములలోని పలుచనిపొరకు నెత్తురుఎక్కువగా చేరుటవలన అపొర ఎరబడుతుంది ఆముక్కురంధ్రాలనుండివచ్చుద్రవపదార్థము చిక్కబడి ముద్దగట్టుతుంది ఈస్థితిలో పశువుమేతసరిగా మేయదు. వ్యాధిముదిరకొలది జొడిదగ్గుఏర్పడుతుంది ముక్కునందు తడియుండదు ఇంకను అశ్రద్ధ చేసినయెడల శ్వాసకోశములోనికి ఈవ్యాధివ్యాపించిజ్వరము ఎక్కువై పశువుచాలాబాధపడుతుంది. శ్వాసకోశములుచెడి వ్యాధి హెచ్చినయెడల పశువునకు ఆరోగ్యముకుదురుట కష్టము గనుక మొదటనే జాగ్రత్తపడాలి.

## చికిత్స

### జ్వరము వుంటే

ఉప్పు 10 తు, సూరేకారము 2 తు, నవాసాగరము 1 తు, అర్ధసేరు చన్నీటిలో కలిపి త్రాగించాలి.

లేక నల్లమందు 1/4 తు, కర్పూరము 3/4 తు, కర్పూరతైలము 2 1/2 తు, అర్ధసేరు నీటిలోకలిపి త్రాగించాలి.

లేక శొంఠి 2 తు, పిప్పళ్ళు 2 తు, మిరియాలు 2 తు, అర్ధసేరు నీటిలో కలిపి త్రాగించుము.

లేక నీరుల్లిపాయలరసము 4తు, ముక్కు రంధ్రములలో పోయుము

లేక మంచిబెల్లం సవాసేరు, పసుపు 4 తు, కలిపి నిమ్మకాయంత ఉండలుచేసి పెట్టుము.

పైనచెప్పిన చికిత్సలలో రెండు మూడు దినములు మీాయిష్టము వచ్చినది చేయవచ్చును. లేక రామాయల్‌ను వాసన పీల్పించుచు కనకాసవను వాడుడు,

## ఉబ్బసము

### స్వభావము

ఈవ్యాధి బండిఎద్దులకు తరచుగా శ్వాసకోశములలోవున్న చిన్న తిత్తులు పెనవి పగుటవలన కలుగుతుంది. పశువులకు సారము లేని పిప్పివంటి ఆహారవస్తువులు మేపుటవల్ల కొన్ని పనిలేక సోమరితనముగా వుండుటవల్ల మరికొన్ని విస్తారముగా మేత మేయు స్వభావముగలవిగా వుండుటవల్ల ఈరోగము వుత్పత్తియగుచున్నది. నోటిగాళ్ళు తగిలిన నెమ్మదించిన పశువులకు ఈవ్యాధి తరచుగా వచ్చుతుంది. ఈవ్యాధి యందు కఫమెక్కువగా పడుతుంది కొన్నిటికి కఫముండదు పశువు యధాస్థితిలో వుండకపోవుటచేత, ఊపిరితిత్తులకు ఒత్తిడి గలుగుటవల్ల దీర్ఘమైన దగ్గులేక శ్వాసకోశములకు వేడి తగులుటవల్ల ఈ వ్యాధి రావచ్చును ఈవ్యాధి తగిలినపశువు చాలకృశించి మిగులవిచారముగా వుంటుంది ఇది ముసలిపశువుల కెక్కువగా వస్తుంది దీనికతగిన చికిత్స లేదు.

## ముకుబంతి

### దీనినే ముకుబంతి లేక మొగబంతి అంటారు.

(1) ముక్కురంధ్రముల లోపలి పైభాగమున నొక విధమైన మాంసకండ గుండ్రని కోలగావుండు కాయలవలె పెరుగుతుంది

అది ముక్కురంధ్రములో వుండే శ్లేష్మపు పొరలకు ఒక సన్నని కాడ వంటిదాని నంటకొనియుంటుంది ఈవ్యాధి చలిగాలివలనగాని, తదితర వ్యాధులవలనగాని లేక పశువులకు తరచుగా వస్తుంది.

(2) ముక్కురంధ్రముల పొడుగున అనగా పైనుండిక్రిందవరకు చిన్న గుండ్రని బిళ్ళలువలెగాని, ఉండలవలెగాని దుర్మాంసము పెరుగుతుంది.

మొదటివిధమైన వ్యాధిగల పశువునకు దగ్గుంటుంది. కాయగాని, ఉండగాని గొంతువద్ద అడ్డుపడుటవలన శ్వాససరిగా ఆడక తన్నుకొంటుంది కొద్దిజ్వరము వుంటుంది కండ్లు యెర్రగావుంటూ, ముక్కులగుండా ద్రవముకారుతుంది ముదిరినకొలది ద్రవము చిక్కబడి పులుస్తుంది.

రెండవవిధమైనదానితో దుర్మాంసము పెరిగి బిళ్ళలుగాని, ఉండలుగాని, చిటికియుండుట, నల్లగా క్రుళ్ళుట, ముక్కురంధ్రముల వెంబడి చీమిడివంటి పదార్థముకారుట. శ్వాస తీసుకొను సమయములో విస్తారముగా శబ్దము కలుగుట మొదలగు లక్షణాలు కనబడుతాయి. వ్యాధి ముదిరినకొలది పశువు నలు నీలు తిరుగుతుంది. మూర్ఛకూడ రావచ్చును.

## చికిత్స

మొదటివిధమైన రోగమునకు ఒకదారము జారుముడి వేసి ఒక సన్నని చివర మొద్దుగావుండే పుల్లతోగాని లేక సన్నని తీగతోగాని, ఆముడిని లోపలికి తీసికొనివెళ్ళి జాగ్రత్తగా సన్నని కాడవలెనుండు చోటను తగిలించి ముడిని లాగినయెడల ఆకాడ తెగిపోయి ఉండ బైటికి వచ్చుతుంది దీనినే ముకుబంతి అంటారు. ఈప్రకారము కానిచో పశువైద్యశాలకు తీసికొనిపోయిన వారు ఒకవిధమైన పనిముట్టుతో తీసివేస్తారు.

ఈ వ్యాధిగల పశువులు చెరువుల లోను గుంటల లోనునీళ్ళు త్రాగుటకు పోయినప్పుడు ఆపురుగులు కొన్ని నీటిలో జేరగానే నత్తలు చిరుకప్పలు తినుట వలన వాటిలోనుండి మరల మంచిపశువులు త్రాగుటకు వచ్చినప్పుడు ఈవ్యాధి సోకుటయు గలదు. కొన్ని మామూలుగా యింటివద్ద నుండుతొట్లలో త్రాగుటవలన కూడ మంచి పశువులకు రావచ్చును ఈవ్యాధి వచ్చిన తరువాత మూడు మాసములకుగాని పక్వమునకు రాదు. దీనికి సరియగు చికిత్స లేదు.

## చికిత్స

రైతులలో చాలమంది ముక్కు రంధ్రముల మీద వాతలు వేయుదురు. అంతమాత్రమున కే తగ్గదు.

ఆరంభమునుంచి వ్యాధితగ్గువరకు తులసిఆకురసము 10తు, మైలతుత్తము1/2 వడ్లగింజంత కలిపి ముక్కులలోపోయుచు లోపలికి బలముగలిగించు వస్తువులను పెట్టుచుఅప్పుడప్పుడుపటికనీటితో కడుగు తుండాలి,

లేక ఫార్మసీవారి రామాయిల్ నుముక్కులకు వాసన చూపించుచు కార్బోకిస్సను లోపలిపుండ్లకు రాయాలి లోపలికి శాతారి అంఖును వాడుగు.

## జలోదరము

పశువు చర్మముక్రింద ఒకవిధమగు ద్రవపదార్థము చేరిబాధ పెట్టేరోగానికి జలోదరమంటారు. ఈరోగము హృదయానికి గాని, కార్జమునకుగాని, మూత్రపిండాలకుగాని, సోకుతుంది

## లక్షణాలు

పశువు కడుపువాచి పెద్దదిగావుంటుంది.కడుపు ఒత్తితేగుంటపడు తుంది. నీరు అటుఇటు కదులుతుంది. వ్యాధిముదిరితే మలబద్ధకము

ఎక్కువగుటగాని లేకవిరేచనాలు ఎక్కువగుటగాని తటస్థించును క్రమేపి దాహమెక్కువై శ్వాసతీవ్రతవల్ల ఊపిరితిరుగక మరణించుతుంది.

## చికిత్స

ఇట్టి పశువులు జీవించుటకష్టము. అనుభవముగల వైద్యునకు చూపించుము,

## శ్వాసవరోధము

పశువుకంఠము, శ్వాస నాళములు మున్నగుభాగాలలో కలిగే రోగకారణాల వల్లను, నీటిప్రవాహంలో మునిగి కొట్టుకొని పోవుట వల్లను, ఆహార సంబంధమగు పదార్థములు గొంతునకు అడ్డము పడుటవల్లను, త్రాడు, పలుపు బిగిసినందువల్లను తదితర కారణాల వల్ల శ్వాసమార్గమునకు ఏర్పడే అవరోధమువల్ల పశువు ఊపిరి తీసికొనుటకు కష్టముగానుండును గాన జాగ్రత్తగాపరీక్షించాలి. ఇంకను పుట్టిన దూడలు యొక్క హృదయ దౌర్బల్యంవల్లను రక్తహీనత, తదితర వాతాది దోషాలవల్లను ఇంకను పొగవిష వాయువులవల్లను, శ్వాసావరోధము ఏర్పడుతుంది. కాబట్టి అనుభవముతో, ఊహతో, నూత్రముతో ఇట్టి ప్రమాదాలకు చికిత్సలు చేయాలిగాని మోటుతనముగా చేయక వైద్యుని సలహాపొందాల్



## లక్షణాలు

జంతువు మొదట వ్యాకులతతో వుండి మూతి విసుస్తూ మనుష్యులయొద్దకుగాని, తదితర పశువుల యొద్దకుగాని చేరుటకిష్టముండదు గృహోపకరణముల క్రిందగాని, నిశ్శబ్దమైన స్థలములందుగాని దాగియుంటుంది, రోగము ముదిరినకొలది కోపోద్రేకము కలిగి చిరాకుగ వుండి కంటికి కనబడినదానినెల్ల కఱవబోతుంది. ఈగలను పట్టుకొనుటకు ప్రయత్నించుచదానిపలె అరచుచు తిరుగులాడుతూ వుంటుంది. ఒకవిధమైన చొంగ నోటనుండి కారుచ్చుతూ ఆ చొంగ జిగటగాను, నురుగు నురుగుగా ఉంటుంది. ఆ చొంగ పశువుల పెదవులనుండి తీగవలె వ్రేలాడుతుంది. కండ్లు ఎఱ్ఱగావుంటాయి ఇట్టి స్థితిలో ఆజంతువు నోరు కొంచెము తెరచుకొని సరిగా ముందునకు పరుగెత్తుచు మార్గమున దానికి కనబడు ప్రతిదానిని పొడుస్తూ కఱుస్తూ పోతూవుంటుంది ఆకలి మందగించి దానికి దొరకునట్టి యేవస్తువునో తినబోతుంది అది అరచునపుడు దానిఅరపు ఒక విధమైన లోహపుధ్వనిగలకూతగా మారిపోవునట్లు కనుగొనవచ్చును. ఇట్టిస్థితిలో మరణము సంభవించుతుంది పక్షవాతము కలుగుతుంది. ఆహారముతినదు. క్రిందిదవుడలు సన్నముగావుంటాయి. మ్రింగునపుడు కష్టపడునట్లు విశదమగుతుంది చిట్టచివరకు కాళ్ళుచచ్చుపడి విరేచనములై శుష్కించి చనిపోతుంది కొంతకాలము కదలకుండ పడియుండిన తరువాత కొన్ని పశువులకు మరణము సంభవించుతుంది.

## చచ్చినతరువాత కనబడే లక్షణాలు

ఈ వ్యాధిగల పశువుకడుపు కోసి చూచితే మట్టి, రాళ్లు. పుల్లలు, గడ్డి, చింపిరిబట్టలు మున్నగు వస్తువులతో నిండియుంటుంది. క్రిందిదవడ వ్రేలాడుతుంది. చిక్కనిద్రవము కారుతూవుంటుంది.

## చికిత్స

లేక ఈవ్యాధిగల పశువుగాయముమీద గరిటెతోగాని ఇనుప కడ్డీతోగాని కాల్చాలి. లేక ఫార్మసీవారి విషఘ్ని నివాడుడు. లేక ప్రభుత్వ పిచ్చికివేసే టీకాలమందును యిప్పించుము.దీనికి సరియగు చికిత్సలేదు

## కొమ్ముడొల్లలు

పశువులకు జీర్ణ శక్తితగ్గుటచేత ఆహారము సరిగా పెట్టకపోవుట చేత శిరోవాతము వలన ఈ వ్యాధి ఉత్పత్తి యగుతుంది. రక్తము క్షీణించు టవల్లవిషసంబంధమైన గాలిని పీల్చుట వల్ల పశువు యొక్క మెదడు కరిగిపోయి ముక్కులగుండ చిక్కని ద్రవముగాని చీమిడివంటి పదార్థముగాని కారుతూవుంటుంది కొమ్ము కొట్టిచూచినచో ఓటి (మోతమో)గుతుంది. ఈ వ్యాధి పుట్టిన వారనుదినములకేపశువు క్షీణించుతుంది. వ్యాధి ముదిరిన యెడల కొమ్ముమూదగగాని పార్శ్వపులమూదగగాని పరిణ మించుతుంది. కొమ్ములయందు రక్తమే మాత్రముండదు. రాత్రితడిసున్నము తెచ్చికొమ్ముల మొదళ్ళచుట్టు రాచి ఒక దినముంచి ముక్కులనుండి కారుద్రవములో రక్తపు జీరకన బడుతుంది.రక్తపు జీరయున్న యెడల ఈకొమ్ముడొల్లలనిగ్రహించాలి. ఈ వ్యాధిగల పశువును నీళ్ళుత్రాగించునప్పుడుమూతిం గముపరకు నీటిలోముంచి గుటకలు వేస్తుంది.

## చికిత్స

ఈ వ్యాధికిఅనేకమంది అనేకరకములుగా చికిత్సలు చేస్తారు. శొంఠి2తు, ఆవుపాలుఅర్థసేరు వంతున దినమునకొకసారి చింతగింజంత వసగంధము దానిలో కలిపి ఒక నెలరోజులు త్రాగించితే తప్పక తగ్గుతుంది.

లేక కారుఇంగువ 1 1/2తు, వస 1/2తు,మూర్కొండాకుపసరు 3తు, కలిపి చెవులలోపోసి, చెవులు కొమ్ములకు కట్టాలి. మంటగా వుంటుంది. గాన పావుగంటవరకు కట్టవుంచి తీసివేయాలి,

లేక దిరిసెనాకు పసుపు ఆవు పాలతో త్రొక్కి రసముతీసి అందులో వసగంధము చింతగింజంత జేర్చి చెవిలో పోయుము.

లేక వస 2 తు, రసకర్పూరము 2తు, మంచిగంధము 2తు. పొగాకు 6తు, పావుసేరు సున్నపుతేటలో కలిపి చెవిలో పోయుము.

లేకమిరియాలు 1తు, చేదుజీలకఱ్ఱ 1తు. ఆవాలు 2తు. వెల్లుల్లి పాయలు 2తు, కలిపినూరి చెవిలో పిండుము.

లేక పొగాకురసముతో నీరుసున్నము కలిపిగాని లేకఅర తులము పాదరసముగాని, పశువు కొమ్ములకు బెజ్జములువేసిబెజ్జము లయందు పైమందువేసి గుడ్డపీలికలు పెట్టాలి. తరువాత నీలిరంగుగుడ్డ కాల్చినపొగ ముక్కులకు పట్టించాలి.

లేక ఫార్మసీహరి వాతారిపొడిని వాడుడు.

## కుందేటి వెఱ్ఱి

దీనినే తిక్క తెవులు, రిమ్మ అంటారు ఇది నాడికా సంబంధ మైన వ్యాధియై యుంది నరములకు సంబంధించిన కొన్ని దుర్గుణాలు




ముందు ప్రారంభమవుతాయి. ఈ వ్యాధి ఎల్లప్పుడు విసుగువిరామము లేక పని చేయుచుండుటవల్ల సోమరితనముగా నుండుటవల్ల కపాల సంబంధమగు నరములశాఖ అస్వస్థత నొందువల్ల రాగలదు

## లక్షణాలు

ఈ వ్యాధి మంచి బలముగల పశువులకు వచ్చుతుంది పశువు తలలో నేదోయొక భాగము మేకు గుచ్చుకొనినట్లుంటుంది. జ్వరము సమశీతోష్ణముగావుంటుంది పశువు దవడలకు చాలబాధగావుంటుంది నాలుక జారవిడుస్తూ, ముడుచుకొంటూవుంటుంది. తనతలను కొట్టపు గోడలకుగాని, తదితరవస్తువులకుగాని ఆనించి త్రోస్తూవుంటుంది. వెఱ్ఱిమాపులు చూస్తూ పైకెగురుతూ వ్యాధి ముదిరినకొలది పశువు గిరగిర తిరుగుతూ నేలమీదపడుతూ లేస్తూ వుంటుంది. ఈవిధముగా ప్రతిఅరగంటకు వచ్చుతుంది మనుష్యులను కరవపోవుట కొమ్ములతో పొడుచుట, బజారుల వెంటపరుగిడుట. ఆయాసముచే చొంగవేయుచూ క్రిందపడుకొంటూ కాళ్ళు నిగడదన్నుతూ క్రమేణ నీరసముజెంది పశువు చనిపోతుంది. కండ్లు ఎరుపుగావుండి వ్యాధిముదిరినకొలది వెర్రిచూపులు చూస్తుంది.

## చికిత్స

కరిదూపము-చేరెడు, శొంఠి-నవటాకు, మిరియాలు 2 తు, పిప్పళ్లు 1 తు కలిపి కషాయముకాచి దానిలో బీరాకుపసరు-తవ్వెడు నెయ్యి-తవ్వెడు కలిపి త్రాగించాలి.

లేక పశువు కొమ్ములకు నూనెగుడ్డలుచుట్టి వెలిగించాలి. ఈ వేడిచే రోగముఆగుతుంది లేకజనపనారకొస కొమ్ములకుచుట్టి బిగించి ఒక గంటసేపుంచి ఊడదీయాలి.

పశువు ముచ్చిలి గుంటలో ఒక చుక్క మూతిమీద మూడు అడ్డగీతలు గీయాలి. వెలుతురు ఎండతగులకుండ కండ్లకు పశువుకలిపిన గుడ్డను మూతగా వేయాలి. ఫార్మసీవారి పశురక్షామృతం రామా యిల్ ను వాడుడు.

## జాగ్రత్త

ఈ వ్యాధిగల పశువును చాలా జాగ్రత్తగా కాపాడాలి. బండిమోకులు గాని, చొప్పతాళ్లుగాని ... లుగాని తెచ్చి ఆపశువు మెడకు వేసి చుట్టుకొనేటట్లు కట్టరాదు. లేనియెడల పశువునకు ఉద్రేకము వచ్చినప్పుడు ఊపిరాడక గోడలుగాని చెట్లుగాని తనతలను వేసి కొట్టుకొంటుంది. అప్పుడు పశువునకు ప్రాణాపాయము రాగలదు. ఈ పశువునకు చికిత్సకులు ఎంతగా చాలా కష్టము ఈవ్యాధి తాత్కాలికంగా తగ్గిన అప్పుడప్పుడు ... నెలలు ... కు గానిలగ్గదు.

## మూర్ఛ

ఇది నరములకు సంబంధమగు రోగమైయుండి, ఇదిపనిచేయించక సోమరిగావుంటే పశువులకు కలుగుతుంది. ఈవ్యాధిగల పశువునుఎక్కువగా కష్టపెట్టరాదు. దీనినే మూర్ఛలేక హిష్టీరియా అంటారు,

## లక్షణాలు

ఆరంభములో శరీరముపైన చెమటపట్టి వణకుతుంది. శరీరము కృశించి కన్నులు నలువైపులు తిరిగిపోతూ నోటినుండి నురుగువచ్చుతూ దౌడలుబిగిసికొనిపోతాయి. ఈవ్యాధివచ్చుటకుపూర్వము మేతతినదు. ఉశ్వాస నిశ్వాసము లెక్కువగుతాయి, అప్పుడప్పుడు పశువుఅరచుతుంది. ఈవిధముగా ఒకగంట లేక రెండుగంటలుండి తగ్గుతుంది. లేక వ్యాధిముదిరినయెడల ఒకపూటవరకుండి తగ్గుతుంది. దినమునకు ఆరు లేక పదిపర్యాయములు ఉద్రేకతచుట్టి వస్తుంది

## చికిత్స

ఈవ్యాధిరాగానే చన్నీళ్ళు ఒకబిందెడు తలమీద పోయాలి. లేక స్మెల్లింగు సాల్టు వాసన చూపించుము. ఒకతులము ఇంగువ, అర్థసేరు వేడినీటితో కలిపి వ్యాధి రాకమునుపే త్రాగించుము.

లేక 6నిమ్మకాయలరసము త్రాగించుము.

లేకఫార్మసీవారి రామూయిల్ వాతారి అరఖునువాడుడు.

లేకరావిచెక్క రసముఅర్థసేరు ఆవుపాలుఅర్థసేరు కలిపివారము దినములుత్రాగించుము.

## అంగిటిముండ్లు పెరుగుట

వీటినే అర్లుపెరుగుట అంటారు.

పశువు గొంతుకద్వారము నుంచీ దవడలవరకు ఒక విధమైన మెత్తని ముండ్లువుంటాయి. వీటినే అంగిటి ముండ్లంటారు. అంగిటిలో ఒకవిధమైన పొరయుంటుంది, జీర్ణకోశము తిగినంత పనిచేయక గాని, జలుబువల్లగాని, లేక ఆహారలు ఏకారణము చేతనైన విస్తరిల్లి ఒక విధమైన ముండ్లేర్పడుతాయి. ఈముండ్లు తెలుపురంగుగా, మరికొన్ని నలుపురంగుగా, ఉండి నిక్కబొడుచుకొని సూదులవలె వుంటాయి. ఈ ముండ్లకు సరియైన చికిత్స చేయనిచో, పశువుయొక్క గొంతు భాగమువాచి ఎక్కువ చేస్తుంది.

## లక్షణాలు

పశువు మేత మేయునపుడు చాల బాధపడుతుంది. మేత నెమరు కూడమానుతుంది. నాలుక లావుబారి, మేతతిన లేక అప్పుడప్పుడు క్రక్కుతుంది. ఒకవిధమైన తెలుపుజిగురు నోటినుండి వెలువడుతూ మూతి విరస్తూవుంటుంది. వ్యాధి ముదిరినకొలది పశువు విచారముగా నీరసముగా వుంటుంది

## చికిత్స

అంగిలిలోవున్న ముండ్లను కత్తెరతో కత్తిరించాలి సామాన్యమైనకత్తెరలు పనికిరావు పశు చికిత్సాలయములో వుండే కత్తెరలు చాల మంచివి. కత్తిరించుటకు పూర్వము పటికపొడి ఆముండ్లకు

రాచి కత్తిరించాలి. నెత్తురు కారినను భయపడనవసరము లేదు కత్తిరించునపుడు చాలజాగ్రత్తగా కత్తిరించాలి. తెలిసి తెలియని వైద్యులు కత్తిరించినయెడల నాలుకగాని దవుడల భాగపు మాంసముగాని, తెగిపోతుంది కాబట్టి చాలజాగ్రత్తగా కత్తిరించాలి. ఎక్కువపొడుగుగా పెరిగిన ముండ్లుగాని, మొద్దుబారియుండు ముండ్లుగాని కత్తిరించాలి చిన్నవి కత్తిరించక పోయినను నష్టము లేదు. కత్తిరించిన ముండ్లను లోపలికి మ్రింగనీయరాదు

మన వైద్యులు నల్లుదంపి చేటలో వేసి చెరగకుండ కొంచెము ఉప్పుకలిపి రెండు మూడు పూటలుఆముండ్లమీద వేసి తోముతారు కాని కత్తిరించినంత దృఢముగా ఈ చికిత్సకు లొంగవు.

# ఇరువదిఆరవ భాగము

## రక్తమూత్రము

ఈరోగము అతి వేడివల్ల విసుకువిరామము లేకపని చేయించుటవల్ల విషసంబంధమగు గోమారులు పశువుశరీరములో ప్రవేశించుటవల్ల కలుగవచ్చును ఈవ్యాధి విషయంలో ముఖ్యముగా రోగనిదానము కనిపెట్టాలి. గోమారులవల్ల వచ్చినచో చాలాప్రమాదమని గ్రహించాలి.

## లక్షణాలు

ఆరంభములో జ్వరము తీవ్రముగావుంటూ చలికూడవుంటుంది. శరీరము, బొడ్డుస్థానము మొదుచుకొంటుంది. ముఖ్యంగా మూత్రము ఆరంభములో తుమ్మచెక్క కషాయపు రంగువలె పలుచగావుండి

వ్యాధి ముదిరినకొలదిరక్తమువలెపోస్తుంది పశువు మూత్రము ఎక్కువగా పోసినకొలదీ శుష్కించుతుంది. మలబద్ధకముండి ఆకలిమందగించుతుంది దగ్గుకూడయుంటుంది నాలుగునుంచి వారమురోజులలో తగు చికిత్స చేయనిచో ప్రమాదమునకు రాగలదు. అతివేడిజేసి రక్త మూత్రము పోసిన తగిన చికిత్సచేసిన క్రమేపి తగ్గుతుంది

## చికిత్స

ఆరంభములో వ్యాధి లక్షణాలు కనుగొని జ్వరము తీవ్రముగా వుంటే సూరేకారము 4తు, మంచిగంధపుపొడి ౧తు, చల్లటినీరు శేరు కలిపి ఒక్కపర్యాయమే త్రాగించాలి. పచ్చిగడ్డి తింటే పెట్టాలి.

అప్పుడప్పుడు ఉప్పు 2తు, పటిక 2తు, కలిపినూని శేరునీటిలో కలిపి దినమునకు రెండుమూడు మోతాదులు ఇచ్చిన తగ్గుతుంది

తుమ్మచెక్కరంగుగా మూత్రమువుండి తెలుపుగా, జిగటగల కండలుకూడ పడుతూ ఈగలు వాలుతూవుంటే ప్రమాదముని గ్రహించాలి.

ఇట్టి సమయంలో మెంతిపిండి 15తు, దూసరాకుపసరు శేరు, నీలిమందు 1తు, కలిపి ఒకే మోతాదు ఈయాలి లేక కావిరాయి అరగదీసి శేరు నీటితో కలిపిపెట్టుము అప్పుడప్పుడు నూకలజావగాని బార్లిజావగాని పెట్టాలి. వేడిజేసి రక్తము త్రము పడుచున్నపుడు కొబ్బరి బొండములోని నీటిని రెండుశేర్లు త్రాగించి, పేరిననెయ్యి 15తు. పెసరగుగ్గిళ్ళు సోలెడు, ంచదార చేరెడు కలిపి పెట్టుము. వేడినీటిని త్రాగించాలి. లేక పటికపొడి తుమ్మచెక్క కషాయం కలిపి రోజుకు మూడుసార్లు ఈయాలి.

# మూత్రపు సంచిలో రాళ్ళు

దీనినే శిలామేహవాతము, ఉచ్చబుడ్డకందుట వాచుట,వీర్యము గట్టి పడుట అని పలువిధములుగా చెప్పతారు.

ఈవ్యాధి అతి వేడివల్ల, మలబద్ధకమువల్ల, కారిజపు అస్వస్థత వల్ల ఎక్కువగాపనిచేయించుటవల్ల, ఇదితర వాతములవల్ల. ఈవ్యాధి కలుగుతుంది. ఇది బహుచిత్రమైనవ్యాధి.

## లక్షణాలు

జ్వరము బాగావుంటుంది.పశువు తోకఎత్తుచూ పేడ వేయాలనితిరుగు తుంది. గాని బయటకురాదు అర్ధమేత మేస్తుంది మరికొన్ని మేయక బాధపడతాయి. మూత్రము రక్తములోనికి జీర్ణించి కనుగుంటలు విడుస్తుంది వ్యాధ ముదరినకొలది దాహ మెక్కువగావుంటుంది నీరు త్రాగినకొలదీ పొట్టయుబ్బుతుంది. మూత్రకోశము ఉబ్బి పేడవచ్చు




మార్గము బంధించుతుంది. క్రమేపిపశువుశుష్కించి రక్తము తలకెక్కి ప్రమాదంరావచ్చు. మరికొన్ని పశువులు మూత్రము ఎక్కువగాగాని, పసుపుపచ్చగా గాని చుక్కలుచుక్కలు గాపడుతుంది ఇట్లుపోయుటవలన కొంత ఆశకలుగుతుంది గాని వారము లేక పక్షము నెలదినములవరకు

యుంటే ప్రమాదము రాగలదు. లేదా తగ్గవచ్చును మరికొన్ని మూడు నాలుగు రోజులలోనే చనిపోతాయి కాబట్టి ఈవ్యాధివచ్చిన తరువాత అయిదారు రోజులలో మూత్రము పోయనిచో ఆపశువునకు వైద్యము చేయుట వృధాయని గ్రహించాలి.

## చికిత్స

ఆరంభములో గోరు వెచ్చని నీటితో ఎనిమా చేయాలి మనిషి వలె పశువునకు మూత్రకోశములో కర్రీ ఎక్కించి తీయుటకు వీలు లేదు పశువు మూత్రకోశము ఏరీతిగా వంకరగా వుంటుందో చూడండి.



రైతులు ఆతురతపడుతారు. మూత్రకోశములో నునుపువంటి చక్కని రాళ్ళుపుట్టుతాయి. ఇవే అడ్డుపడి పశువును బాధించుతాయి. శస్త్ర చికిత్సచేసినప్పటికి చాలా పశువులు చనిపోతాయి

ఆరంభములోనే మూత్రమును జారీచేయు సూరేకారము, రేవల్చిన్ని, కొబ్బరినీరు మున్నగునవి అనపానముపూద వాడాలి.

## నాడీయంత్రం

శిలా మేహవాతము, తదితర రోగాలలో నీరుడు బంధించి నిలువయుండి బాధపడుచున్నపుడు అనుభవముగల వైద్యునకు చూపించాలి.

# అతిమూత్రము

పశువును ఎక్కువగా పనిచేయుంచుటవల్ల, న్యూమోనియా వ్యాధి సంభవించుటవల్ల, కారిజము సరిగా పనిచేయక పోవుటవల్ల, విషపదార్ధములు తినుటవల్ల నీటితుంగ మొదలగు గడ్డిదినుసులు తినుటవల్ల ఈవ్యాధి కలుగుతుంది ఇదితరచుగా సంభవించే వ్యాధికాదు ఇంకను పశువు శరీరములోవుండే చక్కెర పదార్ధము ఎక్కువగా కలియుటవల్లకూడ ఈ వ్యాధిరావచ్చును. అందుచే దేహములోని జలభాగము లన్నీపొంగి ప్రవహించుతాయి.

## లక్షణాలు

ఈవ్యాధిచే బాధపడుపశువు మూత్రము హెచ్చుగావదలుతూ వుంటుంది. వ్యాధిముదిరినకొలదీ దినమునకు 400ఔన్సులవరకుకూడ పోస్తుంది. పశువు శుష్కించుతుంది మూత్రముపై ఈగలు విశేషముగామూగుతాయి. ఈమూత్రముపడినభాగముఎండిపోయినతర్వాత అచ్చట తెల్లగా వుంటుంది. ఈ తెలుపురంగునుబట్టియే ఈరోగనిదానమును గ్రహించాలి. మేతసరిగా మేయదు. పశువుకాళ్ళు వాచి కండ్లు పొరలు గ్రమ్ముతాయి ఈ వేడి సమానముగా వుండదు. వర్షము కురియునప్పుడు, మబ్బుగా వుండునప్పుడు, నీరుడుఎక్కువగా పోస్తుంది. ఈ వ్యాధిగల పాడిపశువులు సరిగా ఎదగావు.

## చికిత్స

పచ్చిసెల్లుల్లిపాయలు- అర్ధశేరు నవటాకు, కల్లుబెల్లం-అర్ధశేరు నవటాకు కలిపితొక్కి వారము దినములు పెట్టాలి.

లేక కలబందరసము 4తు, ఆవుపాలు అర్ధశేరు కలిపి అప్పుడప్పుడు పెట్టాలి.

లేక పటికపొడి అరతులము, వేడినీరు అర్ధశేరు కలిపి త్రాగించాలి.

లేక పచ్చితంగేడు చిగుళ్ళ రసము కితు, దినమున కొకసారి త్రాగించాలి.

లేక పశురక్షామృతమునుగాని, వాతారి పౌడరుగాని వాడుము

## హెచ్చరిక

గోధుమపొట్టుగాని, కందిపొట్టుగాని, నువ్వులపొట్టుగాని, తెలికపిండిగాని, ఉలవగుగ్గిళ్ళుగాని, నువ్వులుబెల్లముకలిపి తొక్కిగాని పెట్టుచుండాలి. ఈవ్యాధిగల పశువులకు అప్పుడప్పుడు విశ్రాంతి ఈయాలి పశువుఎంతఆహారముతిననుఎంతనీరుత్రాగినను తృప్తి కాదు

## వీర్యనష్టము

ఈవ్యాధి వాతమువల్ల మిగుల కాకవల్లగాని, అజీర్తివల్ల, మత్తుపదార్థములు పెట్టుటవల్ల, మలబంధమువల్ల, వేడిపదార్థాలు పెట్టుటవల్ల, ఆసనభాగములకు దెబ్బతగులుటవల్ల రావచ్చును.

## లక్షణాలు

ఆరంభములో మూత్రము ధారాళముగాపోస్తూ చివరకునున్నపు తేటవంటిమూత్రమునువిడచుతుంది ఈవ్యాధిముదిరిన కొలదిమలబద్ధక మేర్పడి మూత్రము వెంట అప్పుడప్పుడు వీర్యము పడుతూవుంటుంది. మూత్రకోశముచెడిపోతుంది అప్పుడప్పుడు వీర్యముచుక్కలు చుక్కలుగా గాని కుతపలు కుతపలుగాగాని, పడుతూ ముల్లుగుచ్చుకొన్నట్లుగా మంటకలిగి యుంటుంది. సొమ్మసిల్లుతుంది. కడుపునొప్పియుంటుంది. దుర్బలత్వమెక్కువై పశువునీరసించి చావునకు సిద్ధమగుతుంది

## చికిత్స

నీరుల్లిపాయలు అరవీసె, ఆవుపాలుసేరు, జిల్లేడిపువ్వులు 6 గుప్పెళ్ళు. నల్లమందు అరతులము కలిపి ఉడకబెట్టి వెలగకాయంత ముద్దచేసి రెండుపూటల రెండుముద్దలు పెట్టాలి.

లేక జాజికాయ 4తు, జాపత్రి 3తు, లవంగాలు 4తు, పోక చెక్కలు 2తు, కలిపి పొడిచేసి తేనెలో కలిపి తగ్గువరకు ప్రతిపూట తినిపించాలి.

లేక అరటిపండుసగముముక్కలో నిలువున వ్రేలితో రంధ్రము చేసి దానినిండ మజ్జిపాలు పోసి ఒకగంటసేపుంచి పశువునోటిలో వేయాలి.

లేక మామిడిపిందెల చూర్ణము 2తు, వేడినీరు అర్ధశేరు కలిపి త్రాగించాలి

లేక విబోర్రివాతారి కలిపిపెట్టుము

ఈవ్యాధిగల పశువుతో పనిచేయించరాదు. విరేచనములకు అప్పుడప్పుడు మందిచ్చుచుండాలి అజీర్తియున్నచో తగినచికిత్సచేయాలి. సరియైనవేళకు ఆహారము పెట్టాలి

## మూత్రరోగాల విషయాలు

పశువులకుమానవులకువలె ఉచ్చబుడ్డలోరాళ్ళు, అతిమూత్రం మధుమూత్రం మున్నగు పలువిధ రోగాలుకలుగుతాయి.

## మూత్రముతో శ్వేతధాతువువచ్చుట

పశువు దేహతత్త్వానికి సరిపడని ఆహార పానీయములు స్వీకరించుటవల్లను, మూత్రకోశములో తదితర రోగాలు కలుగుటవలన అతివేడిజేసి అల్బూమినియం శ్వేతధాతువుమూత్రముతో వెలువడుతూ వుంటుంది. అందుచేత పశువుశుష్కించుతూ. నరముల బలహీనతచే కాళ్ళతీపులు వగైరా కలిగి బాధపడుతూ వుంటుంది. ముఖ్యముగా కోడెదూడలకు, మదించిన గిత్తలకు ఈ వ్యాధి అరుదుగా వస్తుంది.

## మూత్రావరోధము

పశువు మూత్రకోశాన్ని హానికలిగించే క్రిములవల్లను, మూత్ర కోశములోవాపు, చీము, దుర్మాంసము రాళ్ళు, సుద్ద మున్నగునవి అడ్డుపడుటవల్లను, పిల్లిపెసర, మినప, పెసర మున్నగు వాతముచేసే గడ్డిజాతులు మున్నగునవి తినుటవల్లను మూత్రము బంధించి కడు పుబ్బుట, అపరమితమైనబాధ. పోటు, చురుకు, భరింపరాని వేదనతో వుండుటయేగాక మూత్రముకొన్నిటికి ధారాళముగా వెడలక రక్తము చీముకలసిన చుక్కలు చుక్కలుగా పడుటయుకలదు మూత్రాన్ని వెడలించే చికిత్సలు చేయాలి

## మూత్రముతో చక్కెర వెడలుట

మానవులకువలెనే పశువులకు మధుమూత్రరోగము వుంది. ఎక్కువ పిండిగలదాణాలు తీపిగల పదార్థములు పెట్టుటవల్ల పశువు మూత్రము పోయునప్పుడు చక్కెర పదార్థముతో కలిసి పోస్తుంది. పోసినతరువాత మనము పరీక్షించిన భూమిమీద తెలుపువంటిచక్కెర పదార్థము పేరుకొనియుంది. అట్టిసమయములో తీపివలన ఈగలు చీమలుకూడ ముసురుతాయి. ఇంకను నరముల అస్వస్థతవల్లను మూత్రపిండాలకు సంబంధించిన అస్వస్థతవల్లను కూడ ఈరోగము రావచ్చును. దీనినే మధుమూత్రరోగమంటారు

## అతిమూత్రము

పశువులకు నరముల సంబంధమగువ్యాధుల వల్లను, తనతల్లి దండ్రుల సాంప్రదాయమువల్లను ఈవ్యాధిరావచ్చును. అతిమూత్ర మనగా మధుమూత్రమువలెగాక మూత్రముజాస్తిగా పోయుటవల్లనే అతిమూత్రమంటారు రోజునకెన్నో పర్యాయాలు మూత్రముపోయుట వల్లపశువు శుష్కించి, నరాలు బలహీనతచెంది, ఆకలి ఎక్కువగా నగుచు, చర్మముయొక్క మృదుత్వం నశించి తీవ్రరూపముదాల్చి కొంతకాలమునకు మరణమునకు సిద్ధమగుతుందిగాన బలవర్ధక ఔష ధాలను యిచ్చుతూ కాపాడాలి.

## మూత్రకోశములో రాళ్లు

మానవులకువలె పశువులకుకూడ మూత్రకోశములో చిన్న చిన్న స్ఫటికంవలె వుండేరాళ్ళు వుత్పన్నమై పశువును బాధించుతాయి మానవులకైతే మూత్రకోశములోకి కడ్డీఎక్కించిగాని, ముందుఎక్సరే తీసి పరీక్షించిగాని, అవుసరమున్న శస్త్రం చేసిగాని రాళ్ళనుతీస్తారు. పశువుల మూత్రకోశము వంకరగా యుండుటవల్ల మూత్రకోశములోని కికడ్డీఎక్కించుటకుగాని రబ్బరుట్యూబును ఎక్కించుటకుగాని వీలు పడదు. అందుచేత అనుభవముగలపశువైద్యునికి చూపించితగినచికిత్స చేయించాలిగాని ఇతరులతో ఏ ఆకుపసరుపోయించినా. ఏ మందులు పెట్టినా ప్రయోజనము యుండదు. ఈరీతిగా పశువులకుకూడ పలు విధములైన మూత్రరోగాలు పశువులకు సంభవించినపుడు ఈ చింతామణిలో తెలిపిన రోగనిదానాలు చికిత్సలేగాక ఇంకను అవుసరమని తోచిన మీ ఫిర్కా ప్రభుత్వ పశువైద్యునికి చూపించుట మంచిది. అంతేగాని తెలిసి తెలియని చికిత్సలు చేయరాదు.

## మూత్రకోశమువాపు

పశువు మూత్రకోశము చివరభాగములో పుండుపడిగాని, ఏదైనా దెబ్బతగిలినగాని, ఏదైన విషపురుగులు కుట్టిగాని, పశువు మీదకు ఎక్కినపుడు మూత్రకోశము చర్మము చిట్లిగాని, తదితర రోగాలలోవచ్చే చెడువాపులు ఈ మూత్రకోశానికి సోకుటవలన గాని ఈ వాపురావచ్చును. గాన వివరముగాపరీక్షించి తగినచికిత్సలు చేయాలి.

## నపుంసకత్వము

మానవులకువలెనే పశువులకుకూడ నపుంసకత్వము వస్తుంది. కొన్నిపశువులకు పుట్టుకతోనేవస్తుంది. ఇట్టిపశువునకు తగినచికిత్సలేదు. మధ్యలోఆబోతుకుగాని, దున్నపోతుకుగానినపుంసకత్వమువచ్చినపుడు

మూత్రకోశములో కురుపు ఏదైనావుందా? ఏమైనా సూక్ష్మజీవులు ప్రవేశించి వీర్యాన్ని పెంపొందించుటలేదా? ఏమైనా గనేరియావంటి రోగమేదైనా సోకినదా? నరాల దౌర్బల్యం వలన లేపనశక్తి తగ్గినదా మున్నగు విషయాలను జాగ్రత్తగా అనుభవముగల పశువైద్యునకు చూపించి తగినచికిత్సచేయించాలి. లేదా తెనాలి సహదేవ పశువైద్య ఫార్మసీవారికి వివరాలు తెలిపితే సలహా తగినమందు పంపుతారు.

## మూత్రపురీషములు

### అప్రయత్నముగా వెడలుట

పశువుశరీరంలో యేర్పడిన రోగాల దోషాలవల్లగాని, అంగ దౌర్బల్య కారణమువల్లగాని, నరములదౌర్బల్యమువల్లగాని, తదితర రోగకారణాలవల్లగాని ఇట్టివి తటస్థించుతాయి. ఇట్టిపశువునుకూడ వైద్యునికి చూపించుము

## మూత్రపురీష మార్గాలు

### పుట్టుకతోనే బంధింపబడుట

కొన్నిదూడలు పుట్టినపుడే పేడవచ్చేరంధ్రము, మూత్రము వచ్చే మూత్రనాళము పలుచని చర్మంతో కప్పబడి యుంటుంది. 24గంటలలో దానికి అనుభవముగల వైద్యునితో చికిత్స చేయించాలి లేనిచో ప్రమాదానికి గురియగుతుంది. నాటువైద్యులలో కొందరు ఆ మూసికొనిపోయిన భాగాన్ని సన్ననికత్తితో చీల్చి ద్వారమును తెరుస్తారు. మరికొందరు మోటుగా కోస్తారు. ఇట్టిపనులు అనుభవం గల పశువైద్యులకు చూపించుట మంచిది.

## గూనిమోకాళ్ళు వంకరలు

దూడలు పుట్టగానే కొన్నిటికిగూని, మోకాళ్ళుముడతలుపడుట మోకాళ్ళ ఎముకలు గట్టిగానుండుట, డెక్కలు ముడుచుకొనిపోవుట, తల, మెడ ఒకప్రక్కకుపోవుట మున్నగునవి లక్షణాలు అప్పుడప్పుడూ

కలుగుతుంటాయి, ఇట్టివానికి వెంటనే తగిన చికిత్సలు అనగా వంకర తిరిగినభాగాలకు మంచిగుడ్డలుచుట్టి నునుపుగల వెదురుబద్దలతో కట్లు కట్టుచు తైలములతో మర్దనచేయుచూ, తోముచూ, అవుసరమున్న కాపులుతీయుచు కాపాడితే కొన్నిటికి యదాస్థితిలోనికి రాగలవు. దూడవయస్సు ముదరకమునుపే ఇట్టిచికిత్సలు చేయాలిగాని తరువాత అంత ప్రయోజనము వుండదు

# ఇరువదిఏడవ భాగము

## నేత్రరోగాలు

జ్ఞానేంద్రియములన్నిటిలోను నేత్రము ప్రధానమైంది. రమణీయములైన దృశ్యాలవలన కలిగే ఆనందము మనకు జంతువులకు నేత్రాలవల్ల కలుగుతూవుంది వస్తువులయొక్క పరిమాణము, ఆకారమురంగు ఆకారమురంగుదూరము మున్నగు విషయపరిజ్ఞానం నేత్రాల వల్ల మనము జంతువులు సంపాదింప కలుగుచున్నవి. నేత్రమునున్నితమైన అవయవము. అందుచేతనే సృష్టికందే భగవంతుడు దానికి అనేక రక్షణలను యిచ్చియున్నాడు అందు ముఖ్యముగాకంటిలోని గుడ్డునుకాపాడుటకు కనుబొమ్మలను కను రెండుప్రకలనురక్షకములుగా సృష్టించియున్నాడు. ఇంకనుకంటిలో దుమ్ము క్రిమి కీటకాదులు చేరకుండునట్లును, సామాన్యగాయాలుతగులకుండునట్లుకూడా నేత్రాలు కాపాడుతాయి.

## నేత్రమందలి ముఖ్యభాగములు

పశువు కనుగుడ్డు గుండ్రముగానుండి కనుగుంటలో అమర్చబడియుంటుంది అందుచేతనే సామాన్యముగా దెబ్బతగలకు కను

గుడ్డు మిక్కిలి కోమలముగా వుంటుంది. దీనిచుట్టు కనుగుంటలయందు ఒకవిధమగు క్రొవ్వుపదార్థముతో కప్పబడుతుంది. ఈపదార్థముదిండు వలె యుండుటవల్ల గుడ్డునకు అదురు దెబ్బలు తగులకుండను ఎముకలతో రాపిడికలుగకుండను, గుడ్డుఅటుఇటుతిప్పుకొనుటకును, దానికి వేడిమిని కలిగించుటకును వుపయోగపడుచున్నది కొన్ని పశువులగుడ్లు గుంటలయందు లోతుగా అమర్చబడి యుండక మెరకగావుంటాయి అందువలన నేత్రాలు పెద్దవిగా కనబడుతాయి. దీనిలో పైభాగమందుండే పొరనే తెల్లగుడ్డు అంటారు దీనికి వెనుక భాగమునందుండేది మధ్యపొర ఇదినలుపుగావుండుటవలన నల్లగుడ్డుఅంటారు, పశువుకను గుడ్డు పైపొర తెలుపుగా నుండి ముక్కిలిదృఢమైన నారవంటిపదార్థముతో అమర్చబడినది. పొరలన్నిటిలోను ఈపొరగట్టిగా నుండుట వలన ఇదిసాధారణముగా బద్దలుకానేరదు, కనురెప్పలు ఎల్లపుడు ఆడుచుండుటవల్ల తెల్లగుడ్డుయొక్క నునుపును, దానికుండాపోయే వెలుతురును పోల్చేశక్తిని కాపాడుతూవుంది. కనురెప్పలు ఆడుచుండుటవల్ల తెల్లగుడ్డు ఎప్పుడు తేమగావుండి కంటిని శుభ్రముచేస్తుంది. రెప్పకను వెండ్రుకలు, తెల్లగుడ్డు, నలగ్రుడ్డుఈనాల్గింటిమధ్యగాదృష్టి మండలము ఏర్పడియుంది.

## కంటిపువ్వు

కంటిలో ఏకారణమువల్లనైనా పువ్వువేసినయెడల నల్లగుడ్డు మీద ఒక తెలుపు చుక్కవుంటుంది. దీనినే పువ్వు అంటారు. కంటికి దెబ్బతగులుటవల్ల, చిన్నన లుసులు పడుటవల్ల, వాతరోగమువల్ల ఈపువ్వు ఒకటిగాని రెండుగానిఏర్పడవచ్చును.

## లక్షణాలు

ఈపువ్వు యేర్పడిన పశువు మిట్టిమిట్టి చూస్తూ పోతుంది వెలుతురు చూడలేక బాధపడుతూ కంటినుండినీరుకారుతూ వుంటుంది.

సకాలములో తగిన చికిత్స చేయకపోతే అంధత్వము ఏర్పడి శుక్లము గడ్డకట్టుతుంది. శుక్లము గడ్డకట్టిన తరువాత కన్నురాదని తెలిసి కోవాలి

## చికిత్స

దిరిసెనచెక్కరసము 2తు, ఉప్పు 1/4తు, మిరియాలు 1/4తు తెచ్చినూరి రెండుదినములు కుడికంటిలో పువ్వయినయెడల ఎడమ చెవిలోను, ఎడమకంటిలో పువ్వయిన కుడిచెవిలోను పోయాలి. నాలువైద్యులచెట్టా.

లేక కొద్ది దొండాకుపసరున్ను, రెండు మిరియములు తెచ్చి నూరి కండ్లలో పెట్టాలి.

లేక మండపసుపుకొమ్ము, ఉప్పుగల్లు, మిరియము తెచ్చి కాకరాకు పసరుతోగాని, అవిసెఆకు పసరుతోగాని కంటిలో పెట్టాలి

లేక పొగాకు ఉప్పు కోటెలో వేసి మెత్తగానూరి తెల్లనిగుడ్డలో వేసి కంటిలో పిండాలి. లేక నేత్రాంజనం నెం. 1 వాడుదు

లేక సున్నం, చీనాపంచదార మెత్తగానూరి కంటిలోపెట్టుము

## కంటి పొరలు

ఈవ్యాధి పశువుయొక్క కంటికి ఒకదానికిగాని, రెండు కండ్లకు గాని, రావచ్చును. బింబనుగుండా వెలుతురుపోదు. కనుక చూపు కనపడదు, అనగా కాంతిహీనమైనపొర గప్పియుంటుంది. బింబమంతయు పొరగప్పియున్నప్పుడు కొన్ని కిరణములులోపలికి పోవుటచేతకొంచెము చూడగలిగియుంటుంది ఈ వ్యాధి పశువులకు మధ్యవయస్సులోగాని ముదివయస్సులోగాని, వాతమువలనగాని, తదితర వ్యాధులవలన గాని రావచ్చును.

## లక్షణాలు

పశువునకు మొదటిదినము కనుగ్రుడ్డుమీద సన్నపొర క్రమ్మి యుండి మరుసటిదినమున ఈ పొరమీద మరొక పొరక్రమ్మిదళసరిగా కాన్పించుతుంది ఈవిధముగా వారము దినములవరకు దినమున కొక పొరవంతున క్రమ్ముకొని గ్రుడ్డంతా తెల్లబడి తరువాత సన్నని పురుగులు ఆ గ్రుడ్డు పొరలలో ప్రవేశించి అటునిటు తిరుగుతూ వుంటాయి.

## చికిత్స

సబ్బు 1తు, కలకండ 1తు, తెచ్చి మెత్తగానూరి కంటిలో వారముదినాలు పెట్టుము.

లేకవాకుడాకుపసరులో కలకండమెత్తనిదికలిపి కంటిలోవారము దినములు పెట్టుము.

లేక ఉప్పువాకుడాకుపసరు వెన్నలోకలిపి రెండువేళల కంటిలో పెట్టవలెను. లేక నేత్రాంజనమును వాడుడు.

## అవిరి

పశువులకువాతరోగమువల్ల, కాకరోగమువల్లకండ్లకుఅదరుదెబ్బ లుతగులుటవల్ల, మనుష్యులురాళ్ళుమొదలగునవి పశువులమీదవిసరున పుడుకంటికితగులుటవల్ల, దుమ్ముతోనుండునలకలు పడుటవల్ల, ఎప్పుడు చురుకుగా నుండి బొల్లిపుచ్చలు గలిగి స్వారి చేయుట వల్ల ఎద్దులకు ఈవ్యాధి రావచ్చును దీనిలోపుట్టఅవిరి, కోడిజుట్టుఅవిరి, గ్రుడ్డుఅవిరి అనునవి వుంటాయి. ఏజాతిదైనను ఆరంభములో చికిత్స చేయవలెను గాని ముదిరిన తరువాత నేమియు లాభములేదు. అవిరికి సరియైన చికిత్సలుచేయక ఎల్లపుడు రోగపశువును పనిచేయించుటవలన మెదడు

కరిగి కనుగ్రుడ్డు క్రుళ్ళిపోయి మాదగాఅగుతుంది కాబట్టి చాల జాగ్రత్తగా అవిరిచికిత్స చేయాలి కంటిమాదను గూర్చి మాదప్రకరణలో చూడుడు.

## లక్షణాలు

పశువు ఎండగాని, వెలుతురుగాని చూడజాలదు కంటినుండి నీరు విస్తారముగా కారుతూ కన్ను రెపరెపలాడుతుంది. రెప్పలా వెక్కి క్రింది పొర ఒత్తుబారి యుంటుంది ఇంకను రెప్పలమీద సన్నని పొక్కులు కూడ లేచి కంటి గ్రుడుమీద దుర్మాంసము పెరుగుతుంది. ఈ దుర్మాంసము కంటి లోపలనుంచి పుట్టుతుంది. ఇట్లుపుట్టిన గ్రుడ్డు చెడినదని గ్రహించాలి. దీనినే కంటిమాద యంటారు.

## చికిత్స

పశువుకంటి లోపలిభాగమందును, రెప్పలలోను నుండుమలిన పదార్థములను తీసివేసి పటిక నీటితో కండ్లను శుభ్రముగా కడుగుతుండాలి.

తరువాత వాకుడాకు పసరు 1తు, వెన్న 2తు, ఉప్పు 1/2తు, కలిపి ఉదయ సాయంకాలములందు కంటిలో పెట్టాలి.

లేక పేరిన నెయ్యి 1తు, పెంకుపొడి 1/2తు, అరటదుంపరసము 1/2తు, కలిపి కంటిలో 5 దినములు పెట్టుము

లేక చిల్లగింజను తేనెలో అరగదీసి పచ్చకర్పూరము కలిపి కండ్లయందు పెట్టుము.

లేక కావిరాయి నీటితో అరగదీసి గుడ్డకుపట్టించి కండ్లపైన వేయుము. గ్రుడ్డుమీద కొయ్యగండలున్న గోరుతో గ్రుచ్చి చిదిపి నేత్రాంజనమును వాడుడు

మాదయైనచో గ్రుడ్డుతీసివేయించాలి.

## కామెర్లు

ఇది పైత్య రస సంబంధమగు వ్యాధి. పైత్యరసమధిక మగు నప్పుడు అది రక్తములోనికిచేరి శరీరమునకును, కండ్లకును పసుపువన్నె గలుగజేస్తుంది ఈవ్యాధి కొలదికాలములో తగ్గటము, లేక చాలా కాలముండుటయు గూడగలదు

## లక్షణాలు

కండ్లలోని తెలుపు, ఆకుపచ్చగా గాని, పసుపువర్ణముగా గాని యుంటుంది. పశువుచర్మము నలుపురంగుతో కూడిన పసుపుఛాయగలిగి యుంటుంది. పశువునకు జ్వరముసోకిమందకొడిగావుంటుంది. కొమ్ముల మొదళ్ళువేడిగా వుంటాయి. పేగులలో మలబద్ధక మేర్పడుతుంది. పశువుశరీరముపై దురదగా ఏర్పడి నాలుకమీద ఒక విధమైన పొర గమ్ముతుంది విరేచనము తెలుపుగా గాని, రేగడివర్ణముగా గాని యుంటుంది. మూత్రము నల్లశేరుగు రంగుగాపోస్తుంది. ఆకలిఎక్కువగా పశువు విచారముగావుండి నెమరు సరిగా వేయదు.

## చికిత్స

ముసాంబ్రము2తు, నేలవేము 11/2తు, కలిపిబెల్లపుపానకముతో నాలుగు దినముల కొకసారి యిచ్చుచుండాలి.

లేక పిప్పళ్ళు 1/2 తు, మిరియాలు 1/2 తు, మెత్తగానూరి వెన్నపూసతో కలిపి కంటిలో పెట్టాలి.

లేకఉత్తరేణి ఆకుపసరు 4తు, పెరుగుఅర్ధశేరుకలిపి నాలుగు దినములు ఉదయపు పూట త్రాగించాలి.

లేక ఊడగపట్టవేరు రసం 3తులములు, మజ్జిగ అర్ధశేరు కలిపి త్రాగించాలి.

లేక గుంటకలిజేరిఆకురసము కాటుకగాజేసి కండ్లలో పెట్టుము. కన్ను గ్రుడ్డుమీదఅవికిపుట్ట పెరిగినయెడల శస్త్రము చేయవలసియుండును. డాక్టరుగారికి చూపించుము వారు, నేత్రాంజనమును వాడుదురు.

# కండ్లఎరుపు-నీరుకారుట

రక్తరోగమువల్ల అతివేడివల్ల, కండ్లలో ధూళి మున్నగునవి పడుటవల్ల విసుగు విరామములేక రాత్రింబవళ్ళు పనిచేయించుటవల్ల ఈవ్యాధిపశువులకు కలుగుతుంది కొన్ని పశువులకు చిన్ననాటినుండి విడువక కండ్లనుండి నీరుకారుతూ వుంటాయి. పశువు మొదటిలో పుట్టిన వ్యాధియే దీనికి కారణమైయున్నది. ఈవ్యాధి వంశపరంపరముగ వచ్చుటకొన్ని పశువులలో కలదని కొన్ని పశువైద్య శాస్త్రములు తెలుపుతున్నాయి అధికవాతముగల పశువులకుకూడ నీరు కారుతుంది

## లక్షణాలు

పశువునకు గ్రుడ్డుపైపొర వాచి యెర్రబడుతుంది కన్నీరు వేడిగా వుంటూ కంటిలో ఎరుపుజీరలుకూడ యుంటాయి పశువు కన్ను మిక్కిలి ఎరుపుగానున్నచో వెలుతురును కూడ చూడజాలదు. మామూలుగా కొన్ని పశువులకు నీరుకారుతాయి. వాతమువలన కలుగుతుంది,

## చికిత్స

పశువునకు వెలుతురు ఎండ అంతగా తగులనీయరాదు. కండ్లను ఉదయము వేళలయందు వగరునీటితో కడుగుతుండాలి. పశువుకన్నులు మిక్కిలి ఎరుపుగానున్నచో 30, 40 తులాలు ఆముదమును త్రాగించుము.

లేక కందిగింజల గంధము కండ్లలో రెండువేళల పెట్టుము

లేక పశువు మాడుపట్టున ఆముదముకాచి రెండుమూడు దినములు పెట్టుము.

లేక పొంగించిన పటిక అరతులము తెచ్చిదానిలో సూక్ష్మముగా నల్లమందు వేసి చింతాకురసముతో కాలవేసిన వేడిపారమీద మర్దన చేసి కండ్లకుపెట్టుము.

ఫార్మసీవారి నేత్రాంజనము చక్కగా పనిచేస్తుంది.

## కంటిపుసులు

పశువులు విసుగు విరామము లేకుండ పనిచేయించుటవల్లవాత రక్త రోగములవల్ల ఇంకను కంటికిగాని, తలకుగాని, అదురుదెబ్బలు తగులుటవల్ల ఎండలో పనిచేయించుటవల్ల అతివేడివల్ల నేత్ర గోళములలో జబ్బుండుటవల్ల ఈపుసులుపుట్టుతాయి.

## లక్షణాలు

కన్ను పెట్టబడుట నీరు కారుట మరిదగ్గర వుండవచ్చును ఆ భాగమందే గడ్డలుకట్టికన్నుల మొదటిభాగమందు పుసులునీరుకారుతూ వుంటాయి. చూచుటకు పశువు చాలఅసహ్యాకరంగా వుంటుంది. ఈగలు కూడఆగడ్డలమీద ముసిరి కండ్లను చెరుపుతాయి.

## చికిత్స

ప్రతిదినము పశువుమాడున అముదము కాచిపోస్తుండాలి ఇట్లు నాలుగైదు దినములు చేయాలి. పటికనీటితో కండ్లు కడుగుచుండుము.

లేక పసుపుగాని, కుంకుమగాని కండ్లలో పెట్టుము.

లేక సోరచేపతలలోని రాయి, ఖర్జూరగింజ, చనుబాలతో అరగదీసి కంటిలో పెట్టుము

## రేజీకటి

కొన్ని పశువులకు రాత్రిపూట కండ్లు ఏమాత్రం గన్పించవు. ఈవ్యాధిని పశువుయొక్క చర్యలను బట్టి కనుగొనవలసినదే గాని

సాధారణముగా నేత్రపరీక్షవలన తెలిసికొనుట దుస్తరము. కొన్ని దూడలు పుట్టిన వారముదినములలోనే ఈవ్యాధి జనించుతుంది. ఈవ్యాధికూడ వంశ పరంపరముగ వచ్చునని కొందరు డాక్టర్లు చెప్పు చున్నారు ఇంకను ఫ్యాక్టరీ లోనుండు తవుడు విస్తారముగా మేపుట వల్ల, పిల్లిపెసరను నెలలకొలది మేపుటవల్ల కండ్లకు అతివేడిజేసి ఈ వ్యాధి రావచ్చును,

పుట్టినవెంటనే దూడలకు కండ్లుకనపడనియెడల కష్టము. కొన్ని దూడల జీవితము కండ్లుకనపడక వృధాయగుతాయి,

## లక్షణాలు

ఈవ్యాధిగల పశువులు పగలు బాగుగనే చూడగలవు. గాని రాత్రిపూట మాత్రము చూడజాలవు రాత్రిపూట బుట్టలలో ఆహార పదార్థములుంచి యెదుటవుంచిన యెడల రేజీకటిగల పశువు ఇటునటు వెదకుకొంటుండి ఒకదొడ్డినుంచి మరియొకదొడ్డిక తోలినయెడలపశువు నకు త్రోవసరిగాకన్పించక గోడలకు, గోతులకు చెట్లకు అడ్డుపడి పోతుంది. మంచి వెన్నెలగాయుచున్నపుడు మాత్రము విసికో మాదిరిగ కన్పించుతాయి.

## చికిత్స

నేత్రములలో ఆవువెన్న పెట్టి చన్నీళ్ళుకొట్టుము
లేక, మునగాకురసము తేనెతో కలిపి కండ్లకుపెట్టుము.
లేక, గానుగవేరు తేనెతో అరగదీసి కండ్లకుపెట్టుము.
లేక, ఒకటిరెండుచుక్కలు నీరుల్లిపాయల రసము కండ్లలో పిండుము.

లేక, అవిసె పువ్వుల రసము నలకలు లేకుండ శుభ్రమైనవి పోయుము.

మరా:-పుట్టినదూడలకు వరుసగా వారమురోజులు చూపుకనబడనిచో తగ్గుటకష్టము. రేజీకటిగల పశువులకు సజ్జపిండి పెట్టాలి. పసుపు గుడ్డ కండ్లకు వేయుటమంచిది పక్షమురోజులు చికిత్సచేయాలి ఫార్మసీవారి నేత్రాంజనం వాతారిని వాడుడు చేపనూనెను లోపలికి కండ్లలోకి వాడవచ్చును



# ఇరువదిఎనిమిదవ భాగము

## విషప్రయోగాలు

## విషతంత్రము

విషముగలిగిన ఆహారమునుండి నెడలు అవిరితగులుటచేత హృదయమందు బాధకలుగుతుంది. కన్నులుతిరుగుతాయి. కాళ్ళకు అంటిన మంటలుపుట్టుతాయి.

ప్రమాదమునేగాని, అజ్ఞానముచేగాని,విషాహారమును సేవించిన నాలుక బండబారి, రుచిని గ్రహించుశక్తి నశించి, మండుచున్నట్లుగా వుంటుంది.

విషము జీర్ణమైనపుడు అతిసారము, మంటలు, కడుపు లో గడబిడ,శరీర కాంతి తగ్గుట గలుగుతుంది. సారాయి, కల్లుమున్నగు పదార్థములయందు విషమునుకలిపిన సీసలు నురుగులు బుడగలు కలుగుతాయి. విరేచనములగుతాయి.

గానాదినుసులు, పచ్చిగడ్డి జాతులలో విషమును గలిపిన చిటచిటలాడుచు రుచి వశించి దుర్గంధము కలిగియుంటుంది. పచ్చి కాయలకు విషము తగిలిన వెంటనే పండుతాయి. పండిన వానికి తగిలిన వెంటనే కుళ్ళిపోతాయి.

దంతములయందు విషముంటే మొనలు విరిగిపోతాయి. నాలుక, పండ్లు, చిగుళ్ళువాస్తాయి. పుష్పాలకు విషముతగిలితే వాని సువాసన తగ్గి రంగుమారి వాడిపోతాయి. వాసిని వాసనజూచిన శిరోబాధకలిగి నేత్రములందు నీరు తేరుతుంది

అంజన మందు విషముంటే కన్నీటిలో జిగురు వుంటుంది. అంధత్వము కలిగి బాధఎక్కువగ వుంటుంది,

పట్టెళ్ళయందు, గంటలయందు, గొలుసులయందు విషము కలిపితే మామూలుగా ప్రకాశింపవు ధరించితే ఆయా శరీరభాగాలు హింసించుతాయి. ఒడలు పంకుతూ వుండే దురద కలిగి జిలగా వుంటుంది.

## పలువిధ విషప్రయోగాలు

మేత దొరకని కాలములందు పశువులు పొదలమీద వుండే విషవంతములగు ఆకులుతినుటవల్ల, విషపు పుట్టలు పట్టియుండే చొప్ప రెల్లు మొదలగు గడ్డిదినుసులు తినుటవల్ల ఆకస్మికముగా మేతతో ఉమ్మెత్తాకులు, జిల్లేడాకులు. పొగాకు లేతజొన్న మొదలగు విష వస్తువులు తినుటవల్ల, పశువులకు అపాయాలు తటస్థించుతాయి.

ఇంకను పశువులకు మాలమాదిగెలు దుర్బుద్ధిచేతనో, తోళ్ళ కొరకో విషముపెట్టి చంపుతారు. చచ్చిన పశువులను గ్రామ మాది గలకిచ్చుఆచారమును బట్టి తోళ్ళు గిరాకిగా వుండే కాలములందు గ్రామ మాదిగెలు పశువులకు విషములుపెట్టి చంపుతారు

విషవస్తువులు తెచ్చి పిండితోగాని, తవుడుతోగాని పిసికి ముద్ద చేసి అరటియాకులోగాని యితర ఆకులలోగాని మడచి పెట్టుతారు. లేదా పశువులముందర పడవేస్తారు అంతట పశువు తిన్నతర్వాత బాధపడతాయి.

## గడ్డిజాతులలో కలిపి పెట్టుట

కొన్ని సమయములందు పశువులుతిను గడ్డిలో కలుపుతారు కొందరు పశువులు మేయుబీడుభూములలో పాషాణపొడి జల్లుతారు నోరుపొక్కుతుంది.



మరికొందరు చర్మమును చీల్చి ఆగాయమునందు విషమును పూస్తారులేదా ఆసనమునందుగాని యోనియందుగాని విషపదార్థం ఎక్కించుతారు. అప్పుడు యోని వుండగుతుంది.

## మశూచిపడినతలను కుళ్ళించుట

మశూచి పడి చనిపోయినపశువుయొక్క తలను భూమిలో పాతి పెట్టి అదికుళ్ళినతరువాత దానిలో ఒకయింజెక్షన్ సూదిసిదించికుళ్ళి నిరు సూదికి పట్టించినతరువాత ఆసూదితో ఇతరజంతువులకుకొంచెము రక్తముకారునట్లు చేస్తారు. వెంటనే ఆవిషమెక్కి పశువుచనిపోతుంది.

## జిల్లేడుపాలను పేగులలోనికి ఎక్కించుట

జిల్లేడుపాలను ఒకచిప్పలోనికి వాడిచిమూరెడు పొడుగను ఒక అంగుళము వెడల్పుగుగల కర్రపుల్లకొనకు, ఆగుడ్డనుచుట్టి మూత్రము విడుచుపేగులలోనికి గుచ్చిలోపల ఆగుడ్డ నుంచి పుల్లను నెమ్మదిగా బయటకులాగుతారు, ఈనుందుబహువేడియగునస్తువగుటవలన నెంటనే పేగులువాచి బాధపడి చచ్చిపోతుంది.

## అంటువ్యాధుల మలములనుపయోగించుట

పెద్ద రోగము, దొమ్మ మొదలగు వ్యాధులు సంభవించిన పశువుల పేడను తీసి దాచి యుంచి తోళ్ళు గిరాకిగా వుండునపుడు మాత్రము ఆపేడ పచ్చిక మీదజల్లుతారు. ఆపచ్చిక పశువులుతిని పలువిధసంకటముల పాలగుతాయి.

## గన్నేరుగింజలు,చెక్కలనుపయోగించుట

కొందరు మాదిగవాండ్రు పచ్చగన్నేరుగింజలను దారమునకు కండవలె గుచ్చి పశువులముందలపై విసరుతారు. లేదాఎండుగడ్డితో గన్నేరుచెక్క కలిపిపెట్టుతారు.

## గురిగింజలనుపెట్టుట

మరికొందరు గురిగింజలను పొడిచేసి నీటిలోకలిపిముద్దజేసిఒక అంగుళము పొడవుగలకర్రచివరవాడిగాచెక్కిఆముద్దనుకర్రకుఅంటించి

జంతువు శరీరములోనికి జొనుపుతారు. పొడి ఎచ్చట ప్రవేశించునో ఆభాగము విశేషముగా వాచి రెండుమూడు దినములలో పశువుచనిపో తుంది.

## విషము నోటిగుండ పెట్టినతరువాత కనబడు లక్షణాలు

పశువునోటినుండి విషములోనికి వచ్చినయెడల దంతములు చిగుళ్ళు, నోరు, నాలుకపూచి బాధకలుగుతుంది. చొంగ యధికము గా కార్చుతూ వాంతిచేయుటకు ప్రయత్నించుతుంది. కడుపునొప్పి కలిగి తరుచుగా లేచుతూ పండుకొంటూవుంటుంది కడుపుబ్బి పిమ్మట దుర్గంధముతో విరేచనములగుతాయి. ఆవిరేచనములలో రక్తజీర కూడ వుండవచ్చును. నల్లకప్పవేసి వెంట్రుకలు నిక్కబొడుస్తాయి నాలుక చిగుళ్ళు నల్లపడుతాయి, వ్యాధి ముదిరినకొలది కండ్లునీలివర్ణ ముగావుంటాయి.

## ఆసనములో పెట్టినతరువాత కనబడు లక్షణాలు

ఆసనములో పెట్టినయెడల ఆసనము ఎర్రబడి చాలబాధపడు తుంది కడపటియవస్థలో దైన్యముతో చూస్తూ కంటిపాపలు పెద్దవై చాలఆయాసముకలిగి పక్షవాతముచే నిలువకక్రిందపడి చనిపోతుంది.

## చికిత్స

10,20 కోడిగుడ్లును ఒక శేరున్నర చిక్కని జావలోగాని కలిపి 3,4గంటలకొకసారి త్రాగించాలి. లేక వెలగబంకనీరుగాని అన్న భేదినీరుగాని త్రాగించాలి. లేకపుగాకురసముగాని, సున్నపునీరుగాని ఘాటుసారాయిగాని త్రాగించాలి. లేకసారాయి10తు, శొంఠి2తు నల్ల మిరియాలు పొడి1తు, జావఅర్థశేరు కలిపిత్రాగించాలి లేకఫార్మసీ వారి పశురక్షామృతమును గాని విషఘ్నిసిగాని వాడుడు.

## పథ్యము

నీటినిఏమాత్రము త్రాగనీయరాదు, సీమఅవిసగింజలజావగాని బియ్యపుజావగాని. ఎక్కువగా త్రాగించాలి ఉడకబెట్టిన తవుడు, చిట్టు పథ్యముగా పెట్టాలి

## ఉంగిడి

లేతజొన్న ఆముదపుఆకులు తిను పశువులు సాధారణముగా విషమెక్కి చచ్చుటయనక అందరకు తెలియును ఒక పొలములోని లేతజొన్నను మేపిన పశువులు విషమెక్కి చావగా మరియొక పొలములో నట్టిరీతి లేతజొన్ననే మేపిన పశువు లారోగ్యవంతములై యుండుటనుగూడ మన మెరుగుదుము 1903వ సంవత్సరములో క్వీన్స్‌లాండు దేశమునందు లేతజొన్నను మేయుటవలన అనేకపశువులు మరణించుతాయి. అందువలన ఆద్వీపవాసులు శోధనలను బెక్కింటిని జేసి వాని పర్యవసానము ను తెలియపరిచారు. సారవంతములైన భూములలో పెరిగిన జొన్నలయందు ఘోరవిషములైన ప్రుసిక్ ఆసిడ్ మున్నగు పదార్థములువుంటాయి. భూమియందలి సారము తగ్గినకొలది అందుండు జొన్నలో విషము అంతగావుండవు కాబట్టి నిస్సారముగు పొలమునందలి లేతజొన్నను పశువులకు మేపినప్పుడు నష్టముకలుగకున్నను భూమిలోని సారము హెచ్చినకొలది అందలి లేతజొన్నను మేసినపశువుకు విషచిహ్నము [illegible] కానవచ్చుట మీ దేశమువారి శోధనవలన గానవచ్చినది నైట్రోజను విస్తారముగా గలభూములలో మాత్రమే యిట్టివిషము లేతజొన్నయందు కానబడుతుంద. ఇందుకొరకై బ్రిగ్నిక్ అనుదొర ఒకపొలములోని కొంత భాగములో ఎరువును దేనిని వేయకుండగనే జొన్నలను జల్లి మరికొంత భాగమునకు నైట్రోజను ఎరువువిస్తారముగా వేసి జొన్నలనువిత్తెను నైట్రోజన్ వేయబడిన భాగమందలి లేతజొన్నలో విషమువిస్తారముగా గానవచ్చుతుంది. నైట్రోజను ఎంతఎక్కువగా వేయబడినదో అంత వరకే సరిగానందలి లేతజొన్నలో యీవిషము లు హెచ్చుతుంది. ఎన్ని పర్యాయములు యిట్లు శోధించినను ఈరీతిగనే ఫలితము తేలింది. కాబట్టి భూమిలోని నైట్రోజను ననుసరించి లేతజొన్నయందు విషముండునని నిర్ధారణ అయింది.

ఏపుగా పెరుగు మొక్కలలో ఈవిషము తక్కువయు ఎండా కాలపు మొక్కలలో పీలగానెదుగు మొక్కలలోను ఈవిషము విస్తారముగా వుంటుంది. విస్తారము నైట్రోజనుగల భూములలో పెరుగు మొక్కలు ఒకవీసమెత్తు బెరిగినమొక్కలు తినిన ఎట్టి పసరమైనను చనిపోతుంది కాబట్టి లేత మొక్కలనుపీలమొక్కలను అంతగా ఆరోగ్య కరములైనవికావు లేతగాకోసినను ఎండువొప్పయగునేని దీనియందు విషముండదు. నైట్రోజను విస్తారముగాగల భూములలోని జొన్నను కంకి వేయువరకు పశువునకు మేపరాదు మొక్క మొలిచిన మూడువార ములనుంచి ఏడువారములవరకు నందువిశేషముగా విషముంటుంది అటుతరువాత యీవిషమందలి నైట్రోజను విరిగిపోయి హానిజేయని యితరపదార్థముల క్రిందకుమారిపోతాయి, మొక్కపూతబట్టినతరు వాతనందలివిషము నామమాత్రి వశిష్టమైయుంటుంది. కానికొన్ని చోట్ల కొద్దికాలమునకు పూతకువచ్చు మొక్క మరికొన్ని చోట్ల నేపుగాపెరిగి చాలకాలమునకుగాని పూతకురాకుండుటచే పైనచెప్పిన మూడుఏడు వారాల గడువు సర్వత్రి సమముగావర్తించదు. కాబట్టి యేదియెట్లున్నను పూతపూయక ముందు పచ్చిజొన్నను పశువులకు మేతగాపెట్ట రాదు. మాక్సివెల్ అనుఒకదొర లేతజొన్ననుఎండుగడ్డిని కలిపిపశువు నకు మేతగా వేయవచ్చునని అందుఎండుగడ్డిపాలు హెచ్చుగా వుంటే లోపలికిపోవులేతజొన్నయందలి విషముచాలతక్కువగుటచేతఅం తగాహానికలిగించదనీ తెలియజేసాడు ఏదిఏట్లున్నను పూతపూయనిపచ్చి జొన్నను పశువులకు వేయకుండుట యేమంచిది పెరుగుచున్న జొన్న మొదలగు పైరులను పశువులు చొరబడి మేయకుండ కాపుదలచేసి కోవాలి కోసినవెంటనే పచ్చిజొన్న మొక్కజొన్నవీనిని పశువులకు వేయరాదు రెండుమూడుదినములు వీనినిఎండబెట్టి తరువాతనేపశువు లకు వేయాలి. పూతపూయక మునుపు పచ్చిచొప్పను పశువులకు వేయుట యేతప్పు తేమనేలను ఏపుగా పెరిగినదానిని వేయవచ్చును విశేషముగా ఈమేతను ఇతర ఆహారములతో ఇచ్చుటమంచిది.

# తేతజొన్న తిన్న పశువుల లక్షణాలు

పశువు అసుగు వేయు లేదు. తడబడుతూ వుంటుంది. నల్లకప్పు వేస్తుంది వెంట్రుకలు నిక్కబొడిచి సృహతప్పుతుంది. నాలుక జార విడుస్తూ నోటి వెంట చొంగ పడుతుంది. నాలుక విరగలాగుతుంది, వ్యాధిముదిరిన కొలది పొట్ట భరివలె పొంగిసృహతప్పుతుంది. గురక పుట్టి దౌడలు బిగిసికొనిపోతాయి ఊపిరియాడక వెంటనే మృతినొందుతుంది. విషఘ్ని రామాయిల్ వాడుడు.

## చికిత్స

ఆరంభములోనే చికిత్స చేయాలి గాని తరువాత ఏమియు లాభము లేదు

1. శేరున్నర పులికలిలో ఉప్పు చేరెడు, నల్లేరుముద్ద చిన్న నారింజకాయంత కలిపి పెట్టాలి.

2 కొమ్ములకు నూనెవత్తులు చుట్టి కాల్చి జాము వరకు యుంచిన తగ్గుతుంది.

3. కుంకుడుకాయల గంధము కంటిలో కలికెము వేయాలి.

4. నిమ్మపండ్లరసము నల్లేరురసము కలిపి మూడుగొట్టములు పెట్టిన తగ్గుతుంది

5. చిర్రిచెట్టుబదంచి రసముతీసి పులికలితో మూడుగొట్టములు పెట్టాలి.

6. దోసకాయలు పెట్టుము

7 దీపపు కొడిచే జిల్లేడుఆకులు పొట్టముగా కట్టి చమురుకాచి మాడున పెట్టాలి.

8. పులికలితో మస్తపు వేళ్ళునూరి సారముతీసి ముక్కురంధ్రములలో పోసికన్నులకు ఇంగువకలికెము వేయాలి

9. చింతపండు పులుసు మూడు గొట్టములు పెట్టాలి.

10 నల్లేరుకొనలు దవుడలకు పెట్టికొరికించిన తిక్కపోతుంది

11 అమ్మోనియం క్లోరిడ్ అనునది 2/12 తులములు తీసికొని చన్నీటిలో కలిపి త్రాగించాలి.

12 అప్పుడప్పుడు స్మెల్లింగుసాల్టు ముక్కులకు చూపించము, ఫార్మసీవారి పశురక్షామృతముగాని విషఘ్నినిగాని వాడుము.

## పశువుల కుపయోగించు పనిముట్లు

పలుపులు, నీరుపెట్టు తొట్టెలు, మందులనిచ్చు గొట్టములు పాత్రలు ఎప్పటి కప్పుడే పరిశుభ్రము చేయాలి. శత్రువులెవరైన యున్నపుడు విషమందులు కలుపుదురేమో తనిఖీ చేయుచుండాలి.

పశువులశాలలు పాకలుగూడ పరిశుభ్రముగా వుంచాలి. చెత్త వగైరాలున్నచో విషపురుగులు చేరుతాయి క్రిమికీటకాదులు జనించి పలువిధ రోగములు కలిగించుతాయి గడ్డివాములు, పుట్టలు, విషము గల తీగెలు, లేక జొన్న వగైరా లుండుచోట్ల పశువులను కట్టరాదు.

మంచి పశువులకు ఓర్పు లేనివారు నోటిలో దబ్బనము, ఇనుప సూదులు మున్నగునవి వేస్తారు ఇట్లు వేయుటవలన పశువు ప్రేగులలో గాని, తదితర అవయవములలోగాని నిలువయుండి పశువును బాధించుతూ కొన్నాళ్ళకు ఆవస్తువు త్రుప్పుపట్టి. శరీరభాగములను చెరచుతుంది. ఆకలితగ్గి మందముతో వుంటుంది. ప్రేగులలో చిక్కుకొని యుంటే తూట్లుపడుతాయి. కడుపునొప్పి, నోటివెంట చొంగ. ముక్కులవెంట చీమిడి మున్నగునవి పడుచూ క్రమేపి పశువుమరణించుతుంది. కండరములలో చిక్కుకొనియుంటే ఆభాగమంతా చెడికణుతులు లేస్తాయి. ఆకంతులు పక్వమునకురాక శరీరమంతాపుట్టి కొన్నాళ్ళకు ఆవిషమంతా జీర్ణమై చనిపోతుంది. విరేచనములగునపుడు ముడ్డి

తీపు శోంకలిగి మలముతో త్రుప్పురంగుకూడ కనబడుతుంది. కండర ములోనిలువయున్న చీముపట్టి కొన్నాళ్ళకు పగిలి ఆపనిముట్లుకనపడు తుంది. పేగులలో చిక్కుకొన్న లాభము లేదు.

ఇటువంటి వస్తువు మ్రింగినపశువుల చరిత్ర తెలిసికొనుటచాల కష్టము. అనేకమంది పశువైద్యులను తీసికొనివచ్చి చూపించుతారు అందరిలోకొందరు పేగులో చిక్కుకొనినప్పుడు కడుపునొప్పి యంటారు ఇంక అనేకవిధాలుగా రోగనిర్ణయాలు చేస్తారుగాని అసలువ్యాధి కను గొనరు పశువు మరణించిన తరువాత మాదిగెవాండ్రు కోయునప్పుడు ఆవస్తువులు బయట పడుతాయి.

ఇటువంటి ప్రమాదములు జరిగినపుడు వెంటనే మూడు నాలుగు సార్లు సబ్బునీటితో ఎనిమా చేయాలి. తరువాత వెన్నను తినిపించాలి. కంతులు పుట్టినయెడల శస్త్రవైద్యములో నున్న ప్రకారము శస్త్ర చికిత్సలు చేయాలి.

లేదా పశురక్షామృతమునుగాని విషఘ్నినిగాని వాడుడు.

## జంగమ విషాలు

పిచ్చికుక్కలు మొదలగు చతుష్పాద జంతువులు, సర్పములు, వృశ్చికములు, శతపదాదులు, లూతలు, మూషికములు, మండూ, కములుఅనేవి.

## విషమాశ్రయించి యుండేస్థానాలు

దృష్టి, నిట్టూర్పు, కోరలు, గోళ్ళు, మలము, మూత్రము, శుక్రధాతువు, చొంగ, తోక, ముఖముతో కరచుట, అపానవాతము గుదమునందలి యెముక, చేదు, తోకయందలి ముల్లు మృతకళేబరము అను వానియందు విషమువుంటుంది.

దేవతా సర్పములకు దృష్టియందును, నిట్టూర్పునందును, నేల మీాదనుండు సర్పములకు కోరలయందు విషమువుంటుంది.

పిల్లి, కుక్క, కోతి, మొసలి, కప్ప, మత్స్యము, ఉడుము, నత్తపురుగులు, కీచురాయి, బల్లి మొదలగు చతుష్పాద జంతువులకు, పురుగులకు కోరలయందు, గోళ్ళయందు, విషమువుంటుంది

చిపిటము, పిచ్చిటము, సర్షపవాసికము, తోటకము, కీటకము, కౌండిల్యకమను పురుగులకు మలమూత్రములందు ఎలుకలకు శుక్రము నందు విషమువుంటుంది.

సాలెపురుగులకు, చొంగ మూత్రము, రెట్ట, కాటు, గోళ్ళు, శుక్రము, ఆర్తవము-వీనియందు విషమువుంటుంది

తేలు, విశ్వంభరము, రాజీవమను చేప, ఉచ్చిటింగము, సముద్రపు వృశ్చికము అనువానికి తోకయందు వుంటుంది.

చిత్రశిరము, శతదారుకము, అరిమేదకము, శారికాముఖమను కీటకములకు కాటు, అపానవాతము మూత్రము, రెట్ట యను వాని యందు వుంటుంది.

ఈగలు కందిరీగలు, జలగలు కాటునందు విషమువుంటుంది

విషముచే చచ్చిన జంతువులయొక్క ఎముకలుపాము శరీరమునందలిశల్యములు, వరటి యనుచేప ఎముక యనునవి అస్థివిషములుఅంటారు.

శకుని, ఎర్రచారలుగ చేప (రక్తరాజీవము) వరకీయను చేపలకు చేదుకట్లయందు సూక్ష్మతుండము, ఉచ్చిటింగము, వరటి, కాళ్ళజెర్రి, శతపది, శూకవలభిక, శృంగి భ్రమరము (తుమ్మెద) లకును తోకయందు, ముల్లునందు విషమువుంటుంది.

కీటకాలు:- పాములయొక్క శుక్రము, మలము, మూత్రము, శవము కుళ్ళిపోయిన గ్రుడ్డు మొదలగు వానినుండి వాతపిత్త శ్లేష్మ ప్రకృతులుగల వివిధములగు కీటకములు జనించుతాయి.

కందిరీగలు;- నాలుగుజాతులు గలవు. ఇవన్నీ తీవ్రముగా బాధను గలిగించుతాయి. ఇవికరచినచో వాపులు పుట్టుతాయి. కాటు నల్లబడుతుంది, నొప్పులు. మంటలు, కలుగుతాయి.

జెర్రులు:- ఎనిమిది జాతులుగలవు. ఇవి కరచినవాపుమంటలు కలుగుతాయి కొన్నికరచిన గడ్డలు లేచుతాయి.

కప్పలు:- ఎనిమిదిజాతులుగలవు వీటిలో కొన్ని కరచినచోట దురద కలుగుతుంది నోటివెంట నురుగువచ్చుతుంది. ఇంక కొన్నిరకములు కరచిన మంటలుగలుగుతాయి. మూర్ఛవచ్చుతుంది.

చీమలు:- ఆరుజాతులు. చలిచీమలు కరచిన కాటునందు తీపు అగ్ని తగిలినట్లు మంటవాపు కలుగుతుంది,

తేనెటీగలు:- ఆరుజాతులుఇవికరచినమంటలు వాపులు కలుగుతాయి

దోమలు:- ఇవి కరచిన ఎక్కువదురదకలుగుతుంది. కొన్ని కరచిన ఆస్థలమందు గోకినయెడల పుండ్లుపడిమంటగా వుంటాయి.

## లూతలు

మనము మన యిండ్ల యందు, రెల్లుదుబ్బ లందు, జనుప గడ్డివాములందు సాలెపురుగులనులూతలనుచూచుచుందుము వీటినిగురించియే ఇదివరకే చెప్పబడియున్నది సాలీడుశరీర మందు గ్రంథులనబడు సంచులువుంటాయి. కొన్ని భూములలో కన్నములుచేసికొని వానిపై కప్పులను దారముతో నమర్చుతాయి. లోపలి భాగాన పగలంతా యుండిరాత్రులయందాహారము కొరకై వెలుపలికి బయలుదేరుతాయి మరికొన్ని చెట్లకొమ్మలకు ఛత్రమువంటి గూటిని నిర్మించి మధ్యను తనపిల్లలను రక్షించుకొంటుంది ఇంకాకొన్ని నీటి యడుగునే యుండి

యచ్చట నే గూండ్లు కట్టుకొని తమపిల్లలను పెంచుకొంటాయి. పశువులు రెల్లుదుబ్బులను తిన్ననాడుగాని జనుపకట్టెలు జొన్నవరిగడ్డి, బీటిమేత, తదితర దాణాదినుసులు, తిన్నప్పుడు వానితోపాటు ఈ సాలీళ్ళను వాటి గూళ్ళను తింటే ఒక విధమైన వ్యాధి కలుగుతుంది కొన్ని ప్రమాదముకలిగించుతాయి.

## లక్షణాలు

ఆరంభములో పశువు నల్లకప్పు వేస్తుంది. కడుపుబ్బుతుంది. నోటి నుండి చొంగ పడుతుంది. మలబద్ధక ముంటుంది. వెన్ను విరచు తుంది. కరచినచోటుమంటలు పుట్టుతాయి బుడగలుగా పొకుతాయి వెండ్రుకలు నిక్క బొడుస్తాయి

## చికిత్సలు

ఫార్మశీవారి బేల్ పౌడరును. పశురక్షా మృతమును వాడుడు.

లేక దిరిసెనాకు పసరు అర్థశేరు పసుపు 1/2 తులం కలిపి త్రాగించాలి.

లేక శొంఠి 1తు, పిప్పళ్ళు 1తు, మిరియాలు 1తు, మజ్జిగ 1 శేరు కలిపి త్రాగించాలి.

లేక ఎక్కువ తీవ్రలక్షణము లున్నచో శొంఠి గంధముగాని మిరియాల గంధముగాని కండ్లలో వేయాలి.

# సర్పజాతులు



| | | | |
|---|---|---|---|
| తాచుపాములు | —26 | విషము లేనివి | —12 |
| పొడపాములు | —22 | సంకరజాతులు | — 3 |
| కట్లపాములు | —10 | సంకరజాతులవలనపుట్టినవి— | —7 |

ఈరీతిగా మొత్తముమీద 80 జాతుల సర్పములు గలవని తెలిసికోవాలి.

## అల్పవిషాలుగల పాములు

రోగము కలిగినట్టే భయపడునట్టే, సర్పములకు విషము స్వల్పముగవుంటుంది. ఆవిధముగనే వృద్ధాప్యము గలిగినట్టె, చిన్న పాములకుగూడ స్వల్పవిషము వుంటుంది. విషహారములగు ఔషధములుగల ప్రదేశములయందు విషము బాగుగా వ్యాపింపజాలదు జలములో సంచరించు సర్పములకు, కుబుసము విడుచు సర్పములకు,

చిక్కనసర్పములకు దప్పికొన్న సర్పములకు విషము తక్కువగా వుంటుంది.

## పాముకట్టు

ఏసర్పము కరచిననూ కాళ్ళయందైనచో మొట్టమొదట గుడ్డ పీలికలచేగాని, తోలువారలచేగాని, చెట్టుపట్టులచేగాని మరియే యితర మృదువైన వస్తువులచేగాని కరచినచోటునకు నాలుగుఅంగుళ ములపైన కట్టుకట్టాలి ఇట్లుకట్టుటచే విషము శరీరమునందు వ్యాపిం పక నిలచిపోతుంది. ఈకట్టునకు అరిష్టమంటారు కట్టు కట్టుటకు వీలు లేనిస్థలములైనచో విషము వెలుపలికి పీల్చుట, కరచినచోటు కోయుట, కాల్చుట యనునవి అన్నివిషములందూ ముఖ్యములైనవి వెంటనే మూర్కొండాకు పసరును ముక్కులోనూ, చెవులలోనూ కొన్నిచుక్కలు పిండిన వెంటనే కొన్నిటికి తగ్గుతుంది.

## సర్ప విషము

మానవులకు శరీరమంతా శుక్రము వ్యాపించినట్లుగానే సర్ప మునకు శరీరమంతటా విషము వ్యాపించియుంటుంది. కోపము కలిగి నపుడు విషము బయటకు కక్కుతుంది. సర్పముయొక్క కోర చేపలనుబట్టు గాలములవలె వంకరగావుంటాయి. విషముశరీరమునుండి బయలుదేర వానియందు చిక్కుకొంటుంది, కనుక సర్పములు కాటు వేసినతరువాత వెల్లికల బడినగాని (పడగవరకు) విషమును వదల జాలవు. విషమంతయుకూడ మిక్కిలి ఉష్ణముగ తీక్ష్ణముగవుంటుంది.

## పాములు ఊదుట

కొన్ని విషసర్పములు నోటినుంచి పాడిపశువుల పొదుగులకు, తదితర పశువుల శరీరమునకు విషముగల గాలి విడుస్తాయి. అట్టి సమయము

నందు శరీరము మీద పొడగజ్జి పుండ్లు పుండ్లుగుండ రక్త ద్రవము. దద్దుర్లు కలుగుతాయి ఇట్టి వాటికి నర మూత్రం, పచ్చిపసుపు కలిపి నూరి త్రాగించాలి.

మంత్రిగాడితో దురాయి.కట్టించుము.

లేక విషఘ్నిని వాడుము




లేక గాడిది గడపాకు పసరు, పచ్చికుసుమాకు పసరు కలిపి 2 1/2 తులములు త్రాగించుము.

## కాటు భేదములు

వెలికిల బడిన చో మిక్కిలి బలముగా కరచిన దనీ ఒక్క కోరమాత్రమే దిగ బడిన యెడల ఆక్రాంతమై కరచిన దనీ ఒక్క కోర మాత్రమే కొంచెము దిగ బడిన యెడల భీతిల్లి కరచిన దనీ రెండు కోరలు లోతుగా దిగబడినయెడల క్షుద్బాధ మిక్కుటముగా నుండి కరచినద నీమూడు కోరలుగ దిగబడిన చో మహానాగము కాటు వేసినదనీ మిక్కిలి లోతుగా గాయము పడు నటుల గరచిన యెడల ఇదివరకు పగబట్టి కర చినదనీయు గ్రహించాలి.

# విషాది వివరణ పట్టిక

| | విష గ్రంధిలో నుండు విషము | కరచినప్పుడు వెలువడునది | మనుజుని, పశువును చంపుటకు ఎలయునది | మరణము తటస్థించు కాలము |
|---|---|---|---|---|
| త్రాచుపాము | 1/2-18 గ్రెయినులు | 6 గ్రెయినులు | 1/12 గ్రెయినులు | 10 ని॥ మొ॥ 30 గంటలు |
| కృష్ణసర్పము | 2-16 గ్రెయినులు | 4 గ్రెయినులు | 1/12 గ్రెయినులు | 10 ని॥ మొ॥ 24 గంటలు |
| వైపరులు | 1-4 గ్రెయినులు | 2 గ్రెయినులు | 1/8 గ్రెయినులు | 6 గం॥ మొ॥ 8 రోజులు |
| కట్లపాము | 1/50-2 గ్రెయినులు | 1 గ్రెయిను | 1100 గ్రెయినులు | 12 గం॥ మొ॥ 8 రోజులు |

పొగాకు తోటలవైపునకు పాములురావు కావున పొగాకును ఔషధముగా వాడుతారు. ఇదీ కొంతపనిచేస్తుంది. శీతాకాలములో విషమెక్కువగా యుంటుంది. చీకటికంటె వెలుతురులో విషంఎక్కువగా యుంటుంది. పాము చాలదూరమునుండివచ్చి కరచినపుడుగాని రెండుదవడలు సరిగ కలువకపోయినగాని విషము చాలకొద్దిగా ఎక్కుతుంది. మంచినీళ్ళలోవుండే పాములకు విషంవుండదు. సముద్రములో వుండే సర్పాలలో కృష్ణసర్పముకన్న పదిరెట్లెక్కువ విషము వుంటుంది. ఉష్ణప్రదేశములలో యెక్కువ విషమువుంటుంది సర్పముయొక్క వయస్సును బట్టికూడ విషముమారుతుంది. సర్పము కోపముగావుంటే విషమెక్కువగావుంటుంది ఆహారము తిన్నతరువాత కూసము విడిచిన తరువాత విషమువుండదు ఈ సర్పములన్నీ చెవిటివికగలవు. నదుల దాటగలవు త్రాచుపాములకు చాల జ్ఞాపకశక్తిఎక్కువ వాటిని బాధించిన వారిని చాలా కాలమైనను జ్ఞాపకముంచుకొని, వీలైన తిరిగి శిక్షించగలవు.

# పాముకాటు లక్షణాలు

పాముకాటునకు వెంటనే అనగా విషము దేహమునందు వ్యాపించకమునుపే చికిత్స చేయుటకారంభించాలిగాని, "అలస్యంఅమృతంవిషం" అనునట్లు విషము దేహము నందంతటా రక్తములో ప్రవేశించి రక్తము నల్లబడిన తరువాత నేమియూ లాభము లేదు. పాము కరచిన పశువునకు బాగుగా లక్షణాలు కనబడుతాయి కరచినచోట భరింపరాని మంటయుంటుంది. శీఘ్రముగా మత్తును కలుగజేస్తుంది తటాలున క్రిందనుండి పైకిపక్షవాతము క్రమ్మినట్లగుతుంది కాళ్ళలో సత్తువబోయి నేలగూల బడుతుంది గుండెలు పత్తుకొని పోవునట్లుండి దడగావుంటుది కన్నుమేపి తలవాలిపోయి ఊపిరియాడుట కష్టముగా వుంటుంది కునుకుపాట్లు పడుతుంది దీనినేసర్పనిద్రయంటారు.

మొదటి అవస్థ:- పశువుపండ్లు తెలుపురంగుగావుండి నీరుకారుతుంటాయి. జ్వరముకంటుది. ఈఅవస్థలో జిల్లేడుకొనలు. ఉప్పు, ఆవుపాలతో నూరి కండ్లలో కలికము వేయుము. లేక దిరిసెన పువ్వుల రసము కండ్లలో పెట్టుము. లోపలికి నాగముల్లి వేరు 2 తులములు, సన్నావాలు అరతులం నూరి మూడు గొట్టముల గంజిలో కలిపి పెట్టుము.

రెండవ అవస్థ:- పశువు శరీరమంతా నలుపురంగుగా మారి చొంగకార్చుతుంది. ఈఅవస్థలో మణుగు తామర 3తులాలు, తెల్లగలిజేరు 3తు, ఈశ్వరివేరు 3తు, నూరి ముద్దచేసి నీటిలో కలిపి త్రాగించాలి. రేలవేరు గంధముతీసి కండ్లలో పెట్టాలి.

మూడవ అవస్థ:- శిరస్సు బరువుగా వుంటుంది. మెడ నిలువజాలదు ఈఅవస్థయందు తెల్ల ఉలిమిరివేరు 2తులములు, ఈశ్వరివేరు 3తు, దిరిసెనచెక్కరసం 3తు, నూరి నీటితో కలిపి త్రాగించాలి. కలి నీటితో దిరిసెన విత్తులునూరి కండ్లలో వేయుము

నాలుగవ అవస్థ:- పండ్లు కొరుకుతూ, భూమిమీద పడుతుంది శరీరము నల్లబడుతుంది ఈఅవస్థలో చికిత్సచేయుట లాభము లేదు.

## చికిత్సలు

ఏ పాముగరచి ఆలస్యమైననూ. పశువు గుటక వేసినచో గాడిద గడప, పిచ్చికుసుమ మిరియాలు. అత్యద్భుతముగా పనిచేస్తాయి.

నాగముండదుంప నీటితో అరగదీసి అయిదుతులాలు లోపలికి త్రాగించి కొంత కరచినచోట పూసిన విషము విరుగుతుంది.



తెల్ల ఈశ్వరివేరు గంధముతీసి నాలుగుతులాలు లోపలికిచ్చి కుట్టినచోట పూసిన విషము హరించుతుంది

ఉత్తరేణిఆకులు నూరి పాముకరచినచోట మందముగ పట్టించిన విషము హరించుతుంది. దీని ఆకురసము లోపలికి త్రాగించుము.

[—]

# ఇరువదితొమ్మిదవ భాగము

## ప్రసవతంత్రము

### చూడిపశువుల పోషణ

మన దేశములోవున్న చూడిపశువులు ఈనిన తరువాతగాని, ఈనకముందుగాని అనేక వ్యాధులు, అపాయములు అప్పుడప్పుడు సంభవించుచున్నవని మన కందరకును విశదమేగదా ? ఇట్టివి సంభవించుటకు మన రైతులయొక్క తెలివితక్కువ చేతను అయా పశువుల యొక్క అనారోగ్యముచేతను తటస్థించుతాయి. పశువులు ఈనుట, గర్భము ధరించుట మున్నగునవి వానికి స్వాభావిక కర్మలోవిగాని వ్యాధులలో జేరినవిగావు. మిక్కిలిగారాబముతో పెంచుచూడిపశువు ఈనవలెనన్న చాల కష్టముగా ఈనుతుంది ఎందుచేతనన దానికి తగినంత విశ్రాంతి నీయక దృష్టిదోషము తగులునను యుద్దేశ్యముతో చీకటికొట్టములలోవుంచి, అమితముగా దాణాదినుసులు పెట్టి మేపుట వలన ఇటువంటివి కలుగుతాయి. పశువులు ఈనునప్పుడు పడుకష్టాలు చెప్పనలవిగాదు. కొన్ని పశువులు చూలునిలువగనే సునాయాసముగా ఈని చాల ఆరోగ్యకరంగా వుంటాయి. ఇట్టిపశువులు నిర్మలవాయువులో తిరుగుతూ నిర్మలోదకాన్ని త్రాగుతూ, పరిశుభ్రమైనస్థలాలలో నివసించుతూ, దేహపరిశ్రమవల్ల దేహదార్ఢ్యమును గలుగజేసికొంటాయి. చూడిపశువులను, తదితర పశువులతో నెప్పుడు వుంచరాదు పశువులన్నియు ఎచ్చోట ఎక్కువగావుంటాయో, అచ్చోట వాయువు అపరిశుభ్రమగుతుంది. కల్మషాదులుకూడ ఎక్కువ అగుతాయి. ఇందు చేత ఇచ్చట నివసించు పశువులు అనేకరోగముల పాలగుతాయి.

పశువులను పోషించేరైతులు చాల జాగ్రత్తతో, ప్రేమతో చూచుచుండాలి ఇవి ఈను కాలము వచ్చినతరువాత వానికేవైనైన ఆటంకాలువచ్చినచో తెలివిగల పశువైద్యుని రప్పించి తగిన చికిత్సలు చేయించాలి. గ్రామాలలో వివిధ రకాల పశువైద్యులువుంటారు కొందరు దూడను సరియైనమార్గములో నికితీసికొనిరాకుండగనే లోపల దానితలకు త్రాడువేసి యోనిగుండ లాగుతారు. మరికొందరు చేయి పెట్టి లోపలిఅవయవాలన్నీ తాకి పశువు యొక్క యోనిని చెడగొట్టు తారు మరికొందరు తెలియని మందులు లోపలికి పోయించి పిండానికి అపాయము గలుగజేస్తారు.

కాబట్టి చూడిపశువుల విషయమై చాల జాగ్రత్తగా వుండాలి. అవినోరులేని పశువులు. మనము జ్ఞానము గలవారము. కాబట్టి మన మెంతజాగ్రత్తగా వుంటే అంతపుణ్యము మనకుగలుగుతుంది.

## పశువులకలయిక

ఎదయినపుడు ఆబోతును ప్రతిదినము ఆవులతో కలుపరాదు వారమునకు రెండు ఆవులకంటె ఎక్కువగా కలియ నీయరాదు. ఆబోతును నియమితము లేకుండ విడచుటవలన శీఘ్రముగా నపుంసకత్వం కలుగుతుంది. లేదా అట్టిదానికి పుట్టిన దూడలు రోగగ్రస్తము బలహీనము అయిచచ్చుతాయి లేదా చచ్చియూ చావక కునుకుచు బ్రతుకుతాయి. ఆవునుఅనేకసారులు దాటించుటచేత దాని చూలు కూడ పాడగుతుంది. ఆబోతు ఆవును ఒకసారి దాటినయెడల చూలు కలుగుతుంది రెండవసారి దాటిన యెడల చూడికి భంగము కలుగుతుంది. చూడికట్టిన తరువాత ఆవును మరల ఆబోతుతో కలియనీయరాదు. ఇట్లుకలిసిన గర్భస్రావము కలిగి ఆవు ఈచుకొని పోతుంది. ఒకసారి చూడికట్టినఆవు మరల ఆబోతును కాంక్షించదని అనేకమంది అభిప్రాయ పడుతారు. కాని ఈసంగతి మేము నమ్మజాలము. నాలుగైదు నెలలచూడితో వున్న ఆవులనుగూడ ఆబోతులు కలుస్తాయి

ఆవుఈనిన 4 మాసముల వరకు ఆబోతుదరికి జేరనీయరాదు. అప్పుడు కరిపచ్చిగా దించుకొని యుంటుంది. గర్భము ధరించుటకు తగిన స్థితిలో నుండదు. ఒక వేళ ఆబోతు కలిసినను చూలు నిలువదు. ఆవు ఈసమయములో అరచినను దాటించరాదు. ఎదఆరనిచో చన్నీళ్ళతో కడుగుట మంచిది లేక సూరేకారము అరతులం చన్నీటితో కలిపి త్రాగించిన ఆతాప మణుగుతుంది

## యుక్తవయస్సు

పశువుయొక్క యుక్తవయస్సును గూర్చి పశువైద్య శాస్త్రజ్ఞులలో కొందరికి భేదాభిప్రాయములు గలవు. సామాన్యముగా ఆవు పెయ్యి ఆరుమాసములకుపొర్లి పదిహేనుమాసములకు యుక్తవయస్సు వచ్చుసరికి ఈనుతుంది. కాని అంతచిన్న వయసులో గర్భము ధరించి ఈనినపశువునకు పుట్టుదూడ బలహీనంగావుంటుంది పాలనమ్మువారు ఆవుపెయ్యను ఆరుమాసములకే గర్భము ధరించునట్లుచేస్తారు. దానికి కారణమేమన అంతత్వరలో ఈనినయెడల వారుదానిపాలు మొదలగు వానిని అమ్ముకొని లాభము పొందుటకు ప్రయత్నించుచుతారు జనసామాన్యమంతా ఆవుపెయ్యకు రెండుసంవత్సరముల వయస్సు వచ్చునప్పటికి ఈనునట్లుగా చేస్తారు. ఈవత్సరమునందు ఈనుపెయ్యను మనము జాగ్రత్తగా పోషించిన యెడల అది యెట్టికష్టములను పొందక దూడను పెట్టుతుంది

## ప్రసవకాలము

పశువులను పెంచువారు పశువు పొర్లినతేదీని జ్ఞాపకముంచుకొన్నయెడల అదిఈను సరియైనదినము ఆసాజముగా తెలిసికొనగలరు. ఈదిగువ పట్టికలోని మొదటి వరుసలో తెలుపబడినవి పశువులు పొర్లిన తేదీలనీ, వానికి వ్యతిరేకముగవున్న రెండవ వరుసలో నున్న తేదీలు అవి ఈను కాలమును తెలుపు తేదీలనీ గ్రహించాలి

దీనికిఉదాహరణము:- ఒకఆవు జనవరి 10వ తేదీని పొర్లినయెడల అక్టోబరు 21 వ తేదీన ఈనుతుంది జూన్ 16 వ తేదీన పొర్లినయెడల ఏప్రియల్ 6 వ తేదీన ఈనుతుంది.

ఈపట్టికలో వేసిన తేదీలు సుమారుగ వేయబడినాయి ఈ చెప్పిన తేదీలకు కొద్దిదినములు ముందు వెనుకలుగ ఈనుతాయి

## ప్రసవకాలపట్టిక

| పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ |
|---|---|---|---|---|---|
| జనవరి 1 | అక్టో॥ 12 | ఫిబ్రవరి 1 | నవం॥ 12 | మార్చి 1 | డిశం॥ 10 |
| 2 | 13 | 2 | 13 | 2 | 11 |
| 3 | 14 | 3 | 14 | 3 | 12 |
| 4 | 15 | 4 | 15 | 4 | 13 |
| 5 | 16 | 5 | 16 | 5 | 14 |
| 6 | 17 | 6 | 17 | 6 | 15 |
| 7 | 18 | 7 | 18 | 7 | 16 |
| 8 | 19 | 8 | 19 | 8 | 17 |
| 9 | 20 | 9 | 20 | 9 | 18 |
| 10 | 21 | 10 | 21 | 10 | 19 |
| 11 | 22 | 11 | 22 | 11 | 20 |
| 12 | 23 | 12 | 23 | 12 | 21 |
| 13 | 24 | 13 | 24 | 13 | 22 |
| 14 | 25 | 14 | 25 | 14 | 23 |
| 15 | 26 | 15 | 26 | 15 | 24 |
| 16 | 27 | 16 | 27 | 16 | 25 |
| 17 | 28 | 17 | 28 | 17 | 26 |
| 18 | 29 | 18 | 29 | 18 | 27 |
| 19 | 30 | 19 | 20 | 19 | 28 |
| 20 | 31 | 20 | డిశం। 1 | 20 | 29 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| జనవరి 21 | నవం॥ 1 | ఫిబ్రవరి 21 | డిశం॥ 2 | మార్చి 21 | డిశం॥ 30 |
| 22 | 2 | 23 | 3 | 22 | 31 |
| 23 | 3 | 23 | 4 | మార్చి 23 | జనవరి 1 |
| 24 | 4 | 24 | 5 | 24 | 2 |
| 25 | 5 | 25 | 6 | 25 | 3 |
| 26 | 6 | 26 | 7 | 26 | 4 |
| 27 | 7 | 27 | 8 | 27 | 5 |
| 28 | 8 | 28 | 9 | 28 | 6 |
| 29 | 9 | | | 29 | 7 |
| 30 | 10 | | | 30 | 8 |
| 31 | 11 | | | 31 | 9 |

## ప్రసవకాలపట్టిక

| పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ | ఎశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ |
|---|---|---|---|---|---|
| ఏప్రిల్ 1 | జనవరి 10 | మే 1 | ఫిబ్రవరి 9 | జూన్ 1 | మార్చి 12 |
| 2 | 11 | 2 | 10 | 2 | 13 |
| 3 | 12 | 3 | 11 | 3 | 14 |
| 4 | 13 | 4 | 12 | 4 | 15 |
| 5 | 14 | 5 | 13 | 5 | 16 |
| 6 | 15 | 6 | 14 | 6 | 17 |
| 7 | 16 | 7 | 15 | 7 | 18 |
| 8 | 17 | 8 | 16 | 8 | 19 |
| 9 | 18 | 9 | 17 | 9 | 20 |
| 10 | 19 | 10 | 18 | 10 | 21 |
| 11 | 20 | 11 | 19 | 11 | 22 |
| 12 | 21 | 12 | 20 | 12 | 23 |
| 13 | 22 | 13 | 21 | 13 | 24 |
| 14 | 23 | 14 | 22 | 14 | 25 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏప్రిల్ 15 | జనవరి 24 | మే 15 | ఫిబ్రవరి 23 | జూన్ 15 | మార్చి 26 |
| 16 | 25 | 16 | 24 | 16 | 27 |
| 17 | 26 | 17 | 25 | 17 | 28 |
| 18 | 27 | 18 | 26 | 18 | 29 |
| 19 | 28 | 19 | 27 | 19 | 30 |
| 20 | 29 | 20 | 28 | 20 | 31 |
| 21 | 30 | 21 | మార్చి 1 | 21 | ఏప్రిల్ 1 |
| 22 | 31 | 22 | 2 | 22 | 2 |
| 23 | ఫిబ్రవరి 1 | 23 | 3 | 23 | 3 |
| 24 | 2 | 24 | 4 | 24 | 4 |
| 25 | 3 | 25 | 5 | 25 | 5 |
| 26 | 4 | 26 | 6 | 26 | 6 |
| 27 | 5 | 27 | 7 | 27 | 7 |
| 28 | 6 | 28 | 8 | 28 | 8 |
| 29 | 7 | 29 | 9 | 29 | 9 |
| 30 | 8 | 30 | 10 | 30 | 10 |
| | | 31 | 11 | | |

## ప్రసవ కాల పట్టిక

| పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ |
|---|---|---|---|---|---|
| జూలై | ఏప్రిల్ 11 | ఆగష్టు 1 | మే 12 | సెప్టెం॥ 1 | జూన్ 12 |
| 2 | 12 | 2 | 13 | 2 | 13 |
| 3 | 13 | 3 | 14 | 3 | 14 |
| 4 | 14 | 4 | 15 | 4 | 15 |
| 5 | 15 | 5 | 16 | 5 | 16 |
| 6 | 16 | 6 | 17 | 6 | 17 |
| 7 | 17 | 7 | 18 | 7 | 18 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| జూలై 8 | ఏప్రి॥ 18 | ఆగస్టు 8 | మే 19 | సెప్టెం॥ 8 | జూన్ 19 |
| 9 | 19 | 9 | 20 | 9 | 20 |
| 10 | 20 | 10 | 21 | 10 | 21 |
| 11 | 21 | 11 | 22 | 11 | 22 |
| 12 | 22 | 12 | 23 | 12 | 23 |
| 13 | 23 | 13 | 24 | 13 | 24 |
| 14 | 24 | 14 | 25 | 14 | 25 |
| 15 | 25 | 15 | 26 | 15 | 26 |
| 16 | 26 | 16 | 27 | 16 | 27 |
| 17 | 27 | 17 | 28 | 17 | 28 |
| 18 | 28 | 18 | 29 | 18 | 29 |
| 19 | 29 | 19 | 30 | 19 | 30 |
| 20 | 30 | 20 | 31 | 20 | జూలై 1 |
| 21 | మే 1 | 21 | జూన్ 1 | 21 | 2 |
| 22 | 2 | 22 | 2 | 22 | 3 |
| 23 | 3 | 23 | 3 | 23 | 4 |
| 24 | 4 | 24 | 4 | 24 | 5 |
| 25 | 5 | 25 | 5 | 25 | 6 |
| 26 | 6 | 26 | 6 | 26 | 7 |
| 27 | 7 | 27 | 7 | 27 | 8 |
| 28 | 8 | 28 | 8 | 28 | 9 |
| 29 | 9 | 29 | 9 | 29 | 10 |
| 30 | 10 | 30 | 10 | 30 | 11 |
| 31 | 11 | 31 | 11 | | |

## ప్రసవకాల పట్టిక

| పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ | పశువు పొర్లిన తేదీ | ఈనిన తేదీ |
|---|---|---|---|---|---|
| అక్టోబరు 1 | జూలై 12 | నవం॥ 1 | ఆగస్టు 12 | డిశెం॥ 1 | సెప్టెం॥ 11 |
| 2 | 13 | 2 | 13 | 2 | 12 |

# కడుపులో వాయువు చేరుట

చూడిపశువు కడుపులో వాయువు చేరితే డొక్కలుబ్బి యుంటాయి జీర్ణముకాని పదార్థములు తినుటవల్ల పిండమునకుఏర్పడైన అపాయము కలుగుటనలన ఈవ్యాధి రావచ్చును. ఇంకను పేగుల యందు జీర్ణశక్తి క్షీణించుటచేత కూడ వాయువు ప్రసరించి నపుడు నొప్పి, శూలనొప్పి, కడుపుబ్బరము కలుగుతుంది.

ఫార్మసీవారి వాతారి అరఖును వాడుడు.

# మలబద్ధకము

ఇది సాధారణముగా పశువులలో చాల భాగము వరకుయుం టుంది ఈవ్యాధి చూడిపశువులకు పలుమారు వస్తుంది. పశువు తినిన ఆహారము సరిగాజీర్ణమై పేడసరిగా వేస్తుండాలి అట్లుపేడ వేయనిచో అనేక వ్యాధులు పుట్టుతాయి. లోపల పేడలోని మురికిపదార్థములు పేడకాని తదితర వ్యాధులు పుట్టించుతాయి ఇంకను అవయవముల యందలిబలాన్ని కూడ తగ్గించుతుంది. మలబద్ధకము వల్లనే చూడిపశు వులకు కడుపునొప్పి, రక్తశూల గర్భశూల మున్నగువ్యాధులు జనిం చుతాయి. కాబట్టి దీనికి చెప్పినచికిత్సలు చేయుట మంచిది

ఫార్మసీవారి వాతారి అరఖురు చింతపండు పులుసుతో వాడుడు

# విరేచనాలు

చూలు కట్టినది లగాయతు ఈనువరకు కొన్ని పశువులకు పలు చని విరేచనము లగుతాయి ఈవిరేచనములు దుర్వాసనగా వుంటాయి ఇట్లుఎల్లప్పుడూ ఆగుతూవుంటే పశువునకు గర్భపాతము కలుగుతుంది. కాబట్టి ఆరంభములోనే తగిన చికిత్స చేయాలి ఈవిరేచనములతో కడుపునొప్పికూడ యుండవచ్చును.

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అక్టోబరు | 3 | జూలై | 14 | నవంబరు | 3 | ఆగష్టు | 14 | డిసెం॥ | 3 | సెప్టెం॥ | 13 |
| | 4 | | 15 | | 4 | | 15 | | 4 | | 14 |
| | 5 | | 16 | | 5 | | 16 | | 5 | | 15 |
| | 6 | | 17 | | 6 | | 17 | | 6 | | 16 |
| | 7 | | 18 | | 7 | | 18 | | 7 | | 17 |
| | 8 | | 19 | | 8 | | 19 | | 8 | | 18 |
| | 9 | | 20 | | 9 | | 20 | | 9 | | 19 |
| | 10 | | 21 | | 10 | | 21 | | 10 | | 20 |
| | 11 | | 22 | | 11 | | 22 | | 11 | | 21 |
| | 12 | | 23 | | 12 | | 23 | | 12 | | 22 |
| | 13 | | 24 | | 13 | | 24 | | 13 | | 23 |
| | 14 | | 25 | | 14 | | 25 | | 14 | | 24 |
| | 15 | | 26 | | 15 | | 26 | | 15 | | 25 |
| | 16 | | 27 | | 16 | | 27 | | 16 | | 26 |
| | 17 | | 28 | | 17 | | 28 | | 17 | | 27 |
| | 18 | | 29 | | 18 | | 29 | | 18 | | 28 |
| | 19 | | 30 | | 19 | | 30 | | 19 | | 29 |
| | 20 | | 31 | | 20 | | 31 | | 20 | | 30 |
| | 21 | | 1 | | 21 | | 1 | | 21 | | 1 |
| | 22 | ఆగష్టు | 2 | | 22 | సెప్టెం॥ | 2 | | 22 | అక్టో॥ | 2 |
| | 23 | | 3 | | 23 | | 3 | | 23 | | 3 |
| | 24 | | 4 | | 24 | | 4 | | 24 | | 4 |
| | 25 | | 5 | | 25 | | 5 | | 25 | | 5 |
| | 26 | | 6 | | 26 | | 6 | | 26 | | 6 |
| | 27 | | 7 | | 27 | | 7 | | 27 | | 7 |
| | 28 | | 8 | | 28 | | 8 | | 28 | | 8 |
| | 29 | | 9 | | 29 | | 9 | | 29 | | 9 |
| | 30 | | 10 | | 30 | | 10 | | 30 | | 10 |
| | 31 | | 11 | | | | | | 31 | | 11 |

లేక దానిమ్మ చిగుళ్ళు 2గుప్పెళ్ళు పెరుగు అర్ధసేరు కలిపి త్రొక్కి పెట్టవచ్చును. పైమోతాదు దినమునకు రెండు పర్యాయముల వంతుల నీయవచ్చును.

లేకఫార్మసీవారి బెల్ పౌడరును వాడుడు

## ప్రసవించుట

ఈనుటకు ముందు నొప్పులు వస్తాయి. పశువు శాంతముగా వుండ లేదు. బాధపడుచున్నటులకదలుతుంది పిండముతరచుగా మార్గము తప్పుటకు కారణమేమనగా:— ఒకాలమునకుముందుప్రసవించుట యేగాక, ప్రసవించునొప్పులవలననేగాక, దూడ వున్నటువంటిస్థానమునుబట్టికూడ యుంటుంది. పశువు ఈనుటకు సరియైన కారణాలు బాగా తెలియవు. పిండముక్రమక్రమముగావృద్ధియగుకొలదీయోనియందుకూడక్రమక్రమముగా మార్పులు కలిగి పిండము బయటకువచ్చుటకు వీలుపడునట్లు వృద్ధిపొందుతుంది

పిండము వృద్ధియగుకొలదీ తల్లికడుపునుండి దూడకడుపునకు రక్తము మొదలగునవి ప్రసరించుట తగ్గిపోతుంది. ఇంకను వద్ధిపొందిన కొలదీ తల్లిశరీరముతో సంబంధముండక దూడ విడిగావుంటుంది.

పశువు ఈనుటకుముందు విశాలమైనస్థలములోగాని.గాలివచ్చు పశుశాలగదిలోగాని యుంచాలి. ఆగదివిశాలముగా తేమ లేనిదిగా సున్నముకొట్టిన గోడలుగలదిగా ఉండాలి. పశువు ఈనునప్పుడు యజమాని, నౌకరు జాగ్రత్తగాచూస్తుండాలి. పశువు ఆరోగ్యముగా వున్నచో నొప్పులు ఆరంభించగానే యోనిమార్గమునుండి తీగెలు, ద్రవమూ వెలువడుతుంది గర్భాశయద్వారమందలి గోళాలలో ఊరే ద్రవములో యోని ద్వారమందు రక్షక సూక్ష్మజవులు విస్తారముగా వుంటాయి. గాన హానికరములగు వ్యాధులను కలిగించు క్రిములు గర్భాశయమందు ప్రవేశింపకుండ ఈ రక్షక సూక్ష్మజీవులు వానిని నిరోధించుతుంటాయి.

పశువు ఈనుసమయములో గర్భాశయము చాల ప్రమాదములకు గురియైయుంటుంది గాన అట్టి అపాయస్థితిలో విషక్రిములు దానిలో ప్రవేశించకుండ చేయుటకు తగిన యేర్పాటులు సృష్టికర్త అమర్చియున్నాడు.



మొట్టమొదట దూడయొక్క ముందు కాళ్ళను, ఆ భాగంలో వుండి కండర ప్రదేశాలును బయటకువచ్చుతాయి అప్పుడే యోని

భాగమించుమించుగ పెద్దదగుతుంది. పెద్దపెద్ద జంతువులయందు పాదములు ముందువచ్చి కండరభాగము మాత్రము తరువాత బయటకు వచ్చుతుంది. మాంసభక్షక జంతువుల విషయంలో తల పెద్దదగుటచే ముందువచ్చుతుంది తరువాత ముందుభాగపు అవయవములు రొమ్ముక్రిందగా సమర్చబడి బైటకువచ్చుతాయి ఒక్కొక్కప్పుడు అరుదుగా దూడయొక్క వెనుకభాగము బయటపడుసమయంలో రెండు వెనుకకాళ్ళూ ముందు కనబడతాయి తరువాత తదితర అవయవములన్నీ బయటకువస్తాయి. సామాన్యముగా యోనినుండి దూడతల బయటకువచ్చినప్పుడు తరువాత భాగము రాక కొంచెము ఆగుతుంది ఎందుచేతనన తలతరువాతభాగము మిక్కిలి లావైయుండుట చేత అది బయటకు వచ్చుటకు యోనిభాగంయింకా ఎక్కువ ఉబ్బవలసిన అవసరము వుండుటవల్ల అట్లు ఉబ్బుటకు వీలుకలుగుటకు కొంత ఆలస్యమగుతుంది తల బయటకు వచ్చినతరువాత రొమ్ము భాగము, భుజము, పొత్తికడుపు లోపలవుండగానవచ్చుతుంది అందుచేత అప్పుడు పశువుయొక్క ఆ భాగము మిక్కిలి లావుగ ఉబ్బరముగ కనబడుతుంది. అప్పుడే ముకుచుకొనుటలు ఎక్కువగుతాయి. అతి బలీయంగా కలుగుతూ తరువాత దూడ ఒక్కసారి బయటికి పడుతుంది. ఆసనములో బాధ ఎక్కువగుతుంది కుక్క, పిల్లి అటు వంటి సమయములందు అరచుతాయి. రొమ్మునకు తరువాత భాగము బయటకు వచ్చుటకు కొంచెము సులభంగానే యుంటుంది.

## ప్రసవకాలము బొడ్డుత్రాడు

దూడ బొడ్డుత్రాడు మిగుల కురచగవుంటుంది, ఒక్కొక్కప్పుడు ఆ బొడ్డుత్రాడు దూడ క్రిందపడకమునుపే పశువుయొక్క యోని భాగములోనే తెగిపోతుంది. ఒక్కొక్కప్పుడు ఆ బొడ్డుత్రాడు గట్టిగా బలముగావున్నప్పుడు అట్లు తెగిపోక పొరలచేత చుట్టబడి దూడ క్రిందపడువరకు ఉంటుంది. అప్పుడు ఆవు ఆశ్చర్యయుతమగు

హాజజ్ఞానముచే దూడ బొడ్డుత్రాటిని తీసివేస్తుంది. బొడ్డునుండి రెండంగుళముల తరువాత త్రాడు తెగిపోతుంది ఒక్కొక్కప్పుడు , 6 అంగుళములవరకు తెగిపోతుంది.

## దూడ అడ్డము తిరుగుట

తల ముందుభాగము నుండిగాని, వెనుకభాగము నుండిగాని గ్రీవము తప్పుట, డెక్కలభాగము తల్లియొక్క వెన్నెముక వైపునకు తిరుగుట మొదలగునవి సాధారణంగా జరుగుతుంటాయి ఈపరిస్థితులు సంభవించునపుడు పశువునకు ముఖ్యముగా గుండెబరువు అనువ్యాధి సంక్రమించి మలాశయము గర్భాశయము పగిలిన తరువాత మలాశయము నుండి పిండము వచ్చుతుంది. ఇట్లు పగులుటకు కారణమేమన ఈభాగము లోనే పిండము సామాన్యముగా అడ్డముతిరుగుటవలన మలాశయము నుంచి వచ్చుటచేగాని వేరొకటి గాదని భావించాలి.

పిండము వెన్నుభాగములో వుంటే ముందు బరియెముకలు యోనిలోనికి వచ్చినతరువాత, మనచేతికి రొమ్మెముక తగులుతుంది. రొమ్మెముక పైభాగము మెడయొక్కముందుభాగము శ్వాసనాళముతో అంశాస్థులకు మెడకు నడుమవున్న భాగానికి పోతుంది. లేక ప్రక్క వైపునకు జారవచ్చును. డెక్కయొక్క ముందుభాగము తల్లియొక్క వెన్నెముక (యోని) వైపునకు వుంటుంది. లేక వంకరగా తిరిగి యుంటుంది

పిండముయొక్క వెన్నెముక మీదచేతితో సరిచేసిఉపయోగించిన యెడల దూడ సరియైన స్థానమునకు వచ్చుతుంది దూడయొక్కతల యోనిలోనికి రాగియెడల మరలచేతితో జాగ్రత్తగా నెట్టాలి. మనము యేవిధమైన ఆటంకాలు లేకుండా చేయిపెట్టి ముందుపాదాల భాగము పట్టుకొనిగాని లేక గట్టిగా గాని వెన్నుని నెమ్మదిగా త్రిప్పచు యోని వద్దకు తీసుకొనిరావాలి ఇట్టిసమయములో దూడనుకోసి తీయుటకు ఎక్కువఅవసరముండదు. చివరకు కష్టప్రసవసమయమందు మాత్రము శస్త్రము చేసి తీయాలి.

# గర్భస్రావము-గర్భపాతము

వృక్షమునుండి యేకారణము చేతనయినసరియగుపరిమాణము పొందనిఫలము తొడిమనుంచి విడిగాక్రిందపడేరీతిగా చూలుతో వున్న పశువుయొక్క గర్భము యేకారణము చేతనైనాభిన్నమై స్వస్థానముతప్పి పిండముయోని మార్గమునుంచి బయటకు వెడలిపోవునట్టి స్థితినిగర్భస్రావము, గర్భపాతముఅంటారు

గర్భస్రావమనగా పశువుగర్భము ధరించినమొదలు మూడు నాలుగుమాసముల లోపుగా పిండము సరియగు పరిణామముజెందక, కొంచెము ఎరుపురంగుగల ద్రవపదార్థాము వెలస్రవించుతూయోనినుంచి బయటకు నెట్టివేయుటే గర్భస్రావమంటారు.

గర్భపాతమనగా పశువు గర్భము ధరించినదిలగాయతుఅయిదు ఆరుమాసాలు అయిన తరువాత గర్భస్థమైయున్న పిండము దానియొక్క వయస్సునకు తగినరీతిగా అంగపరిణామము చెంది గట్టిపడుతుంది. ఇట్టి స్థితిలో పిండము స్వస్థానమునుంచి విడబడి పతనమగుటే గర్భపాతమంటారు ఇట్టవి తొలిచూడిలోగాని, వృద్ధాప్యములోగాని, తదితర కారణాలవలనగానిరాగలవు.

గర్భస్రావము కొన్నిసమయాలలో ప్రమాదము కాకున్నా, గర్భపాతము మాత్రము పిండము సక్రమముగా యోనిమార్గము నుంచి రాకపోయినా, యోనికిపిండము అడ్డము పడినా, వ్రణము, వాపు మొదలగు కారణాలవల్ల పిండపరిమాణము పెద్దదై ఉబ్బినపుడు మాత్రము వెంటనే అనుభవముగల వైద్యునకు చూపించకపోయినచో తల్లికే ప్రమాదమురాగలదు పిండము అడ్డముతిరిగిగాని, లోపలచచ్చినపుడుగాని, వెంటనే తీసివేయనిచో ఆభాగమంత కుళ్ళివాచిమరణానికిసిద్ధమగుతుంది.కొందరువైద్యులు తెలిసితెలియని చికిత్సలులోపలకు చేతిని పోనిచ్చి అటుయిటు వారియిష్ట ప్రకారముత్రిప్పి పిండాన్ని పాడుచేయుటవల్ల ధనుర్వాతము చెడుగాలిచేరి పశువువిపరీతమైనబాధ

పడి మరణించుతుందిగాన అయినవారితో కానివారితో మాత్రము పిండాన్నిలాగనీయకఅనుభవముగల వైద్యునకుచూపించుము ఇట్టిపశువు లకుశస్త్ర చికిత్సకూడచాలఅవసరము.గర్భకోశ్తములో దూడ కదలుటఆరంభించినది లగాయతు 5 లేక 6 నెలలమధ్య ఈనుట మొదటుకాన్పు ఈచుకొని పోయినతర్వాత తదితర కాన్పులకు ఈచుకొని పోవుటకూడ కొన్నిపపశువులలోవుంటుందిఎకువ్కగా మేపినపశువునకు ఈఅపాయము తప్పక వాటిల్లుతుంది.

కడుపుమీద దెబ్బతగిలినా గర్భము దాల్చినపిమ్మట మగజంతువులతో సంపర్కము కలిగినా చుట్టుప్రక్క జంతువులేనైన ఈచుకొని పోయినా ఇది పసిపట్టుట వల్ల, పెద్దపులి మొదలగు భయంకరమైన మృగములను అకస్మాత్తుగా చూచుటవల్ల, మరియు బలహీనతవల్ల ప్రేగులలో ఆటంకము కలుగుటవల్ల ఈచుకొని పోతుంది.

## లక్షణాలు

మేత మేయదు. మందగించి విచారంగా వుంటుంది. పాలు స్రవించవు స్తనములు జారుతాయి. జంతువు తరచుగా అరచుతుంది కణనుండి తీగెలువేస్తూ కడుపుముడుచుకొని పోతుంది. తల్లికడుపులో దూడ అటునిటు తిరుగజాలక ఆగిపోతుంది. ఒక్కొక్క సమయంలో దూడకూడ లోపల చనిపోవుటయూ కలదు. ఇంకను దూడ లోపల వుండవలసిన స్వస్థానమున వుండక తప్పిపోవుటకూడ కలుగుతుంది ఎరుపురంగుగల ద్రవము మర్మస్థానమునుండి కారుతూ పిండము బయటపడునంతవరకు ఆవు బాధపడుతుంది అకాల ప్రసవములో దూడతలచిన్నదగుటచే త్వరగా ఈనుట పూర్తియగుతుంది.

సారాయి 10తులాలు, ఆవుపాలు అర్థశేరు, ఇంగువ 2తులాలు తుమ్మాకు పసరు పావుశేరు కలిపి త్రాగించాలి.

ఈచుకొని పోయిన తరువాత వేడిగంజిలో ఉప్పుకలిపి నడుమునకు, తొడలకుకట్టాలి. వాతారి అరకును అరపౌను వాడుము.

# దూడకాళ్ళు ముందు వచ్చుట

పశువు ఈనుటకు ముందుగా కాళ్ళు, డెక్కలు బయటకు వస్తాయి. తలతప్పి ప్రత్యేకంగా ముందుకాళ్ళు వస్తాయి. అప్పుడు వైద్యుని పిలిపించి సరియైనస్థానములో వుండునట్లు చేయించాలి.

# సూతికావాతము

ఈవ్యాధి పశువు ఈనిన వెంటనేగాని, ఈనినతరువాత తవుడు చిట్టు పిండి పదార్థములు దాణాదినుసులు సున్నగునవి పెట్టుటవల్ల చలిగాలిలో వుంచుటవల్ల ఈవ్యాధికలుగుతుంది. ఈనినఆరుమాసముల వరకు కూడ ఈవ్యాధి రాగలదు

## లక్షణాలు

పశువు శరీరమంతా భారముగావుంటుంది త్వరలో ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఆయాసము, నోరు తెరచుట ప్రారంభ మగుతుంది శరీరము చల్లగా వుంటుంది. కాళ్ళుపట్టివేస్తుంది. నోటివెంట చొంగ పడుతూ క్రమేపి కడుపుబ్బుతుంది. మలబద్ధక మెక్కువగా వుంటుంది. కన్నులు మూస్తుంది. ఉష్ణమున్నటుల కనపడదు. దవుడలు బిగించి స్మారకము లేక మూతిని భూమిమీద ఆనించుతుంది మలబద్ధకం ఎక్కువగా వుంటుంది వెంటనే ముచ్చిలి గుంటలో, మూతిమీద తప్పకుండ రక్షలువేసిన తగ్గుతుంది.

## చికిత్స

1. సారాయి 3 డ్రాములు త్రాగించాలి.

2. శొంఠి 2తు, మిరియాలు 1తు, పిప్పళ్ళు 1తు వాము గిద్దెడు ఎండుమిర్చి పొడి 4తు, కలిసీరు శేరు కలిపిఒకమోతాదు ఈయాలి.

వేడి వచ్చుటకు కర్పూరము 1తు, తాటిబెల్లము10తు, కలిపి నాలుకకు రాస్తుండాలి. ఇంకను వేడినీటి కాపులు శరీరమంతయు తీసుకవచ్చును. వాతారి అరఖును వాడుడు.

## పాలజ్వరము

పశువు ఈనిన తరువాత ఒక్కొక్కప్పుడు మిగుల అపాయ కరమగు జ్వరము తటస్థించుతుంది ఈనిన వెంటనే బలమైన ఆహార మిచ్చుటవల్ల తగినంత విశ్రాంతి లేకపోవుటవల్ల పశువు కష్టముతో ఈనుటవల్ల వర్షములోను, చలిగాలిలో వుండుటచేత ఈవ్యాధి వచ్చు తుంది. ఇంకను పశువు గర్భకుహరమందుండు మలినము సరిగా వెలువడక రక్తములో కలియుటచేత జ్వరము కలుగుతుంది. పశువుఈనిన కొలది కాలములోనే అకస్మాత్తుగా ఈవ్యాధి కలిగి 24 గంటలలోనే చని పోయేదికూడ గలదు. సోమరితనముగా వుండే పశువులకు ఇటువంటి వ్యాధులు తటస్థించుతాయి. పశువు ఈనినతరువాత యేకారణమువల్ల నైనా దూడ చనిపోయిన యెడల పాలు సరిగా ఈయదు. ఆపశువు పాలనీయదను యుద్దేశ్యముతో ఆపశువును విడిచిపెట్టతారు. అప్పుడా పశువునకు పాలగ్రంథులుబ్బి శరీర వేడిమి అధికమై పాలజ్వర మేర్పడు తుంది.

## లక్షణాలు

ఆకలి లేకపోవుట. పశువు చిరాకుగావుండుట, నాడి తీవ్రముగా వుండుట, శ్వాస యెక్కువగుట పాలుతగ్గుట, కడుపుఉబ్బిపొదుగుభాగము గట్టిగానుండి వేడిగావుండుట, వెనుకకాళ్ళలో సత్తువతగ్గి నిలుచుండుట కష్టముగా వుండుట, పశువు తూలుచూ పడిపోవుచుండుట, కన్నులు చూచుటకుశక్తి తగ్గుట, నోటి నుంచి చొంగకార్చుట, నాడి తీవ్రముగా కొట్టుకొనుట, పేగులలో బాధగా వుండుట, నాలుక తెలుపుగా వుండుట, ముఖకాంతి తగ్గుట, మలమూత్రములుగట్టిపడుట ఇటువంటి లక్షణాలువున్న పశువునకు చికిత్స చేయనిచో త్వరలో మరణించు తుంది.

## చికిత్స

తిప్పతీగెరసము అర్ధశేరు, శొంఠి 1తు, మిరియాలు 1తు, కలిపి అర్ధశేరు కలినీటిలో కలిపి త్రాగించాలి.

తమలపాకుల రసము పావుశేరు తీసి తులము ఇంగువ, శేరు వేడిగంజిలో కలిపి పెట్టాలి.

3 డ్రాములు నారాయిలో తులము సూరేకారము కలిపి త్రాగించాలి. వాతారి అరకును వాడుడు.

## మావిపడుట

పిండసంబంధముగు పొరలు లేక మావియనది ఊడిపడినతరువాత బయటకు పడును. కొన్ని కొన్ని కేసులుమాత్రము వానియొక్క బలమునుబట్టి దృఢత్వమునుబట్టి బలహీనతనుబట్టి ముందు వెనుకలుగా పడతాయి దూడ క్రిందపడినవెంటనే గర్భాశయము అతిత్వరితముగా శక్తివంతముగ ముడుచుకొనుచు విడిపోతుంది ఈసమయమందు యోని యొక్క లోపలిభాగపు ఘనపరిమాణము క్రమక్రమముగతగ్గుతుంది. యోనిభాగములోనికి అచటనుండువదులైన ఎముకలద్వారా నెమ్మదిగ వచ్చుచుండును. ఆపిండపుపొరలను లేక మావిని బయటకు స్వేచ్ఛగ రానీయక నొక్కిపట్టాలి అదేసమయములో పొట్ట వెన్నుభాగముల యందుండు కండరములు అప్పుడప్పుడు పిండము క్రిందపడునపుడుండు బరువుచేతను, దూడయొక్క బొడ్డుతాడుచుట్టుకొని పోవుటచేతను, ఆ మావి గర్భాశయములోనుండి యోనిభాగములోనికి ఈడ్వబడుతుంది. అప్పుడప్పుడామావితోగూడ పశువుల గుండెప్రక్కనుండు రక్తము కొంచెము కొంచెముగా వస్తుంది ఇట్టిరక్తమునాపుటకు అప్పుడప్పుడు సంభవించుగర్భాశయపు ముడుచుకొనుటలు కొంతవరకు ఆపుతుంది. 24 గంటలలోమావి పడనియెడల వెంటనేతగు చికిత్స చేయాలి ఒకేసారి పశువులు కవలదూడలను కనునపుడు మొదటదూడ వెంటనే మావి బయటకువచ్చును. అవి సరియైనత్రోవలో లేకపోవుట చేతనే అట్టిచిక్కులు తటస్థించుతాయి.

## మావిని తిననీయరాదు

మావిని పశువునుతిననీయకుండ కాపాడాలి. మావితిన్న పశువునకు ఊపిరితిరగకుండ నుండు చిహ్నములు కనబడుతాయి. ఆవు ఈనగనే సాధ్యమైనంతవరకు దూడపడిన తరువాత మావిపడుట మిక్కిలి అవసరము. అట్లు మావివేయక యోనిభాగమందే నిలువయున్నయెడల ఒక విధమైన జ్వరము కలుగుతుంది మావిపడగనే యోనిభాగము తనంతటదియే ముడుచుకొనిపోతుంది యోని యొక్క ఘనపరిమాణము వెంట వెంటనేతగ్గి మరల వెనుకటిదశకు ఎన్నడును రాదు. యోనిభాగములో నుండు బంకపదార్థములతో గూడిన పొర దాని సహజస్థితిలోనికి వస్తుంది. యోనియొక్క లోపలిభాగము వెంటనే ముడుచుకొంటుంది. ఇంక నాభాగములో నుండు ఎముకలు కొన్ని దినములలో ముడుచు కొని పోతాయి.

## మేయుదిగుట

చూడిపశువును సరిగా మేపకుండుటవలనను, దుర్బలత్వమువలనను, వాతరోగమువలనను, అతికాకవలనను ఈమేయి కనబడుతుంది. ఇదిచాల ప్రమాదకరమైనది. ఈ మేయిలో అనేకరకములు గలవు. చూడిపశువులకు ఈమేయి కనబడగనే చాల ఆందోళనపడుతారు. ఈమేయి దిగిన చూడిపశువునకు చికిత్సలు మాత్రము చేయరాదు. చికిత్సలు చేయవలెనని కోరియున్నచో అనుభవముగల వైద్యునిపిలిపించాలి. కాని తెలిసి తెలియని వైద్యము చేయరాదు. అట్లుచేసిన పిండమునకు అపాయము కలుగుతుంది ఈమేయి ఈనిన తరువాత కొన్ని పశువులకు కనబడుతుంది మరికొన్నిటికి చూలులోనే తటస్థించుతుంద

కానిపశువు ఈనుటకుముందు ఈ మేయి ఆటంకము కలిగించి పశువున కషాయము సంభవించుతుంది. ముక్కుచుండును. ఇంకను భరింపరాని




నొప్పులుకూడ నుండును కాబట్టి అది యేజాతిలో చేరినదో తెలిసికొని తగిన చికిత్సలు చేయాలి.

## గరిమేము

మనము గడ్డికోయు కొడవలికక్కు (గరకు) యేమాదిరిగ నుండునో ఆమాదిరిగనే ఈగరిమేయి యుంటుంది. జాగ్రత్తగా నెట్టాలి.

## సొరమేయి

ఇది సొరకాయ ఆకారముగ వుంటుంది. ఈ మేయికి మధ్యగా గాని, ఒకప్రక్కనుంచిగాని ఒకచుప్రని జీరయుంటుంది ఈ జీరగల భాగము పశువు వెన్నముకకు తిన్నగానుంచి లోపలికి తోయాలి. లేనిచో మరల వెంటనే జారుతుంది.

## గుంప్రశమేయి

ఇది కొబ్బరికాయ ఆకారముగ వుంటుంది. దీనికిని సొర మేయివలె జీరయుండును పై విధముగనే చికిత్స చేయాలి

## బల్లి ఆకారపు మేయి

ఇది బల్లి ఆకారముగా వుంటుంది ఇంకనూ పనస మేయి, మిడి మేయి మొదలగునవి గలవని ఆయుర్వేద పశువైద్యులు చెప్పుతారు. ఇటువంటివి తటస్థించినపుడు అనుభవముగల వైద్యునితో జాగ్రత్తగా తగిన చికిత్సలు చేయించవలెను.

## చికిత్స

మేయిని స్వస్థానమునకు త్రోసి సీసాదూర్చి కట్టుకట్టాలి మూడు నాలుగు దినములుంచి తీసివేయాలి. లోపలికి వేడిచేయువస్తువులు పెట్టరాదు.

లేక ఏటవాలుగా నేలత్రవ్వి ఆగోతిపైభాగమున పశువు మేయి దిగినభాగమున్ను, తల క్రింద భాగమునకు వుండాలి. ముందు మేయి స్వస్థానములో త్రోసిఆపశువు నట్లే కొన్ని దినములు వుంచాలి.

లేక ముందు నందివర్ధనపుష్పాలు తెచ్చి గిద్దెడు రసము తీసి ఆ మేయికిరాచి సరియైనస్థానములో నుంచవలెను నందివర్ధన రసములో నీరులాగివేయుశక్తియున్నది. ఆమేయిమరికొన్ని గంటలలో గాని, కొన్ని

దినములలోగాని మరల కనబడవచ్చును అప్పుడు మేయిని త్రోసివేసి బద్దలుచెక్కి మానమునకు కట్టినమరలరాదు. తరువాత ఒకటి రెండు దినములకు బద్దలు తీయవచ్చును. కొందరు మేయిని త్రోసివేసి మానమును కుట్టుదురు. ఇదిచాల మూర్ఖత్వపుపని— మంచి పద్ధతికాదు ఫార్మసీవారి అభిరను వాడుము. అప్పుడప్పుడు ముక్కకుండ విబ్రోతో పంచదారకలిపి వాడాలి

## మేయిని త్రోసిన తరువాత

నల్లతుమ్మాకు పసరు అరసోలెడు, పాలుఅర్థసేరు, ఇంగువ 1తులము కలిపి దానిలోఎర్రగా కాల్చిన ఒక కంకరరాయి వేసి మరల తీసిత్రాగించాలి. అంతకు నొప్పులు తగ్గినచో ఏ డ్రాములు సారాయి త్రాగించాలి.

లేకపంచదారను త్రోసినతరువాత లోపలి మేయికి అప్పుడప్పుడు పట్టించుము.

## మావి పడకుండుట

పశువు ఈచుకొని పోవునప్పుడు చాలసేపు నొప్పులుపడి ఈని నప్పుడు నీరసస్థితిలో నుండి చాలినంత బలము లేకుండుటవలన బలము లేని ముసలి పశువునకును గర్భతిత్తి ముడుచుకొని పోవుట వలన గర్భ తిత్తి నరములలో బలహీనతవలన మావికిరిందపడక నిలిచిపోతుంది. పశువు మానమునుండి మావికొద్దిగా వ్రేలాడుతుంది. కాళ్ళు నేలమీద కొట్టుకొనుచుండును. తోకఆడించుచు ముక్కుతుంది. మావి నిలువ యున్నయెడల కుళ్ళి దుర్వాసనవేస్తుంది వెనుకభాగము పైకిలేవలేదు సరిగా పశువు నిలుచుండలేదు. కనుగంటలు విడుస్తుంది. ఈగలు మానముచుట్టు మూసురును. మానము వెంబడి మష్టుపడుతుంది. మావి కుళ్ళుటవలన శరీరమునకమిత బాధ కలుగుతుంది. ఈ చెడిపోయినదియు, కుళ్ళినదియునగు మావియొక్క సారము శరీరమందు ప్రవేశించి నెత్తు

రును చేసుస్తుంది. అందువలన జ్వరము. గడ్డలు లేచుట మున్నగు వ్యాధులు సంభవించుతాయి జ్వరముతగిలిన తరువాత నాలుకయందు తేమయుండదు. పాలుండవు. కల్మషము నిలిచిపోయి మిగుల బలహీన ముగా నుండును.

## చికిత్స

### ఆవు ఈనినతరువాత

1 1/2 దినముకంటె మావినిలువయున్న యెడల నువ్వులు అర్ధ శేరు, వేడినీరు శేరు కలిపి త్రొక్కి త్రాగించినచో అది క్రిందపడుతుంది.

లేక తాడికాయలు 9తు, మంచిబెల్లం 10 తులములు కలిపి పెట్టాలి.

లేక పులిసినచల్లలో కంద నూరి కలిపి పెట్టాలి.

లేక ఉడకబెట్టిన సజ్జపిండి 1/ 12 శేరు, మంచిబెల్లము అరవీసె, కలిపి త్రొక్కి పెట్టాలి.

లేక బెండకాయలు 15 లేక25 నువ్వులు 10తులములు, వరి గంజి శేరుకలిపి త్రాగించాలి. ఫార్మశీవారి వాతారి అరఖు,ఉల్బంను వాడాలి.

## మావినితీసివేయుట

పశువు యోనిద్వారమున చేయిజొనిపి మెల్లగా గర్భతిత్తుల లోనికిపోనిచ్చి మావినిపట్టుకొనిబయటకుతీసికొనిరావాలి. చెయ్యిలోప లికి పోయినందున గర్భతిత్తికి ముడుచుకొను శక్తిగలుగుతోంది అందు వలన మావివెలుపలికివచ్చి రక్తమునిలిచి పోతుంది. ఈమాత్రము కూడ మీకు తెలియని యెడల ఒకఅడుగుపొడవుగల సన్నని బద్దలు రెం టిని తీసుకొని వ్రేలాడుచున్న మావియొక్క చివరను, ఆరెండుబద్దల మధ్యనుంచి ఆబద్దలయొక్క చివరలను రెండుచేతులతో గట్టిగాపట్టు

కొని ఆమావినిఆబద్దలకుచుట్టాలి ఇట్లుచేయుగా ఆబద్దచివరివద్దకువచ్చు తుంది అంతట మెల్లగాలాగుచు ఆవిధముగా చుట్టాలి. కఠినముగా లాగరాదు. ఎంత తేలికగా లాగిన అంతమేలు కలుగుతుంది. నెమ్మదిగా లాగినయెడల మావిరాక బద్దలకు చుట్టుటకు వీలు లేని యెడల అంత వరకే ఆదినము లాగివేయుట మాని వేసి మరుసటిదినమునతిరిగి ప్రయత్నించాలి. మావిని తీసివేసిన తరువాత పశువునకు సత్తువకలుగుటకు గంజిపోయవచ్చును మావినితీసినతరువాత పశురక్షామృతమును వాడుడు.

## ఈనినతర్వాతకలిగేమార్పులు

పశువు ఈనిన తరువాతపక్షము రోజులవరకు ఎంతో జాగ్రత్తగా చూస్తూవుండాలి పశువుతనమూడవ నవమాసాలు పెంచడంవల్ల తన శరీరంలో అనేక మార్పులు కలుగుతాయి. ముఖ్యంగా గర్భకోశం పెద్దదవడం,-దానితో కడుపులోని కండరాలు పెద్దదవడం, శరీరంలో నుండే అవయవాలన్నీ యేదోవిధంగా మార్పురావడం జరుగుతుంది ఈనిన తరువాత యివన్నీ యథాస్థానంలోకి యథాప్రకారంగా రావాలి

## గర్భకోశంఎన్నాళ్ళకు ముడుచుకొంటుంది

గర్భకోశం పశువుఈనినతరువాత రెండువంతులుముడుచుకొని పోతుంది నాలుగైదురోజులలోవంటినొప్పులు తగ్గుతాయి.బొడ్డుక్రింద నరము అప్పుడప్పుడు తేలుతూవుంటుంది. గర్భకోశం పదిహేను రోజులలో రోజురోజుకు తగ్గుతూ మలుగుల్లోకి చేసుకుంటుంది నెలరోజులలో యథాస్థితి వస్తుంది. ఇట్టిపశువు కండరాలుబాగా గట్టిపడి యథాస్థితికి రావాలంటే అప్పుడప్పుడు పొలములో త్రిప్పుట మంచిది

## మైలపడుట

పశువు ఈనినతరువాతవాతముచేగాని తదితర కారణాలవలన గాని మష్టువంటి తెలుపుపదార్థము అప్పుడప్పుడు పడుతూవుంటుంది. ఈనిన

వెంటనే తఫుడు, జొన్నపిండి, పచ్చిపులవపిండి మున్నగునవి పెట్టిన సూతికావాతము వచ్చినపశువుకు ప్రమాదమురాగలదు. పశువులోపల నున్న మైలపడాలంటే ప్రతిరోజునిమ్మకాయంత కరివేపాకు ఉండచేసి నోటిలోవేయాలి. ఈరీతిగా వారంరోజులు పెట్టిన మైలపడుట తగ్గుతుంది. ఒకవేళ గర్భకోశంఎక్కువమూడుచుకొన్నట్లయితే మైలఅంతగా పడదు. మైలలోవాసన జ్వరంలేకపోతే పరవాలేదు దూడకుపాలిస్తూ ఉన్నప్పటికి మైలతక్కువగనే పడుతుంది.

# ముప్పది వ భాగము

## పాడిపరిశ్రమ

### పాడి విషయాలు

రెండుమూడుసార్లు క్రమము తప్పకుండా పాలుపితుకాలి మూడవదినాన పిండుపాలు త్రాగుటకు రుచిగావుంటాయి మొదటి దినాన రెండవ దినానయిచ్చుపాలను జున్నుగా వండుకొని తింటారు. వీటిని యెంతమాత్రము వుపయోగించక దూడకే విడిచిపెట్టాలి.

### పొదుగు - దానియుత్పత్తి

పాడిపశువులకు పొదుగనే అగంముపుంటుంది. ఈ పొదుగునందు నాలుగు పాలగ్రంథులు వుంటాయి, ఈ గ్రంధులుపశువుయొక్క వెనుకకాళ్ళ సందున యుంటాయి, ఒక ప్రక్కనవున్న రెండుగ్రంధులును ఒక తంతుసంయుతమైన తొడుగుచే పరివేష్టింపబడియుంటాయి. ప్రతి గ్రంధికి ఒక్కొక్కచన్ను యుంటుంది ఈచన్నులు పాడి పశువులకు 3, 4, న్ను, ఆడగుఱ్ఱము, ఆడుగొఱ్ఱెలకు 2 ను, ఆడుపందికి 10

లేక 14 ను, యుంటాయి. అప్పుడప్పుడీ నాలుగు గ్రంధులు గాక మరియొక రెండు మాంసగ్రంధులు కలిగియుంటాయి. ప్రతిదానికి ప్రత్యేక ద్వారాలువుంటాయి. చంటిపైని ప్రతి గ్రంధిలోనుపాలతిత్తి యొకటి యుంటుంది.

ఇందులోనికి పాల కాలవలన్నీ ప్రవహించుతాయి. ఈ పాల తిత్తినుండి చంటిగుండా పై భాగానికి ఒక కాలువవుంటుంది, పాల గ్రంధి రబ్బరువంటి తొడుగువుంటుంది. ఈ గ్రంధికి క్షీరవాహికల చుట్టూ అమర్పబడియుండు కణములగుంపులచే ఏర్పడిన యంగము క్షీరవాహికలుఅనేకములుచేరి పెద్దవాహికలుగా ఏర్పడతాయి. ఇవి యన్నీ చంటిపైవుండే పాలతిత్తులలోకి ప్రవహించుతాయి. ప్రతి పాలతిత్తినుంచీ కాలువ చంటిగుండా పైకి వెలువడుతూవుంటుంది. చంటిచివరవుండే మాంసకండరాలు పాలు తమంతట తాము కారి పోకుండ ఈ కాలువలను మూసికొని యుండునట్లు చేస్తాయి.

పాలగ్రంధికికొన్ని రక్తనాళాలగుండా రక్తమువస్తుంది. ఆరక్తము నుండి గ్రంధికణాలు, పాలుపనికివచ్చు ద్రవ్యాలు తీసికొన్నతరువాత తక్కినభాగము దుష్టరక్తనాళములగుండ మరలిపోతాయి. ఈ దుష్ట రక్తనాళాలలో కొన్ని లోపలనున్నను మరికొన్ని పైభాగానవుంటాయి.

పైభాగమందుండువానినే పాలనాళాలు అంటారు. పశువుల లోపలి భాగంలోవుండే రక్తనాళములు ఎంతె పెద్దవిగా స్ఫుటముగావుంటే అవి యంత బాగాపాలుయిచ్చుతాయి పాలగ్రంథులలో తామా దూడల పోషణకై పాలు చుట్టుచేస్తాయి. చంపి మొనలగుండా పోయిప మార్గములగుండా పాలు ప్రవహించుతాయి. ఆ మార్గమునకు పై భాగాన క్రిందిభాగాన ద్వారమును మూయుగల కండరములు ఏర్పడి యున్నాయి. చను మొనకు పైన పాలతొట్టి సుమారు 1 1/2 పైంటు పాలుపట్టునట్టిగావుంటుంది. దానినుంచి చంటిద్వారముగుండా పాలు లాగబడతాయి శరీరములో మాంసకండరములువున్న భాగాలకు పొదుగుభాగానికి మధ్యగా పాలగ్రంథులు యేర్పడి ఏకముగాజేరి పాలను నిలువచేస్తాయి ఈ గ్రంథులు ఒక్కొకటి అంగుళములో 30-వ వంతు వెడల్పుగలిగియుంటుంది పొదుగుకంటె కంటె దానిలో వుండే పాలయొక్క బరువు యెక్కువగావుంటుంది. ప్రసవమువచ్చినపుడు పొదుగు వికసించి యీనుటకుముందు అది పెద్దదగుతుంది. ఈనితే చురుకుదనము గలిగియుంటుంది. పాలిచ్చుకాలం అంత్యమగునప్పటికి మరల సంకోచమునొంది తన వ్యాపారమును మానుతుంది. క్షీరగ్రంథుల వలన పుట్టెడుపాలు దూడలకుసంపూర్ణాహారము

## పాలుతీయుటలో కలిగేమార్పులు

నిత్యము ఒకేకాలమందు పాలు తీయుచున్నప్పుడు ఒకేవిధముగా వుంటాయి కొంచెమాలస్యముగా పాలనుతీసినచో క్రొవ్వుఎక్కువగా వుంటుంది. ఉదయము తీసిన పాలకంటె సాయంకాలము తీసిన పాలు శ్రేష్టముగా వుంటాయి.

| వరుస | క్రొవ్వు | క్రొవ్వు కాని ఇతర పదార్థములు |
|---|---|---|
| మొదటి పర్యాయము | 1 70 | 8 77 |
| రెండవ పర్యాయము | 1.76 | 8.99 |
| మూడవ పర్యాయము | 2.10 | 8 75 |
| నాల్గవ పర్యాయము | 2 54 | 8.69 |
| అయిదవ పర్యాయము | ?.14 | 8 49 |
| ఆరవ పర్యాయము | 4 08 | 8.59 |

మొదటి పర్యాయము తీయబడిన పాలలో క్రొవ్వుతక్కువగాను క్రమేపి ఎక్కువగాను కనబడుతుంది. మొదటిపర్యాయము తీయబడిన పాలలోని క్రొవ్వుతక్కువగావుండుటకు ఆరవపర్యాయములోతీయబడిన పాలలో క్రొవ్వు ఎక్కువగా వుండుటకును కారణమేమన పొదుగుక్రింది భాగమున వుండే పాలలోని క్రొవ్వును తిరిగి లోపలకు లాగుకొనుట వల్లనే పోగొట్టుకొనబడుతోందని తెలియుచున్నది. కాని ఇది సరియైన సిద్ధాంతము గాదని నాయభిప్రాయము జంతువును బాగుగా మేపిన కొలది క్రొవ్వు ఎక్కువగుతాయి పచ్చిమేత, ఎండుమేత వేయుటలో ఈ మార్పు కలుగుతుంది. పచ్చిగడ్డి వేసినచో క్రొవ్వు యొక్క పాల యొక్క రంగు పసుపు వర్ణముగా వుంటుంది. ఆహారమును బట్టి పాల యొక్క రుచి మారుతుంది. కొన్ని దుంపదినుసులు తినుటవలన పాల యొక్క రుచి తగ్గుతుంది.

## పాలలోని వాసనలు

పాలు, మీగడ, వెన్న, మజ్జిగల వాసనలను సులభము గా గ్రహించ వచ్చును. కొన్ని పాలు మేక వాసన కొట్టు చున్నవనీ మట్టి కంపు కొట్టు చున్న వనీ గొఱ్ఱె వాసన కొట్టు చున్న వనీయు, బూజు కంపు కొట్టుచున్న వనీయు, చెప్పుతుంటారు పశువులనుండిబయలు దేరు కొన్ని విధములగు వాయువులు పాలు పిండే వేళలలో పాలతో గూడ

కలసి వచ్చుటచే ఈవాసనలుబహులుదేరుతాయి ఇంకయిట్టివాసనలు మనము పాలకుపయోగించు పాత్రలు శుచిగా లేకుండుట వల్ల, పాత్రి అడుగుభాగమున వుండే మలినాన్ని కడుగక పోవుటవల్ల పాలు సరిగా కాగనీయకుండ తోడు పెట్టుట వల్ల పాలు చల్లారిన తరువాత చుంచులు మొదలగు జంతువులునాకుటవల్ల కలుగు తాయి. కొన్నిపశువులు మనుష్యుల మలము, నీరుల్లి, వెల్లుల్లి, మొదలగు వస్తువులు తినుటవలన అవి యిచ్చుపాలుకూడ అమాదిరిగానే వాసన వేస్తాయి.

## ఈతలనుబట్టి పాలు

పాలు ప్రతిదినముకొలుచుటమంచిది. సంవత్సరమునకు 300నుంచి 500 గాలనుల పాలిచ్చు ఆవులను పెంచుట అంతలాభమైనపని కాదు. రెండు మూడు ఈతలీనిన ఆవులను 700 నుండి 1000 గాలనుల వరకు యిచ్చు ఆవులను సంపాదించాలి పాలుకొలుచుటవలన లాభమేమనగా పాలు తగ్గుచున్న యెడల దానికేమైన వ్యాధియున్నదేమో గ్రహించాలి తరువాత వ్యాధియున్నచో పశువైద్యునిచే చికిత్సచేయించాలి.ప్రతి దినముఉదయసాయంకాలములందు పాలుకొలిచిడైరీలోవ్రాసిసంవత్స రమునకెంతపాలుయిచ్చినదో తెలిసికొనుటమంచిది పాలనుపొదుగులో మిగల్చరాదు. అట్లుమిగిల్చినయెడల పొదుగుచెడిపోతుంది. చివరనున్న పాలలో మీగడఎక్కువగా వుంటుంది. తప్పకుండ తీయుటమంచిది. పాలతో చన్నులు తడిచేసి పిండరాదు. ఇట్లుపిండుటవలన పాలుచెడి పోతాయి

## పాడిపశువును తనఖీచేయుట

పాలుపితుకుటకు పూర్వము పశువు సంతోషముగా వుందో జబ్బుగావుందో పరీక్షించి పాలుతీయాలి. పశుశాలను శుభ్రముగా బాగుచేసిన తరువాత పాలను తీయుటమంచిది. పాలుపితుకునపుడుతది తరులెవ్వరు యుండరాదు. ఇట్లుండుటవలనదృష్టిదోషముతగులుతుంది

పాలలో దుమ్ము ఎంతమాత్రము పడరాదు. పాలు పిండిన తరువాత పాల బిందె ఎవరికి చూపించరాదు. దృష్టియనునది యున్నదాయని కొందరు చమత్కారపు ప్రశ్నలను వేస్తారు నా అనుభవము మీద దృష్టిదోష మున్నదని చెప్పగలను

## పాలలోని కలగలుపులు

ఆడపశువులు వాని బిడ్డలకొరకు స్తనసంబంధమగు నాళాలు తయారుచేసే ఒక విధమగు తెలుపుగా, చిక్కగా నునుపుగా వుండే ద్రవానికి పాలు అంటారు కొన్ని జంతువులు వాని బిడ్డలకు పాలు అవసరము లేనప్పుడు పాలిచ్చుట ఆపివేస్తాయి కొన్ని పాడిపశువులు దూడలకు అవసరము లేకున్ననూ పాలిస్తూనే యుంటాయి ఆవుపాలు అన్నిటికంటె మిక్కిలి శ్రేష్టము. గొఱ్ఱె, మేక, గాడిద, గుఱ్ఱము మొదలగు జంతువులిచ్చు పాలుగూడ ఒక్కొక్కప్పుడు మనుష్యులకు వుపయోగ పడుతున్నాయి పాలనుండి మీగడతీసినచో మీగడపాలనీ, మీగడ తీయని పాలనీ, అనేకజంతువుల పాలనుకలిపినపుడు మిశ్రమపాలనీ, పిలువబడుతాయి.

మన దేశంలో పాలు మిక్కిలి కల్తీగా వుంటాయి పాలలో చక్కెరను నీటిని చేర్చుతారు ఉదయము పితికిన పాలను సాయంకాలపు పాలలో కలుపుతారు మరికొందరు ఆవుపాలలో గేదెపాలను కలుపుతారు పాలు, పెరుగు, నెయ్యి వెన్న మున్నగువాటిని అమ్మేవారిలో అన్యాయానికి జంకక లాభన్ని అధికంగా పొందడానికి బుద్ధిపూర్వకంగా పాలలో వున్న మీగడను తీసివేసి పాలలో పిండిని, గంజిని కలుపుతారు. పాలలో సహజముగా నీరు చక్కెర వెన్న పెరుగు మొదలగు నవియూ, శరీర పోషణకు అవసరములగు కొన్ని లవణాలును యుంటాయి. పాలనమ్మువారు ప్రత్యేకముగా పాలలో గలుపునీరు తరచుగా అపరిశుద్ధంగా వుంటాయి. అందువల్ల అట్టిపాలను త్రాగినచో చెడునీటివల్ల కలిగే

కలరా టైఫాయిడ్ మున్నగు వ్యాధులు కలుగుటకు కూడ అవకాశ మేర్పడుతాయి రక్తవిరేచనముల కట్టించుతుంది. దూడలకు సంభవించు నీళ్ళవిరేచనములగూడ బాగుగా పనిచేస్తుంది పెరుగు నీరు కలిపిన మజ్జిగ నేత్రరోగములకు పనిచేస్తుంది. చలువచేస్తుంది కాచిన మజ్జిగ వాతరోగములకు నోటరోగములకు బాగుగా పనిచేస్తాయి. కాకరోగముల పశువులకు పెట్టుట మంచిది.

# పాడిపశువులరోగాలు

## పాలుచేపకుండుట

పాడిపశువుల చన్నులగొట్టాలలో అనేకమైన సూక్ష్మమగునాళములు వుంటాయి ఈపాలగొట్టాల కన్నిటికి తుదిమొదళ్ళలో మాంసంతో చేయబడిన ద్వారములు వుంటాయి. ఈద్వారములు తెరచి కొన్నచో పాలతిత్తులలోని పాలు పీలగుండ ప్రవహింప గలవు. ఏదన్నాన భయము కలిగినప్పుడుగాని, జ్వరము వచ్చినపుడుగాని, సకాలమునకు పాలు పిండనప్పుడుగా, పశువు దూడకు పాలు దాచుకోవాలను యుద్దేశమున్నప్పుడుగాని, మనోవ్యాకులము కలిగినప్పుడుగానిఈద్వారములు ముడుచుకొంటాయి, అప్పుడు పశువుచేపుట లేదంటాము. పశువు దూడను దగ్గరకు రానీయదు చన్నులపైన నీరుపోసి పతికినప్పుడు పాలురావు బెదరిబెదరి చూస్తూవుంటుంది, సరిగా సలబడక అటునిటు తిరుగుతుంది కొన్నిపశువుల కిట్టిసమయంలో దాణాపెనుసులు పెట్టిన పాలు చేపుటకూడాగలదు. ఇట్లు చేపకుండుటవలన రైతు విసుగు కొంటాడు.

## చికిత్స

ఆవుమజ్జిగ అర్ధశేరు, తాటికాయలు 1 తు, కాచలవణము 1/2 తు సుగంధపాలరసము 2తు, కలపి రెండుపర్యాయములు ఈయవచ్చును.

లేక గోధుమగంజి అర్థశేరు, నెయ్యి 5తు, కలిపి మూడు పూటలు త్రాగించుము.

లేక నాగనారపట్టలు తెచ్చి ఉడికించి దానిలో వున్న తెలుపు పాలకులుతీసి మజ్జిగలో కలిపి త్రాగించాలి.

లేక పుల్లతీగనుంచి రసముతీసి చన్నుల పైభాగమున మర్దించి చేతులతో కొంచెము మర్దించిన పశువు చేపుతుంది.

లేక కొండగోగు ఆకులుముతీసి పాలుపితుకులోపు ముంగు పశువుశరీరమునకు రాచిన తప్పక చేపుతుంది. ఫార్మసీవారివాతారపౌడి, క్లీరోజన్ కలిపివాడిన చక్కగా చేపుతుంది.

## చన్నులద్వారాలు మూడుచుకొనుట

పశువుయొక్క చన్నులు పాలతిత్తులలోనికి వ్యాపించియుం టాయి పాలతిత్తులలో ఈగొట్టాలు ప్రవేశించుచోట ఒకద్వారము వుంటుంది. ఈద్వారము తనంతటదియే ముడుచు కొనగలదు. అట్లు ముడుచుకొన్నపుడు చన్నులనుండి పాలురావు. పాడిపశువు పొదుగు లో రెండు తిత్తులువుంటాయి. రెండు గొట్టాలుక తిత్తిలోకి తక్కిన రెండు గొట్టాలు మరియొక పాలతిత్తిలోకి ప్రవేశించుతాయి కొన్ని పశువులపాలు ఈగొట్టమునుండి పితుకకుండగనే వానియంతటవియే కారిపోతాయి. కొన్ని పశువులకు బాగుగా పిండినప్పటికి పాలురాజాలవు కారణమేమన పశువుచన్నులలో ఒకటిగాని. అంత కెక్కువగాని పూడిపోయిన రంధ్రములుగలవై యుంటాయి.

ఈనిన వెంటనే కొన్ని పశువుల గ్రంధులలో పాలుపుట్టి చన్నులు లావుగా కనబడి నప్పటికి పాలు మాత్రము పైకిరావు. పాలు పైకి వచ్చే ద్వారానికి అడ్డముగా చంటి చివర ఒకవిధమగుపొర పెరుగటయే యుండుట కారణము. కొన్ని పశువులు ఈనిన వెంటనే చన్నులద్వారాలు

మూసికొనిపోయి వట్టిపోతాయి. కొన్ని పశువుల నాల్గు చన్నులకు గాని, రెండుచన్నులకుగాని యిది రావచ్చును. ద్వారములు గట్టిగా ముడుచుకొనిపోతే పశువుల కెన్ని చికిత్సలు చేసినా లాభము లేదు, ఆ ఈతకు అంతియేయని గ్రహించాలి. మరల రెండవ కాన్పునకు కూడ రావచ్చును.

చంటిరంధ్రములు పొరలతో ముడుచుకొని పోయినపుడు సలాక తోగాని, కెతీటరు అను పనిముట్టుతో గాని పొడిచి పాలు పైకివచ్చునట్లు చేయవచ్చును, లేక పొడుగుగల సన్నని సూదితో నెమ్మదిగా ఆ పాలరంధ్రములోనికి పొడిచి పాలను రప్పించ వచ్చును, కాని తెలిసి తెలియనివారు రంధ్రభాగమునకు పొడిస్తే పశువునకపాయము సంభవించుతుంది అందుకు తెలియనిచో వెటరినరీ చికిత్సాలయమునకు తీసికొనివెళ్ళి చికిత్స చేయించుము. వెటనరీ ప్లాస్టరును పొదుగుకు చన్నులకు రాయుచు లోపలికి క్లిరోజన్‌ను వాడుడు,

## కండర సంకోచము

ఒకొక్కప్పుడు చంటిచివరనుండి పాలు తమంతటవి కారిపోకుండ కాపాడు కండరము సంకోచమునొందుటచే రంధ్రములు మిగుల చిన్నవై పాలుతీయుటకు దుర్లభంగావుంటుంది. దీనికి చికిత్సచేయుట కష్టము శస్త్రం అవసరముగనుక యీపనిమిగుల నేర్పరియైనవైద్యుడు చేయవలసియుంటుంది. ఇటువంటి శస్త్రసంబంధమైన వ్యాధులుకలిగినపుడు వెటరినరీ డాక్టరుగారికి చూపించుట మంచిది. ప్రతిదినమునొక సన్నని సూదిని లోనికి జొనిపి పాలనుదీయుచు వచ్చినయెడల రంధ్రము పెద్దది కావచ్చును.

## చన్నులమీద కాయలు

పశువు చన్నులమీద చిటిపొటి కాయలు మొదలగునవి యుండుటచే పాలుపితుకుటకు ఆటంకము గలిగించుతాయి. ఒక్కొక్కప్పుడవి రేగినయెడల పుండుపడి పశువు బాధపడుతుంది, పాలుకూడ

తగ్గవచ్చును. కాబట్టి అటువంటి కాయలను కోసివేయుట వలన వెంట్రుకలతో బిగించి కట్టుటవలన అవి పోవచ్చును ఫార్మసీవారి హీలాన్‌ను వాడుడు.

## చన్నులకు ఆటంకము కలుగుట

పాలలో చమురుగాక కొన్ని ఘనపదార్థాలు వుంటాయి. ఈ పదార్థములు విస్తారముగానున్నయెడల పాలు బరువుగావుంటాయి. ఈ ఘనపదార్థములు పాలుపితుకునప్పుడు చేతికి చిన్నచిన్న గడ్డలవలె తరచుగా తగులుతాయి. ఇవి పేరుకొంటే పాలనుగడ్డలుగాని, లోపల చర్మముపై, బయలుదేరిన కంతులుగాని లేక ఒకవిధమైన శిలలుగాని అయియుండాలి ఇవి పాలుతీయుట కవరోధముగ గలిగించుటయేగాక ఒక్కొక్కప్పుడు పొదుగునందుగూడ వాపుపుట్టించుతుంది కాన ఈ యవరోధాన్ని తీసివేయాలి. తీసివేయుటకు వీలులేనియెడల పైనవుండే పాలతిత్తిలోకి త్రోసివేయుట మంచిది. ఫార్మసీవారి స్ట్రెయిన్ కిల్లరును మర్దన చేయుడు.

## చంటికి రంధ్రముపడుట

ఏదైన అవయవలోపము వలనగాని, పుండుపుట్టుట వలనగాని చంటిలో సామాన్యముగ పాలుతీయుమార్గముగాక పాలతిత్తిలోనుండి చంటిప్రక్కకు కన్నముపడవచ్చును. అచటనుండి పాలు కారిపోతాయి ఇందువలన పొదుగంతటికీ గూడ వాపు తగలవచ్చును. పాలిచ్చుచున్నంతకాలంమును ఈ రంధ్రమును పూడనట్లు చేయుట మిగుల కష్టము. పాలిచ్చుట మానినతరువాత శీఘ్రముగనే కుదరవచ్చును. అయినను పాలతిత్తిలో పాలెప్పుడును లేకుండ కారునట్లు మామూలు మార్గములోనొక గొట్టముంచి యాపుంపును మాన్పవచ్చును. కాని యిది కష్టసాధ్యము. పొదుగు భాగమందు కలిగిన గాయములు త్వరగామానక బాధించును హీలాక్సునుగాని వెటరినరీ ప్లాష్టరును గాని వాడుడు,

## కొరివిచన్ను

పాడిపశువులలో ఏదైనకొరివిచన్ను కావచ్చును అనగా ఆచన్ను నిత్తివలెనై పాలు స్రవించకుండా వుంటాయి. పశువునకు అతివేడి జేసినపుడుగాని, విషసంబంధమైన పదార్థములు తినుటవలనగాని ఈవ్యాధి యేర్పడవచ్చును పశువు నవమాసములు వచ్చిన తరువాత యేదైన విషపు మొక్కలు తినినయెడల ఈనిన తరువాత ఈవ్యాధి కనపడవచ్చును కొన్ని పశువుల చన్నులనుండి నెత్తురు పడుచుంటుంది. మరికొన్నిటికి చీము, నెత్తురు కలిసి పడుతుంది. అప్పుడు దృష్టిదోషము తగిలినదని అనేక చికిత్సలు చేస్తారు. కొరివి చన్నుగల పశువు ప్రతి ఈతకు పాలు సరిగా నీయదు తక్కిన మూడుచన్నులనుండి పాలు వచ్చునుగాని ఈచన్నునుండిమాత్రము రావు. ఒక్కొక్కప్పుడు అన్ని చన్నులకు నీవ్యాధిరావచ్చును దీనినే కొరివిచన్ను అంటారు.

## పాలుతగ్గిపోవుట

పశువుయొక్క తత్వాన్నిబట్టి, ఆరోగ్యాన్నిబట్టి, సాంప్రదాయాన్ని బట్టియు పాలెక్కువ తక్కువగా పుట్టుతాయి. పశువులకు ప్రతి దినము పెట్టుదాణాదినుసులు తగ్గించిపెట్టుటవలన బొత్తిగా పెట్టకపోవుటవలననుకూడ పాలుతగ్గవచ్చును. ఇంకనుపశువు శరీరములో తగినంత రక్తవృద్ధి లేకపోవుట వల్ల, క్రొత్తమనుష్యులు పితుకుటవల్ల, ఎండలో నెక్కువగా నుంచుటవల్ల పొదుగులో వున్న పాలను పూర్తిగా పిండక పోవుటవల్ల, విషసంబంధమైన మొక్కలు తినుటవల్ల, దూడచచ్చినపుడు గాని, పాలన్నీ దూడ త్రాగుననుయు ద్వేశ్యముతో కుడుచనీయక పోవుట వల్లకూడ పాలుతగ్గుతాయి ఇట్టితాత్కాలిక కారణాలవలన పాలు తగ్గినయెడల ఆహారము మార్చాలి

## చికిత్స

వాతముగల పశువునకు ప్రతిదినము సాయంకాలమందు సవాశేరు తెలికపిండి పెట్టుటవలన పాలవృద్ధి కలుగుతుంది. లేక ఆపిండిని నీటిలో నానవేసి సాయంకాలము పెట్టుకుడితితో కలిపిపెట్టవలెను

లేక కాకశరీరముగలపశువునకు ఉలవలునానవేసి రుబ్బికుడితిగా పోయవచ్చును. లేకశనగలునానవేసిరుబ్బికుడితిగాపోయవచ్చును. పశువు యొక్క శరీరతత్వముల గ్రహించి వానికి తగిన ఆహార పదార్థములు పెట్టుచూవుంటే పాలు వృద్ధియగుతాయి. తప్పకుండ క్షీరోజన్‌ను వాడుడు.

## వాంతులు

పశువులకు జీర్ణముకాని ఆహారము పెట్టుటవల్లమిక్కుటముగా నానాజాతుల గడ్డితినుటవల్ల తవుడు, పిల్లిపెసర, కందిపొట్టులు తినుట వల్ల విషపురుగులు, క్రిములు పేగులలో జేరి జీర్ణముకాకుండచేయుట వల్లవాంతులు వచ్చుచుంటాయి.

పేగులు అరచుతూ నోటిగుండా ముక్కులగుండా పేడరంగు వలె వదరుపడుతూ లేచుతూ పడుకొంటూ వుంటుంది శ్వాస నెమ్మదిగా విడచుతూ సరియగు చికిత్సచేయనిచో ప్రమాదము రాగలదు

## చికిత్స

నోటిని ముక్కురంధ్రాలనువగగునీటితో కడిగి శేరున్నరమంచి బెల్లపునీటిలో అరతులము కర్పూరముకలిపి ఆ గంటలకొకసారి ఈ యాలి లేక రావిచెక్కరసము చిక్కనిది శేరు, కర్పూరం 4వడ్లగింజ లెత్తు కలిపి ఒకమోతాదు ఈయాలి

లేక మాదిగ వాడు తోలు ఊర వేయుటకు తయారుచేసిన తంగేడుచెక్క నీటిని మూడుగొట్టములు పెట్టును.

అప్పుడప్పుడుముక్కురంధ్రములకు సాంబ్రాణిపొగపట్టించుము.

* * *

# ముప్పది ఒకటవ భాగము

## వత్సభృత్యము

### పాలను విడిచిపెట్టుట

పశువు ఈనగనే పాలు ఎక్కువ యున్నవీ లేనివీ తెలిసికోవాలి. పాలెక్కువగావున్నయెడల తక్కువ వదలిపెట్టుటయూ తక్కువగానున్న యెడల ఎక్కువగా వదలి పెట్టుట యూ చేయాలి. మామూలుగా దూడకు పొదుగునకు ఉండు ఒకవైపు రెండు చన్నులలోని పాలే కుడుపాలి. పాలు చిక్కగా వుండి ఎక్కువగా నిచ్చునపుడు తక్కువగా వదలి పెట్టాలి ఇవన్నీ కూడ పశువు ఈనిన రెండు మూడు దినాలలో ఎక్కువ తక్కువ పరిమాణాలు తెలిసికోవాలి. దూడకుపాలుతక్కువగా కుడిపిన రక్తముపారుతుంది ఎక్కువగా కుడిపిన తెలుపు రంగుగా పారు తుంది. నెల దినములు గడుచు వరకు ప్రక్కపాలు దూడలకు కుడుపు తుండాలి ముందరవైపు ఒకసారి రెండవవైపు మరియొకసారివదలిపెట్టు తుండాలి. ఒకప్రక్కనే వదలిపెట్టుతుంటే పొదుగు బరువుగాదిగుతుంది పాలు తక్కువగా వుంటే మూడుచన్నులూ వదలిపెట్టాలి. నెల దినాలు రాగానే మేతమేస్తుంది. కాన ఒకచన్నులోనిపాలు వదలిపెట్టాలి. దూడనుఎప్పుడూఆకలితో వుంచాలిగాని కడుపునిండుగా త్రాగించ రాదు ఈరీతిగా మూడుమాసాలవరకు చేయాలి. తరువాత మీయిష్ట ప్రకారము వదలిపెట్టవచ్చును పాలు చిక్కగావుంటే దూడలు బ్రతుకవుగాన తగ్గించుతూ త్రాగించాలి. వెన్న తక్కువగావున్న పాలు ఎన్నిత్రాగినా వ్యాధులురావు పశువు ఎండిపోవువరకుదూడకు ఒకచన్ను వదలితే ఏయ్యదూడైనా రెండుసంవత్సరాల వయస్సు రాగానే పొర్లి మూడవ సంవత్సరములోనే ఈని పాలిచ్చుతుంది.

దూడలకు మన్నుతిను స్వభావము వుంది. గాన చాల జాగ్రత్తగా కాపాడుతుండాలి. సామాన్యముగా ఈనిన పదిదినాలనుంచి పచ్చి మేతకొరకు ఎదురుచూస్తూవుంటుంది. పక్షము దినాలైననుంచి అరుదుగా ఒక్కొక్క గడ్డిపరకనంతున కొరికితింటుంది. పాలు త్రాగుటవల్ల మేత తినుటవల్ల సరిగా జీర్ణము కాక నెలజబ్బు వచ్చుతుంది. కాని బలాత్కారముగా మాత్రము మేత పెట్టరాదు. లేనిచో పాలు మేత కలసి చాల జబ్బుచేస్తుంది. కొందరు పాలెక్కువ తీసికోవాలనీ గరిక, గోంగూర మేపుతారు. ఇట్లు మేపుట వలన దూడకడుపు లావుగా పెరుగుతుంది

## ఆహారములో మార్పులు

పాలు త్రాగిన వెంటనే కక్కినచో దూడ త్వరగా త్రాగిందని అధికముగా త్రాగిందనిగాని, ఏదైన జబ్బుచేసిందనిగాని గ్రహించాలి.

ఒకసారి పాలుత్రాగి రెండవసారి త్రాగినగాని, మధ్య క్రక్కినచో క్రొవ్వుపదార్థములు ఎక్కువగుటచే అజీర్తి చేసిందని గ్రహించాలి.

పాలు త్రాగిన తరువాత అరగంటకు పెరుగుబిళ్ళలవలె కక్కినచో మాంసకృత్తు లధికమగుటచే అజీర్ణము చేసిందని గ్రహించాలి.

మలబద్ధకము వుంటే క్రొవ్వుపదార్థము తక్కువైందనీ, కావలసిన దానికంటె అధికముగా వుందనీ గ్రహించాలి.

కడుపునొప్పి యుంటే మాంసకృత్తులు అధికముగా వున్నవనీ పాలు వేగంగా పట్టుపడినవనీ అధికముగ నివ్వబడినవనీ గ్రహించాలి ఫార్మసీవారి వాటారి అగుము దూడలకు అప్పుడప్పుడు యిచ్చుట మంచిది.

## దూడల రోగాలు

దూడలు పుట్టిన వెంటనే మలబద్ధకము మొదలగు కొన్ని వ్యాధులు కొన్ని కారణములచే వస్తాయి. దూడలను మట్టిని తినసీయు

రాదు. ఈగలు, గోమారులు, మిన్నల్లులు మున్నగునవి దూడలను చంపుతాయి అవి పేడకుప్పలనుండి తుక్కునుండి. అన్నిరకాల కల్మ షాలను దూడలు తిను ఆహారముమీదకు తీసికొని పోతాయి దూడలు వీటిని తినిన తరువాత పలువిధ రోగముల పాలగుతాయి.

పాలకుడుచు దూడలకు దాణా లెక్కువగా పెట్ట రాదు. అట్లు పెట్టుటవలన అతిసారము. కడుపునొప్పి మొదలగు అజీర్ణసంబంధమగు వ్యాధులు పుట్టుతాయి దూడకు అతి సారము వచ్చినప్పుడు తల్లికి రోగమే మైన యున్న దేమో కనుగొనాలి. వాత రోగముచే బాధపడు పశువుపాలు త్రాగి దూడ అంబాడునిఅంతగాఅరువజాలదు. శరీరము కృశించుతుంది అపానవాయువులు తరచుగా విడుస్తూ మలము జిగురు జిగురుగావుంటుంది. పైత్యరోగముచేచాలా బాధపడుచున్న పశువుపాలు త్రాగిన దూడ మలము వంటలువంటలుగా వుంటుంది. శరీరము అధిక వేడిగావుండి ముక్కురంధ్రాలలో తేమఅంతగా వుండదు. కఫరోగముచే బాధ పడు చున్న పశువుల పాలుత్రాగిన దూడ నోటి నుండి చొంగ కార్చుతూ పాలను వెడల గ్రక్కుతూ వుంటుంది.

## వ్యాధికనుగొనుట

దూడ విశేషముగా ఆహార వేళలయందుగాక తదితర వేళల యందు అరచు చున్నయెడల మిక్కిలి బాధకలదనియు, కొంచెము తక్కువగా అరచు చున్నయెడలకొంచెముబాధగానున్నదనియుగ్రహిం చాలి దూడతనశరీరముపై ఎక్కువగా స్పృశించు చుండునో అచ్చట బాధకలదనియు ఎక్కడ ఘనము తో తాకిన బాధనొందుచుండునో అచ్చట బాధకలదనియూ తెలిసికోవాలి

మలబద్ధకమున్న దూడకు పేగులు అరచుట. కడుపుబ్బరము శరీరము ముడుచుకొనుట, విచారముగా ఉండుట, పాలుకుడువకుండుట మొదలగు లక్షణాలువుంటాయి.

వస్తికమునందు బాధకలిగినపుడు మూత్రమున్ను, ఆసనము నందు బాధకలిగినపుడు మలమున్ను నిలిచియుండునని గ్రహించాలి.

ప్రతిఅవయవము. కండ్లను మాటిమాటికి మిగులశ్రద్ధతో చూచుచుండాలి. ఇంతటిశ్రద్ధ మన దేశములో యిప్పటి నాగరికతా లక్షణాలుగల రైతులు గలిగియుందురాయని సందేహము. దూడల యందు తగినంతశ్రద్ధబుచ్చుకొనినచో మిాపశువు సంతతి క్షీణించును గాని వృద్ధిలోనికి రాజాలదనిగట్టిగానమ్ముడు ఈచింతామణిలో పశు వులకు వచ్చే అంటురోగాలలో చూపిన రోగలక్షణాలు, చికిత్సలు జూచి దూడలకు కూడ చేసికోవచ్చును మరల ప్రత్యేకముగా దూడ లకు తెలుపుట అనవసరమని తలంచితిని.

## పాలదొమ్మ

దూడలు పాలుఎక్కువ తక్కువలుగా కుడుచుటవల్ల పాలు పితుకునపుడు ఎక్కువగా విడిచిపెట్టుటవల్ల చిక్కనిపాలు కడుపులో జేరుటవల్ల ఈవ్యాధికలుగుతుంది. నోటినుండి జిగురువంటిపదార్థము వెలువడుతుంది పాలి కడుపులో పేరుకొంటాయి. కుళికిపాల్లుపడుతూ దగ్గుతూ మందమతిగా వుండి నల్లకప్పువేసి శరీరముముడుచుకొంటుంది. వ్యాధిముదిరినకొలది గురకయుండికడుపుబ్బుతుంది. కండ్లనుండినీరూ ముక్కులగుండఒక విధమైన ద్రవము కారుతుంది. క్రమేపి ఊపిరిఆడక చనిపోతుంది.

## చికిత్స

అప్పుడప్పుడు దూడలకుమలబద్ధకము లేకుండ చూచుచుండాలి. పసుపు ఒకతులము, కొట్టిపిండి 4తులాలు, వెన్న నిమ్మకాయంత కలిపి పెట్టాలి.

లేక పెన్నేరుదుంప2తు, గజ్జేరు వేళ్ళు అరగుప్పెడు ,కలినీటిలోకలిపి త్రాగించాలి.

లేక మోదుగపువ్వు 1తులము, బియ్యపునీరు అర్ధసేరు కలిపి త్రాగించునది.

బరిపక్కలను కుక్కకువేయు రక్షలు వేసినపాలదోమ్మ తగ్గుతుంది

తగిలినవెంటనే సారాయిపట్టిన మంచిది. లేక వాతారి అరఖును వాడుడు

# నెల జబ్బు

కొన్ని పశువులపాలు చిక్కగ వుండుటచేత హెచ్చుగ వుండుట చేత ఆకలిలేనప్పుడు తానంతటది పాలు త్రాగుట చేత ఈవ్యాధి కలుగుతుంది. దూడ నాలుకమీద తెలుపువర్ణముగల పొరయేర్పడి ఊపిరి పులువాసనగావుంటుంది. పాలు అప్పుడప్పుడు కక్కుతూ కక్కినపదార్థంలో పాలసంబంధమైన విరిగుడునీరుగాక జిగటగవుండి తెమడ యుంటుంది. వాంతితోపాటు అధికముగ మలబద్ధకమువుండి దూడ చిక్కిపోతుంది ఆరోగ్యము క్షీణించి, ఎముకలు పైకికనబడు తాయి. శరీరము శీతలముగావుంటుంది కొన్నిటికి కడుపునొప్పిగూడ యుంటుంది. సరియగు చికిత్స చేయనిచో దూడ చనిపోవచ్చును దీనినే నెలజబ్బు అని యంటారు.

# చికిత్స

వాముఠసం పావుశేరు, శొంఠిరసము పావుశేరు, ఉప్పుతులము కలిపి త్రాగించవలెను. తమలపాకులు 10, ఇంగువ అరతులము, గురివిందాకు 1 తులము, కలితోనూరి పెట్టిన తగ్గుతుంది, పాలలో మిరియాలపొడి కలిపి దానిలో కంకరరాయి ఎఱ్ఱగాకాల్చి పడవేసి రాయితీసితాగించాలి, వెల్లుల్లిపాయలు, 1తు, దుష్టపుచిగుళ్ళుఅర గుప్పెడుపెరుగు పావుశేరుకలిపిపెట్టుము. కంఠముదగ్గర మూడుగీతలుగా రక్షలువేసిన తగ్గుతుంది. ఫార్మసీవారి పశురక్షామృతం చక్కగా పనిచేస్తుంది.

## విరేచనాలు

కొన్ని సూక్ష్మజీవులు పశువుల పాలతిత్తులలో చేరి ఆ పాలను దూడ కుడచునప్పుడు దానికి సోకుట చేత పాలలో నుండు వస్తువులు తగ్గుట చేత ఈ వ్యాధి దూడలకు రావచ్చును. సాధారణముగా చాలసందర్భము లలో ఆయుక్తాహార పానీయములవల్ల కలుగుతుంది. ఇంకను దూడలు చెడిపోయిన పదార్థములను తినుటవల్ల చెడునీరు త్రాగుటవల్ల రావచ్చును.

## లక్షణాలు

కొన్ని దూడలకు మెల్లమెల్లగ పాకుట ప్రారంభించి క్రమంగా అధికంగా కావచ్చును మరికొన్నిటికి ఆకస్మికముగా అధికంగా నే ప్రారంభి ంవచ్చును విరేచనపు రంగు కొంచెము పసుపుపచ్చగవుండి తరువాత నల్లపు రంగుగా వుంటుంది. వాటితో పాటు కొంచెము జిగురుకూడవుండవచ్చును. ఇంకను దుర్వాసనతో కూడిన నీళ్ళ విరేచనము లవుతాయి. పెరుగు తోనకలవలెగుండ్రముగ ఉండలుండలుగ నలుసులు విరేచనాలలో కలిసియుంటాయి, ఇవి జీర్ణము కానిపాలు అని తెలిసికోవాలి. విరేచనము లెక్కువైన కొలది దూడ నీరసించి చనిపోతుంది

## చికిత్స

నూనెలో వేపుముంచి దూడకందించాలి.

పమిడపత్రి ఆకు మెత్తగానూరి కలితో కలిపిపెట్టాలి.

దానిమ్మ యిగుళ్ళు గుప్పెడు తీసుకొని పెరుగులో నూరి పెట్టాలి.

ఈ చికిత్సలు విరేచనాలు కట్టువరకు రెండు మూడుసార్లు ఈయ వచ్చును ఫార్మసీవారి బేల్ పౌడరును వాడుడు.

దూడను పాలు కుడుపరాదు. వేడినీటితో ఆరంభములో ఎనిమా చేయుట మంచిది. విరేచనాలు పలుచగ వుండి మిక్కిలి దుర్వాసనగా వుంటే వగరు పదార్థాలు యిచ్చుట మంచిది. దూడకు వెచ్చదనాన్ని ఈయాలి. పోడిఆహారము పెట్టాలి.

## మలబద్ధకము

దూడకు మలబద్ధకము తరచుగా సంభవించుతుంది. శీతాకాలములో మలబద్ధకమువలన అనేకదూడలు చనిపోతాయి. చిక్కని పాలు త్రాగు దూడలకు ఈవ్యాధి తరచుగా వస్తుంది. ఈవ్యాధిగల దూడలకు తగు చికిత్స చేయనియెడల దాని యావజ్జీవమును బాధించుతుంది. ఇది పాలు తక్కువగుట వల్ల తగినంత క్రొవ్వు పదార్థము లేకపోవుటవల్ల ప్రేగులలో సరియైన గమనము లేకపోవుట వల్ల చలిగాలి ఎక్కువ సోకుటవల్ల రావచ్చును.

## లక్షణాలు

మలబద్ధకముగల దూడలకు కడుపునొప్పికూడ వుంటుంది, దూడ చిక్కుతూ వుంటుంది పెద్దప్రేగు దినదినము తిత్తివలె పెద్దదై అందు మలము నిలువయుండి నానాటికి ప్రేగు బలహీనము చెందుతూ ఆయాసపడుతుంది. వ్యాధిముదిరినకొలది ప్రేగుచివర భాగము బైటికి రావచ్చును మలము గట్టిగా రాయివలె ఉండలుండలుగా ఆసనము నద్దనుండి బయటకు రాకపోవుటచే కునుకుతూ వుంటుంది. సరియైన చికిత్స చేయనియెడల మలము శరీరములో జీర్ణించి దుర్గుణాలు పుట్టి చనిపోతుంది.

## చికిత్స

4 అరటిపండ్లను తోలుతీసి ఆముదములోముంచి నోటిలో వేయుము.

సున్నపుతేటగాని కారపుపాలుగాని అరగొట్టము పెట్టుము.

గాలిమిడాకులును నూరి రెండు నిమ్మకాయలంత తీసికొని ఆముదముతో కలిపిపెట్టుము

2 తులముల ఉప్పును అర్ధశేరు గోరువెచ్చని నీటిలో కలిపి త్రాగించుము

లేక వాతారి అరకును వాడుడు.

## సలహా

చాలమంది రైతులు అతివేడిజేసి మలబద్ధకముగావున్న దూడకు బలుసాకు, ఆముదము, శొంఠి. మున్నగు వస్తువులు పెడతారు. ఇట్లు పెట్టుటవలన ఇంకను వేడిజేసి మలము గట్టిపడి బయటకు రాకపోవుట చేత దూడ బాధపడుతుంది కాబట్టి వ్యాధిని నిదానంగా కనుగొని చికిత్స చేయాలి. దూడయొక్క తత్వమును గ్రహించి వేడి బాగుగా నున్నప్పుడు ఎనిమా చేయాలి శీతలముగానున్నప్పుడు చేయరాదు.

## కడుపునొప్పి

దూడకడుపులో పాలు పులిసిపోవుటవల్ల, ప్రేగులలో పాల బిళ్ళలువుండుటవల్ల, పాలు సరిగా జీర్ణము కాకపోవుటవల్ల, ప్రేగులలో గాలిచేరుటవల్ల యింకను తదితర వ్యాధులవల్ల ప్రేగులలో క్రిములు వుండుటవల్ల ఈ వ్యాధిరావచ్చును.

## లక్షణాలు

కడుపు గట్టిగావుంటుంది. తనతలను పొట్టకు ఆనించుకొని నాలుగుకాళ్ళను తనదగ్గరజేర్చుకొని ముడుచుకొని పండుకొంటుంది. దూడకు బాధఎక్కువైనకొలది కాళ్ళతో నటునిటు తన్నుకొంటుంది దూడ మూత్రద్వార సమీపమునవుండే చర్మము ముడుచుకొని పోతుంది. మలబద్ధకము కొన్నిటికి యుంటుంది. అపానవాయువులు విడుస్తూ తలను మెడభాగాన్ని అటు నిటు విసుచుకొంటూ వుంటుంది.

# చికిత్స

వాముురసము పావుశేరు, జీలకర్ర 1 తులము, అర్థశేరు కారపు పాలలో కలిపి రెండుమూడు పర్యాయములు త్రాగించుము.

అరతులము ఇంగువను పావుశేరు గచ్చాకురసములో కలిపి త్రాగించుము.

ఆముదొండాకు పసరు 6తులాలు ఆముదము 4తులాలు కలిపి త్రాగించుము

ఇంగువ2తులాలు వాముురసము అర్థశేరు కలినీరు అర్ద శేరుకలిపి పెట్టుము.

లేక ఫార్మసీనారి - తారి అంఖునుగాని, పశుమిత్రనుగాని, వాడుడు.

జీర్ణముకాని పదార్థముల పెట్టరాదు. వేడినీటిని దాహముగా యిచ్చుటమంచిది చలిగాలి సోకనీయరాదు. మలబద్దకముగా వుంటే సబ్బునీటితో ఎనీమా చేయుట డొక్కభాగములకు వేడికాపులుతీయుట మంచిది

# కడుపుబ్బు

పాలు జీర్ణముకాక పొట్టలో నిలువయుండుటవల్ల తటాలున కుడితితొట్టిని జేరినీళ్ళుత్రాగుటవల్ల ఏపదార్థమైనా గొంతుకలోఅడ్డము పడుటవల్ల పొట్టలోపల గాలిప్రవేశించుటవల్ల దాణాదినుసులు ధాన్యము మున్నగునవి తినుటవల్లకూడ ఈవ్యాధి రావచ్చును.

# లక్షణాలు

కడుపు విస్తారముగా పొంగుతుంది. వ్యాధిముదిరినయెడల బాధ పడుతూ దీర్ఘమైన శ్వాసవిడుస్తుంది. పొట్టయుబ్బి కఠినంగావుండిమూల్గు తుంది. గాలిజేరినయెడల ఒత్తిన పైకుబుకుతుంది. అటునిటు దొర్లచు మూడకు ప్రాణాపాయము కలుగవచ్చును.

## చికిత్స

నారాయి 2డ్రాములు తాగించుము,

లేక వాముురసము పావు శేరు, ఉప్పు 21/2 తులాలు కలిపి తాగించుము

తులము ఇంగువలో 2 తులముల ఉప్పు కలిపి అర్ధ శేరు గోరు వెచ్చని నీటిలో కలిపి తాగించుము.

గచ్చాకు రసము వేడిజేసి దానిలో కలినీరు కలిపిపెట్టుము.

లేక పశుమిత్రినుగాని పశురక్షామృతంనుగాని తాగించుము

కడుపుబ్బు తగ్గువరకు తేలికయైనఆహారంఈయాలి. గాలియుంటే డాక్టరుగారితో కడుపులోని గాలిని ట్రోకారుఅనుపనిముట్టుతోతీయుంచాలి. మలబద్ధకమున్నదని అనుమానము వుంటే వేడినీటితో ఎనిమా చేయుట మంచిది.

## వాతము

దూడకు ఈరోగము వచ్చుటకు అనేక కారణములువున్నాయి' అజీర్తి పేగులలోనులిపురుగులు, పెద్దరోగము, గాళ్ళు మున్నగువ్యాధుల వల్ల వాతసంబంధమగు పదార్థములు తల్లికి మేపుటచే ఆపాలుదూడ తాగుటవల్ల ఈవ్యాధిరావచ్చును.

## లక్షణాలు

కాళ్ళుపట్టివేస్తుంది, ఎల్లప్పుడు కాళ్ళలతో తనశరీరమును పొడిపించు కొంటుంది ముఖము సాలిపోవుట పాలుసరిగా తాగదు. అవయవములలో కొన్ని యెండిపోవుటో. పైకిలాగుటో కొన్నిటికి జరుగుతుంది నోరు దుర్వాసనగా వుంటుంది.కన్నులు పుసులు కట్టుతాయి. క్రమముగా దూడ శుష్కించుతుంది.

## చికిత్స

ఆరంభములో ఆముదము 10తులాలు ఈయాలి.

వాము8తులాలు శొంఠి 1తులము, మిరియాలు 1తులము ఉప్పు 5తులాలు, ఆముదపుపప్పు 1తులము కలిపి నూరి ఉండలుచేసి ప్రతి దినము ఉదయము 2 వుండలుతీసికొని పాచ్చుశెనగబియ్యపునీటిలో కలిపి త్రాగించాలి.

ముద్దకర్పూరము తాటిబెల్లముతో నూరిఅప్పుడప్పుడు నాలుకకు నాకించాలి

ఉమ్మెత్తాకు పసరుగాని,అవిసెఆకుపసరుగాని శరీరము సకంతటికి పూత పెట్టాలి

వావిలాకు పసరు మంచినూనెలోకలిపి కాళ్ళనొప్పునకురాసిన తగ్గుతుంది.

లేక వాతారిని, ప్ఫ్రియిన్ కిల్లరునువాడుడు.

దూడలకు శుభ్రమైన ఆహారాన్ని యిచ్చుతూ జాగ్రత్తగా పోషించాలి. ద్రవపదార్థముల నంతగా ఈయరాదు. వాతముచేయు పదార్థముల పెట్టరాదు మలబద్ధకము లేకుండ చూడాలి.

## జంటిబొడ్డు

దూడపుట్టినపుడు బొడ్డునుండి రెండుదారములుగా కలిపి ఒక మాంసపుతాడు వేలాడుతుంది. ఈతాడు తెగిపోవ్వటచేతఆవ బొడ్డును నాకుటచేత కాకులు మొదలగునవి పొడుచుటచేత పుండుపడుతుంది అశ్రద్ధచేసినయెడల చీముపట్టతుంది. సామాన్యముగా ఈపుండు రెండు మాసములవరకు కూడయుంటుంది. ఆరంభములో వ్యాధియందు బొడ్డుచుట్టుకొంచెమువాపుండి ఎరుపుగా వుంటుంది. వా పుబాగుగాపక్వ మైనతరువాత దానంతటదియే చిటికి చీమంతా కారిపోతుంది. ఈచీము

పోక మరల గడ్డకట్టితే బొడ్డునుంచి రక్తనాళములోకి వ్యాపించిఅక్కడ నుండి ఆవిషము శరీరమంతా కలిసిక్రిమక్రిమముగా బాధఎక్కువై దూడచనిపోతుంది మరికొన్ని పుండ్లుమానక ప్రతిదినము నాకుటచే పురుగులుపడి ఆభాగమంతా తిని చనిపోవుటయూగలదు. కొందరు ఆ రంభములోనే బొడ్డుపైన రక్షవేస్తారు ఇట్లుచేయుట చాలతప్పు.ఆభాగ నంతా మాడిదూడకు అపాయముకలుగుతుంద. అనుభవవైద్యునితో చికిత్స చేయించాలి.

# చికిత్స

పుండునకు ఆరంభములోనే ములగాకుఆముదముతో వేయించి నాలుగైదు కట్లు కట్టాలి. దూడచుమాత్రము పుండునునాకనీయకుండ ముఖ్యముగా కాపాడాలి. అప్పు డప్పుడు వెన్నలో తగినంత పసుపు, గుగ్గిలము కలిపి మెత్తగా నూరి ఆ నాపునకు పట్టించు చుండాలి. లేక ఫార్మసీవారి హీలాన్‌ను గాని కార్సెక్సును గాని వాడుడు.

# రక్తవిరేచనాలు

ప్రేగులలోని మాలిన్యము వల్ల, అతిసారమువల్ల, అతివేడివల్ల చలిగాలి సోకుటవల్ల చెడు ఆహారములు యిచ్చుటవల్ల అపరిశుభ్రపు నీటిని త్రాగుటవల్ల గాలిలో ఆకస్మికముగా మార్పు కలుగుటవల్ల ఈ వ్యాధి కలుగుతుంది

# లక్షణాలు

దూడ మంద మతిగా అసౌఖ్యముగా కొంత కాలముండి ఈ వ్యాధి అకస్మాత్తుగా వస్తుంది. మలము ఉండ లుండలుగా వుండి బంకతోను బాధ పడు తుంది. నడుము వంగిపోయి తోకను లేపుతూ వుంటుంది.తరచుగా పేడ వేయుటకు ప్రయత్నముచేస్తూ, మూలుగుతూ పండ్లుకొరుకుతూ వుంటుంది. విరేచ నాలు నెత్తురు వాసనగా వుండి క్రమేపి నీరసించి చనిపోతుంది.

## చికిత్స

పెన్నేరుదుంపను పేరినెయ్యితో కలిపి రెండుమూడుపర్యాయములు పెట్టాలి.

10తులములఆముదము లో1/8తులము నల్లమందుకలిపిపెట్టాలి.

వాము 1 తులం, జీలకర్ర 1/2 తులం, శొంఠి 1తులం, కలిపి బెల్లముతో కలిపి నాలుకకు నాకించాలి. లేక బేల్ పొడకును వాడుము.

ఆహారము ద్రవరూపంగా బలమొసగు నదిగా చులకనగా జీర్ణమగునదిగా వుండాలి. ఘన పదార్థాలను ఈ రోగము తగ్గిన వారము దినముల వరకూ దూడకు పెట్టరాదు. చన్నీటిని ఈయక కాచిన నీటినే త్రాగించాలి.

## మలక్రిములు

దూడ ప్రేగులలోను, మల కోశం లోనూ అనేక రకాలైన క్రిములు చేరుతాయి ఇవి 6 లేక 12 అంగుళాల పొడవు గలిగి చిన్న ప్రేగులలో వుంటాయి.



ప్రేగులలో పుట్టు క్రిములు

త్రెడ్ వరం అనునది 5, 6 అంగుళాల పొడవుగలిగి పెద్ద ప్రేగులలోను, ఆసనములోను యుంటుంది, ఇది చిన్నదిగా వుండి

సన్నని సూదివలెవుంటుంది. టేప్రవరం అనునది పెద్దపేగులలోను చిన్నపేగులలోను యుంటుంది. ఈ క్రిములు అశుభ్రతవల్లనే ఎక్కువగా శరీరములో ప్రవేశించుకొంది.

## లక్షణాలు

దూడ శుష్కించుతూ ఆకలి హెచ్చుతగ్గులుగా వుంటుంది. తోకను దేనికైనవేసి రుద్దుకొనుటకు ప్రయత్నించుతూ వుంటుంది. మలం జిగటగావుండి కడుపునొప్పికూడ వుంటుంది

## చికిత్స

గాడిదగడపాకుపసరు పావుశేరు త్రాగించుము. అరచేరెడు ఉప్పు, అర్ధశేరు చింతపండు పులుసుతో కలిపి త్రాగించుము. పచ్చి నేలవేమురసము పావుశేరు, కలినీరు అర్ధశేరు కలిపి త్రాగించుము యింగువను పెట్టుము లేక ఫార్మసీవారి వాతారి బాగుగా పని చేస్తుంది.

ఆహారముత్వరగా జీర్ణమైయ్యేదిగావుండాలి. ఉప్పుకలిపిననీటిని పెట్టుటమంచిది. దూడను అటునిటు తిరుగనిచ్చుతూ వుండాలి.

## రక్తచెర్లి

దూడలకు ఈ వ్యాధి తరచుగా వస్తుంది. శరీరము మీాద తడి తరభాగముందు చిన్నచిన్న కురుపులు లేచి బాధను కలుగజేస్తాయి. ఈ కురుపులు నలుపురంగుగావుండి వీటినిచిదిపిన రసికారిఎరుపురంగుగా వుంటాయి. ఇంకను వీటినితాకిన వేడిగా నొప్పిగా యుంటాయి. అశుభ్రమైనగాలిని పీల్చుటవల్లకూడ ఈవ్యాధి కలుగుతుంది ఇది 15 దినములవరకు వుంటుంది సరియైన చికిత్స చేయనిచో కురుపులన్నీయు కలసి పెద్దవాపుగా అగుతాయి

## చికిత్స

సబ్బునీటితోగాని, కుంకుడుకాయనురుగుతోగాని శరీరభాగాలు కడిగి మైలతుత్తం 2 వడ్లగింజల ఎత్తు, వెన్న 6 తు, గంధకము తులం, ముద్దకర్పూరము తగినంత కలిపి మెత్తగా నూరి రెండుమూడు పర్యాయములు రాసిన తగ్గిపోతుంది. లేక బ్రహ్మదండి ఆకుపసరులో ముద్దకర్పూరము కలిపి రాసిన తగ్గుతుంది. ఫార్మసీవారి కార్నెకస్ వాడుదు.

# ముప్పదిరెండవ భాగము

## శస్త్ర వైద్యము

### వ్రణములు - కంతులు

## గాయములు

పోటుగాయాలు:- కత్తి, ముండ్లు మొదలగు మొనగా వుండే పనిముట్లతో పశువులను పొడుచుట వలన ఈ గాయములు ఏర్పడుతాయి

శస్త్రగాయాలు:- మిక్కిలిపదునుగల పేనాకత్తితోగాని, తదితర పదునుగల ఆయుధములతోగాని చెదరనీయక చీల్చుట ( గీచుట, నరకుట ) వలన ఈ గాయాలు ఏర్పడతాయి

వ్రేటుగాయాలు:- బుడుపులుగలకట్టెతో కొట్టుటవల్ల, పెద్దపులి మొదలగు ఘోరజంతువులు గోళ్ళతో రక్కుట (గుచ్చుట, కొరుకుట) వల్ల ఈ గాయాలు ఏర్పడుతాయి.

నలుగుడుగాయాలు:- పశువులులోతుగల గోతుల్లోఆకస్మికంగా పడుట, దుముకుట, రైళ్ళక్రింద మోటారుకారుల క్రిందపడుట వల్ల చర్మముక్రిందిభాగాలునలుగునట్లు దెబ్బలు తగులుటవల్ల ఈగాయాలు ఏర్పడుతాయి.

కుంటుగాయాలు:- తుపాకి, పిస్తోలు మున్నగు ఆయుధాలలో గుండువేసి పశువులను కొట్టుటచే ఈ గాయాలు ఏర్పడుతాయి.

## గాయములనుండి రక్తాన్ని పోనీయరాదు

గాయముతగిలిన వెంటనే రక్తాన్ని పోనీయకుండ ముఖ్యముగా వైద్యుడుగాని, పశువు యజమానిగానిచూచుచుండాలి ఈ గాయము నకు వెంటనే తగు చికిత్స ఆలస్యము లేకుండ చేయాలి. ఇటువంటి చికిత్సలు నేర్చుకొనుటకు రైతుఆతురతపడుటత్యావసరము రైతుగాని వైద్యుడుగాని అట్టిచికిత్సచేయక ఆలస్యము చేసినచో రక్తమంతయు స్రవించి గాయముతగిలిన పశువునకు ప్రాణాపాయముగూడ కలుగు తుంది.

## రక్తనాళాలు

పశువు దేహమందు శుద్ధ రక్తనాళాలు, మలినరక్త నాళాలు సూక్ష్మరక్తనాళాలు మున్నగునవి యుంటాయి. వీటికి ప్రమాదము వచ్చినపుడు రక్తము స్రవించుతూవుంటుంది రక్తముయొక్క రంగును, అది స్రవించువిధానాన్ని చూచి, అదయెక్కడనుండి కారురక్తమో తెలిసికోవాలి.రక్తమెక్కువగా పోవుచున్నయెడల బలహీనత, ధనుర్వా తము కలిగిమరణముసంభవించుతుంది గాయాలలోరక్తము పేరుకొనిగడ్డ కట్టుతుంది. నెత్తురుకారకుండ ఆపుటకు ప్రకృతిసిద్ధమైన ఉపాయాలలో ఇదియొకపద్ధతి. కనుకఅట్లు పేరుకొనియుండే రక్తాన్ని ఏకారణముచేత నైనా కదుపరాదు

# శుద్ధ రక్తనాళములనుండి రక్తము కారుట

ఈ రక్తనాళములనుండి స్రవించే రక్తము కాంతిగలిగి ఎరుపు రంగుగా వుంటుంది. లోపల నాడులు కొట్టుకొనుటవల్ల రక్తము కొంచెము వురవడిగా వస్తూవుంటుంది. ఇట్లుపశువు రక్తనాళములనుంచి రక్తముకారుచున్నట్లు తెలిసికొన్నతరువాత వెంటనే చికిత్స చేయుటకు ప్రారంభించాలి. ఈనాళాలు (ధమనులు) పశువు దేహమునందంతటా వుంటాయి కనుక వాటిస్థలాలను బట్టి చికిత్సలు ప్రత్యేకంగా వుంటాయి. ధమనులకు అపాయము కలిగినపుడు మొదట రక్తాన్ని ఆపుజేయుటకు బొటన్రవేలితో నొక్కాలి. ధమనులను ఎక్కడనొక్కిన రక్తమాగుతుందో తెలిసికోవాలి ముఖ్యంగా ఈ రక్తనాళాలు పశువు దేహములో ఎట్లు వ్యాపించియున్నవో తెలిసికొనుట అత్యావసరము

రక్తము ప్రవహించు భాగాలను పరీక్షించేముందు వైద్యుడు చేతులను శుభ్రముగా వుండునట్లు చూచుకోవాలి ఎముకలు విరిగినప్పుడు పేళ్ళు, గాజుముక్కలు గాయాలలో వున్నప్పుడు మాత్రము పెద్దశుద్ధరక్తనాళాన్ని పట్కారువంటి పనిముట్లతో నొక్కాలి. తల. నోసలుకంఠము; జెబ్బ, పొదుగు, తొడ, నాలుక, చెవియున్న ఏ భాగాలకు దెబ్బలుతగిలి, ఆకస్మికంగా రక్తము స్రవించునప్పుడు చాలజాగ్రత్తగా చికిత్సలు చేయాలి. పైన చెప్పిన భాగాలకు గాయములు తగిలితే మాత్రము పైకియెత్తి యుంచాలి. ఇట్లుచేసినచో ఆభాగమందలి రక్తము కొంతవరకు తగ్గుతుంది. రక్తము స్రవించు భాగమందు వేళ్ళను మోపికొని, తడి లేకుండ పరిశుభ్రముగా వుండేపీచు, దూది పొడిగుడ్డ మున్నగునవి గాయముపైనుంచిగాని నొక్కాలి. ఇట్లు చేయుటవల్ల రక్తము ఆగుతుంది అంతకు తగ్గనిచో గాయము ప్రమాదముగా నున్నదని సందేహము కోచితే డాక్టరుగారిని పిలిపించి చికిత్స చేయించాలి.

## మలినరక్తనాళాలగుండ రక్తముకారుట

గాయమునుండి రక్తము మలినంగా స్రవించుతూవుంటేసిర లకు గాయముతగిలినదని తెలిసికోవాలి వీటిగుండా చెడురక్తము తిన్నగా ప్రవహించుతూ వుంటుంది ఈరక్తనాళాలు వాపుదలజెంది యుంటాయి వీటినిగట్టిగా బిగించి కట్టుకట్టాలి

## గాయపుసంధి

ప్రత్యేకంగా సిరలు తెగితే ఆగాయమునుండి అర్ద్రిపురుగుతో సమానమగు కాంతిగల రక్తంఎక్కువగా కారుతుంది. ఆరీతిగా తెగుట వల్ల వాతము ప్రకోపించి శిరోరోగాలు కలుగుతాయి.

స్నాయువులు తెగితే కుంటుతనంగలిగి అవయవాలు పనిచేయ జాలక పనులుచేయుటయందుకూడ శక్తితగ్గుతుంది. బాధయెక్కువగా వుండి చాలకాలమునకుగాని గాయముమానదు

కదలేపీ కదలకుండావుండే సందులు తెగినచో వాపుతీవ్రంగా వుండి ఎక్కువ బాధకలిగి బల క్షీణించుతుంది. కణుపులు పగిలివాచి సంధులు పనిచేయవు.

అస్థులు తెగినయెడల రాత్రింబవళ్ళు విడువకుండ విపరీతమగు బాధకలుగుతూ శాంతిలేకుండుట, అవయవాలు కృశించుతూపోటూ వాపు కలుగుతుంది.

## సూక్ష్మనాడులనుండి రక్తముకారుట

ఇవి పశుదేహము సందంతటను సల్లికలవలెవ్వుంటాయి. ఇవి రేగుదలనొందినప్పుడురక్తముచిమ్ముతుంది. వీటినిచేతిబొటనవ్రేలితో నొక్కినఆగిపోతాయి.

## ముక్కులనుండి రక్తముకారుట

పశువు ముక్కురంధ్రములనుండి అనేకకారణాలవలన రక్తము స్రవించవచ్చును. అట్టిసమయములందు జాగ్రత్తగా పశువును

పరీక్షించి వేడి జేయుటవల్ల వచ్చుచున్నదో లేక దెబ్బతగిలివచ్చుచున్నదో పరీక్షించాలి తదుపరి చికిత్స చేయాలి

## గాయాలనుగూర్చి ముఖ్యవిషయాలు

గాయములు తగిలిన వెంట నేతగుచికిత్సచేయనిచో ఈగలవలన గాయము పెద్దదై చాలప్రమాదము కలిగించుతుంది.

గాయములందుంటె ఇతరపదార్థాలను ముఖ్యంగా తొలగించి శుభ్రము చేయాలి

శుద్ధజలముతో గాయాలను కడిగి శుభ్రము చేయాలి.

గాయములో బొగ్గుపొడుము గాని, ఆపొడిలో తదితర చూర్ణాలుగాని, కలిపి వాడిన వెంటనే గారపట్టుతుంది.

గాయాలు తగిలినప్పుడు పశువునకు విశ్రాంతియిచ్చి పనిపాటలు చేయించరాదు

గాయాలు చిన్నవైనయెడలఅనగాలోతు లేనప్పుడు వాటిఅంచులనుదగ్గరగాపట్టుకొనేబంకవంటి పదార్థాలను గుడ్డకుపట్టించిగాయము మీదవేయాలి గాయములోతుగా తెగినప్పుడు ధనుర్వాతము రాకుండ కాపాడాలి.

## పోటుగాయాలు

పశువును కత్తితోగాని మరిదితరపనిముట్టుతోగాని, చర్మమునందుగాని, కండరములకుగాని, పోటు చేటచే ఆభాగమంతా ఆగంభము లో రక్తమిళితమై యుండుంది. అట్టిసగాయమునందు ఇదివరకు చెప్పిన లోషన్సుతో ప్రతిదినము కడుగుచూ గాయములకు వేయుఔషధములు వేయుచూ కట్లుకట్టుచూ వుండాలి. లోతుగ తెగి తేలంచులుకుట్టవలసి వస్తే మిాఫిర్కాలయుర్వేద పశువులడాక్టరును పిలిపించిచికిత్స చేయించాలి. గాయము వేసిన కత్తితుప్పుపడినదా లేకగాని ఆకారమెట్లున్నదో చూడాలి. లేనిచో గాయాన్ని మాన్పుటచాలకష్టము.

# శస్త్రగాయాలు

ఈగాయాలు చాలప్రమాదము గలిగించుతాయి ఎందుచేత నంటే చర్మమును కండరములను చీల్చుకొని లోపలికిపోవుటవల్లరక్త నాళములు తెగి పశువులకు ప్రాణాపాయము కలుగవచ్చును. ఈ గాయాలు తగిలిన వెంట నేదుమ్ము లేకుండ చూడాలి, లేని చో ధనుర్వాతము సోక చనిపోగలదు. లోతుగాయముగానుండి విస్తరించు చర్మపుకండలు వ్రేలాడుచున్నపుడు అంచులనుకుట్టి ప్రతిదినము చికిత్స చేయాలి.

# వ్రేటుగాయాలు

చేతికర్రలతో కొట్టినప్పుడు చర్మము పగిలిరక్తముకారుతుంది ఇట్టి సమయములందు అంతగా ప్రమాదముండదు పెద్దపులి మున్నగు జంతువులు కరచి నప్పుడు లోతు గాయము లైతే చాల అపాయము కలుగు తుంది. గాన యిట్టి సమయము లందు ఏ భాగముపైన కాటు వేసినదీ, ఎంత వరకు ఆ భాగము చెడినదీ వెంటనే కనుగొని చికిత్స చేయాలి. అట్లు చేయనియెడల వాతముగ్రమ్మి చనిపోతుంది.

# కుంటుగాయాలు

ఇది వరకు చెప్పిన గాయాలకంటె ఈ కుంటు గాయాలు చాల ప్రమాదాలు కలిగించు తాయి. ఎందుచేత నంటే విషసంబంధ మైన వస్తువులుశరీరము లో ప్రవేశించుట వల్ల ఆ భాగమంతా చెడిపోయి క్రుళ్ళుడు పుట్టుతుంది. కాబట్టి జాగ్రత్తగా పరిశీలించి చికిత్స చేయుట మంచిది. గాయాలకు హిలాన్‌ను గాని, కార్బొకర్సును గాని వాడుడు

పశువులకు ఆపత్సమయంలో సమీపమందు దొరి కేవస్తువులను అనగాగుడ్డ పీలికలు, నూలుబట్ట పీలికలు, చేతి రుమాళ్ళు, శాలువలు గుడ్డపీలికలు, నారగుడ్డపీలికలు మొదలగునవిఉపయోగించాలి. కట్టుకట్టు టలో పలురకాలు వున్నాయి, ఆయుర్వేద పశువుల డాక్టరుగారు కత్తెర, పట్కారు, గుడ్డపీలికలు, తదితర పనిముట్లు మున్నగునవిదగ్గర

వుంచుకోవాలి వీనిని వాడుటకు ముందు పనిముట్లు శుభ్రముగా చేసు కోవాలి. ఇంకను పీచు, దూది. చేతులు తుడుచుకొనుటకు ఒకతుండు ఉండుటవసరము.



ముఖ్యముగా చేతులు కడుగుకొన కుండ కట్లను విప్ప రాదు గాయాలలో గాలి, దుమ్ము, పురుగులు మున్నగు నవి దూరి బాధ కలిగింపకుండ కట్లు గాయాలను సంరక్షించుతాయి గాయాలలో నుంచి రక్తము కారునప్పుడు దానిని నొక్కి అదిమిపట్టినగాని రక్త ప్రవాహం ఆగదు. అట్టి సమ యంలో గాయము చుట్టునుకట్టుగుడ్డను చుట్టి గాయమును నొక్కి రక్తాన్ని ఆపుచేయ వచ్చును. కట్లు కండ రములకు శ్రమనీయకుండ వుండాలి గాయముపైన కట్టుకట్టిఅంతటను వ్యాపించునట్లును, గాలి గాయాలకు సోకకుండునట్లును సమానముగా కట్టాలి. కట్లకు చలువగుడ్డనుగాని, కోరాగుడ్డనుగానియుపయోగించుట మంచిది. ఆ గుడ్డలను ముందు నీటిలో నానవేసి ఆరబెట్టి అంచులు చించాలి. ఈ కట్టుగుడ్డలయొక్క పొడవు వెడల్పు గాయములకు తగి నంతగాచింపి వాడాలి. కట్టుమడతలు ముడతలు పడకుండ చక్కగా

కట్టాలి. అపాయపు అవయవములు కదలినయెడల. బద్దలు చేర్చి కట్టాలి అందువల్లఅపాయపు అవయవాలనుకదలనీయవు.ఆగాయములు సంభవించినపుడు అన్ని భాగములకు కట్లు కట్టటకు వీలుండదు కాబట్టి ఉపాయముతో కట్టాలి.

గాయము పైనున్న కట్లు అంటుకొనియున్నచో రావిచెక్క తుమ్మచెక్కమున్నగు వగరు వేడినీటితోగాని. తదితర లోషన్సుతో గాని తడిపినెమ్మదిగా తీసి దూరముగా పారవేయాలి. లేనిచో పశువు రసిగుడ్డ లను తింటుంది. తరువాత చీము నెత్తురు రసియున్న యెడల శుభ్రము చేసితరువాత మందు వేయాలి.దుర్మాంసము పెరిగిన యెడల మైలతుత్తపు ముక్కతో ఆ దుర్మాంస మంతా పోవువరకు తాకుచుండాలి, ముఖ్యంగా గాయములకు గాలి ఎంతమాత్రము సోకనీయరాదు. ఎంత చిన్నగాయమైనానిర్లక్ష్యము చేసినచో ధనుర్వాతముసోకి పశువును బాధ పెట్టుతుంది మీదగ్గర మందులు లేనిచో ఫార్మసీవారి హీలాన్ లేక కార్నకన్, వాతారి అరకును వాడుడు.

## కుట్లువేయుట

శస్త్రగాయాలు పోటుగాయాలుకుంటుగాయాలు తగిలిప్రమాదాలు కలిగినపుడు అంచులనుచేర్చి కుట్లు వేయవలసియుంటుంది గాన గాయముల కుపయోగించే సాధనములు పనిముట్లు దగ్గరవుంచుకోవాలి. ఏ భాగముయొక్క అవయవముమీదగాయముపడిందో అదిలోతుగా వుందో ముక్కలుముక్కలుగా చీలిందో,రక్తనాళాలకుప్రమాదమేమైన కలిగిందో ధనుర్వాతమువచ్చుటకుసూచనలేమైనవున్నవో ఏగాయానికి ఏసూదితోకుట్టిన సరిపోతుందో మున్నగువిషయాలన్నీ పరిశీలించి తదుపరి కుట్టాలి. గాయము చాలవెడల్పుగ, లోతుగ పొడవుగవుంటేదూదినిగాని పీచుగాని లోపలదూర్చి అంచులను కుట్టాలి. కుట్టేదారాలునరముల సిల్కుదారాలు గట్టినూలుదారాలు ఉపయోగించాలి. లేనిచో

తెగిపోతాయి. ఇట్టిదారాలు శస్త్రపరికరములు దొరకే ఇంగ్లీషుమందుల షాపులలో దొరకుతాయి కుట్టకుట్టవలసినప్పుడు వెటరినరీడాక్టర్లకుగాని ఆయుర్వేదపశువైద్యాచార్యునకుగాని చూపించుటమంచిది.

## కుట్టుసూదుల పరిమాణము

కుట్టుటలో జడలు అల్లినట్లుగా గాని . పైకి క్రిందకు కప్పిగింపునట్లుగా గాని చినిగినగుడ్డను నేతవాండ్రుకుట్టినట్లుగ గాని, చిన్న నిలువుకలుగు నట్లుగాగాని ఏరీతిగా కుట్టిన బాగుండునో ఆరీతిగా చేయాలి.

స్వల్పమాంసముగలప్రదేశము, సందులు వీటియందు కుట్టినట్టి సూది, గుండ్రింగావుండి పొడుపుగా వుండాలి.పొడవుగాను ముక్కోణముగావుండే సూదిని ఎక్కువ మాంసముగల ప్రదేశములోకుట్టుటకు పనికి వచ్చుతుంది.

మర్మస్థానాలు, అండకోశాలు, కడుపు వీనిభాగములందు. కుట్టుటకు విల్లువలె వంగియుండుసూదుల నుపయోగించాలి. ఈ మూడురకాల సూదులయొక్క కొనలుపదును గలవిగా, పట్టుకొనుటకు వీలుగావుండిన ట్లుండి మాలతీపుష్పముల తొడిమ కొనలవలె గుండ్రిముగావుండాలి.

గాయాలను కుట్టునప్పుడు సూదులను మిక్కిలి దూరముగాగాని దగ్గరగాగాని గుచ్చరాదు దూరముగాకుట్టిన ఎక్కువ బాధగలిగి కుట్లుకూడ తెగిపోతాయి.

## నలుగుడుగాయాలు

ఈగాయాలు కలిగినపుడు చర్మం పైభాగానికి భంగముకలుగుతుంది. కాని లోపలవుండే రక్తనాళాలు చితికి బాగానలిగి ఆప్రదేశము నల్లబడుతుంది. రెండుమూడు దినములైనతరువాత చుట్టువుండే చర్మము పసుపురంగుగా ఎరుపురంగుగా నలుపురంగుగా మారుతుంది నలిగినచోట వుండేరక్తము అటునిటూ చెదురుతుంది. అందువలన

వాచుట. నల్లబడుట తటస్థించుతుంది. అవయవాలు ఎక్కువగా నలిగి నయెడల ఆయాభాగాలను వేడినీటిలో గుడ్డముంచి పిడిచి కాచుట మంచిది. దెబ్బలు తగిలిన గాయాలు, శస్త్ర చికిత్సచేసిన గాయాలు కొంత కాలమువరకు మానవు ఈగాయాలు కొంచముగనో గొప్పగనో వాపుగలిగియుంటాయి. ఈ వాపులకు వేడినీటికాపులుతియాలి లేదా అవిసెగింజల పిండియైన కట్టాలి.

## గాయాలకు చికిత్స

సామాన్యంగా అన్నిగాయాలకు గట్టిగా కట్టుకట్టినయడలరక్తము స్రవించుట ఆగుతుంది గాయాలవద్ద వెండ్రుకలు కత్తిరించితే త్వర గా మానుతుంది. గాయాలకు వెంటనే చికిత్స చేయకపోతే ఈగలు వాలుతాయి, అందువలన ఈపీపట్టుతుంది ఈయీపీ వెంటనే పురుగులు అగుతుంది. గాయములందు పురుగులుపడినచో అచ్చటిమాంసము ను అవితినుటచే గాయములు త్వరగా మానవు కాబట్టి పురుగులుపడి నయెడల ఈ చింతామణిలో చూపించినపట్కారుతోగాని శ్రావణము తోగాని తీసివేయాలి.

లేక చేతి చూపుడువేలును గాయములోపలకు పోనిచ్చి పురుగులన్నింటినీ తీసి తదుపరి పుండ్లకువాడు మందులను వాడాలి

## చికిత్స

మంచినూనె 15తులాలు వేపనూనె 8తులాలు, గాడిదగడపాకు పసరు అర్ధశేరునవటాకు, సీమగుగ్గిలము 4తులాలు, ముర్దారుసింగు 2 తులాలు, ఏకపుల్లిపాయలు అర్ధశేరునవటాకు తెచ్చిఈమూడువస్తువులు నూరి పైమూడింటితోకలిపి కాచి గాయములకు పట్టించాలి. ముందు గాయమును తుమ్మచెక్క రావిచెక్క లేక చింతాకు వేపాకువేసి కాచిననీటితో కడిగి తరువాత మందుల నుపయోగించాలి,

లేక కుప్పింటచెట్టు సమూల చూర్ణముతో తగినంత విభూతి కలిపి వేసినగాయాలు మానుతాయి.

లేక నలిగినగాయాలకు నరమూత్రము వాడిన పనిచేస్తుంది

లేక మునగాకు, వసనూరి ఉడికించి వేసిన తగ్గుతుంది.

హీలాన్ లేక కార్నెక్సునుగాని వాడుడు

## గాయముల కడుగు లోషన్సు

ఫినైయిల్ 1 భాగము, నీరు 100 భాగాలు

లేక పొటాషియం పర్మాంగనేట్ 10 గ్రెయిన్సు. నీరు 2 శేర్లు.

పైనచెప్పిన లోషన్సు తయారుచేసి సినాకొవుంచి బిరడాలుపెట్టి అవసరమున్నపుడు ఉపయోగించాలి. రావిచెక్క, తుమ్మచెక్క, నీటిలో నానవేసి కాచి ఉపయోగించవచ్చును అవుసరమున్నపుడు మాత్రమే తయారుచేసికోవాలి. నిలువయున్న చెడుతుంది

పుండ్లకు చెర్నారి, వెటరినరీ ప్లాష్టరును వాడుడు.

## వ్రణాలు

ఇదివరకుచెప్పిన గాయాలకు తగినచికిత్సలు చేయకపోవుటచే సూక్ష్మజీవులు ప్రవేశించి పుండుపడుతుంది. జాగ్రత్తగా కాపాడాలి ఇంకనుఈగలుదోమలు మొదలగు వివపుండ్లమీదవాలిగుడ్లుపెట్టుతాయి గాలిసోకుటవల్ల ఆగ్రుడ్లనుండి తెల్లనిదారములవంటి పురుగులుబయలు దేరుతాయి, గాయాలలో పురుగులుపడిన పశువుపనిచేయుటకు పనికి రాదు కాబట్టి ప్రతిరైతు తగినశ్రద్ధ తీసికోవాలి. అచ్చటమాంసము కుళ్ళి ఆభాగమంతా వాచిఅపాయము కలుగుతుంది. దుర్వాయువులు చేరుటచే చెడుఆహారాలు మేపుటచే, అతివేడి యుండుటవే ధాతుశక్తి తగినంత లేకపోవుటచే కురుపులు,గడ్డలు మొదలగునవి యేర్పడుతాయి మరికొన్ని కురుపులు క్రమంగా పెద్దవై అంచుయేర్పడి మిక్కిలిఎట్టగా వుండి రసికారతాయి. ఈరసికొన్నిటికి దుర్వాసనగా మరికొన్నిటికి లేకుండావుంటుంది. బలహీనమగు పశువులకు ఇవితరచుగా లేచి బాధ

పెట్టుతాయి. సామాన్యంగా కురుపులన్నీ ఒంటరిగా గాని, అనేకంగా గాగాని లేచుటకలదు. ఇవిబటానిగింజలంత పరిమాణము మొదలుకోడి గుడ్డు ఆకారము వరకూ అంతకంటె అధికముగాకూడ వుండ వచ్చును. కొన్నిచీము రక్తము చేరకయే అంతరించిపోతాయి.

## వ్రణాలు-గాయాల నిర్ధారణ

పలువిధములగు తృణములు, కట్టెలు.రాళ్ళు, ధూళి. ఇనుప మేకులు, మట్టిగడ్డలు, ఎముకలు, గోళ్ళు, చీము,వగైరా వ్రణములనుండి తీయుట గర్భమనెడి శల్యమును బయటకు తీయుట, యంత్రి. శస్త్ర, క్షార అగ్నులను వుపయోగించుట వ్రణముల నిర్ధారణచేయుట శల్యతంత్ర లక్షణమంటారు.

శరీరభాగమందు ఏఅవయవంలోపోటు, స్పర్శ తెలియకుండుట, భారముగావుండుట మాటిమాటికి కదిలించుట, స్రవించుట, పోటు ఎక్కువగానుండుట, మున్నగు లక్షణాలువుంటే అచ్చటచ్చట శల్యములు (పైవస్తువులు) వున్నవని గ్రహించాలి

ఎముక సంబంధమగు వస్తువులు శరీరములోవుంటే వెలుపల్కి తీసినచో రెండుమూడు ముక్కలగుతాయి. ఇంకనుఅవిజీర్ణించుతాయి. కొమ్ము ఇనుముసంబంధమగు శల్యములువున్న జీర్ణించక వంకరతిర్గి చీముపట్టి కంతిగానగుతాయి. ఇత్తడి సీసముమున్నగునవి తీసివేయక శరీరములో వుంటే పిత్తాగ్నులచేకరిగిపోతాయి. కర్ర, వెదురు, తృణములు మున్నగునవి శరీరములోవుంటేచీముపట్టి పగిలిబయటకువచ్చుతాయి

కంతినిగాని, వ్రణమునుగాని శస్త్రముచేసినతరువాత గాయములో చీమున్నపుడుతొందరపడిగాయమును మాన్పరాదు.ఆగాయము స్వల్పముగవుంటే లోపలగడ్డకట్టి మరలబాధించుతుంది. గాయమును చీల్చినతరువాత చీముసరిగా కారనిచ్చి తనస్వంత బుద్ధితో విశాల

మనస్సుతో ఆలోచించిపభాగమందు చీముకారుచున్నదో ఎచ్చటెచ్చట నొక్కిన గుంటలుపడునో అచ్చటనుంచి చీమును తీయుటకు మరియొక రంధ్రము వేయాలి.

## పిండికట్లు

పశువులకు కలిగే అనేకరోగాలకు పిండికట్లుకట్టుతారు. ఇవికట్టుట వలన మెత్తబడు స్వభావమువుంటుంది పశువులకు కలుగువాపులు నెత్తురుగడ్డలు గూటిగడ్డలు, మొదలగువానికి పిండికట్లు కట్టినచో నొప్పి తగ్గి త్వరలో కురుపుగా తేలుతుంది జొన్నపిండి, వరిపిండి, అవిసెగింజల పిండి గోధుమతవుడు మున్నగువానితో వేడినీళ్ళు జేర్చి పిసికి ముద్దగా జేర్చి పలుచనిగుడ్డలో వేసికట్టుట మంచిది దుర్వాసనవేయు కురుపులకు గాయములకు మసిబొగ్గుపొడి, పిండి కలిపికట్టుటమంచిది. పశువుసహించగలిగినంత వేడిగావుండు పిండిని వాపులమీదగాని తదితరభాగాలమీద గాని వేపపైన ఆకుగాని, దళసరియగు కాగితముగాని పెట్టికంబళి గుడ్డతో కదలకుండునట్లు గట్టిగాకట్టాలి. ప్రతిమూడు నాలుగుగంటలకు తీసివేసి క్రొత్తకట్టుకట్టాలి. క్రొత్తకట్టు సిద్ధమగు వరకు పాతకట్టువిప్ప రాదు. పశువుయొక్క బాధనుబట్టి కట్టుబిగించాలి. అవిసెగింజలు నూరి ఉడికించి కట్టితే వాపుహరించి గడ్డను మెత్తపరచుతుంది. గట్టిగావుండే వ్రణములకు ప్లాస్టరును వాడాలి.

## వత్తులెక్కించుట

పశువులకుకలిగే వ్రణాలు, గడ్డలు, కంతులు మొదలగునవి పగిలి నెమ్మదించకపోతే ఈవత్తులను ఎక్కించుతారు. ఇటువంటిపనులు అనుభవముగలవారిచే చేయించుటమంచిది. బద్దపాటుగల సూదితో పశువుల గాయాలలో దూర్చబడే నునుపైన గుడ్డపీలికలు దారములు మొదలగువానిని వత్తులంటారు. ఈవత్తులెక్కించుటసులభమైనపని. సూదిరంధ్రమునకు దారముగాని, గుడ్డపీలిక, దారమువలె చేసిగాని వుపయోగించాలి. తరువాత చర్మాన్ని కత్తితో చీల్చిఆగాయముద్వారాఎంత

దూరము వత్తి పోతుందో అంతవరకు సూదినిఎక్కించి ఆకొనయందు గూడ చర్మమునుచీల్చి సూదినిలాగి దారమును అచ్చట నెమ్మదిగా నిలుపాలి. ఆదారపుకొనలకు జీలుగబెండు కట్టాలి. లేదాప్రత్యేకముగా ముడులు వేయాలి. వత్తులుఎక్కించుటకుముందు కోతమందునువాడుట మంచిది ఆకోతమందులు పొక్కుమందులు, ఎంతపనిచేయునో ఈవత్తు లెక్కించుటవలనకూడా అంత ప్రయోజనముంటుంది. ప్రతిదినమువత్తి నెమ్మదిగా క్రిందికి జారదీసి పుండును శుభ్రముగా పైచెప్పినలోషన్ను తో కడిగి మరల ఆవత్తిని ఎక్కించుతూవుండాలి. అవుసరముంటే క్రొత్త వత్తి ఎక్కించాలి ఇటువంటిపనులు వ్రణచికిత్సయందు అనుభవముగల వారిచే చేయించాలి గాజుగుడ్డను గాడిదగడపాకు పసరులో తడిపి ఎండించి వత్తులెక్కించుట మంచిది.

## కణితులు

పశువు శరీరమున ఏభాగమందైనా వాపు కలుగవచ్చును. ఈ వాపు పొంగి మెత్తగాగాని, గట్టిగ రాయివలెగాని యుంటుంది. దీనినే కంతియంటారు. ఇది పశువులకు దెబ్బతగులుటవల్ల, చలిగాలి సోకుట వల్ల, బలహీనతవల్ల పల్లిపెసర మున్నగు వాతవస్తువులు మేపుటవల్ల చిరుకప్పలు ఎక్కువగావుండే చెరువులలోని, గుంటలలోని నీరు ఎక్కువగా త్రాగుటవల్ల ఇవి పుట్టుతూవుంటాయి.

కంతియొక్క అడుగుభాగపు చర్మముక్రింద మాంసము మంద గించి క్రమంగా వాచియుంటుంది ఈ కాయలు సొట్టలుపడి బురబుర లాడుతూ నీరుండునట్లు కనబడితే మెత్తని కంతియనీ వ్రేలితో ఆ కాయపై నొక్కితే అణగక బిరుసుగావుంటే గట్టికంతియనీ తెలిసి కోవాలి

ఈ కంతులు ముఖ్యముగా పశువుల మెడమీద ప్రక్కలా అణ్ణుమీదా జెబ్బలమీదా మూత్రకోశభాగములందు లేచుతాయి. జెబ్బలమీదనుగూళ్ళమీదను, లేచుకంతులుత్వరగా మానక పశువును

చాలబాధించుతాయి. కంతి పుట్టగనే రైతులు దానిమీద కాల్చుతారు ఇది చాలపొరబాటు, ఎందుచేతనంటే అచ్చటి మాంసమంతా వేడివల్లగడ్డకట్టిఎన్ని మందులు వేసినా మానదు. ఇంకను అచ్చటి రక్తనాళాలుకూడచెడిపోతాయి. మెత్తని కంతులను శస్త్రము జేసిన యెడల త్వరగా నెమ్మదియగుతాయి.

## పరీక్ష

ఏకంతి ఏకారణమువలన పుట్టిందో, కాల్చుటవలన తగ్గనా? లేక ఏమైనా పొక్కుమందులువేసిన తగ్గనా? లేక యేమైనపసరులు పట్టీలువేసినతగ్గునా మున్నగునవి విచారించి చికిత్స చేయాలి. కొన్ని పశువుల దొడ్లలో అన్ని పశువులకు ఒకేసారి శరీరముపైన కంతులు పుట్టుతాయి. ఇట్టి సమయంలో జాగ్రత్తగా పరీక్షించాలి. చెడునీటిని త్రాగుటవలననా? లేకవరుసగా ఆ దొడ్డిలోనున్న పశువులన్నీ పిల్లి పెసర మున్నగునవి మిక్కుటముగా తినుటవల్లనా రక్తముచెడివచ్చినవా మున్నగు విషయాలు గుర్తించుకొని తరువాత చికిత్సలు చేయాలి నొసటిమీద పుట్టినకంతి వలన పశువు మరణించుతుంది.

## అబ్బు కణతులు

కంతికి ఆరంభములో పశువు మెడమీద గీచుకొనినట్లు అగుతుంది. కాడి రాపిడివలన దుమ్ము చర్మములోనికి పోయి కంతి పుట్టించుతుంది. కనుక పశువుల మూపుమీద గాయమున కుండునట్లు కాడిని రెండుప్రక్కల సమానముగా వుండునట్లు కట్టాలి ఒకవైపున బరువుతక్కువగ మరియొకవైపున బరువు ఎక్కువగా వుంచరాదు, కాడికియున్న మొదలగు పదార్థము లేవీ లేకుండా శుభ్రంగా వుంచాలి. ఎద్దుమూపురముమీద కూడ మలినముండరాదు. ఇట్లుంచినయడల కణుతులు పుట్టుతాయి, కంతిపుట్టితే పశువుచే ఎట్టి పనీ చేయించక వానికి పూర్తిగ విశ్రాంతి ఈయాలి గాయము పూర్తిగా

మానునరకు పనిచేయింపరాదు లేదా కాడికట్టవలసిన అవుసరము లేని పని యేదయిన అనగా కుప్పలు మొదలగు పనులలో పెట్టాలి. కాడి మెడమీాద వున్నంతకాలము పుండ్లు పడుతూనే వుంటాయి. ఈ కంతులు ముదిరినయెడల చాల ప్రమాదము కలిగించుతాయి. తుదకు కంతి యంతా మాదగా నగుతుంది. అప్పుడు శస్త్రము చేసినా లాభము లేదు కాబట్టి అట్టికణతులను జాగ్రత్తగా చూచుచుండాలి

## గంటిఅఱ్ఱు

గిత్తలను కొత్తగా కాడివేసి పనిచేయునపుడు పైరీతిగా అఱ్ఱమీాద కంతిపుట్టి రేగుతుంది. వెంటనే శస్త్రముచేయించుట మంచిది.



మెడమీాద కాడినిల్పు ప్రదేశమున మంట, నొప్పితో గూడిన దద్దుర్లవల్ల అక్కడవుండే వెంట్రుకలురాలిపోవుటవల్ల ఈజబ్బుప్రారంభమైనదని తెలిసికోవాలి. అప్పుడుజంతువుతో పనిచేయించరాదు. పుండుపడిన పిమ్మట పశువుతో పనిచేయించినయెడల ఆపుండువాచి పెద్దదై యెక్కువబాధపెట్టుతుంది. క్రొత్తగాకలిపినదూడలకు ఈకంతులెక్కువగా పుట్టుతుంటాయి కొన్నిటికి కంతిపుట్టకుండగనే అఱ్ఱభాగము వాచి చర్మము చిట్లిమంటపుట్టుతుంది మరికొన్నిటికి చిన్నచిన్నకాయలవలె పుట్టి కాడితగిలినపుడెల్ల పశువు బాధకోర్వజాలక యుంటుంది. సామాన్యంగా గంటిఅఱ్ఱుమానుటకష్టము. శస్త్రము చేయవలసియుంటుంది.

# కణతులకు దారపుకట్టు

చిన్న చిన్న కణతులు పుట్టినపుడు అనగా వెలగ కాయంత, నారింజకాయంత పరిమాణముగా నున్నపుడు పట్టు, పురికొస, నూలు మున్నగువానితో జేయబడిన దారాలతో ఆకంతుల మొదటిభాగానికి గట్టిగా చుట్టితే సునాయాసముగా తగ్గుతుంది. ఇట్లు కట్టితే కంతిలో వుండే రక్తనాడులు బంధించుతాయి. అందువల్ల కంతి పరిమాణము తగ్గి క్రిమేపి నెమ్మదించుతుంది. ఇంకను రక్తనాడులను బంధిచుటకు విషపురుగులు కరచిన భాగములచుట్టు కట్టివేయుటకు ఈదారములు మిగుల లాభకరములు

## చికిత్స

గట్టిగావుండి చాలాకాలము వరకు వుండే కంతులను తప్పక తీసివేయాలి అట్లుచేయుటకు వీలుకానిచో పొక్కు (కోత) మందులు గాని,పగులురాళ్ళుఅంటించిగాని,కారపు(మంట)మందులుదద్దించుటచే గానినెమ్మదికావచ్చును. మరికొందరుకంతిచుట్టుగట్టిదారము చుట్టిముడి వేసివదలిపెట్టుతారు కొన్నాళ్ళకుఆకంతి తెగిపోతుంది.ఈకంతులనుశస్త్ర ముచేయవలసినపుడుదాని సమీపానవున్న రక్తనాళాలదగ్గరగాశస్త్రచికి త్సచేయుటకంటెమరియొకవిధంగా చికిత్సచేయుటమంచిది.కొందరుపశు వైద్యులు కణతులను చీల్చి ఎర్రికడ్డీనికాల్చి లోపలికి పొడుస్తారు ఇది చాల అపాయము. వెంటనేపశువు చనిపోతుంది శాస్త్రసమ్మతమగు వైద్యునిచేతనే శస్త్రముచేయించాలి

* *
*

# ముప్పది మూడవ భాగము

## విరుగుట - తొలగుట

## ఎముక విరిగినట్లు కనిపెట్టుట

ఎముక విరిగినభాగము బాధ, పోటుకలిగి హాని పొందిన అవయవాలు వంకరగ వుంటాయి

దెబ్బతగిలిన భాగములు పని చేయుటకు శక్తి లేక యుంటాయి. ఒకప్పుడు వాచియుంటుంది.

విరిగిన భాగమును కదల్చుటకుగాని, ఏపనికైన ఉపయోగించుటకుగాని స్వేచ్ఛగా వదలివేయుటకు గాని వీలుండదు.

ఎముకవిరిగిన భాగానికి దేహము అవతల ప్రక్కనవుండు అదే విధమైన భాగానికి ఆకారంలో వ్యత్యాస ముంటుంది.

ఏ అవయవమువిరుగుతుందో దాని ఆకారము, కోమలత్వము అందము చెడిపోయి వికృతరూపము కలుగుతుంది అది కుడిభాగమైతే ఎడమ భాగముతోనూ ఎడమభాగమైతే కుడిభాగముతోనూ సరిపోల్చి చూచి పొట్టి పొడుగు, లావు, సన్నము మొదలగు భేదములు కనిపెట్ట వచ్చును.

సామాన్యంగా చేతితో తట్టిఎముకలు కనిపెట్టవచ్చును. అప్పుడు పశువు చాల బాధపడుచు ముట్టుకొననీయదు

విరిగిన ఎముక యొక్క గరుకైన మొనలు రెండు ఒకటితో నొకటి రాచుకొనుటచేత కరకరమను శబ్దముకలుగుతుంది. అయితే

ప్రథమ చికిత్స చేయు వారు ఇట్టి శబ్ధముందో లేదో తెలిసి కొనుటకై ఎముకలను రాపిడి కలిగింప ఎన్నడూ ప్రయత్నించరాదు.

ఎముకవిరిగినదీ లేనిదీ వాస్తవముగా తెలిసికొన వలసివస్తె విరిగిన యెముకయొక్క వాడి మొనలు వాటి చుట్టవుండే కండరాలలోను చర్మమందు గ్రుచ్చుకొనకుండునట్లు మిగుల జాగ్రత్తతో మెలకువతో పరీక్షించాలి. ఎముకలను సరిచేసి కట్టు కట్టుటలో నాటు వైద్యులలో కొందరు తెలివిగల వారున్నారు.

## విరిగిన ఎముకల గాయములకు చికిత్స

విరిగినయెముక ఏరీతిగా అతుకుకొంటుందో దానిని ఆరంభములో తెలిసికోవాలి. విరిగిన కొనల యందు ఎముకతో సంబంధించిన ఒక క్రొత్తపదార్థము ఏర్పడి ఆకొనలు ఒకటితో నొకటి అతుకుకొనివుంటాయి. ఈ క్రొత్త పదార్థము మొదట మృదువుగా వుండి ఒక నెల లేక రెండు నెలలలోపుగా క్రమ క్రమంగా గట్టిపడి ఎముకగా మారి పోతుంది. ఈ కాలమందు విరిగిన యెముక యొక్క మొనలను అవి యుండ వలసిన చోట ఉంచి ఏమాత్రము కదలకుండ కట్టుకట్టితే ఎముక అతుకు కొని పోతుంది. కాబట్టి ఎముక విరిగినగాయాలకు చికిత్స చేయు నప్పుడు గాయము తగిలిన భాగాన్ని కొంచెము లాగి విరిగిన కొనలను అవి యుండవలసిన రీతిగా జేర్చి అవి అతుకుకొనువరకు అవియే మాత్రము విడిపోకుండా చూడాలి. అవసరనాలు విరిగిన పశువులను మంచములో వేసి కట్టి వ్రేలాడ దీయరాదు.

## పుఱ్ఱెఎముక విరుగుట

తల పుఱ్ఱె ఎముకలు విరిగినపుడు ఒకచోటవిరిగిందీ, ఎక్కువ చోట్లవిరిగిందీ, ఎముక మాత్రమే విరిగిందీ, లేక రక్త నాళము లకు భంగము కలిగిందీ మొదలగు విషయాలను, చేతితో తాకి కనుగొన వచ్చును. ఈ యెముక విరిగిన పశువుతో పనిచేయించరాదు. డాక్టరును

పిలిపించి తగిన చికిత్స చేయించాలి డాక్టరు వచ్చులోపల గాయము నుండి వచ్చురక్తమును ఆపు చేయుటకు ప్రయత్నించాలి. చల్లని నీటిని గాయము మీద పోస్తూవుండాలి

## క్రిందిదౌడ విరుగుట

క్రిందిదౌడ విరిగినప్పుడు పశువునోరు తెరువలేదు, అరవలేదు. రక్తముగాని, చొంగగాని రెండును కలిపి గాని నోటి నుండి బయలు వెడలుతాయి. పశువు చాల బాధపడుతూ దీనంగా మనుష్యుల వంక చూస్తూవుంటుంది. పుర్రె ఎముకవిరిగిన పైమాదిరిగనేదీనికికూడచికిత్స చేయవచ్చును. డాక్టరును రప్పించి దౌడను యథాస్థానమునకు తెచ్చుటకు ప్రయత్నించాలి. అటుతరువాత కట్టుకట్టి పశువు గడ్డము యొక్క అడుగునుండి కొమ్ముపైగాముడివేయాలి కట్టుగడ్డ పొడవుగావుంటే మరల తలకుకట్టి ముడి వేయాలి.

## ప్రక్క యెముకలు విరుగుట

పశువురొమ్మునకు వెన్నెముకకు మధ్య సాధారణంగా ప్రక్క ఎముకలువిరుగుతాయి. పశువులను ఈయెముకలమీద దెబ్బలుకొట్టుటచే ఎక్కువగా విరుగుతాయి. అట్టివేళయందు పశువు ఊపిరి పీల్చునపుడు హృదయభాగము బాధగా వుంటుంది అట్టిసమయములో బాధగావుంటే తగుచికిత్స చేయాలి. ఇంకా ఈ ఎముకలు విరుగుట వల్ల కార్జమునకు వూపిరితిత్తులకు బాధ కలుగుతుంది.

ఎముకలను స్వస్థానములోనికి చేర్చి కట్టుకట్టాలి. ఇక్కడ కట్టు ఆగుటచాలాకష్టము. కనుక పశువు ఎముకలచుట్టును కట్టాలి.

## కాలు విరుగుట

పశువు మోకాలు క్రిందిభాగంలో ఏదైన విరిగితే మొదటవాపు కలుగుతుంది ఎక్కువగా విరిగితే ఎముకలు చర్మాన్ని చీల్చుకొని వెలుపలికి వస్తాయి ఇట్టి సమయంలో ఎముకలను స్వస్థానమునకుచేర్చి

కట్టుకట్టాలి. పశువులకు తొడ యెముకలు విరిగితే కట్టుకట్టుట చాల కష్టము. అచ్చట కట్టునిలువదు గాన యిదివరకు చెప్పిన బద్దలు వేసి కట్టుకట్టాలి

## చికిత్స

పశువు శరీరములో ఏభాగము విరిగినా యీదిగువ చికిత్సలు చేయవచ్చును. విరిగిన వెంటనే చింతగింజల బెందడురుబ్బి జిగురు వచ్చునట్లు వుడకబెట్టి ఒక ముతకగుడ్డను పట్టీగా చింపి జిగురు బాగుగా రాచి ముందువిరిగిన భాగమును స్వస్థానములోచేర్చి పైన ఆ పట్టీ గుడ్డను వేసి దానిమీద మరియొక పొడగుడ్డను వేసి సన్నగా చెక్కిన బద్దలనుగానియిదివరకు చెప్పిన అట్టముక్కలనుగాని పైనవేసికట్టినచో త్వరగా ఎముకలు కట్టుకుంటాయి. బాధ నొప్పు తగ్గుతుంది. కట్టు కట్టునప్పుడు బాధనొందే భాగానికి ఆధారంగా దానిని కదలకుండునట్లు చేయుటకు ఈకట్టు వుపయోగపడుతుంది ఈ కట్టు 15-25 దినముల వరకు వుంచాలి. తరువాత కట్టుపైనవున్న బద్దలు తీసివేసితే నొప్పి క్రమముగా తగ్గుతుంది. ప్రత్యవైద్యుపితో వెంట వెంటనే కట్టునూడ దీయించరాదు అట్లుతీసిన ఎముకకూడుకొనదు.

విరిగినయెముకలను స్వస్థానమునచేర్చి నాలుగైదంగుళముల వెడల్పుగల ముతకగుడ్డకు కుమ్మరిమట్టినిపూసి విరిగినంతవరకుచుట్టాలి. కట్టు 30 దినాలవరకుగాని, అంతకుపైగాగాని, ఈవిధంగానే యుం చాలి. పశువునకు మేతఎక్కువగా వేయరాదు. మఱ్ఱియూడల కొసలు పిడికెడునూరి అర్ధశేరు ఆవుపాలతో కలిపి దినమునకు రెండు సారుల వంతున వారముదినాలు త్రాగించాలి ఇట్లు చేసినచో ఎముకలు త్వరగా కట్టుకొంటాయి.

కొందరు వైద్యులు పేడ, వెన్నపూస గుడ్డకురాసి కట్టు కట్టి తారు కాని దీనివల్ల ఎంతమాత్రము ప్రయోజనము లేదు. ఉత్తరేణి ఆకునూరి కట్టుకట్టి పక్షవ దినములు వుంచాలి ఇంకను వెటరినరీ ప్లాష్టరును గుడ్డకురాచి కట్టవచ్చును.

# విరిగిన ఎముకభాగములకు సాధారణ చికిత్సలు

ఎముకలు విరిగినప్పుడు గాయమునుండి రక్తము కారుచున్నదీ లేనిదీ పరీక్షించాలి ఆగాయము శుభ్రముగావున్నదీ మురికిగానున్నదీ పరీక్షించాలి రక్తముకారుతూవుంటే గాయంలో వాయువునందుండే సూక్ష్మజీవులు ప్రవేశింపకుండుటకు గాయాలను దూదితో గాని లింటుతో గాని, పీచుతో గాని కట్టుకట్టాలి రక్తము నాపుటకవసరమైన యెడల కట్టునుబిగించుటకు టూర్నిక్వెఉపయోగించాలి.టూర్నిక్వె అనగా జానెడుపొడవుగల చేతికఱ్ఱముక్క ఒకదానిని దెచ్చి కట్టుకూచర్మానికి మధ్య దానికొనలలోఒకదానినిదూర్చి గిరగిర మెలికలుతిప్పాలి. అట్లు తిప్పినందువల్లకట్టుబిగిసి ధమనులకు తగిలినగాయాలగుండాప్రవహించేరక్తముఆగిపోతుంది,ఎముకలుచర్మముక్రింద వుండుటవల్ల కంటికగపడవు అవి విరిగినట్లు కంట్టితో చూడలేము. కాని గుర్తులవలన ఎముకలువిరిగినటుల తెలిసికొనవచ్చును. గాయము మురికిగావుంటే లోషన్‌తో కడిగి శుభ్రముచేయుట మంచిది. ఇట్లుచేయుటచే సూక్ష్మజీవులు చేరజాలవు. తొడ, మోకాలు జెబ్బభాగములందు విరిగిన ఎముకలు కట్టుకొనుట చాలాకష్టముగాన చివరకు రాక్షసవైద్యము చేసినా తగ్గుతుంది.

## కట్టు బద్దలు

కట్టుకట్టునపుడు బాధనొందిన భాగమునకు ఆధారము కలిగించుటకు దానిని కదలకుండునట్లు చేయుటకు కట్టుబద్దలు ఉపయోగపడతాయి. కఱ్ఱబద్దలు లేక సన్నని వెదురుచువ్వలు మొదలగువానిని కట్టుబద్దలంటారు ఒకప్పుడివి దొరకనిచో కాగితపు అట్టలు వెదురుబద్దలు తదితర చెట్లయొక్క బద్దలు ఉపయోగించవచ్చును. వీటిని కట్టుతో చేర్చినపుడు ఒత్తుడు విస్తారముగా నుండరాదు. అపాయము కలిగిన భాగముయొక్క కీలు దాటియుండునట్లు వీటినిచేర్చి కట్టుకట్టాలి లేనిచో జాయింటుకీలుతప్పి గాయమునకు కదలికలు గలిగించి బాధను కలుగజేస్తాయి.

పశువును కదలనీయరాదు. అట్లు కదలుట వలన ఎముకలు కదలి ప్రమాదము సంభవించుతుంది కట్టుబద్దలు రెండంగుళముల వెడల్పుగల ముక్కలుగా జేసి జంతువు అవయవమునకు తగినవిగా వుండాలి ఎముక పగిలినచోట ఆరంగుళముల నుంచి అరంగుళము క్రిందికి వచ్చునట్టి పొడుగుగల బద్దలు నునుపుగా చెక్కి చీల్చాలి. బద్దలు వేసి కట్టుటకు పూర్వమువిరిగిన భాగమునకు గుడ్డలు చుట్టాలి లేనిచో చర్మమునకు చెరుపు గలుగుతుంది లేదా బద్దలు చర్మమును చీల్చుతాయి. ఒకనారి బద్దలువేసి కట్టిన తరువాత అయిదు ఆరు వారముల వరకు కట్టువిప్పరాదు ఎముక విరిగి పోదుచుకొనివచ్చినపుడుకట్టును ప్రతివారమును తీసి మరల క్రొత్తకట్టుకట్టుచుండాలి లేనిచో అచ్చట కుళ్ళి పశువునకు అపాయము సంభవించు తుంది. విరిగినఎముకలు కలసికొనక అచ్చట చీము పట్టినయెడలకత్తితో చీల్చి యెముకముక్కలను చీమును తీసివేసి దానినిగాయముగా నెంచి అందుకుతగిన చికిత్స చేయాలి పెద్దజంతువుకాళ్ళు విరిగినచో చికిత్స వలన నెంతమాత్రము ప్రయోజన ముండదు.

## ఎముకలు సాధారణముగా తొలగుట

కీలువద్దఎముకలు అమర్చబడియుండి గూటినుండి అదిబయటకు త్రోయబడుటయే ఎముక తొలగుట యంటారు. ఎముక తొలగి పోయినభాగము వాచి నొప్పికలుగ చేస్తుంది. తొలగిపోయిన భాగము అందవికారంగా వుంటుంది. కీలువద్ద ఎముక తొలగిపోవునేగాని రెండు కీళ్ళ నడుమ వుండే ఎముక తొలగిపోయినచో పశువు నడునజాలక డెక్క చివరనే నేలమీద జార లాగుతూ తిరుగుతూ వుంటుంది. ఎముక విరుగుటయు, విరిగిన మొనలు గరుకుగా వుండి ఒరసి కొనుటయు వుండదు. కరకరమను శబ్దముండదు. కీళ్ళయందుతప్ప, తదితర చోటుల చలనముండదు. ఎముక తొలగిపోయిన కీలు కదల స్థిరముగ వుంటుంది.

## చికిత్స

స్థానభ్రంశమునొందిన యెముకను స్వస్థానమునకు త్రోయాలి. తరువాత దానిపైన మంటమందువేసి పశువును ఒకచోట కదలనీయ కుండా యుంచాలి. తొలగిన ఎముకను లాగి వడగట్టిన పెరుగునుద్ద మినుపసున్న, ఆముదపు పప్పు, గుంటకరాకు సమభాగములుతో కలిపి తొలగిన భాగమునకుపూయాలి. పశువును అంతగామేపరాదు ఎక్కు వగా మేపితే పశువు జీర్ణకోశములు చెడిపోతుంది ఇట్లే పశువు నెల నుంచి మూడుమాసాలవరకు బాధపడుతుంది. కొన్ని కుంటివి యగు తాయి

అవసరమున్నప్పుడు రక్షకూడ వేయాలి నొప్పితగ్గుటకు తంగెడు పాకు నూరి కట్టాలి. కోడిగుడ్డు తెలుపుసొన 6 తు, తేనె 10 తు.గుల్ల సున్నం 6 తులాలు కలిపి తొలిగిన భాగమునకు పట్టువేసిన తగ్గుతుంది

## ఎముకలు గూళ్ళనుండిజారుట

ఎముకలు గూళ్ళనుండి తొలిగి నప్పుడు గూళ్ళ యందు బాధ యుండి వాపుకనిపించుతుంది. ఆభాగమును కదల్చుటకు వీలుండదు. ఆభాగమువిూద బరువుఆనుటకు వీలుండదు. ఆభాగముతో నేవిధమైన పనులను పశువు చేయజాలదు అట్టి భాగమును మనముచేతితో నెంత మెల్లగా తాకినను నొప్పి కలుగుతుంది. ఆభాగము యొక్క ఆకారము వంకరతిరుగుటయో, పొట్టిగా నుండుటయో తటస్థించుతుంది ఒకప్పుడు కాళ్ళు బిఱ్ఱబిగిసి కదలుటకు వీలుండనప్పుడు ఎముకలుగూళ్ళనుండి. తొలగినవని గ్రహించాలి. సాధారణంగాపశువు మోకాలు చీలమండ,తొడ జబ్బమొదలుగు భాగాలయందలి ఎముకకీలు గూటినుండి తొలగుతాయి. వీటిలోభుజాస్థియొక్క తలపెద్దదిగానుఅది ప్రవేశించు గూడుచిన్నదిగాను వుండుటనుబట్టి తరచుగా గూటినుండి తొలగుతాయి. ఇట్టిబాధను పైవాటికి తరచుగా కలుగుతాయి.

ఎముకలు గూటినుండి తొలగినవో లేక అంతలే విరిగినవో తెలిసికొనుట కష్టము. కాబట్టి డాక్టరుకుగాని మిక్కిలి అనుభవముగల మీగ్రామ వైద్యునకుగాని చూపించాలి.

## జెబ్బకుడకజారుట

దీనినే యిండెజారుట అంటారు. పల్లెలయందుండు పశువులకీ ప్రమాదము సామాన్యంగా తటస్థించుతుంది. ఎత్తుస్థలాలనుండి పల్లానికి దూకుటవలన తప్పటడుగు వేయుటవలన, కాలుజారుటవలన యివి తటస్థించుతాయి. కుడక జారినకాలు పైన భారమేమియు మోపజాలదు. కనుక మూడుకాళ్ళతో నడుచుతుంది. జారినట్టి కీలును పట్టిచూచితే ఎముక యొక్క చివరిభాగము మామూలుస్థలమునుంచి వెలుపలికివచ్చి చేతికి గట్టిగా తగిలి గుంటపడుతుంది. ఈస్థితి వెంటనే తెలుసుకొని కీలుసరి చేసినచో అట్టి అవయవము బాగుపడుట కెక్కువ అవకాశములగవ లేనిచో మంచిప్రక్కచుపడదోసి జబ్బకాలునకు చినమణుకునకును మీదుగ త్రాడుగట్టి యొకరు దానిని ముందుకు నెమ్మదిగా బలముతో లాగుచుండగా పైకివచ్చినయెముక కొనను సాధకుడు తనయరచేతితో మామూలుస్థలములోనికి తోయుటకు ప్రయత్నించాలి. ఇట్లుతోసిన టక్కుమని యెముక లోనికిపోతుంది పిమ్మట కుంటుచిహ్నాలు పోయే వరకు జంతువును నెమ్మదిగా వుంచాలి. ఈమాదిరిగనే పశువుల కాలు విరిగినపుడుకూడ స్వస్థానమునకు చేర్చికట్టుకట్టవచ్చును జెబ్బఎముక జారినపుడు 24గంటలలో త్రోసికట్టనిచో రక్తముగడ్డకట్టి కాలురాదు వెంట[illegible] సక్రమాకారముగా రక్షచేయాలి.

## కాలు రెల్లుపోవుట

బండి యెద్దులను సవారి బండ్లకుకట్టి వివాహాములకు తదితర గ్రామాదులకు ఎక్కువగా స్వారి చేయించినపుడు గాని రోడ్లమీద ఎక్కువగా స్వారి చేయించునప్పుడు కాలిగుత్తి మెలికపడినప్పుడు ఈ

ప్రమాదము సంభవిస్తుంది. పశువు పరుగెత్తునప్పుడు నాలుగు పాదాలను ఒకేసారి భూమిని విడుచుతుంది ప్రతి అడుగునందును, కాలుడెక్కలు మాత్రమే భూమిని తాకుతాయి మరియు ప్రతి అడుగునకు పిమ్మట మోకాళ్ళుతిన్నగా వుండవు. పరుగెత్తుటలో వెనుక పాదాలు భూమిని విడుచునప్పుడు అకస్మాత్తుగా మోకాళ్ళు తిన్నగవుతాయి చీలమండలు కీలుసాగి బలముతో కాలిడెక్కలగుండా తోప్రుడునిచ్చి దేహమును పైకి ముందుకు త్రోస్తూవుంటుంది. పాదములయొక్క గిట్టలు భూమిమీద పడుతాయి. అట్లుపడకముందే తిన్నగా నున్న యీ వెనుకటి మోకాళ్ళు బాగుగా వంగి దాని పాదములు భూమిని విడచి కొంతదూరము వస్తాయి. పైకెత్తబడిన వెనుకకాళ్ళు నడకలో నున్నట్లు దానంతటదియే యీగక అందలి కండరములచేత బలముతో ముందునకు లాగబడు తుంది అడుగుల త్వరతమునుబట్టి యీచలనము జరుగుతుంది భూమిని విడువబోవునపుడు వెనుకటిమోకాలు తిన్ననై అతి తొందరగా లాగుకొనుట వలన ఒకవిధమైన జంటకాళ్ళతో దుముకుటయే జరుగుతుంది. దీనికే పరుగెత్తుటయంటాము ఇటువంటి సమయములలో పశువుకాలు రెల్లపోతుంది అనగా పశువుడెక్కనుండి జబ్బకుపోవు నరము చెదురుతుంది. పశువు రెల్లపోయినకాలును భూమిమీదఆనించ లేక చాలబాధపడుతుంది పశువుమిగుల దీనముగా వుంటుంది. రెల్ల పోయిన భాగమువాచి వేడిగావుంటుంది. మనముచేతితో తాకినగిలగిల తన్నుకొంటుంది. బాధచేపండ్లుకొరుకుతుంది. పశువులకు జ్వరముకూడ యుంటుంది.

## చికిత్స

రెల్లపోయిన భాగమునకు రెండుబిందెల చన్నీళ్ళుమీదపోయుట మంచిది. రెండుకుండపెంకులు తీసికొనిపశువు డెక్కనునొక్కి నొప్పిగల భాగమందు పెంకులువేసి గుడ్డకిరుప్రక్కల ఒకతాసతో బిగించి ఒక బిందెడు చన్నీళ్ళుతీసికొని ధారగాపోయాలి. ఇట్లునొప్పితగ్గువరకుపోస్తూ వుంటే నెమ్మదియగుతుంది. రెల్లపోయిన భాగమునకుతవుడు వేయించి

కాపులు వేయుట మంచిది. ఇట్టిపశువులకు 15నుంచి 60దినములవరకు చికిత్స చేయవలసియుంటుంది. ఫార్మసీవారి స్ప్రియిన్ కిల్లర్ వాతారి అరఖు చక్కగాపనిచేయును.

లేక వస1తు, వాము2తు, పసుపు1తు కలిపినూరి నూనెలో ఉడికించి రెల్లపోయిన భాగమంతు మర్ధనచేయాలి.

లేక సున్నములో చింతపండుకలిపి పట్టువేయును.

లేక సారాయిలో కోడిగుడ్డు తెల్లసొనకలిపి పట్టు వేయాలి.

లేక మునగాకు 2గుప్పెళ్ళు వస1తు, వాము1తు. నూనెలో కలిపి ఉడికించి రెండు కట్లుకట్టాలి.

## చెమటగుల్ల

పశువులు తిరుగుచున్నపుడు వానికాలిగిటలపై అప్పుడప్పుడు మన్ను పేరుకొంటుంది. దానిని పరిశుభ్రముగా చేయనియెడల అచ్చటవాచి వేడిగావుంటుంది. ఊటభూములందు, రాతినేలలందు అరణ్యములందు బీడుభూములందు తిరుగుపశువులకు తరచుగా ఈగుల్లలు లేచుతాయి ముఖ్యంగా ఇవి వెనుక కాళ్ళకు వచ్చుతాయి. కాలు కుంటెన వెంటనే తగు చికిత్సచేయనిచో ఆభాగము చీముపట్టి బాధపెట్టుతాయి. కాలుభూమి మీంద ఆనించలేదు మేత నీరు మాని విచారముగా వుంటుంది. ఇంకను అశ్రద్ధచేసిన యెడలపశువు కృశించి మరణమునకు సిద్ధమగుతుంది.

## చికిత్స

గుల్ల పెద్దదిగావుండి మెత్తబడినయెడన శస్త్రము చేసి లోపను నీటితో కడిగి మందును వాడాలి. తరువాత ఆగాయముపైన ఒకదట్టమైన గుడ్డవేసి జెముడుచెక్క ఆవాలు వాముసమభాగములుగా చేర్చి నలగదొక్కి వెచ్చజేసి కాయాలి. ఈరీతిగా నాలుగు దినములు చేయును.

లేక ఆముదపుపత్తి వేసి పొడిసున్నము అద్దికట్టాలి.

లేక ముంగ్లతోటకూర వెచ్చనిచె ఉదయ సాయంకాలము లందు పెట్టాలి.

లేకఫార్మసీవారి హిలాన్‌ను వాడుడు.

## బెణుకులు

పశువుకాలియొక్క ప్రతికీలు రెండుగాని, అంతకుపైనగాని, యెముకలతో కూడినారవంటి తాళ్ళతో కట్టబడియుంటాయి. ఈ తాళ్ళనే లిగమెంట్సు అంటారు. ఈ తాళ్ళుకీళ్ళను తొలగనీయకుండబంధించి యుంటాయి. పశువుకాలుజారిన తప్పుటడుగులు వేసిన అధిక వేగముగా పరిగెత్తిన అధికమైన బరువులులాగిన ఈ లిగమెంట్సు (పట్టుదునరములు) కొలదిగనో గొప్పగనో విస్తరించి సాగినయెడల బెణుకుటయంటారు. బెణికిన కొంచెము సేపటికి ఆభాగము వాచి చల్లబడుతుంది పైచర్మము గలపని చో మొదటనే రంగుమారినట్లు కనబడుతుంది రెండుమూడు దినములైనతరువాత చుట్టునుండు చర్మమునలుపుగానైనఎరుపుగానైన కొంచెము పసుపువర్ణముగానైనఉంటుంది. బెణికినచోట నుండురక్తము అటునిటు చెదరుతుంది.

# ముప్పదినాల్గవ భాగము

## బెణుకులు — వేరొల్లు

కుంటుట బెణుకుట

## కుంటుట

ఆరోగ్యమైన స్థతిలోఉండే పశువును నడిపిస్తే అదిస్తిమితముగా నడుస్తుంది అన్ని కాళ్ళమీదను బరువు వేస్తుంది.

నొప్పికలిగినప్పుడు నొప్పికలిగిన కాలిమీదనో కాళ్ళమీదనో తక్కువ బరువు వేస్తుంది. నిలిచినప్పుడు అంతే. పరుగెత్తినప్పుడు అంతే అప్పుడు పశువు కుంటడము మనకు కనిపిస్తుంది.

అప్పుడు ముఖ్యముగా మనముచేయవలసినదేమంటే, పశువుకు పూర్తిగా విశ్రాంతి యివ్వాలి, అంటే వాటినికట్టివేసి వాని ఇష్ట ప్రకారం పూర్తిగా పడుకోనిచ్చి దానికి ఆహారము పెట్టుతూ ఉండాలి.

కుంటు కనిపెట్టడానికి చికిత్స చేయడానికి ముందు పశువు నిలిచివున్నప్పుడే పరిశీలించాలి ఏకాలిలో నొప్పియుంటే ఆకాలినే ముందుకుచాపుతుంది. నొప్పిచాలతీక్ష్ణముగా ఉంటే అసలు ఆకాలిని భూమిమీద మోపకుండా పైకి ఎత్తుకొనేఉంటుంది.

పశువు నిలబడియున్నప్పుడు కుంటుని కని పెట్టుటకు వీలులేని యెడల గట్టి ప్రదేశమందు పశువును పైకి క్రిందకి పరిగెత్తించిగాని నడపించిగాని పరీక్షించాలి. పరీక్ష చేయునతడు తనవైపునుండి పశువు వెడలిపోవునప్పుడు వెనుక కాళ్ళను తనవైపుకు వచ్చునప్పుడు ముందరి కాళ్ళను పరీక్షించాలి.

కాని పరీక్షకారుడు పశువునకు ముందువైపునగాని లేక వెనుక వైపునగాని నిలబడి, పశువు ఏపాదముమీద బరువు బాగుగా మోపుచున్నదో కనిపెట్టాలి. ఇట్లు కనిపెట్టిన తర్వాత ప్రక్కపాదము మాత్రము కుంటిదని గ్రహించాలి. ఎట్లనగా పశువుయొక్క వెనుక కుడికాలు కుంటిదని తెలుసుకోవచ్చును. ఇదే విధముగా ముందరి కాళ్ళయందలి కుంటును కనిపెట్టుటలో కుంటులేనికాలుభూమిమీదఆను నప్పుడే తలకూడ వ్రాలుటవల్ల కుంటుతనాన్ని సులభముగా గ్రహిం చుటకు సహాయకారియవుతుంది

పశువుకు ముందరిరెండుకాళ్ళ యందుగాని, వెనుకరెండుకాళ్ళ యందుగానిఒకే పర్యాయముకుంటుఉన్నయెడల సదరుకాళ్ళరెండింటి

యందును బరువు సమానముగా మోపుతుంది. ఐతే అది అట్టికుంటుకాళ్ళతో అస్ఫుటమైన నడకను గలిగి దగ్గరగా అడుగులను బెట్టుచూనగుస్తుంది ఏ కాలుకుంటిదో తేలిన తర్వాత కుంటుకు కారణము కనుగొనుటకు కాలి పైనుండి క్రిందికి పరీక్ష చేయుట వసరము

## పాదాలను పరీక్షించుట

కృషి చేయు పశువులలో కుంటునకు ముఖ్యస్థానము గనుక పాదమును ముందు పరీక్షించాలి.

గిట్టలమధ్యన రాయిగాని ఇతరగట్టి పదార్థమేమైనాగాని చిక్కి కొనిన దేమో చూడాలి. దానినితీసి వేసిన యెడల కుంటుపోతుంది.

గిట్టలలో ఏమియు కనబడకపోతే గిట్టమీదఅక్కడక్కడ సుత్తెతో తట్టాలి. లేక పటకారుతో నిమ్మళముగా నొక్కాలి. పాదమునందునొప్పి యున్నచో పశువు పాదము వెనుకకు లాగుతుంది.

పాదమునందు నొప్పియున్నదని అనుమానంవుంటే లాడమున్న యెడలతీసివేసి కుంటుతగ్గి పోవువరకు గోధుమపొట్టు వేడినీళ్ళలో ఉడికించి గోనెపట్టాలో వేసి గిట్టకు కట్టాలి

నాడము కట్టిన ఒకటి రెండు రోజులలో పశువుకుంటిన యెడల సాధారణముగా నాడముకొట్టువాడు గిట్టయొక్క అడుగు భాగమున యెక్కువగా కోసియైనా ఉండాలి లేక మేకులను లోపలికి దిగునట్లుగా లోతుగానైనా కొట్టియుండాలి.

నాళములు వేయునప్పుడుకకంకరరోడ్డుమీంద పనిచేయుటవల్ల గిట్టలుఅరిగి పోవుటచే జంతువులకు బాధకలుగుతుంది. ఇట్టిసందర్భములో పశువు యొక్క గిట్టగట్టిపడి తిరిగిపనిచేయుటకు వీలగునంత వరకుపశువునకు విశ్రాంతి ఇవ్వాలి.

# బెణుకుట

పశువుయొక్క అవయవాలలో కీళ్ళువుంటాయి రెండు లేక అంతకన్న ఎక్కువ ఎముకలను బంధించుటకు నరములు పీచులాంటివి ఏర్పడుతాయి. అతిశ్వరితముగా పరిగెత్తుటలో తప్పటడుగులు వేసినప్పుడు, పాదము జారినప్పుడు ఎక్కువబరువు లాగినప్పుడును, కీలునందలి ఈసంధి బంధనములు (నరములు) ఒక్కొక్కప్పుడు ఎక్కువగా సాగుటవలన గాని తెగుటవల్లగాని బెణుకు కలుగుటకు కారణమగుతాయి.

అప్పుడుకీలు బెణికిన దని చెప్తారు. పశువులలో సర్వసాధారణ ముగా విరిగినకీలుగాని తొంటికీలుగాని భుజము కీలుగాని బెణుకుతాయి. ఆకీలువాచి తే తాకిన వెచ్చగానుండి బాధయున్నట్లు కనబడుతుంది. ఆ కీలు బెణికినదని నిరూపించాలి. ఈబెణికిన కీలునకు ప్రతిదినముపొద్దున సాయంత్రము 1/2 గంటవరకు వేడినీటితో కాపడముపెట్టితడి యారినతర్వాత హారతికర్పూరము కలిసిననూనెనుపూయాలి కర్పూరముకలిసిన నూనెను చేయుట ఎట్లనగా 1తు,కర్పూరమునుపావు శేరు కొబ్బరినూనె లేకనువ్వులనూనెలో కలిపి తయారుచేయాలి దొరికిన యెడల 1/8అణాను కర్పూర తైలమునుగూడ కలపాలి. బెణికినకీలును చింతాకు కషాయంతో కూడ వెచ్చగా కాచాలి వాపుకలిగిన కీళ్ళకు ముసాంబ్రమును నీటితో మెత్తగానూరి కొంచెము వెచ్చచేసి పూయాలి.

బెణికిన అవయవాన్ని స్థిరముగా వుంచాలి. కదలనీయరాదు. బెణికిన భాగానికి తడిగుడ్డచుట్టి తడపాలి. ఇట్లుతడిపినచో ఆభాగము బిగుస్తుంది. కొందరు వేడినీటికాపులు బెణికిన భాగమునకు తీస్తారు. వేడి నీటికాపులకంటె ఇసుకకాపులు చాల శ్రేష్టము. బెణికిన భాగమును చాలకాలము వాడుకచేయని యెడల ఆఅవయవాలు బిగిసిపోతాయి.

ముద్దకర్పూరము 1తులము కొబ్బరినూనె పావు శేరు. కలిపి బెణికినచోట పద్దాలి

లేకపచ్చిజెముడు చెక్కనుతొక్కి బెణికినచోట కట్టాలి.

లేక రావిచెక్క మెత్తగా నలగద్రొక్కి యెండబెట్టి చూర్ణము చేసి నీటిలో కలిపి బిళ్ళచేసి బెణికినచోట కట్టుకట్టి ఆకట్టుపైనచన్నీళ్లు ధారగా పోయాలి

లేక కోడిగుడ్డు సొనతో మంచినూనె కలిపి పట్టువేయాలి.

లేక మంచిఘాటయిన సారాయి ఆరగా ఆరగా రుద్దాలి, బెణికిన అవయవమునకు ఎన్ని చికిత్సలు చేసినను లొంగనియెడల బొత్తులు పెట్టవచ్చును. లేక స్ప్రెయిన్‌కిల్లరునుగాని. ఐఓడిన్‌గాని. వాడాలి.

## దబ్బరికవం

పశువు మోకాళ్ళకుగాని, తొడభాగమునకుగాని ముందు వాపుగాపుట్టి క్రమేపి వృద్ధిజెందుతుంది జ్వరము కొన్నిటికితీవ్రముగా వుంటుంది. వ్యాధిముదిరినకొలది పశువు బాధజెందుతుంది. వాపు వేడిగావుంటుంది. కాబట్టి అనుభవముగల వైద్యునికి చూపించాలి. లేదా బెణుకులుచేయు చికిత్సలు వాడాలి

## వెర్రిదిగుట

పశువును మితముతప్పి మేపుటవల్ల చర్మములోవుండు బల హీనతవల్ల దుమ్ము తేమ వగైరాల కొట్టములో వుంచుటవల్ల, తదితర వాతరోగములవల్ల ఈ వ్యాధికలుగుతుంది. వెనుక మోకాళ్ళుగాని ముందుమోకాళ్ళుగాని వాపుపుంటాయి. ఈవాపును తాకితే గట్టిగా వుంటుంది. మరికొన్నిటికి మెత్తగావుంటాయి. నడుచునపుడు కాళ్ళు వంగనీయవు. ఆవాపుదగ్గర దురదవుంటుంది. ఆరంభములో పశువు మోకాలి చిప్పలచుట్టూ గుండ్రని వాపుంటుంది. ఈవాపు వృద్ధిజెంది కాలిక్రింద భాగమునకుకూడ సోకుతుంది. ఈ వాపులలో ఒకవిధమగు కోడిగుడ్డుసొనవంటిజిగురుపదార్థముంటుంది. ఇట్టివి తగ్గుటకష్టము.

మోకాళ్ళలోగాని, గిత్తలలోగాని వాతమువలనగాని, తదితర కారణముల వలనగాని వాపులుపుట్టి మెత్తగాగాని, గట్టిగాగాని యున్నపుడు తగినచికిత్సచేయాలి.

## చికిత్స

జిల్లేడుపువ్వు, ఇప్పపిండి ఉల్లిపాయలు సమభాగములుగా చేర్చి మెత్తగానూరి బిళ్ళవలెచేసి పశువుమోకాళ్ళమీదకట్టాలి.

ఉప్పు, వెల్లుల్లిపాయలు. పెద్దజెముడు సమభాగములుగా చేర్చి మెత్తగానూరి బిళ్ళచేసి పైమాదిరిగనేకట్టాలి. వారముదినముల కొక సారి విరేచనానికి మందీయాలి. లేక కోడిపెంటలో జిల్లేడుపాలచుక్కలను వేసి రాచి ఒకపావుగంటవుంచి కడగాలి, లేనిచో ఆభాగమువాచుతుంది

లేక ఫార్మసీవారి స్ప్రియిన్‌కిల్లరును రాచి లోపలకు పశురక్షామృతము తాగించాలి.

## మలిమిడి

దీనినే గుడ్డమలిమిడి యంటారు ఇది ఒకవిధమైన జెణుకు. పశువులకు అప్పుడప్పుడు వస్తూవుంటుంది. పశువు మోకాలిగుత్తిలో వుండి నరములు సాగుతాయి, మనముచ్చట తాకితే పశువుచాలబాధపడుతుంది అక్కడ వాపుగా వుంటుంది మూడు కాళ్ళ మీదనే నడుస్తుంది. తేలికగా జెణికితే కాలు భూమిమీద నిలబెట్టి చూస్తే ఆవాపు వేడిగా వుంటుంది. ఈనొప్పి వారము లేక పక్షముదినము లవరకుంటుంది. ఇక్కడ చెడురక్తము కూగుకొని యుంటుంది. క్రమముగా ఆవాపుపొక్కి పుండు బడి కుంటుతుంది. ఇంకా ఆవాపు పుండు పడకుండా తగ్గవచ్చు.

## చికిత్స

పశువు కాలిగుత్తిలో గుడ్డ కడియముగా చుట్టిమంచినూనెతో చి గోరు వెచ్చనిద పోయాలి. ఇట్లు పోస్తూవుంటేగోరువెచ్చని వేడినరాలకు

తగిలి నెమ్మదిస్తుంది. ఇట్లు చేయక మన రైతులు నూనెలో గుడ్డనుంచి కడియముగా చుడతారు. తెణికిన స్థలమును కదల నీయరాదు,

ఆముదముతో చిత్రమూలము నూరి వండి ఆవాపునకు రెండు కట్లు కట్టిన తగ్గుతుంది.

లేక చిత్రమూలము, సన్నాయిలు నూరి ఆవాపునకు మూడుకట్లు కట్టితే వెంటనే తగ్గుతుంది. ఇట్లు చేయనియెడల ఆ భాగము పొక్కుతుంది తరువాత వెన్నపూస రాసిన తగ్గుతుంది.

లేక గోలిమిడాకు గుప్పెడు, మిరియాలు 2తు. కొత్తిగా నూరి ఆముదములో కలిపివండి పెట్టాలి. లేక ఐఒడిన్‌గాని, స్ప్రియున్‌కిల్లరును మర్దనచేసి వేడి కాపులు తీయాలి

## గిట్టల క్రుళ్లుడు

పశువునకు కాలి గోళ్లు పడుట వల్ల తదితర వ్రణముల వల్ల మోటారుకారు, బండి మొదలగునవి గిట్టలమీదుగా పోవుటవల్ల రేకులు పడి గిట్టలు తెగిపోవుటవల్ల గాయములకు చేతగాని చికిత్సలు చేయుట వల్ల ఈ కుళ్ళుడు పుట్టుతుంది.

## చికిత్స

ఈవ్యాధికి చికిత్సలు చేయుట చాల కష్టము. ప్రతిదినము కట్టు కట్టాలి. కుళ్ళకుండ నుండు పదార్థములు వేసి చికిత్స చేయాలి

మద్దకర్పూరము — 2తు, వస 1తు, వ్యాసనైలు 2తు, కలిపి అచ్చట రాయాలి.

లేక జీడివిత్తులు సేరు తెచ్చి తో క్కిచముగ తీయాలి తరువాత. సేరుగా రెక్కొవ్వు అర్థసేరు మైనము అర్ధ శేరు ఆవు నెయ్యి, అర్థసేరు నువ్వుల నూనె, అర్ధసేరు ఆముదము, తీసికొనివచ్చి పైచముగ కలిపి కాచాలి

తరువాత పశువుగిట్టను రక్తము వచ్చునట్లు కుళ్లుతీసివేసి దానిపై చురుక్కుమనునట్లు కాచిన తైలము పోయాలి. తరువాత మైనము బిళ్ళగా చేసి దానిపైనవేసి మరియాకు వేసి కట్టుకట్టాలి. ఆకట్టు మూడు దినములుంచి నాల్గవనాడు ఇదివరకు చెప్పిన లోషనుతో కడిగి మరల మైనపుబిళ్ళ వేసి కట్టుకట్టాలి. పుండు మానువరకు నిట్లేచేయాలి. కార్బైక్సు వాడాలి

## కాలిగొఱ్ఱు

పశువును నాగలి కట్టి దున్నునప్పుడు జీతగాడు నాగలి మేడి సరిగా పట్టుకొనక పోవుటచేతగాని యేమరు పాటున దున్నుటచేతగాని కాలి డెక్కలకు నాగలికఱ్ఱు గుచ్చుకుంటే పశువునకు ప్రాణాపాయము



కూడ రాగలదు. పశువు చాల విచారముగా వుటుంది. తగిన చికిత్స చేయనిచో కాలు చెడిపోతుంది నీరుపట్టి వాస్తుంది. పోటు వుంటుంది. పశువు నడువజాలదు. పోతుగాయమునకు వెంటనే చికిత్సచేయనిచో ధనుర్వాతము సోకి మరణిస్తుంది. కఱ్ఱుతుప్పు రక్తములో జీర్ణించి క్రిందినుండి పైవరకు రక్తగడ్డలు లేస్తాయి. సరియగు చికిత్సచేయనిచో మూడగా నగుతుంది.

## చికిత్స

గాయమునకు ఈగలను ముసరనీయరాదు. చాల జాగ్రత్తగా వుంచాలి. గాలిప్రవేశించకుండ కట్టుకట్టాలి.

నల్లజీడిగింజ కాల్చి ఆభాగమునకు అంటించాలి.

లేక గాయపాకు వేసి నాలుగుకట్లుకట్టాలి

పశువు కాలిడెక్కలకు మేకుగుచ్చుకున్నయెడల జాగ్రత్తగా తీసివేసి నీరు పట్టకుండ చేయాలి.

కాల్చిన యిటుకరాయిమీద గుడ్డమడతలుగా పెట్టిదానిపైన చన్నీళ్ళు ధారగా పోస్తుండాలి ఈప్రకారము మూడునాలుగు దినములు చేయాలి.

ఇసుకతో వేడి కాపులుతీయుటమంచిది వాము, వెల్లుల్లిపాయలు నూరి నాలుగుకట్లు కట్టుము.ఫార్మసీవారి కార్నెకస్సను,వాతారిఅరకును వాడాలి.

## మంద గుది

పశువునకు ఈవ్యాధివాతమువల్ల వచ్చుతుంది. కాళ్ళుఈడ్చుతూ వుంటుంది. కొన్నిటికి తేలికగా తగులుటవలన కొద్దిగాకుంటుతుంది వ్యాధిముదిరినకొలది కాలుపైకి లాగుకొని నడువలేకపోతుంది ఇట్టిపశువును చూస్తే జాలిగావుంటుంది.కొన్నిపశువులకు సాంప్రదాయముగా ఈమందగుది రాగలదు.

## చికిత్స

వాము15తులాలు, దిరిసెనచెక్క15తులాలు, శొంఠి12తులాలు' చేదుపొట్లకాయలు, పొగబంతిచెక్క 13తులాలు, చేదుబీరకాయలు, 12తులాలు పెన్నేరువేరు 10తులాలు, ఇవన్నీయు కలిపి నూరి నిమ్మ

కాయంత ఉండలుచేసి రెండుపూటల తినిపించాలి. వ్యాధిముదిరిన యడల ఈచికిత్సకూడ లాభము లేదు నాటు వైద్యులు నరమునుచీల్చు తారు. తాత్కాలికముగా తగ్గినను మరల తప్పకవస్తుంది

రెక్టిఫైడ్ స్పిరిట్ టింక్చర్ అయోడిన్ రక్తనాళమునకు ఇంజెక్షన్ యిచ్చిన తగ్గుతుంది. అంతకంటె మంచి వైద్యము లేదు ఆయుర్వేదములో ఇంకను ఈవిషయమై ఆలోచించు చున్నారము

## గిట్టల పగుళ్ళు

పశువులను బండ్లుకట్టి రాతినేలలందు కంకరరోడ్లమీద తోలుటచేత, దీర్ఘ ప్రయాణములు వేయుచుండుటచేత సరియయిన నాడాలు డెక్కల అడుగుభాగమున కట్టించక పోవుటచేత పశువులగిట్టలు అరిగిపోవుటచేత ఈవ్యాధిక నుగుతుంది. ఈవ్యాధిముందరి కాళ్ళకు వెనుక కాళ్ళకు అప్పుడప్పుడువస్తుంది. గొరిజలు పగిలివాపుపుట్టిఆ బాధచేతపశువు అడుగువేయజాలదు అజాగ్రత్తగా వుంటే ఆవాపు పుండుగామారిగిట్ట లూడిపోతాయి.

## చికిత్స

(1) వేడినీటిలో ఉప్పుకలిపి డెక్కలమీద పోయాలి

(2) గుగ్గిలము, మైనము, లక్క, సింధూరము ఒక్కొక్కటి పావుతులము వంతునతెచ్చి మెత్తగానూరి పొడిచేసి నూనెలోకలిపి కాచి డెక్కలలోపోసి దానిపైకాచిన వేడియిటుకరాతి పొడుముతో కాచాలి.

(3) ముండ్ల తోటకూర ఆకు తెచ్చి ఉడికించి వెచ్చనిది కట్టాలి.

(4) కరక్కాయపొ , కొత్తసున్నము పటికబెల్లము సమానముగా తెచ్చిమెత్తగానూరి నొప్పిగల గొరిజలకుపట్టించి ఉప్పునీటితో కాయాలి.

(5) తవుడు నీరు చిక్కగా కలిపి వుడికించి దినమునకు ఒకసారి కట్టాల.

(6) గుగ్గిలము బెల్లము నెయ్యి మైనము కలిపి రాయాలి

(7) నిమ్మరసము, సైంధవలవణము, మేకపాలు, జల్లేడుపాలు, గుగ్గిలము, ఆవు వెన్నతో కలిపి రాయాలి

వెటరినరీ ప్లాస్టరు, ఐఓడిన్ చక్కగా పనిచేస్తుంది

## గిట్టలసందున దుర్మాంసము పెరుగుట

గిట్టలకు దెబ్బతగిలినప్పుడు తగు చికిత్స చేయనపుడు కాలిగొట్టు పడిగిట్టచీలినపుడు యేదెబ్బయిన తగిలినపుడు శస్త్రముచేసి సరిగా చికిత్స చేయనపుడు ఈదుర్మాంసము పెరుగుతుంది, పశువు పనిచేసినపుడు గిట్టలసందునవున్న ఈ దుర్మాంసమునకు పుల్లలు, గడ్డలు గ్రుచ్చుకొని బాధపడుతుంది. దుర్మాంసము పెరిగి బాగుగా ముదిరిన యెడల శస్త్రముచేయాలి

## చికిత్స

అనుభవముగలిగిన వైద్యునితో చికిత్సచేయించాలి. తాత్కాలికముగ తగ్గి మరల రావచ్చును మరలమరల వచ్చిన గిట్టమాదగా అగుతుంది ఇట్టి పుండ్లకు ఫార్మసీవారి కార్నికస్టను వాడాలి కాల్చవలసివస్తుంది.



---

# ముప్పది అయిదవ భాగము

## మొదలు - వాపులు

పశువుకు పుట్టినప్పుడుగాని, శస్త్రముచేసిన గాయముగాని, తోక, చెవి, అరుగు కొమ్ము కాలుగొట్టు మున్నగు భాగాలలో కలిగినవానికి ఎన్ని చికిత్సలు చేసినా తగ్గక రైతుకు విసుగుపుట్టించి చికిత్సలు చేయించనప్పుడు ఆ పుండ్లు పెద్దవై మానవు. వీటనే మొదలంటారు. కొమ్ము భాగాలకు మాత్రము తలలో ఒకవిధమగు పదార్థము చేరి వ్యాధిముదిరి కొమ్ము వాలుతుంది. దీనినే కొమ్ముమొదంటారు. మొదలంటే మానదని తెలిసికోవాలి. కాబట్టి యిట్టిమొదలకు అనుభవముగల వైద్యులతో చికిత్సలు చేయించాలి.

### తోకమొద

దీనినే తోకగురుజు అంటారు. పశువుయొక్క కుచ్చుండుస్థానమునందు ఈవ్యాధి పుడుతుంది. కుచ్చపైభాగమంతా నల్లబడి వెంట్రుకలు వూడిపోతాయి. చివరభాగమున ఉంగరమువలె మెలికలు తిరిగి బిరుసుగావుంటుంది, క్రమముగా తోకకుచ్చు వెంట్రుకలూడిపోయి మొండితోకగా వుంటుంది. పశువుసరిగా మేతమేయక వెఱ్ఱిచూపులు చూస్తూ తిరుగుతుంది,

### చికిత్స

పశువుతోక చివరభాగము కత్తితో తెగగొట్టి గోరువెచ్చని నేతిలో ముంచాలి, తరువాత కలబందమట్టలు, సైంధవలవణము, ఆవాలు అల్లము సమభాగములుగా తెచ్చినూరి పులికలిలో మూడుదినములు నానవేసి పూటకు గొట్టము త్రాగించాలి. వెంట్రుకలు మొలచుటకు ఉమ్మెత్తో సిలిమందునునూరి 4,5 దినములు రెండుపూటలు పట్టించు చుండాలి.

లేకతోక తెగగొట్టినప్పటికికూడ, మరలతోక చెడిపోతుంది కాన ఎక్కడకు తోకకుళ్ళి ఎండిపోవునో అంతవరకు అనుమానము లేకుండ తెగగొట్టి నూనెలో ముంచాలి. ఈగల ముసరనీయరాదు. తోకఎముక ఉంగరము మాదిరిగా ఊడినపుడు తోక మాదయని గ్రహించి అనుమానము లేకుండ నరకాలి. కార్నెక్సును వాడుడు.

## కొమ్ముమాద

కొమ్ములు జంతువులయొక్క యావజ్జీవితమూ పెరుగుతూ వుంటాయి. ఆకస్మికముగా వూడాలిగాని తమంతటవి ఊడవు. ఒకప్పుడేదైనదెబ్బతగిలినపుడు ఇట్టికొమ్ములు వూడిపోతాయి. కొమ్ములిరిగి క్రిందపడినపుడు నిజమైన కొమ్ము అమర్చబడియుంటుంది. ఆగాయము చుట్టును స్పర్శగ్రహణ శక్తిగల చర్మము సమర్చబడి యుంటుంది. దాని యందసంఖ్యాకములగు నాడులును, రక్తవాహికములు వుంటాయి. నిజమైనకొమ్ములు నరికినను బాధకలుగ నేరదు. ఈకాయ భాగాన్ని ఎంతతేలికగా, గుచ్చిననూ ఎక్కువ బాధకలుగుతుంది. కాయచుట్టువుండే చర్మములో నాడులు రక్తవాహికలు వుండుటచేతనే ఈబాధ కలుగుతుంది ఈకాయ అడుగుభాగాన మెదడను పదార్థమువుంటుంది.



ఈ మెదడుభాగమునకు చీము సంబంధమైన సూక్ష్మజీవులు ప్రవేశించి కొమ్ము మాదయను వ్యాధిని కలిగిస్తాయి. ఈ మాదబత

కొమ్మునకుగాని రెంటికిగాని రావచ్చును తలకుకొంచెము దురద ప్రారంభమయి, ఎఱ్ఱని వర్ణముగల బొబ్బలు కనబడతాయి. ఇవి క్రమముగా పసుపువర్ణముగా మారుతాయి ఇవిచితికి తేనెతుట్టెఆకారమువహించి పొక్కులుకనబడతాయి. ఈపొక్కుల యడుగునపుండ్లు యేర్పడుతాయి, ఈవ్యాధిని అశ్రద్ధ చేసినయెడల పశువుకపాయము కలుగుతుంది. ఇదిబహు మొండివ్యాధి. పశువుతలలోనున్న మెదడును ప్రవేశించిక్రమముగ కొమ్ము లోపలి భాగముకూడ తింటుంది ముక్కులనుండి చీముగాని, చీమునెత్తురులు గాని పడుచుండుట వలన పశువు కొమ్ము వాలిపోతుంది.

విరిగిన కొమ్ము మాదమైన పశువు చాల శుష్కించి పోతుంది ప్రత్యేకముగా ఈవ్యాధికలిగిన పశువుఎక్కువగాబలుస్తుంది. పశువునకు కాంతితగ్గుతుంది ఈస్థితిలో పశువు చనిపోతుంది. నెత్తురు చిగిర్చి మాద నెమ్మదికాదు.

## కొమ్ములు విరిగినవాద

ఏ ప్రమాదమువల్లనైనా కొమ్ములు విరిగినపుడు జాగ్రత్తగా చికిత్స చేయాలి. విరిగిన భాగము వ్రేలాడు చున్నచో రంపముతో కోసితీసివేయాలి. రక్త మెక్కువగా కారుచున్న తడిగుడ్డతో గట్టిగా నీరుపిండి ఆరక్తాన్ని ఆపాలి. తరువాత మంటపెట్టు మందులుగాక చల్లదనంగావుండే మందులను వాడాలి పురెవరకు కొమ్మువిరిగినఅనుభవముగల వైద్యునితో చికిత్స చేయించాలి విరిగిన 15 రోజులలోచికిత్స చేయకున్నను తాత్కాలికచికిత్స చేసిన తగ్గకున్నను విరిగి పోయి మాదగానై రక్తముకారుతూవుంటుందికాబట్టి విరిగిన వెంటనే చికిత్స చేయాలిఆకు పసరులకంటెచూర్ణములుగాని, తైలములుగాని వాడాలి.

# హెచ్చరిక

ఈ వ్యాధి సామాన్యముగా చికిత్సకులొంగదు. కాబట్టీఆరంభ ములో తగుచికిత్స చేయాలిగాని కొమ్మువాలిన తరువాతఏమీలాభము లేదు.

అనేకమంది పశువైద్యులు మేము నెమ్మదిచేసెదమని కొంతడబ్బు మందుఖర్చునకని తీసుకొని తరువాత మావల్ల గాదంటారు. ఇది నా స్వానుభవము.

మనరైతులలో చాలమంది నయమగునేమోయని ఆతురతతో అనేక చికిత్సలు చేస్తారు కొన్ని మంచి బండిగిత్తలకు వచ్చినపుడు రైతువిచారము, ఆతురతచెప్ప నలవిగాదు. మాపశుచికిత్సాలయము దగ్గరకుకూడ అప్పుడప్పుడు చక్కని గిత్తలు వస్తాయి, వాటినిచూచిన చాలవిచారముగ వుంటుంది. ఈ మాద పురెకు పుట్టిన తగ్గదు, కండకు పట్టిన తగ్గుటయుకలదు

# చికిత్స

కాని ఇటువంటివ్యాధిగల పశువుకొమ్మకోసి ఈదిగువచికిత్సలు చేయాలి.

కొమ్మకోసి వెంటనే కల్లుబెల్లము వెంట్రుకలు తెచ్చిపైనవేసి యినుపకడ్డీతో కాల్చాలి. ఇట్లుకాల్చినచో కొమ్ములోపలవుండేపురుగు లను వేడికలిగి చనిపోతాయి. తరువాత కాల్చినభాగములో మాను వరకు మర్రిపాలు పోయాలి, లేక ఇంగిలీకము, ఇటుకరాతిపొడుము, దంతిచెక్క చూర్ణము కలిపి కొమ్ముగాయములో పోసి కట్టుకట్టాలి. తరువాత సారాయి చటాకు కాజఆకురసము చటాకు కొమ్మకోసిన వైపు చెవిలోపోసి కట్టుకట్టాలి.

అప్పుడప్పుడు ఫినైల్ ద్రావకముతో కడుగుతుండాలి.

లేక వావింటాకు మూడుగుప్పెళ్ళు, నీరుల్లిపాయలు, వస 1తు, తీసికొనివచ్చి నూరిరసముతీసి ఏ ప్రక్కకొమ్ము వాలినదో ఆప్రక్క ముక్కురంధ్రములలో పోయాలి. ఫార్మసీవారి కార్నెక్సు చెర్పాచిరిని వాడుడు.

## పార్శ్వపువాద

పశువు మెదడులో ఒకవిధమైనసూక్ష్మజీవులు పుట్టినఈరోగము కలుగుతుంది దీనినే అర్థాంగవాతమనీ పార్శ్వపువాతమనీ చెప్పవచ్చు ఈరోగము శీతల ప్రదేశములోవుండే పశువులకు కలుగుతుంది.




పశువుమెదడు సగభాగమునకే సోకుతుంది. కొన్ని పశువులకు చెవులమొదట త్రాడుకట్టుటవలన బలవంతముగాలాగుకొని నరములు సాగి ఈరీతిగనే వచ్చుటయుగలదు. మరికొన్నిటికి దీర్ఘ వాతము వలన రావచ్చును. కాబట్టి జాగ్రత్తగా చికిత్సచేయాలి.

పశువుతన తలను ఆరంభములో అటునిటు ఆడించుచుండును.ఒక ముక్కునుండి మాత్రమే చీమిడివంటి పదార్థము కారుతూవుంటుంది చెవిలోనుండికూడ ఒకవిధమగు ద్రవము స్రవించుచూ వుంటుంది కొమ్మువైపునకు చెవికిముక్కురంధ్రాలకు వ్యాధిసోకుతుంది.ఒకకన్ను లోపలికిపోతుంది. నోటినుండి చొంగ పడుతుంది. ఈవ్యాధిని ఆరంభ

ములో గుర్తింపలేక కొమ్ముడొల్లలంటారు కాబట్టి జాగ్రత్తగా పరీక్షించాలి. పసుపుపచ్చని చిక్కనిచీమిడి చెవులనుండి, ముక్కులనుండి పడుతుంది. చాలదుర్వాసన వేస్తుంది వ్యాధిముదిరినకొలది తుట్టెలు తుట్టెలుగచీమిడి పడుతుంది. ఈచీమిడి కోడుగుడ్లలోనుండుపచ్చని ద్రవపురంగుగ వుంటుంది, పశువు శుష్కించిపోతుంది. చెవిలోపురుగులు పడుతాయి. పశువుచూచుటకు చాలఅసహ్యాముగా వుంటుంది.

## చికిత్స

ఇది మొండివ్యాధి. ఈవ్యాధితగిలినపశువు5,6మాసములవరకు జీవిస్తుంది తరువాత చనిపోతుంది కాబట్టిఈవ్యాధిగల పశువునుప్రత్యేక స్థలమందుంచాలి. చెవికిదెబ్బ తగులుటవల్ల వచ్చినచో చికిత్సలకు తగ్గుతుంది. వాతమువల్ల వచ్చిన చాలా కాలము పడుతుంది. అవుసరమున్న పశువుకొమ్మునుండి మూతినరకు చుక్కలు పెట్టాలి చెవిచుట్టు మూడుచుక్కలు పెట్టాలి ముచ్చిలిగుంటయొద్ద ఒకచుక్క పెట్టాలి. ఈవ్యాధి రెండు నెలలవరకు యుండునుగాని, త్వరగాతగ్గదు.

వాతారిఅరఖు, ఐఓడిన్, అనోడైన్ పనిచేస్తుది.

## చెవివహాద

చెవిగూటలో వాతసంబంధమైన పురుగులుపట్టి కురుపులు లేచుటగాని, నరసంబంధమగు అస్వస్థతవలనగాని ఈవ్యాధి కలుగుతుంది. ఇవి లేచుటచే చెవిమధ్యభాగము లోపలిభాగము వెలుపలిభాగము కూడ వాపుపుడుతుంది. ఆవాపువలన పోటుఅధికమై బాధకలుగుతుంది పశువునకు చలిగాలి తగిలినపుడు. అటునిటు తిరుగునపుడు, మేతతినునపుడు నొప్పికలుగుతుంది. ఈవ్యాధికితగిన చికిత్స చేయనిచో కురుపులు పెద్దవై చెవి వేలాడుతుంది. చెవి మొదటచాలవాపుదలనొందియుంటుంది. చెవిబయటభాగమందు కురుపులుఎఱ్ఱగా వుంటాయి. కురుపులు చితికి దుర్వాసన వేస్తాయి, ఈగలువాలసిపైన వాలి పురుగులుఅగుతాయి.

క్రిమముగా చెవిభాగమంతాపురుగులుతింటాయి. పశువుక్షీణించుతూ చాలవిచారముగా వుంటుంది. ఈదుర్వాసనను తక్కినపశువులు పసిపడతాయి.




## చికిత్స

ఈవ్యాధి ముదిరితే నెమ్మదియగుట చాల కష్టము పెద్దజంతువునకు, విరేచనమునకు మందీయాలి చెవిచుట్టు వాపున్నయెడల వేడి కాపులు తీయాలి.

చెవులో బొక్కెనాకుపసరు పోసి దూది పెట్టాలి.

లేక వామింటాకు ఉప్పుతోనూరి రసముతీసి చెవిలోపోయాలి

లేక మార్కొండాకుపసరు 2 తు, చిగురుప్పు 1/2 తు, కరిధూపము 1/2 తు తెచ్చి గోమూత్రముతో కలిపి చెవిలో పోయాలి.

లేక సీమకసిందాకు, రాతిసున్నమునూరి చెవిలో పిండాలి.

లేక వేపనూనె 1/4 తులము, గోరింతాకుపసరు 1/2 తులము వేపాకుపసరు 1/2తులము, మిరియాలపొడి 1/2తులము, కలిపిపోయాలి

చెవి మొదటిభాగమునందు 5, 6 చుక్కలు పెట్టాలి. కార్నైకాస్న గాని అనోడైసు గాని వాడాలి.

## తలవాద

వాతము వల్ల, తల శుభ్రముగా లేక పోవుట వల్ల, మెదడులోనే వ్యాధియైన కలుగుటవల్ల మెదటి భాగమంతా పురుగులు చేరి ఈ వ్యాధి కలుగుతుంది.

తలలో చీముసంబంధమైనకురుపులు లేస్తాయిఆరంభములో దురద వుంటుంది ఈకురుపులు ఎరుపుగా వుంటాయి. ఈకురుపులు తామరవలె గుండ్రంగా వుండక వంకరగావుంటాయి. కొంచెము పసుపు వర్ణముగల చీముంటుంది. ఈచీమువలన పశువు భూమిమీద తనతలను ఆన్చుతూ విచారముగా వుంటుది వ్యాధి ముదిరినకొలది ముక్కుల వెంట చీము పడుతుంది మెదడు క్రమేణ తేనెతుట్టె ఆకారము వహించితల మెత్త బడి పశువునకు బాధ యెక్కువై చనిపోతుంది.

## చికిత్స

ఆవుపాలు అర్ధశేరు. శొంఠి 1 1/2 తు, వస అర తులము కలిపి ప్రతిదినము ఈ మోతాదు వంతున పక్షము దినములు త్రాగించాలి. పైన కార్నెక్సును రాయాలి.

తల పైన పురుగులను చంపు మందుచే మర్ధన చేయుచుండాలి,

లేక సూరేకారము .1/2 తు, నీరు అర్ధశేరు కలిపి మెదటి పైన పోయాలి.

గుజ్జుపుమూత్రము, నిమ్మకాయరసము, హారతికర్పూరముకలిపి రాయాలి.

గంధకపుపొడి 2తులములు, మైలతుత్తము పొడి 1/4తు. పటిక పొడి 1తు, వ్యాసలైను 16 తు, కలిపి పూయాలి,

## అట్టువాద

ఎద్దులను దున్నలను అతిగా బరువువేసిమోయించుటవలన మెడ కండర భాగమంతా కంది వాచి నల్లబడి రక్తము గడ్డ కట్టి బాధగా వుంటుంది. అట్టిపశువులతో పనిచేయించరాదు. దీనినేఅట్టుమాదయంటారు. శస్త్రముచేయవలసినపుడు అనుభవముగల వైద్యులకు చూపించాలి గాని ఇష్టమువచ్చినట్లు శస్త్రము చేయరాదు. ఎందుచేతనంటే రక్తనాళాలు ఆగడ్డచుట్టు చేరియుంటాయి.

## గిట్టువాద

పశువు డెక్కల లోపలిభాగాన రక్తనాళాలతోను, తదితర నరాలతో కానికూడియుంటాయిఏదైనఇనుపముక్క-గుచ్చుకొనుటవల్ల తెగుటవల్ల, రాయిగుచ్చుకొని తెగుటవల్ల పుండ్లుపడ్తాయి. ఈ పుండ్లను అజాగ్రత్తగా చూచుటవలన లోపలపుండంతా కుళ్ళి నరాలుకూడ పాడయి ఎన్ని చికిత్సలుచేసినా తగ్గక రక్తముతోకూడు కొనుటవల్ల గిట్టమాద యంటారు. అనుభవముగల వైద్యునికి చూపించాలి.

## కాలుంగొర్రువాద

పశువులను దున్నేటప్పుడు ఆకస్మికంగా మోకాలుకిందగాని గొరిసెలోగాని గిట్టపైగాని నాగటికర్రుగుచ్చుకొని లోపలిభాగమంతా కమిలి రక్తముకారి బాధపడుతుంది. ఈసమయములో ఏచికిత్స చేయకుండావుంటే ఆకరువిషము రక్తనాళాలలో జీర్ణించిమోకాలు, తొడవరకుకూడ రక్తముగడ్డకట్టి పుండుమానక పశువు బాధ పడుతుంది.

## చేరువాద

పశువు చేరులోపలిభాగపు అవయవముపైన ఒకవిధమగు ఉల్లి పొరవంటి గడ్డలేస్తుంది. మరికొన్నిటికి చేరుచివర చర్మమునకంటి ఒక

విధముగు కురుపు లేవగనే పరీక్షించి తగినచికిత్సచేసిన తగ్గుతుంది. చికిత్స చేయకుండవుంచితే కుర్రిళ్ళి లోపలిభాగమంతా చెడి మాదగా అగుతుంది చేరువంపుగావుండేభాగములోగాని కొంచెము క్రిందగాగాని ఉల్లిపొరలవంటి గడ్డలేచి గట్టిగావుంటుంది. శస్త్రముచేసినప్పటికికొన్ని తగ్గవు. ఇదికూడ మాదగానగుతుంది. గాన ఆరంభములోనే యిట్టి వాటికి చికిత్సలు చేయించాలి

## కంటివహాద

కన్నులోపలి దానికి తదితర కారణాలవల్ల దోషముతగిలి తెల్లగుడ్డుపైనా శనగ గింజంత కురుపుగానై చికిత్సలు చేసినపుడు తగ్గుచు లోలోపల కంటిభాగము పాడగుచు క్రమేపి కన్ను గుల్లపారి పాడవుతుంది ఇట్టిసమయములో ఆవికని చికిత్సచేస్తారు ఇంతమాత్రి మునకే లొంగదు. దీనికేమాదయంటారు. వెంటనే అనుభవముగల వైద్యునితో కన్ను తీయించాలి. లేనిచో రెండవ కంటికి కూడ రావచ్చు రైతులు ఇట్టి పశువులను చూచి విచారపడుతారు ఎంతగావిచారపడిన తాత్కాలిక చికిత్సకు కొంచెము తగ్గినా, కొంతకాలానికైనా కన్నుతీసివేయుట తప్పదు

## స్తనవహాద

పశువులు ఈనినతరువాత పొదుగు, చన్నులలో పాలు లేకుండ పోతాయి. కండరాలలోపటుత్వము తప్పుతుంది. చన్నులనుంచి పాలు వచ్చునేమోయని పాలు పిండితే రాజాలవు. కొన్ని చన్నులు కొరివి చన్నులుగా అగుతాయి. కొన్ని పశువులపొదుగులు మెత్తగానుండిచన్నుల కాటంకముగా కొన్ని నాళాలు బంధించుతాయి. ఎన్ని చికిత్సలుచేసిన ప్పటికి ప్రయోజనం వుండ జాలదు ఏమాత్రము ఒకటిరెండుధార లైన చన్నుల నుంచి వస్తూవుంటే మాత్రము పాలు పడుటకు ప్రయత్నము చేయువచ్చును. లేనిచో ఏమి లాభంవుండదు

## పేగువాద

పశువు బొడ్డునకు వెనుక కాళ్ళకు దూరముగావుండేభాగమందు ఒకగాలికణితి వలెపుట్టుతుంది ఈ కణితి క్రమక్రమేపి పెద్దదై కొన్నాళ్ళకు ఆకణితిచితికి పెద్దగాయము గానై, అపుండు విస్తరించి లోపల వుండే పేగులచుట్టఅంతా బయట పడుతుంది. దీనినే మనవాళ్ళు పేగు మాద అంటారు. ఈమాదకు ఆరంభములోతగిన చికిత్స చేయాలి గాని చివరదశలో ఏచికిత్సకు లొంగక రోగా ఆపశువు చనిపోవుటయు గలదు ఇట్టి పశువులను అనుభవముగల వైద్యులకుచూపించిన పేగులనులోపలికి నెట్టి కుట్టుతారు పేగులన్నీ బయటకు వచ్చి ఆభాగపు చర్మమంతా కుళ్ళిపోతే ఏచికిత్సకూ లొంగదు, మరికొందరు కణితియని దానిపైన కాల్చుతారు. అట్లుకాల్చ గానేపుండు పెద్దదై పగిలి ప్రమాదము కలుగుతుంది.

## వాపులు

రైతులు ఈ వాపుల విషయంలో చాలా జాగ్రత్తగ పరిశీలించాలి కొన్నివాపులు అంటురోగాలవల్ల గొంతుకక్రింద, మూతిమీద, దెబ్బలమీద తదితర భాగాలయందు రావచ్చును ఇట్టివాపులు ప్రమాదాలు కలిగించుతాయి. కాబట్టి వెంటనే కనుగొని చికిత్స చేయాలి.

విషజంతువులుకరచినగాని, కుట్టిగాని, ఊదిగాని వాపులుకలుగుతాయి ఈ వాపులనుగూడ జాగ్రత్తగా పరిశీలించాలి.

మరికొన్ని వాపులు శరీరఅవయవాలమీద కణుతులుగా.గడ్డలుగా, పుట్టుతాయి ఇట్టివాపులు చెడునీటితోగాని, చెడురక్తంతోగాని చెడుగాలితోగాని కలిగియుంటాయి కాబట్టి మీకు తెలిసినంతవరకు వీటికిచికిత్సలు చేయాలిగాని తెలియక పోయిన అనుభవ పశువైద్యులకు చూపించాలి.

# పంపర వాపులు

రైతులలో కొందరు ప్రతివాపునకు పంపరవాపు అంటారు. ఈపంపరవాపులో రెండుమూడు రకాలువున్నాయి. గంగడోలునుంచి మెడకుత్తుక వరకు, గంగడోలునుంచి ముందుకాళ్ళు, బొడ్డు, వెనుక కాళ్ళు, వీరప్రుసరకు కొన్నిగంటలలో మెత్తనివాపుపుట్టి పశువును బాధించుతుంది దానినే గుండెదుంచి పుట్టించంటారు. రక్తముచెడి అకస్మాత్తుగా చెడునీరు చేరగానే చికిత్స చేయనిచో మరణమునకు కూడా సిద్ధమగుతుంది

మరికొన్నిటికి ఊపిరివాపులంటారు. ఈవాపులుశరీర మందెచ్చటనైన పుట్టి గట్టిగనో, మెత్తగనోవుండి పశువులనుకొన్నాళ్ళుబాధించుతాయి. మరికొన్నిటికి చెవికిందుగా మెడవరకును, దవుడకిందుగాను ఈవాపులుపుట్టుతాయి. ఇట్టివాపులు తరచుగా చలిగాలి తగులుట వలన కంఠమువరకు పుట్టుతాయి గడ్డలుగడ్డలుగా లేచివాచుతాయి

## చికిత్స

గంగడోలునుంచి, కుత్తుక వెనుక భాగమునకు వాచి బాధపడే పశువును ఆలసించక త్వరగా వైద్యునికి చూపించుట అవుసరము. తాత్కాలికంగా ఫార్మసీవార పశురక్షామృతమునుయిచ్చి వాపులకు స్ప్రెయిన్ కిల్లరును మర్దన వేడికాపులు తీయాలి.

తక్కినవాపులకు చవుడు సున్నం కలిపి చుక్కలు పెట్టవచ్చును.

లేక చింతపడు పులుసు, సున్నిపిండి తగినంత కలిపి ఉడికించి వాపులకు అప్పుడప్పుడు పెట్టాలి.

లేక బండిగురిందాకు పసరులో తగినంత సున్నము కలిపి రాయాలి. అన్నిరకముల వాపులకు ఫార్మసీవారి వాతారిఅరఖు స్ప్రెయిన్ కిల్లరునువాడాలి

# చేరువాపు

పశువు అంగము మీాదనుండు తిత్తిమీాదగాని, లోపలగాని పుండుపడి క్రిమంగా పెద్దదికాగానే తగిన చికిత్స చేయనిచో చేరు మాాదగా అగుతుంది. అప్పుడప్పుడు కండ్లనుండి నీరు గారుచుతుంది. తీపు ఎక్కువైన కొలది పశువు నడవజాలదు. మూత్రకోశము వాచి మూత్రము పోయలేక బాధపడుతూ వుంటుంది. ఈవ్యాధి పేగులకు కూడ వ్యాపించుతుంది. ఇట్టి సమయములలో పశువునకు అపాయము కలుగుతుంది చేరుచివర అంచులోపుండు యేర్పడి వాపుగలిగి భాధగా వుంటుంది. పుండును శస్త్రముచేసి హీలాన్‌గాని, కార్నెకర్సునుగాని వాడాలి చేరులోపల ఉల్లిషారవంటి కణితి పుట్టిన యెడల డాక్టరునకు చూపించాలి. లేనిచో ప్రమాాదము రాగలదు

## చికిత్స

ఆరంభములోనే ఈ వాపునకు వేడికాపులు తీయుట మంచిది. తేలికయగు ఆహారపదార్థమును పెట్టుచుండాలి,

నల్లజీలకర్ర 4 తులాలు, ఉప్పు 1 తులము. నల్లఉమ్మెత్తాకు రసము మెత్తగానూరి కుండలోపోసి ఉడికించి ఆ తైలము వాపునకు రాయాలి. తరువాత పిడకనిప్పుచే కాచాలి.

లేక చిన్నపిల్లలనీరుడు 2భాగములు, ఉప్పు 1 భాగము, కలిపి ఆనీరుడు బాగుగాయిగురనిచ్చి అందులో ఉప్పు 2తు, ఉత్తరేణిభస్మం 1తు, కలిపి పశువునకు దాణాగా పెట్టుచుండాలి.

లేక గచ్చాకు 5 పిడికెళ్ళు, ఆవాలు 1తు, నల్లజీలకర్ర 1తు, వెల్లుల్లిపాయలు 1తు, తొక్కి వుండలుచేసి దినమునకొకటి వంతున తినిపించు చుండాలి. పుండును శస్త్రము చేయించాలి.

## అఱ్ఱువాపు

ఎద్దులెక్కువగా బరువులు మోయుటవల్ల బురదనేలలో బండ్లులాగుట విసుపు విరామము లేక రాత్రింబవళ్ళు బండిపని చేయుటవల్ల, మెడ మీద ఆనెడి కాడి గరుకుగా వుండుటవల్ల పగ్గపురాపిడి వలన బం ముందు వెనక బరువులు సమానముగా లేకపోవుటవల్ల అచ్చటి చర్మము ఒరసికొని పోవుటవల్ల. క్రొత్తదూడలను కలుపునపుడు మెడ మీద కాడి ఆనెడి ప్రదేశమందు, చెమట ఎక్కువగా పట్టుటవల్ల పశువుచర్మము ఎక్కువ బిరుసుగా వుండుటవల్ల ఈవాపు కలుగుతుంది. కొన్నివాపులు మెత్తగా వుంటాయి మరికొన్ని గట్టిగా వుంటాయి.

ఆస్థలాల్లో ఆరంభమందు దురదగానుండి క్రమముగా అది గట్టిపడి వాపుగా పైకి కొంచెము తేలుతుంది. ఈవాపు నానాటికి పెద్దదై పెద్దగుమ్మడికాయంత పరిమాణముకలదై వాపులో చెడునీరు చేరుతుంది. మరికొన్ని వాపులు గట్టిగా వుండి పశువు పని చేయలేక మెడ నటు నిటు త్రిప్పుతూ బలవంతము మీద పని చేయించితే మిక్కిలి బాధపడుతూ మిగుల విచారముగా వుంటుంది గట్టిగావుండి వాపులుకొన్ని దినాల వరకుండి పగిలి రసి కారుతాయి గుమ్మడి కాయవలె,వుండె వాపును శస్త్రము చేసితే దానినుండిమురికి నీరుకారుతుంది, ఈనీరు తగ్గిన తరువాత పశువులకు బాధ తగ్గుతుంది. కాని అఱ్ఱువాపువలన పశువుకంత ప్రాణాపాయము లేదుగాని మిగుల బాధపడుతుంది అఱ్ఱుభాగమంత వాపు రుంచి నెత్తురున్న కొంతకాలముకో అరుచిమాందగానై పశువు మరణించుతుంది

## చికిత్స

అఱ్ఱువాపులను జాగ్రత్తగ పరిశీలించి చికిత్స చేయాలి. గట్టిగా వుండే వాపులకు వెంటనే ఇసుక వేయించి కాపులు

తీసిన వెంటనే తగ్గుతుంది. అక్రిమాదమైన వాపు రక్తముతోనుండి ప్రాణాపాయము కలిగిస్తుంది.

వాపు కురుపుగా తేలి పుండయి పగిలిన యెడల పటిక నీటిచే కడగాలి.

అక్రిలయందు ఎరుపు, నలుపు, తెలుపు రంగులుగల కొయ్య గండలు పెరిగిన యెడల శస్త్రము చేయించాలి.

ఫార్మసీనారి వెటరినరీ ప్లాష్టర్‌ను వాడుడు.

బండి గురివిందాకు పసరు ౧తు, తడిరాతిసున్నము ౨తు, కలిపి రాయాలి.

లేక బిళ్ళమసి ౨తు, నిమ్మ కాయంత వెన్నపూస కలిపి ప్రతి దినము వాపునకు రాయాలి.

లేక వరిపొలములందుండు నత్తలలో తెల్లనివి తెచ్చి కాల్చి సున్నముచేసి ఆముదముతో కలిపిరాయాలి,

లేక బొంతజెముడుపాలు గిద్దెడు, ఆవుపేడ రసము ౪ గిద్దలు కలిపి వాపునకు పట్టించాలి.

## గంగడోలు క్రిందవాపు

ఈవాపు ముఖ్యముగా పశువు ముందు రెండు కాళ్ళమధ్య పైభాగములో వాచుతుంది దీనినే మనవారు. పేడపురుగు కుట్టుట వలన కలుగునని తలంచెదరు. ఈవాపు వలన పశువునకు అపాయము లేదుగాని వ్యాధిముదిరి వాపుపగిలి క్రమేణ పుండుపడుతుంది. అవుసర మున్న కొద్దిగా శస్త్రము చేయాలి.

♦ ♦ ♦

# ముప్పది ఆఱవ భాగము

## దంత రోగాలు

పశువు తన ఆహారాన్ని నమలి నెమరువేయడానికి జఠరరసాన్ని ఉత్పత్తి చేయుటకు దంతాలు చేసేపని దంతాల యుపయోగమంతా పశువు ఆరోగ్యముపైన ఆధారపడివుంది. పశువుల దంతాలు వుపరి భాగాలు బల్లపరుపుగావుండి గంట్లు గంట్లుగా వుండుటవల్ల తిరుగలి రాళ్ళవలె పనిచేస్తాయి వీని సహాయమువల్ల మేత వగైరాలన్నీ ముక్కలు ముక్కలుగా నరుకబడుతాయి. ఈ దంతాలన్నీ పింగాణి వంటి పదార్థమువంటి గట్టిఎముకతో నిర్మింపబడియున్నది. దంతము దవుడఎముక ఎముకలోని కూపమున సిమ్మెంటువంటి పదార్థంతో బిగింపబడియుంటుంది. వెలుపలిభాగాన ఎనామిల్ అనబడు కాంతి వంతమగు గట్టిపదార్థముచే కప్పబడియుంటుంది. పన్ను అరిగిపోకుండా ఎనామిల్ కాపాడుతుంది. డెంటిన్ లోపలిభాగము గుల్లగావుంటుంది దంత పోషణకవసరమయ్యే పదార్థాలను తీసికొనివచ్చే రక్తనాళాలు, నాడులు వీటిలో వున్నాయి.

పశువుల యారోగ్యం దంతపరిశుభ్రతపై ఆధారపడియుంది. ఆహారపదార్థాలు దంతాల మధ్యనిలువయుంటే అవికుళ్ళిరోగాలకు కారణమవుతున్నాయి. కొన్నిరకాల సూక్ష్మజీవులు దంతాలపై ఎనామిల్‌ను తినివేసి దంతరోగాలను కలుగజేస్తున్నాయి ఆకస్మికంగా పశువుదంతాలనుండి రక్తంకారుట, దుర్గంధంగావుండే నల్లనినెత్తురు దంతములనుంచికారుట, మున్నగునవి రక్తదోషంవల్ల కలుగుతుంది వాత దోషంవల్ల కొన్నిపశువులకు పంటిపైపన్ను, దంతముపైదంతము పెరిగి బాధగావుండుట, పన్నుపెరిగినకొలది బాధతగ్గి మేత ఊచుట, తినవలెనను కోరికతో తిన్నప్పటికి క్రక్కుట మున్నగు లక్షణాలు వుంటాయి.

# దంత దోషాలు

రెండుమూడు దంతాల కుదుళ్ళలో వాపుపుట్టి బాధ ఎక్కువ గావున్న కఫదోషమువల్ల కలుగుతుంది. దంతాలలో వుండే రక్తము చెడిపోయి అందునుంచి చీముకారుతూవున్న ప్రమాదమని గ్రహించాలి. వాతదోషాల వలన కొన్ని పశువులకు పంటిపై మరల పన్ను



పెరిగి బాధగా వుండుట, పన్ను పెరిగినకొలది బాధఎక్కువై మేత క్రిక్కుట, మున్నగు లక్షణాలు కలుగును గాని యిట్టిదానికి తగిన చికిత్సలేదుగాని పెరిగే దంతాన్ని ఆకురాతితో నెమ్మది నెమ్మదిగా తోముటవలన తగ్గుటయు కలదు. ఇంకను వాతాది దోషాలవల్ల నాలుకక్రింద, దవుడ భాగములయందుండే ఉమ్మిగోళాలలో దోషాలు వుండుటవల్ల పశువు మేత క్రిక్కుతుంది.

దవుడచివర పంటి కుదుళ్ళలో ఎక్కువగా వాపు, పోటు కలిగి నోటి వెంట జిగురుగల చొంగ పడుచున్నయడల అంగిటిముళ్ళు పెరుగును. గాన బాగుగా పరీక్షించి చికిత్సచేయాలి. పశువునకు సామాన్యముగా మునిపండ్లు కొన్నిటికి కదులును, మరికొన్నిటికి కదలవు గాన జాగ్రత్తగా పరీక్షించాలి.

## దంతాల రంగుమారుట

కొన్ని పశువుల దంతాలు రంగుమారి వివిధరంగులుగా కనబడతాయి. దంతాలలోవుండే రక్తంచెడి రంగుమారుతుంది. ఈ రంగు ముదిరిన కొంది దంతాలు గుల్లగానై ఒక విధమగు రసి కారుతుంది. క్రిమిపి అచ్చట పురుగులుపడి పశువును బాధపెడుతుంది.

## దంతాలు కదలుట

వాతరోగంవల్ల, నిర్వాకవల్ల, ఏదైన దెబ్బతగులుటవల్ల, గట్టిదాణాలు తినుటవల్ల, వృద్ధాప్యంవచ్చిన పశువులకు దంతములు కదలుటవల్ల, పలువిధబాధలు కలుగుతూ వుంటాయి.

## దంతాలు పెరుగుట

పశువు లోపలదంతాలలో ఏదోఒకటివున్న పరిమాణం కంటె ఎక్కువగా సూదిమొనలాగాగాని, పలకగాగాని పెరిగి పశువును మేత తిననీయక బాధపెట్టినపుడు వైద్యునకు చూపించితే ఆకురాయితో అరగదీయుటగాని, దంతము తీసివేయుటగాని జరుగుతుంది. మొత్తం మీద మానవుల దంతాలకు చికిత్స చేసినటుల పశువులకు అంతగా వీలువుండదు. సరియగు చికిత్సలు లేవుఅని గ్రహించాలి.

## పంటిచిగుళ్ళ వాపులు

పశువుశరీరం అనారోగ్యంతో కృశించుటవల్లను, ఎల్లప్పుడు వర్షాలలోను చలిగాలిలోను, తేమలోను కట్టివేసి యుంచుటవల్లను దంతముల వాపు పోటు మున్నగునవి కలిగి బాదపడుతూ వుంటాయి.

ఇంకను తదితరరోగాలవల్ల పంటిచిగుళ్ళు సంటికుమురు, దవుడఎముక పైభాగానవాపు పోటుబాధకలిగి ఒకవిధమగు కుసుపులు శేచి పగిలిచితికి లూటీపడుటయుగలదు. ఇట్టివికలిగినప్పుడుమీకుదగ్గరగావున్న పశువైద్యునకుచూపించాలి వైద్యుడుదొరకనిసమయములో ఈగ్రంథములోచెప్పిన పగరులోవన్నుతో కడిగి ఫార్మసీచారగడారిఅను అరఖును వాడుడు

## పండ్లుగార పట్టుట

పశువునోటియందు వ్రాలేలాలాజలము మున్నగుదవ్యములు దంతాలసందున చిగుళ్ళసందున నిలువయుండి పాచి పాకుగు వాటికి పట్టి మాడినరంగుగావుండి చిగుళ్ళనుంచి చీము నెత్తురుకారుతూనోటి వెంట చొంగపడుతూ బాధపడుతూ వుంటుంది ఇట్టివ్యాధులకు లోషన్నుతో ప్రతిరోజు కడుగుతూ తగినమందులను వుపయోగించాలి.

## పంటినొప్పి

ఆకస్మికముగాపశువుదంతాలనుంచి దుర్గంధముగావుండే నెత్తురుకారుట, ఒకదంతము ప్రక్కన లోపలవుండే మాంసముకుళ్ళిమరొక దంతాన్ని చెడగొట్టటమున్నగుదంతరోగలక్షణాలు రక్తదోషమువలన కలుగును.

## పగుళ్లు

పసువు లోపల నరాలపైన తగిలే దెబ్బలవల్ల ఒకొక్క సమయములో బీటలువారును. పశువు కదలినప్పుడు ఆ బీటవారిన ముక్కలు ఒకదానితోనొకట రాచుకొని నొప్పిని కలిగించుతాయి. అందువలన ఆ భాగాన్ని కదిపిన యెడల నొప్పిగావుంటుంది. గాన కదపరాదు, ఇట్టి చికిత్సలు అనుభవముగలవారితో చేయించుము.

# దంతభ్రష్టత్వము

ఏ కారణముచేతనైనా పశువుయొక్క దంతాలలో ఒకటిగాని, రెండుగాని పుచ్చిపోయి దంతభ్రష్టత్వము కలుగుతుంది. దంతమునందుగాని, ఎముకయందుగాని, రంధ్రము, చీము, పుచ్చుట మున్నగు పరిస్థితులు ఏర్పడి బాధ, జ్వరము కలిగి మేత మేయలేక బయటకు క్రక్కుతూ వుంటుంది. ఇంకను నోటివెంట చొంగపడుతూ వుంటుంది ఇట్టిసమయములో వైద్యునికి చూపించి తగిన చికిత్స చేయించుము.

# నోరుపెదవిపుండ్లు

పశువులకుక్రిమిసంక్రమణదోషాలవలనగొంతు. నాలుక, నోరు, పెదవిభాగాలలో పుండ్లుయేర్పడి బాధించగలవు. క్రిందపెదవి క్రిందగాని. పైపెదవిపైనగాని, నాలుకక్రిందగాని, చివరగాని, పెద్దపుండుపడి చెడుద్రవము స్రవించుతూ పుండ్లుపెద్దవైనకొలది లోపలపుండ్లుకూడ కనపడుతూ పశువుబాధపడుతూవుంటుంది. వెంటనే సమీపములో గల పశువైద్యునకు చూపించాలి.

*          *          *

# ముప్పది ఏడవ భాగము

## బుడ్డకొట్టుట, వత్తుట

రైతులలో చాలమంది సుతారులు ఆదికాలమునుంచి మంచి వయసులోనుండు కోడెలకు సుతారంగా బుడ్డకొట్టేవారు. రానురాను నాగరికత ప్రబలినకాలదిబుడ్డకొట్టేవారే కన్పట్టుటలేదు మొత్తంమీద యిప్పుడైన సరియగు సుతారి, అనుభవశాలియుంటే జాగ్రత్తగాబుడ్డ కొట్టించమని నాసలహా

ఈమధ్యకాలంనుంచి పట్కారువంటి పనిముట్టుతో వృష్ణాలపై నుండే నరాలను వత్తుట కొందరు మొదలుపెట్టారు. ఈపద్ధతిమంచిదే కాని సముద్రప్రాంతాల, గరువుప్రాంతాల, కొండప్రాంతాలనుండే టంగణములవంటి పశువులకు ఈపనిముట్టుతో వత్తుటమంచిదే. పెద్ద భారీగా పెరిగే ఎద్దులకు కొట్టుటమేలుంచిది. ప్రతిరైతుఈపట్కారువంటి పనిముట్టుతో నొక్కవచ్చును లేదా అనుభవము గలవారితోనొక్కించవచ్చు ఒక్కొక్కప్పుడు అనుభవముగలవారు నొక్కినపుప్రమాదం రావచ్చును చేరునరాలను సరిగాగ్రహించి పట్టుకొని జాగ్రత్తగా నొక్కాలి పట్కారు వూపివూపి నొక్కక బాలెన్సు సరిగాచూచుకొని అనుభవంతో నొక్కాలి.

ఆరంభములో కొంచెము వాపుండును. తరువాతపగిలి పుండగును. ఎల్లప్పుడు మురికిలో పశువులుంచుటవలన రాగలదు. ముఖ్యముగా గేదెలకు దున్నలకు ఈవాపువస్తుంది,

## చికిత్స

ఒక పదునైన చాకుతోగాని, సూరముల్లుతోగాని ఆవాపుపైన నెత్తురువచ్చునట్లుగా గీయవలెను తరువాత ఉడికించిన పేడరసమును ఆవాపుమీద చీపురుకట్టచే కొట్టాలి. కానికొందరువైద్యులు ఆవాపును కత్తితోచీల్చుదురు వెంటనేరక్తము ఎక్కువగాకారి గాయము పెద్ద దగును. మరల వెంటనే చెడునీరుచేరిపశువును బాధించును. ఇటువంటి సమయములలో వేడికాపులు తీయాలి.

బండిగురివిందాకు నీరుసున్నముతో నూరి పశువు వాపునకు పట్టించాలి

లేక అవిసెఆకు నీరుసున్నముతో నూరి వాపునకు రాయాలి.

లేక జిల్లేడాకుపసరు, దుష్టుపాకుపసరు, వెన్నపూస,పసుపుకలిపి ఆవాపు భాగములకు పూయాలి.

లేక కార్నికస్నుగాని, వెటరినరీప్లాష్టరునుగాని,మర్ధనచేయాలి.

## కాళ్ళవాపులు, పాతనొప్పులు

కాళ్ళ సంబంధమగు పాతనొప్పులుగాని. దబ్బరికపు నొప్పులు గాని, జెబ్బవాపులుగాని, తాత్కాలికచికిత్సలు చేసినప్పటికి ఆయా భాగముల యందుండే వాపులుగాని, కలకలుగాని, వుంటాయి. ఈ వాపులు గలభాగాలలో కొంతమంది రక్షలువారియిష్ట ప్రకారము వేస్తారు ఈరక్షలు వేసినతరువాత ఏచికిత్సచేసినను ప్రయోజనముం డదు.ఎన్ని చికిత్సలకు తగ్గనపుడుమాత్రముఅవి పాతనొప్పులు అనగా ఎప్పుడువుండే నొప్పులుఅంటారు. ఈ పాపునొప్పులుగల భాగముకప్రమేపి కండరభాగము క్షీణించిపోయి కాలుసమానముగా భూమిమీదఆనించ లేక బాధపడుతూ వుంటుంది. అట్టిసమయములోవాత వేయకుండనున్న

అనుభవముగల వైద్యులకు చూపించాలి. ఆవైద్యునకుకూడ సాధ్య పడకపోతే వాతవేయుటమంచిది. ఆభాగపునొప్పి తగ్గుతుంది.

## బుడ్డ గొట్టుట

సాధారణముగా మనదేశములోగిత్తలకు రెండుసంవత్సరములు మొదలు అయిదు సంవత్సరములలోపుగా. అనగా 2 పండ్లు మొదలు 6 పండ్లు వచ్చునప్పటికిగాని బుడ్డకొట్టరు గిత్తకు బుడ్డకొట్టునప్పుడు తాడుగట్టి క్రిందకు పడదోసి వృషణములను గట్టిగా పట్టుకొనిదాని పైనున్న నరమును చేతితో మెల్లగా క్రిందికి జారతీస్తారు తర్వాత వృషణముల పైభాగమున నొక రోకలియు. క్రిందభాగమున నొక రోకలియుపెట్టి వృషణముల పైభాగమును గట్టిగా నొక్కి రెండవ నరమును కడుపులోనికి త్రోస్తారు. తరువాత పైనున్న నరమును రోకలిమధ్యనుంచి వృషణముల లోనికి జారతీసి క్రింద కొడతారు. అంతట వృషణములలోని మూలపదార్థము పిండివలె అవుతుంది. తరువాత రోకళ్లుతీసి వృషణములకు ఆవుపేడ, పసుపు కలిపి రాస్తారు. వెంటనే కోడిగుడ్లు, పాలు పెడతారు. పొగరుబోతు గిత్తలకు రెండు ముక్కుల మధ్యనున్న కండను లావుగాకుట్టి దానిగుండ ఒకఅంగుళము తాడు ముక్కులోదూర్చి కొమ్ములకు కడతారు. ఇందుచే గిత్త పొగరు తగ్గుతుంది. 10, 15 దినములకెల్ల పశువు ఆరోగ్యముగ నుంటుంది

కాని యిప్పటిపరిస్థితుల ననుసరించి పశువులకు బుడ్డలు సరగా కొట్టకపోవుటవలన ఆ భాగమువాచి పుండై మరల వెటరినరీ ఆసుపత్రిలకు తీసికొనిపోతారు. కాబట్టి లోపలి పలుకంతయు పూర్తిగా నలుగునట్లు కొట్టినచో ఆవులమీదికి పోజాలదు, వృషణముల పైభాగ

మయ్బి 10, 15 దినములలో దానిలోపలి పలుకంతయు జీర్ణమై తిత్తిమాత్రమే వ్రేలాడుతుంది. బుడ్డకొట్టుట అరగంటపట్టును. కొట్టిన తరువాత వెటరినరీ ప్లాష్టరును వ్రాయాలి చెడిపోయిన శస్త్రమే చేయాలి.

## బర్డోజీ మాస్క్యులెటరు

ఇదియొక పెద్ద పట్కారువలెనుంటుంది. ఇవి ఆస్పత్రులలో నుంటుంది దీనిపిడివద్ద కొద్ది బలమునుపయోగించిన ఎక్కువ బలముగా నొక్కునట్లు యేర్పాటు చేయునదిగ నుంటుంది ఇది మూసినపుడు నొక్కుటకు ఏర్పాటైన భాగములు ఒకదానికిఒకటి సందు లేకుండా కలిపి కొని యుంటుంది. అందువలన వీటిమధ్యన ఏమియుంచినప్పటికి అదియంత





యు నలిగిపోతుంది. దీనివల్ల ఒక్కొక్క నరమును నిమిషమాత్రము నొక్కుటచేత గుల్లలు హరించుకొనిపోయి జంతువులు నపుంసకత్వము పొందుతాయి. ఈ ఆపరేషను అయినతరువాత ఏవిధమైన చికిత్సయు అవుసరము లేదు. పశువులలో ఈ ఆపరేషన్ విత్తులు తీయకుండగను, నెత్తురురాకుండగను చేయవచ్చును. ఈపనిముట్టుచే వృషణములదగ్గర నున్న నరములు నొక్కినపుడు టబ్ మనుశబ్దము వినబడుతుంది. తరు

వాత బోరిక్ ఆయింటుమెంటుగాని సల్ఫర్ ఆయింట్ మెంటు గాని రాచి విడిచిపెట్టుతారు. తరువాత ఒకటిరెండు దినములువాచి క్రమేణ తగ్గుతుంది పశువులకు జ్వరముగాని మరియొక బాధకాని కలుగదు, కనుక వెంటనే మందలో కలుపవచ్చును. కాని యీ పనిచేయించుట వలన పశువు బుడ్డకొట్టినంత బలముగలదిగా నుండదని అనేకమంది రైతులు చెప్పిరి.

కాని బుడ్డకొట్టుట ఒక అరగంటపట్టును. ఈ పనిముట్టుచేనొక్కినచో రెండు నిమిషములు పట్టును. బుడ్డకొట్టిన జంతువు కొన్ని వారములు వాపువల్ల బాధపడుతుంది. చాలకాలమువరకు వాపు తీయక గడ్డ కట్టి మానుటకు ఎక్కువకాలము పట్టును. ఈ పనిముట్టుచేత చేసిన, వాపు కొద్దిగా నుండును ఆవాపు ఒకటిరెండు దినములలో తగ్గును. బుడ్డకొట్టినపుడు జంతువు పడుబాధ చూడలేము కాని యీ పనిముట్టు వలన కలుగుబాధ చాలతక్కువ. ఈపద్ధతిలోకూడ అచ్చటచ్చట బుడ్డలు చెడిపోవును, నొక్కుచునపుడు చివరకాలములో నెమ్మదిగా నొక్కించాలి కొన్నిటికి ఒకేవ్రణముంటుంది. దీనినికూడ పత్తవచ్చును. ఆరంభములో పత్తినపుడు నలగనిచో మరల కొంతకాలమాగి నొక్కాలి. కొన్నిటికిఎంతజాగ్రత్తగానొక్కినప్పటికి తత్వమును బట్టి బుడ్డపాడగును వాపులకుమాత్రము స్ప్రియిన్ కిల్లరును వెటరినరి ప్లాస్టరును వాడాలి

## పెంపుడు పక్షులు విత్తులు తీయుట

ఇట్లు విత్తులు తీయుటకు కారణమేమనగా:- పక్షియొక్క పరిమాణము పెద్దది అగుటకును, దాని మాంసము తినుటకు మృదువై రుచికరముగా నుండుటకును మరియుచిన్న కోళ్ళకు విత్తనములు తీయుటచే జగడ మాడుటయందు ఇచ్ఛపోయి ఒకదానితో నొకటి పోరాడుట మానుటకును చేయుదురు. మూడు నాలుగు మాసములు వయస్సుగల కోడిపిల్లలకు విత్తులు తీయవచ్చును,

విత్తులుతీయుటకుశస్త్రము చేయుపద్ధతి:—విత్తులుతీయుపక్షులను బాగా పస్తుపెట్టాలి. ముప్పదిగంటలవరకు పస్తుయుంచినయెడలపేగులు ఖాళియై ముడుచుకొని విత్తులుబాగా కనబడుతాయి

అట్లుచేయు పక్షిని బల్లమీద ఒకప్రక్కకు పడుకొనబెట్టి ఒక నౌకరు పట్టుకోవాలి. ఇంకొకమనిషి సహాయము లేనప్పుడుఒకయిటికి ముక్కగాని సీసాగాని రెక్కలకొకటి కాళ్ళకొకటి కట్టి పక్షికదలకుండుటకు వ్రేలాడగట్టాలి. తరువాత చివరరెండు బరెప్రఎముకలకు తొంటికి మధ్యనుండు దూదిఈకలుపీకాలి. అట్లుచేసిన చివరరెండు బరెప్రఎముకల మధ్యశస్త్రము చేయుస్థలము కనబడుతోంది ఒకటిఒకటిన్నర అంగుళము కత్తితో గంటుపెట్టిన చర్మము బరెప్రఎముకల మధ్యనున్న కండరము తెగుతుంది. ఈకోతతగినంత పైకినెట్టిన "V" అనుఇంగ్లీషు అక్షరము మాదిరికన్నముపడి గర్భకుహరమున అంటుకొనియుండు ఆ పొరను చర్మమునందు బడినకోత ఎంతపొడుగో అంతకోయాలి.అప్పుడు విత్తనములు కనబడువరకు పొరకుకోసి బరెప్ర ఎముకలు ఎడముగావుండేలాగు చేయుపనిముట్టును పెట్టాలి. మంచి వెలుతురు వేళలో సూర్యరశ్మితగిలి లోపలభాగమంతయు వెలుతురుగా నుండెడి సమయములో ఈఆపరేషన్ చేయాలి ఎలక్ట్రిక్టార్చి యున్నయెడల చాలబాగుంటుంది. నడుము అడుగుభాగము వులవకాయకు ముందుఆకుపచ్చరంగు కలిగిన చిక్కడుగింజఆకృతిగలవిత్తనము అగపడుతుంది. చెంచామాదిరియున్న పటకారు జొనిపి విత్తనమును పట్టి మెలిపెట్టితీయాలి తరువాత పక్షిని మళ్ళించి అదేప్రకారము రెండవవిత్తును తీయుటకు చేయాలి ఒకనైపునుంచి విత్తనములు తీయుటకు ప్రయత్నించుటకన్న ఏనైపుకానైపు కోసి తీయుటచేత విస్తారము కష్టముకాక లాభకరకంగా యుంటుంది.

తరువాత చేయవలసిన చికిత్స ఫలితము— పుండుకుఏమియు చేయునవసరములేదు. అక్కడపట్టిన రక్తపు గడ్డచే మూతపడిపోతుంది

కొన్ని టికిడొక్కక్రింద వాయువు చేరుటచే విపత్తు కలుగుతుంది. అప్పుడు చర్మమును పొడిచి ఆగాలి పోవునట్లుచేయాలి.

## బుడ్డచెడుట

బుడ్డకొట్టుటవలనగాని, వత్తుటవలనగాని, లోపలనరాలు లేక వృషణములు కమిలి నలిగిపోయి రక్తముచీము కలసిపడుతుంది. అట్టి సమయంలో ఏకాకియో ఆభుంఖుపైన తనముక్కుతో పొడిస్తే వెంటనే జ్వరమువస్తుంది పుండుకూడ పెద్దది అవుతుంది. కాబట్టియిట్టిపుండ్లను జాగ్రత్తగా అనుభవంగల వైద్యునితో శస్త్రచికిత్స చేయించాలి. తెలిసి తెలియని తుప్పపట్టిన బండకత్తులను ఉపయోగించే పరమానంద య్యవైద్యులకూ మాత్రము చూపించరాదు. ఇంకను బుడ్డకుపుండుపడకుండ గట్టివాపున్నను, మెత్తటివాపున్నను జాగ్రత్తగా పరీక్షించి వైద్యునకు చూపించాలి. గట్టివాపుంటే చాలజాగ్రత్తగా చికిత్స చేయించాలి.

# ముప్ఫది ఎనిమిదవ భాగము

## గొంతు, నాలుక, చెవి, దంతరోగాలు

పశువు గొంతుకలోపల వుండే నాలుక, దంతాలు, తదితర భాగాలకు పుండ్లుగాని వాపులుగాని, దంతములు పుచ్చుటగాని, కలిగినపుడు ఆయాభాగాలను పరీక్షించాలి. పరీక్షించిన తరువాత రైతు తాను చేయగలిగిన చికిత్సయుంటే చేయ్యాలి. తెలియకపోతేమరొక అనుభవంగల వైద్యునకు చూపించాలి అంతేగాని తెలిసి తెలియని చికిత్సలు చేయరాదు.

## నాలుకక్రిందగుల్ల

నాలుకక్రింద నిమ్మకాయంత, దబ్బకాయంత పరిమాణముగల కురుపులేస్తుంది. ఈకురుపులోపల తెల్లని జిగటవంటిపదార్థంతో కూడి

కొన్ని మేతమిగ్రింగనీయక బాధపెడుతాయి నోరు తెరచిచూస్తేస్పష్టంగా గుల్లవంటి కురుపు గాని, వాపుగానికనబడుతుంది నోరు తెరవలేదు. అట్టి సమయములో అనుభవముగలవైద్యునికి చూపించాలి ఆవైద్యుడుఅవు సరముంటే శస్త్రముచేస్తాడు. లేకపోతే మందులతో మాన్పుతాడు

## గొంతులో కురుపులు

పశువుయొక్క గొంతుక శుచిగా లేకపోవుట వలనగానిగొంతు కలో ఒకవిధమైన సూక్ష్మజీవులుప్రవేశించి నిలుకడగా నుండుటవలన గాని, గాలికుంటు, మశూచి మున్నగు వ్యాధులు సోకుటవలనగాని, ఈ కురుపులు పుట్టుతాయి

గొంతువాపుదల నొందవచ్చును. నోటినుండి ఒకవిధమైన చొంగ పడుతుంది. నోటినుండి దుర్వాసన వస్తుంది కురుపులు ఎరుపు రంగుగా వుంటాయి. పశువు అపరిమితముగా బాధపడుతుంది.

గొంతులో పొట్లు పొడుచు చున్నట్లుంటాయి ఊపిరిపీల్చు టకు కష్టముగా వుంటుంది. మేత మున్నగువానిని తినదు. జావమొద లగు ద్రవపదార్థములను త్రాగుతుంది.

## చికిత్స

వెదురుగొట్టముగాని, వేపుచువ్వగాని, పశువునోటియందుం చాలి. తరువాత ఆగొట్టముగుండా మనచేతినిపోనిచ్చి ఆకురుపులను తాకి కనుగొనాలి. పక్వమునకు వచ్చినచో ఆకురుపులను చిదుపాలి. ఆ పైన పటికనీరుతో కడిగి తగినమందు వేయాలి.

ఉప్పునీరు వేడినీరు అర్ధశేరు, కలిపి త్రాగించాలి.

లేక పాతచింతపండు రసముఅర్ధశేరు, త్రాగించాలి.

లేక వాకుడాకురసము 10తులములు లోపలికియ్యాలి.

లేక వెల్లుల్లిపాయ రసము 5తులములు త్రాగించాలి,

వాతారి అరఖును వాడాలి.

## గొంతులో వస్తువులడ్డముపడుట

ఆహారవాహిక పశువుయొక్క గొంతునకు ఎడమభాగమందుంటుంది దీనికిస్పర్శజ్ఞానమధికము ఆహారపదార్థములు దీనినితాకినవెంటనే దానినిలోపలికి పోనిచ్చి వెనుకభాగమందు ముడుచుకొనుచు దాని సముందునకు జరుపుతుంది. ఇట్లు మేతనీరు కొంతపోయినతరువాత తిరిగి వెనుకభాగము ముడుచుకొనుటవలన ఇదిక్రమముగాజరుగతుంది జీర్ణాశయములోనికి బోతుంది ఇదిజాలకసంచివలెనుంటుంది. మరియు పశువునోటికి నెమరు తెచ్చుకొనుటకూడ ఈమార్గముననేఈగొట్టము యొక్క లోపలిభాగము యెల్లప్పుడు తడిగావుంటుంది. అందువలన ఆహారము ఈగొట్టముగుండా జారిపోతుంది.

పశువులు నములకుండగనే చెరుకుగడలు. దుంపలు, తాటిపండ్లు నారదినుసులు, గుడ్డపీలికలు మొదలగువానిని ఆతురతతో తినునప్పుడు గొంతుకోవిలో అనగా పైన చెప్పిన ఆహారనాళములో చిక్కుకొని అడ్డుతగులుతాయి. వానికివాడిగల అంచులుగాని, మొనలుగానియున్న యెడల గొంతునకు గాయములు యేర్పడుతాయి.

### లక్షణాలు

జంతువుయొక్క గొంతు నొప్పిగా వుంటుంది. తగ్గుతుంది. చొంగ కారుస్తుంది కడుపుబ్బుతుంది. కడుపుబ్బిన యెడల పశువు చనిపోతుంది ఆహారనాళము కొన్నిటికి వాస్తుంది ముక్కునుండి నీరు కారుస్తుంది కడుపుబ్బకుండనుండిన యెడల కొంతకాలము జీవిస్తుంది.

### చికిత్స

వెటరినరీవైద్యశాలలో ఒకవిధమైన పనిముట్టును గొంతులోనికి దూర్చి అడ్డును తొలగిస్తారు పశువుగొంతును ఒత్తరాదు. ఒకయినుపకడ్డీని పశువు నోటిలోకి పోనిచ్చి జాగ్రత్తగా లోపలిగాలి బయటికి లాగాలి లాగినతరువాత మెత్తని మేత, నూకలజావ పెట్టాలి.

# సర్పి

ఈవ్యాధి వాతరోగములో, పాండురోగములో, రక్తప్రసరణమునకు ఆటంకము గలుగుటవలన, వేడిగల పదార్థములను మేపుటవలన సర్పము ఏమాదిరిగా త్వరగాఅటునిటుపాకుచుండునో అదేమాదిరిగా నీసర్పి పశువు శరీరమంతటను వ్యాపిస్తుంది.

## లక్షణాలు

ఆరంభములో పశువునకు జ్వరము కలుగును. పశువు కంఠములోపలనో, తదితర భాగములందో ఒకవిధమైన కురుపులు లేస్తాయి ఇవిలేచిన వెంటనే త్వరత్వరగా ఆయాప్రదేశములకు పాకుతుంది. నోరు తెరువజాలదు. నోటినెంట ఒకవిధమైన చొంగకారుతుంది. దాహమెక్కువగావుంటుంది. వ్యాధి ముదిరినకొలది నోరు తెరువజాలక ఒకవిధమైన దుర్వాసన కొడుతుంది. నాలుక నటునిటు త్రిప్పజాలక రెండు దవుడల మధ్యగా కరచుకొనివుంటుంది. మూతిభాగముందైనచో ఆభాగమంతయు వాస్తుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసములనాటంకపరుస్తుంది క్రమేణా కంఠముదగ్గరగాని, మూతిమీదగాని, యున్న వాపు గంగడోలునకు దిగును ఈవిధముగా 3, 4 దినములుండి ఉచ్ఛ్వాస నిశ్వాసము లాడక మృతినొందుతుంది.

## చికిత్స

చేదుజీలకర్ర 1 తులము తీసికొని తేనెతో కలిపి ఆ సర్పిభాగములకు రాయాలి. లేక నల్ల ఉమ్మెత్తాకురసము రాయువచ్చును.

తప్పకుండ విరేచనమునకు మందీయాలి. పటికనీటితో నోటిని కడుగుచుండాలి. లోపలికి నా తారిఅరఖును, పై వాపునకు బెటడిన్‌రీ ప్లాస్టరును వాడాలి

## హెచ్చరిక

ఈవ్యాధి తగిలిన పశువును ప్రత్యేక స్థలమందుంచు టత్యావసరము. అనుభవముగల వైద్యునకు చూపించి తగిన చికిత్సచేయాలి కొందరు మంత్రములను పెట్టించెదరు. ఎన్ని మంత్రములు పెట్టినప్పటికి ఆరంభములోనే తగినచికిత్స చేయనియెడల లాభము లేదు. ఈవ్యాధి మనుష్యులకు సోకుటకంటె పశువులకు నాలుగురెట్లు విస్తరించును.

## నాలుక రోగాలు

1 నాలుకపగిలి మొద్దుబారి రుచి తెలియక, గరగరలాడుచు అప్పుడప్పుడు నీరుపడుచుండిన మాచికాయపొడి లేక కవిరిపొడి తగినంత తేనెలోకలిపి రాయుచుండిన తగ్గుతుంది.

2 నాలుక ఎర్రబారి, పొడుగై, ముండ్లుముండ్లుగానుండి, వాచి బాధపడుచున్నపుడు ఏదైన చికిత్సచేయాలి.

3. నాలుక మిక్కుటముగావాచి పుండ్లుగాని చిన్న చిన్న రంధ్రములుపడి బాధపడుచున్నపుడు విషవస్తువులు మ్రింగినదా? సర్పియను జబ్బువలన వచ్చినదా? నాలుక తెగినదా? మున్నగు విషయములు తెలిసికొని చికిత్సచేయాలి.

4. నాలుక చివరలోపల అచ్చటచ్చట పొక్కి- పల్లపడిన విష సంబంధమని గ్రహించాలి.

## చెవిరోగాలు

మానవులకువలె పశువులకుకూడ చెవి సంబంధమైనరోగాలు వున్నాయి చెవిలోపల భాగమునందు సన్ననినాళికలు సూదిమొన యంత పరిమాణము కలిగి ఎల్లప్పుడు ఒకవిధమగుద్రవముస్రవించుతూ దుర్వాసనగావుంటుంది. మరికొన్నిటికి చీముతోకూడిన రక్తద్రవము చెవిగూబలోనుంచి ఎల్లప్పుడూ కారుతూవుంటుంది. లోపలచెవినత్తగుల్ల

ఆకారముగావుంటుంది. దీనిలోనుంచి చీముకారుతుంది. కాబట్టివగరు లోపన్నుకో కడిగినిమ్మఫులుసులో గవ్వభస్మముకలిపి కొన్నిచుక్కలు అప్పుడప్పుడు వేస్తూవున్నతగ్గుతుంది చెవిలోపల పుండుయేర్పడి దుర్గంధం వేస్తూ ఈగలువాలి పుండులో పురుగులుపడి క్రిమిపి ఆ భాగమంతా తినుటవలన చెవినరాలు బలహీనత చెంది చెవివాలిపోతుంది. మరికొన్ని పశువుల రెండుచెవులకు పనుగగజ్జి యేర్పడి దురదపెట్టినపుడెల్ల కాలిడెక్కలతో గోకుకొనుటవల్ల పుండ్లుపడి ధనుర్వాతముకో కొన్ని పశువులు మరణించగలవు గాన చెవులను పపూటకాపూట లోపనునీటితో కడిగి ఫార్మసీచారి అనోడైన్ మందును వాడుట మంచిది,

చెవికి దెబ్బతగులుటవల్లగాని, వాతరోగమువల్లగాని, చెవికి త్రాడుకట్టి లాగుటవల్లన సాంక్రామిక రోగాలవల్లగాని చెవివాపులు కలుగుతూవుంటాయి. మరికొన్నిటికి చెవికి దెబ్బతగులగానే ఆభాగపు కంటెనరానికికూడ దోషముతగిలి కనుగుడ్లులోపలికి పోవుట, చెవి వాలిపోవుట, కంటిభాగముకూడ వాపుగావుండుట మున్నగులక్షణాలు వుండునుగాన జాగ్రత్తగా పరీక్షించి చికిత్సలు చేయాలి.

## చెవిలో చీము

చెవిగూబలోగాని. మధ్యగూబలోగాని వాపుఉంటుంది. ఈ వాపువాతదోషమువల్ల రాగలదు చలిగాలి తగులుటవల్ల ఈ వపు ఎక్కువైన చెవిలోపల ఒక విధమగు పురుగుపుట్టును

ఒకటిరెండు దినములైన తరువాత దురదపుట్టె పసుపుపచ్చని చిక్కనిద్రవము కారుతుంది దీనినేచీము అంటారు. ఈచీమువచ్చిన తరువాత కొన్ని పశువులకు చెవిలో వ్రణముగా తేలుతుంది ఈవ్యాధి త్వరగా నెమ్మదికాదు.

## చికిత్స

ఈవ్యాధిగల పశువుతో పనిచేయించరాదు. చెవిలోమందుపో సిన తర్వాత చెవినికొమ్మునకు కట్టాలి. వగరునీటితో పిచికారిచేయా

లి. వాతమువలన చెవులోనుంచి రసికారుచున్న చాలకాలమునకుగాని తగ్గదు.

కలబందమట్టను కాచిరసముతీసి చీము లేనిచెవిలో రెండుమూడు పూటలుపోయాలి.

లేక గవ్వసున్నము కాల్చిపొడిచేసి ముందుగా చెవిలోవేసితరు వాత నిమ్మపులుసు అరతులము పోయాలి.

లేక వేపనూనె 10,15 చుక్కలుపోయాలి.

లేక నిమ్మపండురసము 1/ తు, వేపచెక్కరసము 1/2తు, రస కర్పూరము 1/4తు, కలిపిచెవిలో పోయాలి.

లేక సారాయి5,6 చుక్కలు పోయాలి.

లేక ఫార్మసీవారి ఆరోడైన్‌ను వాడుచు పశురక్షామృతమును లోపలికి వాడాలి.

# ముప్పదితొమ్మిదవ భాగము

## చర్మరోగాలు

పశువునకు ఆరోగ్యవంతమైన చర్మమే అందానికిమూలకారణం. ఆరోగ్యానికి కూడా చర్మముతీరు కొలత బద్దవంటిది. చర్మపు స్థితిని బట్టీ పశువునకు వుండే కొన్ని కొన్ని రుగ్మతలనూ, రోగాలనూ పోల్చ వచ్చు. చర్మాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే అది రెండురకాల పొరల వలన ఏర్పడినదనిన్నీ ఆరెండు పొరలకూ ప్రత్యేక వ్యాధులున్నాయనీ తెలుస్తూ వుంది చర్మముపైపొరయందు క్రొవ్వుతో కూడిన మెత్తని పదార్థం వుంటుంది.

లోపలపొరలో నరములు రక్తనాళాలు వ్యాపించియుంటాయి పైపొరయందు రక్తనాళాలు ఛండవు. శరీరముపైన వేడినీరుపడితే బొబ్బలు పడుతాయి ఆబొబ్బపైనవుండే పొరయే చర్మముయొక్క పై పొర చర్మము దేహమందలి ఉష్ణాన్ని సమానంగా కాపాడుతుంది. చర్మమునకు కావలసినంత రక్తాన్ని యివ్వడానికి, రక్తనాళాలకు నరాలకు రక్షణయివ్వడానికి క్రొవ్వుమాత్రము సహాయకారిగావుంటుంది. చర్మము స్వేదంద్రియము చెమట, జిడ్డులను చర్మముబైటకిరప్పించి శుభ్రముచేస్తుంది. సూర్యునియొక్క శక్తిదాయకమైన కిరణాలు చర్మముపై పడగానే చర్మముఅభివృద్ధికి ఎముకలఅభివృద్ధికి శక్తినియిచ్చుతుంది. ప్రతిరోజు పాడిగేదెలను దున్నలను కడిగిశుభ్రము చేస్తూవుండాలి దుక్కిటెద్దులను ఆవులను మాలీషు చేస్తూవుండాలి. లేనిచో పేలు ఈగలు, గోమారులు పుట్టిపశువులకు పలువిధరోగాలు పాలుచేస్తాయి

విసర్జనక్రియలో చర్మానికి మూత్రపిండాలకు పరస్పరసంబంధం వుంది. వేసవికాలములో చర్మమువల్లనీరుఎక్కువగాను, పశువుమూత్రపిండాలవల్ల తక్కువగాను విసర్జింప బడుతుంది. శీతాకాలమందు మూత్రము చర్మముద్వారా తక్కువగాను, మూత్రపిండాలద్వారా ఎక్కువగాను వెలువడుతుంది. ఇంకను చర్మమువలన పశువుశరీరానికి యితర ప్రయోజనాలు వున్నాయి.

## పురుగు తొలచుట

పశువు శరీరభాగమందెచ్చటనైనా ఒకవిధమగు దారమువంటి సన్నని పురుగు తొలచుతూ రక్తము ధారగాకారుతూ వుంటుంది. మరి కొన్నిటికి నాలుగైదు చోట్లకాకుతూవుంటుంది అట్టిసమయంలో లోపలికి గాడిద గడపాకు పసరు—— పావుశేరు, చింతపండుపులుసు అర్ధశేరు, పటికపొడి—— 6 వడ్లగింజల ఎత్తుకలిపి రెండురోజుల కొక పాడి ఒకమోతాదు యిచ్చిన తగ్గుతుంది. రక్తము కారే వుండును

పటికపొడితోగాని, మామూలుఉప్పుతోగాని, కవిరి లేక కాచుపొడితో గాని రోజుకు నాలుగైదుసార్లు చేతితోపుండును నొక్కిన చక్కగా పనిచేస్తుంది.

## చర్మము మచ్చలు

శరీరముమీద, తోకమీద సున్నితమైన పొరలు చెడుటవల్ల, క్రిమిసంబంధమైన దోషాలవల్ల వెండ్రుకలు అచ్చటచ్చట వూడి పోయి చిన్నచిన్న మచ్చలు పడగానే మన రైతులు పురుగు చేష్టలు అంటారు. ఇట్టి మచ్చలు కర్పూరము, మైంతుత్తం, గంధకం తగినన్ని పాళ్ళతో వెన్ననుగాని, వ్యాసులైనుగాని కలిపి అప్పుడప్పుడు రాస్తూ లోపలికి నాలుగు దినాలకు ఒకసారి చింతపండు పులుసు అర్ధ శేరు త్రాగించాలి లేక ఫార్మకీవారి కేటూరిని వాడాలె.



## గిట్టల చుట్టు పుండ్లు

తడి, బురద, సున్నం, చవుడు. మానవునిమలము మున్నగునవి పాదాలలో గిట్టల చుట్టూ చేరుటవల్లచర్మము తెల్లబారి తెల్లనిపొక్కు

లుగా యేర్పడి అచ్చటవున్న చర్మాన్ని చెదలు తిన్నట్లుతింటూ పశువుకు బాధకలుగజేస్తుంది. గాన ప్రతిరోజు ఆభాగాలను కుంకుడు కాయరసంతో కడుగుతూ కవిరి, మాంచికాచు కర్పూరం కలిపిన పొడిని ఆపుండ్లకు పట్టించిన తగ్గుతాయి. ఈరీతిగా ఎన్నో చట్కా చికిత్సలు వున్నాయి.

## చర్మ వికారము

పశువుకు వచ్చే పెద్దరోగము, మశూచిజ్వరాలవల్లగాని, శరీరానికి పడనిమందులూ ఆహారపదార్థాలు వాడుటవల్లగాని, చర్మమంతా వికార రూపమైన దురదకలిగి పొక్కులుఎర్రబారి పశువు బాధపడుతూ వుంటుంది. వైద్యుడు ఈవికారం దేనివల్లవచ్చినదో విపులముగా తెలిసికొని చికిత్సచేయాలి.

## అధిక స్పర్శ జ్ఞానము

పశువునరాలకు సంబంధించిన బలహీనతవల్ల ఈ స్పర్శజ్ఞానము కలుగుతుంది. పశువుకు ఆభాగమందు తాకగానే ఉలికిపడుతూ బెదరి బెదరిచూస్తూవుంటుంది. ఈరీతిగా కొంతకాలము వుంటూ మరికొంత కాలము పోతూవుంటుంది. కాబట్టివైద్యుడు ఏకారణంవల్లవచ్చినదో తెలిసికొని తగినచికిత్సచేయాలి.

## చర్మము లావెక్కుట

పశువు శరీరంపై తెలుపు. పసుపు రంగుగల మచ్చలేర్పడి చర్మాన్ని దళసరిగాచేస్తుంది. ఈదళసరి క్రమేపి ఎక్కువై పశువు ఆరోగ్యాన్ని పాడుచేస్తుంది. గాన ఏకారణంవల్ల ఈ వ్యాధి కలిగిందో వైద్యుడు తెలిసికొని తగిన చికిత్సచేయాలి.

## చర్మపు అతిమెరుపు

పశువు చర్మానికి సంబంధించిన గ్రంధులు అతితీవ్రతగా పని చేయుటవల్ల నూనెవంటి జిడ్డువంటి పదార్థము చేరుతూవుంటుంది

అందువలన చర్మవికారం చర్మరోగాలు పుట్టుతాయి. గాన తగిన చికిత్స చేయవలసి యుంటుంది.

## చర్మము కొరుకు కొనుట

కొన్ని పశువులు విషసంబంధమైన ఆకులుగాని, వేళ్ళుగాని, విషపు నాళీళ్ళుగాని మిగింగినపుడు ఆవిషమంతా శరీరమంతటా రక్తములో వ్యాపించి, దురద మంట, బాధకలుగుటవల్ల శరీరముపైన అచ్చటచ్చట కొరుకుకొనుటవల్ల పుండ్లుపడును.

అట్టిసమయములో ఫార్మసీవారి పశురక్షామృతంలోఅన్న భేది 1తులము, చింతపండుపులుసుగాని గాడిద గడపాకు పసరుగానితగినంత కలిపి నాలుగైదుపూటలు యిచ్చినతగ్గును

## కాలిన బొబ్బలు

పశువుశరీరము మీద వేడినీరు, వేడిగంజి, ఎర్రగా కాలిన యినుపవస్తువులు మున్నగునవి ఆకస్మికంగా పడినపుడు, గంధకపు ద్రావకము మొదలగు ద్రావకాలు తగిలినపుడు పశువు శరీరము కాలుతుంది. శరీరముమీద తేలికగా కాలితే శరీరము ఎఱ్ఱబడుతుంది. దేహముకూడ కాలితే బొబ్బలెక్కుతాయి. శరీరము ఎక్కువగా కాలితే అపాయము కలుగుతుంది. శరీరముమీద పుండ్లుపడితే ఈగలుముసిరి పురుగులను కలుగచేస్తాయి. కాబట్టి జాగ్రత్తగా కాపాడాలి.

## చికిత్స

నవనీతమును వాడాలి. నవనీతమంటే సున్నపునీరు కొబ్బరినూనె సమానముగా కలిపిచేతితో గిలకొట్టగా వచ్చిన వెన్నవంటి పదార్థమునే నవనీతమంటారు. శరీరము కాలగనే వెంటనే ఆరగఆరగా ఈ నవనీతాన్ని రాయాలి

లేక మజ్జిగతో పెడకబూడిదను కలిపి రాయాలి.

లేక వంటఆముదము సవాశేరు, రాతితడిసున్నం పదితులాలు, నీరుమానెడు కలిపిచేతితో గిలకొట్టగావచ్చిన వెన్నవంటి పదార్థాన్ని కూడ నవనీతమంటారు దీనినికూడ వాడవచ్చును

లేకఫార్మసీవారి గ్లయిమాల్ను రాయాలి.

## గజ్జి

ఇదిపశువులకు ఒకవిధమగు సూక్ష్మజీవులవలన రాగలదు. ఈ పురుగులను "పారసైట్" జీవులంటారు. ఇవి చర్మభాగములో వుండే రోగపదార్థాన్ని తింటూ లోపల గుర్లుపెట్టి పోతుంటాయి. ఇదివేడి పదార్థముగావుండి దురద, గులహెచ్చుగా వుంటుంది. ఈగజ్జి మెత్తని భాగానికి ఎక్కువగా సోకుతుంది. ఈరోగము పెద్దపశువులకు, బలహీనంగా వుండే మగపశువులకు ఎక్కువగా వుంటుంది. ఈగజ్జినే చర్మ నుసిమిరి అంటారు. మూపురంమీద మెడభాగమందు, వెన్నుభాగమందు, ప్రక్కటెముకల చర్మముమీద వలువురంగుగా గాని, పసిమి రంగుగా గాని యుండి దురదకలిగినప్పుడెల్ల గోడలకు చెట్టులకు వేసి రుద్దుకొంటుంది. వ్యాధి ముదిరిన తగ్గుటకష్టము

## చికిత్స

గంధకము 1తు. మైలతుత్తం1/4తు, వ్యాసులైను 8తులాలుకలిపి అప్పుడప్పుడు రాయాలి

లేక సన్నని గోనెపట్టాతునకను మాడ్చి ఆముదరోకలిపి రాయాలి. లేక ఫార్మసీవారికీ టారి అత్యద్భుతంగాపనిచేస్తుంది

## గజచర్మరోగము

ఈవ్యాధి పేనుసంబంధమైనట్టి బూజుసంబంధమైనట్టి, సూక్ష్మ జీవులవలన పశువులకు కలుగుతుంది. ఇది ఉష్ణరోగపదార్థమండలము

వలన ఉత్పత్తియగుతుంది మొదట పశువు శరీరమునం దక్కడక్కడ ఈనుసిమిరి పుట్టి క్రమేపి వృద్ధియగుతుంది. పశువునకు ఎక్కువగా దురద, మంటపుట్టి అప్పుడప్పుడు తనపండ్లతో గీరుకొంటుంది. బొబ్బలుకూడ పుట్టవచ్చును. క్రిముు గ నల్లమచ్చలుగా మారి అవి గుడ్లుపోసి పలుచని ద్రవాన్ని స్రవింప జేస్తుంది. వెంట్రుకలు రాలి పోతాయి. ఈవ్యాధిగిత్తలకు తరచుగా వస్తుంది, పశువుఅప్పుడప్పుడు నుసిమిరియున్నచోట గోడలకు, గుంజలకు, కట్టుగొయ్యకువేసి రుద్దు కొంటుంది. పశువు ఆకారముచెడి క్షీణించి కాంతి తగ్గుతుంది. ఈవ్యాధి ముదిరినచో తగ్గుట చాలకష్టము.

## చికిత్స

సైంధవ లవణము కలబందమట్ట రసముతో కలిపి రాయాలి.

మేకవదరు వేడిదైనది తీసికొనివచ్చి శరీరమునకు మూడునాలు గు పూతలు పెట్టి తరువాత వేడినీటితో కడగాలి

3తులాలు పసుపు, అర్ధసేరు ఆవుపాలతో కలిపి ఒకపూటత్రా గించిన తరువాత అడ్డసరపు విత్తులు, నువ్వులు, ఉప్పు. కొట్టుపసుపు, వెట్టిపుచ్చ వేళ్ళు, బావంచాలు, జిల్లేడుమొగ్గలు ఒక్కొక్కటి తుల ము వంతున తీసికొనివచ్చి మెత్తగా నూరి వేపనూనెతో కలిపి నుసి మిరియున్న చోట రాయాలి మూడవనాడు మేకపొట్టలో నుండు వె చ్చని వదరు రుద్ది నాల్గవనాడు వేడినీటితో శరీరమంతయు కడుగాలి శరీరమంతా వ్యాపించి పచ్చలుపడి బాధజెందు నుసిమిరి తగ్గుట చాలకష్టము. కీటాగ్ని వాడుడు లేక పాలతో ఇంజెక్షను చేయించాలి.

## పశువుదేహము ఉడుకెత్తుట

పశువును అతితీవ్రమైన ఎండలో పని చేయించుట వలన అసమయములోనే దాహమెక్కువై శరీరము వుడుకెత్తి యుండుట వలన చన్నీళ్ళతో దేహము కడుగుటవలనజ్వరముసోకుటవలనఎండలో

పనిచేయించుటవలన వ్యాధి కలుగుతుంది. పశువు ఎండలో వుండక వగర్చుతూ నీడకు పోతూ నీటిలో కూడ పడుతుంది. దేహమంతా మంట లెక్కుతుంది.

## చికిత్స

సూరేకారము 2తులములు నీటిలోకలిపి త్రాగించాలి చన్నీటిలో గుడ్డముంచి తలకు కొట్టాలి.

శరీరముపైనకూడ చన్నీటి కాపులు తీయాలి. లేక పాటాల్ వాడాలి.

## వెంట్రుకలూడిపోవుట

పశువునకు పెద్దరోగము, జ్వరము గాలికుంటు మొదలగు రోగాలు తగిలి నెమ్మదించిన తరునాత పశువు ఈనిన తరువాత లేత దూడలకు దుర్బలత్వముచేత వెంట్రుకలు వూడిపొవుట తటస్థించు తాయి. పొట్టివెంట్రుకలు కత్తిరించాలి.

లేక వ్యాసులైనులో నీలిమందు తగినంత కలిపి రాయాలి.

లేక ముసాంబ్రము ఘాటు సారాయిలో కలిపి రాయాలి

లేక నెల్లుల్లిపాయలపొట్టు కాల్చి నీమనూనెలో కలిపిరాయాలి.

## గోమారులు బుడ్డపురుగులు

ఈ గోమారులు కాలబుతువులనుబట్టి పుట్టుతూ మరల వాటంతటవే పోతూవుంటాయి. కానియివి పశువును పట్టుకొని నెత్తురును పీల్చుటచేత పశువు దుర్బలత్వముచెంది పలువిధ సంకటముల పాలగుతుంది. కాబట్టి వెంటనే వీటికి తగు చికిత్సచేయాలి. గోమారులు బహు మొండిజాతి. వీటికి పశువు శరీరమును తొలుచుకొని పోవునంతటి శక్తివుంది. ఈ గోమారులున్న పశువును చూచిన మనకు

చాల అసహ్యంగా వుంటుంది. ఈ గోమారులవల్ల రక్తమూత్రింఅనే వ్యాధిసోకునని ఇదివరకే ఈ గ్రంధములో చెప్పియుంటిని. పశువు పొదుగుమీదను, కాళ్ళమీదను, కండ్ల రెప్పలమీదను వీలులేని స్థలములమీదను పట్టిబాధించుతాయి

## చికిత్స

ఫినైల్ అర్ధసేరు, గ్రెంచి వార్నిషు పావుసేరు, కార్బాలిక్ 1తు,గంధకపుపొడి 4తు, వేడినీరుసేరు కలిపి దీనిని గుడ్డతోముంచి రాయాలి.

లేక మంచినూనె దేహమంతటికిరాచి ఎండలో వుంచితే చావవుగాని ఊడిపోతాయి. కాబట్టి ఈ చికిత్సచేయు పశువును దూరముగా ప్రత్యేకస్థలమందుంచి చికిత్సచేయాలి. లేక ఫార్మసీవారి కండూతున్రను వాడాలి.

## హెచ్చరిక

గోమారులున్న కొట్టాలలో పశువునుంచి చిన్న మంట వేస్తారు. ఇదిచాల ప్రమాదకరమైన విషయము. నేను ఈ గోమారుల వలన తగులబడిన కొట్టములను ప్రత్యక్షముగా చూచియున్నాను. కాబట్టి ఇటువంటి ప్రమాదకరమైన పనులు చేయుటచేత కొన్ని పశువులు కూడ మరణిస్తాయి.

## తోకనుసిపురి

పేడ మన్ను మొదలగు కల్మష పదార్థాలు పశువుతోకకు అంటుకొని యుండుట చేతను రైతులు వానినిపరిశుభ్రముగా కడుగక పోవుట చేతను ఈవ్యాధి కలుగుతుంది. ఒక విధమైన బూజు సంబంధమైన సూక్ష్మజీవులు తోకలోపలిభాగమున ప్రవేశించి దురదపుట్టించుతుంది. తోక నల్లబడి వెంట్రుకలు వూడిపోతాయి ఈవ్యాధి పశువు

తోకకుచ్చుకు పైభాగానే యుంటుంది. ఇది యెక్కువగా వ్యాపించితే పశువుతోక సరిగా నెత్తలేక కుచ్చుతో నటునిటు విసరుకొంటుంది.

## చికిత్స

మైలతుత్తము పావుతులము, గంధకము 1 తు, వస 1 తు వ్యాసులైను 2తు కలిపి నుసిమిరికి రుద్దాలి

లేక ఒక వంటపిడక తెచ్చి తోకపైనున్న నుసిమిరిపై ఎఱ్ఱబడునట్లు రుద్దాలి. తరువాత దానిపైన పసుపుమీగడ కలిపి రాయాలి ఇట్లు రెండుమూడు దినములుచేసిన నెమ్మదిఃపగుతుంది.

పసుపు నల్లేరుతో కలిపిబాగుగా రుద్దాలి.

విషబొద్ది కొబ్బరినూనెలో కలిపిరుద్దాలి.

వెన్నతో ముర్దారుసింగు కలిపిరుద్దాలి.

ఆముదపు పలుకులు నూరేకారము ఉప్పుమెత్తగానూరి పెరుగుతోకలిపిరాయాలి ఫార్మసీవారి కీటారి చక్కగాపచేనిస్తుంది.

## పొడలు-మచ్చలు

పశువు శరీరముమీద గుబురు గుబురుగ ఒకవిధముగ మచ్చలేర్పడుతాయి కానీవీనివలన ప్రమాదముండదు. పశువు ఆకారము చెడుతుంది. వాటంతటవి ఘడుతుంటాయి. ఇవిచలిగాలి సోకగనేపోతుంటాయి.

## చికిత్స

విభూతి, పుల్లమజ్జిగ కలిపి నాలుగైదు దినములు రాయాలి. మజ్జిగలో పిడక బూడిదకలిపిరాయాలి. ఆవనూనెలో వెల్లుల్లిపాయలు వేసికాచి రాయాలి. వేపాకు కాల్చినబూడిదతో నెయ్యికలిపిరాయాలి రావిచెక్కబూడిద కొత్తతడిసున్నముతో కలిపిరాయాలి.

లేక హిలాన్‌ను వాడాలి

## జోరీగలు

జోరీగలు పశువు కడుపు అడుగుభాగాన తదితర భాగములులందు వందలకొలది వేసవికాలపు చివరదినాలలో ఎక్కువగా కాన్పించుతాయి జోరీగపిల్లలను పశువు మింగినపుడు గుండుసూది పరిమాణము గలిగియుంటాయి కాని రెండు నెలలపిమ్మట యువిజూన్ జూలై వరకులో పలయుండి తరువాత మలముతో పాటు బైటకివస్తాయి



ఈపురుగులు కడుపు లోపలిభాగమునుండి యేమైన హాని చేయునిదీ లేనిదీ పశువైద్యులేమియు చెప్పజాలరు. పశువుశరీరము వెలుపల నివసించే జోరీగలు చర్మముపైన గుడ్లు పెట్టి సంతానభివృద్ధిని పెంపొందించుతాయి పశువురక్తాన్ని పీల్చుతుంది. ఇవిఎక్కువగావుంటే పశువు కరిమేపి క్షీణిస్తుంది పశువునకుగురదపుట్టుతుంది. ఇవిఅంటువ్యాధులను వ్యాపింపజేస్తాయి,

## చికిత్స

వీటికింతవరకు సరియైనచికిత్స లేదు.

ఫినైలు 1 భాగము నీరు 2 భాగములు కలిపి దేహమంతట రాయాలి

లేక కర్పూరతైలమునుగాని, తారుగాని ఆయా భాగములందు రాయాలి.

లేక కండూరితును వాడాలి.

## దోమలు

పల్లపు ప్రదేశములో, మురికి గుంటలలో ఇవి ఎక్కువగా వుంటాయి. వీటివల్లనే పశువులకు అనేక విధములైన వ్యాధులు ప్రబలుతాయి. కాబట్టి వీటినిర్మూలమునకు తగిన చికిత్స చేయాలి. దోమలు పశువులకు మిక్కిలి హానిని కలిగించు శత్రువులు. కొన్ని దోమలు విషకరమైన కాటుగలవి. ఏనుగుకాలు అను వ్యాధి వీటివల్లనే కలుగుతుంది. కాని వానిని పరీక్ష చేయుట కష్టము. కనుక అన్ని దోమలును విషము గలవని తలంచి జాగ్రత్త తీసుకొనుట యుక్తము. ఈగలవలెనే దోమలకు జన్మపారంపర్య మున్నది. మురుగుకాలువలు, బురద నేలను దోమలకు మిగుల యిష్టము. కుడితి తొట్లలోను, పగిలిపోయిన డబ్బాలలోను నీరునిలిచి యుండకుండ చూడాలి

## చికిత్స

ఆవుపేడతో కలిపిన చెత్తను తెచ్చి దానిలో గవ్వసాంబ్రాణి అమరశిలగంధకము కలిపి పొగవేసిన మరల నవి రావు లేక దాల్చిన అరఖు లవంగాల అరఖు నీటిలో కలిపిచల్లిన దోమలురావు లేక భూతులసిచెట్లను కొట్టములలో కట్టిన రావు

## పేలు

ఇవి మనుష్యుల తలలలోవుండే పేలకంటె కొంచెమెక్కువ పరిమాణము కలిగియుంటాయి. ఇవి కుట్టినచోట దద్దురుపుట్టి చర్మము వాచుతుంది. వానిని తేలికగా చంపవచ్చును. కాని ఊపి తీసివేయుట కష్టము. కొబ్బరిచిప్పల కాల్చినచమురును పేలున్నచోట రాయాలి. లేక వెల్లుల్లి పాయలరసమును రాయాలి.

# మిన్నల్లులు



కొన్ని దూడలకు మిన్నల్లులు పట్టిభాధించుతాయి. వెంట్రుకలు రాలిపోయి పుండ్లుపడి దూడ నాకుకొంటుంది. ఈబాధఎక్కువైనకొలదీ దూడచనిపోతుంది. ఇవి పాలదూడలకు తరచుగా పట్టుతూవుంటాయి మిన్నల్లులు చర్మమునందు రంధ్రము చేసి గుడ్లుపెట్టి ఆగుడ్లుపిల్లలై చర్మముపైదురదను పుట్టించుతాయి ఇవిరోగాలుగల పశువురక్తమును పీల్చి యితరపశువులదేహములలో దీనిని విడుచుటవలనఅంటువ్యాధులు కలుగుతాయి ముందుదూడల బొచ్చు కత్తిరించాలి.

## చికిత్స

ఫినైల్ 1 భాగము, నీరు 2 భాగములు కలిపి శరీరమునకు పట్టించాలి.

లేక వేపనూనె 1 భాగము, కిరసనాయిల్ 2 భాగములు కలిపి పట్టించిన వెంటనే తగ్గును.

లేక వేపాకు నీటిలోవేసి మరగకాచి ఆనీటితో దూడను కడుగవలెను. లేక కండూత్రతుడు వాడాలి.

# నలుబదివ భాగము

## చట్టా చికిత్సలు

సంస్కృతం, తమిళ, హిందీ, యూనానీ, ఉర్దూ, ఒరియా మరాఠీ. మలయాళ, తెలుగు గ్రంధాలను కొన్నిటిని సంపాదించి వాటిలోనున్న చికిత్సలను మా పశువైద్యశాలలో పశువులకువచ్చిన ఆయా పశురోగాలకు నేను, నా విద్యార్థులు వాడిన కొన్నిముఖ్యమైన చికిత్సలనే ఈదిగువ తెలిపితిని

## పెద్దరోగము

వెమురాకు, నేలవేము, అడ్డసరపువేళ్ళు, నల్లేరువేళ్ళు, తెల్లావాలు సమానభాగాలతో చేర్చి మూడుగొట్టాలతో రోజు కొక మోతాదువంతున వరుసగా రెండుదినములు ప్రథమావస్థలో పెట్టాలి

లేక అత్తిపత్తి చెక్క 6 తులాలు, పెద్దులవంగపట్ట చెక్క 4 తులాలు, నల్లతుమ్మచెక్క 4 తులాలు. మెంతిపొడి 3 తులాలు తెచ్చిమూరి సేరు పులిమజ్జిగలో కలిపి త్రాగించాలి.

లేక మెంతిపొడి 4 తులాలు, జీలకర్ర 1 తులం, పసుపు 1 తు ఇంగువ 1 తు, పులిచింతాకులు 4 తులాలు, దానిమ్మ, అరటిపువ్వులు కొబ్బరిపువ్వులు కలిపి 5 తులాలు. మామిడి చిగుళ్ళు 2తులాలు కలిపి మెత్తగా నూరి సేరుమజ్జిగలో కలిపి త్రాగించాలి

లేక చేదు పుచ్చకాయలరసం పావుసేరు. నేరేడుచెక్కరసం అర్ధసేరు. కలిపి త్రాగించును.

లేక అరటిపువ్వులరసము పావుసేరు, సున్నపుతేట అర్ధసేరు కలిపి త్రాగించుము.

లేక పచ్చిదానిమ్మకాయలు – రెండు, కర్పూరం 1 తులం, తాటిబెల్లం 15 తులాలు కలిపి మెత్తగానూరి రెండు వుండలు చేసి పూటకొక మోతాదు ఈయాలి.

లేక చేదుపుచ్చకాయలు రెండు తీసికొని సేరు మేకపాలలో కలిపి త్రాగించుము

లేక వేపాకులు పసుపు మెత్తగానూరి లోపలికి ఈయాలి.

లేక శొంటి, వాము, నానువారిపాలు, మోదుగపువ్వు సమాన భాగాలు కలిపి కలినీటితో త్రాగించాలి.

పైనచెప్పినమోతాదులుపెద్దరోగము ప్రథమావస్థలో ఒకటి రెండు మోతాదులు ఈయాలి.

## దొమ్మలు

కరక్కాయలు, ఉసరికపప్పు, శొంటి, పిప్పళ్ళు మిరియాలు ఒక్కొకటి 3తులలాపొడిని శేరు చింతపండు రసముతోగాని లేకగేదె పేడరసముతోగాని కలిపి ఎడపోస రోగము తగ్గువరకు ప్రథమదశలో ప్రతినాలుగుగంటల కొక మోతాదు ఈయవచ్చును లేక ఉత్తరేణి సమూలరసముచు మేకపాలతోగాని, మేకమూత్రముగాని త్రాగించాలి

లేక కర్పూంశిలాజిత్తును మెత్తగానూరి మేకమూత్రముతో ఈయవచ్చును

లేక గంగరేగు ఆకులరసముగాని, చెక్కరసముగాని, నిమ్మకాయ పులుసుతో కలిపి ఈయాలి

లేక దుష్టుపాకు, ఏనుగతుమ్మఆకు, పసరులు పావుసేరు వంతున తీసికొని ఒకతులంకర్పూరం కలిపి ఈయాలి.

లేక నీరుల్లిపాయలు 3 తులాలు, తుంగముష్టి 2 తులాలు, దుష్టుపాకు 3 తులాలు, మూరేడుపండు 3 తులాలు, వస 3 తులాలు తెచ్చి కలిపి మెత్తగా తగినంత నీటితోనూరి రెండు మోతాదులుగా మాత్రలు చేసి ఉదయసాయంకాలము ఈయాలి.

లేక ఇంగువ 4 తులాలు, కర్పూరం 2 తులాలు తాటిబెల్లం 20 తులాలు కలిపి రెండు మాత్రలుగాచేసి ఉదయు సాయంకాలము ఈయాలి.

## జెబ్బవాపు

వెల్లుల్లి 3తులాలు కరక్కాయలు 2తులాలు, వస 3తులాలు అల్లము 1 తులము కలిపి మెత్తగానూరి శేరు గోరువెచ్చని నీటిలో కలిపి ఈయుము.

లేక వెదురుపప్పు 3తులాలు సోడాప్పుప్పు 2తులాలు, వాము పువ్వు 1తులము, కర్పూరం తులము కలిపి తగినంత సారాయిలో కలిపి ఈయుము.

లేక మారేడు ఆకులు 4తులాలు, కరిగొట్టు చెట్టు వేళ్ళు 3 తులాలు త్రిఫలాలు 6తులాలు తెచ్చి మెత్తగానూరి శేరున్నర నీటిలోవేసి కాచి వడపోసి అందులో మరల ఒక తులము కర్పూరం కలిపి తగ్గువరకు మూడునాలుగు మోతాదులు ఈయాలి.

లేక నిమ్మనూనె 5తులాలు, కర్పూరం ఒకతులము, అరతులం కలిపి అర్ధశేరు నీటిలో కలిపి ఈయాలి.

## ఉబ్బసవు

పంచమూలల కషాయము అర్ధశేరు. జటామాంసి 2తులాలు కలిపి రోజుకొకమోతాదు వంతున వారంరోజులు త్రాగించుము.

లేక చెరుకురసం 8తులాలు, బిల్లుడుగడ్డి 4తులాలు, పైడితం గేడుచెక్కరసం 6తులాలు జటామాంసి 3తులాలు కలిపి సేరున్నర నీటిలోకలిపి కషాయముగా కాచివడపోసి త్రాగించవలెను.

## గుండెజబ్బు

త్రికటుకాలు 2తులాలు, వెల్లుల్లి3తులాలు వస1తులం,ఆవాలు 1తు, పిప్పలి2తులాలు ఉడకవేసి ముండ్లుతీసిన చేప 10తులాలు,

తెలికపిండి అరవీసెకలిపి అర్ధశేరు మేకపాలతోగాని, రెండుడాగ్రములు నారాయితోగాని ఈయాలి.

## వాతము

వాతముచే కాళ్ళు వాచియున్నయెడల వావిలి, తంగేడు, బారిజ దిరిశెన నిమ్మ ఆకులపసర్లును, నేయ్యీమానెడుఆముదమునూనె మానెడు కలిపి కాచి సగము శరీరమునకు రుద్ది తక్కినది లోపలికి త్రాగించిన యెడల వాతముతగ్గి వాపులు పోతాయి.

వావిలి, తక్కేడు, దుష్టుపాకు దిరిశెనవేళ్ళు, బారిజచెక్క, తిమలపాకులు, మోడి, ఇంగువ, తంగేడు, జిల్లేడుపువ్వులు, గన్నేరు వేళ్ళు, నల్లేరు, వాము, చేఁణితివెల్లి, కాకిరాకు సమానభాగములు రోటిలోవేసి దంచియుద్దలుచేసి ఆముదముతో కలిపి పెట్టిన వాతము తగ్గుతుంది.

పత్రియాకురసము,పుచ్చాకురసము నావిలాకురసము,అడ్డసరపాకురసము,సంపెంగరసము,తక్కేడాకురసము,చింతాకురసము పల్లేరురసము, తురకవేపాకురసము, దిరిసెనాకురసము మారేడుపండ్లగుజ్జు, మేడిచెక్క రసము, నూనె ఆముదను సమానముగా తీసిమిరియాలపొడి కలిపి పాకముగాచేసి పూటకుపావుశేరు పెట్టినఎటువంటి వాతములైననుతగ్గి పోతాయి.

## నక్కవాతము

పసుపు6తు తామరదుంప1పిసె, బెండవేళ్ళు 2గుప్పెళ్ళు పంచదార అరవీసె కలిపి2సేర్లు పందినేతితో పాకముగావండి వెలగకాయంత తీసికొని అర్థశేరు గొఱ్ఱెపాలతో కలిపి 15దినములు పెట్టిన నక్క వాతము తగ్గుతుంధి.

నిమ్మకాయంత రాతిసున్నము, పిప్పళ్ళు 1తుకలిపి ఉదయ సాయంకాలములయందు 10దినములు పెట్టిన నక్కవాతము నివారించు తుంది.

నాగులాకు 4పీసెలు, తంగేడాకు 2పీసెలు, గోంగూర3పీసెలు మంచినూనె 1పీసెడు కలిపిముద్దజేసి రేపూమాపూ మందువచ్చువరకు పెట్టిన నక్కవాతము నివారించుతుంది.

పచ్చిగోంగూర మణుగు, శొంఠి10తు మిరియాలు 6తుఉసిరి పప్పు 7తుకలిపితొక్కి ఒకబానలోవేసి పెంటపోగుగోతిలోవేసి కలిపి యుంచి వారముదినములైన,తర్వాత తీసెదినమునకొక వెలగకాయంత ముద్దచేసి పెట్టిన పైవాతము నివారించుతుంది.

## తీటవాతము

కలినీరు అర్ధశేరు బూరుగబంక 4తులములు నువ్వుపువ్వులు నాలుగు గుప్పెళ్ళు కలిపి పెట్టిన తీటవాతము తగ్గిపోతుంది.

గాడిదగడపాకు పసరుఅర్ధశేరు రాతిసున్నము గుప్పెడునువ్వుల నూనె పావుశేరు కలిపి తీటకుపట్టించాలి.

మూర్కొండాకుపసరు పావుశేరు గంధకము 1తులము కలిపి రాసిన తగ్గుతుంది.

గోరింటాకుపసరు పావుశేరు పటికపొడి 1తులము పొగాకు రసము పావుశేరు కలిపిరాసిన నివారించుతుంది.

కొబ్బరిచిప్పలు కాల్చి మసిచేసి ఆముదములో కలిపిరాసినతీట వాతము నివారించుతుంది

## శిరోవాతము

అతివస 2తులాలు, పిప్పలి 2తులాలు, వస 2తులాలు వావిలి ఆకులుగుప్పెడు, ఉప్పు 4తులాలు, కలిపినూరి సారాయితో ఈయాలి.

లేక ఇప్పపువ్వు, మంచి గంధపుపొడి, తెల్లకలువ పువ్వులు ఏనుగ సహదేవి ఆకులు సమాన భాగాలు తీసికొని మెత్తగా నూరి ముచ్చిరి గుంటలో రుద్దవలెను. దీనినే పాలతో నూరి వడపోసి ముక్కు రంధ్రాలలో పోయాలి.

లేక ఆవాలు గుంటకలగర, సంజీవర్ధన కుక్కతులసి ఆకులు మెత్తగానూరి మంచినూనె కలిపి గోరువెచ్చగా కాచి వడపోసి ముచ్చిలిగుంటలో మర్ధనచేసి కొంత ముక్కురంధ్రాలలో పోయాలి

ఆవాలు ఒకటిన్నర తులము శొంఠి ఒకటిన్నర తులము హారతి కర్పూరం ఒకటిన్నర తులము గాలిమిడాకు పసరులో కలిపి చెవిలో పోయుము.

పరా:- వాతరోగములు వాని రోగనిదానములు చికిత్సలు వాతలు విపులముగా తెలిసికొన వలెనన్న ఈ చింతామణిలో చూడుడు.

## కడుపుబ్బు

కాల్చినమసి 12తు, శేరు కలినీటిలో కలిపి త్రాగించిన కడుపుబ్బు తగ్గుతుంది.

వేకువజామున వేసిన పక్షులరెట్ట 6 తు, శేరునీటిలో కలిపి త్రాగించాలి.

దిరిసెనాకుపసరు అర్ధశేరు ఉప్పుచేరెడు, బియ్యపుకలి అర్ధశేరు కలిపి త్రాగించాలి.

సైంధవలవణము 4 తు, వస 2 తు, కోష్టు 4 తు, పెట్టిపుచ్చ చెక్కరసము 6 తు, కలిపిత్రొక్కి ఆముదముతో తడిచేసితినిపించాలి.

కారింగువ 2 తు కరిధూపము 1 తు గచ్చాకురసము పావుశేరు ఉప్పు 4 తు, కలినీరు అర్ధశేరు కలిపి త్రాగించాలి.

ఇంగువ 3 తు వెల్లుల్లిపాయలు 4 తు, మంచిబెల్లము అర్ధశేరు కలిపి. త్రాగించాలి. పై చికిత్సలన్నియు కడుపుబ్బులకుమంచిపనిచేస్తాయి

## విరేచనాలు

కర్పూరము ఒకటిన్నర తు, ఇంగువ 1 తు, శొంఠి ఒకటిన్నర తు, బెల్లము తగినంత కట్టి నూకలజావతో రెండుపర్యాయములిచ్చి రక్త విరేచనములు కట్టుకొంటాయి

కవిరి 1 తు, సీమసున్నము ఒకటిన్నర తు, దాల్చినచెక్కపొడి ఒకటిన్నర తు, శొంఠి ఒకటిన్నర తు, కలిపి తినుఆహారములో రెండు వేళల పెట్టిన విరేచనములు కట్టుకొంటాయి

కవిరి 1 తు, మాచికాయపొడి 1 1/2తు , నల్లమందు 1/4తు సోపు 2 1/2 తు, రెండు వేళల గంజిలో కలిపి పెట్టాలి.

ఉడుకబెట్టిన నీరుల్లిపాయలు 10 తు, కవిరి 1 తు, నల్లమందు 1/2 తు, కలిపి గంజితో ఈయాలి.

నల్లమందు పావుతులం కవిరి తు, సీమసున్నము 2 1/2 తు శొంఠి 1 తు, కలిపి గంజిలో రెండు వేళల ఈయాలి.

మారేడు గుజ్జుతో కవిరి రెండుమూడుపర్యాయము లీయాలి. పై చికిత్సలన్నియు విరేచనముల కట్టించుతాయి.

## మలబద్ధకము

ముసాంబ్రము ఒకటిన్నర తు, నేలవేము 1 తు, ఉప్పు రెండున్నర తు, శొంఠి ఒకటిన్నర తు, బెల్లము తగినంత కలిపి యిచ్చిన మలబద్ధకము నివారణవుతుంది.

కటకరోహిణి ముప్పావుతు, ఉప్పు రెండున్నర తు, శొంఠిపావు తులంయు[illegible], ఒకటిన్నర తు, సాంబ్రాణి 11 తు నూకలజావతో కలిపి త్రాగించాలి.

కారపుపాలు సేరువంతున రెండుపర్యాయములు త్రాగించాలి.

ఉప్పు చేరెడు, మోదుగవిత్తులు 1 తు, గోరువెచ్చని నీరు శేరు కలిపి త్రాగించాలి. పై చికిత్సలన్నియు మలబద్ధకమును పోగొట్టుతాయి.

## అజీర్తి

కారము, ఆనపిండి, ఉప్పు కలిపి మూడుగొట్టములు పెట్టిన అజీర్తి, శూలనొప్పి నివారిస్తుంది.

చింతపండుపులుసు, కారము, ఉప్పు, ఆనపిండి కలిపి ఎద్దులకు మూడుగొట్టములు పెట్టాలి

మిరపాకు రసము మిరియాలపొడి ఉప్పునూరి కలితో పెట్టాలి

వాము, ఆచాలు, కరిధూపము, ఉప్పు, పంచ లవణములు, ఇంగువ కలిగో కట్టి పెట్టిన శూలలన్నియు పోతాయి.

వాకుడుచెట్టు సమూల రసములో పంచలవణములు. వెల్లుల్లి కలిగో కలిపి పెట్టుము పై చికిత్సలన్నియు అజీర్తి శూలలు నివారించుతాయి.

## బలవర్ధకములు

వాతశరీరము కలిగి నునుపుగను బలిసినదిగను డొక్కలుదించుకొని ఎల్లప్పుడుకన్నులవెంట నీరుగార్చుచు కాళ్ళుపట్టివేయు ఎద్దులకు కల్లుబెల్లం వీశెడు, మంచి నువ్వులనూనె అరవీశెడు కలిపి జత ఎద్దులకు ఉదయం 10 గంటలకు పెట్టాలి. ఈరీతిగా అయిదు వారములు పెట్టుచు పిల్లిపెసర తొండంగి మిరపకాడ పత్తివిత్తులు మొదలగునవి నిరాటంకముగా పెట్టవచ్చు

అంతనిక్కాక అంతవాతము లేకుండనుండు పశువునకునిక్కాకు వస్తువు లుపయోగించినప్పుడు నీరుమేత ఎక్కువగా సేవించుచు, తెల్లవారునప్పటికి నిర్జీవముగలది,గానుండి నిస్సత్తువతో నుంటుంది.అప్పుడు

యిత్తడికాగునకు కళాయి వేయించిఅందులో మెట్టతమిధలు వేయించి ఒకఇరస, కల్లుబెల్లము ఒకటిన్నర మణుగు మంచినూనె ఒకటిన్నర మణుకు వేసి కలిపి ఒకవారము నిలువయుంచి ప్రతిదినము అరవీసెపరి మాణము వంతున పైనచెప్పిన లక్షణములుగల ఎద్దునకు పెట్టినయెడల బాగుగా బలియును.

రత్నాపురి గుగ్గిలము వీసెడు, మంచినూనెవీసెడు, తాటిబెల్లం వీసెడు, గవ్వసాంబ్రాణి వీసెడు. తెచ్చి ముందునూనెలో గుగ్గిలపు పొడి కొద్దికొద్దిగా కలుపుచుండాలి. లేనియెడల గడ్డకట్టును. అందులో తాటిబెల్లము కలిపి తరువాత సాంబ్రాణి డబ్బాలో వారముదిన ములుంచి తరువాత వారమిదినములు ఈమందును జతయెద్దులకు పెట్టాలి. పైమందులో శేరుగాని అర్ధశేరుగాని, మినపపిండి కలిపి పెట్టిన మిగులమంచిది

## కడుపులోని వాయువును పోగొట్టునవి

సోపు2తు, ఏలకులు 2తు జీలకర్ర తులమున్నర శొంఠి,తులము న్నర కలిపి తినుఆహారంలో పెట్టాలి.

ఇంగువ2తుకర్పూర తైలము5తుఅవిశనూనెఅర్ధశేరుకలిపిత్రాగించాలి

సారాయి10తు, ఉప్పు 10తు. ఇంగువ 1తు, గోరువెచ్చని నీరు శేరున్నర కలిపి త్రాగించాలి

ఏలకుల2తు, లవంగాలు అరతులం శొంఠి తులమున్నర సోపు 1తు,జీలకర్ర తులమున్నర కలిపిదాణాలో పెట్టాలి.

దాల్చినచెక్కపొడి 1తు శొంఠితులమున్నర మిరియాలు1తు సోపు1తు తినుదాణాలో పెట్టాలి.

ధనియాలు నాలుగున్నరతు సోపుఒకటిన్నరతు జీలకర్ర 1తు శొంఠి 1తువాముగిద్దెడు కలిపి తినుఆహారములో కలిపి పెట్టాలి

మెంతులు 3తు మిరియాలు తులమున్నర ఆవాలు 1తుఉప్పు గిద్దెడుకలిపిపెట్టాలి.

వెల్లుల్లి 4తు, ఇంగువ తులమున్నర ఉప్పు తులమున్నర శొంఠి 1 తు, బెల్లపునీటితో కలిపి పెట్టాలి

పిప్పళ్ళు 1 తు, శొంఠి 1 తు పసుపు తులమున్నర లవంగాలు తులమున్నర ఉప్పు రెండున్నర తులములు కలిపి పెట్టుము.

## మూత్రరోగములు

నీరుల్లిపాయల రసమును నీరు చురుకునకు యిచ్చిన తగ్గుతుంది.

సూర్యక్షారమును నీటిలో కలిపి యిచ్చిన నీరుచురుకు తగ్గుతుంది

పెద్దనల్లేరు సమూలరసమును యిచ్చిన మూత్రకోశములోని నొప్పి, మంట, వేడి, శుక్లనష్టము తగ్గుతుంది

ధనియాలచూర్ణమును గాని పచ్చికొత్తిమీర ఆకునుగాని యిచ్చిన మూత్రము వెంట ఇంద్రియము పడుటను కట్టించుతుంది

మంచిగంధమును నీటిలో కలిపిచ్చిన వీర్యనష్టము తగ్గుతుంది.

తెంపలివేళ్ళ రసము కలినీటితో కలిపి ముక్కు రంధ్రములలో పోయాలి

తెలికపిండిని మోదుగనీరు కలితో కలిపిపెట్టాలి.

శొంఠి పిప్పళ్ళు మిరియాలు సమానభాగములు తీసికొని కలితో పెట్టిన దగ్గు వగర్పు కట్టును.

దిరిసెనాకు పసరు, తెల్లవావిలాకు పసరు, కలిపి ప్రతిదినము పెట్టుచుండినయెడల తగ్గును

నీరుల్లిపాయలరసము అర్ధశేరు మజ్జిగ అర్ధశేరు కలిపి త్రాగించాలి

రాగిచెక్కరసము అర్ధశేరు పచ్చిపాలు అర్ధశేరు కలిపి నాలుగు దినములు త్రాగించాలి.

తెలికపిండి అరవీసె, ఆవుపాలు అర్ధశేరు, గంజి అర్ధశేరు, కలిపి త్రాగించాలి.

ప్రత్తికాయలు గుప్పెడు ఆవుపాలతో నూరి త్రాగించాలి.

మూర్కొండాకు పసరు ఒక్కొక్క ముక్కురంధ్రములో 10 చుక్కలు వేయాలి

## దగ్గు, జలుబు

ఇంగువ 6 తు, అల్లము 2 తు, కలిపి నూరి తినిపించాలి.

నీరుల్లి పాయలు దాహము పెట్టినట్లుగా తినుపించాలి.

అడ్డసరపాకు రసముతో తేనెకలిపినాకించాలి.

ఇంగువ ఒకటిన్నర నవాసాగరము ఒకటిన్నర తు, కర్పూరము ఒకటిన్నర తు, యష్టిమధుకము 3/4 తు, బెల్లము తగినంత కలి నాకించాలి

కర్పూరము, యష్టిమధుకము ఒకటిన్నర తు, ఇంగువ 1తు, తేనె తగినంత కలిపి అప్పుడప్పుడు నాలుకకు నాకించాలి.

కృష్ణతులసి ఆకులు అరగుప్పెడు, మిరియాలు అర తు, శొంఠి అరతులం, తమలపాకులు 6 కలిపి నూరి తేనెతో నాకించాలి.

## వగర్పు

వస, శొంఠి, పిప్పళ్లు, పసుపు, మిరియాలు ఒక్కొక్కటి పావు తులమువంతున నూరి ముక్కురంధ్రములలోనికి నశ్యము చేయించాలి.

అడ్డసరాకుపసరు మానెడు, శొంఠి 8 తు, పసుపు 3 తు, మిరియాలు 4 తు, కలిపినూరి నాలుగుదినములు త్రాగించాలి.

కలినీరు పావు శేరు, వెంపలి ఆకురసము 3 తు, కలిపిముక్కురంధ్రములలో పోయాలి.

మోదుగాకుపసరు అర్ధశేరు. తెలికపిండి సవాశేరు కలిపి తాగించాలి.

దుష్టుపాకు గుప్పెడు చిరిసెనాకులు గుప్పెడు, పసుపు అరతులం నల్లేరు 3 తు, కలినీరు అర్ధశేరు కలిపి తాగించాలి

దుష్టుపాకు పసుపు ఆముదము కలిపి వండిపెట్టిన తగ్గును.

## జ్వరమును తగ్గించునవి

వసపొడి రెండున్నర తు, నేలవేము కషాయము రెండున్నర తు వేడినీరు శేరున్నర కలిపి తాగించాలి

నవాసాగరము ఒకటిన్నర తు, ఉప్పు 10 తులములు నీరు శేరు కలిపి తాగించాలి.

గచ్చపప్పు 1 తు, మిరియాలు 1 తు, లవంగాలు ఒకటిన్నర తు, కలిపి తినుఆహారములో పెట్టాలి.

## కంటిపొరలకు

తెల్ల గలిజేరు వేరు 4 తులాలు ఆవుపాలు 2 తులాలు కలిపి నూరి ఆయింటు మెంటుగా చేసి కొంచెము ఆరబెచ్చి కండ్లపొరలకు అప్పుడప్పుడ పట్టించ్చిన తగ్గును

లేక ఆముదపు ఆకులరసం 1 తులం, ఉప్పు అరతులం కలిపి కంటిపువ్వులకు, ఎరుపులకు, పొరలకు పట్టించుము

లేక మిరియాలపొడి అరతులం దొండాకుపసరు 3 తులాలుకలిపి కంటిపువ్వులకు పట్టించుము

## రేజీకటి

నందివర్ధనపువ్వులు 4, ఇప్పపువ్వులు 4, మంచిగంధపు పొడి 1 తులం కలిపి మెత్తగానూరి అప్పుడప్పుడు కండ్లలో పెట్టుము

# రొమ్మపట్టు

మంచినడినవయస్సులోనున్న అనగా మొదటి సారి గుడ్లుకారకు వచ్చిన పెట్టనొకటి, దాల్చినచెక్క 5 తు, ఏలక్కాయిలు 2 తు లవంగాలు 2 తు దుంపపసుపుకొమ్ములు 5 తు, ధనియాలు పావుసేరు అల్లము 5 తు, వాము సోలెడు. నువ్వులనూనె అరవీసె తెచ్చి సదరు వస్తువులన్నియు మెత్తగా కొట్టవలెను కోడిబొచ్చుతీసి కాల్చి కాళ్ళ భాగాములు తీసివేసి మిగిలినది రోటిలోవేసి మెత్తగా తొక్కి ఎముకలు తీసి అందులో పైచూర్ణమును నూనెలో కలిపి మెత్తగా దంచి ముద్దలుచేసి సాయంకాలము పెట్టవలెను. ఈ మందు పెట్టిన రాత్రి నీరు పెట్టరాదు. ఇట్లు వేసిన సమస్త వాతరోగములు హరించు తాయి (అనుభవము)

నువ్వుపిండి, తాటిబెల్లము, ఉలవ కలిపి, కోడిపెట్ట కొవ్వు సమానభాగములు రోట వేసి దంచి కోడిగుడ్డంత రెండువేళల పెట్టుము.

ఉప్పిచెక్క, పసుపు, ఉలవపిండి కలిపిపెట్టిన తగ్గును.

తాటిబెల్లము, జిల్లేడుపట్ట కలిపి దంచిపెట్టిన తగ్గును.

# అరుగ్రిపట్టు

పశువుముక్కుకొననుండి తోకచివరవరకు తాడుతో కొలిచి ఆతాడును చెరిసగముచేసి ఆసగముతో దాని ముక్కుకొననుండి కొలువగా నది ముగిసెడి చోటునకు వాతవేసిన తగ్గును.

దొండాకుపసరు వెన్నతో కలిపి అరుగ్రిభాగమునకు మర్ధనచేసి తవుడువేయించి కాపులు కాయాలి

పంచిచముదు అప్పుడప్పుడు శుద్ధిచుండాలి

ఆరంభములో వెన్ను భాగమును వెన్నతో రుద్ది చిన్న ఉల్లి పాయలు జిల్లేడాకులు పొట్లములుకట్టి ఆముదములోముంచి కాకవేసి వెన్ను భాగమునకు కాపులుతియ్యవలెను.

## చెవిరోగములు

నిమ్మకాయరసము 2 తు, గవ్వసున్నము అరతులము కలిపి చెవిలో పోయుము.

ఉత్తరేణి సమూలపుభస్మము కాల్చినపొడి 2 తులములు నూనె 4 తులములు కలిపి పోయుము

వావింటాకు ఉప్పుతో దంచి రసముతీసి చెవిలో పోయుము.

గవ్వనుకాల్చి భస్మముచేసి నిమ్మరసముతో కలిపివేసిన తగ్గును

## ఉండె తొలగుట

ఆముదపుపప్పు సోలెడు, రాతిసున్నము 16 తులములు తెచ్చి మెత్తగానూరి ఉండెను సరిగాలాగి పట్టువేసి నాలుగు దినములుంచిన తగ్గును.

ఉండెను లాగి జారిన భాగముచుట్టురక్షలుపెట్టుము.

శొంఠి 4 తులములు పిప్పళ్ళు 1 తులము మిరియాలు 1 తులము ఉమ్మెత్తాకుపసరు అర్ధసేరు తేనె 4 తులములు కలిపి మర్ధించుము

## కాలిన బొబ్బలు

గాడిదగడపాకురసము రాచి పిడకబూడిదచల్లుము

నవనీతము ఆరగా ఆరగా రాయుచుండుము

తిప్పతీగెరసము పూయుము.

కొబ్బరినూనెలో సున్నపునీరుపోసి తరచిన వెన్నవలెనగును. దీనిని ఆరగా ఆరగా పూయుచుండుము.

పాతసున్నమును పెరుగుమీాద తేట కలిపి రాయుము.

గోరింతచెక్క కషాయము రాయుము.

నీలిమందును నీటితో కలిపి రాయుము

# పురుగులుపడిన పుండ్లు

పారిజపాకురసము గుప్పెడు, ఉప్పు 2 తులములు. మిరియాలు 1తులము, తెచ్చి గుమ్మపాలతోనూరి పురుగులు పడిన పుండ్లకు పట్టించుము.

మిరియాలు 1 తులము సైంధవలవణము 1 తులము గాడిదగడ పాకుతోనూరి పుండ్లకు పట్టించుము

ఆముదములో కొత్తరాతిసున్నమునూరి పుండ్లకు పట్టించుము

పొగాకు, కరిధూపము, పొట్లాకు నూగు, రాతిసున్నము ఆనపాకు సమానభాగములుగానూరి గాయములకు పట్టించుము.
సీతాఫలపాకు గుప్పెడు, రాతిసున్నము 1 తు, చేర్చినూరి పుండ్లకు. పట్టించుము.

హారతికర్పూరము కరిధూపము చేర్చి పెట్టుము.

వస, కరిధూపము,సున్నమునూరి వేయవలెను

# చేపుటుకం

అడ్డసరపాకు 2 గుప్పిళ్లు ఉప్పుచేరెడు జీలకర్ర 1 తులము సుగంధపాలు 4 తులములు నూరి అడ్డెడుమజ్జిగలో కలిపిత్రాగించుము.

చేకొణితాకు 2 గుప్పిళ్ళు తెల్లఆవాలు 1 తులము ఉప్పు చేరెడుపు లిచల్ల అర్ధశేరు కలిపి త్రాగించుము

బంధము వేయనీయక పొడుచుచూ దూడను దగ్గరకు చేర నీయక గంతులు వేయుచుండు పశువు పొదుగునకు పుల్లతీగెరసము రాసిన చేపువచ్చి పాలను పిండుకొననిచ్చును.

పాలు యీయక తిప్పలుపెట్టు పశువునకు నెయ్యి పావుశేరు గోధుమగంజి అర్ధశేరు గంజిశేరు కలిపి 4 దినములు పెట్టము

కనెర కోమలి తీగరసము పావుశేరు తెలికపిండి సవాశేరుకలిపి శరీరమునకు రాయుము.

## మలివిండి

ఆముదములో చిత్రిమూలపు పొడి కలిపి కట్టినతగ్గును.

శొంఠి,పిప్పళ్ళు, మిరియాలు, చిత్రిమూలము కలిపి నూరి ఆముదముతో వండి గోరువెచ్చనిది కట్టవలెను.

దుష్టుప వేళ్ళు మిరియాలు నూరి రసము తీసి ముక్కులలో పిండుము.

గాలిమిడిఆకు మిరియాలు మెత్తగానూరి నీటితో వండికట్టిన తగ్గును

ఆముదములో నాయింటాకు త్రొక్కి పాకముచేసికట్టవలెను.

బరెడిపేడలో, చెంచలిఆకు వండి కట్టినతగ్గును

## ఉంగిడి

పులికలిలో దుష్టువువేళ్ళునూరి నారముతీసి ముక్కురంధ్రము లలో పోసి కన్నులకు ఇంగువ పెట్టినతగ్గును.

నల్లేరుచిగుళ్ళు దవుడలలో పెట్టికొరికించవలెను

పులికలిలో ఉప్పు నల్లేరుకలిపి త్రొక్కి పెట్టవలెను.

కొమ్ములకు నూనెవత్తులుచుట్టి కాల్చి జాముసేపుంచినతగ్గును.

కుంకుడుకాయ గంధము కన్నులకు పెట్టవలెను.

నిమ్మపండ్లరసము కలిపి మూడుగొట్టములు పెట్టవలెను.

చిర్రిచెట్టు గంచి రసముతీసి పులికలితో మూడుగొట్టములు త్రాగించాలి

చింతపండుపులుసు మూడుగొట్టములు పెట్టినతగ్గును.

దీపపుకోడిచే జిల్లేడుపత్రి పొట్లములుగా కట్టి చమురున కాచి మూడునపెట్టినతగ్గును

## వాపి పడుటకు

తన్నేడు నువ్వులు త్రొక్కి సేరునీటిలో కలిపి పెట్టుము.

పులిచల్లలో కందదుంపనూరి కలిపి పెట్టుము

ఆముదము సవాశేరు త్రాగించుము.

సెనగలు నానబెట్టి పెట్టుము.

## వాపి తినినచో

అనుములు పావుశేరు, పచ్చిపుచ్చాకుపసరు అర్ధశేరు. మజ్జిగ శేరు కలిపి త్రాగించాలి.

నామురసము అర్ధశేరు, ఉప్పుచేరెడు, ఆముదపుప్పు గిద్దెడు శేరు బియ్యపునీటిలో కలిపి త్రాగించవలెను

## చవాలు నిల్పుటకు

కరివేపాకు గుప్పెడు వరిబియ్యము గుప్పెడు కొర్రలు 2 గుప్పెళ్లు కలిపి నూరి 15 దినములు పెట్టుము.

వెలిగారము 4 తులములు మజ్జిగ శేరు కలిపి 2 దినములు త్రాగించుము.

## తోక నుసిపిండి

ఉప్పు 2 తులములు ఆవాలు అరతులము అల్లము 1 తులము కలబందపసరు పావుశేరు, పులికలి శేరు చేర్చి మూడుదినములు పెట్టుము,

పిచ్చికుసుమాకు పసరు 10 తులములు నీలిమందు 1 తులము చేర్చి నుసిమిరికి అప్పుడప్పుడు రాయుచుండుము.

## తోక గురుజు

తోకచివర నరికి నెయ్యి కాచి వేడిగానున్నపుడు ముంచవలెను కుసుమఆకునూరి తోకచివర రాసిన వెంట్రుకలు వచ్చును.

అల్లము ఉప్పు పులిచల్లలోచేర్చి రాయుము

అల్లము కలబందగుజ్జు ఆవపిండి మెత్తగానూరి పులిచల్లలో మరగనిచ్చి దినమునకు మూడుగొట్టములు పెట్టవలెను

## దృష్టిదోషము

పశువునకు దృష్టిదోషము తగిలినవెంటనే జొన్నలు వేపాకు ప్రత్తిగింజలు ఉప్పు తెచ్చి పశువునకు దిగతుడిచి నిప్పులో పోయుము. దృష్టిదోషము పోవుటకు తాళ్ళు వేయుటకూడ మంచిది.

## చర్మరోగాలు

కుప్పింటాకురసము 5 తు, సున్నము 1 తు, నిమ్మరసము ఒకటిన్నర తు కలిపి నుసిమిరి తామర గజ్జికి రుద్దాలి.

కవిరిని తేనెతో కలిపి పుండ్లకు రాయాలి.

పొగాకుపొడి ఒకటిన్నర సీతాఫలపాకుపొడి 10 తు కర్పూరము ఒకటిన్నర తు, కలిపి దుర్వాసన వేయుపుండ్లకు పట్టించుము.

నీలిమందు 1 తు, గంధకము 1 తు వ్యాసులైను 4 తు చర్మరోగములకు వాడాలి

నువ్వులనూనె కిరోసనాయిల్ కలిపి రాయాలి.

గాడిదగడపాకుపొడి ఆముదముతోకలిపి రాయాలి,

కృష్ణతులసిఆకురసములో నిమ్మరసము కలిపిరాయాలి.

సహదేవ పశువైద్య ఫార్మసీవారి మందులు వీటినిప్రతిరైతు ప్రతిబ్లాకుడెవెలెప్ మెంట్ తెప్పించుకోవాలి.

# లేహ్యాములు

## జంతురక్షణి (అమరప్రిభ)

పౌనుడబ్బా రు 3-0-0

4 పెద్దపశువులకు-6 చిన్న పశువులకు సరిపోతుంది

జంతువులను రక్షించాలంటే శాస్త్రోక్తముగా తయారైన ఈ జంతురక్షిణినే వాడాలి. ప్రిభుత్వపశువైద్యాటీకాల మాదిరిగాముందు గనే మంచిపశువులకు వాడిన అంటురోగాలను రానీయక సూక్ష్మజీవు లను చంపుటకు నిరీక్షించుచుండును. పశువులకువచ్చే పెద్దరోగము దొమ్మలు, గురక, జెబ్బవాపుమున్నగురోగాలకు చక్కగాపనిచేస్తుంది చూడిపశువులకు కూడ నిరభ్యంతరంగా వాడవచ్చును రోగముసోకిన ప్రారంభదశలో ఈమందును వాడినపనిచేస్తుంది తరువాత యిచ్చిన ప్రియోజనము లేదు మందుయిచ్చినతరువాతవరుసగా ఆపశువుముక్కు నకు పంది చమురుగాని యూకలిప్టస్ ఆయిల్ను గాని కొద్దిగారాసి నాలుగైదుదినాలు సాంబ్రాణి ధూపం వేస్తూవుండాలి పెద్దరోగము లో పాముడున్నయెడల ఫార్మసీబేల్ పౌడరును వాడాలి. గ్రామాలలో అంటురోగా లున్నవనిఅనుమానముగా వున్నపుడు ముందుగనే ఫార్మ సీకి వ్రాసితెప్పించుకోవాలి పౌను, అరపౌను మాత్రింపంపరు. రెండు పౌనులనుంచి ఎంతవరకైనా పంపుతారు. ఎక్కువపశువులకు కావలసి నపుడు మీదగ్గర రైల్వేస్టేషన్ తెలుపాలి. లేనివో పోస్టలులో పంపు టకు వీలులేదు. పైరోగాల నిదానాలు, చికిత్సలు కావలసినపుడు మీ పంచాయితీలోగాని, మీగ్రామ రైతులదగ్గర నుండే అనుభవ పశువైద్యచింతామణి చూడండి. వివరాలన్నీ తేటతెల్లమగును.

# స్వర్ణాసవ

## (సువర్ణాసవ)

(పౌనుడబ్బా) రు. 3-0-0

దీనినే సువర్ణాసవ అంటారు మనపశువులకు వచ్చేగాలికుంటు నోటిగాలి, గాళ్ళుఅనే అంటురోగము వచ్చినపుడు రైతులు పశువు

లకు ప్రమాదము రాకపోయినను పనిపాటలు పాడగునని భయపడుతారు అందుచేత ఈవ్యాధిగ్రామములో నున్నదని అనుమానమున్నపుడు ముందుగనే ఈసువర్ణాసవను తెప్పించుకొని మంచిపశువులకు వాడిన చక్కగా పనిచేయును. ఈరోగంలో కలిగేపుండ్లకు, కార్నెక్సునుగాని, హీలాన్నుగాని చెర్మారినిగాని వాడాలి. ఒక్కొక్క పశువునకు 4నుంచి6తులాలవరకు వాడవచ్చును.

## (కనక) కనకాసవ

(పౌనుడబ్బా) రు 3-0-0

దీనినే "కనక"అంటారు. శ్వాసరోగాలను తగ్గించాలంటే కనకాస్నే వాడాలి. గుండెదగర్పు, వాతదగర్పు నక్కహాతము లేకకసిమిరి దగ్గు, మకుబలతి మున్నగురోగాలకు చక్కగా పనిచేస్తుంది. పూటకు 4నుంచి6తులాలవరకు నీరుల్లి రసముతో గాని అడ్డసరపాకు రసముతో గాని,జమ్మిఆకు రసంతో గాని ఉదయ సాయంకాలమందు ఈయాలి.దీర్ఘముగా బాధపడుచుండే రోగాలకుఎక్కువదినాలువాడాలి. గానఫార్మసీ వారికి వ్రాసి వివరాలు తెలిసికోవాలి.

## అర్కములు

### వాతారి అరకు (లికర్నుయిజ్జు)

పౌను సీసా రు. 2-8-0 , అరపౌను రు. 1-8-0.

ఇతర నకలు మందులకు మోసపోక ఫార్మసీవారి సీలున్న దానినే తెప్పించుకోవాలి. ప్రతి రైతు తన పశువునకు వాతము చేసినదనిఅనుట ఎల్లరకు తెలిసిన విషయమే పిల్లిపెసర, తవుడు పొట్టు ధాన్యములు, కృత్రిమపు పదార్థములు, అతిగా పెట్టుటవల్ల కాళ్ళు పట్టుట, కాళ్ళ కలకలు, కాళ్ళ వాపులు, జీర్ణరోగములు చూడి పశువుల ఈచుకొని పోవుట, రేజీకటి, పాడిపశువుల వట్టిపోవుట మున్నగు రోగాలు సంభవించు చున్నవి. ఇంకను దూడలకు

అజీర్తి చేసినా, దూడల కడుపులో ఎలిక పాములు, నులిపురుగు లు ఉత్పత్తియైనా. పాడిపశువులు ఎగచేపుకొన్నా వాతారిని వాడిన వైద్యులతో నిమిత్తం లేకుండా చక్కగా పనిచేయును.

ఉదయ సాయంకాలములందు శేరు గోరువెచ్చని నీటిలో ఈ వాతారిని 4నుంచి 6తులముల వరకు కలిపి ఈయాలి ఇంకను అవసర మున్న అల్లపురసంతో కలిపి ఈయవచ్చును.

## వాతాంకుశము

పౌను సీసా కు 3-0-0

రాయలసీమ, నెల్లూరు, గుంటూరు, హైదరాబాదు ప్రాంతాలలో నున్న కొన్ని తాలూకాలలో దీర్ఘవాత రోగము దీర్ఘవాయు పట్లు అనురోగము పశువులకుసోకి బాధపడుట ఎల్లరకు తెలిసిన విషయమే ఆయా తాలూకాల సెలయేర్లు వూటబావులు, దిగుడుబావులు పారిశ్రామిక కేంద్రస్థలాలలో నుండే స్థలాలలో "ఫ్లోరాను" అను లవణపదార్థ ముత్పన్న మగుచున్నది. ఈప్రాంతాలలో నుండు నీటిని ఆఉప్పునీటితో కలిసియుండు పచ్చికను, మిట్టిని తినుటవల్ల ఈ వాత రోగములు కలుగుచున్నవి

ఎద్దులకు, గేదెలకు, కోడెలకు ఈవ్యాధిసోక కీళ్ళనొప్పులు, కీళ్ళ కలకలు కీళ్ళరోగములు కలిగి ఎముకలవాపు,పోటు, నొప్పికలిగిజెబ్బలు వాలినటులనుండుట, కాలిగిట్టలు పెరుగుట, కాళ్ళుపట్టుట అప్పుడ ప్పుడు తీవ్రజ్వరము, నల్లకప్పువేయుట మున్నగు లక్షణములుండి పశువులెంతో బాధపడుచున్నవి

ఈరోగమునకు మాఫార్మసీచేతయారు చేయబడినసువర్ణ వాతాం కుశమను అర్కమును ఉదయమున వాతారి చూర్ణమునుసాయంకాల మున వేళల ప్రకారము ఈయాలి. దీర్ఘరోగమైన మందును

చాలకాలము వాడాలి ఇంకనుసలహా కావలసినమా ఫార్మసీకి తెలుపుచుం డాలి కీళ్ళవాపులకు, నొప్పులకు ఫార్మసీవారి స్ప్రియిన్‌కిల్లరునురుద్ధు చుండాలి.

# పశురక్షామృతము

పౌను సీసా రు 3-0-0

ఆపత్కాలములో ఏరోగమైనది తెలియక భయపడే సమయ ములో తమపశువులను రక్షించేది పశురక్షామృతమని గ్రహించాలి. అన్నిరకముల రోగాలకు దీనిని కడుపులోనికి ఈయవచ్చును. పరిమా ణంచేయదు వ్యాధి గుణాలనుతగ్గించితే తగ్గించుంతుది. లేదా ఏరోగ మైనది తెలిపేశొప్పగుణం ఈరక్షామృతం జంతు రక్షిణితో పాటు ఈరక్షామృతంను ఒద్దరవుంచుకోవాలి.

మోతాదు 4నుంచి 10తులాలవరకు.

# కాలాగ్ని

పౌను సీసా రు 3-0-0

ఇదియొక విచిత్రమైన మందు ఇతరరోగాలలో నిస్సత్తువుగా నున్నపుడు ఉష్ణముతగ్గి శరీరము చల్లబడినప్పుడు, ఉష్ణము తీవ్రముగా నుండి ఆయాసము కలిగినపుడు కాలాగ్నిని ప్రతి 4 గంటలకు 10తులాలమందును సేరు గోరువెచ్చని నీటిలో గుణము యిచ్చేవరకు కలిపిత్రాగించాలి

# శూలకుఠార్

పౌను సీసా రు 2-8-0

ఈ అర్కము ఆంగ్లేయ వైద్యులు వాడు అల్కలైన్ మిక్చర్ కంటె కూడా ఎక్కువగా పనిచేస్తుంది. ఎంతోమంది వాడిరి. జ్వరము లకు, శూలరోగములకు, దీర్ఘవాతములకు చక్కగా పనిచేస్తుంది. మోతాదు 4 నుండు 6 తులములు.

# చూర్ణములు

## వాతారిచూర్ణము

పౌను ప్యాకెటు రు 2-8-0

ఈ చూర్ణములో శాస్త్ర సమ్మతమగు ఓషధులు 24 వరకు కలిసినవి దీర్ఘవాత రోగములకు, మామూలు వాతములకు ఈపొడి అద్భుతంగాపనిచేస్తుంది. ఎంతోమంది రైతులుప్రశంసించిరి. ఈపొడిని పూటకు 6 తులాలు తీసుకొని తగినంత తాటిబెల్లంతోగాని, గోరు వెచ్చని నీటితోగాని యిచ్చిన అమోఘంగా పనిచేస్తుంది.

## పశు బలవర్ధని

పౌను ప్యాకెట్టు రు 2-8-0

పశువులకు బలముకలిగించే దాణాలు పెట్టేటప్పుడు తప్పక ఈ పొడిని పూటకు 5 తులాలు కలిపి వాడిన నరములకు సత్తువనిచ్చు తుంది ఎంత మేపినను నిస్సత్తువుగానుండే పశువులకు దాణాలో గాని బెల్లంలో గాని కలిపియిచ్చిన చక్కగా పనిచేస్తుంది.

## పశు పవిత్ర

పౌను ప్యాకెట్టు రు 2-8-0

కడుపునొప్పి, కడుపుబ్బు, గర్భశూల, గర్భవాతము, తదితర శూలలకు 6 నుంచి 12 తులాల పొడిని కారపుపాలతోగాని, బెల్లంతో గాని, గోరు వెచ్చని నీటితోగాని ఈయవలెను.

## క్షీరోజన్

పౌనుప్యాకెట్టు రు2-8-0

పశువులు ఈనినతరువాత పాలుపడనపుడు తక్కువగా యిచ్చు చున్నపుడుగాని, పాలశేర్లు నాలుకసెల, పొదుగువాపులలోగాని,

ఈపొడిని ప్రతిపూట 6 తులములు తీసికొని తగినంత బెల్లముతోగాని, కుడితితోగాని, దాణాలోగాని ఈయాలి. ఇంకను పాలుఎక్కువ కావలెనన్న సోలెడు ఉలవలు నానవేసి అందులో 8 తులాల జీలకర్ర క్షీరోజన్ 4 తులములు కలిపి మెత్తగా రుబ్బి కుడితిగాపోయవచ్చును ఇది ఎంతకాలము పెట్టినను యిబ్బంది లేదు. రైతుయొక్క ఆర్జనశక్తిని బట్టివాడాలి లేదా 3 పౌనులు శనగపండి, 1½ పౌనుల మెంతిపిండిలో 1 పౌను క్షీరోజన్ కలిపి ప్రతిరోజు దాణాలోగాని, కుడితిలోగాని రెండుమూడు గుప్పెళ్లు వేసిన పాలువృద్ధియగును.

## విబ్రో

గర్భరక్షక

అర పౌను ప్యాకెట్టు రు 2-8-0

దీనినే గర్భరక్షక అందురు. పశువులు చూడిలో నున్నప్పుడు సరియగు పోషణ లేక బలహీనముగా నుండును. లోపలపిండము కూడా వృద్ధిగానుండదు, వాతము, మలబద్ధకము, రొంప మాదము వెంట తెలుపు లేక ఎరుపు మైలపడుట ఆరవ నెలలో గాని నెలలుతక్కువగా ఈనుతుందని అనుమానముగా నున్నప్పుడు చూడిలోనే మేయు కనపడినప్పుడు పశువు కట్టి వెంటనే చూలు నిలువ నప్పుడు ఈ మందు చక్కగాపని చేయును. వీటి వివరాలు ఫార్మసీ వారికి తెలిపిన చక్కని సలహాలీయగలరు. ఈ మందు తో పంచదార కలిపి ఈయాలి.

## బేల్‌పౌడరు (బిల్వ)

అరపౌను రు 2-8-0

దీనిలో అభిని, బిల్వఫలాల చూర్ణము, ఇంకను లవణ క్షార ములుకలియును పశువులకు కలిగే ఎట్టి రోగములో వచ్చే విరేచన ములు రక్తవిరేచనములు మున్నగు రోగాలకు తగినంత నేరేడు లేక తుమ్మచెక్కతో శాస్త్ర సమ్మతముగా కాచిన కషాయముతో

4 నుంచి 10 తులాలవరకు వ్యాధియొక్క ఉధృతనుబట్టి ఈయాలి ఎక్కువ, తక్కువలుగా ఉపయోగించక జాగ్రత్తగల మోతాదులు ఈయాలి.

## గర్భక (గర్భధారి)

అరపౌను రు 2-8-0

వంధ్య పశువులకు ఈ మందును మండలము రోజులు వాడిన తప్పక చూడియగును సలహాకొరకు ఫార్మసీకి వ్రాయాలి,

## సాన్టాల్ (వర్ధిని)

అరపౌను రు 2-8-0

మూత్ర రోగాలకు మురిపెమైన దివ్యౌషధము రక్తమూత్రము నీరుచురుకు, మూత్రశూల శుక్లనష్టంలకు పనిచేయును శిలామేహ వాతం ప్రారంభదశలో పనిచేస్తుంది వృచ్ఛబుడ్డబ్రిద్ధలై కండ్లు పీకుకొని పోయినపుడు ఈమందును వాడనేవద్దు. ఈచూర్ణమును ప్రతినాలుగు గంటలకు రక్తమూత్రము పోయుచున్నచో 6 తులాల చూర్ణంలో అరతులం పటికపొడి కలిపి తగ్గేవరకు ఈయాలి.

శుక్లనష్టంలో రావి లేతచిగుళ్ళలో ఈపొడిని 4తులాలు కలిపి వరుసగా వారమురోజులు రోజుకొక మోతాదు ఈయాలి.

## విషఘ్ని

అరపౌను రు. 2-8-0

పిచ్చికుక్కలు. నక్కలు, విషపు సాలీళ్ళు, చిరుకప్పలు ఉంగిడి మున్నగు రోగాలకు పనిచేస్తుంది. మోతాదు 4 నుంచి 8 తులాలు.

## ఉల్బాం (చూర్ణం)

అర పౌను రు 2-8-0

పశువు ఈనిన తరువాత మైలతీవ్రముగా పడుచున్నప్పుడు మేయి వచ్చునప్పుడు, మావి పడనప్పుడు, ఈ చూర్ణమును వాడాలి. మావి పడనప్పుడు సేరు నువ్వులు త్రొక్కి 10 తులాల ఉల్బాను కలిపి సేరు గోరువెచ్చని నీటితో ఒక పర్యాయం ఈయాలి.

## చెర్బారి (పామారి)

పౌను రు 2-8-0

దీనినే పుండ్లపొడి అంటారు అన్నిరకాల గాయములకు పుండ్లకు ఈపొడిని అవసరమునుబట్టి పట్టించిన పుండ్లు త్వరలో గారపట్టును. పుండ్లలోనున్న రసిని తగ్గించుతుంది. కాకులు కూడ ఈపొడిఘాటుకు పుండ్లను ముట్టుకొనవు

## అశ్వబలవర్ధని

పౌను రు 3-0-0

గుఱ్ఱములను బలిపించుటకు నరాల పటుత్వమునకు వగర్పు రాకుండుటకు ప్రతి దినము నాలుగు తులాల పొడి వితగినంత బెల్లంతో గాని, దాణాలోగాని కలిపి పెట్టిన చక్కగా పని చేస్తుంది

# తైలములు

## కార్బెక్స్ (వ్రణఘ్నం)

పావుపౌను సీసా రు 2-8-0

మానని మొండి గాయములకు, కొమ్ములు విరిగిన పుండ్లకు, మాద పుండ్లకు ఈ మందు చక్కగా పనిచేయును. ప్రతి రైతుయింట ఇదియున్న డాక్టర్లక్కర లేదు.

## క్రీటారి

పావుపౌను రు 2-8-0

తోకనుసిమిరి, మొండి చర్మపుండ్లు, నుసిమిరి మున్నగు రోగాలకు ఈమందు పెట్టిందిపేరు ఈరోగమున్న శరీరాన్ని కడిగి రెండు మూడు ప్రూతలు పెట్టాలి

## హిలాన్ (శీతల)

పావుపౌను రు 2-0-0

అన్నిరకముల పుండ్లను మాన్పుతుంది. చర్మాన్ని బాగుచేస్తుంది.

## అనోడైన్ (సుకర్ణ)

పావుపౌను రు. 2-0-0

అన్నిరకముల చెవి రోగాలకు పనిచేస్తుంది ప్రతిరోజు చెవిని కడిగి కొన్ని చుక్కలు వేస్తుండాలి.

## ధణధణ (లావణ్య)

పావు పౌను రు. 2-0-0

పెద్ద పశువులు. చిన్న దూడలు తమ మూత్రము తామే త్రాగుతూవుంటే నాలుగు గంటల కొకసారి ఈలావణ్య అనగా కొన్ని లవణాలతో తయారు చేసిన ఈమందును నాలుకకు, బొడ్డునకు రాసిన మరల ముట్టుకోవు.

## కండవాతుంగ్రి

(దద్రునాశ)

అరపౌనురు. 2-8-0

గోమారులు, మిన్నల్లులు పేలుపుష్కల పశువులకు ఒకటి రెండు పర్యాయములు పట్టించిన చక్కగా పనిచేస్తుంది.

## గ్లయువాల్

(నవనీత)

అరపౌను రు.2-8-0

జంతువుల శరీరము కాలినప్పుడు, దా్రివకములుపడి పొక్కి-నపుడు, చర్మము పగిలినపుడు ఈనవనీతం అద్భుతంగా పనిచేస్తుంది

## ఐఓడిక్స్

(కురరక్ష)

పావుపౌను రు 2-0-0

పశువుల డెక్కలు తెగినపుడు, డెక్కల అడుగుభాగము నొక్కి-బడి కుంటునప్పుడు, గుత్తి వాపులకు. నొప్పులకు చక్కగా పనిచేస్తుంది ఈమందును రెండుపూటలుమర్ధనచేయాలి. అవసరమున్న వేడికాపులు తీయాలి

## అభిత

(మూనరక్షణి)

పావుపౌను రు.2-8-0

మేయుకనపడగనే ఈతైలమునురాసి. లోపలికివిబో్రిను వాడు చుండిన ముక్కుట తగ్గిలోపలికి ముడుచుకొనిపోతుంది

## గదారి

(వజ్రదంత)

సీసారు. 1-8-0

దంతములు కదిలినపుడు, చిగుళ్ళువాచి మేతతినసపుడుదీనిని అప్పుడప్పుడు పట్టించిన పనిచేస్తుంది.

## పశునేత్రాంజనం

**నెం1. రు 1-8-0**

నెం2 రు.1-8-0

పశువులకు వచ్చేకండ్లఎరుపు, రేజీకటి, పువ్వులుదుర్మాంసము లకు ఉదయసాయంకాలములందు నాలుగైదుచుక్కలు వేయాలి.అంజన మైన కాటుకగా కండ్లలోపెట్టాలి.

## రావరాయిల్

సీసా రు 1-8-0

తుమ్ములు రానప్పుడు మొగబంతి, శిరోరోగములకు దీనిని కొన్ని చుక్కలు ముక్కులలో వేయాలి.

## కొకొనిన్

(దరణాయుధ)

సీసా వెలరు.1- 0-0

కోళ్ళకువచ్చే కొక్కెర రోగమునకు ఆరంభములో ఒకటిరెండు మోతాదులుఈయాలి. మంచికోళ్ళకు ముందుగావాడిన ఈరోగము రానీయక నిలిపివేస్తుంది

## స్ప్రియుక్లిల్లర్

అరపౌను రు 2-8-0

దీనినే బెణుకుతైలమందురు. ప్రతిరైతుయింటిలోను ఈమందు వుండాలి. కాలురెల్లపోయినా, కాళ్ళు పట్లుపట్టినా, చర్మము, వెన్ను బిగిసికొనిపోయినా, కల్లవాపులు, పంపరవాపులు పుట్టిన వెంటనే ఈ తైలమును పదేపదేరుద్ది బాగుగామర్ధించి వేడికాపులు తీయుచున్న గారడివలె తగ్గించుతుంది. ఇది అంబకుకేషన్‌లా పనిచేస్తుంది.

# వెటిరినరీప్లాస్టర్

పావుపౌనురు 1-8-0

దీనినే ఉద్రిపలాము అందురు. పశువ్రులు అర్రులు వాపుచెందిన, గడ్డకట్టిన, మెడనరాలుపంగక మెడవంచకపోయినా, అర్రుచిట్లినా గిట్టలుపగిలినా. ఈపలాము అద్భుతము గా పనిచేసితీరాలి.

వలయువారు:- సహదేవ పశువైద్య ఫార్మసీ, మారీసుపేట-తెనాలి






గేదెపై ఎద్దు ఎక్కుట
కాళ్లు ఈడ్చుట
కాళ్లు ఎత్తుట
కొంగ కాళ్లు
వంకర కాళ్లు
వ్రేలాడు వృషణములు
గిట్టలు కొట్టుకొనుట
గిట్టలు, వెడల్పు వంకర
పంగ గిట్టలు
గ్రందులు ఏర్పడుట
GS

| | |
|---|---|
| కిరీటపు కొమ్ములు | పొడుగు నిలువు కొమ్ములు |
| పొట్టేలు కొమ్ములు | మెంటి కొమ్ములు |
| స్వర్గపాతాళములు | ఒక కొమ్ము విరుగుట |
| ఒక కొమ్ము గలది | పగిలిన కొమ్ములు |
| బోడి తల | వెడల్పు కొమ్ములు (పక్షులు నిద్రించుట |

౬౫


తలవూపుట
లావుమెడ
అంగిలినలుపు
పెద్దమూపురము
నాలుక బైటకు
లాగుట
తక్కువపెదవి
వెడల్పుముఖము
వంపుముఖము
పెద్దచెవులు
పంగతల
DS

# పశువైద్య గ్రంధమాల

1 అనుభవ పశువైద్య చింతామణి రు 10-0-0

2 హోమియో పశువైద్య చింతామణి రు 4-0-0

3 ప్రాచీన పశుసంజీవి రు 2-0-0

4 పశువైద్య ఇంజెక్షన్సు గైడ్ రు 2-0-0

5 జంతు విజ్ఞాన శాస్త్రము రు 5-0-0

6 కోళ్ల పరిశ్రమం ( పిరింటులో వున్నది )

7 పాడి పరిశ్రమం ( పిరింటులో వున్నది )

8 గోసేవ మాసపత్రిక సం॥ చందా రు 5-0 0





Sri Sai Printing Press, Morris Pet, T E N A L I.

